"నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే"

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ సంపుటము

౨ ముద్రణము

'అన్' నుండి 'అశ్విని' వరకు


ముఖ్యసంపాదకుడు

కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, ఎం. ఏ.



ఆంధ్రపత్రికా ముద్రాలయము

చెన్నపురి

# ద్వితీయసంపుటమునకు విలేఖకులు

| | | |
|---|---|---|
| ఆ. ల | శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎమ్. బి. అండ్ సి. ఎమ్., భిషగ్రత్న ... | అపస్మారము |
| క. మా. | శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు .. | అశ్వమేధము |
| కా. నా. | శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు .. | అజాపాతకము<br>అమృతసారము<br>అపరోక్షానుభూతి<br>అల్లమప్రభువు |
| కొం. జ | శ్రీ కొంపెల్ల జనార్దనరావుగారు . | అప్పారావు, గురజాడ<br>అప్పారావు, బసవరాజు |
| కొ. రా. వేం. కృ | శ్రీ రాజా కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణరావుగారు, బి. ఏ. | అమరుకము |
| కొ. వేం. ల | శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు, ఎమ్. ఏ. | అనంతామాత్యుఁడు<br>అనపోతారెడ్డి<br>అనవేమారెడ్డి<br>అనాగరకసంఘము<br>అనుమానము<br>అనేకవర్ణసమీకరణము<br>అన్నయ్య, తెనాలి<br>అప్పకవి<br>అబ్బయామాత్యుఁడు<br>అభావము<br>అభిజ్ఞానశాకుంతలము<br>అభినయము<br>అర్థశాస్త్రము<br>అలంకారములు<br>అల్లోపనిషత్తు<br>అవతారములు<br>అవధానము<br>అశోకవర్ధనుఁడు |
| గం. దూ. | శ్రీ గం. దూర్వాసశాస్త్రిగారు . | అన్నభేది<br>అపస్మారము<br>అభ్రకము<br>అల్పరక్తము<br>అయస్కాంతము |
| గొ. వేం. రా. | శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు, బి. ఏ. ... | అనూరాధ<br>అపభరణి<br>అష్టమినక్షత్రములు |

| | | |
|---|---|---|
| గో. జో. | శ్రీ గోకుటి జోగిరాజుగారు,<br>అసిస్టెంట్ డైరక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ | .. అనాస<br>అనుము<br>అరఁటి<br>అరఁటికుటుంబము |
| చి. వేం. శా. | శ్రీ చివుకుల వేంకటరమణశాస్త్రిగారు | .. అయనము |
| టి. ఆర్. చిం. | శ్రీ టి. ఆర్. చింతామణిగారు,<br>ఎమ్. ఏ., పిహెచ్. డి.,<br>సంస్కృతభాషా ప్రధానోపాధ్యాయులు,<br>మద్రాసు విశ్వవిద్యాలయము. | .. అప్పయదీక్షితులు |
| టి. యన్. రా. | శ్రీ టి. యన్. రామచంద్రన్‌గారు,<br>ఎమ్. ఏ.<br>ఆర్కియాలాజికల్ అసిస్టెంట్,<br>గవర్నమెంటు మ్యూజియము, మద్రాసు | ... అమరావతిస్తూపము<br>అగ్యూఖాన్ |
| బు. వేం. రా. | శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు | .. అభిధేయము<br>అభిషేకనాటకము |
| భా. వేం. కృ. | శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారు,<br>బి. ఏ., బి. ఎల్. | .. అమ్మరాజవిజయాదిత్యుఁడు<br>అమ్మరాజవిష్ణువర్ధనుఁడు |
| మా. రా. కృ. | శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, ఎమ్. ఏ. | .. అభినయము |
| మా. వేం. రం. | శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్యగారు,<br>ఎమ్. ఏ.<br>రీడర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ హిస్టరీ,<br>పొలిటిక్స్ అండ్ ఎకనమిక్స్ | అరాజకత<br>అర్థశాస్త్రము |
| వే. వేం. శా. | మహామహోపాధ్యాయ, ఆంధ్రకళాప్రపూర్ణ,<br>శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు | .. అనిరుద్ధచరిత్రము |
| శ్రీ. క. భా. | శ్రీ కల్యాణానందభారతీస్వామివారు | .. అవధూతప్రకాశిక |

# విన్నపము

విజ్ఞాన మానందము విజ్ఞానము పురుషార్థము. విజ్ఞానము పరమార్థము. విజ్ఞానము పరబ్రహ్మము విజ్ఞాన తరంగములు విశ్వవిలాసములు శాస్త్రజ్ఞులు, కవులు, గాయకులు, శిల్పులు, మంత్రులు, యోధులు, మతాధిపతులు, త్యాగులు, కార్మికులు మొదలగు విజ్ఞానోపాసకులు దేశకాలపాత్రావరణాతీతమైన విజ్ఞానారాధనమును మానవధర్మాభ్యుదయమునకుఁ జేయుచున్న విధమును విజ్ఞానోదంత మనంతముఖములను విశదము చేయుచున్నది

ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును నీ మహాకార్యమును యథాశక్తిని నిర్వహించుట కుపక్రమించిన విధము మొదటిసంపుటమునందలి ప్రస్తావనయందు విశదీకరింపఁబడినది. రెండవసంపుటమునం దీచర్విత చర్వణ మనవసరము. రెండవ సంపుటమును ప్రకటించుటయందుఁ గలిగిన కాలవిలంబనము వర్తమాన దేశ పరిస్థితులం దనివార్యము. బహుజన సాహాయ్యమునను, విశేష సాధనసంపద వలనను సాధ్యమైన ప్రచురణమునందు కాలవిలంబనము సహజము. రెండవ సంపుటమునకు వ్యాసములను వ్రాసి ప్రచురణమును సాధ్యముచేసిన వ్యాస లేఖకులకు వందనములు మాకుఁగావలసిన ఛాయాచిత్రములనొసంగి ద్వితీయ సంపుటమునందు ముద్రించుట కనుమతించిన మద్రాసు గవర్నమెంటు మ్యూజియము, సూపరింటెండెంటుగారికిని, కోటగిరి ఆర్కియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, సదర్న్ సర్కిల్ సూపరింటెండెంటుగారికిని, కలకత్తా ఇండియన్ మ్యూజియము సూపరింటెండెంటు (ఆర్కియొలాజికల్ సెక్షను) గారికిని, హైదరాబాదు హెచ్ ఇ హెచ్. ది నైజామ్స్ గవర్నమెంట ఆర్కియొలాజికల్ డిపార్టుమెంటు డైరెక్టరుగారికిని సంపాదకులు కృతజ్ఞులు పునర్ముద్రణము నందు నూతనాంశములు చేర్పఁబడి ద్వితీయసంపుటము అన్-అశ్విని వఱకును పర్యాప్తమగుచున్నది. భగవంతుఁడును, ఆంధ్ర మహాజనులును నీ ప్రయత్నము సార్థకమగుట కనుగ్రహింతురుగాక!

భావ సం మాఘశుద్ధ
౧౪, శనివారము

కా. నాగేశ్వరరావు.

We have great pleasure in expressing our grateful thanks to the following, who so kindly acceeded to our request and granted us permission to reproduce some of their photos in this volume

i The superintendent, Government Museum, Madras,

ii The director of the Archaeological department of H E H the Nizam s dominions, Hyderabad

iii The Superintendent, Archaeological survey of india, Southern Circle Kotagiri,

iv The Superintendent, Indian Museum (Archaeologica, section), Calcutta

**అన్** — అన్ అనునది దక్షిణబర్మాయందలి క్యాక్ ఖ్యా జిల్లాయందలి యొకపట్టణప్రాంతమునకు పేరు. దీనికి వైశాల్యము ౨,౯౬౧ చదరపుమైళ్లు జనసంఖ్య ౨౬,౯౬౩ అడవిభాగము విశేషము, వ్యవసాయము తక్కువ. రాబడి రూ ౩౧,౦౦౦ లు ముఖ్యపట్టణము అన్ అనునది. అక్కడ ౯౨౬ గురు జనులు గలరు

**అనంగ** — భారతవర్షీయనది (భార, భీష్మ, అ ౯)

**అనంగజీవన** — ఇది యొకభాణము వాసంతికా వసంతశేఖరుల యన్యోన్యానురాగమును, నారినమాళికను నిందు వర్ణింపఁబడినవి ఆత్రేయసగోత్రుఁడగు వరదగురువు అనువతఁడు దీనిని రచించెను విశ్వగుణాదర్శమును వ్రాసిన వెంకటాచార్యుని కితఁడు పినతండ్రి ఇతని యితరగ్రంథములు కారికాదర్పణము, కృష్ణాభ్యుదయము

**అనంగదేవుఁడు** — చేదిదేశపు రాజు హైహయ వంశమునందు జననమొందెను తండ్రి పేరు అర్జునుఁడు రాష్ట్రకూట నృపాలుఁడగు ఇంద్రుఁడీ యనంగదేవుని కూఁతును పెండ్లియాడెను

**అనంగపాలుఁడు** — ఢిల్లీరాజు తువర వంశమునందుఁ జివరివాఁడు ఈతనికాలమునందే యీతనిరాజధానికి 'ఢిల్లీ' యని పేరు కలిగెను ఇతనికి పుత్రసంతానము లేదు ఇద్దరు కొమార్తె లుండిరి అందు కమలాదేవి యనునామెను అజమీరురాజయిన సోమేశ్వరున కిచ్చెను ఈ సోమేశ్వరుఁడే తరువాత ఢిల్లీశ్వరుఁడైన పృథ్వీరాజు రెండవ కొమార్తె యగుసుమలాదేవిని కనోజరాజైన విజయపాలున కిచ్చిరి ఈమెయే జయచంద్రునితల్లి అనంగపాలుఁడు ముసలివాఁడై బదరికాశ్రమమునకుఁ బోవునప్పుడు తన ఢిల్లీ రాజ్యమును దౌహిత్రుఁడగు పృథ్వీరాజున కిచ్చెను

**అనంగబ్రహ్మవిద్యావిలాసము** — ఇది యొక భాణము శృంగారరసప్రధానమయినది రచయిత వాధూలవరదాచార్యుఁడు.

**అనంగభాగి** — ఒక బ్రహ్మర్షి

**అనంగవిజయము** — శృంగారరసప్రధానమగు శోకనాటకము దీనిని రచించినవాఁడు శివరామకృష్ణుఁడను వతఁడు నారాయణుఁ డనువతఁ డీశివరామకృష్ణునితండ్రి

**అనంగాధరి** — ఉభయవక్రసంపూర్ణరాగము ౩౯-వ మేళకర్తయగు ఝాలవరాళిరాగజన్యము ఆరోహణము స రి గ రి మ ప ని ధ ని స; అవరోహణము స ని ప ధ మ గ మ రి స యని సంచారముకలది

**అనంగుఁడు** — ౧. శివునిచే భస్మముచేయఁబడిన తరువాత మన్మథునకు వచ్చినపేరు (చూడుఁడు: మన్మథుఁడు).



౨ రామసేనయందలి యొక వానరుఁడు.

**అనంత** — ౧ ఈపేరుగల సంస్కృతకవు లెందఱో కలరు వారిలో నీక్రిందివారు ముఖ్యులు (౧) ఉదయభాను కావ్యకర్త, (౨) కారకచక్ర రచయిత, (౩) చిదంబరాష్టకకారుఁడు, (౪) యోగామృతార్థచంద్రిక యను పాతంజలయోగసూత్రభాష్యమును రచియించినవాఁడు, (౫) కామ్యమంజరీరచయిత, (౬) విధ్యపరాధప్రాయశ్చిత్తప్రయోగరచయిత, (౭) వాజసనేయసంహితకు 'శుక్లదళభాష్యము'ను వ్రాసినవాఁడు, (౮) సాహిత్యకల్పవల్లి యను నలంకారగ్రంథమును గూర్చినవాఁడు, (౯) భీముని కుమారుఁడు, నైగేయార్చికానుక్రమమును వ్రాసినవాఁడు, (౧౦) మంత్రిమండల కుమారుఁడు, ౧౪౫౭-వ సంవత్సరమున కామసమూహ మహాప్రబంధము అను కామశాస్త్రమును రచియించినవాఁడు

౨ వక్రషాడవ-ఔడవరాగము పదునేడవ మేళకర్తరాగమగు సూర్యకాంతరాగజన్యము ఆరోహణావరోహణము లందు—రి స మ ప ధ ని స, స ధ మ గ రి స యని సంచారము కలది

**అనంతకవి (చిత్రకవి)** — ఇతఁడు పెమ్మసాని చినతిమ్మనాయని కాశ్రితుఁడు. పదునేడవ శతాబ్ది మొదటియర్ధమున నున్నవాఁడు. ఆరువేలనియోగి బ్రాహ్మణుఁడు. చిత్రకవి పెద్దనార్యుని పుత్రుఁడు భారద్వాజసగోత్రుఁడు. ఇందుమతీపరిణయ మను ప్రబంధమును రచించెను. హరిశ్చంద్రనలోపాఖ్యానమునకును, విష్ణుచిత్తీయమునకును టీక వ్రాసినవాఁడు. ఆంజనేయోపాసకుఁడు.

**అనంతగిరి** — ౧ తూర్పుగోదావరి ఏజెన్సీజిల్లా, యెల్లవరంతాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧౦౦ (౧౯౩౧).

౨ గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకాలోని జమీందారీగ్రామము జనసంఖ్య ౧౩౧ (౧౯౩౧)

౩ గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకా జమీందారీగ్రామము జనసంఖ్య ౨౦ (౧౯౩౧).

౪ గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకా జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౪౩ (౧౯౩౧).

౫. గంజాంజిల్లా ఛత్రపురతాలూకాలోని ఈనాంగ్రామము. ఇచ్చటి జనసంఖ్య ౫౩౫ (౧౯౩౧).

**అనంతచ్ఛందస్సు** — (చూడుఁడు అనంతామాత్యుఁడు).

**అనంతజిత్తు** — ఇరువదినలుగురు జినులలోఁ బదునాలుగవవాఁడు. ఇతఁడు వర్తమానావసర్పిణియందు నావిర్భవించెను. ఇతని

(ప్రతిపండితుఁడు) అనంతపాలదండనాథుని శాసనములు క్రీ. శ. ౧౧౦౦ మొదలుకొని ౧౮౩౩ సంవత్సరములవఱకుఁ గాన్పించుచున్నవి.

**అనంతపురము** — ౧ మైసూరురాష్ట్రమునందలి యొకపల్లె. షిమోగాజిల్లాలోని సాగర్ తాలూకాలోనిది. షిమోగాకు ౫౮ మైళ్లమీద నుండును. అంధాసురుఁ డను రాజుచే పదునెనిమిదవ శతాబ్దియందీ గ్రామము కట్టింపఁబడినది. పదునొకండవ శతాబ్దియం దిది చాళుక్యుల యధీనమునం దుండెను. ఇది 'సూత్రనివయము' (మండలము)లోనిది. ౧౦౪౩లో నిది ౧౩౦౦ బ్రాహ్మణుల కగ్రహారముగ నీయఁబడెను. ౧౦౪౯లో నిది రాజధానిగఁ జెప్పఁబడెను. పదునేడవ శతాబ్దియందు, కెలదిరా జయిన వేంకటప్పనాయకుఁ డీగ్రామమునందు శివాచారమఠమును స్థాపించెను. చంపకసరసు అనుచెఱువు త్రవ్వించెను. గ్రామముపేరు 'ఆనందపుర' మని మార్చెను. అదియే తరువాత ననంతపురముగ మారెను. హైదరు, టిప్పూలు ఈగ్రామముపై పెక్కుసార్లు దాడివెడలిరి. ౧౮౩౦లోని తిరుగఁబాటుకాలమున నీ గ్రామము దోపిడికి లోనయ్యెను.

౨ అనంతపురము జిల్లాకు ముఖ్యపట్టణము. ఇది చెన్నపట్టణమునకు వాయవ్యముగ ౨౧౬ మైళ్లమీద నున్నది. ఇది చెన్నపురి దక్షిణమహారాష్ట్ర రైల్వేదారి యొక్క గుంతకల్లు బెంగుళూరుశాఖమీద నొక స్టేషను.

ఈ గ్రామమును చిక్కప్పవొడెయర్ అనునతఁడు కట్టించె నని చెప్పుదురు. ఇతఁడు విజయనగరరాజయిన బుక్కరాయలకు మంత్రిగ నుండెను. ఈ వొడెయర్ ఒక పెద్దచెఱువు కట్టించి, దానికి రెండు అలుగులనుండి ఎక్కువైననీరు పోవుటకు రెండు కాల్వలును, దానికి సమీపమున రెండు గ్రామములను కట్టించెను. అం దొక గ్రామమునకు రాజుపేరిట బుక్కరాయసముద్రము అని పేరు పెట్టి, రెండవదానికి తనభార్యయైన అనంతమ్మపేరిట అనంతసాగర మని పేరు పెట్టెను. ఆపేరే అనంతపుర మని మారెను.

౧౮౦౦ లో దత్తమండలములు కంపెనీవారిక్రిందికి రాఁగా, ప్రకటనంతరము మన్రో అనువాని కలెక్టరుగా నియమించిరి. అతఁడు అనంతపురమునందే తనకచ్చేరి యేర్పఱచుకొనెను. ౧౮౦౭ లో కలెక్టరుకచ్చేరి బళ్లారికిఁ దీసికొనిపోయిరి. ౧౮౦౩ లో మరల ఆ కచ్చేరి అనంతపురమునకు వచ్చెను. ౧౮౪౦ లో కలెక్టరు కచ్చేరిని బళ్లారికి మార్చి, అనంతపురములో సబ్‌కలెక్టరు ఉండఁజొచ్చెను. ౧౮౭౮ లో ఈకచ్చేరికూడ గుత్తికిఁ బోయెను. ౧౮౮౨ లో అనంతపురము స్వతంత్రముగ జిల్లా ఆయెను. అప్పు డిచ్చటికి మరల కలెక్టరు కచ్చేరి వచ్చెను.

ఇచ్చట జిల్లాకలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు, ఫారెస్టు ఆఫీసరు, లోకల్ ఫండ్ ఇంజనీరు, అనంతపురం డివిజనును పాలించు హెడ్‌క్వార్టర్సు డిప్యూటికలెక్టరు, అనంతపురంతాలూకా తహసీల్దారువారల కార్యస్థానము లుండును. ఇచ్చట డి. పి. డబ్ల్యు అసిస్టెంటు ఇంజనీరు, సాల్టు - అబ్కారీ - కస్టమ్సు శాఖ ఇన్‌స్పెక్టరు, సబ్‌రిజిస్ట్రారు, ఎష్యూరెన్సుల జిల్లా రిజిస్ట్రారు, జిల్లా విద్యాధికారి, ఇంకమ్‌టాక్సు ఆఫీసరు, జిల్లా ఆరోగ్యాధికారి (హెల్త్ ఆఫీసరు), పోలీసు డిప్యూటీసూపరింటెండెంటు, సహకారపరపతి సంఘముల (కో ఆపరేటివ్ సొసయిటీలు) అసిస్టెంటు రిజిస్ట్రారు కూడ నుందురు. జిల్లాకోర్టు, సెషన్సుకోర్టుకూడఁ గలవు. ఇవి యన్నియు కాక గవర్నమెంటు ఫస్టుగ్రేడు కళాశాల, పోలీసు రిక్రూటింగుస్కూలు వీనితో దీనికి ప్రాముఖ్యము మఱియు హెచ్చినది. జనసంఖ్య ౧౫,౦౯౯. ఈగ్రామమున చెప్పఁదగిన విశేషము 'రాబర్ట్‌సన్ స్క్వేర్' అను చౌకము. అనంతపురమున కలెక్టరుపనిచేసి ౧౮౩౯ న అచ్చటనే మరణమునొందిన రాబర్ట్‌సన్ అనువాని పేర ఈ చౌకము నిర్మిత మయినది. రాబర్ట్‌సన్ బ్రతికియున్నప్పుడే ఈ చౌకము నేర్పఱచి, నడుమనున్న కొలను, కందకము త్రవ్వించి, నడుమ మంటపమును కట్టించి, చుట్టు తనచేతితో చెట్లు నాటెను. వీనిలో దాదాపుగ అన్నియు నశించిపోయినవి. ఇది ఎదురుగ నున్న విశాలమైన పెద్దచౌక మిప్పుడు దానిచుట్టుపట్లఁ గల పాఠశాలలందలి విద్యార్థులకు క్రీడారంగముగ నుపయోగపడుచున్నది. 'రాబర్ట్‌సన్ స్క్వేరు' చుట్టు నున్న కట్టడములలో గవర్నమెంటు ఆస్పత్రి, ఉపాధ్యాయులకు ఉపాధ్యాయినులకు బోధనాభ్యసన కళాశాలలు (Training Schools), బాలబాలికలకు ఉన్నతపాఠశాలలు చెప్పఁదగినవి. ఈ చౌకమున కుత్తరమున ప్రాఁతకోట యుండెను. దాని బురుజుల విశేషములును, కందకపు ఎల్లములును ఇప్పటికిని గానవచ్చును. ప్రాఁతకోట యున్న ప్రదేశమున నిప్పుడు 'జూబిలీ పార్కు' అను పూఁదోట యున్నది. వారమువారము జరుగుసంత యిచ్చట జరుగును. అనంతపురము పరిశుద్ధముగను, చక్కఁగను నుండును.

౩ అనంతపురంజిల్లా గుత్తి తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౪౧౩ (౧౯౩౧).

౪ అనంతపురంజిల్లా మడకశిరతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౯౩ (౧౯౩౧).

౫ చిత్తూరుజిల్లా మదనపల్లి తాలూకాయందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౬౦ (౧౯౩౧).

౬ కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౫౩౫ (౧౯౩౧).

౭ కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౯౫ (౧౯౩౧).

— (రాళ్ల) అనంతపురంజిల్లా కల్యాణదుర్గంతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౬౧౯ (౧౯౩౧).

— (అక్కిరెడ్డిపల్లి) కడపజిల్లా రాయచోటితాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౯౩౫ (౧౯౩౧). శ్రీ బ్రహ్మోత్సవముల జరుగు గంగజాతరకు జను లనేకులు వచ్చెదరు.

# అనంతపురముజిల్లా

**అనంతపురము జిల్లా** — ఇది చిన్న రాజధానియందలి యొక తెలుగుజిల్లా. ఇప్పుడు రాయలసీమ (పూర్వపుదత్తమండలములు) అనఁబడు జిల్లాలలో నిది దక్షిణపుది. పూర్వము బళ్లారిజిల్లాలోనే అనంతపురముకూడ కలిసియుండెను. బళ్లారినుండి దీనిని ౧౮౮౨ లో వేఱుచేసిరి. దీని కుత్తరమున బళ్లారి, కర్నూలుజిల్లాలును, తూర్పున కడపజిల్లాయును, దక్షిణమున మైసూరురాజ్యమును చిత్తూరుజిల్లాయును, పడమట మైసూరురాజ్యమును బళ్లారిజిల్లాయును గలవు. ఇందు పూర్వము అనంతపురము, ధర్మవరము, గుత్తి, హిందూపురము, కల్యాణదుర్గము, మడకశిర, పెనుకొండ, తాడిపత్రి అను తొమ్మిదితాలూకాలే యుండెను. కాని ౧౯౧౦-వ సంవత్సరమున నూతనముగ చిత్తూరుజిల్లా యేర్పడినప్పుడు కదిరితాలూకా నిందుఁ గలుపుటవలన నిప్పుడు తొమ్మిదితాలూకా లయినవి.

## భూస్వభావము

అనంతపురముజిల్లా సమప్రదేశము కలది కాదు. ఉన్నతప్రదేశము ఇది మైసూరుపీఠభూమి చివరిభాగము. దక్షిణమువైపు ఉన్నతముగను, పోనుపోను ఉత్తరమువైపు పల్లముగను నుండును. దక్షిణపువైపుప్రదేశము ౨,౨౦౦ ల అడుగులయెత్తున నున్నది. బళ్లారికిని గుత్తికిని నడుమ నున్న రేగటినేల యెత్తు ౧,౧౫౩ అడుగులు, తూర్పుభాగమున తాడిపత్రియొద్ద ౯౦౦ అడుగులు.

భూస్వభావమునుబట్టి యీజిల్లాను ఉత్తర, దక్షిణ మధ్యవిభాగము లని మూఁడు విభాగములు చేయవచ్చును. గుత్తి, తాడిపత్రి తాలూకాలు కలసినది ఉత్తరవిభాగము. ఇందు ప్రత్తిపంట కనువయిన రేగటిభూమి చాల ఎక్కువ. అనంతపురము, కల్యాణదుర్గము, ధర్మవరము, పెనుకొండతాలూకాలు మధ్యవిభాగములోనివి. కదిరికూడ ఇందే చేరును. ఇందలిది గొడ్డుభూమి. జాతియొక్కనేల చెట్టుచేమ పెరుగదు. కదిరియందంతట చెట్టుచేమ పెరుగనిగుట్టలు కలవు. హిందూపురము మడకశిరతాలూకాలు కలసి దక్షిణవిభాగమువవచ్చును. ఇది మధ్యవిభాగమంత పాడుది కాదు. ఇందలి యొక్కనేల వశిమివిభాగమునందలిదానికంటె మంచిది. హిందూపురము, మడకశిరతాలూకాలలో నీటివసతి యెక్కువ. ఇందు కొబ్బరి, పోకతోఁటలు కలవు. ఈతోఁటలవలన మడకశిర ఈజిల్లా కంతకు ఆరామమన్న పేరు గడించినది. కాని చాలసంవత్సరములనీటికొఱతవలన పోక, కొబ్బరితోఁటలు చెడి దాని కాపేరు పోవుచున్నది.

## కొండలు కనుములు

ఈజిల్లాలో మిక్కిలి ఎత్తయినకొండలు లేవు. ఉన్న కొండగుట్టలు ఈజిల్లాయందు మిక్కిలి యెత్తయినవి — మల్లప్పకొండ ఇది పెనుకొండతాలూకా బుక్కపట్టణమున కుత్తరముగ నాలుగుమైళ్ల దూరమున నున్నది. దీనియెత్తు ౩,౦౯౬ అడుగులు; పెనుకొండ కొండ - దీనియెత్తు ౩,౦౯౧ అడుగులు. మందుర్పిదుర్గము ఎత్తు ౨,౫౫౩ అడుగులు. మడకశిరకొండ ౨,౯౩౪ అడుగులయెత్తు, కదిరితాలూకాయందలి ఈశ్వరమలయ ఎత్తు, ౩,౧౪౧ అడుగులు. ఇవి సముద్రమట్టమునకంటె ౧,౫౦౦ లు మొదలు ౨,౦౦౦ ల అడుగులయెత్తున నున్నప్రదేశమున నున్నవి. జిల్లాయందలి రెండు స్థలములందుమాత్ర మీగుట్టలు పంక్తులు తీర్చియున్నవి. ఈరెండును ఉత్తరదక్షిణములఁ బోవును. వీనిలో మొదటికొండ లనునవి తాడిపత్రితాలూకాను గుత్తి అనంతపురముతాలూకాలను మధ్యగ వ్యాపించినవి. వీనిపొడవు ౩౫ మైళ్లు. చాలచోట్ల వీనివెడల్పు ఏడు మైళ్లు. నాగసముద్రముకొండ లనునవి గుత్తితాలూకాను మధ్యగఁ బోవును. వీనిపొడవు ౫౦ మైళ్లు. కాని యీవరుస చాలచోట్ల తెగిపోయినది. పైని చెప్పిన అయిదింటిలో ముఖ్యమైనది మల్లప్పకొండలచాలు. ఇది పెనుకొండతాలూకా తూర్పుభాగము నాక్రమించినది. ఇది ధర్మవరమునొద్ద నారంభమయి జిల్లా దాఁటి మైసూరురాజ్యములోనికిని, కడపజిల్లాలోనికినికూడ వ్యాపించినది. పెనుకొండతాలూకాయందలి మఱియొకకొండలచాలు పెనుకొండకొండలు. ఇది ధర్మవరమునకు దక్షిణమున ఆరంభమయి పెనుకొండ, హిందూపురంతాలూకాలగుండ మైసూరురాజ్యములోనికి దక్షిణముగ ౪౦ మైళ్లపొడవు వ్యాపించియున్నవి. పెనుకొండకొండదగ్గఱ ఒక్కచోటుమాత్ర మీవరుస తెగిపోయినది. మడకశిరకొండలు ఆతాలూకాయందు తూర్పుపడమరలుగ వ్యాపించి దానిని ఉత్తరదక్షిణవిభాగములుగ వేఱుచేయుచున్నవి. తాడిపత్రితాలూకాతూర్పుభాగమున కర్నూలు-ఎఱ్ఱకొండలు వ్యాపించినవి. ఇవికాక విడివిడికొండలు పెక్కులు కలవు. ఇట్టివి నిలో ఉత్తికొండ, అనంతపురంగుత్తి తాలూకాలనడుమనున్న గంపమల్లకొండ పేర్కొనఁదగినవి. కల్యాణదుర్గము, ధర్మవరముతాలూకాలలోఁ జన్నకనుమ లయిదాఱు కలవు. కదిరితాలూకాయందలి దొర్నాలకనుమ, గొంతలపల్లికనుమ, తుమ్మలమల యున్నగు భయంకరములయిన కనుములు కలవు.

## నదులు

ఈజిల్లాలోఁ బ్రవహించునదులలో పెన్న ముఖ్యమయినది. ఇది మైసూరురాజ్యమునందుఁ బుట్టి, హిందూపురం తాలూకా దక్షిణమున ఈజిల్లాయందుఁ బ్రవేశించును. అచ్చటనుండి నూటిగ నుత్తరము దిక్కు ౪౦ మైళ్లు ప్రవహించి, ఊడిపి (పెన్నహోబలము) యొద్ద, చక్రున తూర్పునకుఁ దిరిగి రమారమి ౫౦ మైళ్లు ప్రవహించి వంగనూరుగ్రామమునకు నుత్తరమున కొకమైలుదూరమున కడపజిల్లాలోఁ బ్రవేశించును. ఈజిల్లాయందలి తొమ్మిదితాలూకాలలో నిది రెండుతాలూకాలగుండ ౧౩౦-౧౪౦ మైళ్లప్రదేశమునఁ బ్రవహించును. తామిడిగ్రామమునకు దక్షిణముగాఁ దానెను ఈనదికి నడుమ నొక శివాలయము - గోపురకోభితముగఁ గట్టఁబడినది.

చిత్రావతి — ఇది పెన్నకు నుపనది. మైసూరురాజ్యమునఁ బుట్టి ఆగ్నేయదిక్కున ఈజిల్లాలోఁ బ్రవేశించి, హిందూపురము, పెను

# అనంతపురము జిల్లా

కొండ, ధర్మవరము, తాడిపత్రి తాలూకాలలోనుండి ౧౨౦ మైళ్లు ప్రవహించి కడపజిల్లాలోఁ బ్రవేశించును.

పైనుడివినవి కాక పెన్నేటి ఉపనదులయిన జయమంగలి, కుముదవతి, వార్గరిలోఁ గలయుస్వర్ణముఖి, కదిరితాలూకాయందలి మద్దిలేరు, పాపఘ్ని అను చిన్నయేళ్లు కలవు వ్యవసాయమున కుపకరించు జలాధారములుగ నివి యంత యుపయోగకరము లైనవి కావు. సంవత్సరమంతటిలో చిత్రావతి, పెన్నానదులలో పరిమిత దినములమాత్రమే నీరుండును. ఈకారణమున సంవత్సరమునఁ జాలభాగము పైరు లుండవు

## గనులు

గుత్తితాలూకా వజ్రకరూరుగ్రామసమీపమున భూమిపై భాగముననే యెప్పుడైనను వజ్రములు దొరకుచుండును అవి యెచ్చటి నుండి పుట్టునో తెలియలేదు ధర్మవరముతాలూకా రామగిరిగ్రామము దగ్గఱ నున్న కొండలలో బంగారుగని యొకటి తొమ్మిదేండ్లక్రిందట మారిసన్ అను పాశ్చాత్యుఁడు కనిపట్టినాఁడు కాని యది లాభప్రద మయినదికాదు 'నార్త్ అనంతపూర్ గోల్డ్ మైన్స్ కంపెనీ' అను పేర బొకసంఘము ౧౯౦౮ లో చేర్పడి ౧౯౨౫ వఱకు గుత్తితాలూకా, రామపురముగ్రామప్రాంతమున బంగారుగొలుసు పనిచేసినది. కాని ౧౯౨౪ లో ఆకంపెనీ దివాలా తీసినది

ఇండ్ల కుపయోగపడురాళ్లు అచ్చటచ్చట దొరకును. తాడిపత్రితాలూకాయందలి రాయలచెఱువునొద్ది బలపపురాయి దొరకును. వానితో పాత్రలు చేయుదురు

## అడవి

౧౯౫౯ - వ సంవత్సరము, ఒనవరి మొదటి తేదినాఁటి కనంతపురంజిల్లాయందుఁగల యాడవివిస్తీర్ణము 'తాలూకావారి'గా నీక్రిందఁ జూపఁబడినది

| తాలూకా | చ. మైళ్ల యడవి | మొత్తమువిస్తీర్ణమున నూటికి |
|---|---|---|
| గుత్తి | ౫౯ | ౪ - వ వంతు |
| తాడిపత్రి | ౭౫ | ౧౨ ,, ,, |
| అనంతపురం | ౬౮ | ౭ ,, ,, |
| ధర్మవరం | ౮౨ | ౬ ,, ,, |
| కల్యాణదుర్గం | ౮౫ | ౬ ,, ,, |
| పెనుకొండ | ౧౨౦ | ౧౭ ,, ,, |
| హిందూపురం | ౮౦ | ౯ ,, ,, |
| మడకశిర | ౩౮ | ౭ ,, ,, |
| కదిరి | ౨౧౬ | ౧౯ ,, ,, |
| జిల్లామొత్తము | ౪౦౫ | ౧౨ ,, ,, |

బళ్లారి, కడపజిల్లాలయందలి పడమటితాలూకాలలోవలెనే యిచ్చటి యరణ్యములలోఁగూడ పెద్దచెట్లు పెరుఁగవు. జిల్లాయందలి యుత్తర, మధ్యమవిభాగములందు దక్షిణవిభాగమునందు కంటె అడవి తక్కువ. దక్షిణవిభాగము మైసూరుపీఠభూమి కాన యగుటవలన దేశము ఎత్తు ఎక్కువ అదియునుగాక అచ్చటి కొండలేల జిల్లాయందలి యుత్తరభాగములం దున్నదానికంటె సారవంత మయినది అనంతపురం, తాడిపత్రి తాలూకాలయందును నున్న ముచ్చుకోటకొండలలో యేపిచెట్లు విశేషముగ పెరుఁగును ఈయడవియందుఁ బెరుఁగుయేపి హిందూదేశమునం దంతట దొరకు కలపలో మిక్కిలి గట్టిది, మిక్కిలి బరువయినది జిల్లాయంతటిలో వెలువెఱుగకములచెట్లు, పెరుఁగుడల విశేషముగఁ గల యడవి దక్షిణవిభాగమున, అందు ముఖ్యముగ కొత్తకోట, అమగొండపాళయం ప్రాంతములఁ గలదు ఈ కొత్తకోట, అమగొండపాళయం రిజర్వు అడవులు జిల్లాయంతటిలో బాగుగ వృద్ధిలోనికి రాఁగలవు మంచిగంధపుచెట్టును ౧౯౦౮ లో ఈజిల్లాకుఁ దీసికొనివచ్చినారఁట్రి. ఇవి క్రమముగ వృద్ధిపొందుచున్నవి యేపి (ముఖ్యముగా నీది కొత్తకోటరిజర్వు అడవిలోను), టేకు, బిల్లుమ్రాను విశేషముగఁ గలదు ఈ మండలమునందలి టేకు అంత యెత్తుగఁ బెరుఁగదు గిడసబాఱి యుండును ఇవికాక కొండలమీఁద చాలచోట్ల వెదురు పెరుఁగును

అడవులను రక్షింపవలసిన ప్రాముఖ్యమును రైతులు గుర్తించిరని తెలిసికొన్నపిదప గవర్నమెంటువారు ౧౯౧౮ వ కొన్నికొన్ని జిల్లాలలో సామాన్యరకమయినయడవిని ఎట్లు చక్కఁబెట్టెదరో చూతమని పంచాయతులవశము కావించిరి ఒక్కొక్కగ్రామము నకో, మొత్తముమీఁద కొన్నికొన్నిగ్రామములకు కలిపియో పంచాయతు లేర్పాటు చేసిరి చాలపంచాయతు లటవీవ్యవహారములను సరిగా చక్కఁబెట్టుచున్నవని గవర్నమెంటువారికి సంతృప్తి కలిగినది. గవర్నమెంటువా రీపంచాయతీపద్ధతిని ౧౯౨౬ వ ఈజిల్లాకు వర్తింపఁజేసినారు ఈజిల్లాయందలి చాలరిజర్వు అడవులు పంచాయతులవశమునకు వచ్చినవి ౧౯౫౭ - వ సంవత్సరమున పంచాయతులవశమున నుండినవి, అటవీశాఖవారియధికారమున నుండినవి ఈక్రిందరీతిని గలవు

| తాలూకా | అడవి విస్తీర్ణము చ. మైళ్లు | పంచాయతుల వశమునను్న అడవి చ. మైళ్లు | అటవీశాఖ వారియధికారమున నున్న యడవి చ. మైళ్లు |
|---|---|---|---|
| గుత్తి | ౫౪ | ౫౪ | ,, |
| తాడిపత్రి | ౪౮ | ౪౮ | ,, |
| అనంతపురం | ౪౮ | ౬౮ | ,, |
| ధర్మవరం | ౮౮ | ౭౯ | ౧౫ |
| కల్యాణదుర్గం | ౮౫ | ౮౫ | ,, |
| పెనుకొండ | ౧౨౦ | ౮౬ | ౪౮ |
| హిందూపురం | ౮౧ | ౨౭ | ౧౨ |
| మడకశిర | ౩౮ | ౩౮ | ,, |
| కదిరి | ౨౧౬ | ౫౭ | ౧౫౭ |
| మొత్తము | ౪౧౮ | ౮౮౫ | ౨౫౭ |

పల్లెరివలనను, అడవిఫలసాయములవలనను కడచిన అయిదేండ్లలో పెంతటిరాబడి వచ్చినదో సగటున లెక్కవేసి దానినిబట్టి యేటేటా నింతకిస్తు చెల్లింపవలెనని నిర్ణయముతో గవర్నమెంటువారడవిని పంచాయతుల కొప్పగించిరి. ఇంకను మరికొన్ని షరతులు కలవు; అవి యేవన, ఎడపెడపశువుల 'సొంతదారు'లను సభ్యులుగా జేర్చి సభలు చేయుచుండవలెను. అట్టిసభలలో వారియాజమాన్యము నిమిత్తము పంచాయతీలెక్కలను ప్రతిపెట్టవలెను. ఖర్చులు పోను మిగిలినలాభమును మందుగా గ్రామమునందలి యడవిని పెంపొందించుట కుపయోగింపవలెను. ఆటుతరువాత నింకను సొమ్మున్నచో పంచాయతీగ్రామములలో ప్రజోపయోగకరము లైన కార్యములకైన నున్న దానికి వచ్చింపవలెను. అట్లుగాని మరియే యితరకార్యములకైనగాని అడవిపెంపునకు భంగము కలుగకుండ నిరోధింపవలెను. అడవిసరిహద్దు చిహ్నములు సరిగా కాపాడవలెను. తొలకరివానలు పడినతరువాత నెలలవరకు అడవులలో పశువులను మేతకు వదలగూడదు. ఎన్ని పశువులను మేతకు వదలవచ్చునో, ఎన్నిచెట్లను కొట్టవచ్చునో ఈమొదలయినవి గవర్నమెంటువారి చట్టముల ననుసరించి పంచాయతీవారు నిర్ణయించుకొనుదురు.

పైని చూపినపట్టిక ననుసరించి ౧౯౫౪ వ ౧౧౧ అటవీపంచాయతుల క్రింద ౪౪౫ చ మైళ్ల యడవి యుండెను. ఈయడవికి పంచాయతులనుండి గవర్నమెంటువారికి మొత్తమునీద రు ౧౧,౪౯౦ల కిస్తు చెల్లినది. ఈపంచాయతులు సరిగ పని చేయుచున్నది లేనిది మొదట ఫారెస్టు పంచాయతీఆఫీసరు కనుగొనుచుండెను, కాని ౧౯౫౪-౫౫ జనవరి ౧-వ తేదీ లగాయతు ఈయధికారము జిల్లారివిన్యూవర్గమువారికి వశపఱుపబడినది. ఈ పంచాయతులపనిని కనుగొనుట కిరువురు డిప్యూటీతహసీలుదారులు నియమింపబడిరి. ఒకరు అనంతపురమునను మఱియొకరు పెనుకొండయందు నుందురు.

## వర్షపాతము శీతోష్ణస్థితి

జిల్లాయందలి పంటపైరులు ప్రధానముగ వర్షాధారములు. ఒక్క బళ్లారిజిల్లాను మినహాయించినయెడల చెన్నరాజధానియందలి యేయితరజిల్లాయందుకంటెను వర్షపాతమీజిల్లాయందు తక్కువ. అనంతపురము జూను, జూలై, ఆగస్టు, సెప్టెంబరు మాసములలో తొలకరివానలు, అక్టోబరు, నవంబరు, డిసెంబరుమాసములయందలి తూర్పువానలు కురియుప్రదేశమున నున్నది కాని రెండువానలును చక్కగా గురియవు. సాధారణముగ ఈజిల్లాయందు ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరుమాసములలో వాన యెక్కువగా గురియును. కడచినపదియేండ్లకాలమున ఈజిల్లాయందు గురిసినవాన లెక్కవేసి చూడగా సగటున సంవత్సరమునకు ౨౨ అంగుళములపైచిలుకు కురిసినట్లు తేలినది. జిల్లాతాలూకాలలో పెనుకొండతాలూకాయందు వర్షమధికముగ కదిరితాలూకాయందు దల్పము. హిందూపురము, అనంతపురము, ధర్మవరము, తాడిపత్రి, గుత్తి, మడకశిరతాలూకాలయందు జిల్లాసగటుమీద సగటునబడినవర్షముకన్న తక్కువ; కల్యాణదుర్గము, కదిరితాలూకాలయందు జిల్లాసగటుకు మేలినలెక్కకంటె దక్కువవర్షము కురిసినది. ఆది యటుండ నీవర్షపాతము జిల్లాయందంతట సమముగ నుండదు. యొకచోట యెక్కువగాను, ఒకచోట తక్కువగాను ఉండును. వర్షములు సరిగా గురియక కఱవు కాటకములు తఱచు సంభవించుచుండును.

ఆర్ద్రతయందును, తాపపరిమాణమునను ఈజిల్లా బళ్లారివలె నుండును. మార్చి, ఏప్రిల్, మే మాసములు మండు వేండకాలము. చెన్నరాజధానియందలి యితరజిల్లాలయందుకంటె నిచ్చట ఎండ లధికము. మృగశిర ప్రవేశముతో జూన్‌మాసమునుండి ఎండలు తగ్గును. అప్పు డిచ్చటిశీతోష్ణస్థితి యితరజిల్లాలలోకంటె ఎక్కువ బాగుగ నుండును. జిల్లాయందలి యుత్తరపువైపుభాగమునకంటె దక్షిణపువైపుభాగ మెక్కువ చల్లగ నుండును.

## చెఱువులు

ఈ జిల్లాలో ౧౬౨ చెఱువులు కలవు. వానిలో బుక్కపట్టణముచెఱువు, ధర్మవరముచెఱువు, సింగనమలచెఱువు అనునవి ముఖ్యమయినవి. మొదటిరెండును చిత్రావతినదికి నడ్డకట్టవేసి నిర్మింపబడుటచేత వానికి నీటివసతి విశేషముగ నుండును. మిగిలినచెఱువు లన్నియు వర్షములు బాగుగ నున్ననిండును, లేనిచో లేదు. సగటున కొన్నిసంవత్సరములకు లెక్కవేసి చూడగా ఉన్నచెఱువు లన్నిటిలో ఎనిమిదివంతులలో నొకవంతు నిండుననియు, రెండువంతుల చెఱువులలో నీరు యుండ దనియు, అయిదువంతులు అసంపూర్తిగ నిండు ననియు తేలినది. ఈచెఱువులక్రింద జరుగువ్యవసాయము చాలముఖ్యమైనది.

రు ౫,౦౦౦ల కిస్తుకు పైన వచ్చు ఆయకట్టుపరిమితిగల చెఱువు లీక్రిందిపట్టికయందు జూపబడినవి.

| చెఱువు | ఆయకట్టు | కిస్తు |
|---|---|---|
| అనంతపురముతాలూకా | | |
| అనంతపురం చెఱువు | ౨,౧౬౯ | ౧౩,౬౦౩ |
| సింగనమలచెఱువు | ౨,౪౪౨ | ౧౪,౬౭౧ |
| ధర్మవరముతాలూకా | | |
| ధర్మవరము చెఱువు | ౧,౬౪౬ | ౧౫,౩౬౭ |
| గుత్తితాలూకా | | |
| గుత్తిచెఱువు | ౬౭౭ | ౬,౫౩౦ |
| రాయలచెరువు చెఱువు | ౭౯౦ | ౬,౩౦౧ |
| హిందూపురంతాలూకా | | |
| పరిగిచెఱువు | ౨,౬౪౩ | ౧౪,౯౩ |
| కల్యాణదుర్గంతాలూకా | | |
| కంబాదూరు చెఱువు | ౯౦౬ | ౫,౪౬౭ |

# అనంతపురముజిల్లా

మడకశిర తాలూకా

| | | |
|---|---|---|
| మొరుబాగలం చెఱువు | ౧,౧౩౩ | ౬,౧౮౩ |
| అమరాపురం చెఱువు | ౯౩౧ | ౬,౫౯౦ |
| అగళి చెఱువు | ౮౮౮ | ౪,౯౮౧ |

పెనుకొండతాలూకా

| | | |
|---|---|---|
| బుక్కపట్టణం చెఱువు | ౩,౩౯౮ | ౪౩,౬౩౩ |

## వృత్తులు పరిశ్రమలు

రాయలసీమయందలి యితరజిల్లాలలోవలెనే ఈ జిల్లాయందు కూడ ప్రజలకు ప్రధానజీవనాధారము వ్యవసాయము. ఈవృత్తితోడు పశువులమందలను గొఱ్ఱెలమందలను పెంచుటకూడ గలదు. కుమ్మరము, కమ్మరము, వడ్రంగము మొదలయిన చేతిపను లటుంచి ప్రధానమయిన పరిశ్రమ నేత. వేసవికాలమున వ్యవసాయపు పని లేనిదియు మంచిదినములలో ముఖ్యముగ గుత్తి, తాడిపత్రి తాలూకాలయందలి కాపులు, మహమ్మదీయులు, దూదేకులవాండ్రు, మాల, మాదిగలు నేత నేయుదురు. దాదాపుగ ప్రతిగ్రామమునను రాట్నములు కలవు. కాని వ్యవసాయపు పనితొందరలు లేనికాలముననే వానికి పని కలుగును. గుప్పటములు, సాధారణముగ రైతులు కట్టుకొను ముతక బట్టలు, స్త్రీలు కట్టుకొను రంగుచీరలు ఎక్కువగ ఈజిల్లాయందు నేయుదురు. రవికలకు తలపాగలకు పనికివచ్చు బట్టకూడ కొంత తయారగును. ఉరవకొండ, తాడిపత్రి, ధర్మవరములు ఈ నేత పరిశ్రమకు ప్రధానస్థలములు. ప్రధానముగ దేవాంగులు, తొగటవారు, సాలీలు నేత నేయుదురు. అచ్చటచ్చట మహమ్మదీయులును, మాలవాండ్రునుకూడ నేతనేయుట కలదు. నేత కుపయోగించు దారము కొంచె మెందుమించుగ నంతయు యంత్రముమీద తయారయినదే. పట్టుబట్టలు, చీరలు ముఖ్యముగ ధర్మవరమున నేయుదురు. నేతపరిశ్రమ ఉరవకొండయందు పూర్వముకంటె చాల తగ్గినది. ఇచ్చట తయారగు నీలిరంగుబట్టలు కాఫీతోటలలో పనిచేయు కూలీలకు మల్నాటి యెగుమతి యగును. పామిడి చౌలూరుగ్రామము లందును, కొంతవఱకు పెనుకొండ, గుట్టూరుగ్రామములందును చేతితో బట్టల యద్దకము చేయుదురు. అంబాడీస్త్రీల కుపయోగపడు చీటీబట్టలును, బర్మా, సీవాంగు, సింగపూరు, దక్షిణహిందూదేశము, బొంబాయి బజారులలో చెల్లుబడియగు చీటీబట్టలుమాత్రమే యిచ్చట తయారగుచున్నవి. కలంకారీయద్దకము నశించినది. ముఖ్యముగ కల్యాణదుర్గము తాలూకాయందును, గుత్తి అనంతపురము తాలూకాలలోని కొన్ని భాగములయందును కంబళ్లు నేయుదురు. ఈజిల్లాయందలి తనకల్లు, బెళుగుప్ప గ్రామములయందు తయారగు కంబళ్లు ప్రశస్తమైనవి. ఇక్కడ తయారగుకంబళ్లు బళ్లారి యెగుమతి యగును. ఈజిల్లాయం[illegible] గాజాలు తయారుచేయు గ్రామము పెనుకొండ కనిదిమై ల్రమున నున్నగుట్టూరు. తీరమయిన మంచిన మట్టితో సీగాజాలు చేయుదురు. ఈకారణమున దీనికి గాజులగుట్టూ రని పేరువచ్చినది. ఒకప్పు డిచ్చట గాజాలు తయారుచేయువా రెవుబందల మంది యుండిరి. ఇప్పు డీపరిశ్రమ క్షీణించినది. ధర్మవరమునకు పదునైదుమైళ్లదూరమున నున్న హ్మాకుద్దల గ్రామమున కొయ్యబొమ్మలు మొదలకు కాగితము తయారు చేయువారు. ఇప్పు డీపరిశ్రమయు క్షీణించినది. హిందూపురము తాలూకా చిలమత్తూరు గ్రామమున మాలలొను, పట్టుతోను పటకాలను, కొడికొండ గ్రామమున కత్తులుబ్లేడులను తయారగుచున్నవి. తిప్పనచెర్ల, గుంతకల్లు, తాడిపత్రి గ్రామము లందు ప్రత్తి రేకి యూటలు కట్టు ప్రత్తి ఫ్యాక్టరీలు చాలకాలమునుండి యున్నవి. వీనిలో అనేకులు పనిచేయుచుందురు.

## వర్తకము ఎగుమతి, దిగుమతులు

ప్రత్తి, ఊలవలు, ఆహారపదార్థములు, దుప్పటులు, చీరలు, తంగేటిచెక్క ఇచ్చటి ముఖ్యమయిన యెగుమతులు. ఉప్పు, కిరసనాయిలు, పరదేశపునూలు, పరదేశపుబట్టలు, పశువులు ముఖ్యమయిన దిగుమతులు. ఈజిల్లాయం దుత్తరమునకు తాడిపత్రియు, దక్షిణమునకు హిందూపురము ప్రధానవర్తకస్థానములు. ఎగుమతి చేయుటకును, జిల్లాయందు దొరకనివానిని ప్రోగుచేయుటకును, దిగుమతి యయినవానిని స్థానికముగ పంచుటకును వారము వారము జరుగు సంతలు తోడ్పడును. ఈసంతలు లోకలుబోర్డువారియాధీనమునం దుండును. ఇట్టివానిలో ముఖ్యమయినవి తాడిపత్రి, యాడికి, ఉరవకొండ, పెనుకొండలందు జరుగును.

## బాటలు

ఈజిల్లాయందు బండిబాటలు, రోడ్లు చాల కలవు. రోడ్లు మదరాసుకంటె చాల చక్కగనుండినవి. ౬,౫౮౧ చదరపుమైళ్ల వైశాల్యము కల యీజిల్లాయందు ౧,౦౮౦ మైళ్ల రోడ్లు కలవు. ఈజిల్లాయందలిరోడ్లను నాలుగుతరగతులుగ విభాగించిరి. ట్రంకురోడ్లు, రెండవతరగతిరోడ్లు, మూడవతరగతిరోడ్లు, జిల్లాబోర్డురోడ్లు కాక ఇతరములయినవట్టోడ్లు. ట్రంకురోడ్లు రెండు కలవు. అం దొకటి చెన్నపురినుండి బొంబాయికిని, రెండవది కర్నూలునుండి బెంగుళూరికిని పోవుచున్నది. ఈరెంటిని సరియైనస్థితియం దుంచుట కగు వ్యయము నంతయు గవర్నమెంటువారు భరింతురు. ఇవి మోటారు బండ్లు పోవుటకు తగినస్థితియం దున్నవి. రెండవతరగతిరోడ్లుకూడ ప్రయాణార్హములయినవే. వీనిని సరియైనస్థితియం దుంచుట కగు వ్యయమున సగము గవర్నమెంటువారును, సగము జిల్లాబోర్డువారును భరింతురు. మూడవతరగతిరోడ్లను జిల్లాబోర్డువారును, నాలుగవతరగతిరోడ్లను తాలూకాబోర్డువారును సుస్థితియం దుంచి కాపాడెదరు. వీనిని మరమ్మతుచేసి చక్కగస్థితియం దుంచుటకు తగినంతధనము లేక పోవుటచేత [illegible], నాలుగుతరగతులరోడ్లు అంత బాగుగ లేవు. కాని వీనిలో అనంతపురము—కల్యాణదుర్గముమధ్యని రోడ్డు కొన్ని యప్పుడు మోటారుబండ్లు పోవుటకుకూడ తగినస్థితియం దున్నవి.

తాశీదారుగా మండి అసిస్టెంటు లేక డిప్యూటీసూపరింటెండెంటు దానిని నడపుచుండును రాయలసీమజిల్లాలయందియు, ఉత్తర సర్కారులయందియు పోలీసుపనిలో క్రొత్తగ చేరఁదలఁచినవారికి కడపపాఠశాలకు వత్తురు

ఈ జిల్లాకు గిల్లాజైలు లేదు జిల్లా మొత్తముమీఁద ౩౪ పోలీసుస్టేషనులును, ౧౧ 'ఔట్‌పోస్టు' లును కలవు జిల్లా సంరక్షణామునకయి తొమ్మండ్రు ఇన్‌స్పెక్టరులును, ౧౯ గురు సబ్ ఇన్‌స్పెక్టరులును, ఇరువురు సార్జెంటులును, ౪౯౬ గురు కానిస్టేబిలులును (హెడ్ కానిస్టేబిలులతోఁ గూడ), ౭౬ గురు తలారులును నియమింపఁబడినారు ౧౪ సబ్‌జైళ్లు కలవు మాసమునకు పైని శిక్ష విధింపఁబడినవారిని బళ్లారిజైలునకు పంపెదరు అన్ని సబ్‌జైళ్లలోఁ గలసి ౬౩౭ గురు ఖైదీలు పట్టెదరు పెనుగొండ, హిందూపురం, మడకశిర, ధర్మవరము, అనంతపురము, కల్యాణదుర్గము తాలూకాల కొక్కొక సబ్‌జైలును, కదిరి, గుత్తి, తాడిపత్రి తాలూకాలకు రెండేసి సబ్‌జైళ్లును కలవు

ఇదివఱకు రిజిస్ట్రేషనువిషయమున ఈజిల్లా బళ్లారిజిల్లాలో నిదిగ చేర్చఁబడుచుండెడిది కాని ౧౯౧౯-వ సెప్టెంబరు మొదటి తేదీ మొదలు ఈవిషయమున ఈజిల్లాను బళ్లారిజిల్లానుండి విడఁదీసి అనంతపురముజిల్లాకు జిల్లారిజిస్ట్రారును నియమించి, జిల్లారిజిస్ట్రారుకార్యస్థానముగూడ అనంతపురముననే ఏర్పాటు చేసిరి జిల్లారిజిస్ట్రారు క్రిందనుండు సబ్‌రిజిస్ట్రారు లుండుదురు వీరుకాక ఈజిల్లాయందు పదునెండుగురు సబురిజిస్ట్రారులు కలరు వీరిలో ఎనమండ్రు తాలూకా ప్రధానగరములం దుందురు తక్కినవారిలో గుత్తి తాలూకాయందలి గుంతకల్లున నొకరును, ఉరవకొండయం దొకరును, పెనుకొండతాలూకాయందలి బుక్కపట్టణమున నొకరును ఉందురు లేవ రిజిష్టరగు స్థిరాస్తిమొత్తమువిలువ ౧౯౨౭ లో అంతకు గడచిన తొమ్మిదివత్సరములలో ౫౯ లక్షలనుండి ౫౬ లక్షలకు తగ్గినను, జిల్లారిజిస్ట్రారు ఏర్పడి యీమార్పులు జరిగినప్పటినుండి రిజిస్ట్రేషను పని వృద్ధి యగుచున్నది

అబ్కారీపరిపాలనమునిమిత్తము మొదట తొమ్మిదితాలూకాలు కలిపి జిల్లానంతయు ఒక్కసర్కిలుగా ఏర్పాటు చేసిరి ౧౯౨౪ వ చెట్లకు పన్ను కట్టుపద్ధతి వచ్చినతరువాత అప్పుడు ఒక యిన్‌స్పెక్టరునకు పని యెక్కువ యయినది అందువలన పెనుగొండ సర్కిలు ఏర్పాటయినది కదిరి, ధర్మవరము, పెనుకొండ, హిందూపురము, మడకశిర తాలూకాలు ఆయినను పెనుకొండసర్కిలులో చేర్చిరి మిగిలిన నాలుగు తాలూకాలును అనంతపురముసర్కిలులో చేర్పఁబడినవి

## సహకారోద్యమము

సహకారోద్యమలాభములు బడసిన మొదటిజిల్లాలలో ఈయనంతపురము నొకటి ఇది కఱవుగ తీవ్రమయిన కఱవుకాటకములు సఖ యనుకునటులున వ్యవసాయదారులవ జీవింపుజనులకు సహకారోద్యమమువలన గొప్పప్రయోజనము కలిగినది ఈజిల్లాయందు మొదటి సహకారపరపతిసంఘము ౧౯౦౫ వ సంవత్సరమున బుక్కపట్టణమున స్థాపితమయినది ౧౯౨౭ వ సంవత్సరమున, అనఁగా యిరువదియేండ్లు సంవత్సరములకుఁ పిమ్మట, ౫౧౪ సహకారపరపతిసంఘములుండెను ఈసంఘములలో నూటికి తొంబది కర్షకులకు ఋణము లిచ్చుసంఘములు (Agricultural Credit Societies) ఈ సంఘములు అన్నిటఁ గలసి ౩౦,౦౦౦ ల సభ్యులు కలరు నిర్వాహకమునకుఁ దిరుగుపెట్టుబడిమొత్తము (Working Capital) ౭౫ లక్షలు ఈసంఘములు వ్యవసాయకుల కావశ్యకత కలిగినప్పుడు బాగుల్లు పుట్టుటలోఁ గల కష్టములను దొలఁగించుటకే కాక ఋణప్రదాతలు విధించువడ్డీ ఎక్కువ 'వరవడి' ని (High rate) తగ్గించుటకును తోడ్పడినవి జిల్లా 'సహకారపరపతిబ్యాంకి' ౧౯౧౯ వ సంవత్సరమున ఏర్పడినది ఇది ప్రజలవలననుండి నిలువచేయుటకు సొమ్ము (Deposits) తీసికొనును, చట్టము ప్రకారము రిజిస్టరయినసంఘములకు సుకరమయిన పద్ధతుల మీఁద ఋణ మిచ్చును ఈజిల్లాయందలి సహకారసంఘములలోఁ గొన్ని ప్రత్యేక మొక్కనిమ్నజాతులకే తోడ్పడువనియుఁ గలవు అట్టివి ముప్పదిసంఘము లున్నవి వీనిలో ౪౦౪ గురు సభ్యు లున్నారు నిర్వాహకమునకుఁ దిరుగుపెట్టుబడిమొత్తము రు ౨౫,౦౦౦ లు పట్టామీఁద భూములు సంపాదించి నేద్యమునకొఱకు వానిని సంఘసభ్యులకొసఁగుట ఈముప్పదింటిలో అయిదుసంఘముల ప్రధానోద్దేశము జిల్లాయందలి యీసంఘము లన్నిటిమీఁద నధికారి అనంతపురమునం దుండు అసిస్టెంటురిజిస్ట్రారు ఈయసిస్టెంటు రిజిస్ట్రారుక్రింద, సంఘములపనిని తనిఖీ చేయుటకును, లెక్కలను పాలించి సరిమాచుటకును, మంచిచెడ్డలను తెలియఁజెప్పుటకును పదుమువ్వురు ఇన్‌స్పెక్టరులు కలరు

## జనులు మతము

ఈజిల్లాయందు ౧౯౧౧ వ సంవత్సరపుజనాభాలెక్క ననుసరించి ౯,౬౩,౨౬౦ మందియు, ౧౯౨౧ వ సంవత్సరపుజనాభాలెక్క ననుసరించి ౯,౩౩,౪౫౪ మందియు, ౧౯౧౧ వ సంవత్సరపు జనాభాలెక్క ననుసరించి ౯,౬౩,౨౭౮ గురును, ౧౯౨౧ వ సంవత్సరపు జనాభాలెక్క ననుసరించి ౯,౫౫,౯౧౪ గురుగు జను లుండిరి ఇటీవల ౧౯౩౧-వ సంవత్సరమున జరిగినజనులగణితి ననుసరించి ఈజిల్లాయందలి మొత్తముజనసంఖ్య ౧౦,౫౦,౭౧౧ మంది తేలినది ఇందు ౫,౩౯,౫౩౮ గురు పురుషులు, ౫,౧౦,౯౪౪ గురు స్త్రీలు ౧౯౩౧-వ సంవత్సరపు జనాభాలెక్కల ననుసరించి 'తాలూకా వారిగ విస్తీర్ణము, గ్రామములసంఖ్య, జనసంఖ్య మొదలైనవి ప్రక్కపుటలోని పట్టికయందుఁ జూపఁబడినవి.

# అనంతపురముజిల్లా

| తాలూకాపేరు | విస్తీర్ణము చ. మైళ్లు | పట్టణముల సంఖ్య | గ్రామముల సంఖ్య | ఇండ్లసంఖ్య | జనాభా – ౧౯౩౧ | | | చ. మైలుకు జనసంఖ్య ౧౯౩౧ |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | మొత్తము | పురుషులు | స్త్రీలు | |
| అనంతపురము డివిజను | | | | | | | | |
| అనంతపురము | ౯౨౬ | ౧ | ౧౧౪ | ౨౩,౬౬౮ | ౧,౧౬,౯౫౮ | ౬౧,౦౪౯ | ౫౫,౯౦౯ | ౧౨౬ |
| కల్యాణదుర్గము | ౮౨౧ | ౧ | ౭౪ | ౧౭,౫౯౦ | ౮౭,౪౪౭ | ౪౫,౨౩౬ | ౪౨,౨౧౧ | ౧౦౭ |
| ధర్మవరము డివిజను | | | | | | | | |
| ధర్మవరము | ౭౩౬ | ౧ | ౬౩ | ౧౮,౮౮౮ | ౯౦,౦౨౪ | ౪౬,౪౯౬ | ౪౩,౫౨౮ | ౧౨౨ |
| కదిరి | ౧,౧౬౨ | ౧ | ౧౪౧ | ౩౫,౮౬౬ | ౧,౭౩,౨౫౪ | ౮౯,౬౦౦ | ౮౩,౬౫౪ | ౧౪౯ |
| గుత్తి డివిజను | | | | | | | | |
| గుత్తి | ౮౯౬ | ౪ | ౧౩౨ | ౩౧,౫౬౯ | ౧,౫౯,౬౪౦ | ౮౧,౪౭౬ | ౭౮,౧౬౪ | ౧౭౮ |
| తాడిపత్రి | ౬౪౧ | ౧ | ౯౭ | ౨౩,౮౩౯ | ౧,౧౭,౩౧౫ | ౫౯,౩౭౩ | ౫౭,౯౪౨ | ౧౮౩ |
| పెనుకొండ డివిజను | | | | | | | | |
| హిందూపురము | ౪౩౧ | ౧ | ౭౭ | ౨౩,౫౦౭ | ౧,౧౦,౧౯౪ | ౫౬,౭౮౫ | ౫౩,౪౦౯ | ౨౫౬ |
| మడకశిర | ౪౪౬ | ౧ | ౫౭ | ౧౯,౧౬౦ | ౯౭,౦౮౧ | ౪౯,౨౭౩ | ౪౭,౮౦౮ | ౨౧౮ |
| పెనుకొండ | ౬౮౨ | ౧ | ౯౮ | ౨౧,౩౯౯ | ౯౮,౪౯౮ | ౫౦,౨౪౬ | ౪౮,౨౫౨ | ౧౪౪ |
| మొత్తము | ౬,౭౪౧ | ౧౨ | ౮౫౩ | ౨,౧౫,౪౮౭ | ౧౦,౫౦,౪౧౧ | ౫,౩౯,౫౩౪ | ౫,౧౦,౮౭౭ | ౧౫౬ |

ఈజిల్లాయందలిజనులలో నూటికి దాదాపు తొంబదిమంది హిందువులును, తొమ్మండ్రకుపైగా మహమ్మదీయులును గలరు ముఖ్య మతముల ననుసరించి ఈ జిల్లాయందలి జనసంఖ్య యీ క్రింద 'తాలూకావారి'గా నీయబడినది

| తాలూకా | హిందువులు | మహమ్మదీయులు | క్రైస్తవులు |
|---|---|---|---|
| అనంతపురము | ౧,౦౬,౬౪౮ | ౯,౫౮౭ | ౬౭౬ |
| ధర్మవరము | ౮౪,౮౯౫ | ౪,౭౬౨ | ౩౪౯ |
| గుత్తి | ౧,౩౬,౮౨౬ | ౨౦,౪౫౦ | ౨,౨౯౩ |
| హిందూపురము | ౯౮,౩౪౫ | ౧౧,౪౭౦ | ౩౦౯ |
| పెనుకొండ | ౮౯,౬౬౩ | ౮,౫౯౮ | ౨౨౭ |
| కదిరి | ౧,౫౦,౨౫౯ | ౨౨,౩౩౮ | ౬౫౫ |
| కల్యాణదుర్గము | ౮౩,౮౫౦ | ౩,౫౦౩ | ౮౩ |
| మడకశిర | ౯౨,౬౯౮ | ౩,౪౮౯ | ౪౬ |
| తాడిపత్రి | ౧,౦౦,౫౮౪ | ౧౪,౭౬౧ | ౧,౯౦౮ |
| మొత్తము | ౯,౪౩,౭౬౮ | ౯౮,౯౫౪ | ౬,౫౪౬ |

జైనులీజిల్లాయందు వేయిమందికిపైని కలరు అందు ౮౪౮ గురు మడకశిరతాలూకాయందున్నారు.

## వ్యవసాయము

జిల్లాయుత్తరభాగమునందుఁ దక్క మిగిలినభాగమునం దంతటను భూమి మిక్కిలి చీడయై ఫలవంతము కాదు. ఉత్తరపుతాలూకాల లోని రేగడిభూమియును నంత శ్రేష్ఠమైనది కాదు. ఈజిల్లాలో పెద్ద ఆనకట్టలు కాని, ఏటికాల్వలు కాని లేవు అందుచేత చెఱువుల యాధారమునను, బావులయాధారమునను మాగాణిపైరులు, తోట పైరులు చేయుదురు ఈజిల్లాయం దిరువదివేలవఱకు బావులు కలవు. మిక్కిలి కట్టకాలములో బావు లంతగా నుపయోగపడవు. మెరక పైరులలో కఱ్ఱజొన్న, రాగి ముఖ్యమయినవి. కొద్దిభూమి లేక ఎక్కువపైరును, వెలగలపైరును పండించుటకు బదులుగా రైతులు ఎక్కువభూమిని దున్ని కొద్దిపైరులను చీడపైరులను పండించెదరు. ౧౩౪౦-వ ఫసలీ, అనగా ౧౯౩౦-౩౧-వ సంవత్సరమున 'రైతా దీన'మం దున్నభూమి ౧౯,౧౧,౪౦౯ యెకరములు. దీనివలన వచ్చు శిస్తుమొత్తము రు ౧౩,౩౯,౦౩౩ లు. ఈ 'భూమి పరిమితము'న ౧౭,౯౦,౦౦౮ యెకరములకేల మెట్టవ్యవసాయమును, ౧,౨౧,౪౦౧ యెకరములకేల పల్లపువ్యవసాయము (నీరుపారించి చేయునది) ఇప్పటికిని చీడుభూము లేటేటను పాడగుచున్నవి

ఈమండలమున పచ్చికబయళ్లు మెండుగా లేకపోవుటచేత ఇచ్చట పుట్టు పశువు లంత శ్రేష్ఠమైనవి కాకయున్నవి అందు వలన బెల్లారిప్రాంతపు బలిష్ఠములైన కోడెలను మంచివెలకుఁ గొని తీసికొనివచ్చుచుందురు కొన్నిచోటుల మండలమునందు గొఱ్ఱెలను మేకలను ఎక్కువగాఁ బెంచెదరు ఈయున్నితో చాలగ్రామము లందు రగ్గుకంబళ్లు నేయుదురు.

## కఱవులు

ఈజిల్లాయందు వర్షపాతము చాల తక్కువ యగుటవలన పైరుపంటలకు తగినంత నీరు దొరకక తఱచుగ కఱవు సంభవించు చుండును, ఒక్కొక్కప్పు డతివృష్టి కలిగి పంటలు చెడి కఱవు సంభ వించుటయు కలదు. కడచినశతాబ్దియందు ౧౮౦౩, ౧౮౨౪, ౧౮౩౩,

మహారాష్ట్రులు, నైజాము, ఇంగ్లీషువారు కలసి ౧౭౯౨ లో టిప్పూ సుల్తాను నోడించినప్పుడు, ఇప్పటి అనంతపురముజిల్లా యొక్క ఉత్తరభాగమైన యిప్పటి తాడిపత్రి, తాడిమఱ్ఱి తాలూకాలు నైజామున కీయఁబడెను. టిప్పూ చనిపోయిన తరువాత ౧౭౯౯ లో అతని రాజ్యమును ఇంగ్లీషు, నైజాము మొదలగువారు పంచుకొనునప్పుడు ఈజిల్లాయొక్క మిగిలినభాగ మంతయు నైజామునకుఁ జేరెను. ఈ రెండు తహానామాల (treaties) ననుసరించి నైజామునకు వచ్చిన రాజ్య మంతయు, నతఁడు ౧౮౦౦ లో నింగ్లీషువారికి దత్తము చేసెను. అవియే దత్తమండలములు (Ceded Districts). దత్తమండలప్రదేశమున కిప్పుడు రాయలసీమ యని పేరు. నైజామునంరక్షణ నిమిత్తమై యింగ్లీషువా రుంచవలసిన సైన్యముకర్చుక్రింద ఈమండలములు శాశ్వతముగ నింగ్లీషువారి కీయఁబడెను. అప్పు డనంతపురముగూడ బ్రిటిషుప్రభుత్వమునఁ జేరెను.

మొదట దత్తమండలముల కన్నిటికి నొక్కఁడే కలెక్టరుండెను. మొదటికలెక్టరు మేజర్ మన్రో (ఇతఁడే తరువాత సర్ పదవిని బొందెను). తరువాత దత్తమండలములు రెండుజిల్లాలుగ విభజింపఁబడెను. అందు బళ్లారిజిల్లాలో నిప్పటి యనంతపుర ముండెను. బళ్లారిజిల్లా పెద్దది అయినందున ౧౮౮౨లో దానిని రెండు జిల్లాలుగ విభజించి, ఒకదానికి బళ్లారి అనియు, రెండవదానికి అనంతపుర మనియు పేర్లు పెట్టిరి. కదిరితాలూకా యిదివఱకు కడపజిల్లాలోనిది — ఇందుఁ జేర్పఁబడినది.

ఈజిల్లాలో చరిత్రప్రసిద్ధములయిన పురాతనదుర్గములు గుత్తి, పెనుకొండ కోటలు. తాడిపత్రిలో పెన్నయొడ్డున నున్న దేవాలయము, లేపాక్షి, హేమావతిదేవాలయములు రమణీయశిల్పశోభితములు.

నిడుగల్లుకూడ చరిత్రప్రసిద్ధమయిన స్థలము. ఈ నిడుగల్లు రాజ్యమును పదునొకండు, పండ్రెండు, పదుమూఁడు శతాబ్దములందు చోళవంశజులు పాలించిరి. వారి రాజధాని యిప్పటి హేమావతిగ గుర్తింపఁబడిన పెంజేఱు. హెంజే అనియు దీనికి నామాంతరము గలదు. వీ రీమండలమును పాలించుకొన్న ప్రధాన వంశముల కొకప్పుడు సామంతులుగను, వారి యధికారము క్షీణించుచుండినకాలమున స్వతంత్రులుగను రాజ్య మేలుచువచ్చిరి. పదునేడవశతాబ్దియం దీరాజ్యము విజయనగరపు అరవీటివారికి సామంతులుగ పారతినాయకులు పాలించిరి. టిప్పూసుల్తా నీప్రాంతమును జయించి తనరాజ్యమునఁ గలుపుకొనువఱకు వీ రధికారము నెఱపుచునే యుండిరి.

క్రీస్తుశక పదునొకండవశతాబ్దినాఁటి తెలుఁగుశాసనములు కొన్ని యీ మండలమునందలి గుత్తితాలూకాయందుఁ గానవచ్చినవి. తెలుఁగు వ్రాసి యున్న మొదటిశాసనములలో నివి కొన్ని. వీనిలో మొట్టమొదటఁ జెప్పఁదగినది వాదాము చాళుక్యప్రభువయిన మొదటి విక్రమాదిత్యుని యిరువదిరెండవ పరిపాలనవర్షము (క్రీ. శ. ౬౭౨) నాఁటిది.

**అనంతపురము తాలూకా** — అనంతపురముజిల్లాయందలి యొక తాలూకా. ఉత్తరమున గుత్తితాలూకాయును, తూర్పున తాడిపత్రితాలూకాయును, దక్షిణమున ధర్మవరముతాలూకాయును, పడమట కల్యాణదుర్గముతాలూకాయును నడుమ నున్నది. దీని విస్తీర్ణము ౯౨౬ చ. మైళ్లు. జనసంఖ్య ౧,౧౬,౪౭౫ (౧౯౨౧). ఈ తాలూకాయందు ౧౧౪ గ్రామములు గలవు. అనంతపుర మొక్కటే ఈతాలూకాయందలి పట్టణము. ఇందలి మెట్ట, పల్లము కలసి ౧౩౩౫-వ ఫసలీ (౧౯౨౫-౧౯౨౬) లో ౨,౦౦,౦౬౫ యెకరములు. మొత్తము కిస్తు రు ౧,౧౭,౪౯౮ లు.

ఈ తాలూకా మిట్టపల్లములు గల ప్రదేశము. భూమి చీడ దయినందున ఫలవంతము కాదు. అందుచేత పచ్చని చెట్లు తక్కువగఁ గానవచ్చును. ఉత్తరమున నచ్చటచ్చట నల్లరేగడిభూమి కొద్దిగఁ గలదు. ఈ తాలూకా కుత్తరమున పెన్నయు, తూర్పున చిత్రావతియుఁ గలవు. కాని వీనివలన తాలూకా కేమియు ప్రయోజనము లేదు. పల్లపువ్యవసాయమున కంతకును వర్షమే ప్రధానాధారము.

మొదట విజయనగరాధీశులక్రిందఁ గాశెగాండ్రుగ నుండిన హండేవంశజులు ఈప్రాంతమునఁ బ్రసిద్ధు లయిన నాయకులు. విజయనగరరాజులప్రథ తగ్గినపిదప హండే మలకప్పనాయఁడు గోలకొండ నవాబునకు సామంతుఁ డయి అనంతపురమునకుఁ జుట్టుపట్టులనుండు ప్రాంతమును జాగీరుగ సంపాదించెను. ౧౮౦౦ లలో నింగ్లీషువారికి వశపడువఱకు అనంతపురమును ముఖ్యపట్టణముగ చేసి కొని యీ వంశమువా రొకరి కొకరికి లోఁబడి ఈ ప్రాంతము నేలుచుండిరి. ఈకారణమున అనంతపురముతాలూకాకు ముఖ్యపట్టణ మయిన అనంతపురమునకు 'హండీ అనంతపుర' మని ప్రసిద్ధి కలిగినది (చూడుఁడు హండేవంశము).

అనంతపురసమీపమున నున్న చెఱువును క్రీ. శ. ౧౩౬౪-వ విజయనగరరాజుల మంత్రియయిన చిక్కప్పఒడయ రనువతఁడు కట్టించెను.

**అనంతఫంది** — ఒకమహారాష్ట్రకవి. ఇతఁడు శా. శ. ౧౬౬౬ లో జన్మించి ౧౭౪౧ లోఁ గీర్తిశేషుఁ డయ్యెను. నగరప్రాంతమునందలి సంగమనేర్గ్రామనివాసి. మొదట నితఁడు శృంగారాతిరేకముగల 'లావణీ' లనఁబడు వృత్తములలోఁ బద్యములఁ జెప్పుచు మగపిల్లలను వెంటఁ దీసికొని వారి నాడించుచు జీవనము చేయుచుండెను. కాని యొకసారి అహల్యాబాయి సంగమనేరునకు వచ్చి నప్పు డామె యీతనిని పిలిపించి బ్రాహ్మణున కిది తగ దని చెప్పఁగా నామార్గము విడిచి యితఁడు భక్తిపరమైన కవిత్వముఁ జెప్పుచు హరికథలు చెప్పఁదొడఁగెను. ఇతనిచే రచింపఁబడినచాటు వులు పెక్కులు గలవు. కావ్యములలోమాత్రము మాధవగ్రంథ మనునది యొక్కటున్నది. ఇందు రెండవమాధవరావుపేష్వ పేద వాఁడగుండి దూఁకినప్పటినుండి అంతమునకురావు రాజ్యాధికారము

జరుగుచుండుటను వర్ణింపఁబడినది కవికి జరిగిన యథార్థస్థితి, ఉత్తరములు వ్రాసి, తెలిసి కొందురుకాక రావు ఈచరిత్ర వ్రాయించెను ఇతనికి శ్రీవత్సఖండీ యను నామాంతరముగల సనాతఖండీ యను కుమారుఁ డుండెను అతఁడును కవియే.

**అనంతభట్లఖండ్రిక** — నెల్లూరిజిల్లా కోవూరు తాలూకాయందలి ఈనాం గ్రామము జనసంఖ్య ౫ (౧౯౩౧).

**అనంతభట్టు** — ఇతఁడు శివాజీగురు వైన రామదాస స్వామికి సమకాలికుఁడు సాధుపురుషుఁడు. రామదాసస్వామియొక్క పంచాయతనములో నొక్కఁడు

**అనంతభూపాలుఁడు** కుమారుల — ౧ ఇతనితండ్రి కృష్ణభూపాలుఁడు, తల్లి భాగమాంబ ‘వచనరచనా వైచక్షణ్యగరి ష్ఠుఁడితఁడు. భగవద్గీతలు, విష్ణుపురాణము, రామాయణము, భారతము వచనముగ వ్రాసినాఁడు. రామాయణమున సుందరకాండ మొక్కటి మాత్రమే (౫ ఆశ్వాసములు) లభించినది భారతమున సభా, భీష్మపర్వములుమాత్రము లభించినవి

మట్ల — ౨ విజయనగర సామ్రాజ్యవైభవము తఱిగినపిదప పదునాఱవశతాబ్దియంతమున నామమాత్రు లయినరాయలయొక్క భూములయందు సర్వస్వతంత్రముగనో, కొంత స్వతంత్రముగనో అచ్చటచ్చట రాజ్యభారము నిర్వహించినవానిలో నీమట్లవంశ మొక్కటియై కన్పించుచున్నది. మట్ల కడపజిల్లా రాయచోటితాలూకాలో నున్నది మట్లప్రభువులు విజయనగరాధీశులకు సామంతు లయిన స్వల్పసంస్థానాధిపతులు మట్ల వారిలో నొక్కఁడగు వరదరాజు శ్రీ కృష్ణదేవరాయలయల్లుఁడు మట్లవంశమువా రాంధ్రచోడులుగఁ గన్పట్టుచున్నారు వీరు సూర్య వంశజులు వీరి మూలపురుషుఁడు తిమ్మప్రభుఁడు చాటుపద్యములను బట్టియు, కకుత్స్థవిజయ-అభిషిక్తరాఘవములబట్టియు మాడ మట్ల వంశోద్భవులు విద్యాప్రియులును, రణప్రియులు నయి కన్పట్టుచున్నారు. అందు అనంతభూపాలుఁడు పెనుకొండకడ మల్కాబలముల సాధించినట్లును, గుత్తిముకొండను స్వాధీనపఱచుకొనినట్లును, సిద్ధవటదుర్గము నాక్రమించుకొనినట్లును, రాయలచే ‘సురయాణ’ బిరుద మందినట్లును తెలియవచ్చుచున్నది యుద్ధవీరుఁడుగను, కావ్యకర్తగను ప్రఖ్యాతిఁ గాంచిన ఈ యనంతభూపాలుఁడు ఎల్లమరాజు మనుమఁడు, రంగమాంబకును పుత్త్రుఁడు, తిరుమలతోళప్పాచార్యుల శిష్యుఁడు. పదునాఱవశతాబ్ది యుత్తరార్ధమునను, పదునేడవశతాబ్ది యాదిని నుండినవాఁడు. ఇతఁడు కకుత్స్థవిజయ మను గ్రంథమును రచించెను.

**అనంతమడుగు** — నెల్లూరుజిల్లా రాపూరుతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౬౪౫ (౧౯౩౧).

**అనంతయ** — ‘విష్ణుమాయానాటకప్రబంధము’ అను ఐదాశ్వాసముల గ్రంథమును రచించినకవి భారద్వాజసగోత్రుఁడు, అయ్యలామాత్యుఁ డితనితండ్రి

**అనంతయజ్వ, రేపూరి** — ఇతఁ డొక తెలుఁగు కవి ఆపస్తంబసూత్రుఁడు కౌండిన్యసగోత్రుఁడు. వైదిక బ్రాహ్మణుఁడు బాలకవి బిరుదాంకితుఁడు. మహాపండితుఁ డగు బాలకవి అనంతార్యునకు పౌత్రుఁడు. బాలసరస్వతికవి యితని తండ్రి అనంతయజ్వ ౧౬-వ శతాబ్ది తుదిభాగమువాఁ డని తెలియుచున్నది. తిరుచినాపల్లికి సమీపమున నున్న ‘తురైయూరు’ ఇతని నివాసస్థాన మని కొందఱ యూహ. ఇతఁడు రచించిన గ్రంథములు రెండు. శ్రీముష్ణమాహాత్మ్యము, శివరహస్యఖండము. ఇందు మొదటిదానిలో ఐదాశ్వాసములును, రెండవదానిలో ౭ ఆశ్వాసములును గలవు. శ్రీముష్ణమాహాత్మ్యము పెనుగొండ కృష్ణభూపాలునకును, రెండవది తీర్థపుర (తురైయూరు) నందీశ్వరునకును అంకితము చేయఁబడినవి. కవిత్వము ప్రౌఢము, మనోహరము

**అనంతయ్యగారిపల్లి** — కడపజిల్లా రాజంపేట తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨,౦౬౯ (౧౯౩౧).

**అనంతరాజపురం** — ౧. చిత్తూరుజిల్లా తిరుత్తని తాలూకాయందలి జమీన్దారీగ్రామము జనసంఖ్య ౩౦౦ (౧౯౩౧)

౨ కడపజిల్లా బద్వేలు తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౪౫౫ (౧౯౩౧)

**అనంతరాజపేట** — కడపజిల్లా రాజంపేటతాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౪,౩౨౬ (౧౯౩౧)

**అనంతరామకవి** — ఒక సంస్కృతకవి ‘స్వామభూతి’ యను పేర నొక నాటకము రచించెను

**అనంతవరం** — ౧ గుంటూరుజిల్లా తెనాలి తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨,౯౩ (౧౯౩౧).

౨ గుంటూరుజిల్లా బాపట్లతాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౪౯౨ (౧౯౩౧).

౩ నెల్లూరిజిల్లాకోవూరుతాలూకాయందలి ఈనాంగ్రామము జనసంఖ్య ౪౯౬ (౧౯౩౧).

౪ గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨,౪౪౦ (౧౯౩౧).

౫. గుంటూరుజిల్లా ఒంగోలు తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౧౧౧ (౧౯౩౧).

౬. గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౯౦౪ (౧౯౩౧)

౨ నెల్లూరుజిల్లా దర్శి తాలూకా యందలి జమీందారీ గ్రామము. జనసంఖ్య ౨౬౮ (౧౯౩౧)

౩ విశాఖపట్టణముజిల్లా భీముని పట్టణముతాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧౯౫౦ (౧౯౩౧)

**అనంతవరప్పాడు** — గుంటూరుజిల్లా గుంటూరు తాలూకాయందలి ఈనాం గ్రామము జనసంఖ్య ౨,౨౪౬ (౧౯౩౧).

**అనంతవర్మ** — ఇది కళింగము నేలిన గాంగవంశనృపాలుర పెక్కుమందికి గలనామము తమశాసనములందు గాంగేయశక వత్సరముల నొసంగిన పూర్వగాంగభూపతులలోఁ బెక్కుమంది కనంతవర్మనామము కలదు గాంగశకము ౨౦౪-వ వత్సరమున క్రోష్టుకవర్తని యందలి తాలతిర గ్రామమును బ్రాహ్మణులకు దాన మొసంగినవాఁడు దేవేంద్రవర్మకుమారుఁ డనంతవర్మ రాజేంద్రవర్మకుమారుఁ డనంతవర్మ గాంగశకము ౩౦౪-వ సంవత్సరమునాఁటివాఁ డొకఁడు కలఁడు. ఇట్లే పూర్వ గాంగనృపాలురశాసనములవలన ననంతవర్మనామధారుల కుమారులను పెక్కురు తెలియవచ్చెదరు. గాంగశకము ౫౧ నాఁటి దేవేంద్రవర్మ, గాంగశకము ౨౨౧ నాఁటినందవర్మ, గాంగశకము ౨౫౪ నాఁటి దేవేంద్రవర్మ, గాంగశకము ౩౪౨ నాఁటి రాజేంద్రవర్మ, గాంగశకము ౫౨౦ నాఁటి దేవేంద్రవర్మ, గాంగశకము ౫౨౬ నాఁటి మధుకామార్ణవుఁడు – శాసనములందు వీరందఱు తాము అనంతవర్మ తనయుల మని చెప్పుకొన్నవారే పూర్వగాంగవంశజుల వంశావతారక్రమము కాని, అనుపూర్వ్యకచారిత్రము కాని, గాంగశకారంభవత్సరము కాని ఇంకను అజ్ఞాతవిషయములుగ నున్నందున ఈయనంతవర్మ నామధేయుల పరస్పరసంబంధమును, చరిత్రమును ఇంకను నిగూఢముగనే యున్నవి.

పూర్వగాంగులను విడిచి 'పరగాంగులు' (Later Gangas), అనఁగా మొదటిరాజరాజుతండ్రి యైన వజ్రహస్తదేవునినాఁటినుండి కళింగమును పాలించినవారిశాసనములను బరిశీలించినచో అనంతవర్మ యనునది యారాజుల ద్వితీయనామముగఁ గన్పట్టును రాజరాజుతండ్రి యయిన వజ్రహస్తదేవుఁడు శాసనములయం దనంతవర్మ వజ్రహస్తదేవుఁ డని పేర్కొనఁబడినాఁడు. ఇట్లే ఇతని పౌత్రుఁడును, మొదటి రాజరాజకుమారుఁడునగు చోడగంగదేవునికి అనంతవర్మచోడగంగదేవుఁ డని శాసనప్రసిద్ధి. చోడగంగదేవుని కుమారుఁ డయిన కామార్ణవదేవునిదగ్గఱనుండి మూఁడవ నరసింహదేవునివఱకుఁ గల కళింగ గాంగధరణీధవు లెల్లరును అనంతవర్మనామాంచితులే వీరిలోఁ గొందఱు తమశాసనములందు కేవల మొక్క యనంతవర్మ నామముననే పేర్కొనఁబడిరి

**అనంతవిజయము** — యుధిష్ఠిరునిశంఖము.

**అనంతవ్రతము** — ఒకవ్రతము భాద్రపదశుద్ధ చతుర్దశినాఁడు వచ్చును అనంతపద్మనాభుఁ డనుపేర విష్ణువు ఉపాసింపఁబడును

**అనంతశయనగుడి** — బళ్లారిజిల్లా, హొస్పేటతాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౭౩౭ (౧౯౩౧).

**అనంతశయనము** — ఇది తిరువాన్కూరు సంస్థానమునకు ముఖ్యపట్టణము దీనినే తిరు-అనంతపుర (తిరువనంతపుర) మనియెదరు. ప్రస్తుతవ్యవహారనామము 'త్రివేంద్రము' ఈపట్టణము వైశాల్యము రమారమి ఎనిమిదిచదరపుమైళ్లు

జనసంఖ్య ౯౬,౦౧౬ (౧౯౩౧) వీరిలో పురుషులు ౪౯,౩౯౨, స్త్రీలు ౪౬,౬౨౪ జనసంఖ్యయంతలో చదువనేర్చినవారు ౩౪,౨౯౬ గురు వీరిలో ౨౫,౦౬౭ గురు పురుషులు ; ౧౨,౨౨౨ మంది స్త్రీలు ఇంగ్లీషువచ్చినవారిపురమున ౧౨,౩౬౭ గురు కలరు వీరిలో ౨,౪౬౭ గురు స్త్రీలు, మిగిలినవారు పురుషులు.

ఇచ్చట మహారాజులుంగారును, బ్రిటిషు రెసిడెంటును ఉందురు. పట్టణము సముద్రమునొద్దనుండి రెండుమైళ్లదూరమున నుండును ఇందు భవ్యమైన యొకదుర్గము గలదు. దానిచుట్టు నుండుప్రాకారము వేయి గజముల పొడువును (తూర్పు, పడమరలు), ఎనిమిదివందల గజముల వెడల్పును (ఉత్తర, దక్షిణములు) ఉండును పట్టణము కోటకు లోపల వెలుపల నున్నను కోటలోని భాగమే ముఖ్యమైనది. అందు రాజభవనము, రాణుల మందిరములు, అనంతపద్మనాభునివిఖ్యాత దేవాలయమును గలవు

అనంతపద్మనాభునిదేవాలయమువలననే ఈపట్టణమునకు విశేషఖ్యాతి కలిగినది. హిందువులచే నిది యొకమహోత్తరక్షేత్రముగా పరిగణింపఁబడుచున్నది భరతఖండమునందలి యన్నిదేశములనుండియు యాత్రికు లెల్లపుడును గుంపులుగుంపులుగా వచ్చుచుందురు ఇచ్చట శ్రీమహావిష్ణువు 'అనంతుఁ' డనునాగముపై పవ్వళించియుండును ఈ క్షేత్రము మిక్కిలి పురాతన మని చెప్పెదరు. దీని యుత్పత్తిని గురించి పెక్కుగాథలు కలవు అందు క్రిందిది యొకటి.—

'దివ్యమంగళమ్ స్వామియార్' అను కొకస్వామి మలబారుదేశమందు పెక్కుదేవాలయములను కట్టించెనట. అతఁడు కనులు మూసికొని ధ్యానము చేయునపు డొక చిన్నబాలుఁడు వచ్చి, అతని సాలగ్రామమును తీసివేసి, పూల నెగఁజల్లి ఇతరపూజాద్రవ్యములను చెల్లాచెదరు చేసి, పెక్కువిధముల నతనిని చిక్కుపఱచుచుండెను అతఁడు కనులు తెఱచినతోడనే మాయమగు వచ్చుచుండెను ఒకదినమున స్వామి మిక్కిలి కోపము వచ్చి కన్నులు మూసికొనియుండియే తనచేతితో నాపిల్లవానిని త్రోసివేసెను. అంత వాఁడు మద్భక్తుఁడై 'నీ విట్లని త్రోసితివేని నాకు నీ యిష్టదేవత ఇఁక నీ కగపడను 'అనంతకాడు' అనుస్థలమునందుమాత్రము

సీ. సకలలోకప్రదీపకుఁ డగు పద్మినీ
మిత్రవంశమున జన్మించె ననియుఁ
జూచిన మగలైనఁ జొక్కెడునట్టి సౌం
దర్యసంపద సొంపు దాల్చె ననియు
జనహృదయానంద జనక మై చెలఁగిన
చతురతకల్మి నప్రతిముఁ డనియు
మెఱసి యొండొంటికి మిగులు శౌర్యత్యాగ
విఖ్యాతకీర్తుల విలసె ననియు
గీ. వివిధవిద్యాపరిశ్రమవేది యనియు
సరసబహుమానవిరచనాశాలి యనియు
మత్కృతీశ్వరుఁ డగుచున్న మనుమనృపతి
సుభగుఁ గావించుటకు సముత్సుకుఁడ నైతి

ఈ పైపద్యమును జూచి యీయనంతకవి తాను కావ్యము వ్రాయుటకుఁ గారణములు చెప్పఁదలఁచి యిట్లు వ్రాసెను —

సీ. నూతనం బయ్యుఁ బురాతనకృతులట్ల
సంతతశ్రావ్యమై జరగు ననియు
నాదిరాజులలోనఁ దగు భోజనరపతి
చరిత మీ కవితాప్రసంగ మనియు
నిందుఁ జెప్పెడికథ లన్నియు తొలిఁ బ్ర
శస్తగణ్యోపదేశంబు లనియు
నఖిలజగన్నాథుఁ డగు నహోబిలనాథుఁ
డీప్రబంధకృతికి నధిపుఁ డనియుఁ
గీ. బుధులు నల్లజనులు ప్రియభక్తియుక్తిఁ జా
టింతు రనియు నూఁదిల్లి యేను
బరమసౌఖ్యమైన భవదాభిముఖ్యంబు
గామ్యిఁ బడసి యధికసమతోష [౧ ౬౮]

రసార్ణవ మనునది నాలుగాశ్వాసముల యలంకారగ్రంథము. మొదటియాశ్వాసమునందు నవరసస్థాయిభావములును, రెండవ యాశ్వాసమునందు రతిగుణవిభావానుభావాదులును, మూఁడవ యాశ్వాసమునందు శృంగారరసప్రకరణమును, నాల్గవయాశ్వాసమునందు నాయికానాయక ప్రకరణమును వర్ణింపఁబడినవి మాకు దొరకినప్రతిలో గ్రంథ్యాది పద్యములు లేవు. ఈకృతియు విష్ణుమూర్తి కర్పింపఁబడినది

అనంతుఁడు గొప్పలాక్షణికుఁడు అనంతుని ఛందస్సు తెలుఁగు భాషయందు బహుకాలమునుండియుఁ జేరుగన్న గ్రంథము లక్షణకర్తలందఱును దానిని గౌరవముగఁ జేకొని, యం దుండి యున్నిటీ లక్ష్యములను లక్షణములను ఉదాహరించియున్నారు కాని యిప్పుడీగ్రంథము సంపూర్ణముగ దొరకుట లేదు దీనిని పూర్తిగ సంపాదించి యచ్చొత్తించినవారు లేరు రెండాశ్వాసముల గ్రంథము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దున్నది. రెండవ, మూఁడవ, నాల్గవ ఆశ్వాసముల యసంపూర్ణప్రతి యొక్కటి మ-రా-శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారివలన మాకు దొరకినది

భీమనకృత మనఁబడు కవిజనాశ్రయమును విడిచినయెడల, తెలుఁగున నిదియే మిక్కిలి పురాతనచ్ఛందోగ్రంథ మని చెప్పవలెను

ఇందలి ప్రథమాశ్వాసములో 'గద్యపద్యాదికావ్యలక్షణంబును, గురులఘు నిర్ణయంబును గణనిరూపణంబును, ప్రాసయతివిశేషంబులును, పరిగణసంజ్ఞయును' గలవు రెండవదానిలో 'మత్రియభాషా నిరూపణంబును, గద్యవర్ణనంబులవిధంబును, షడ్వింశతిచ్ఛందోనామంబులును, తదుద్భవంబులగు సమవృత్తంబులును, వృత్తవిక్రమంబులగు నర్ధసమవృత్తంబులును, ఛందఃప్రోక్తంబులగు మాలావృత్తంబులును, పగుద్ధంబులగు దండకంబులును' నిరూపింపఁబడినవి మూఁడవదానిలో 'జాతిలక్షణలక్షితంబులును, చాటుకావ్యపరిమాణంబులును, ఉదాహరణంబులును, షట్ప్రత్యయంబులును, సప్తమప్రత్యయం బైన సమవృత్తంబుల వగల నెఱుఁగు తెఱఁగును' గలవు నాల్గవదానిలో 'వర్ణంబు లగు దశదోషంబుల నేర్పఱుచుటయును, నందు దోషరహితంబులై గణదర్శనీయంబు లగుపట్లఁ జేర్పుటయును, సంధిసమాసంబులును' గలవు ఇట్లీ గ్రంథమునం గొంత వ్యాకరణవిషయముకూడఁ గలదు

ఈ గ్రంథమునకు మేము చూచినప్రతులలో 'ఛందోదర్పణ' మన్న పేరున్నది అది లేఖకప్రమాదమేమో, 'ఛందోఽర్ణవ' మన్నది నిజమైన నామమేమో యని సంశయము గలుగుచున్నది

**అనంతాయి** — గంజాం జిల్లా బరహాంపురం తాలూకా యందలి గ్రామము ఇచటి జనసంఖ్య ౧,౦౬౮ (౧౯౩౧)

**అనంతారం** — తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురం తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨౦ (౧౯౩౧)

**అనంతి** — శతరూపకు నామాంతరము

**అనంతుఁడు** — ౧ కామధేను వను జ్యోతిషగ్రంథముపై టీక వ్రాసినవాఁడు 'జాతక పద్ధతి' యను నొక గ్రంథ మీతనిది గలదు ఇతఁడు గార్గ్యసగోత్రుఁడు గోదావరీతీరమున నున్న ధర్మపురి యితని వాసస్థలము కావున, ఆంధ్రుఁడు. తండ్రి పేరు చింతామణి కుమారులు శ్రీకంఠుఁడు, రాముఁడు. వీరును జ్యోతిషశాస్త్రమునఁ జేరొందినవారు, గ్రంథకర్తలు.

౨ అంతములేనివాఁడు, పరమాత్మ

౩. కశ్యప కద్రూసంతతియైన నాగులలో నొక్కఁడు

౪ శేషునకు ఈపేరు గలదు.

౫ జైనుల ఇరువది నలుగురు తీర్థంకరులలో పదునాల్గవవాఁడు

**అనందపూర్** (ఒరిస్సా) — ఇది ఒరిస్సాదేశమునందలి సంస్థానములలో కొంటిఝరు కియోంఝారులోనున్న యొక గ్రామము వైతరిణీనదియొడ్డునఁ గలదు. జనసంఖ్య ౨,౯౮౫.

**అనందపూర్** (సంస్థానము) — ఇది బొంబాయి రాజధానియందలి రేవాకాంఠపరగణాలలోని యొకచిన్న సంస్థానము.

**అనకర్లపూఁడి** — నెల్లూరుజిల్లా కందుకూరుతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౧,౧౧౭ (౧౯౩౧).

**అనకవోలు** — చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తి తాలూకా యందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౧౯౬ (౧౯౩౧).

**అనకాపల్లి గ్రామము** — ఇది అనకాపల్లి తాలూకా యొక్క ముఖ్యపట్టణము. ఇది విశాఖపట్టణమునకు ౨౦ మైళ్లదూరమున శారదానదిమీఁద నున్నది. ఇచ్చటికి చుట్టుపట్టుపల్లెలనుండి వరి, చెఱకుగడలు మొదలగు వస్తువులు హెచ్చుగా వచ్చుచుండుటచేత మంచి వర్తకస్థానముగా నున్నది. ఇచ్చటినుండి బెల్లము ధాన్యము ఎక్కువగా ఎగుమతి చేయఁబడుచున్నవి. ఈపట్టణము ౧౮౭౮-వ సంవత్సరమున స్థాపింపఁబడిన ఒక మ్యునిసిపలుసంఘముచే పాలింపఁబడుచున్నది. ఈపట్టణముయొక్క ఆదాయమును ఖర్చును రమారమి ౨౫,౦౦౦ రూపాయలు. రాజోద్యోగస్థు లనేకులు ఇచ్చటనే వాసము చేయుచుందురు. తూర్పుతీరపు ఇనుపదారి ఈ పట్టణము మీఁదుగఁ బోవుచున్నది. జనసంఖ్య ౨౩,౩౬౮.

**అనకాపల్లి తాలూకా** — ఈతాలూకా చెన్నపురి రాజధానిలో నున్న విశాఖపట్టణము జిల్లాకు ఆగ్నేయదిక్కున ఉ. ౧౭° ౨౦', ౧౮° ౫౫' కును, తూ. ౮౨° ౫౦, ౮౩° ౧౫' కును మధ్య నున్నది. దీనివిస్తీర్ణము ౪౯౭ చదరపుమైళ్లు. ఇందలి జనసంఖ్య ౨,౮౨,౫౬౮. ఈతాలూకాలో ౧౯౫ గ్రామము లున్నవి. గవర్నమెంటువారికి ఈతాలూకావలననుండి రమారమి ౧,౨౨,౦౦౦ రూపాయలశిస్తు చెల్లుచున్నది. ఈతాలూకాయొక్క ఉత్తరభాగము మంచి నీటివసతి గలదియును, సారవంతమైనదియు నగుటచేత వరి, చెఱకుగడ, మొదలగుపంట లచ్చట పండును. సముద్రతీరమున నున్నభూమి ఇసుకనేలయైనందున మంచిపైరు లచ్చట పండవు. ఇది ఒక జమీందారీ తాలూకా. ఈ జమీందారీ కొన్నిభాగములుగ విభజింపఁబడియున్నది. ఇవి గోడేవారికిని, కాశింకోటవారికిని, విజయనగరము చీపురుపల్లి ఎస్టేటుదార్లకును చెందియున్నవి. పూర్వము కాశింకోట శ్రీకాకుళముసర్కారుయొక్క సేనానివేశము (Military Contonment) అయియుండెను.

**అనకూటాద్రి** — హిందువులపురాణములలో తఱచుగ నుదాహరింపఁబడిన ఒక కొండ. గిరిరాజ మని దీనికి మఱియొకపేరు. ఇది మధురజిల్లాలో (సంయుక్తప్రాంతములలో) మధుర తాలూకాలో నున్నది. నిజముగ నిది యొక గుట్టయే కాని కొండ కాదు. ౧౦౦ అడుగులకన్న నెక్కువ యెత్తుగా లేదు. పొడవుమాత్రము ౫ మైళ్లుండును. దీనిమీఁద చెట్టు చేమ కూడ విశేషముగ లేవు.

**అనక్రియన్** — గ్రీకుకవి. క్రీ.పూ. ౫౬౦ ప్రాంతమున అశియామైనరులో జన్మించెను. విఖ్యాతుఁడగు సైరస్ ౫౪౫లో అసియాలో గ్రీకువారిక్రింద నున్న పట్టణములను ముట్టడించినపుడు, అచ్చటినుండి 'త్రేసు' పట్టణమునకుఁ బాఱిపోయెను. అచ్చటినుండి సామాస్‌నకుఁ బోయి 'పాలిక్రేటిస్' అను రాజుచే గౌరవింపఁబడి యాతని యాస్థానకవిగా నుండెను. ఆరాజు కాలము చేసినతరువాత ఏథెన్సుపట్టణమున నధికారిగా నుండి 'హిప్పార్కస్' అనువాని యాశ్రయమున నుండెను. వాఁడును చనిపోయినతరువాత నీతఁడు తన జన్మభూమియైన టియాసునకు తిరిగివచ్చెను. ఇతఁడు ౮౫ సంవత్సరములు బ్రతికియుండె నని చెప్పెదరు.

ఇతఁడు కొన్ని దేవతాస్తుతులను రచించెను. పచ్చి శృంగారము గల భావగీతములు కొన్ని యాతనిపేరను గలవు. కాని కొందఱు పండితు లవి యాతనివి కా వని తలంచెదరు.

**అనగార్లపల్లి** — చిత్తూరుజిల్లా కుప్పంతాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౯౭ (౧౯౩౧).

**అనఘ** — శాకద్వీపమునం దొకనది.

**అనఘుఁడు** — ౧ ఒక గంధర్వుఁడు.

౨ ఒకరాజర్షి.

**అనచార్సిస్** — సిరియన్ తత్త్వవేత్త. క్రీ.పూ. ౬౦౦ ప్రాంతమున నున్నవాఁడు. గ్రీసు జ్ఞానియైన ఏథెన్సువాఁడగు సోలన్‌వలన గ్రీకుజ్ఞాన మంతయు నేర్చుకొనెను. ఆ దేశమునందు సప్తర్షులుగా నెంచఁబడినవారిలో నొక్కఁడు. తనదేశమునకుఁ దిరిగి వచ్చి తాను నేర్చినవిద్య లన్నియుఁ దన దేశస్థులకు నేర్పెను. ఇతఁడు యజ్ఞము చేయుచుండఁగా నితనితోఁ బుట్టినవాఁడే యితనిని చంపెను.

**అనధ్యాయము** — అధ్యయనము చేయఁదగనికాలము. బడిపిల్లలకు నాటిదినపు పూర్వకాలపు వీథిబడులలోఁ బౌర్ణమాసికిని, అమావాస్యకును సెలవు ఇచ్చుచుండిరి. అట్టిదినములనే స్మృతికారులు అనధ్యాయము లనిరి. ఎప్పుడెప్పుడు పాఠశాలలకు సెలవు లీయవలసిన దన్న విషయమున స్మృతికారులు మిక్కిలి సూక్ష్మములయిన నియమములను జేసిరి. అధ్యయన మనఁగా మొదట వేదాధ్యయన మనియే యర్థము. వేదము నెప్పుడు పఠింపవలయును, ఎప్పుడు పఠింపఁగూడదు అన్న చర్చలో నీ నియమము లన్నియుఁ బుట్టినవి. అవియే యితరవిద్యలను బోధించుపాఠశాలలకుఁ గూడ నుపయోగించినవి.

అనపోతారెడ్డికి దొడ్డాంబిక యను తోఁబుట్టువుండెను ఆమెను కాటయరెడ్డి కిచ్చిరి వారికి పుట్టినవాఁడు కాటయ వేముఁడు ఇతనికి అనపోతారెడ్డి తనమేనకోడలైన మల్లాంబిక నిచ్చెను[1] ఇతనికి కుమారగిరిరెడ్డి యను కుమారుఁ డుండెను

'అనపోతానాయని తమ్ముఁడైన మాదానాయఁడు దక్షిణ కోటయొద్ద నవవేమ రెడ్డి బంధువైన యనపోతారెడ్డితో యుద్ధము చేసి యతనిఁ దఱిమి జయమును బొందెను' అని వెలుగోటివారిచరిత్రలో నున్నది కాని దీనికి నెచ్చట నేమియు నాధారము కనఁబడలేదు

సంస్కృతశాసనములందును, తెలుఁగుశాసనములందును ఇతని పేరు అనవోత, అన్నవోత, అంనవోత అని వచ్చునే కాని 'అనపోత' అని యుండదు

(కో వేం ల)

**అనబాప్టిస్టులు** — క్రైస్తవులలోఁగలలో అనబాప్టిస్టు లనఁగా రొకరు చిన్నతనమునసే పరిశుద్ధస్నానము (Baptism) నిచ్చుపద్ధతిని వీ రొప్పుకొనరు అందుచేత తమ సిద్ధాంతముల నంగీకరించి తమలోఁ జేరఁదలఁచువారికి చిన్నతనమున పరిశుద్ధస్నానము నొందిన క్రైస్తవులైనను సరే, మరల సంస్కారము గావించుచుండిరి ఈసిద్ధాంతమును మొదట ప్రచారములోనికిఁ దెచ్చినవాఁడు నికొలస్ స్టార్చ్ అనునతఁడు తరువాత క్రైస్తవులకును, వీరికిని ఎన్నియో వాదోపవాదములు, పోరాటములు జరిగినవి నేఁడు అనబాప్టిస్టులను పేర యెచటను వినరాదు బాప్టిస్టు లనఁబడువా రిప్పటికిని కలరు కాని వీరికి అనబాప్టిస్టులతో సంబంధము లేదు రెండవసారి సంస్కారము చేయుపద్ధతిని వీ రొప్పుకొనరు

**అనమనపూఁడి** — కృష్ణా జిల్లా గుడివాడ తాలూకా యందలి గ్రామము జనసంఖ్య ౬౭౧ (౧౯౩౧)

**అనమనమూరు** — గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకా యందలి ఈనాం గ్రామము జనసంఖ్య ౧,౦౭౯ (౧౯౩౧)

**అనమసముద్రము** — నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకా యందలి గ్రామము జనసంఖ్య ౧,౩౯౯ (౧౯౩౧)

**అనమసముద్రముపేఁట** — నెల్లూరుజిల్లా ఆత్మకూరుతాలూకాలోని యొకపల్లె జనసంఖ్య ౧,౦౧౦ (౧౯౩౧) ఇచ్చట ఖాజా రహీముతుల్లా సాహెబ్ అనువానిచే ౧౬౦ సంవత్సరములకు మున్ను కట్టింపఁబడిన సుప్రసిద్ధమగు మసీదు కలదు ఈమసీదునకు ౭ గ్రామముల ఈనాము కలదు ఇచ్చట జమాదిలాకరుమాసమున పెద్ద ఉరుసు (ఉత్సవము) జరుగును

**అనమిత్రుఁడు** — ౧ (సూ వం) నిఘ్నునిపుత్రుఁడు

౨ (చం వం) యదుకులోత్పన్నుఁడైన వృష్ణియొక్క యిద్దఱుపుత్రులలో రెండవవాఁడు నిమ్న, శిని, వృష్ణి యనువా రతనిపుత్రులు

**అనరణ్యుఁడు** — ౧ (సూ వం) ఇక్ష్వాకువంశజుఁడగు పురుకుత్సునిమనుమఁడు త్రసదస్యుని రెండవకుమారుఁడు ఇతనికి హర్యశ్వుఁడు, బృహదశ్వుఁడు అను ఇద్దఱు పుత్రులు కలరు ఇతఁడు అయోధ్యలో రాజ్యము చేయుచుండఁగా లంకాధిపతియైన రావణుఁడు దిగ్విజయార్థమై వచ్చి యీతనిని ఓడించెను యుద్ధమునందుఁ గూలి యీతఁడు ప్రాణములు విడుచుచు 'నావంశమునందు జన్మించినవాని చేతనే నీవును, నీవంశమును నాశముఁ జెందుదురుగాక' యని శాప మొసఁగెను (వా రా, ఉత్తర, స ౧౯)

౨ (సూ వం) ఇక్ష్వాకుకులోత్పన్నుఁడైన ఋతుపర్ణమహారాజునకు సర్వకాముని (సర్వకర్మని) యిద్దఱుపుత్రులలోఁ బెద్దవాఁడు ఇతని కొడుకు నిఘ్నుఁడు

**అనర్కచతుర్దశి** — కార్తికశుద్ధచతుర్దశి అనర్కచతుర్దశి యనఁబడును ఈనాఁడు హనుమంతుని జన్మదినము రామభక్తులెందఱో యీనాఁడు మహోత్సవము లొనర్తురు

## అనర్ఘరాఘవము

— మురారి యను కవిచే రచింపఁబడిన సంస్కృతనాటకము సంస్కృతవాఙ్మయమునందు కాళిదాస, భవభూతులకుఁ గల గౌరవము ఈతనికి లేకపోయినను, ఈతఁడు రెండవతరగతికవులలో నొకఁడుగఁ బరిగణింపఁబడు నని చెప్పవచ్చును ఇతనిది మౌద్గల్యగోత్రము భట్టశ్రీవర్ధమానుఁ డనువాఁడు కవి యీతనితండ్రి, తంతుమతి యనునది తల్లి ఈసంగతు లీతని నాటకమునందలి ప్రస్తావనలోఁ జెప్పఁబడియున్నవి[2] ఈతనిది ఏదేశమో తెలియదు కాని కావ్యమాలలో నీ నాటకమును అచ్చువేసినవారు 'దీనికి శాస్త్రమునందు నెక్కుడు ప్రచారము కల' దని వ్రాసినారు అందుచే నీకవి యాదేశమువాఁ డేమో యని కొంద అనుకొనిరి కాని నాకుఁ జూడ నీకవి యాంధ్రదేశమువాఁ డేమో యని సంశయము తోఁచుచున్నది ఎంగు కవఁగా, ఈనాటకమునంగు ఏడవయంకములో, శ్రీరాములు రావణసంహారానంతరము పుష్పకవిమాన మెక్కి అయోధ్యకు వెళ్లుచుండఁగాఁ గ్రిందఁ గానవచ్చిన కొన్ని దేశములను, పట్టణములను, క్షేత్రములను వర్ణించు నట్టిసందర్భమునఁ గవి ఆంధ్రదేశమందలి భీమేశ్వరుని నిట్లు వర్ణించియున్నాఁడు —

---

1 Epigraphia Indica, Vol IV, p 328

2 'అస్తి మౌద్గల్యగోత్రసంభవస్య మహాకవే ర్భట్ట శ్రీ వర్ధమానతనూజన్మన స్తంతుమతీనన్దనస్య మురారేః కృతి రభినవ మనర్ఘరాఘవం నామ నాటకమ్.'

విభీషణ — (దక్షిణతో దర్శయన్) దేవ, ప్రణమ్యతా మయ మన్ధ్ర విషయలక్ష్మ్యాః సప్తగోదావరీహారకలా శైవాలనాయకో భగవాన్ భీమేశ్వరః

[అర్థము విభీషణుఁడు — (దక్షిణమువైపు చూపి) దేవా! ఆంధ్రదేశలక్ష్మికిఁ గల యేడుగోదావరుల హారసమూహములకు నొక్క నాయకమణి యగు భగవంతుండైన భీమేశ్వరునకుఁ బ్రణామము చేయుఁడి ]

దీనితరువాత, నీవిభీషణునినోట నొకపద్యమును, శ్రీరాముని నోట రెండుపద్యములును భీమేశ్వరునిస్తుతిపరములు కలవు. వానితో మనకుఁ బనిలేదు. కాని పైని ఈయఁబడిన 'అన్ధ్రవిషయము', 'సప్తగోదావరి', 'భీమేశ్వరుఁడు' అనుపదములును, హిందూదేశము నందు విశేషఖ్యాతిలేని భీమేశ్వరక్షేత్రమును (దాక్షారామము) వర్ణించుటయుఁ జూడ నీకవి యాంధ్రుఁ డనియు, ఆదేశమందలి యభిమానముచేత బుద్ధిపూర్వకముగా భీమేశ్వరునకు శ్రీరామునిచే దండము పెట్టించె ననియు నూహింపవలసియున్నది

కాని కవి ఈప్రకరణమునందే భీమేశ్వరునకుఁ బూర్వము మహారాష్ట్రాంతర్గతమైన విదర్భలోనియుండినపురమును, తరువాత ద్రవిడదేశమందలి కాంచీనగరమును వర్ణించియున్నాఁడు. కావున 'ఈకవి ఆయాదేశములవాఁ డనియూఁ జెప్పవలసియుండును' అని కొంద రాక్షేపింపవచ్చును కాని అట్లనుట సరికాదు కుండిన పురము, కాంచీనగరము భరతఖండఖ్యాతిగల పట్టణములు కవి యెచ్చటివాఁడైనను ఆపట్టణనామములను ఎఱిఁగియుండును దాక్షారామము అట్టి భరతఖండఖ్యాతిగల క్షేత్రము కాదు దానికి తెలుఁగు దేశమందుమాత్రము ఖ్యాతి గలదు ఆఖ్యాతికిని రెండుమూఁడు జిల్లాలకంటె నెక్కుడు వ్యాప్తి లేదు. తెలుఁగువాఁ డైనఁ గాని సాధారణముగ నీక్షేత్రమును ఎఱిఁగియుండఁడు. ఒకవేళ నెవరి వలననైన విన్నను, కాంచీపట్టణమందలి వినాయకేశ్వరునితో సమానముగ నీభీమేశ్వరుని నాటకమునందుఁ బేర్కొనవలయు నని యాతని కేల బుద్ధి పుట్టును?

ఈ కవికాలము నిశ్చయముగఁ దెలియదు కొంద ఱితఁడు తొమ్మిదవశతాబ్దికిఁ బూర్వుఁ డనిరి[1] కొంద ఱితఁడు అర్వాచీనుఁ డని తలంచుచున్నారు

'అనర్ఘరాఘవ' మనునాటకమునందు రామాయణీయకథ సంక్షేపముగఁ గలదు అనర్ఘ మనఁగా అమూల్యము, పూజ్యము, దుర్లభము పూజ్యుఁడైన రాఘవునికథ కలది గనుక అనర్ఘరాఘవ మయ్యె విశ్వామిత్రుఁడు వచ్చి రామునిఁ దీసికొనిపోవు కథాప్రసంగము మొదలు శ్రీరామునిపట్టాభిషేకమువఱకుఁ గల శ్రీరామకథ యే డంకములలో ఈనాటకమునందు వర్ణింపఁబడినది. కథ పెద్దదియు, నాటకము చిన్నదియు నగుటచే, పెక్కుకథాంశములు రంగము మీఁదఁ జూపుటకు వీలులేక, విష్కంభకాదులలోఁ బాత్రలచేఁ జెప్పింపఁబడినవి. ప్రథమాంకమునందు విశ్వామిత్రుఁడు దశరథుని యొద్దకు వచ్చుట, రామలక్ష్మణులను గొనిపోవుట, ద్వితీయాంకమునందు రామలక్ష్మణులు విశ్వామిత్రయజ్ఞమును రక్షించి రాక్షసులను శిక్షించుట, తృతీయాంకమునందు రాముఁడు శివధనుస్సును ద్రుంచుట, చతుర్థాంకమునందు పరశురామునిసత్త్వము హరించుట, పంచమాంకమునందు వాలివధ, సుగ్రీవాభిషేకము, షష్ఠాంకమునందు రావణుని వధ, సప్తమాంకమునందు శ్రీరామాదులు పుష్పకవిమానము నెక్కి అయోధ్యకు వెళ్లుచు క్రిందఁ గానవచ్చు పట్టణముల వర్ణించుట, పట్టాభిషేకమును వర్ణింపఁబడినవి ఇందు రామువనవాసాదులు, సీతాహరణము మొదలయిన రామాయణీయముఖ్యప్రసంగములసంవిధానకము ఈప్రకారము మార్పఁబడినది —

సీరధ్వజజనకునియింటఁ బెరుఁగుచున్న అయోనిజయగు సీతను తన కిమ్మని యడుగుటకు రావణుఁడు తనపురోహితుఁడైన శౌష్కలుని జనకునియొద్దకుఁ బంపును ఆతఁడు విఫలమనోరథుఁ డగును అంత సీతను హరించుట యెట్లన్న యాలోచన రావణునిమాతామహుఁడును, మంత్రియు నగు మాల్యవంతునకుఁ గలిగె, రాముని మిథిలలోఁ గాని, అయోధ్యలోఁ గాని ఓడించి సీతను దెచ్చుట యసంభవము గాన సీతారాము లరణ్యమునకు వచ్చినప్పుడు అచ్చట రాముని మోసపుచ్చి సీతను అపహరింపవచ్చు నని యతఁడు నిశ్చయించెను

ఇంతకుఁ బూర్వమే సుగ్రీవునిసాహాయ్యార్థము శ్రీరాముని నరణ్యమునకు రప్పించుటకుఁ గాను సంపాతి శబరిని పంపె నని యాతఁడు వినియుండెను శబరి వెళ్లి కైకదాసి యగు మంథరశరీరమునఁ బ్రవేశించి దానిచే కైకేయికి దుష్ప్రేరణ చేయించెను అందు మీఁద రాము నరణ్యమున కంపుఁ డనియు, భరతునికి రాజ్యము గట్టుఁ డనియు కైక దశరథుని వరము లడిగెను ఇట్లు సీతారామలక్ష్మణు లరణ్యమునకు వెళ్లుట సంభవించినది.

ఈనాటకమున ప్రథమాంకమందలి దశరథవిశ్వామిత్రసంభాషణంబును, చతుర్థాంకమందలి శ్రీరామ, పరశురామ సంవాదంబును, సప్తమాంకమందలి నానాదేశాదివర్ణనలును రమ్యములుగ నున్నవి. ఈ నాటకమును కీర్తిశేషులయిన ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగా రాంధ్రీకరించియున్నారు

**అనర్వ్యుఁడు** — వృత్రాసురునిసేవకులలో నొక్కఁడు.

**అనల** — ౧. రోహిణియొక్క యాఱ్వురు కన్యలలో పెద్దది. ఈమెకు శుకి యను కన్య కలదు

౨. మాల్యవంతుఁడను రాక్షసునకు సుందరియను భార్యయందుఁ బుట్టిన కన్యయ. విశ్వావసురాక్షసునిభార్య యగుటచే కుంభీనసి (వా. రా., ఉత్తర, స. ౫౧).

1 కావ్యమాల, అనర్ఘరాఘవమ్, ౧-వ పుటక్రింది టిప్పణి చూడుఁడు.

సరస్వతి — ఈతఁడు తూర్పుసముద్రమున కంతకును ప్రభు వైనట్టు కూడ నిందు వ్రాయఁబడినది. ఇందువలన నితనికాలమందు సముద్రవర్తకము మెండుగ నుండె నని మన మూహింపవచ్చును. ఈతని శాసనములలో 'వసంతరాయ', 'తురిశాసహాయ', 'జగదొబ్బగండ' మొదలయిన బిరుదులు ఈతని కున్నట్లు వ్రాయఁబడినది

ఏ శాసనములవలనఁ గాని, ఏ గ్రంథములవలనఁ గాని యీతనికిఁ బుత్రుఁ డున్నట్టు కానరాదు కాని శ్రీనాథుఁ డీతనికి నొకపౌత్రి (పుత్రునికూఁతురు) ఉన్నట్టును, ఆమెను అల్లాడరెడ్డి (కాశీఖండమును కృతి నొందిన వీరభద్రారెడ్డియొక్క తండ్రి) పెండ్లాడినట్టును కాశీఖండమందలి యీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు

మ. అనవేమక్షితిపాలపౌత్రి యగు వేమాంబామహాదేవికిన్
ఘనుఁ డయ్యల్లడభూమిపాలునకు సంగ్రామస్థలీగాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు నై దొడ్డప్రభుం
డును నన్నయ్యయు బాహువిక్రమకళాటోపప్రతాపోద్ధురుల్

దీనినిబట్టి చూడ అనవేమారెడ్డికి నొకకుమారుఁ డుండె ననియు, ఆ కుమారున కొకబిడ్డ యుండె ననియు మన మూహింపవలెను కాని యీపద్యమునందలి 'పౌత్రి' పదము 'పొరపాటు, దౌహిత్రి యని కవితాత్పర్యము' అని చెప్పుదు రందులకు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రిట్లు వ్రాసియున్నారు 'ఈ పై పద్యమునందలి పౌత్రి యనుశబ్దమునకు దౌహిత్రి (పుత్ర్యాః పుత్రి) యని యర్థము గ్రహింపవలయును. అల్లాడ దొడ్డభూపాలున కంకితము గావింపఁబడిన శివలీలావిలాసమునఁ గొమ్మనామాత్యకవి యల్లాడరెడ్డి నిట్లు వర్ణించెను

మ. ధరితశ్రీనిధి యమ్మహీరమణుఁ డొప్పన్ శౌర్యభక్తిక్షితీ
శ్వరగమానం డల భీమలింగమవనీశశ్రేష్ఠసత్పుత్రి భా
స్వరకారుణ్యాదికాజనావనవిధాసంధాత్రి వేమాంబికన్
వరియించెం బరితత్కీర్తి గౌరవదృఢవ్యాపారనిత్యాంబికన్

'మఱియుం గోరుమిల్లి శాసనమున (౧౪౩౪)
శచీవ శక్రస్య శివేవ శంభోః
పద్మేవ సా పద్మవిలోచనస్య
వేమాంబికా చోళకులేందుభీమ
భూపాత్మజా సూనుమహీశ్వరస్య జాయా ।[1]

'అని భక్తీశ్వరచోళనృపాలపుత్త్రుండు భీమపాలునిపుత్త్రి యగు వేమాంబికను వివాహముఁ జేసికొనిరని చెప్పఁబడియుండుట చేత భీమరాజు అనవేమక్షితినాథునియల్లుఁ డని యర్థము చేసికొనక తప్పదు'[2]

అనవేమారెడ్డికాలములో శ్రీనాథుఁ డున్నట్లును, ఒకసారి యాతనిసభకుఁ బోయి యీ క్రిందిపద్యముతో నాతనిఁ బొగడినట్లును పరంపరాగత మైనవదంతి కలదు

అనవేమమహీపాల! స్వస్త్యస్తు తవ బాహవే
ఆహవే రిపుదోర్దండచంద్రమండలరాహవే

[అర్థము — ఓ అనవేమభూపా! యుద్ధమునందు శత్రువుల దోర్దండములనెడు చంద్రమండలములకు రాహు వైనట్టి నీబాహువునకు శుభమగుఁగాక]

శ్రీనాథుఁడు కుమారగిరికాలమునందు నున్నట్టు హరవిలాసము వలన స్పష్టము అనవేమారెడ్డితరువాతనే కుమారగిరి రాజ్యమునకు వచ్చినందున శ్రీనాథుఁడు అనవేముని కాలమునందు నుండినను నుండ వచ్చును కాని యున్నట్టు నిదర్శనము లేవియు లేవు[3] ఎఱ్ఱాప్రెగ్గడ యీతనితండ్రికాలమందు నున్నవాఁడు, శ్రీనాథుఁ డీతని కుమారుని (అన్నకుమారుని) కాలమువాఁడు కావున ఈకవివరుల నిద్దఱిని ఈతఁడు చూచి గౌరవించిన గౌరవించియుండవచ్చును అయినను హరివంశము వ్రాయుకాలమునకు నితఁడు పుట్టనేలేదు గనుక నాతని ప్రభుత్వకాలమునకు ఎఱ్ఱన బ్రతికి యుండకపోవచ్చును, శ్రీనాథుఁడు చిన్నవాఁడుగ నుండవచ్చును కావున నెఱ్ఱన శ్రీనాథుఁడు పుట్టిన గిట్టిన సంవత్సరములు స్పష్టముగఁ దెలియునంతవఱకు నిదమిత్థ మని చెప్పలేము

ఈతనితరువాత నెంతయో కాలమునకుఁ బుట్టిన వెన్నెలకంటి సూరనకవి విష్ణుపురాణమున నీతనినిగుఱించి యీ క్రిందిపద్యము వ్రాయుట చూడఁ దెనుఁగుదేశమందు నితనిఖ్యాతి కొన్ని వందలయేండ్ల వఱకు పెక్కుడుగా నున్నట్లు మన మూహింపవలసియున్నది

---

1 పై శ్లోకము అల్లాడ దొడ్డారెడ్డి శాసనమునందుఁగూడ నున్నది (Epigraphia Indica, Vol V, p 68).

2 ఆంధ్రులచరిత్రము, 3-వ భాగము, ౨౬3-వ పుట శివలీలావిలాస మింకను అచ్చుపడలేదు దాని శీర్ణమైనప్రతి యొకటి శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారియొద్ద వీరభద్రరావుగారు చూచినారఁట. కోరుమిల్లి శాసన మెచ్చటను ప్రకటింపఁబడలేదు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు ౧౫-౬-౨౬ గుర్తుగల సంపుటమునందు 3౧౫-వ పుటలో నున్నది. దీనికే 'Elliot's collection' అని అందురు దీనికే దొరకనమువారిశాసనార్థములు వేమవరముశాసనము (Vemavaram Plates) అని వ్రాసియున్నారు—Epigraphical Reports, 1900 paras 68 & 64

3. ఆంధ్ర నైషధము సంకితమందిన మామిడి సింగన్న అనవేమారెడ్డిమంత్రి యని శ్రీయుత జయంతి రామయ్యగారు వ్రాసియున్నారు. (Epi Indica, Vol XI, p 315, foot-note) కాని యది పొరపాటు. నైషధము చివరనున్న వచనమునుబట్టి మామిడిసింగన్న పెదకోమటివేమునియొక్క మంత్రి యనుట స్పష్టము

మునఁ జెప్పఁజాలము గాని, యిప్పు డీభూమిమీఁద నింకను అనాగరకు లుగా నున్న ఆరణ్యకజాతులయొక్క యాచారవ్యవహారములను బట్టి కొంత వఱకు మనము నాగరకజనుల పూర్వవృత్తాంతమును ఊహింపవచ్చును.

అనాగరకజాతు లిప్పుడు ప్రపంచమునందు పెక్కులు కలవు వారిలోఁ గొందఱు ఇచ్చటఁ బేర్కొనఁబడుచున్నారు — మనయాంధ్ర దేశమందు కోయలు, చెంచులు, ఎఱుకలవాండ్రు, దాసరులు, లంబాడీలు, హిందూదేశమందలి యుత్తరప్రాంతములలోని యరణ్యము లంగును పర్వతములంగును సంచరించు గోండులు, ఖోండులు (కోదు), సవర, జాంగు, నాగ మొదలైనవారు, అండమానులందలి యాదిమనివాసులు, సింహళమందలి వెడ్డలు, ఆఫ్రికాఖండమందలి సుహనివాసులు, ఆక్కా లనఁబడువారు, ఉత్తర-అమెరికాయందలి కొలారెడోలు, దక్షిణ-అమెరికాలోని బ్రెజిల్ వాసులు, గ్రీన్‌లాండులోని ఎస్కిమోలు అనువారు, బోర్నియోలోని డైకులు, ఆస్ట్రేలియాఖండమందలి యాదిమనివాసులు వీరు గాక యచ్చటచ్చట విడిద్వీపములలోను, ఖండాంతరమునందలి యరణ్యాదికములలోను పెక్కుమంది అనాగరకజనులు గలరు వీరందఱును ఒక్కతరగతి వారు కారు ఒకరు కోళ్లకట్టుకొనువారుగ నున్న మఱియొక రాకులు కట్టుకొనువారుగను, మఱొకవారు బట్ట విడిచి తిరుగువారుగను ఉందురు. ఒక్కొకరియందు నాగరకతాభావ మొక్కొకవిధముగఁ గానవచ్చుచుండును. నాగరకతగల సంఘమువారికిని, అనాగరకజనుల సంఘములకును గల ముఖ్యభేదము లెవ్వియో వానిలోఁ గొన్నింటి నిచ్చట సంగ్రహముగ వ్రాయుదుము

ఆహారము. — మానవునకు దినమును తప్పక కావలయునది యాహారము ఇందునుగూర్చి యొకానొకసంఘముయొక్క యాహార మును మన మెఱింగితిమేని యా సంఘ మెంత నాగరకస్థితిలో నున్నది మనము చెప్పఁగలము మొట్టమొదట మానవుఁడు పశువులవలెనే, అరణ్యమందుఁ దనంతటఁ బుట్టుకాకాదులను భక్షించియుండవలెను గడ్డి మొదలైనవానికంటె పండ్లు, కందమూలములు మానవశరీరము నకు నెక్కువ పోషకములు గనుక వానిని చెట్లమీఁదినుండి కోసి కొనియు, భూమిలోనుండి త్రవ్వియుఁ దీసికొనియుండును దీనికి 'ఫలదశ' యని పేరు పెట్టవచ్చును ఈదశలోనే యదృచ్ఛగా దొరకిన పశువులమాంసమును తినుచుండవచ్చును మిక్కిలి నికృష్టమైన యీదశకంటెఁ గొంచెము పైకి వచ్చినవారు వేటాడి మృగములఁ జంపి భక్షింతురు. దీనిని మనము 'మృగయాదశ' యందము పూర్వపుదశ కంటె నిందుఁ గొంచెము నాగరకత కావలయును వేటాడుటకు విల్లు, అంబు మొదలైన సాధనము లుండవలయును ఈ సాధనములఁ జేయుట నేర్చుకొనినపిదపఁ గాని మానవునకు 'మృగయాదశ' రాలేదు. కందమూలాదు లేమి, మాంస మేమి మొదట పచ్చిగనే భక్షింపఁ బడును ఎందు కనఁగా మానవజాతికి నిప్పు శైశవావస్థయందు లభించి నదికాదు. కొంచెము నాగరకత హెచ్చినతరువాతఁగాని నిప్పును బుట్టించుయుపాయములు వారు కనుఁగొనలేకపోయిరి. నిప్పు వశమైన తరువాతఁగూడ భక్ష్యపదార్థములను అందుఁ గాల్చి తినుచువచ్చిరి వంటకములఁ జేయుపద్ధతి కొంచెము హెచ్చుతగ్గుగ అనాగరకస్థితి వదలినతరువాతనే మానవునకుఁ దెలిసిన దని చెప్పవచ్చును కంద మూలముల నేమి, మాంసము నేమి కొంచెము హెచ్చుతగ్గుగ నవాగ రకు లందఱును పచ్చిగనో, కొంచెము కాల్చియో భక్షింతురు వర్ణ్యము జేయువిద్య వా రంతగ నెఱుంగ రని చెప్పఁ జెప్పవచ్చును ఈ 'దశ' తరువాతఁ గొంతకాలమునకు 'గోపాలదశ' మానవజాతికిఁ బ్రాప్తించును కందమూలఫలములు గాని, వేటవలన వచ్చెడి మాంసము గాని తమకు వలయునంతయు వలసినప్పుడు దొరకకపో వచ్చును వానిని ఎక్కువగ సంగ్రహముచేసి యుంచుటకు వీలులేదు కావున మానవుఁ డరణ్యమందలి కొన్ని పశువులను, అనఁగా మేఁకలు, ఆవులు, గొఱెలు మొదలైనవానిని వశపఱుచుకొని పెంపఁ బ్రారంభించెను ఇందువలన వానికిఁ గావలయునప్పుడు గావలసినంత మాంసాహారము దొరకుటయే గాక, వానిపాలు పెరుఁగు మొదలైన రుచికర పదార్థములుఁగూడ తినుటకు దొరకును ఇట్లు గోపాలదశకు వచ్చిన వారు కొంత నాగరకు లని చెప్పవలెను ఇట్టిస్థితి రానిజాతు లిప్పటి కిని ఈభూమిమీఁదఁ బెక్కులు కలవు మనదేశమందలి కోయ, చెంచు జాతులవా రింకను గోపాలకదశను వహింపలే దనియే చెప్పవలెను అస్సాముదేశమునకుఁ దూర్పున పర్వతప్రాంతమందు మిష్మిజాతివారు కలరు వారు ఆవులు, ఎద్దు మొదలైనవాని నెక్కువగాఁ బెంచెదరు అవి అరణ్యములో స్వేచ్ఛగాఁ దిరుగుచుండును. వీరు వీనితో వ్యవ సాయము చేయరు పండుగదినముల నొకదానిఁ జంపి తిందురు భార్యలను కొనుటకై వీనిని ధనముగ నుపయోగించెదరు. గోపాలక దశను పొంది దానివలన మిక్కిలి లాభము సంపాదించినవారు లంబా డీలు వీరు ఎద్దు మొదలైనపశువులను విశేషముగఁ బెంచి వాహనము లుగ నుపయోగింతురు, భక్ష్యమునకు నుపయోగింపరు గోపాలదశకుఁ దరువాతిది 'కృషకదశ', అనఁగా వ్యవసాయము చేసి ధాన్యము పండించునట్టిస్థితి భూమిలో కొన్ని విత్తు వేసి నూఱువిత్తులు పుట్టించు నట్టివిద్య మానవుఁడు సాధించినవిద్యలలో గొప్పది. ఆదిమదశలో మానవుఁడు తాను తిరుగుచుండుస్థలములలో స్వాభావికముగఁ బెరుఁగు గడ్డిధాన్యముల కోసికొని తినుచుండవలెను తరువాతఁ గొన్నివిత్తులు నేలమీఁదఁ బడి వర్షాకాలమున చెట్లయి ఫలించుటఁ జూచి, మాన వుఁడు మొదట భూమిమీఁద విత్తులు చల్లి వచ్చినపంటను అనుభ వించుచుండెను. భూమి దున్నుట గాని, పాటు చేయుట గాని యెఱుఁ గఁడు కోయలు మొదలైనయరణ్యజాతులవారు భూమిని ఎక్కువగా దున్నకయే విత్తనములు చల్లి వచ్చినపంటను అనుభవింతురు. క్రమ ముగఁ బశువులచే దున్నించుట మొదలైన వ్యవసాయపద్ధతులను నేర్చి నాగరకతాభివృద్ధిఁ జేసికొనిరి

నరమాంసభక్షణము.— కొంద ఱనాగరకజాతులవారు నరమాం సమును తినెదరు. ఇట్లు మనుష్యమాంసమును తినువాడుక మిక్కిలి తక్కువదైనను పూర్వ మంతటను, ఇప్పుడును ఉన్నది.

నరమాంసాశకులైన రాక్షసులు మనపురాణాదికములలో వర్ణింపఁబడి యున్నారు. ఆ ప్రాంత యిట్టియాచారముగల అనాగరకజనులనుగూర్చి చిరకాలము వ్రాయఁబడియుండును. అట్టివారు లిప్పుడు నశించియుండును. మిక్కిలి పురాతనకాలమందు ఫ్రాన్సుదేశమందును నిట్టివా రుండి రనుటకు నిదర్శనము లున్నవి. కాస్పియనుసముద్రమునకు నీశాన్య మున దీవులలోఁ దిరుగుచున్న సిథియన్సు, మాసగేటియను జను లిట్టివా రని హిరొడొటస్ మొదలయిన పురాతనలేఖకులు వ్రాసియుండుటవలనఁ దెలియుచున్నది. ప్రస్తుతకాలమందును ఆఫ్రికాఖండముయొక్క పశ్చిమ, మధ్యమభాగములందును, న్యూగినీ, ఫిజీ, ఆస్ట్రేలియా, న్యూజీలండు, పాలినీషియను దీవులు, సుమత్రా, దక్షిణ-అమెరికా మొద లయిన దేశములందును మాంసభక్షకజాతులు చాలఁ గలవు. వీరిలోఁ గొందఱు క్రమక్రమముగ నీ రాక్షసాచారమును విడుచుచున్నారు. కాని సుమత్రాలోని బట్టా లనువారును, ఈస్టుఇండియనుదీవులలోని వారును, దక్షిణ-అమెరికాలోని పూర్వనివాసులును ఈ పురాత నాచారమును విడువలేదు. ఈ మాంసభక్షకులు సాధారణముగ శత్రు వులను జంపి భక్షింతురు, తమసంఘమువారిని తినరు. హిందూదేశ మందు మనుష్యభక్షకులైన యనాగరకు లున్నట్లు కానరారు. అఘోర పంథమువారు పీనుఁగులను భక్షించుచుండెరి. కాని యది మత సిద్ధాంతమునుబట్టి వచ్చినభక్షణ గాని యనాగరకతవలన వచ్చినది కాదు.

దుస్తులు — సిగ్గువలనఁ గాపాడుకొనుటకు శరీరమునకు దుస్తులు కావలెను. కాని 'సిగ్గు' అను మనోవికారము మానవజాతికిఁ గొంత నాగరకత వచ్చినతరువాత నుద్భవించినది. మొదట శరీరమును చలి వలనఁ గాపాడుకొనుటకు దానిని దేనితోనైనఁ గప్పవలసివచ్చెను. అందుచే నెండ అధికముగ నుండుచోట నారణ్యకజనులు నగ్నులుగ నుండుటయు, చలి యెక్కువగ నున్నచోట వారు గుడ్డలను ధరించు టయు తటస్థించెను. కేవలము నగ్నావస్థయం దుండుజాతులుకూడఁ గలవా యని యూరోపియనులు విచారించినదుస్తుల ధరించుచున్న మన కొనవచ్చును. కాని వస్త్రవిహీనులుగ నుండు అనాగరకులు భూమి మీఁద నిప్పుడును పెక్కురు గలరు. అరణ్యమధ్యమున నుండు కోయ వాండ్రు నగ్నులుగ నుండుదురు. ఎవరికైనఁ జూడవచ్చినప్పుడు ఆకులు చుట్టుకొని వత్తురు. ఫ్యూజీదేశజులు, ఆస్ట్రేలియాదేశజులు సాధారణముగ నేమియుఁ గట్టుకొనకయే తిరుగుచుందురు. చలిపుట్టి నప్పుడుమాత్ర మేమైనను చుట్టుకొందురు. ఇప్పుడు నాగరకజనుల సంపర్కమువలనఁ గొన్నిజాతులవారు వస్త్రధారణము నేర్చినను బట్ట విడిచి తిరుగునాచారము వారిలోఁ బూర్తిగఁ బోలేదు. ఆఫ్రికాఖండ ములో భూమధ్యరేఖాప్రాంతమునం(Equatorial Africa) దున్న అషీరు(Ashiras) అను జనులలోను, అమెరికాయొక్క మధ్య భాగమునందున్న చయ్మసులు (Chaymas) అనువారిలోను వివాహి తైనస్త్రీలు వస్త్రధారణము చేసినను, అవివాహితలగు కన్యలు చీర కట్టుకొనక నగ్నముగనే యుందురు! చలి యెక్కువగ నుండి దుస్తులు ధరించువారు పశువులచర్మములను వస్త్రములుగ ధరించెదరు. ఇంగ్లండుదేశమునం దుండినయాదిమవాసులు మృగములతోళ్లు కట్టుకొను చుండిరి. మనపూర్వపురుషులుకూడ (అనాగరకులు గాకపోయినను) మృగాజినములు ధరించుచుండినట్లు మనము చదువుచున్నాము. చెట్ల బెరడులుగూడ కట్టుకొను అనాగరకులు గలరు. నూలువస్త్రములు నాగరకతాదశలో వెలసినవి గాని అనాగరకదశలోనివి కావు. బట్టల నేత వచ్చుటకుఁ బూర్వము వ్యవసాయము, ప్రత్తి పెంపకము, దారము వడుకుట మొదలయినకళ లన్నియు వచ్చియుండవలెను.

అలంకరణము — పోటుజాతులయొక్క పోటుతనము, నాగరకజాతులయొక్క నాగరకతయు అలంకారములవలనఁ గొంత తెలియును. నగ్నస్థితిలో నున్నప్పుడు శరీరమునకు రంగు వేసికొని దాని చక్కఁదనమును హెచ్చింపవలెనను నన్నకోర్కె పుట్టుట సహ జము. కావున పెక్కురనాగరకజనులు శరీరమునకు రంగు వేసికొని యుందురు. ఆఫ్రికా, అమెరికాఖండములందలి ఆదిమనివాసులైన అర ణ్యకజాతులవారు తమశరీరమును వేఱువేఱుచిత్తరువులతో నలంకరించు కొనియుందురు. కొందఱు శరీరముయొక్క యొక భాగమందును, మఱియొకరు ఇంకొకభాగమందును, ఇంకొకజాతివారు శరీర మంత యును నల్లని, పచ్చని రంగులచిత్తరువుల రాచుకొందురు. ఈచిత్తరు వులు చెట్లు, తీగలు, చెక్కడములు, గళ్లు, మృగములు మొదలైనవిగ నుండును. ఇది చిత్రవిద్యయొక్క ప్రథమావస్థ యని చెప్పవచ్చును. కొన్నిదేశములలో శరీరమున పచ్చలు పొడిపించుకొని సింగారించుకొని యుందురు. మనదేశమునందును పచ్చలు పొడిపించుకొనునాచారము కలదు. ఈపని సాధారణముగ ఎఱుకలవాండ్రు చేయుచుందురు. మెల నేషియా, పాలినీషియా, న్యూజీలండు మొదలయినదేశాంతరములందలి పోటువారు చేతులనిండను, కాళ్లనిండను, ముఖమంతయు, శరీర మంతయుఁ బచ్చలు పొడిపించుకొందురు! బట్టలు కట్టునాచారము హెచ్చినకొలఁదియు శరీరమునకు రంగు వేసికొనుట, పచ్చలు పొడి పించుకొనుట యను నాచారము తగ్గెను.

శరీరమున నలంకారము తగిలించుకొనుటకు శరీరమునందుఁ జిల్లులు చేయుట అనాగరకజనులయొక్క పెద్దవిశేషము. చెవులకు, ముక్కునకు చిల్లులు చేయుట సహజమేకదా! కొందఱు క్రిందిపెద వికిఁ జిల్లిచేసి, దానిని క్రమముగఁ బెంచి, నోటితో సమానమైనంతది చేసి దానికి నగలు పెట్టుదురు. బ్రెజిల్, దక్షిణ-అమెరికా, మధ్య- ఆఫ్రికాలందలి పోటుజాతులలో నీయాచార మున్నది. అచ్చట పిల్లలకు తల్లులు, మనము మనపిల్లలకు చెవులు కుట్టించినట్లు, పెదవి కుట్టించి క్రమముగఁ బెంచెదరు! కొందఱు బుగ్గలోఁ జిల్లి చేసికొని నగ ధరించెదరట!!

వీరినగలును మిక్కిలి పోటుగ నుండును. కొందఱు చక్కఁ దనమునకై ఱాళ్లను ధరించెదరు. ఆడువాండ్రు ధరించునగలు ఎముక లతోను, సముద్రమునందలి ప్రాణులకవచములతోను చేయబడి

యుండును. మనదేశమునందు లంబాడీస్త్రీలు ధరించుచుండిన నగలు మనము చూచుచున్నాము. ఇంకను అనాగరకజనులలో నింతకంటె నగలు మెండుగ నుండు నని తెలిసికొనవలయును.

వివాహము. — మానవులు పశుదశయం దున్నకాలమునఁ గొంత వఱకు స్త్రీ పురుష సంబంధములు కూడ పశువులవలెనే యే నియమము లేక స్వేచ్ఛగా జరిగియుండును. కాని యంత పశుదశయం దున్నజాతు లిప్పుడు కానరావు. కొంతకాలమునకుఁ గొన్ని నియమములు యేర్పడినవి. మొదటినుండియు స్త్రీలను పురుషులు తావిసలుగ, తమ యుపయోగమునకై పుట్టిన సొత్తువలె చూచుచున్నందున, కొందఱు పురుషులకుఁ గొందఱు స్త్రీలకు నియతసంబంధము కలిగెను. ఇదియే వివాహవిధి. ఇది అనేకవిధములుగ నున్నది. ఒక స్త్రీకి నొక పురుషుఁ డన్న నియమము మొదటినుండియు నున్నది కాదు. ఒక్క పురుషునకుఁ బెక్కు స్త్రీలును, ఒక్క స్త్రీకిఁ బెక్కురు మగలును, ఉండు నాచారములు అనేకానాగరకజనులలో నున్నవి. బహుపతిత్వము (Polyandry) నాగరకజాతులవారమైన మనకు నెంత యసహ్యకరముగ నున్నను భూలోకమునం దీయాచార మనాదిసిద్ధముగ నున్న జాతులు కలవు. సింహళమునందును, టిబెత్తునందును, నీలగిరిపర్వతమునందును ఈయాచారముగల జాతు లున్నవి. ఇట్టియాచార మున్న చోట సాధారణముగ నొక్క స్త్రీకి నున్న పెక్కురుమగ లన్నదమ్ములుగ నుందురు, అనఁగా పంచపాండవులవలె నన్నదమ్ము లందఱును ఒక్క స్త్రీకి పెనిమిట్లుగ నుందురు. నీలగిరిపర్వతముమీఁద 'తోడా' లను మోటుజాతివా రున్నారు. అన్నదమ్ములలో నొక్కఁడు వివాహమాడిన స్త్రీ యందఱితోడఁబుట్టినవారికిని పెండ్లాముగను ఒక పెండ్లాము గలవా రందఱును సాధారణముగ అన్నదమ్ములైనను ఒకప్పుడు వా రొక్క కుటుంబములోనివారుగను, అరుదుగ భిన్న కుటుంబములోనివారుగనుగూడ నుందురు. ఇట్టిస్త్రీకిఁ బుట్టనపిల్లలకుఁ దండ్రి యెవఁ డని నిశ్చయముగఁ దెలియుటకై యాస్త్రీ గర్భముతో నున్నప్పుడు ఏడవనెలలో నొకయుత్సవము చేసెదరు. అప్పుడు దానిమగలలో నొక్కఁడు దానిచేతికి నొక చిన్నవిల్లును, అంబును ఇచ్చును. అట్లిచ్చినవాఁ డప్పుడు పుట్టబోవుశిశువునకుఁ దండ్రి. మగ లందఱు నన్నదమ్ములైనప్పుడు పెద్దన్నయే సాధారణముగ విల్లంబు నిచ్చును.

ఎఱుకలవాండ్రలోఁ గూడ నొకవిధమైన బహుపతిత్వము కలదు. ఎఱుకలవానిమగఁడు దొంగతనము చేసి ఖైదునకుఁ బోయిన కొడుల నాకాలము నది మఱియొకనితోఁ గాఁపుర ముండవచ్చును. తిరిగి మగఁడు రాఁగానే యది వానిఁ జేరును.

కొన్ని జాతులలో వివాహము చేసికొనిన స్త్రీ పెనిమిటి సెలవు లేక యన్యపురుషునిం బొందుట తప్పుగా నెంచినను, భర్త యనుజ్ఞ వడసి యట్లు చేయుట గాని, అవివాహితస్త్రీలు తమ కిచ్చవచ్చినట్లు ప్రవర్తించుట గాని తప్పుగా నెంచరు. న్యూజిలెండులోను, ఉత్తర-ఆరాకానులోను, ఉత్తర-అమెరికా, మధ్య-అమెరికాల యం దుండు మోటుజాతులవారు కన్య స్వేచ్ఛగాఁ దిరుగుట తప్పుగా నెంచరు. అట్లు అవివాహితయై కన్య యెవరితోను సంబంధము లేకుండ నుండెనేని యది రూపని కా దని బ్రెజిల్‌దేశజ లనుకొనెదరు. మెలనేషియాదేశమండలిజనులు తమయింటికి వచ్చినచుట్టముల కొద్దకుఁ దమభార్యలఁ బంపుదురు.

మోటుజాతులలోఁ గొందఱు తమతెగవారిని వివాహ మాడుదురు. కొందఱు వేఱుతెగవారిని గాని వివాహ మాడరు. మొదట వేఱుతెగలనుండి యాఁడువారిని ఎత్తుకొనివచ్చి బలవంతముగ వివాహ మాడుచుండిరి. దీనినే మనవారు రాక్షసవివాహ మనిరి. ఇట్టి యాచార మింకను అనాగరకజనులలోఁ బెక్కుచోట్ల నున్నది. ఈ తెగవారు ఆ తెగవారితోనే సంబంధబాంధవ్యము చేసికొనవచ్చు నని యున్నచోట నీతెగలోని యీతరముపురుషు లందఱికి ఆతెగలోని యీ తరమునందలి స్త్రీ లందఱును పెండ్లాలుగ నుందురు, అనఁగా ఈ తెగలోని యుక్తవయసు వచ్చినమగవాఁడు ఆ తెగలోని యుక్తవయసు వచ్చినంత మంది స్త్రీలను పెండ్లి చేసికొనవచ్చును. ఇట్టియాచార మాస్ట్రేలియా జనులలో నున్నది. సుమత్రాద్వీపమునందుఁ గొంతకాలముక్రిందట జగర్, అంబెల్ అనక్, సెమనడో అను మూఁడువిధములయిన వివాహము లుండెను. మొదటిదానిలో పురుషుఁడు స్త్రీని కొనును, రెండవదానిలో స్త్రీ పురుషుని కొనును, మూఁడవదానిలో స్త్రీ పురుషు లిద్దఱును సమానమైనహక్కు కలవారై యుందురు. మొదటి వివాహపద్ధతి మనదేశమునందును కలదు గాన దానిని వర్ణింపనక్కఱ లేదు. రెండవదానిలో ఎల్లతండ్రి అల్లుని కొనితెచ్చును. వాఁ డప్పటినుండియు భార్యకుటుంబమువాఁడే యగును. వానిసంపాదన యంతయు వానిమామగారికే చెందును. వాఁడు మామగారికుటుంబమువాఁ డగును. ఇది యొకవిధమైన యిల్లఁటము. భార్యాభర్తల కిద్దఱికిని సమానమైనహక్కుగల వివాహమందు ఇద్దఱిసంపాదనయు, అప్పులును ఇద్దఱికి సమానముగ వచ్చును. భార్యాభర్త లిద్దఱును విడిపోవలయు నన్న సొత్తును సమానముగఁ బంచుకొందురు. ఇట్లు అనాగరకజాతులలో వివాహపద్ధతులు పెక్కులు గలవు. ఇవన్నియు, శరీరసౌఖ్యముకొఱకుఁ జేసికొన్న వివాహములే కాని యిందు సాత్త్విక ప్రేమ యనునది కానరాదు. స్త్రీని సాధారణముగ దాసిగ, పనికత్తెగ, భోగస్త్రీగఁ జూచెదరు. కావున నాగరకవివాహములకును, అనాగరకవివాహములకును సాత్త్వికప్రేమ యనునదియే భేదము.

నివాసస్థలములు. — చెట్టునీడ, పొదలచాటు మొదట నారణ్యకులకు నివాసస్థానములు. గుహాలే వానికిఁ బెద్దగృహములు. మొదట మానవుఁడు గృహనిర్మాణ మెఱుఁగఁడు. రెండుకొమ్మలు చెట్టు గాని పొదలచాటునను, గుహలలోను కాఁపురముండు నికృష్టజాతులవా రిప్పటికిని పెక్కురు కలరు. ఈ స్థితినుండి లంబాడీ గుడిసెలవఱకు వచ్చుటకు మానవజాతి కెన్నియో యుగములు పట్టి యుండును. వస్త్రంగముచిద్య సాధ్య మగుటకు మానవు లారణ్యక

# అనాగరకసంఘము



౧



౨



3



౪

దక్షిణ అమెరికాయందలి అనాగరకజాతులవారు ( పటము ౧, ౨, 3

ఆఫ్రికాదేశపు అనాగరకజాతిస్త్రీ ( పటము ౪)

కేన్‌యార్కర్ అనువారు రెంటికంటె నెక్కుడులెక్కల నెఱుఁగరు. మూఁడు అనవలసివచ్చినప్పుడు 'రెండుఒకటి', నాలుగు అనవలసి వచ్చినప్పుడు 'రెండు రెండు' అని యందురు! కావున నిట్టివారిబుద్ధి యింకను వికాసముఁ జెందక బాల్యావస్థయం దున్న దని చెప్పవలెను.

మాటలాడు భాషయొక్కయు, లెక్కించుసంఖ్యలయొక్కయు స్థితి యిట్లుండ, నింక వీజాతులవారిలో వ్రాఁత లే దనియు, గ్రంథములు లే వనియును వేఱుగఁ జెప్పవలెనా? వ్రాఁత లేకపోయినను, కొంచెము అధికులగు అనాగరకజాతులవారు తమయుద్దేశమును చిత్రములద్వారమునఁ గొంతవఱకుఁ దెల్పెదరు.

కుటుంబము.—స్త్రీపురుషసాంగత్యమువలనఁ గుటుంబ మేర్పడును. పూర్వము కుటుంబములు స్త్రీప్రధానములు. పిదప క్రమముగఁ బురుషప్రధానము లయ్యెను. స్త్రీప్రధానకుటుంబము లనఁగా నాకుటుంబములోనివారు నిజమునకు ఒక స్త్రీకిని, దానికి గల బంధుత్వము వలనఁ గలసియుందురు. వారసత్వము మొదలైన వన్నియు స్త్రీ ననుసరించి వచ్చును. మానవులయాదిమదశలలో, వివాహబంధనములు దృఢము కానందున సంతానమునొక్క తండ్రి యెవఁ డయినది నిశ్చయముగాఁ దెలియదు. తల్లిమాత్రము తెలియును. కావునఁ బిల్లలను పోషించుభారము తల్లిమీఁదను, ఆమెబంధువులమీఁదను పడును. మలె ఆర్చిపెలగోదేశమందలివారు మిక్కిలి హీనావస్థలో నున్నారు. ఒక పురుషుఁడు, ఒక స్త్రీ యరణ్యమునకుఁ బోయి పొదలలోఁ గాఁపుర ముందురు. పిల్లలు పుట్టినతరువాత పిల్లలు కొంచెము పెద్దవా రగువఱకు వారు కలసి యొకచెట్టుక్రింద నుందురు. చెట్టునకు ఒకవిధమైన ఉగ్గొల్లల త్రాఁటఁగట్టి పిల్లలను దానిలో నుంచెదరు. రాత్రి పురుగు లేవైనవి రాకుండ నిప్పు ముట్టించి యుంచెదరు. పిల్లలు కొంచెము పెద్దవారైనతరువాత తండ్రి యిష్టమువచ్చినచోటికిఁ బోవును. తల్లి పిల్లలను పెంచుచు నుండును. ఆస్ట్రేలియాదీవుల లోను ఇట్లే పిల్లలను తల్లి, మేనమామ పెంచుదురు. ఉత్తర-అమెరికాయందును ఇట్టియాచారము కలదు. హిందూదేశమందలి నాయరుజాతివారిలోను స్త్రీప్రధానమైన కుటుంబపద్ధతియే అమలులో నున్నది. అచ్చటికుమారునకు తండ్రి యింటిపేరు రాదు. తండ్రి సొత్తు రాదు. మేనమామయింటిపేరు వచ్చును. మేనమామసొత్తు వచ్చును. ఇట్టికుటుంబమును తారవడ్ అందురు.

వివాహబంధనములు దృఢమైన జాతులలో పురుషప్రధానకుటుంబము లేర్పడినవి. వీనిలోఁ బురుషునిబట్టి కుటుంబ మేర్పడును, దాయభాగము వచ్చును. ఇట్టివియే మనకుటుంబములు.

సంఘము.—సంఘ మనఁగాఁ గొన్నికుటుంబములు స్వసంరక్షణార్థమై కలసియుండుట. మిక్కిలి ప్రారంభావస్థయందు నొకకుటుంబమునకు నాకుటుంబమే విడివిడిగా నుండి స్వేచ్ఛాచారము చేయును. సింహళమునందలి వెడ్డా లనుజాతివా రట్టివారే. వారు వేఱువేఱుగ నుందురు. అమెరికాఖండమందలి 'ఫ్యూజియనులు' అనుజాతివారిలోని వేఱువేఱుకుటుంబములు యుద్ధసమయమునఁ గలసి యొకనాయకుని యేర్పఱచుకొని వానియాజ్ఞలో నున్నను, ఆపని తీఱినతోడనే యేకుటుంబమున కాకుటుంబము స్వతంత్రమై పోవును. కాని మఱి యొకజాతివారు ప్రక్కను జేరి శత్రువులుగా నున్నప్పుడు స్వసంరక్షణార్థమై యీచిన్నకుటుంబము లన్నియుఁ జేరి యొక సంఘము కావలసివచ్చును. ఇట్లు కూడి యొక్కని నధిపతిగ నేర్పఱచుకొని వాని యాజ్ఞలో మెలఁగుదురు. ఇట్లు సంఘముగా నేర్పడువారు సాధారణముగ నొక్కతెగవారై యుందురు. ఇట్టిసంఘములోఁ బెద్దపెద్దకుటుంబము లుండును. ఆ కుటుంబముల కధిపతి తండ్రి. ఆతని కుమారులు, మనుమలు మొదలయినవా రందఱును ఆతనియాజ్ఞలో నుండవలయును. ఆ కుటుంబమునకు నాతఁ డొకవిధమైన రాజు.

అనాగరకస్థితిలో నుండువారుకూడ తమస్వాతంత్ర్యమును కాపాడుకొని పరులస్వాతంత్ర్యమునకు భంగము రాకుండఁ బ్రవర్తింపఁగల రనుటకు ఖురాసానులోని దేశాటనశీలురైన కొన్నితెగల జాతులు నిదర్శనము. వీరిలో నిప్పటికిని ఒకరాజు గాని, ప్రభుత్వము గాని కానరాదు. అందఱును సమానులుగనే యుందురు. వీరిసంఘములు చిన్నచిన్నవి. కొన్ని నూఱుకుటుంబములకంటె నెక్కువ యుండవు. ఒక్కొకసంఘమున నొక్కముసలివాఁడు పెద్దగా నుండును. ఆతఁడు కలహము చెప్పవాఁడుగను, తగాదాలు వచ్చినప్పుడు తీర్పువాఁడుగను ఉండుటేకాని యధికారిగ నుండఁడు. ఇతనికిఁ గొంత జీత మిచ్చెదరు. ఇతఁడు పూర్వాచారము నుల్లంఘింపఁడు. 'మా కధికారులు లేరు మా కధికారులతోఁ బని లేదు' అని ఖురాసాను లందురు. పరులను బాధపెట్టి వారిమీఁద నధికారము చేయవలయు నన్న ప్రవృత్తి వీరికి లేదు. ఇతరులస్వాతంత్ర్యమునకు వీ రెన్నఁడును భంగము కలిగింపరు. అరణ్యావస్థ తగ్గినకొలఁదియును మానవజాతికిఁ దమకంటెఁ దక్కువజాతులవారిని వశపఱుచుకొని, తమ బానిసలుగ నుంచుకొని, వారిని కష్టపెట్టి తాము సుఖపడవలయు నన్న యిచ్ఛ పుట్టును.

ఈసంఘములు మొదట నొక్కచోట స్థిరముగ నుండునవి కావు. తమ కాహారము, పశువులకు మేఁత యెచ్చట దొరకునో యచ్చటికిఁ బోవుచుండెను. మనదేశమందలి లంబాడీలును, అప్పు డప్పుడు గుఱ్ఱము లెక్కి తిరుగుచు, చిన్నకత్తులు మొదలైన వమ్ముచుఁ దూరదేశమునకు వచ్చుచుండెడి లంబాడీలవంటి మాలలును ఇటువంటివే. కొంతకాలము గడచినతరువాత నిట్టి జాతులు సంచారమును మాని యొకానొక ప్రదేశమున శాశ్వతముగ వసతిచేయును. అప్పు డాదేశమునకు నాజనులపేరు వచ్చును. కాళింగులు, ఆంధ్రులు, ద్రావిడులు మొదలయినజనులు మొదట నిట్టి సంచారము చేయుచు నిలిచిపోయినదేశములకు కళింగదేశము, ఆంధ్రదేశము, ద్రవిడదేశము అని పేళ్లు వచ్చెను. సంస్కృతమునందు దేశములకు జనులనామములే వాడెదరు. అట్లనే మద్రకులు అనఁగా మద్రదేశము, కళింగులు అనఁగా కళింగదేశము,

ఆంధ్రులు అనగా ఆంధ్రదేశము అని యర్థము. ఈవిధముగ నరణ్యమునందు దిరుగువారిలోనుండి గొప్పసంఘములును, గ్రామములును, పట్టణములును, దేశములును పుట్టుచున్నవి.

[కొ. వేం. ల.]

**అనాగ్జగోరస్** — (క్రీ. పూ. ౫౦౦ ౪౨౮) గ్రీకు తత్త్వవేత్త. ఇతడు ఆసియామైనరులోని క్లెజోమెనె యనుపట్టణమునందు క్రీ. పూ. ౫౦౦ సంవత్సరప్రాంతమున జన్మించెను. ౪౬౪ ౪౬౦ ప్రాంతమున నితడు గ్రీసుదేశపు రాజధాని యగు ఏథెన్సుపట్టణమునకు బోయి, ముప్పది సంవత్సరములవరకును అచ్చటనే యుండి తన విద్యామహిమచే మిక్కిలి కీర్తి వడసెను. పెరిక్లీస్, యూరిపైడ్స్ అను పండితులు ఇతనిశిష్యులు. సాక్రటీస్ కూడ నితని శిష్యుడని కొందరియభిప్రాయము. జ్యోతిశ్శాస్త్రమందును, గణితశాస్త్రమందును ఇతడు మిక్కిలి విఖ్యాతిచెందుటయే కాక తత్త్వవిచారశీలుడనియు, సదాచారసంపన్నుడనియు మిగుల ఖ్యాతి వడసెను. వారికలో నున్న మతగురుల నవమానించెనన్న యపరాధము మోపి యీతనిపై నొక యభియోగము తెచ్చిరి. కాని యితని శిష్యుడైన పెరిక్లిసుయొక్క వక్తృత్వమహిమచే నితడు నిర్దోషుడని విడువబడెను. ఏథెన్సులో నుండుట సురక్షితము గా దని యీతడు క్రీ. పూ. ౪౩౪ ౪౩౩ ప్రాంతమున ల్యాంప్సాకసుకు బోయెను. అచ్చటనే యితడు క్రీ. పూ. ౪౨౮ ప్రాంతమున కీర్తిశేషుడయ్యెను.

ఇతనిసిద్ధాంతానుసారముగా బ్రపంచమందలి భూతసంఖ్య నాలుగు గాని, అయిదుగాని కాదు. అది యసంఖ్యము. నాలుగైదు భూతములలోనుండి యసంఖ్యాకములగు వస్తువుల సృష్టి యైన దను సంగతము. ఇవన్నియు ననాదు లని చెప్పును. మొదట నివన్నియు నొకదానితో నొకటి కలిసి వేరువేరుగ గుర్తించుటకు వీలు లేకుండగ నుండెను. కాని గతి (Motion) రూపమైన చైతన్యమందు ప్రవేశించి, వీని నన్నిటిని విడదీసి సృష్టియొక్క యభివృద్ధికి కారణ మయ్యెను. ఏ వస్తువును నశింపదు. 'చావు' అనగా ఒకచోట సంతరణముగ గూడియున్న వస్తువులు వేరగుట. 'పుట్టుక' యనగా సంతరణము వేరుగ నున్న వస్తువులు కలయుట.

**అనాగ్జిమండర్** — గ్రీకుతత్త్వవేత్తలలో నితడు రెండవవాడు. క్రీ. పూ. ౬౧౧ సంవత్సరప్రాంతమున నితడు పుట్టెను. క్రీ. పూ. ౫౪౭ ప్రాంతమున జనిపోయెను. ఇతని మతమునకు 'అయోనియన్ తత్త్వజ్ఞానపంథ' యని పేరు. సువిఖ్యాతతత్త్వవేత్త యగు గ్రీసు థేలిస్ అభిప్రాయముల నితడు కొంతవరకు ననుసరించెను. కాని యతనిసిద్ధాంతములకు నితనిసిద్ధాంతములకు చాల భేదము కలదు.

థేలిస్ సిద్ధాంతముల ననుసరించి జల మొక్కటియే, యీసృష్టికంతకును మూలతత్త్వము.

అనాగ్జిమండర్ దీని నొప్పుకొనడు. పృథివి, అగ్ని, జలము ఈ మూటిలో నేదియు మూలతత్త్వము కాజాల దనియు, ఈ మూటికి నతీతమై యున్న సర్వవ్యాపి యగు 'అనంతము' అనునదియే యీ మూలతత్త్వ మనియు నీతని సిద్ధాంతము. 'పృథివి, జలము, అగ్ని - ఇవి యన్నియు నశ్వరము లగు పదార్థములే. మూలతత్త్వము నాశనరహితము. అజరహితము. అట్లగుచో నీమూటిలో నేదియు మూలతత్త్వమైయుండుట కవకాశము లేదు. ఏది నాశరహితమో, ఏది యగమ్యమో, ఏది స్వయంభూతమో యది అనంతము. ఆ యనంతమే మూలతత్త్వము. దాని గూలమునకే, ఆ యనంతమునందు గల చాలకశక్తి (Directive Power) వలననే యీ సృష్టికార్యమంతయు జరుగుచుండును' అని యతనివాదము.

ఐరోపాఖండమున వ్యాప్తమయియున్న ఈశ్వరవిషయకమగు సిద్ధాంతమునకు అనాగ్జిమండర్ సిద్ధాంతమే యాధారమని కొందరి యభిప్రాయము.

జగదుత్పత్తివిషయమున మొదట నక్షత్రములు, తరువాత పృథివి, పిదప సముద్రము, అటుపైని తక్కిన ప్రాణికోటియు సృజింపబడిన వని యితని యభిప్రాయము. ప్రాణికోటిలో ముందు మానవులు తరువాత మిగిలినవియు నట!

భూమి గుండ్రముగా నున్న దనియే యితని యభిప్రాయము.

**అనాతవరం** — తూర్పుగోదావరి జిల్లా అమలాపురము తాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౩,౦౭౩ (౧౯౩౧).

**అనాథపిండదుడు** — శాక్యబుద్ధుని సమకాలికుడైన యొకకోమటి. శ్రావస్తిపట్టణ మితనినివాసస్థానము. ఇతనియసలు పేరు సుదత్తుడు. సుదత్తుడు మిగుల ధనవంతుడు, ఉదారుడు. నిరుపేదలైనవారికి, దిక్కులేనివారికి నితడు చూపిన దానవినయౌదార్యమును బట్టి అనాథపిండదుడను పేరు వచ్చినది. బుద్ధదేవుడు రాజగృహమున నుండినకాలముననే యతనిని శ్రావస్తికి గొనిరావలయు నని సుదత్తుడు ఎక్కువగా బ్రయత్నించెను. ఆకాలమున శ్రావస్తినగరమున భిక్షు లుండుటకు తగిన ప్రశాంతమైన చోటేదియు లేకుండెను. బుద్ధుని యాజ్ఞపై సుదత్తుడు దీనిలోటు దీర్చివేయవలయు నని ప్రయత్నించెను. కాని యప్పటి శ్రావస్తిరాజు ప్రసేనజిత్తు అనాథపిండదుడు నిర్మింపబోవు ఉద్యానవనమునకు వలయుస్థలమును సులభముగ నిచ్చుట కంగీకరింపలేదు. ఎంతస్థలము కావలయునో యంతను గప్పగల బంగారము తన కీయవలయు నని యతడు కోరెను. సుదత్తుడు దానికి వెనుదీయలేదు. తుదకు రాజు అనాథపిండదునకు బుద్ధునిపై గల భక్తి కచ్చెరువంది స్థలము నుచితముగ నొసంగివైచెను. తరువాత నందు దివ్యమగు తోట సిద్ధమయ్యెను. ఇతనిగృహమునం బ్రతిదినము ౫౦౦ మంది భ్రాతలు భోజనము చేయుచుండిరి. ప్రసేనజిత్తు

ఏర్పఱిచిన మఱియొకక్షేత్ర ముండెను. ఆక్షేత్రమునందుఁగూడ నట్టి యేర్పాటులే యుండెను. రాజక్షేత్రమునం దియ్యఁబడునట్టి యాహారము విలువగలదిగను, మిక్కిలి శ్రేష్ఠమైనదిగను నుండినను బ్రాహ్మణులాహారముమాత్రము గైకొని దాని నారగించుట కసాధ్యపడుదుమని గృహమునకుఁ గాని, విశాఖునియింటికిఁ గాని పోవుచుండిరి. ఈసమాచారము మొదట కోసలునకుఁ దెలియదు. ఒకదినమున రాజు భోజనశాలయందు మహాహారద్రవ్యము నొకదానిం గొనివచ్చి వేగమున కొసంగి దానిని భోజనశాలలోని బ్రాహ్మణుల కిచ్చి రమ్మని యంపఁగా నతఁడు పోయి వెంటనే మరలి వచ్చి భోజనశాలలో నెవ్వరును లేరని వచించెను. రాజు వారలంగూర్చి ప్రశ్నింప వారిమిత్రులగృహములకుఁ బోయిరని దగ్గఱ నున్నవారు వచించిరి. అంత ప్రసేనజిత్తు భోజనానంతరమున దేశికునికడ కేఁగి యన్నిటిని మించిన యాహారమేది యనుఁగా మిత్రరూపియాహారమే సర్వశ్రేష్ఠ మనియు, నట్టిమిత్రుఁ డెట్టి యాహార మిచ్చినను నది దివ్యభోజనమే యనియుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

**అనాధృష్యుఁడు** — ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొకఁడు.

**అనామిక** — చిటికెన వ్రేలికి ప్రక్క నున్న వ్రేలు. ఒకప్పుడు శివుడు ఈ వ్రేలితోనే బ్రహ్మదేవుని శిరస్సు ఖండించెను. అందుచే నిది యపవిత్రమైపోయెను. కావుననే యజ్ఞాదికార్యములలో దీనిని బవిత్ర మొనర్చుటకై దర్భపవిత్రము దీనికిఁ బెట్టుదురు. ఈవ్రేలిపేరైన నెత్తరాదు. అందులకే యనామిక యని దీనికి పేరు.

**అనాయువు** — మాఱుపేరు అనుగ. తండ్రి దక్షప్రజాపతి. మగఁడు కశ్యపుఁడు.

**అనార్కలి** — ఒక యువతి. అనార్కలి యనుపేరెన్నియో కథలలో నుదాహరింపఁబడుచుండును. జహాంగీరు అనురాగమునకుఁ బాత్రమైన యొకకాంత యని కొందఱి యభిప్రాయము. అనార్కలి యనుపేరుగల యొకయందకత్తె రంజిత్‌సింగున కుంపుడుకత్తెగ నుండిన దనియు, నామెపైఁగల యనురాగమునకు స్థిరచిహ్నముగ నతఁడు లాహోరునగరమున ఆమెపేర నొకవీథిఁ గట్టించె ననియు మఱియొకకథ ప్రచారమున నున్నది. అనార్కలి యనుపేరుగల వీథి మాత్ర మీనాటికిని లాహోరునగరమునఁ గలదు.

**అనార్యులు** — ఆర్యులు కానివారు. హిమాలయమునకును, వింధ్యపర్వతమునకును నడుమ నున్న ప్రదేశము ఆర్యావర్తమనియు, నందుండువా రార్యులనియు, తదితరు లనార్యులనియుఁ జెప్పఁబడుచుండిరి. హిందూదేశమునందు నార్యులరాకకు పూర్వమందు మూలనివాసులను ఆర్యులు అనార్యు లనుచుండిరి. ఇటీవల పారసీక, పాశ్చాత్యు లనేకులును ఆర్యశాఖవారే యనియు సిద్ధాంతీకరింపఁబడినది. కనుక, ఈ యార్యశాఖలోఁ జేరనివారిని ఇప్పటి పాశ్చాత్యులు అనార్యు లనియెదరు.

**అనావల్** — ఇది గుజరాతుదేశమున నివసించు బ్రాహ్మణులతెగలలో నొకదానికి పేరు. వీరికి దేసాయీ లనియు, మస్తాను లనియు మఱిరెండుపేర్లు కలవు. దక్షిణగుజరాతుదేశపు టాదిమ నివాసులు వీరు. బరోడారాజ్యమునందలి నవసరీజిల్లాయందుఁ గల అనావల్ అను గ్రామముపేరునుబట్టి వీరి కీపేరు వచ్చినది.

ఈ యనావలులనుగూర్చి యొకచిన్నకథ కలదు. రావణవధ యైపోయినతరువాత శ్రీరాముఁ డయోధ్యకు మరలి వచ్చుచు దారిలో అగస్త్యాశ్రమమునకుఁ బోవలయు ననె. వింధ్యపర్వతప్రాంతమున దిగెను. ఆయన అచ్చట బ్రహ్మహత్యచేఁ గలిగినపాపమును బోఁగొట్టుకొనుటకై ప్రాయశ్చిత్త మొనరించుకొనఁదలఁచెను. కాని యచ్చట బ్రాహ్మణు లెవ్వరును లేరు. అంతట ఖిల్లులే. అందుచే హిమాలయప్రాంతమునుండి బ్రాహ్మణులను రప్పించెను. వారు రామునిచే దీవింపఁబడిన దక్షిణ గొనకపోవుటచే వైశ్యధర్మ మనుష్ఠించుచు నుందురుగాక యని వారి నతఁడు శపించెను. ఆ బ్రాహ్మణులసంతతివారే యీయనావలులు.

ఇది మఱియొకచిన్నమార్పుతోఁ గూడ ఒక్కొక్కచో వ్యాప్తిలో నున్నది. వింధ్యపర్వతప్రాంతమున బ్రాహ్మణు లెవ్వరును లేకుంటచే శ్రీరాముఁ డచ్చటిఖిల్లులనే విప్రులుగఁ జేసె ననియు, అయినను వారికి సంపూర్ణముగ బ్రాహ్మణ్య మబ్బకపోయిన దనియు నీమార్పు.

బరోడాలోని నవసరీప్రాంతమున వీరు విశేషముగఁ గలరు. మొత్తముమీఁద బరోడాలో వీరిజనసంఖ్య ౯,౫౮౭. వీరిలో దేసాయీలు, భథేలులు అనురెండుతెగలవా రున్నారు. దేసాయీలు ఉత్తములు. ఈరెండుతెగలవారికిని చుట్టఱికము కలియదు.

**అనాస** (Pine apple — Ananas sativa) — ఇది యేకదళబీజకములలోఁ జేరిన యొకఫలజాతి 'బ్రొమిలియేసి' కుటుంబమునందలిది.

అనాస మొక్క కుఱుచప్రకాండము గలిగి సుమారు ౨-౪ అడుగుల యెత్తుగను, కాయ పుట్టినవెనుక నీప్రకాండము నిడివిగ పెరిగి యాకాయను ఆకులమధ్యమునుండి పైకిఁ దెల్చును. మొక్క మొదట నుండియు, ప్రకాండమునందునుగూడ పిలకలు బయలుదేరును. అనాసమొక్కవేళ్లు సామాన్యముగ ౬-౮ అం. కంటె లోతునకుఁ గాని ౧-౧½ అడుగులకంటె దూరమునకుఁ గాని వ్యాపింపవు. ఆకులు ౧½-౨ అం. వెడల్పు గలిగి ౨-౫ అడుగులపొడవుండును. వారగలిగి కొంచెము దళముగ నుండును. వానియంచులను వాఁడియైన ముండ్లుండును. కొనగూడ ముల్లుదేరి యుండును. ఆకు లించుక పసిమితోఁ గాని, ఎఱుపుతోఁ గాని చేరినయాకుపచ్చవర్ణము గలిగియుండును. పూవులు చిన్నవి. అవి గుండ్రముగఁగాని, పఱుగోళాకృతిగఁ గాని యుండు నొక కృత్రిమఫలమునకు పైభాగమున నుండు 'కండ్ల'లో నమరియుండును. కండ్లపై రెప్పలవంటి దళము లుండును. పువ్వులు నిడుపవులు; పుష్పకోశము త్రిదళవలయము. ఆకర్షకవలయమున

పైదు పత్రము లుండును. ఇది రెండు విధములు నీలవర్ణము గలిగి యుండును కింజల్కములు ఆరు. అండాశయముపైకిలము మూఁడుగ చీలి యుండును గింజలు చిన్నవిగను, బల్లపరుపుగను నుండును గాని తఱచు తప్పులుగ నుండును. కృత్రిమఫలము బాగుగ పెరిగినప్పుడు ౬ గు౨ అం నిడివియు, ౪-౬ అంగుళములావును గలిగియుండును. పండినప్పుడు పసుపురంగు గలిగియుండును దీనిపైని పిల్లవంటి ఆకుల గుత్తి యుండును తఱచు దీనిచుట్టును, కాయకొత్తిపైనను, కాయ దిగువనుకూడ అనేకములగు చిన్నచిన్న పిల్లలు బయలుదేరును.

అనాసకు అమెరికాఖండపు ఉష్ణభాగములు (బహుశః బ్రెజిల్ దేశము) ఆదిస్థానమయియుండునని యెంచఁబడుచున్నది అమెరికాఖండము కనుఁగొనఁబడినప్పుటికే యీమనోహరమగు ఫలజాతి యితరఖండవాసులకు లభ్యమయ్యెను. ౧౫౧౩-వ సంవత్సరమున గాన్‌సేలో వార్నాండెజ్ (Goncate Hernandej) అనునాతఁడు ప్రప్రథమమున నీమొక్కల నైరోపాఖండమునకును, పిమ్మట నచట నుండి ౧౫౪౮-వ సంవత్సరమున పోర్చుగీసువారు హిందూదేశమునకును దెచ్చిరని తెలియుచున్నది. హిందూదేశమునుండి యిది చీనా మొదలగు ప్రాచ్యదేశములకు వ్యాపించెను.



అనాస మొక్క

ఇప్పు డిది అనేకోష్ణదేశములందు సాగు చేయఁబడుచున్నది. హవాయిదీవులందును, మలయాద్వీపకల్పమునను విస్తారముగఁ బెంపఁబడి యచటనుండి డబ్బాపండ్లును, నిల్వచేసిన మురబ్బాయును విగతచోట్ల కెగుమతి యగుచున్నవి. హిందూదేశమున దీపండ్లు వంగదేశమునను, బర్మాలోను, అస్సామునందును విరివిగ పైరుచేయఁబడుచున్నవి. చెన్నపురిరాజధానిలో దీనిపంట పడమటిసముద్రతీరమున హెచ్చు. ఆంధ్రదేశమున సింహాచలముపైనను, పాలకొల్లుప్రాంతములందును కొంతవఱకు పండింపఁబడుచున్నవి.

తెలుఁగుజిల్లాలలో విస్తారముగఁ బెంపఁబడుచున్న 'దేశవాళీ' రకము ఆకులందు విస్తారము ముండ్లు గలిగి చిన్నకాయలను గాచును, కాని తీపటయినదియు, బాగుగఁ గాచునదియు నై యున్నది. ఇది గాక సిలన్, థకాక్కా, సిల్హట్ రకము లాయాప్రాంతములందు ప్రసిద్ధి వహించియున్నవి. ఇటీవల క్వీన్, కెయన్నె, ట్యాగ్ మొదలగురకము లితర దేశములనుండి తేఁబడి అచ్చటచ్చట సాగుచేయఁబడుచున్నవి కడపటి రెండురకములను ఆకులందంతగా ముండ్లు లేక పెద్దకాయలను గాచును సింహాళమున నొకప్పు డొకపూరకపు కాయ ౨౪ పౌనులు తూఁగినదట కాని యీరకములు దేశవాళీరకములంత తీపటయినవి గావు నాటినచోటునుండి ౩, ౪ సంవత్సరముల కొకసారి తీసి క్రొత్తచోట నాటుచుండవలెను, లేనిచో క్షీణించును

అనాస ఉష్ణమండలవాసియయినను కొంచెము శీతోష్ణదేశము లందుఁగూడ పైరగును. ఇది సగటుఉష్ణత 'ఫారెన్‌హీటు' ౬౫° లు మొదలు 'ఫా' ౮౦° లవఱకుఁ గల ప్రదేశములందు జయప్రదముగ సాగుచేయఁబడుచున్నది ౧౦౦౦ - ౨౦౦౦ అడుగులఉన్నతముగల ప్రదేశములు దీని కనుకూలములు కాని సముద్రప్రమట్టమునుండి ౫౦౦౦ అడుగులవఱకు ఉన్నతముగల ప్రదేశములందు సైతము ఇది పెంపఁబడుచున్నది వర్షపాతమునఁగూడ నిది చాల హెచ్చుతగ్గుల నోర్చును ౨౫ అం మొదలు ౧౦౦ అం వఱకును గురియు ప్రదేశములం దిది పైరగుచున్నది

అనాసతోఁటలను నాటుటకు ఆగస్టు, సెప్టెంబరు నెల లనుకూలములు అప్పటికి కాపు ముగియును గావున నపుడే తోఁటలలో ననవసరములగు పిల్లలను దీసి మరల నాట వీలగును. పిల్లలు ముందు లభించుచో జూన్, జూలై నెలలలోఁగూడ నాటవచ్చును

అనాస పలువిధములగు నేలలలో పైరగును. నీరు సులభముగ వడియుటయే అనాసకుఁ దగిన నేలలముఖ్యలక్షణము కావున నిందుకు ఇసుకగరువులును, గరుములును తఱచు ఎన్నఁబడుచుండును సేంద్రియపదార్థము హెచ్చుగ నుండుటచే క్రొత్తగ నడవి నఱికి సాగునకుఁ దెచ్చిననేల లీతోఁటలకుఁ బ్రశస్తములు జిగురునేలలో కాయలు పెద్దవిగ ఎదిగినను రుచిమంతములుగ నుండవు ఏమాత్రము చౌడికొడినేల లైనను దీనికి పనికిరాదు

అనాసతోఁటలను ఎండలు తీవ్రముగ లేనిచోట్ల ప్రత్యేకముగ నాటుట మంచిది ఎండలు మిక్కుటముగ నుండుచోట్ల నీతోఁటలలో నచ్చటచ్చటను, చుట్టును అరఁటిమొక్కలను నాటుట మంచిది సింహాచలమున నీతోఁటలలో పనస, మామిడి, జీడిమామిడి మొదలగువాని నాటి, యవి కాచునప్పటికి అనఁగా ౧౦ సంవత్సరములయినపిమ్మట అనాసతోఁటను దీసివేయుదురు సముద్రదేశములందుఁగూడ నపోటా, మామిడి మొదలగు తోఁటలను పెంపఁదలఁచు ప్రదేశములలో వానితోపా

టనాస మొక్కలనుగూడ నాఁటి యేది కాపు పట్టునరికి అనఁగా ౫-౬ సంవత్సరములలో అనాసమొక్కలను దీసివేయవచ్చును. అనాస మొక్కలు కొంత నీడ నోర్చుటచే వీనిని మామిడిమాను చెట్లచుట్టును, బత్తాయి, నారింజ వగైరాతోఁటలలోను నాటుటకూడఁ గలదు. కాని యిట్లు నీడను పెరిగినకాయ అంతరుచిగా నుండదు.

సింహాచలమున నడుమని నఱికి, కంపను కాల్చి, చెట్లను త్రవ్వి, మొక్కలను రాళ్లను దీసి, యారాళ్లను ౧-౧½ గజములదూరమున వరుస లుగఁ గీర్చుటచే నేల నంతరములుగ చేర్పఱిచి, వానిపై పిల్లలను నాటుదురు. సమప్రదేశములందు నేలను బాగుగ దున్ని సన్నము చేసి ౮ అడుగుల కొకకాల్వను (౮-౧½ అడుగు వెడల్పు, ౯ ౧౨ అం లోఁతు) త్రవ్వి వానిమధ్యస్థలములపై నామంటిని పఱచి యామెడలపై నాలుగడుగులదూరముగల వరుసలలో ౧½ - ౨ అడుగుల కొక్కొక పిల్లను నాటవలయును.

అనాసపిల్లలు నాలుగువిధములు —

౧ నేలపిల్లలు — ఇవి మొక్కలమొదట నేలలోనుండి పుట్టును. సన్నని నిడివియాకులు గలిగియుండును. వయస్సును బట్టియు పొడుగునుబట్టియు నాటినసంవత్సరమే కాని, మఱుసటిసంవత్సరమునఁ గాని కాచును.

౨ కాఁడపిల్లలు — ఇవి కాయలను గాచినకాఁడలపై నాకు సందులలో బయలుదేరును వీనియాకులు కుఱుచగను, కొంచెము వెడల్పుగను నుండును ఇవికూడ పైవానివలెనే నాటిన తొలిసంవత్సరమునఁ గాని, మఱుసటిసంవత్సరమునఁ గాని కాచును

౩ తలలు — ఇవి కాయనెత్తిమీఁద బయలుదేరును ఇవి సామాన్యముగ నాటినపిమ్మట రెండవ సంవత్సరమునఁ గాని, మూఁడవ సంవత్సరమునఁగాని కాచవు.

౪ కాయపిల్లలు — ఇవి కాయనెత్తిమీఁద ముందుతలను గాని, కాయకు క్రిందఁ గాని చుట్టును అనేకముగ బయలుదేరు చిన్న పిల్లలు ఇవి నాటినవెనుక కాచుట కధమము ౩ సంవత్సరములు పట్టును

నాటుటకు కాఁడపిల్లలు ప్రశస్తముగ నెంచఁబడుచున్నవి. కాని యివి తోఁటలో కాపునకు వదలఁబడుటచే దొరకుట కష్టము కావున సామాన్యముగ నేలపిల్లలే నాటవలసియుండును. తలలను, కాయపిల్లలను మంచిదొక నారుమడిలో నాటి యొకటి రెండు సంవత్సరములు పెరిగినపిమ్మట నాటఁదగును

పిల్లలను నాటునపుడు వానియడుగుననుండు కొన్నియాకు లను దీసివేసి కుళ్ళు రోగముఁగలుగకుండుటకు ప్రకాండమును బయలుపఱుపవలెను. ఈప్రకాండమునకు మన్ను అంటినచో కాని వేళ్లు పుట్టవు నేలపిల్లలనుండి ప్రాఁతవేళ్లను దీసివేయుట మంచిది. పిల్లలను ౨-౩ అంగుళములకంటె హెచ్చులోఁతున నాటఁగూడదు. సింహాచలమున సామాన్యముగ ఎకరమునకు సుమారు ౮౦౦౦ పిల్లలను నాటుదురు. సమప్రదేశములందు ౪ అడుగులదూరముగల వరుసలలో ౧½ అడుగుదూరమున నాటుచో సుమారు ౭ వేల పిల్లలను, ౨ అడుగులదూరమున నాటుచో ౫౦౦౦పిల్లలను పట్టును



అనాస పొద

అనాసతోఁటలు వర్షాకాలమున నాటఁబడుటచే నాటినప్పు డొకసారి నీరు పోసినఁ జాలును. సింహాచలమున నదియు చేయఁ బడుటలేదు తోఁటలలో నాటినవెనుక నొకసారి కలుపు తీయుట తప్ప నాసంవత్సరమున మఱేయుపనియుఁ జేయఁబడుటలేదు. తరువాతి సంవత్సరములందేఁటేఁట కాయలకోఁత ముగిసినపిమ్మట నేల నొకసారి త్రవ్వి కుప్పలను దీసివేయుదురు వర్షమువలన చెదటనైన వంతరములు చెడినచో వని బాగుచేయఁబడును ౩ సంవత్సరము లయినపిమ్మట పిల్లలు హెచ్చుగ బయలుదేఱుచో వానిని దీసివేయుదురు సమప్రదేశము లందు పిల్లలను నాటినవెనుక తోఁటలలో నవసరమైనప్పుడెల్ల (అనఁగా మూఁడుసార్లయినను) గొప్పు త్రవ్వి కలుపు తీయవలెను తోఁట కాపునకు దిగినపిమ్మట పదును తగినంత లేనిచో నీరు కట్ట నారంభింప వలెను వేసవిలో నిట్లు ౪-౮ తడు లవసరము కావచ్చును ఎండ తీవ్ర ముగఁ గాసి,కాయలు దాఁకుడు నని తోఁచినచో వానికి అరఁటిచాఁపు చుట్టి కాపాడవలెను మఱుసటిసంవత్సరమునుండి ప్రతియేఁడును, కాయలకోఁత పూర్తి యయినపిమ్మట తోఁటలో పైపైని కొరలతో త్రవ్వి కలుపుతీసి యెరువు వేయవలెను వేసవిలో పైని చెప్పినట్లు నీరు కట్టవలెను.

అనాసతోఁటలకు బూడిదతోఁగూడిన పశువులయెరువు అను కూలము. ఎకరమునకు ఏఁటేఁట ౩౦-౫౦ బండ్లు వేయవలెను దానికిఁ దోడు కొంత నైట్రేటుగాని, అమ్మోనియాగంధకితముగాని వేయుట చాలచోట్ల లాభకరముగ నుండును. మొక్క ౧-౨ ౨-౩ తులముల నైట్రేటును (వేరువేరుగ రెండు తడవలుగా) గాని ౨½-౧ తులము అమ్మోనియాగంధకితము గాని వేయవచ్చును. దీనిని పశువులయెరువుతో

‘అనాహత మతిక్రమ్య విశుద్ధే ప్రాణా న్నిరుధ్యాఽఽజ్ఞామనుధ్యాయన్ బ్రహ్మరంధ్రం ధ్యాయన్ త్రిమాత్రోఽహ మిత్యేవం సర్వదా ధ్యాయన్ పశ్యత్యనాకారశ్చ భవతి’

—హంసోపనిషత్తు.

అనాహతచక్రము నతిక్రమించి విశుద్ధచక్రమునందు ప్రాణములను నిరోధించి ఆజ్ఞాచక్రము ద్వారా బ్రహ్మరంధ్రమునుచేర్చి జ్ఞానపరుఁడై ఓంకారము నేనని సర్వదా ధ్యానించు పురుషుఁడు పరమును వీక్షించి యనాకారుఁ డగును

విశ్వమయమైన మూలనాదము ఆహత మగునపుడు శబ్దబిందువుల యొక్కయు, లేక శబ్దపరమాణువులయొక్కయు సంయోగమువలనను ధ్వనులును, వర్ణములును గలుగుచున్నవి. బిందువుల సంయోగము ఆకాశతత్త్వమునందు శబ్దస్వరూపమునను, అగ్నితత్త్వమునందు రేఖామండలరూపమునను, వాయుతత్త్వమునందు స్పర్శరూపమునను, జలతత్త్వమునందు రసరూపమునను, పృథ్వీతత్త్వమునందు గంధరూపమునను గ్రాహ్యము లగుచున్నవి

శ్లో॥ శబ్దో ధ్వనిశ్చ వర్ణాశ్చ మృదంగాదిభవో ధ్వనిః,
కంఠసంయోగజన్మానో వర్ణాస్తే కాదయో మతాః ।

మృదంగాదులు గలుగఁజేసెడి శబ్దములు ధ్వనులు కంఠాది సంయోగములవలనను గలిగెడి శబ్దములు వర్ణములు వైదికమత పరిణామమునందు పురుషసూక్తమువలె శ్రీసూక్తము పురుషార్థమునకు సాధనముగను సనాతనహిందూవిజ్ఞానము నిర్ణయించుచున్నది వేదములందు ఆదికాలమునందు దేవారాధనము సామాన్యముగ పురుషపరముగ నున్నదనుటను ఋక్కులు, మంత్రములును విశదము చేయుచున్నవి

‘దేవో వరుణః ప్రజాపతిః’
‘జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః’
‘యో దేవో అగ్నౌ, యో దేవో అప్సు
తస్మై దేవాయ నమోనమః’
‘విశ్వ మాదౌ స దేవః’
‘బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ’
‘భర్గో దేవస్య ధీమహి’

ఇత్యాదిఋక్కులు, బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతాదులును సామాన్యముగ జగత్కారణమును విశ్వేశ్వరుఁడైన దేవునిగ నిరూపించుచున్నవి మహానారాయణము, శ్రీబిందు, నాదబిందు, యోగశిఖ, హంస మొదలగు నుపనిషత్తులు జగత్కారణమును విశ్వేశ్వరియైన దేవినిగ నిరూపించుచున్నవి. ఇతరార్యజాతుల మతములును జగత్కారణమును పురుషునిగ నిరూపించుచున్న విధమును వారిమతసిద్ధాంతములు, దేవారాధనవిధానములు, సంప్రదాయాచారములు సువ్యక్తము చేయుచున్నవి. సెమెటిక్ జాతుల మతములును జగత్కారణమును పురుషునిగ నిరూపించుచున్నవి సింగళజాతులమతమును జగత్కారణమును పురుషునిగ నిరూపించుచున్నది యూదు, క్రైస్తవ, మహమ్మదీయమతములు దేవుఁడు, తండ్రి, అల్లా మొదలగు పురుషనామములను జగత్కారణముగ సంబోధించుచున్నవి వేదాంతము జగత్కారణమును నిర్గుణమైన పరబ్రహ్మముగ నిరూపించుచున్నది

వైదికమతవికాసమునందు కాలక్రమమున జగత్తునకు పురుషుఁడును, శక్తియును కారణములుగ నిరూపింపఁబడినవి దేవభాగవతమువలె దేవీభాగవతమును, పురుషసూక్తమువలె శ్రీసూక్తమును, వైదికమతసంప్రదాయారాధనాచారములందు పరిపాటి యైనవి ఆదికాలమునందు మతానుష్ఠానమునకు వేదములు ప్రమాణము లైనటులు కాలక్రమమునను ఆగమములును వైదికమతాచారములందు ప్రమాణము లైనవి శివకేశవాదులపూజలవలె కాళీ, లక్ష్మి, సరస్వతి, గౌరీత్యాది దేవీపూజలును వైదికమతమునకు పరిపాటియైనవి దేవీపూజలందు శక్తిపూజ ప్రధానస్థానమును హిందూపూజాకల్పవిధానమునం దాక్రమించినవిధము జిజ్ఞాసువులకు పరిశోధనార్హముగ నున్నది శాక్తేయము ఆర్యేతరమతసంప్రదాయ మని సాధించుటకు సనాతనవైదికమతపరిశోధనము నిదర్శనములను సమకూర్చుచున్నది శక్తిపరమైన ఆగమములును, లలితాసహస్రనామాదిస్తోత్రములును ఈవిషయమును పరిస్ఫుటము చేయుచున్నవి

యజుర్వేదీయపురుషసూక్తమునందు ‘సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్, స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్ పురుష ఏవేదగ్ం సర్వమ్, యద్భూతం యచ్చ భవ్యమ్’ అనియును, నారాయణసూక్తమునందు ‘సహస్రశీర్షం దేవం, విశ్వాక్షం, విశ్వశంభువం, విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్ ... స బ్రహ్మ స శివస్సహరి స్సేంద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్’ అని వర్ణింపఁబడిన జగత్కారణము శ్రీసూక్తమునందు ‘ఈశ్వరీగ్ం సర్వభూతానాం త్వామిహోపహ్వయే శ్రియమ్’ అని దేవీపరముగ వర్ణింపఁబడినది శ్రీవిద్యాపరమైన ఆగమములందును, స్తోత్రములందును దేవీవర్ణనలు ఆర్యేతరసంప్రదాయములను స్ఫురింపఁజేయుచున్నవి లలితాసహస్రనామావళియందుఁ గల మలయాచలనివాసిని, వింధ్యాచలనివాసిని, మాతంగకన్య మొదలగు నామముల భావార్థములు శాక్తేయమునకు ఆర్యేతరసంప్రదాయమును నిరూపించుచున్నవి వర్తమానకాలమునను దేవీపూజాపరమైన ఆగమముల వ్యాపకవ్యాఖ్యానములును, దేవీపూజయును విశేషముగ వంగదేశమునందును, మలయాళ ద్రవిడాంధ్రదేశములందును వ్యాపకము గలిగియుండుట ఆర్యేతరసంప్రదాయమునకు నిదర్శనము ఆర్యసంప్రదాయాగతమైన పురుషదైవారాధనము ఆర్యేతరసంప్రదాయాగతమైన దేవీదేవతారాధనముతో సమ్మేళనమును పొందినవిధమును హిందూమతపరిణామము విశదము చేయుచున్నది హిందూమతోద్ధరణమును జేసిన ఆదిశంకరస్వాములకృతమైన శివానందలహరివలె సౌందర్యలహరీస్తోత్రము హిందూమతవ్యాపనమునందు కాలక్రమమున నిగమాగమములకు గలిగినసంయోగమును విశదము చేయుచున్నది.

## అ నా హ త ము



ప్ర ప్రవాహములు

అనాహతశబ్దము పరా పశ్యంతీ మధ్యమా వైఖరీరూపమైన సకల ప్రపంచమును వ్యక్తము చేయువట్లు హిందూవిజ్ఞానము మంత్రతంత్ర శాస్త్రరూపమున నిరూపించుచున్నది

అకారము శివస్వరూపము, నిర్గుణము, హకారము శక్తిస్వరూపము, సగుణము. నిర్గుణ సగుణ స్వరూపములు శివశక్తిస్వరూపములైన అహంకారము కామకళాస్వరూపమున జగద్రూపముగ పరిణమించుచున్నది. మహాతత్త్వము, చంద్రసూర్యాగ్నులు బిందురూపమై వెలయుచున్నది. త్రిగుణాత్మకములైన చంద్రసూర్యవహ్నిబీజములు ప్రకాశ విమర్శ మిశ్రబిందువులై పురుషప్రకృతి సంయోగరూపమైన వాగ్బంధరూపమును దాల్చుచున్నవి. వాగ్బంధ వర్గములు కామకళాత్మకమైన త్రికోణరూపమునందు వ్యక్తము లగుచున్నవి. కామకళారూపమైన త్రికోణశీర్షమునందు హకారము, మిగతా కోణములందు సకారరహిత వర్గములును ప్రతిపాదితములు. శబ్దబ్రహ్మము త్రిగుణాత్మకమై వ్యక్తమైన యోనిపీఠాకృతిని ఇచ్ఛాక్రియా జ్ఞానశక్తులను వ్యక్తము చేయుచున్నది

బిందుసంగతమైన త్రికోణరేఖలు (అ, క, థ) గర్భాంతమున వ్యక్తమై (౪౮) నలుబదియెనిమిదివర్ణములచే నిర్మితమగుచున్నవి. అకారము మొదలు పదునారు వర్ణములు (అచ్చులు) ఒకరేఖయును, కకారము మొదలుకొని తకారమువరకు నొకరేఖయును, థకారమునుండి హకారమువరకు మూడవరేఖయును త్రికోణ రేఖలు. పరాశక్తియైన బిందువు వాగ్బంధకలారూపమునను, సూర్యచంద్రాగ్నిరూపమునను వాగ్బంధయోగమున పురుషప్రకృతిసంయోగమున ప్రపంచరూపమున వ్యవహరింపబడుచున్నది. బ్రహ్మాండభాసురమైన అక్షరామ్నాయము పిండాండమునందున శక్తిరూపమున శివపరిణామమునకు వినియోగపడుచున్నది. బ్రహ్మాండావృతములైన సప్తలోకములు, సప్తస్వరములు, సప్తచ్ఛాయలు పిండాండమునందు సప్తకమలరూపమున జీవయాత్రకు వినియోగపడుచున్నవి

చరాచరప్రపంచమంతయును చైతన్యశక్తిమూలమున జీవయాత్ర నడచుచున్నది. జీవజాలములు శక్తిని స్వాధీనము చేసికొనుటకు చేయుచున్న ప్రయత్నములను ప్రపంచపరిణామము వెల్లడిచేయుచున్నది. వర్తమానకాలమునందు ప్రకృతిశాస్త్రజ్ఞులు వ్యక్తముచేసిన సిద్ధాంతములును, నిర్మాణములును ఈపరిణామములనే నిర్ణయించుచున్నవి. జీవశాస్త్రము, భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము, వేదాంతశాస్త్రము, యంత్రశాస్త్రము మొదలగు శాస్త్రములు చేసిననిర్ధారణలు ప్రాచీనవైదికవిజ్ఞానవిషయములను సమర్థించుచున్నవి. వర్తమాన భౌతికశాస్త్రసిద్ధాంతములు, నిర్మాణవిమర్శనము ప్రాచీనాధ్యాత్మికసిద్ధాంతమార్గములను సమర్థింపగలవిధమున పరిశోధనలు వికాసము చేయుచున్నవి. ఆదికాలమున భయభ్రాంతులకు మూలములైన ప్రకృతిశక్తులు కాలక్రమమున వశవర్తినులై మానవగర్వాభ్యుదయమునకు వినియోగపడుచున్నవి

అఖండమైనశక్తి ఖండరూపములందు సూక్ష్మాతిసూక్ష్మరూపమునను, బాహ్యాభ్యంతరములందు దేశకాలప్రతిబద్ధమైనపుడు ప్రపంచస్థితికిని, అప్రతిబద్ధమగునపుడు విలయమునకును సాధనభూతముగ నున్నది. నాదబిందువులు రేఖాకారమునను సూక్ష్మరూపమునను ప్రపంచీకరణము నొనర్చుచున్న విధమును చిచ్ఛక్తి వికసము చేయుచున్నది. శ్రీచక్రము షట్చక్రనిరూపణము నాదము రూపరేఖావిన్యాసమున వ్యక్తమగుచుండగల విధమును నిరూపించుచున్నవి. చిచ్ఛక్తినుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి పృథ్వి, పృథ్వినుండి చరాచర ప్రపంచము కలుగుచున్నది. చిచ్ఛక్తి పృథ్వీతత్త్వమునందు ఆకాశతత్త్వమునందువలె వ్యక్తమగుచున్నను జీవజాలములకు పృథ్వీతత్త్వము గోచరించినట్లు ఆకాశతత్త్వము గోచరము కాకున్నది. సర్వవ్యాపకమైన చిచ్ఛక్తిని అనుభవవేద్యము చేయుటయే సకలయోగములకును సకలశాస్త్రములకును, మంత్రములకును తంత్రములకును, కావ్యములకును కళలకును ప్రయోజనము

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి

అవ్యక్తమైన శక్తిని వ్యక్తమైన ఉపాధియందున గ్రహించుటయే పురుషార్థమునకు ప్రయోజనము. అవ్యక్తమైన చిచ్ఛక్తి నాదరూపమున సక్రమోపేతముగ విశ్వస్థితికి ఆధారభూతము. విశ్వవ్యాప్తమైన నాదము కళారూపమున విశ్వస్థితికి వినియోగపడుచున్న విధము ‘కదిరా’ శక్తి వికసము చేయుచున్నది. కళారూపమైన ‘రసికా’ శక్తి శబ్దరూపమునను, శబ్దము అక్షరరూపమునను, అక్షరము పదరూపమునను, పదము అర్థరూపమునను పరిణమించు విధము బ్రహ్మాండమునందలి పిండాండమునందును గ్రాహ్యమగుచున్నది. హిందూవిజ్ఞానప్రతిపాదితమైన మంత్ర తంత్ర యోగశాస్త్రములు పిండాండమునందు శ్రీవిద్యారూపమున జీవపరమార్థమును సాధించుటకు వినియోగపడుచున్నవి

ప్రపంచపరిణామమునకు మానవదేహము బ్రహ్మాండాంతర్గతమైన పిండాండమునకు లక్ష్యముగ నున్నది. విశ్వవ్యాప్తమైన శబ్దశక్తిని యంత్రసాధనమున శబ్దరూపమున ప్రత్యక్షము చేయగలవిధమున బ్రహ్మాండవ్యాప్తమైన చైతన్యశక్తిని మంత్రరూపమున దేహమునందు ప్రత్యక్షము చేయుట మంత్రశాస్త్రమునకు ప్రయోజనము. మంత్రశాస్త్రము బీజాక్షరరూపమున చైతన్యశక్తి నావాహనము చేయుచున్నది. అక్షరమునందు మంత్రబీజాక్షరములు ప్రపంచసాధనములైన ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులకు సంచలనము కలుగజేయుచు సాధకులసంకల్పముల కావరణవిక్షేపశక్తులు కలుగజేయుచున్నవి. మంత్రబీజాక్షరములు బీజ, శక్తి, కీలకరూపమున సంకల్పితదేవతావాహనమును సాధకునిదేహమునందు చేయుచు బ్రహ్మాండశక్తులను పిండాండమునందు ప్రజ్వలింపజేయుచున్నవి. మంత్రశాస్త్రమునందు పురుషవిద్యా, శ్రీవిద్యా, కామవిద్యా

ఘోరవిద్యాదుల ఉపాసన సాధ్యము. పురుషార్థములందు ప్రధానమైన మోక్షమునకు సాధనభూతము కాని మంత్రోపాసనము ఇతర యోగవిద్యాభ్యాసములవలెనే పరిత్యాజ్యము. పురుషార్థములకు సాధనములైన అర్థకామములను ధర్మావిరుద్ధములు గాకుండుట మంత్రోపాసనమునకును యోగవిద్యాభ్యాసమునకును వలెనే పరమార్థము. మంత్రశాస్త్రమందు ధర్మయుక్తమైన అర్థకామసిద్ధికి కామేశ్వరీ రాజరాజేశ్వరీ త్రిపురసుందరీ దేవీపరమైన శ్రీవిద్యోపాసన సాధనముగ నిగమాగమములు నిరూపించుచున్నవి. శ్రీవిద్యోపాసనాంతర్గతమైన కుండలినీయోగము మంత్రసిద్ధికిని అష్టసిద్ధులకును మోక్షమునకును సాధనము కాఁగలవిధమును షట్చక్రనిరూపణము విశదము చేయుచున్నది.

కుండలినీయోగము — 'పరా వాఙ్మూలచక్రస్థా పశ్యంతీ నాభిసంస్థితా, హృదిస్థా మధ్యమా జ్ఞేయా వైఖరీ కంఠదేశగా' చైతన్యశక్తి బ్రహ్మాండాంతర్గతమైన పిండాండమునకు ఆవాహన కాఁగలవిధమును కుండలినీయోగము విశదము చేయుచున్నది. చైతన్యశక్తి వాగంశ రూపమున ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసములను కలుగఁజేయుచు పిండాండములందు శివశక్తుల సంయోగమును కలుగఁజేయుచున్నది. బ్రహ్మాండమునందు మాయాశక్తి వలెనే పిండాండమునందు మనశ్శక్తిని స్వాధీనము చేయఁగలవిధమును కుండలినీయోగము విశదము చేయుచున్నది. బ్రహ్మాండమునందు నాద బిందు కళా పరిణామములైన వర్ణమాలాక్షరములు దేహమునందును వర్ణమాలాక్షరశక్తులరూపమున అంతర్భూతములై యున్నవి. బ్రహ్మాండాంతర్గతములైన భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము పరమైన శక్తులు పిండాండమునందు దేహమునందు అక్షరరూపమున అంతర్గతములై సప్తశక్తులరూపమున ప్రతిష్ఠితములై యున్నవి. దేవీయోగశక్తి అంతిమఘట్టమున పరిస్ఫుట మగునిగమున, కుండలినీశక్తి కుండలినీప్రబోధమున పరిస్ఫుట మగునని కుండలినీయోగము బోధించుచున్నది.

మానవుఁడు దేహము కాకను జీవాధిష్ఠితమైన దేహి. మానవశరీరము విచిత్రనిర్మాణము. జీవశాస్త్రము, జంతుశాస్త్రము, శారీరకశాస్త్రము, భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, శివవిజ్ఞానమునకు దేహాంగవిజ్ఞానము వినియోగపడిన విధమును విశదము చేయుచున్నది. చైతన్యశక్తి భౌతికస్వరూపములందు స్వయంప్రకాశమును, స్వయంవ్యక్తిత్వమును బడయఁగల విధమునకు మానవదేహాంగములు ప్రమాణములు. స్థూల సూక్ష్మ కారణదేహములందు స్థాపితమైన చిచ్ఛక్తి స్వయంప్రకాశమానమైనను త్రిపురావరణబద్ధమై అప్రత్యక్షముగ నున్నది. మానవ దేహములందును, సకల పిండాండములందును బ్రహ్మాండమునందువలె చిచ్ఛక్తి పూర్ణవ్యాపకముగ కలిగియున్నది. పిండాండములందు పూర్ణవ్యాపకమును కలిగినను అప్రత్యక్షముగ నున్న చిచ్ఛక్తిని ప్యాగనము చేసికొనుట శ్రీవిద్యకును, తదంగమైన కుండలినీయోగమునకును ప్రయోజనము

కుండలినీశక్తి — బ్రహ్మదండి దేహమునందు బ్రహ్మరంధ్రము మొదలు ముడ్డిపూస (Coccyx) వఱకును వ్యాపించియున్నది. సుషుమ్నా నాడి బ్రహ్మదండినడుమగ బిసతంతురూపమున వ్యాపించియున్నది. ఇడాపింగళా నాడులు, చంద్రసూర్యనాడులు మూలాధారస్థానమునుండి బయలుదేఱి భ్రూమధ్యస్థానమునందు సుషుమ్నా నాడితో సంయోగమును పొందుచున్నవి. సుషుమ్నా నాడి శుద్ధచిచ్ఛక్తికిని, ఇడాపింగళలు చంద్రసూర్యశక్తులకును చిహ్నములు. ఇడ సుషుమ్నకు ఎడమభాగమునందును పింగళ కుడిభాగమునందును మూలాధారస్థానమునుండి బయలుదేఱి చక్రస్థానములందు సుషుమ్నను కలిసికొనుచు ఆజ్ఞాస్థానమునందు సుషుమ్నతో సంయోగమును పొందుచున్నవి. ఇడాపింగళా నాడులు సుషుమ్నానాడికి ఎడమ కుడి వైపులనుండి ప్రదక్షిణము చేయుచు చక్రస్థానములందు కలిసికొనుచున్నవి. ఈకూటస్థానములు, చక్రస్థానములు గ్రంథిస్థానములు. స్థూలదేహమునందు గ్రంథిస్థానములందు దేహమునందు వ్యాపకమై యున్న ఇడాపింగళల సంయోగస్థానములు శక్తిస్థానములై బ్రహ్మాండమునందలి శక్తుల నాకర్షించుచున్నవి. బాహ్యాభ్యంతరశక్తులు చక్రస్థానములందు యోగయుక్తములై పంచప్రాణవాహినులను దేహమునందు ప్రసరింపఁజేయుచు జీవయాత్రకు వినియోగపడుచున్నవి. ఇడాపింగళా నాడులు మూలాధారమునుండి ఆజ్ఞాస్థానమువఱకును చక్రభ్రమణమువలెనను (Spiral) సుషుమ్నకు ప్రదక్షిణము చేయుచు చక్రస్థానములందు కలిసికొనుచు ఆరోహణావరోహణములను చేయుచు ప్రాణప్రవాహమును క్షేత్రమునందు ప్రవహింపఁజేయుచున్నవి. నాగబంధమువిధమున ఇడా, పింగళా, సుషుమ్నా నాడులు సామాన్యముగ ప్రకృతిసిద్ధముగను స్వయముగను ప్రాణప్రవాహమును ప్రవహింపఁజేయుచున్నను, యోగాభ్యాసము ప్రాణప్రవాహము స్వాధీనము చేసికొని దేహద్వారములంగన, నాడీగ్రంథులందును ౭౨,౦౦౦ నాడులందును ప్రాణశక్తులను యోగిసంకల్పానుసారముగ ప్రవహింపఁజేయుచున్నది. సకలపదార్థములందును పూర్ణచైతన్యమే ముఖ్యముగ వ్యాపకమైయున్నను భూతపంచీకరణమునందు స్థూలస్వరూపములందు ఆకాశతత్త్వము క్షీణించుటయును, పృథ్వీతత్త్వము ప్రబలుటయును సంభవించుచున్నది. పంచభూతములను అనులోమ విలోమమార్గమున ప్రపంచీకరణమును బడయుచున్నవిధమును భూతములయొక్క ఉత్పత్తిస్థితిలయములను సంకోచమార్గమును తెలుపుచున్నవి. సృష్టిపరిణామమునందు ఆకాశపరమాణువు పృథ్వీపరమాణువుగ పరిణమించుచు క్షేత్రజ్ఞుని కనంతములైన క్షేత్రములు కల్పింపఁబడుచున్నవి. ఆకాశపరమాణువునందు పరిపూర్ణముగ వ్యాప్తమైయున్న చైతన్యశక్తి పృథ్వీపరమాణువునందు విక్షేపావరణములందు సంకోచించి ప్రక్షిప్తమగుచున్నది. పృథ్వ్యాపస్తేజోవాయుతత్త్వములందు అంతర్గతమై యున్న చైతన్యశక్తిని ప్రజ్వలింపఁజేసి పరమార్థమును బడయుటయే ఇతరయోగములవలెనే కుండలినీయోగమునకును పరమార్థము. చంద్రసూర్యనాడులు చక్రభ్రమణవిధమున గ్రంథిస్థానములందు




చిత్రము, ౪ అనాహతము
హృదయస్థానము వాయుతత్త్వము




చిత్రము, ౬ ఆజ్ఞాచక్రము
భ్రూమధ్యస్థానము మనస్తత్త్వము




చిత్రము, ౫ విశుద్ధము
కంఠస్థానము ఆకాశతత్త్వము



చిత్రము, ౭ సహస్రారము
శిరస్సు ఆత్మస్థానము



శ్రీ చక్రము

శ్లో॥ చతుర్భిః శ్రీకంఠైః శివయువతిభిః పంచభిరపి
ప్రభిన్నాభిః శంభోర్నవభిరపి మూలప్రకృతిభిః,
చతుశ్చత్వారింశద్వసుదళకలాశ్రత్రివలయ
త్రిరేఖాభిః సార్ధం తవ శరణకోణాః పరిణతాః

—సౌందర్యలహరి

ఓ తల్లీ! నలువురు రుద్రులచేతను, శివునికంటె వేఱయిన యేవురు శక్తులచేతను, తొమ్మిది మూలప్రకృతులచేతను, అష్టదళ, షోడశదళ, త్రివలయ రేఖలచేతను నీకు నిలయ మయిన శ్రీచక్రము నలుబదినాలుగు కోణములు గలది. శ్రీచక్రము త్రికోణాష్టకోణ దశకోణద్వయ చతుర్దశకోణము లనియెడు నయిదు శక్తిచక్రముల చేతను, బిందువు, అష్టదళము, షోడశదళము, చతురశ్రము అను నాలుగు శివచక్రములతోడను కూడి నవచక్రాత్మక మయి శివశక్త్యైక్యరూపముగా వెలయుచుండును.

శ్లో॥ సమున్మీలత్సంవిత్కమలమకరందైకరసికం
భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరమ్,
యదాలాపాదష్టాదశగుణితవిద్యాపరిణతి
ర్యదాదత్తే దోషాద్గుణమఖిలమద్భ్యః పయ ఇవ

—సౌందర్యలహరి

ఓ తల్లీ! ఎవ్వనివలన పరిశీలనలకు అష్టాదశ విద్యలుగా మాఱుచున్నవో, ఏవంటి దోషములనుండి గుణములను నీటినుండి పాలనువలె గ్రహించునో, వికసించిన జ్ఞాన మనెడి కమల మందలి మకరందమును గ్రోలి హైం కూడి యున్న యోగుల హృదయ మను మానససరస్సున నున్న యనిర్వాచ్యమహిమగల శివశివాత్మక మనెడు హంసమిథునమును నే సేవింతును.

మానవ శరీరమునం దూర్ధ్వకాయము ప్రాణ ప్రవాహమున కాధారభూతముగ నున్నది. బ్రహ్మదండియందలి సుషుమ్నానాడి ప్రాణరక్షణమునకును ప్రాణపోషణమునకును మూలాధారముగనున్నది. శరీరమునందలి గ్రంథి మర్మస్థానములందు ప్రాణప్రవాహము యథోచితముగ జరుగునపు డాయురారోగ్యములు సహజ మార్గమున నడచు చుండును. నరముల శక్తియును నాడులశక్తియును ప్రాణప్రవాహము మీఁది కాధారపడియున్నది. ప్రాణప్రవాహమున కడ్డంకులు గలిగి నపు డడ్డంకులనుతొలఁగించుటకు యోగము సాధనముగా నున్నది. పై పటమునందలి కమలస్థానములును, మర్మస్థానములును సాధకులకు ప్రాణప్రవాహమును జేయుట కభ్యాసముచేయుట కుపకరింపఁగలవు.

బ్రహ్మాండమునందు పరిపూర్ణమును నేకమునునైన చిచ్ఛక్తి క్షేత్రమునందు (పిండాండమునందు) ఖండమును భిన్నమునునైన చిచ్ఛక్తి పూర్ణప్రయోజనములను సమకూర్చుటకు పూరకత్వమును బొందవలసియున్నది. మహాశక్తి ఉపాసకులకు వారి సంకల్పమునకును, నుపాసనమునకును ననురూపమైన ఫలమును గలుగఁజేయుచున్నది. భగవద్గీతయును నీయర్థమునే బోధించుచున్నది.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః

పురుషార్థము — హిందు మత ధర్మసిద్ధాంతములకు ధర్మార్థ కామ మోక్షరూపములైన చతుర్విధ పురుషార్థములందును మోక్షము పరమార్థము. ఇతర యోగములవలె కుండలినీయోగపరమైన లయ యోగమును నీ పరమార్థమునకు వినియోగపడుచున్నది. సృష్టి పరిణామమునందు చిచ్ఛక్తి ఆకాశతత్త్వమునుండి వాయుతత్త్వమునం దును, వాయుతత్త్వమునుండి అగ్నితత్త్వమునందును, అగ్నితత్త్వము నుండి అప్తత్త్వమునందును, అప్తత్త్వమునుండి పృథ్వీతత్త్వము నందును నధోమార్గమునను వైఖరీరూపమునను వికారమును బొందు చున్నది. అధోగతిని సవికారముగ నున్న చిచ్ఛక్తికి ఊర్ధ్వగతిని నిర్వికారత్వమును సమకూర్చుట యోగము. లయయోగము పృథివ్యప్తేజోవాయుతత్త్వములను క్రమముగ ఆకాశతత్త్వమునందు లయము చేయుచు చిచ్ఛక్తిని ప్రజ్వలింపఁజేయుచున్నది. పృథ్వీతత్త్వమునందు పరిమితమై ప్రసుప్తముగ నున్న చిచ్ఛక్తి ఆకాశతత్త్వ యోగమువలన నపరిమిత మగుచున్నది. చిచ్ఛక్తి ఊర్ధ్వగమనమునందు మూఁతపడియున్న ద్వారములను తెఱచుచు శక్తిప్రవాహమున కాటంకములను తొలఁగించుచున్నది. తేజస్సు కట్టెలమంటయందును, మట్టినూనెదీపమునందును, విద్యుత్తునందును, రేడియమునందును ప్రకాశమాన మైయున్నను జడపదార్థములందుకంటె నిర్మల స్వచ్ఛ పదార్థములందు (Transparent) విశుద్ధముగను, వ్యాప్తముగను

# అనాహతము

| | నామము | స్థానము | తత్త్వము | తత్త్వ కాంతులు | దళములు | వర్ణములు | జ్ఞానేంద్రియములు | రంగు | మండలాకారము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | సహస్రారము | శిరస్సు | ఆత్మ | అనంతము | ౧౦౦౦ | ౧౦౦౦ | | | |
| ౬ | ఆజ్ఞాచక్రము | భ్రూమధ్యము | మనస్సు | ౬౪ | ౨ | హం క్షం | చిత్తము<br>మనస్సు | | బిందువు |
| ౫ | విశుద్ధము | కంఠము | ఆకాశము | ౭౨ | ౧౬ | అచ్చులు<br>(౧౬) | వినము<br>శ్రవణము<br>శ్రోత్రము | తెలుపు | చక్రము |
| ౪ | అనాహతము | హృదయము | వాయువు | ౫౪ | ౧౨ | క ఖ గ ఘ<br>ఙ చ ఛ జ<br>ఝ ఞ ట ఠ | చలనము<br>స్పర్శము<br>త్వక్కు | ధూమ్రము | షట్కోణము |
| ౩ | మణిపూరకము | నాభి | అగ్ని | ౫౨ | ౧౦ | డ ఢ ణ త<br>ద ధ<br>న ఫ | చూచుట<br>రూపము<br>చక్షువు | ఎరుపు | త్రికోణము |
| ౨ | స్వాధిష్ఠానము | లింగస్థానము | అప్పు | ౬౨ | ౬ | బ భ మ<br>య ర ల | రుచి చూచుట (?)<br>రుచి<br>జిహ్వ | తెలుపు | అర్ధచంద్రము |
| ౧ | మూలాధారము | గుదస్థానము | భూమి | ౫౬ | ౪ | వ శ ష స | ఆఘ్రాణము<br>గంధము<br>ఘ్రాణేంద్రియము | పసుపు | చతుష్కోణము |

మూలాధారాది కమలములకు సంబంధించిన విశేషాంశము లాయావిషయశీర్షికలందు ప్రచురింపబడును. సామాన్య విషయ గ్రహణము గలుగుటకై కమలముల చిత్రములను విడు ప్రచురింపబడినవి. అనాహతచక్రవ్యాఖ్యానములు విచిత్రముగ తెలుపబడినవి. కుండలినీయోగశాస్త్రపటము (౯వ చిత్రము) అనాహతచక్రపటమును (౧౦వ చిత్రము) ప్రకమ లములను ఆగమశాస్త్రానుసారముగ వివరించుచున్నవి.

అనాహతము — హృదయస్థానము బంధూకపుష్పకాంతిభరి ప్రకాశమానము. క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అనెడి ద్వాదశవర్ణయుక్తమైన ద్వాదశదళయుక్తము. షట్కోణాకారము వాయుమండలము ధూమాభముగల కర్ణికాయుతము. కర్ణికాపరిభాగమున సూర్యమండలయుతము. కర్ణికామధ్యమున విద్యుత్కోటినిభ భాసుర త్రికోణము. దాని మధ్యమున కృష్ణసారాధిరూఢమును ధూమ్రధూసరాభమును చతుర్భుజమును అంకుశహస్తమునునైన వాయుబీజము. దాని(క్రోడమున) మీదమున ద్విభుజాడును వరభయకరుడును త్రినేత్రుడును వాంవరుడైన ఈశ్వరుడు. ఈ కర్ణికయందు రక్తపద్మమున ఉన్న కనకవర్ణయును చతుర్భుజయును పాశకపాలవరాభయకరయును త్రినేత్రయును సర్వాలంకారాన్వితయును ఆర్ద్రహృదయయును కంకాళమాలాధరయునునైన కాకినీశక్తియు. మధ్యత్రికోణమునందు అర్ధచంద్రబిందురూపమస్తకుడును స్వర్ణవర్ణుడును కామోద్గమోల్లసితుడునునైన బాణలింగశివుడు. దానిక్రిందను స్థిరతరదీపకలికాకార హంసరూపియైన జీవాత్మయు. ఈ కర్ణిక క్రిందను రక్తవర్ణమును ఊర్ధ్వముఖమును గల అష్టదళపద్మమును. ఇయ్యది కల్పవృక్ష రత్నవేదీఛత్రాతపత్రాద్యలంకృతమైన మానసపూజాస్థానము. కమలస్థానమందు అకులమూలాధారమునను పరమాత్మస్వరూపమును పొందగల విధము అనాహతపూజావిధానమున ఉదాహరింపబడినది.

## అనాహతము



షట్చక్రములు

# అనాహతము

| బీజము వాహనము | దేవత వాహనము | ధాతు శక్తి | లింగ యోని | ఇతర తత్త్వ సంయోగము | గ్రంథులు | లోకములు | గుణము | అధిష్ఠాన శక్తి |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | సత్యలోకము | సత్త్వము | చంద్రుడు |
| ఓమ్ | శంభువు | హాకిని | ఇతర త్రికోణము | మహత్తు మహత్ప్రకృతి హిరణ్యగర్భుడు | రుద్రగ్రంథి | తపోలోకము | సత్త్వము | చంద్రుడు |
| హం, శ్వేతగజము | సదాశివుడు | శాకిని | త్రికోణము | శబ్దతన్మాత్ర శ్రోత్రేంద్రియము వాగింద్రియము | | జనలోకము | రజస్సు | రవి |
| యం, కృష్ణమృగము | ఈశుడు | కాకిని | బాణ త్రికోణము | స్పర్శతన్మాత్ర త్వగింద్రియము గుహ్యకర్మేంద్రియము | విష్ణుగ్రంథి | మహర్లోకము | రజస్సు | రవి |
| రం, మేషము | వృషభవాహన రుద్రుడు | లాకిని | త్రికోణము | రూపతన్మాత్ర చక్షురింద్రియము గుదకర్మేంద్రియము | | స్వర్లోకము | తమస్సు | అగ్ని |
| వం, మకరము | గరుడవాహన విష్ణువు | రాకిణి | లింగ త్రికోణము | రసతన్మాత్ర జిహ్వేంద్రియము హస్తకర్మేంద్రియము | బ్రహ్మగ్రంథి | భువర్లోకము | తమస్సు | అగ్ని |
| లం, ఐరావతము | హంసవాహన బ్రహ్మ | డాకిని | స్వయంభువు త్రికోణము | గంధతన్మాత్ర ఘ్రాణేంద్రియము పాదకర్మేంద్రియము | | భూలోకము | తమస్సు | అగ్ని |

సుషుమ్నానాడీమార్గగ అనాహతచక్రస్థిత పార్వతీసహిత శివాయై నమః. అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యో ధ్వనిః, ధ్వనే రంతర్గతం జ్యోతి ర్జ్యోతిరంతర్గతం మనః, తన్మనో విలయం యాతి తద్విష్ణోః పరమం పదమ్. కం నమః- హంసశ్శివస్సోహం హంసః ఖం నమః- హంసశ్శివస్సోహం హంసః గం నమః- హంసశ్శివస్సోహం హంసః, ఘం నమః- హంసశ్శివస్సోహం హంసః ఙం నమః- హంసశ్శివస్సోహం హంసః చం నమః- హంసశ్శివ స్సోహం హంసః. ఛం నమః - హంసశ్శివస్సోహం హంసః జం నమః- హంసశ్శివస్సోహం హంసః ఝం నమః - హంసశ్శివస్సోహం హంసః ఞం నమః - హంసశ్శివస్సోహం హంసః టం నమః-హంసశ్శివస్సోహం హంసః ఠం నమః- హంసశ్శివస్సోహం హంసః ద్వాదశదళసహిత అనాహత చక్రస్థిత పార్వతీసహిత శివాయై నమః

అనాహతచక్రము సప్తశకలములందును మధ్యస్థానమునం దుండుటవలన కుండలినీశక్తి ప్రబోధమునకు విశేషోపయోగముగ నున్నది. అనాహతమునకు క్రిందను మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక చక్రములును, పైని విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారచక్రము లును గలవు. హృదయస్థానము జీవాత్మస్థానము. జీవాత్మప్రాణశక్తులను భూలోకవిషయవాసనలకు వినియోగించునదియును, సత్యలోకారోహ ణమునకు వినియోగించునదియును అనాహతశక్తి నిర్ణయింపగలదు. అనాహతమునకుగల వితరచక్రములకును దళములు వర్ణములు గల్పింపబడినవి. పటము ౯ యందుగు శ్లోకమునందు వివరములు చూడనగును.

జ్యామునకు వినియోగపడుచున్నది ప్రణవబీజసాధనమున ఓం భూః, ఓంభువః, ఓగ్ం సువః, ఓమ్ మహః, ఓంజనః, ఓంతప, ఓగ్ం సత్యం అని సప్తకములాంతర్వ్యాప్తమైన కుండలినీశక్తి స్వాదీన మగుటకు గాయత్రీమంత్రము సులభసాధనమగ నున్నది నిగమాగమములకు, శాస్త్రములకు, మంత్రతంత్రములకు, సాంఖ్యయోగములకు, పురుషార్థవిద్యలకు ప్రయోజనము పురుషార్థము పురుషార్థమున కాత్మజ్ఞానము సాధనము గాని బాహ్యవిషయోపభోగము సాధనము గాదు హిందూమతశాస్త్రకళావిజ్ఞానమునంగు 'ఓమిత్యే కాక్షరం బ్రహ్మ, ఓమిత్యేకాక్షరం శక్తిః' పరమార్థములు

కుండలినీయోగము నగుణములైన దళములు, వర్ణములు, యంత్రములు, వాహనములు, దేవతలు, బీజాక్షరములు మొదలగు సాధనములద్వారా నిర్గుణమైన పరాశక్తి నారాధింపఁగల విధమును సప్తకములయొక్క పరిజ్ఞానము సుగమము చేయుచున్నది

శ్లో॥ శివశక్త్యర్థదా వాసం కురుతే దేవి! సర్వదా,
రోగాదింశ్చ వారే త్తస్య స్వదేహేన సిద్ధ్యతి

—అనం లా

తా॥ ఓదేవీ! శివశక్తి యెప్పుడు ఎచ్చట వాసము చేయుచున్నదో, అప్పుడా శక్తి వానిరోగాదులను వారించును అప్పుడా జీవుని స్వదేహముచేతనే సిద్ధిగలుగును

శ్లో॥ అత్రాస్తే శిశుసూర్యసోదరకలా చంద్రస్య యా షోడశీ
శుద్ధా నీరజసూక్ష్మతంతుశతధాభాగైకరూపా పరా,
విద్యుత్కోటిసమానకోమలతనూ హ్యధోముఖీ
పూర్ణానందపరంపరాతివిగళత్పీయూషధారాధరా

—షట్చక్రనిరూపణము

తా॥ ఈసహస్రదళపద్మమునందు 'అమ' అను చంద్రుని షోడశకళ యున్నది ఆకళ బాలసూర్యునితో సమానముగా ప్రకాశించునది, వికారము లేనిది గనుక నిర్మలమైనది పద్మనాళమునందలి సూక్ష్మమైన దారమును నూఱుభాగములు చేయఁగా నందలి యొకభాగమువలె సూక్ష్మమైనది శ్రేష్ఠమైనది కోటి, సర్వ నీయుక్తమూర్తులైన దుమ్మకీటకములకు కోట్లకొలది మెఱుపుతీగలవలె కోమలమయిన యాకృతి గలది నిత్యప్రకాశమానమైనది అధోముఖము గలది పూర్ణానందపరంపరనుండి యధికముగ స్రవించుచుండెడి యమృతధారను ధరించుచున్నది

శ్లో॥ ఏతస్యా మధ్యదేశే విలసతి పరమాపూర్వనిర్వాణశక్తిః
కోట్యాదిత్యప్రకాశా త్రిభువనజననీ కోటిభాగైకరూపా,
కేశాగ్రస్యాతిగుహ్యా నిరవధి విగళత్ప్రేమధారాగరా సా
సర్వేషాం జీవభూతా మునిమనసి ముదా తత్త్వబోధం వహన్తీ

తా॥ ఈ నిర్వాణకళయొక్క మధ్యప్రదేశమందు శ్రేష్ఠమై కదియు, సృష్టికి ముందే ఆవిర్భవించుటవలనఁ బనాంట ముంగుగ మొదలును లేనిదియు నగు నిర్వాణశక్తి ప్రకాశించుచున్నది అది కోటిసూర్యుల ప్రకాశమువంటి ప్రకాశముగలది మూఁడులోకముల కును తల్లి ఒక తలవెండ్రుకకొస కోటిభాగములు చేయఁగా నందొక భాగమునంత ప్రమాణము గలది మిగుల సూక్ష్మమయినది పరిమితి లేకుండ స్రవించుచుండెడి ప్రేమధారను ధరించునది, మఱియు నది యెల్లరకు జీవభూత యగుచు మునుల మనస్సులందు సంతోషముచేతను తత్త్వజ్ఞానమును కలిగించుచుండును

శ్లో॥ తస్యా మధ్యాన్తరాళే శివపద మమలం శాశ్వతం యోగిగమ్యం
నిత్యానందాభిధానం సకలసుఖమయం శుద్ధబోధస్వరూపమ్,
కేచిద్బ్రహ్మాభిధానం పద మితి సుధియో వైష్ణవం తల్లపన్తి
చిద్గం సాఖ్యావే త ద్విడా ఏకే సుకృతినో మోక్షమాత్మప్రబోధమ్

తా॥ ఆ నిర్వాణశక్తియొక్క మధ్యమున్న శూన్యమందు నిర్మలము, శాశ్వతము, యోగులకు జ్ఞానమాత్రగమ్యము నగు శివపద మున్నదని తత్త్వజ్ఞులు చెప్పుదురు అది నిత్యానందమను పేరు గలది శుద్ధమయిన జ్ఞానమే స్వరూపముగాఁ గలది ఆపదమును కొందఱు విద్వాంసులు బ్రహ్మపదముగాను, కొందఱుబుద్ధిమంతులు వైష్ణవపదముగాను, మఱికొందఱు హంసమను పేరుగల మోక్షస్వరూపముగాను, కొందఱు అనిర్వచనీయమయిన ఆత్మసాక్షాత్కారస్థానముగాను చెప్పుదురు

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః

—గీత అ, ౨

ఏకమును, పరిపూర్ణమును, నిష్క్రియమును, నిర్గుణమును, సర్వవ్యాపకమును నైన చిచ్ఛక్తి సృష్టిపరిణామమునందు కించెమును, పరిమితమును, జ్యోతిర్విహీనమును, సగుణమును, కూటస్థమును నగుచు పదార్థమున కస్తిత్వకల్పనను గలుగఁజేయుచున్నది అఖండమైనశక్తి నానావరణములంగు వికారాశ్రితములైన ఖండరూపములను గను చున్నది చరాచరాత్మకప్రపంచము అవ్యక్తము, పురుషుఁడు, చంద్రుఁడు, సూర్యుడు, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివ్యాది నానాకరణములందు భాసిల్లుచున్నది త్రివిధ నానాకరణములందును సూక్ష్మాతిసూక్ష్మమైన పరశక్తి స్థూలస్వరూపములందు పరిణామము నొందుచున్నదని మనము స్ఫుటము చేయుచున్నది శ్రీచక్ర మీభావమును రేఖాబీజాక్షరరూపమునను వ్యక్తము చేయుచున్నది అవ్యక్తమైన శక్తి నాదమాదివ్యక్తస్వరూపము బ్రహ్మాండమయమైన నాదశక్తి రేఖాబీజాక్షరరూపములను బొందినవి లందు గోచరమగుచున్న నిగమును శాస్త్రములు వివరము చేయు చున్నవి ఆకాశతత్త్వమునం దపరిమితముగా నున్న నాదశక్తి పృథ్వీతత్త్వమునందు పరిమితమగుచున్నది పరిమితమైనశక్తి ఆత్మ సాక్షాత్కారణమును దుర్లభము చేయుచున్నది పరిమితమైన శక్తి నపరి మితము చేసి సర్వవ్యాప్తము గావించుటయే సకలయోగముల

నేయునకు రాజమహేంద్రవరము రాజ్యమిచ్చెను. కాటయవేముని తరువాత నాతనిపుత్రుఁడైన కుమారగిరి రాజమహేంద్రవరమునకు రాజయ్యెను. అతనితరువాత నాతనిచెల్లెలైన అనితల్లిని, ఆమెభర్తగా నైన అల్లాడరెడ్డి శత్రురాజులను ఓడించి రాజ్యముపైఁ గూర్చుండఁ బెట్టెను. ఈమెభర్తగా నైన అల్లాడరెడ్డియు, బావగా నైన వేమారెడ్డియు, భర్త యైన వీరభద్రారెడ్డియు ఈమెతోఁగూడ రాజమహేంద్రవరరాజ్యము చేయుచున్నట్టు గానవచ్చుచున్నది. ఈమె శా. శ ౧౩౪౫ (క్రీ. శ ౧౪౨౩)వ నం దొకబ్రాహ్మణునకుఁ గలువచేరు గ్రామము దాన మిచ్చుచు నొకశిలా ప్రశాసనము వ్రాయించెను. దానివలనఁ బైసంగతులు వెల్లడి యగుచున్నవి. దానము తీసికొనిన బ్రాహ్మణుఁడు కాశ్యపభట్టుకుమారుఁడైన పరహితాచార్యుఁడు. ఇతఁడు వైద్యశాస్త్రమునందు మిక్కిలి ప్రవీణుఁడు. ఈమె అనంతర్పురము నకే దేవబ్రాహ్మణుల యగ్రహారములమీఁది పన్ను తీసివేసిన దని యీ శాసనమునందే వ్రాయఁబడియున్నది. శ్రీనాథుఁడు కాశీఖండమునందు ఈ అనితల్లిని ఇట్లు వర్ణించియున్నాఁడు —

మ. మనుకులస్థుం డగు కాటభూవరుని వేమక్ష్మాతలాధీశునం
దనఁ బాణిగ్రహణంబు చేసి ప్రియ మొప్పన్ వీరభద్రేశ్వరుం
డనితల్లి న్వనితామతల్లి నుదయాస్త్రాద్రీంద్రసీమావనీ
ఘనసామ్రాజ్య సమర్థ సుప్రతిత సాక్షాదిందిరాదేవతన్

ఈపేరునకు 'అనతల్లి', 'అన్నతల్లి' యనునామాంతరరూపములు కలవు.

**అనిపినకట్టె** — బళ్లారిజిల్లా, హొస్పేటతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩౩౩ (౧౯౩౧).

**అనిమల** — కడపజిల్లా, కమలాపురంతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩,౧౬౩ (౧౯౩౧)

**అనిమిగానిపల్లి** — చిత్తూరుజిల్లా, కుప్పంతాలూకాయందలి శిథిలగ్రామము. జనసంఖ్య ౪౨౧ (౧౯౩౧)

## అనియంకభీమదేవుఁడు

— ౧. కళింగమును పాలించిన గంగవంశపు రాజు. ఇతఁడు కామార్ణవుని కుమారుఁడు, గుండమదేవుని తండ్రి. ఈ పేరు వహించిన గంగరాజులలో నితఁడు మొదటివాఁడు. ఇతనిని గురించి మన కేమియుఁ దెలియదు.

౨. ఇతఁడు కళింగదేశాధిపతియు, గంగవంశజుఁడు నయిన అనంతవర్మచోడగంగదేవునికి చంద్రలేఖవలనఁ గలిగిన యైదుగురు తనయులలో రెండవవాఁడు. ఈ పేరు ధరించిన గంగవంశజులలో నితఁడు రెండవవాఁడు. అన్న యగు రెండవ రాజరాజానంతర మితఁడు సింహాచల మొక్కలింగమునందలి కృత్తివాస ఆలయము శాసనముల ననుసరించి యితఁడు క్రీ. శ ౧౧౯౦ యందు రాజ్యమునకు వచ్చియుండు నని మహామహోపాధ్యాయ చక్రవర్తిగారు నిర్ధారణచేసిరి. ఇతని సోదరుఁడగు రెండవరాజరాజుశాసనములు క్రీ. శ ౧౧౯౨ వఱకుఁగూడఁ గానవచ్చుచుండుటవలన ఇతఁడు తనయన్నతోపాటు రాజ్యమును రెండేండ్లు కలసి పాలించిన ట్లూహింపవలసియున్నది. ఇతఁడు త్రికళింగేశ్వరబిరుదాంచితుఁడు. శాసనములం దీతనికి అనంగభీమదేవుఁడనియు నామాంతరము కలదు. ఈతఁడు పరిపాలించుచుండినకాలమున రెండవరాజరాజదేవునిభావమఱఁది వ్యస్మేశ్వరదేవుఁడు భువనేశ్వరమున నద్భుతమైన మేఘేశ్వరాలయమును గట్టించెను. అనియంకభీమదేవు ప్రధాని గోవిందుఁడు. ఇతఁడు కాలాంతరమున చటేశ్వరమున నొకదేవాలయమును గట్టించెను. మహామహోపాధ్యాయ చక్రవర్తిగారి పరిగణనము ననుసరించి యితఁడు క్రీ. శ ౧౧౯౮ వఱకు రాజ్యమేలెను.

౩. కళింగమును బరిపాలించిన గంగవంశపురాజులలో నొకఁడు. రెండవ అనియంకభీముని పౌత్రుఁడు, మూఁడవ రాజరాజునకు ముంకుణదేవికిని జనియించినవాఁడు. ఇతఁడు ముప్పదినాలుగుసంవత్సరములు రాజ్య మేలినట్లు గాంగశాసనములు తెలుపుచున్నవి. వీని వంశవర్షములను పరిగణించి మహామహోపాధ్యాయ చక్రవర్తిగారు ఇతఁడు శకవర్షము ౧౧౩౩ నుండి ౧౧౬౦ వఱకు పరిపాలించినట్లు నిర్ణయించిరి. ఈతని తండ్రియగు మూఁడవ రాజరాజుకాలమునుండియే కళింగోత్కలములపయి మహమ్మదీయుల దండయాత్ర లారంభమయినవి. ఈతనికాలమున నుత్కలముపయి దండెత్తివచ్చినవాఁడు బంగాళము నేలుచుండిన లాలంగవ సుల్తాను ఘియాజుద్దీన్ ఇవాజ్. ఈదండయాత్రయందు మహమ్మదీయులు జయించి రనియు, హిందువులు పరాజయము నొందిరనియు మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిరి కాని యది విశ్వసనీయముగఁ గన్పట్టదు. ఏల యన అనంగభీమదేవుని శాసనములవలన అతని ప్రధాని యయిన విష్ణు వనునతఁడు యవనుల నోడించినట్లు తెలియుచున్నది. మన పూర్వులు మహమ్మదీయులను యవను లనియుఁ బేర్కొనుచు వచ్చినందున వీరు బంగాళదేశపు మహమ్మదీయు లయి యుందు రని చరిత్రకారులు నిర్ధారణ చేసియున్నారు.

అనియంకభీమదేవుఁ డుత్తరమున మహమ్మదీయులతోఁ బోరాడుచుండినకాలమున ఓరుఁగంటి కాకతీయులు కాకతి గణపతిదేవుని నాయకత్వమునఁ దమరాజ్యమును ప్రాక్సముద్రతీరమునకును విస్తరింపఁజేసికొనుచుండిన సందర్భమున, వేంగిమండలమును జయించి, గోదావరి నుత్తరించి, కళింగముపయి దాడి వెడలిరి. కాకతిరాజ్యసమర్థుఁ డని బిరుదందిన రేచర్ల రుద్రరెడ్డి సామంతుఁడు రాజనాయకుఁడు కళింగదండయాత్రను నడపిన శూరాగ్రేసరుఁడు. కాకతి గణపతిదేవుని శాసనములం దనేక మారితఁడు కళింగమును జయించినట్లు వాకొనుచున్నవి. కాని నేల మిది తాత్కాలిక మై నిరవిజయముగ నే కాన్పించును, ఏల యన, అనతికాలమునకే అనియంకభీముని దండాగ్రేసరవల్లభుఁడును, అభినవసింహాంగని అగ్రపుత్రుఁడును అగు 'శ్రీమత్ ప్రాణఋద్యు' వేంగిమండలమును జయించినట్లు దాక్షారామ శాసనములు తెలుపుచున్నవి.

అనియంకభీమునిరాజ్యము దక్షిణమున గోదావరినుండును ప్రాకించినది. బంగాళము మహమ్మదీయుల లక్షణావతిరాజ్యము ఉత్తరపుసరిహద్దు కడపటి గాంగభూపతులలో నితఁడు మిగులఁ బరాక్రమవంతుడు. అనంతవర్మ చోడగంగు నిర్మింప నారంభించిన జగన్నాథాలయము నితఁడు పూర్తిచేయించె ననియు, భూములను గొలిపించె నని 'మాదలాపంజి' వలనఁ దెలియుచున్నది.

**అనిరుద్ధచరిత్రము** — అయిదాశ్వాసముల స్వతంత్ర కావ్యము, ౧౮ వ శతాబ్దిలోనిది. కవి కనుపర్తి అబ్బయామాత్యుఁడు. కౌండిన్యసగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు. తండ్రి రాయనమంత్రి, తల్లి నరసమాంబ, అన్న యోగానందుఁడు. కృతిపతి మంగళగిరి లక్ష్మీనృసింహస్వామి.

కథాసారము: కుండినపురాధీశ్వరుఁడైన భీష్మకుని పౌత్రుఁడు రుక్మి అనువాఁడు తన కూఁతురు రుక్మలోచనను అనిరుద్ధున కిచ్చును. శోణపురాధీశ్వరుఁడు బాణాసురుఁడు శంకరుని నృత్యమున మురజము వాయించి మెప్పించి పార్వతీపరమేశ్వరులు తనతలవాకిట కావలి యుండునట్లు పరమశివుని వరముఁ బడసెను. బాణునికూఁతురైన ఉష స్వప్నములో అనిరుద్ధుని కలయును. ఆమెచెలి, మంత్రికుంభాండుని కూఁతురు చిత్రరేఖ యనుకన్య, తన చిత్రకళానైపుణ్యమున యాదవవంశులైన యండగాండ్ర నెల్ల చిత్తరువులందు వ్రాసి, అందు ఉష గుర్తించినవానిని అనిరుద్ధుని తన దివ్యశక్తులచేఁ బోయి తెచ్చి ఉషకు సంఘటించును. ఉష గర్భము దాల్చును. అనిరుద్ధుఁడు ఉషాంతఃపురమున నున్న దెలిసి, బాణుఁడు వాని నాగకట్టె. ఈవార్త విని కృష్ణుఁడు వచ్చును. బాణునితోడను శివునితోడను కృష్ణుఁడు యుద్ధము సల్పును. బాణుని శరణాగతి, ఉషానిరుద్ధుల కల్యాణము. ఇందలి ప్రధానరసము శృంగారము.

కథాప్రశంస కథనము మనోజ్ఞము. చమత్కారమైన పద్యములు గలవు. హిందూస్థానీపదప్రయోగ వ్యాకరణక్రియము లక్షణము మున్నగునవి.

ఉదాహరణములు కొన్ని —

| | |
|---|---|
| అఖండయతి | ౧౪౫, ౧౦౬ |
| 'లిలింపచంపకీ, పలితపంచబాణరస సంజనితోరు పరిశ్రమంబలై' | ౪౧ |
| కోసము (కోఁటు అనుటకు) | ౧౧౧ |
| ధ థ ప్రాస | |
| మనుచరిత్రములోని 'నూపానఖంపచ' అనుపద్యమునకు అనుకరణము—'అధిక ప్రయత్న | ౧౧౫ |
| కొద్ది (కొలఁది అనుటకు) | ౨ ౨౧,౩ ౧౬ |

అలంకారశాస్త్రమందు అప్రయుక్త మని చెప్పఁబడిన 'గల్ల' శబ్దమిందు ప్రయుక్తము. ప్రాచీనకవులు భవభూత్యాదులు నీశ్వరుడు ప్రయోగించినారు —

| | |
|---|---|
| గల్ల | ౨౩, ౬౩, ౬౪ |
| ఇంద్రుగాగమము | ౩౦ |
| ఈఁగంగల | ౧౩౪ |
| ర, ఱ ప్రాస | ౧౪౨ |

ఈపద్యమునఁ జెప్పఁబడిన హిందూస్థానీ శబ్దములు —

| | |
|---|---|
| జతనాబుతోఁ దేటి | ౨ ౧౯ |
| నాస్తి యతి | ౩ ౨౯ |
| సన్నాన (స్నా) | ౩౪ |
| ఇంచునకు పర్యాయము | ౭౧ |
| ఇంద్రుగాగమము | ౯౨ |

ఈక్రిందివి అందమైన వృత్తములు —

| | |
|---|---|
| 'విచికిలగంధియుగ ' | ౧ ౯౯ |
| 'కళలు కొలుంబోరాములు ' | ౨ ౯౩ |

అల్పనంతో చిరంజకములు —

| | |
|---|---|
| 'ఘనసారమును సారఘనమును' | ౨ ౨౬ |

(వే వేం శా)

**అనిరుద్ధుఁడు** — ౧ కల్పాదియందు బ్రహ్మను పుట్టించుటకై నారాయణుఁ డెత్తిన యవతారము.

౨ (చం వం) యాదవకులజుఁడు. శ్రీకృష్ణుని కుమారుఁడైన ప్రద్యుమ్నునకును, రుక్మికూఁతురైన రుక్మవతికిని కుమారుఁడు. ఇతఁడు నాగాయుతబలుఁడు, మహారథుఁడు. రుక్మిరాజు పౌత్రియైన రోచన యీతనిభార్య. ఈ వివాహాకాలమందు ఘోరమైన పోరు జరిగెను. ఈమెవలన నితనికి వజ్రుఁడను పుత్రుఁడు పుట్టెను (భాగ, ౧౦ ౯౦). బాణాసురునికన్య ఉష యనునామె యీతని ద్వితీయభార్య. ఈమెనుగూర్చి యాదవులకును బాణాసురునకును పోరు జరిగెను.

**అనిర్దేశ్యము** — దక్షసంబంధియైన యొక అగ్ని పేరు.

**అనిలమధ్య** — పోడవ సంపూర్ణరాగము ౫౩ - వ మేళకర్తయగు గమనశ్రమరాగజన్యము. ఆరోహణము స రి మ ప ధ స; అవరోహణము స ని ధ ప మ గ రి స యని సంచారము కలది.

**అనిలుఁడు** — ౧ అష్టవసువులలో నొక్కఁడు. ఈ మన్వంతరమునందు వాయవ్యదిక్కునకు నధిపతి. ఈ శబ్దమునకు అనిలుఁడను రూపముగూడఁ గలదు.

౨ శ్రీకృష్ణునకు మిత్రవిందవలనఁ గలిగిన పుత్రులలో నొక్కఁడు.

**అనివారితాచార్యుఁడు** — ఇతనికి గుణదుఁ డనియుఁ బేరు కలదు. ఇతఁడు బాదామిని పాలించిన పశ్చిమచాళుక్యరాజులలో నొకఁ డగు ద్వితీయవిక్రమాదిత్యునికాలమున నుండిన విఖ్యాతుఁ డగు శిల్పి. ఇతఁడు బిజాపురముజిల్లాలోని పట్టదకల్లులో లోకేశ్వర విరూపాక్షదేవాలయమును నిర్మించెను. ఈదేవాలయనిర్మాణమునఁ జూపినపనితనమునకుఁ బ్రసన్నుఁడై విక్రమాదిత్యుఁ డితనికి సమ్మానపట్టమును, త్రిభువనాచార్యుఁ డనుబిరుదమును నొసంగి సత్కరించెను.

**అనీకుఁడు** — (చం వం) యాదవుఁడు, వసుదేవుని తమ్ముఁడు.

**అనీకెర** — చిత్తూరుజిల్లా, కుప్పంతాలూకాయందలి ఒమికాదారీగ్రామము. జనసంఖ్య ౪౮౧ (౧౯౩౧).

**అనీహుఁడు** — (సూ వం) శ్రీరామునివంశమునందుఁ బుట్టిన దేవానీకునిపుత్రుఁడు. నామాంతరము అహీనకుఁడు. పుత్రులు పారియాత్రుఁడు, సహస్రాశ్వుఁడు.

**అనుంపల్లి** — అనంతపురంజిల్లా, గుత్తితాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧౫౬౨ (౧౯౩౧).

**అనుకంపనుఁడు** — ఒక రాక్షసుఁడు. ఖరదూషణాదుల వధయు, శూర్పణఖ యవమానమును రావణునకుఁ దెలిపి సీతాపహరణమునకుఁ బ్రేరేపించినవాఁ డితఁడు.

**అనుకరణము** — ఒకరిని చూచి నేర్చుకొనుట యనుకరణ మనఁబడును. అనుకరణము ముఖ్యముగ రెండువిధములు: శబ్దానుకరణము, వ్యాపారానుకరణము. శబ్దానుకరణ మనఁగా నొకరు పలికినట్లు పలుకుట. వ్యాపారానుకరణ మనిన నొకరు చేసినట్లు చేయుట. అనుకరణము మరల స్వాభావిక మనియు, బుద్ధిపూర్వక మనియు రెండువిధములు. పిల్లవాఁడు తల్లిదండ్రులమాటలను మరలఁ జెప్పఁబోవుట స్వాభావికానుకరణము. ఇట్టిది చిలుక గోరింకలవంటి పక్షులకుఁగూడఁ గొంతవఱకుఁ గలదు. సంగీతమునందు గురువులవారి ధ్వనివలె ధ్వని చేయ యత్నించుట బుద్ధిపూర్వకము. శబ్దానుకరణమునందును, వ్యాపారానుకరణమునందును మానవజాతికి స్వాభావిక ప్రవృత్తి కలదు. బాలుఁగవనెలనుండి శిశువునకు అనుకరణప్రవృత్తి కలుగు నని డార్విన్ అను శాస్త్రజ్ఞుఁడు వ్రాసినాఁడు. ఈ స్వాభావికప్రవృత్తియే మానవునకు సకలవిద్యలు నేర్చుకొనుటకు ముదట పురికొల్పునది. పిల్లవానికిఁ జదువుచెప్పువారు ఈ స్వాభావికమైన అనుకరణప్రవృత్తిని చక్కఁగ నెఱిఁగి, దానిని క్రమముగ నుపయోగించినయెడల పిల్లవానికి శీఘ్రముగను, పరిశుద్ధముగను భాషయు విద్యలును పట్టుపడును. పరిశుద్ధమైన యుచ్చారణ చేయలేనిగురువుల యొద్ద నేర్చుకొనినపిల్లలయుచ్చారణములు మరల పరిశుద్ధములుగఁ జేయుట యొంతకష్టమో యెందఱకును విదితమే. సంగీతవిద్యయందును, వక్తృత్వకళయందును శబ్దానుకరణప్రవృత్తి యెక్కువగ నుపయోగపడును. కొందఱు ఇతరపురుషులమాటలను, పశుపక్ష్యాదికముల ధ్వనులను కూడ ననుకరించెదరు. వ్యాపారానుకరణప్రవృత్తి భరతశాస్త్రవ్యాపనమునకు మూలాధారము. నాటకమునందు రసపోషణ చేయుటకై రెండువిధములయిన అనుకరణములును గానలయలును పాత్రోచితమైన భాషయు, నటనయు నుండవలయును. గ్రంథాదులందు వచ్చు జాతీయము లన్నియు ననుకరణములే. వ్యాపారప్రవృత్తియే మానవునిస్వభావమును, ఆచరణను నిశ్చయపఱచును. మంచి సహవాసము గలవారు మంచివారగుటయు, చెడ్డసహవాసము గలవారు చెడ్డవారగుటయు సర్వసాధారణము. పైని రెండువిధములు అయిన యనుకరణములు చెప్పినప్పటికి ననన్యవిధములు లేకపోలేదు. స్వరూపానుకరణమే చిత్రవిద్య. ఆకుపటమును జూచి నిజమైన ఆకనియు, మానవునిపటముఁ జూచి నిజమైన మానవుఁ డనియు భ్రమ గలుగునట్లు చేయుటయే చిత్రకారుని యుద్దేశము.

అనుకరణప్రియత మానవులయందే కాక పశ్వాదులకుఁ గూడ నుండును. చిలుక మొదలైనవి మనము చెప్పినమాటలు మరలఁ జెప్పును. కోఁతులు మానవకృతుల ననుకరించును. కొన్ని పురుగులు శత్రువులనుండి తప్పించుకొనుటకై, తా ముండుగడ్డియొక్క రంగును గాని, మఱి బలవంతము లైనపురుగులరూపమును గాని అనుకరించును.

**అనుకులపాలెం** — తూర్పుగోదావరిజిల్లా, ఎల్లవరంతాలూకాయందలి ఒమికాదారీగ్రామము. జనసంఖ్య ౨౦౬ (౧౯౩౧).

**అనుకూరు** — విశాఖపట్టణముజిల్లా, వీరవల్లితాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౧౯౩.

**అనుక్రమణికలు** — అనఁగా విషయసూచికలు. ముఖ్యముగ పదములయొక్క విషయసూచికలకు అనుక్రమణికా నామము చెల్లుచున్నది. సంస్కృతభాషలో అనుక్రమణిక లనఁగా వేదానుక్రమణిక లనియే యర్థము. సంహితభాగములందు క్రొత్తమంత్రములు చేరకుండఁగను, ఉండినవి లోపింపకుండఁగను ఉండు నిమిత్తము అనుక్రమణిక లేర్పడినవి. వానిలో మంత్రమందలి ప్రతీకము, ఋషి, దేవత, ఛందస్సు మొదలగువానిపేళ్లు, మంత్రసంఖ్య చెప్పఁబడును.

వేదములయొక్క వేఱువేఱుశాఖలకు వేఱువేఱు అనుక్రమణిక లేర్పఱుపఁబడినవి. సాయణాచార్యునికాలమునందుఁ జెక్కు అనుక్రమణిక లున్నట్లు కానవచ్చుచున్నది. అప్పు డున్న యనుక్రమణిక లిప్పుడు లోపించినవి. ఋగ్వేదమునకు ౭ అనుక్రమణికలు గలవు. అందు నైదు శౌనకప్రణీతములు, ఒకటి కాత్యాయనరచితము. మిగిలినదానికిఁ గర్త యెవఁడో తెలియదు.

**అనుయాయి** — ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొక్కఁడు.

**అనురాజ** (అనుజారీ) — తెనాసరి దేశము నందలి యాకారకజాతి. వీరిం దించుమించుగ ౨౦,౦౦౦ మంది యున్నారు. వీరిలో జోకజాభవారిని శంపీ లందురు. వీరు 'శంప్'ను (శంప్ అనఁగా మార్గుఁడు) బూజింతురు. దీనినిబట్టి వీరు ఈశాన్యదేశము నందలి శియాధర్మములనుండి సూర్యోపాసనను గ్రహించిరని తెలియుచున్నది. ఉత్తరమున తలతోయాఖాతు వ్యాపించియున్న సముద్రతీరమునమాత్రమే వీరు నివసించుచుందురు. దీనికి తూర్పువైపున అనుజారిలోంపె యున్నది. దీనిమంచియే వీరి కనుజారీ లను పేరు వచ్చినది. 'అనురాజ' యనుపదము 'అనుజారీ' కి అపభ్రంశమై యుండవచ్చును. ఖిల్‌వాయీ, శంపాయీ, మేఖురాజాయీ అని వీరికి మఱియొకడు పేర్లు కలవు.

అనురాజీలను రాజు లేదు. నేటివరకు వీ రెవ్వరికిని లోఁబడి యుండలేదు. తమలో ఎరుకవివారోగములు ఎచ్చుఁదామని ... టని బహిష్కరించుకొందురు.

**అనురుద్ధుఁడు** — పాలీభాషలో గ్రంథములు రచియించిన బౌద్ధపండితుఁడు. ఇతఁడు కాంచీపురమున జన్మించి తనజీవితములో ప్రాముఖ్యభాగమును గాపిలిఖీపుర అచ్చటనే గడపెనని 'ధమ్మసంగహము', 'పరమార్థవినిచ్చయము' అను గ్రంథములవలనఁ దెలియుచున్నది. క్రమక్రమముగ అతఁడు 'ఎంబు వాయఁడు' పర్వతము అటుతరువాత బౌద్ధమతవ్యాపనమునకై తిరుశొన్వేలి, తంజావూరులకు పోయి యచ్చట కొంతకాల ముండెను. అటుపిమ్మట నతఁడు సింహళమునకుఁ బోయి అచ్చటి 'ఉత్తరమూలసంఘారామము' నందలి స్థవిరులలో నొక్కఁడుగఁ జేరెను. అనురుద్ధశతక మను గ్రంథము ఇతనిని 'ఉపస్థవిరు'నిగ పేర్కొనుచున్నది. కాని 'ధమ్మసంగహము' నందును, మఱియితర గ్రంథములందును ఇతఁడు 'థేర' ('స్థవిరుఁ') డనియే పేర్కొనఁబడియున్నాఁడు.

ఇతఁడు పాలీభాషలో 'అభిధమ్మత్థసంగహము', 'పరమార్థవినిచ్చయము', 'నామరూపపరిచ్ఛేదము' అను గ్రంథముల రచించెను. బౌద్ధమతమునకు సంబంధించిన 'అనురుద్ధశతకము' అను సంస్కృతగ్రంథముకూడ ఇతఁడు రచియించినదే యని చెప్పుదురు. వీనిలో 'అభిధమ్మత్థసంగహము'ను లండను 'పాలీటెక్స్టు సొసయిటీ' వారును, కలకత్తా 'బుద్ధిస్టిక్ టెక్స్టు సొసయిటీ' వారును ప్రకటించియున్నారు.

ఉత్తరమూలసంఘారామము క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దిమధ్యభాగమున ఏర్పడిన దగుటచే ఆసంఘారామమునకు సంబంధించిన అనురుద్ధుఁడుకూడ క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దియందు జీవించియుండు నని యూహింపఁదగును.

**అనుల** — ౧ సింహళదేశపు రాణియైన మహానాగుని భార్య. మహానాగుఁ డశోకచక్రవర్తికి సమకాలీనుఁ డని చెప్పుదురు. సింహళమున బౌద్ధధర్మమును వ్యాపింపఁజేయుటకు నీమె పాటుపడెను. ఈమెకు బౌద్ధమతజ్ఞాన మధికముగ నుండెను. ఈమె అఁదుబిడ్డపేరు సంఘమిత్ర. ఈమెకు బౌద్ధమతమునందుఁ గల విశేషజ్ఞానమును బట్టి సంఘమిత్ర యీమెను 'ఆచార్య' యని పిలుచుచుండెను.

౨ సింహళపతియైన చోరాంగరాజు భార్య. దురాచరణము కలది. తన పతి యగు చోరాంగుని, పుత్రుఁ డగు తిష్యుని, నలుగురు ఉపపతులను విషము పెట్టి చంపెను. ఈమె రాజ్యము చేయుచుండఁగ నీమె నుండి కుమారుఁడైన కాలకంటతిష్యుఁ డనువాఁడు తిరుగఁబడి యీమెను చంపి రాజయ్యెను (క్రీ. పూ. ౪౧).

**అనులు** — వేదకాలమందు పరుష్ణి నదీతటమున నున్న జనులకుఁ బేరు.

**అనులోమము** (అనులోమ వివాహము) — ఎక్కువజాతిపురుషులు తక్కువజాతిస్త్రీలను వివాహమాడిన నది అనులోమవివాహ మనిపించుకొనును. బ్రాహ్మణుఁడు క్షత్రియ వైశ్య శూద్రస్త్రీలను, క్షత్రియుఁడు వైశ్య శూద్రస్త్రీలను, వైశ్యుఁడు శూద్రస్త్రీని వివాహమాడిన 'అనులోమవివాహ' మగును. దీనికి విరోధశబ్దము 'ప్రతిలోమవివాహ' మనునది. తక్కువజాతిపురుషులు ఎక్కువజాతిస్త్రీలను పెండ్లి చేసికొనుట ప్రతిలోమము. హిందూ ధర్మశాస్త్రానుసారముగ ప్రతిలోమవివాహములు ఎల్లప్పుడును గర్హితములు. అనులోమవివాహములు పూర్వయుగములయందుఁ జెల్లినవి కాని కలియుగమునందు నవియును నిషిద్ధములే. ఇప్పు డమలులో నున్న ఆచారముప్రకారమును, కోర్టువారిచే నొప్పుకొనఁబడిన 'హిందూ లా' ప్రకారమును అనులోమ, ప్రతిలోమ వివాహము లన్నియు నిషిద్ధములే. ఆచారము ననుసరించి యేజాతివా రాజాతిలోనే వివాహము చేసికొనవలెను. అట్లు చేసికొనక మఱియొకజాతితో సంబంధము కలుగఁజేసికొన్నచో నా వివాహము చెల్లదు. అనఁగా వ్యవహారము కోర్టునకు వచ్చినప్పుడు, కోర్టువా రట్టివివాహ స్త్రీని దాసిగను, దానిసంతతిని దాసీపుత్రులుగను భావించెదరు.

ఇట్లు సామాన్యముగ అనులోమ, ప్రతిలోమవివాహము లిప్పుడు లేకపోయినను, ఒకవిధమైన యనులోమపద్ధతి యిప్పటికిని హిందూదేశమునం దున్నది. బంగాళదేశమునందు బ్రాహ్మణులలో కులీనులు, శ్రోత్రియులు మొదలగు భేదములు కలవు. వారిలో కులీనులు అందఱికంటె ఎక్కువవార మని చెప్పుకొనియెదరు. వీరు తమకంటెఁ దక్కువవారగు బ్రాహ్మణులయింటి ఆఁడుపిల్లలను చేసికొందురు. తమ ఆఁడుపిల్లలను వారి కియ్యరు. అట్లే మనదేశమందు మధ్వులు, లింగధారులైన ఆరాధ్యులు, తా మితరబ్రాహ్మణులకంటె ఎక్కువవార మని తలఁచి, స్మార్తబ్రాహ్మణులయింటి యాఁడుపడుచులను వివాహమాడెదరు. కాని తమ యాఁడుపడుచులను స్మార్తుల కియ్యరు. కావున

అనులోమవివాహములవలనఁ గలిగిన సంతతికి కొన్ని విశేషములు కలవు. బ్రాహ్మణునకును, శూద్రస్త్రీకిని పుట్టినవాఁడు ఏడు తరములలో బ్రాహ్మణుఁ డగును అని మనువు ౧౦-వ అధ్యాయము నందు చెప్పియున్నాఁడు[1]; అనఁగా బ్రాహ్మణునకు శూద్రయందు బుట్టిన స్త్రీ మరల బ్రాహ్మణునే వివాహము చేసి, యాఁడుఁ గనును. ఆయాఁడుది గూడ మరల బ్రాహ్మణునే పెండ్లియాడి సంతానము వడయును. ఇట్లేడుతరములవఱకును జరిగినయెడల ఏడవతరమునందుఁ బుట్టు వాఁడు బ్రాహ్మణుఁ డగును. ఇట్లే బ్రాహ్మణునకు వైశ్యస్త్రీయందుఁ బుట్టువాఁడు అంబష్ఠుఁడు. వీఁడు అయిదుతరములలో బ్రాహ్మణుఁ డగును. ఇట్లు శూద్రుఁడు బ్రాహ్మణుఁ డగును, బ్రాహ్మణుఁడు శూద్రత్వమును పొందును. ఇట్లే క్షత్రియునకు వైశ్యునకును బుట్టినవారిని గురించి యెఱుఁగునది[2].

**అనువత్సరము** — జ్యోతిశ్శాస్త్రమునుబట్టి ఐదు వత్సరములతోఁ గూడిన యుగములో నాల్గవవత్సరము అనువత్సర మనఁబడును. సావన, సౌర, చాంద్ర, నక్షత్ర మానముల ననుసరించి వత్సరము లేర్పడును. ఈ సమన్వయముచే నైదువత్సరముల యుగ మొకటి యేర్పడుచున్నది. వీనిలో మొదటిది సంవత్సరము; రెండవది పరివత్సరము; మూఁడవది ఇద్వత్సరము, నాల్గవది అనువత్సరము; ఐదవది యుగవత్సరము. అనువత్సరమున ధాన్యదానము చేసిన గొప్ప పుణ్యము లభించునట!

**అనువాదము** — నైయాయికులు వేదవాక్యములను మూఁడువిధములుగ విభజించిరి. విధివాక్యము, అర్థవాదవాక్యము, అనువాద వాక్యములు ('విధ్యర్థవాదానువాద వచనవినియోగాత్'– గౌతమ, ౨. ౧ ౬౩) విధి యనఁగా విధాయక మని ('విధిర్విధాయకః' ౨ ౧ ౬౪) గౌతమాచార్యులవారు న్యాయసూత్రము నందుఁ జెప్పినారు. ఇట్లు చేయవలసినది యని యాజ్ఞాపించునది విధి 'స్వారాజ్యకామో వాజపేయేన యజేత' (స్వర్గమును కోరు వాఁడు వాజపేయయజ్ఞమును జేయవలసినది) అనునది విధివాక్యము. విధాయకవాక్యమును స్తుతించి, లేక నిందించి, భయము గలిగించి, పూర్వచరిత వర్ణించి బోధించునట్టివాక్యము అర్థవాదవాక్య మనఁ బడును[3] 'పాపకారీ పాపో భవతి' (పాపము చేయువాఁడు పాపుఁ డైపోవును) అనునది అర్థవాదము. ఇందు వాక్య స్పష్టముగా నుండదు. విధివాక్యముచేఁ జెప్పఁబడినదానిని మరలఁ జెప్పుట అనువాద మనఁ బడును[4]. అనువాదము రెండువిధములు: శబ్దానువాదము, అర్థానువాదము. ఇదివఱకుఁ జెప్పఁబడినమాటల మరలఁ జెప్పుట శబ్దానువాదము. ఇదివఱకుఁ దెలిసినవిషయమునే మరల పర్యాయపదములతోఁ జెప్పుట అర్థానువాదము 'అనువాదే చరణానామ్' (౨ ౪ ౩) అను పాణినీయసూత్రమువిూఁద టీక వ్రాయుచుఁ గాశికాకారుఁడు 'ప్రమాణాంతరావగతస్యార్థస్య శబ్దేన సంకీర్తనమాత్ర మనువాదః' అని వ్రాసియున్నాఁడు. వేఱుప్రమాణముచే సిద్ధించినయర్థమును (సంగతిని) శబ్దముచేఁ జెప్పుటమాత్రము అనువాద మనఁబడును 'అగ్నిర్హిమస్య భేషజమ్' (అగ్ని చలికి మందు) అనునది యనువాదము ఏల? ప్రత్యక్షప్రమాణముచే నీసంగతి మన మెఱుఁగుదుము. అజ్ఞానమును ఈవాక్య మనువదించినది.

అనువాదము మరల మూఁడువిధములు భూతార్థానువాదము, స్తుత్యర్థానువాదము, గుణానువాదము 'స వేద సౌమ్యేద మగ్ర ఆసీత్' (ఓ సౌమ్యా! మొదట సత్తే యుండెను) అనునది మొదటి దాని కుదాహరణము 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' (వాయువు క్షేపిష్ఠ మైన దేవతసుమా) యన్నది స్తుత్యర్థానువాదము. 'దధ్నా జుహోతి' (పెరుఁగుతో హోమము చేయుచున్నాఁడు) అనునది గుణానువాదము

వేదములను నమ్మని చార్వాకాదిపూర్వపక్షులు వేదమునందు నుండు అనువాదవాక్యములు పిష్టపేషణన్యాయమునఁ బునరుక్తములు గనుక వేదమునకు గౌరవహాని గలుగుచున్నది యని యాక్షేపించిరి. అందు లకు గౌతమాచార్యులవారు "అనువాదములు పునరుక్తములు కావు అవే శబ్దములు మరల వచ్చినను వానికి నర్థభేద ముండును. శీఘ్రతర మునందు మొదట 'గచ్ఛ' (పో) అని మరల 'గచ్ఛ, గచ్ఛ' (పో, పో) అని దానినే అనువదించినప్పటికిని రెండవతడవ నుచ్చరిం చిన 'గచ్ఛ గచ్ఛ' పదములకు శీఘ్రముగా పొమ్మని యర్థ మగు చున్నది. అట్లే వైదికము లగు అనువాదములకును విధివాక్యముల కంటె భిన్నార్థ ముండుట వలన నవి పునరుక్తములు కావు[5]" అని గౌతముఁడు చెప్పియున్నాఁడు

---

1. శూద్రాయాం బ్రాహ్మణా జ్జాతః శ్రేయసా చేత్ ప్రజాయతే, అశ్రేయా న్ శ్రేయసీం జాతిం గచ్ఛత్యా సప్తమా ద్యుగాత్ ౬౪.
శూద్రో బ్రాహ్మణతా మేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్, క్షత్రియా జ్జాత మేవం తు విద్యా ద్వైశ్యా త్తథైవ చ ౬౫
అర్థము: శూద్రస్త్రీకి బ్రాహ్మణునివలనఁ బుట్టిన స్త్రీ బ్రాహ్మణునకే మరల సంతతి గన్నయెడల ఏడవతరమున నాసంతతి శ్రేష్ఠమైన జాతిని పొందును (౬౪).

2. ఇంకను విశద మగుటకునై చూడుఁడు, మాండలీకసంపాదిత యాజ్ఞవల్క్యస్మృతి, పుట ౧౩౩

3. 'స్తుతి ర్నిందా పరకృతిః పురాకల్ప' ఇతి (అర్థవాదః)—గౌతమ, ౨ ౧. ౬౫.

4. 'విధివిహితస్యానువచన మనువాదః'– గౌ, ౨. ౧. ౬౬.

5. 'శీఘ్రతరగమనోపదేశవదభ్యాసా న్నావిశేషః'— గౌ ౨. ౧. ౬౮.

దీనినాడ వాక్యార్థములు ఇట్లు భాష్యము వ్రాసినాడు. "విపరీతమైన యర్థమును మరల నేల చెప్పవలె నన్న అధికారార్థము (చెప్పఁబోవు విషయ మిది యని తెలియుటకు), విపరీతమైనదానిని నిందించుటకుఁగాని, స్తుతించుటకుఁగాని, విధిశేషముగఁ గాని చెప్పఁబడును. విపరీతార్థమునకుఁ దరువాత వచ్చినదికూడ నమవాద మగును. లోకమునందును అనువాదము కలదు. 'వంసు వందు' అని చెప్పుట కలదు అందులకుఁ ద్వరగ వంసు మని కాని, దయచేసి వందు మని కాని (అధ్యేషణ), తిప్పక వందు మని కాని (అవధారణ) అర్థ మగుచున్నది.[1]"

పైని వర్ణింపఁబడిన మూఁడువిధము లైన వాక్యములలో విధి వాక్యములే ప్రమాణములు గాని మిగిలిన రెండువిధము లైన వాక్యములును ప్రమాణములు కా వని కొందఱు పూర్వపక్షము చేసెదరు

**అనువిందుఁడు** — ౧ విందుని తమ్ముఁడు వసుదేవుని తోఁబుట్టు వగు రాజాధిదేవికిని, ఆమె పెనిమిటి యవంతిరాజు జయసేనునకును పుట్టినవాఁడు. శ్రీకృష్ణునకు మేనత్తకుమారుఁడు భారత యుద్ధమునందు దుర్యోధనపక్షమునఁ బోరాడి అర్జునునిచేఁ జచ్చెను

౨ కేకయరాజుయొక్క ఇద్దఱు పుత్రులలో నొక్కఁడు. వీని అన్న విందుఁడు. భారతయుద్ధము నందుఁ బాండవపక్షపాతియై యుండెను

౩ ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొక్కఁడు

**అనువు** — ౧. యయాతికుమారుఁడు, శర్మిష్ఠకు బుట్టినవాఁడు. తండ్రి ముసలితనము గైకొనుటకు అనువు ఒప్పుకొనలేదు ఈకారణమున నతనిరాజ్యాధికారము పోయెను. తరువాత నతఁడు మ్లేచ్ఛరాజ్యమున కధిపతి యయ్యెను ఇతనికుమారులు చక్షు, పరోక్ష, సభానరులు.

౨ క్రథవంశమునకుఁ జెందిన కపోతరోముని కుమారుఁడు. అనువుకుమారుఁడు అంధకుఁడు.

అనువైనేయము — అయోధ్యాప్రాంతమునందలి యొక పురాతనప్రదేశము దీనిలో మనేయ మను పట్టణ మొకటి యుండెను. బుద్ధదేవుఁ డిచటనే అనోమానదిని దాటి తనవెంట వచ్చిన సేవకుల వెడ్కొను మనియు, ఇచ్చటనే యామన సన్యాసి మును గైకొనె ననియు కొందఱియభిప్రాయము. ఈప్రదేశము మైనేయ నది దగ్గఱ నుండుటచే మనువైనేయ మనుపేరు వచ్చిన దని కొంద ఱును, వేణువులతో (వెదుళ్లతో) నిండియుండుట వలనచే మనువైనేయ మనుపేరు పొందిన దని కొందఱును దలఁచుచున్నారు.

**అనుసాల్వుఁడు** — సౌభపతి యైన సాల్వుని తమ్ముఁడు. సాల్వునిఁ గృష్ణుఁడు చంపఁగా నీతఁడు కృష్ణుని కొట్టవలెనని పంత విశ్వయించెను. ధర్మరాజు అశ్వమేధము చేయుచున్నపుడు కృష్ణుఁడు కుటుంబసహితముగ హస్తినాపురమునకు రాఁగా నీతఁడు సేనాసమేతుఁడై వచ్చి హస్తినాపురపార్శ్వమున దాఁగియుండెను. ఒకనాఁడు కృష్ణుఁడును, పాండవులును అశ్వమును పరీక్షించుచున్న వారని విని యాతఁ డచ్చటికి సైన్యరీతిని తెలియకుండ వచ్చి క్షణములో నశ్వమును తీసికొని పోయెను. భీముఁడు సైన్యముతో వానిని దఱిమికొని చనియెను ప్రద్యుమ్నుఁడు, వృషకేతుఁడును వానిని బట్టి తెచ్చెద మని ప్రతిజ్ఞఁ జేసి పోయిరి ప్రద్యుమ్నుఁ డోడెను వృషకేతుఁడు సాల్వుని నోడించి, బంధించి కృష్ణునొద్దకుఁ దెచ్చెను వాఁడు కృష్ణుని శరణు చొచ్చి, అశ్వమేధమునకు సాయము చేయుటకు నంగీకరించి స్వనగరమునకుఁ బోయెను (జైమినీ మాశ్వమేధము., అ ౧౩-౧౮).

అనుష్ణ — భారతవర్షీయ నది (భార, భీష్మ, అ. ౯)

అనుహ్లాదుఁడు — హిరణ్యకశిపునకు కయాధూ యను భార్యయందుఁ బుట్టిన నల్గురుపుత్రులలో నొక్కఁడు. ఇతని భార్య సూర్మి బాష్కలుఁడు, మహిషుఁడు అనువారు పుత్రులు

అనూదరుఁడు — ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొక్కఁడు.

**అనూపగఢము** — రాజపుత్రానాలోని బికానీరుసంస్థాన మందలి యొక పట్టణము ఇందు సంస్థానాధీశ్వరుఁ డగు అనూపసింగు పేర ౧౬౮౯-వ సంవత్సరములోఁ గట్టఁబడినకోట గలదు. ఇది బికానీరు పట్టణమునకు ౧౨౫ మైళ్లదూరములో నున్నది దెబ్బదియాఱు గ్రామముల కిది ముఖ్యపట్టణము. ఇందలి జనసంఖ్య ౧,౦౧౩ అచ్చటివారిలో ముఖ్యముగా 'రాట్' జాతివారు. ఈ ప్రాంతమున నీరు తక్కువగా నున్నను గోఁతగడ్డి చక్కఁగ పెరుగును సోడా తయారు చేయుటకు కావలసిన 'సజ్జి, లాణా' అనుపేరి చెట్లు విశేషముగాఁ బెరుగును

అనూపదేశము — భారతవర్షీయదేశము. దీనిరాజధాని మాహిష్మతి ఇచ్చట సహస్రకార్తవీర్యుఁడు రాజ్యము చేయుచుండెను. పాండవులకాలమున నిచ్చట నీలరాజు రాజ్యము చేయుచుండెను. ఇతఁడు భారతయుద్ధమునందు పాండవులకై పోరాడి చచ్చెను.

**అనూపసింగు** — ౧ (౧౬౪౦-౧౬౯౦) కరణసింగు కుమారుఁడు. ఇతఁడు సింహాసన మెక్కునప్పటికి ౬ ఏండ్ల వయసు వాఁడు ౧౬౭౦-వ సంవత్సరమున ఔరంగజేబు [illegible] ఇతనిని

---

1 "విమర్శం పునర్విపరీత మనూద్యతే? అధికారార్థమ్ విపరీత మధికృత్య స్తుతిర్వా ప్రవర్త్యతే, నిందా వా, విధిశేషో వాఽభిధీయతే, విపరీతానంతరార్థోఽపి చానువాదో భవతి లోకేపి చానువాదః, పచతు పచతు భవా నిత్యభ్యాసః, క్షిప్రం పచ్యతా మితి వా, అంగ! పచ్యతా మిత్యధ్యేషణార్థమ్, పచ్యతా మేవేతి వాఽవధారణార్థమ్."

రాజ్యమునుండి పొలఁగొట్టెను. అటుపై నితఁడు అడవులలో నుండుచు దాఁగికొనుచు, ౧౮౦౮-వ సంవత్సరమున మహారావుచక్రవర్తి నాశ్రయించెను. చక్రవర్తి యితనిని మూఁడువేలగుఱ్ఱపుదళమున కధికారిగ నియమించి గౌరవించెను

౨. మధ్యఇండియాలోని ఝబువా (Jhabua) సంస్థానమునకు రాజగు కుషాల్ సింగుకుమారుఁడు చిన్నతనమునకే రాజ్యమును రక్షించుటలో నితఁడు తండ్రికి విశేషముగఁ దోడుపడి తనరాజ్యము బదులు ముందే చేరెను. ౧౮౨౩-౧౮౨౪ సంవత్సరములలో ఇతఁడు రాజ్య మేలెను. ౧౮౨౪-వ సంవత్సరమున నితనిని ఎవరో కుట్రతోఁ గాల్చి చంపిరైరి శైలానారాజా తనను చేయించె నని చెప్పుకొందురు

**అనూపషహర్ తాలూకా** — యునైటెడ్ ప్రావిన్సులలోని 'బులంద్ షహర్' అను జిల్లాలో గంగయొడ్డున నున్న యొక తాలూకా. ఇందు 'అనూపషహర్, అహార్, దిబాయి' అను మూఁడుపరగణాలు గలవు. దీనివైశాల్యము ౪౪౪ చదరపుమైళ్లు. ఈ తాలూకాలో ౩౪౭ పల్లెలును, ౪ పట్టణములును గలవు. దీనిమధ్య నుండి ఉత్తరదక్షిణముగ 'ఛోయానది' పాఱుచున్నది.

ఈ తాలూకాలో జహాంగీరాబాద్, దిబాయి, అనూపషహర్ అనునవి పెద్దపట్టణములు. శిస్తున్యాయాదాయము రు ౪,౫౫,౦౦౦ లు. సెస్సురు. రు ౭౦,౦౦౦ లు

**అనూపషహర్** (పట్టణము) — ఈ అనూపషహర్ తాలూకాకు ముఖ్యపట్టణము. బులంద్ షహర్ పట్టణమున కిరువదిమైళ్ల దూరమున నున్నది. జనసంఖ్య ౯,౬౦౧ ఇది చరిత్రసంబంధమున ప్రాముఖ్యముఁ జెందిన పట్టణము. జహాంగీరు ప్రభుత్వకాలమున బర్గూజర్ రాజపుత్ర 'అనూపరాయి' అనునతఁడు తనపేరిట నీపట్టణమును నిర్మించెను. ఢిల్లీనుండి రోహిల్ ఖండు వెళ్లువా రిచ్చటనే గంగానదిని దాటవలయును. కావున నిట్టిరేవును స్వాధీనమం దుంచుకొనవలయునన్న ప్రభుత్వమువారికి పదునెనిమిదవ శతాబ్ది నీపట్టణము ముఖ్యమైయుండెను

మహారాష్ట్రులకు పరమశత్రు వయిన అహ్మద్ షా దురాణి యనువాఁడు ౧౭౫౭-వ సంవత్సరమున నీ పట్టణమును స్కంధావారము (Contonment) గా నేర్పఱిచెను. తురుష్కు లందఱు నేకమై పానిపట్టుక్షేత్రమున ౧౭౬౧ లో మహారాష్ట్రుల నోడించిరి. ఆ యుద్ధప్రయత్నము లెల్ల నీపట్టణమునందే చేయఁబడెను. మహారాష్ట్రులు రోహిల్ ఖండుమీఁదికి దాడి వెడలఁగా వారిని వెడలించు నిమిత్తమై ఔధ్ నవాబుతోఁ గూడి బ్రిటిషువారు ౧౭౭౩-వ సంవత్సరమున నీ పట్టణమును దమసైన్యములకు నివాసస్థానముగా నేర్పఱిచిరి. అప్పటినుండి ౧౮౦౬ వఱకును బ్రిటిషుసైన్యము లిచ్చటనే యుండెను. అటుపిమ్మట మీరటునకు మార్పఁబడెను. ౧౮౫౭-వ సంవత్సరపు సిపాయిల తిరుగఁబాటుకాలమునందు రోహిల్ ఖండునందలి విప్లవకారు లీరేవును దాటుటకుండ 'నాటు'వా రడ్డపడిరి. పూర్వము గంగానదిమీఁద జరుగు వ్యాపారమునకు నీపట్టణము ఉత్తరపరిమితిగా నుండెను. ఈస్టుఇండియాకంపెనీవా రిచ్చట నొకగిడ్డంగిని స్థాపించి యుండిరి. ఇప్పుడు వర్తక మంతగా సాగుటలేదు. శర్కర, కలప, వెదురు వ్యాపారము మాత్రము విరివిగా సాగుచున్నది. స్వల్పముగా చుట్టుపట్లగ్రామములకుఁ గావలసిన బట్టలు, సాలువలు, జోళ్లు మొదలగునవి ఇచ్చట తయారుచేయఁబడుచున్నవి

**అనూబిస్** (Anubis) — పూర్వకాలపు ఈజిప్టుదేశీయుల దేవతలలో నొకఁడు. ఆదేశపు శిల్పములనుబట్టి యీదేవత గుంటనక్కయాకారము గలిగియుండునట్లు తెలియుచున్నది. ఈలోకమున మరణించినవారి పాపపుణ్యములు నిర్ణయించుటయు, వారి యాత్మలను పైలోకమునకుఁ గొంపోవుటయు నితనిపనియఁట !

**అనూరాధ** — మన యిరువదియేడు నక్షత్రములలో నొక నక్షత్రము. విశాఖ తరువాతిది. విశాఖవఱకు నక్షత్రములు ఉత్తరాకాశమున నగపడును. విశాఖనుండి దక్షిణాకాశమునకు మరలును. ఇక్కడ నీ నక్షత్రవీథి శాఖాంతరములఁ బట్టి దక్షిణమునకు మరలి, అటుపై యామ్యదిశనే వ్యాపించుటచేత నీ నక్షత్రము శాఖాభేదసూచకముగా వి-శాఖ యయ్యె నని బెంట్లే (Bentley) దొరగా రూహించిరి. వేదకాలములో విశాఖకు రాధ యను పే రుండెను. 'రాధో విశాఖే' అని అథర్వవేదము (౧౯ ౭) లో స్పష్టముగా గలదు. రాధ తరువాతినక్షత్రము అనూరాధ. అనూరాధ నక్షత్రములోని చుక్కలు — వృశ్చికరాశిలోని బీటా, డెల్టా, పై, రో గుర్తులు గల వని పాశ్చాత్యులు. ఛత్రాకారనక్షత్రము లని వరరుచి ప్రముఖులు, అనఁగా గొడుగువంటి యాకారము గల చుక్కలని వర్ణించినారు. ఈ చుక్కలు వృశ్చికరాశిలో పైభాగమందు, అనఁగా తేలునకు మీఁదిడెక్క లని చెప్పఁదగినచోట నున్నవి

అనూరాధకు అధిదేవత మిత్రుఁడు. దీని తరువాత జ్యేష్ఠకు అధిదేవత ఇంద్రుఁడు. ఋగ్వేదకాలమునాఁటి ఆర్యులకు వర్షాధిదేవతయైన ఇంద్రుఁడు చాల ముఖ్యమైన దైవము. సూర్యాస్తమయము కాఁగానే ఇంద్రదర్శనము — అనఁగా జ్యేష్ఠనక్షత్రము ఉదయించుటయు, ఇంద్రునకు ప్రతిస్పర్ధియైన మృగశిరరూపి వృత్రుఁడు చచ్చుట — అనఁగా అస్తమించుటయు వర్షాగమనసూచకములు. ఈ పరిస్థితి చేకూరుటకు ముందుగా అనూరాధ ఉదయించుటయు, ఆ పిమ్మట జ్యేష్ఠ ఉదయించుటయు జరుగును. కావున అనూరాధ ఉదయమైనవెంటనే వర్షలాభము కలుగు నను మాట. కృషికారుఁడు తన స్నేహితుని రాకవలె అనూరాధయుదయము సంతోషదాయకము. కావుననే అనూరాధకు మిత్రుఁడు అధిదేవత యని వేదము తెల్పుచున్నది. ఈ మిత్రునకు వృషభరాశి ప్రతిస్పర్ధి, అనఁగా మిత్రుఁ డుదయించునపుడె వృషభరాశి అస్తమించును. అనఁగా చచ్చును. కాబట్టి మిత్రుఁడు వృషభమును సంహరించు

# అనూరాధపురము



రువన్ వెలియ డగోబా



జేతవనా రామ డగోబా



ఇసురుమునియ దేవళము

ఉన్న యెడల నది యొకటి పోవునట్లు ఆ సమీకరణములలో నొకదాని నుండి మఱియొకదానిని తీసివేయవలయును.

౫-వ ఉదాహరణము —

ఈ క్రిందిసమీకరణములను విడ్చుడు —

౨ క = ౫ చ + ౧ (౧)

౨౪ — ౭ క = ౩ చ (౨)

౧-వ సమీకరణమువలన క విలువ యిట్లు వచ్చుచున్నది

$$క = \frac{౫ చ + ౧}{౨} \qquad (౩)$$

ఇట్లు వచ్చిన క యొక్క విలువ ౨-వ సమీకరణమునందు మనము భర్తీ చేసినయెడల క లోపించును.

$$౨౪ - \frac{౭}{౨}(౫ చ + ౧) = ౩ చ$$

౪౮ - ౩౫ చ - ౭ = ౬ చ

౪౧ = ౪౧ చ

చ = ౧

ఇట్లు వచ్చిన చ విలువ ౧-వ సమీకరణమందు భర్తీ చేసిన యెడల క విలువ రాగలదు —

౨ క = ౫ చ + ౧

౨ క = ౫ + ౧ = ౬

క = ౩

పైని చెప్పినమార్గములను బుద్ధిసూక్ష్మతతో అవసరముకొలది ఉపయోగించినచో అనేకవర్ణసమీకరణబీజములను (తెలియనివర్ణముల విలువలను) కనుగొనవచ్చును. ఒక్కొకసమయమందు గణితసంబంధ మైనజ్ఞానమును చక్కగ నుపయోగించినయెడల లెక్క సులభముగ వచ్చును.

౬-వ ఉదాహరణము —

ఈ క్రిందిసమీకరణమును విడ్చుడు —

౨౮ క - ౨౩ చ = ౨౨ (౧)

౬౩ క - ౫౫ చ = ౧౭ (౨)

ఇందుండి క ను తీసివేయవలయును. మనకు కొట్టివేయుపద్ధతి తెలియును. ౧-వ సమీకరణమునందలి క యొక్క గుణకసంఖ్య (Coefficient) ౨౮, ౨-వ సమీకరణమునందలి క గుణకసంఖ్య ౬౩; కావున ౧-వ సమీకరణమును ౬౩ చేతను, ౨-వ సమీకరణమును ౨౮ చేతను హెచ్చించినచో సమానగుణకములు గల క వర్ణము రెండు సమీకరణములలోను ఏర్పడును —

౧౭౬౪ క - ౧౪౪౯ చ = ౧౩౮౬ (౩)

౧౭౬౪ క - ౧౫౪౦ చ = ౪౭౬ (౪)

౩-వ సమీకరణమునుండి ౪-వ సమీకరణమును తీసివేసినచో క వర్ణము లోపించి యిట్లు వచ్చును —

౯౧ చ = ౯౧౦

$$\therefore చ = \frac{౯౧౦}{౯౧} = ౧౦$$

ఇట్లు లెక్క వచ్చినను అంకెలు పెద్దపెద్దవిగా పెరిగి లెక్క చేయుటకు కొంత చిక్కు కల్గినది. అట్లు గాక ౧-వ సమీకరణమందలి క వర్ణగుణకము ౨౮, ౨-వ సమీకరణమందలి క వర్ణగుణక సంఖ్య ౬౩, ఈ రెంటికిని అపవర్త్యము, లేక కనిష్ఠసామాన్యగుణిజము (L. C. M.) ౨౫౨. ఈ సంఖ్యను ౨౮ తో భాగించినచో ౯ వచ్చును. ౬౩ తో భాగించినచో ౪ వచ్చును. కావున ౧-వ సమీకరణమును ౯ తోను, ౨-వ సమీకరణమును ౪ తోను హెచ్చవేసిన యెడల ఈ క్రింది సమీకరణములు వచ్చును.—

౨౫౨ క - ౨౦౭ చ = ౧౯౮ (౫)

౨౫౨ క - ౨౨౦ చ = ౬౮ (౬)

౫-వ సమీకరణమునుండి ౬-వ సమీకరణమును తీసివేయగా నిట్లు వచ్చును —

౧౩ చ = ౧౩౦

∴ చ = ౧౦

దీనిని పట్టి క విలువ కనుగొనవచ్చును

౭-వ ఉదాహరణము

ఈ క్రిందిసమీకరణములను విడ్చుడు —

$$\frac{౮}{క} - \frac{౯}{చ} = ౧ \qquad (౧)$$

$$\frac{౧౦}{క} + \frac{౬}{చ} = ౭ \qquad (౨)$$

వ్యాఖ్యానము — ౧-వ సమీకరణమును ౨ చేతను, ౨-వ సమీకరణమును ౩ చేతను హెచ్చించినచో

$$\frac{౧౬}{క} - \frac{౧౮}{చ} = ౨ \qquad (౩)$$

$$\frac{౩౦}{క} + \frac{౧౮}{చ} = ౨౧ \qquad (౪)$$

(౩), (౪)-ఈ రెంటిని కలుపగా

$$\frac{౪౬}{క} = ౨౩$$

∴ ౪౬ = ౨౩ క

∴ క = ౨

౧-వ సమీకరణమునందు క విలువ భర్తీ చేయగా వచ్చునది చ = ౩.

సాధనము.— మొదటివానియొద్ద క సంఖ్యరూపాయలును, రెండవవానియొద్ద చ సంఖ్యరూపాయలును మొదట ఉన్న వని కొందము. ఇపుడు రెండవవాఁడు మొదటివానికి ౧౦౦ రూపాయలు ఇచ్చివేసినచో మొదటివానియొద్ద (క + ౧౦౦) రూపాయలును, రెండవవానియొద్ద (చ - ౧౦౦) రూపాయలును ఉండును. కావున లెక్కయొక్క మొదటిభాగము ననుసరించి, అనఁగా మొదటివాఁడు చెప్పినమాట ననుసరించి యీ క్రిందిసమీకరణ యేర్పడుచున్నది.

క + ౧౦౦ = ౨ (చ - ౧౦౦) = ౨ చ - ౨౦౦ (౧)

మొదటివాఁడు రెండవవానికి పదిరూపాయలు ఇచ్చినయెడల మొదటివానియొద్ద (క - ౧౦) రూపాయలు ఉండును. రెండవవాని యొద్ద (చ + ౧౦) రూపాయలు ఉండును కావున రెండవవాఁడు చెప్పినమాట ననుసరించి యీ క్రిందిసమీకరణ యేర్పడుచున్నది.—

చ + ౧౦ = ౬ (క - ౧౦) = ౬ క - ౬౦ (౨)

(౧), (౨) సమీకరణములయొక్క రెండుపక్షములను (Sides) అనుకూలముగా మార్చఁగా నీ క్రింది రెండుసమీకరణము లేర్పడుచున్నవి

౨ చ - క = ౩౦౦ (౩)

౬ క - చ = ౭౦ (౪)

ఇందు (౪) ను ౨ తో హెచ్చువేయఁగా.—

౧౨ క - ౨ చ = ౧౪౦ (౫)

(౩), (౫) సమీకరణములను కలుపఁగా

౧౧ క = ౪౪౦

క = ౪౦ రూపాయలు

క యొక్క విలువ (౩) లో భర్తీ చేయఁగా చ విలువ వచ్చును.—

౨ చ - ౪౦ = ౩౦౦

౨ చ = ౩౪౦

∴ చ = ౧౭౦ రూపాయలు

ఉత్తరము - మొదటివానియొద్ద రు. ౪౦-౦-౦ లును, రెండవ వానియొద్ద రు ౧౭౦-౦-౦ లును ఉండెను.

(కొ. వేం. ల.)

**అనేనుఁడు** — ౧. ఇక్ష్వాకురాజు ప్రపౌత్రుఁడు. వికుక్షిరాజాపౌత్రుఁడు. కకుత్స్థరాజాపుత్రుఁడు. ఇతని కుమారుఁడు, కాకుత్స్థుఁడు అను నామాంతరములు గల్గు పృథుమహారాజు ప్రధాత.

౨. సోమవంశజుఁడు. పురూరవుని పౌత్రుఁడు ఆయురాజుయొక్క అయిదుగురుకుమారులలో కనిష్ఠుఁడు ఇతని కుమారునిపేరు శుద్ధుఁడు.

**అనోంగోపురో** — గంజాంజిల్లా, బరంపురము తాలూకా వారికొండ జమీందారీలోని గ్రామము. జనసంఖ్య ౫౦౪ (౧౯౩౧).

**అనోమా** — ఒక చిన్నది. ఇది కపిలవస్తునగరమునకు తూర్పువైపున బయలుదేఱి గోరఖ్పూరమునకు దక్షిణ రాప్తినదిలోఁ గలసినది. ఈ దీని చాలభాగము నిర్జలముగ నున్నది. అనోమానదిగట్టు నకే శుద్ధోదనపుత్త్రుఁడు సన్న్యాసము గ్రహించెనట! కావుననే దీనికిఁ బ్రసిద్ధి కలిగినది.

**అనౌపమ్య** — బాణాసురుని భార్య

**అన్నంగి** — గుంటూరుజిల్లా, ఒంగోలుతాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౧౭౮ (౧౯౩౧).

**అన్నంపల్లి** — ౧ నెల్లూరుజిల్లా, ఉదయగిరితాలూకా యందలి ఈనాంగ్రామము జనసంఖ్య ౭౨ (౧౯౩౧).

౨. తూర్పుగోదావరిజిల్లా, అమలాపురం తాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧,౬౦౫ (౧౯౩౧).

**అన్నంపాలెం** — తూర్పుగోదావరి, ఏజెన్సీ జిల్లా, రొల్లవరంతాలూకాయందలి జమీందారీ గ్రామము జనసంఖ్య ౬౩ (౧౯౩౧)

**అన్నంపేఁట** — విశాఖపట్టణముజిల్లా, పాలకొండ తాలూకాయందలి ఈనాంగ్రామము జనసంఖ్య ౨౨౮ (౧౯౩౧)

**అన్నంబాక** — నెల్లూరుజిల్లా, గూడూరుతాలూకా యందలి ఈనాంగ్రామము జనసంఖ్య ౩౪౩ (౧౯౩౧)

**అన్నంభట్టు** — సుప్రసిద్ధుఁడైన యాంధ్రనైయాయికుఁడు. హిందూదేశమునందు నంతటను న్యాయశాస్త్ర మభ్యసింపఁగోరువా రితనితర్కసంగ్రహమును మొదట పఠియించెదరు. ఇతఁడు న్యాయ మీమాంసా వేదాంత వ్యాకరణము లనువిషయములపైని గ్రంథములను వ్రాసెను:—

(౧) న్యాయగ్రంథములు —

౧. తర్కసంగ్రహము, ౨ తర్కసంగ్రహదీపికా, ౩. తర్కభాషాతత్త్వబోధిని, ౪ ఆలోకసిద్ధాంజనము (ఇది జయదేవుని 'ఆలోక' మను తత్త్వచింతామణిటీకకు టీక), ౫. సుబుద్ధిమనోహరమ్ (ఇది రఘునాథశిరోమణియొక్క దీధితిమీఁది టీక).

(౨) మీమాంసాగ్రంథములు —

౧. రాణకోజ్జీవని (సుధాపారణ సోమేశ్వరుని రాణకమునకు టీక), ౨. తంత్రవార్తికటీకా.

అర్థము. వసబూరా, అన్నభేది, వాయువిడంగములు, మరి తెలు, గోరోచనము, సైంధవలవణము — వీనిని సమానముగ గ్రహించి పాలతో సేవనము చేసినచో స్త్రీ సుపుత్రుని పడయును.

౪. కాసీసం దధిశాకుద సింహాస్యా న్నామధుం సంయుతా।
—ఇతి చక్రదత్తః

అర్థము. అన్నభేదిని తెలగపిండిని సమముగ కలిపి తేనెతో సేవించినచో ఎక్కిళ్లు శాంతించును.

ఇట్లు కాసీసము ప్రధానముగాఁగల యోగము లనేకములు గ్రంథస్థములై గానఁబడుచున్నవి.

(గం. దూ.)

**అన్నమదేవుఁడు** — ఓరుఁగంటి రెండవ ప్రతాపరుద్రుని తమ్ముఁడు. ప్రతాపరుద్రుని తండ్రి పేరు మహాదేవుఁడు, తల్లి పేరు ఉమ్మక్క. కావున నితనితల్లిదండ్రులును వారే యని యెంచవలసియుండును. ఉమ్మక్క రుద్రమదేవికూఁతురు. ప్రతాపరుద్రుఁడు ఢిల్లీజయయాత్ర వెడలి పండ్రెండుసంవత్సరములు తిరుగకుండె ననియు, ఆకాలమున నితఁడు ఓరుఁగంటిలోఁ బరిపాలనము చేసె ననియు, తురుష్కులు రాజ్యముమీఁదికి దండెత్తి వచ్చినప్పు డితఁడు సైన్యాధిపుఁడుగ నుండి వారి ననేకపర్యాయములు లోడించె ననియు, చివరకుఁ బ్రతాపరుద్రుఁడు పట్టుబడినకాలమున నితఁడే రాజ్యము చేసె ననియు, ప్రతాపరుద్రుఁడు చెఱనుండి వెడలివచ్చిన తరువాత తాను రాజ్యము చేయనొల్లక యాతనికిఁ బట్టము గట్టె ననియు, ప్రతాపరుద్రుఁడు పరలోకగతుఁ డైనతరువాత నితఁడు తురుష్కభయంబునకై వింధ్యప్రాంతమునకు వెడలిపోయె ననియు 'ఏకశిలానగరవృత్తాంతము'¹ నందు వ్రాయఁబడినది. ప్రతాపరుద్రుఁడు చెఱలో నుండుకాలమున నితఁడు ప్రభుత్వము చేయుచుండఁగా విద్యానాథకవికృత ప్రతాపరుద్రీయము పూర్తి అయిన దఁట! అప్పుడు కవి ప్రతాపరుద్రునియొద్దకుఁ బోఁగా నాతఁడు తనయుంగర మిచ్చి యాతనిని తనతమ్మునియొద్దకుఁ బంపెనఁట! అన్నమదేవుఁ డాతనికి గొప్పబహుమాన మిచ్చుటయేగాక ఓరుఁగంటిలో గొప్పఠారకాలఁ బెట్టించి విద్యానాథుని దానికి నాచార్యునిఁ జేసెనఁట! ఈసమాచారము 'కవిచరిత్ర' యను మహారాష్ట్రగ్రంథము నందుఁ గల దని అర్వాచీనకోశకారుఁడు వ్రాసినాఁడు.² ఈఅన్నమదేవుఁడు ఓరుఁగంటినుండి వెడలిపోయి బస్తరురాజ్యమును స్థాపించెను బస్తరుసంస్థానము నైజాముకంటె స్వతంత్రప్రభుత్వము. ఇది మధ్యపరగణాలలో నున్నది. దీనికి తూర్పున మహరాజధానిలోని జయపురముజమీందారియు, దక్షిణమున గోదావరిజిల్లాలోనిభద్రాచలముతాలూకాయును అంటుకొనియున్నవి అచ్చటిరాజు లీయన్నమదేవుని తమమూలపురుషునిగాఁ జెప్పుకొనియెదరు.³ అన్నమదేవుఁడు ఓరుఁగంటినుండి బయలుదేఱినప్పు డాతనికులదేవత దంతేశ్వరీదేవి యాతని కొకఖడ్గ మిచ్చెనఁట! అది యిప్పటివఱకును ఆరాజులయొద్ద నున్నదఁట⁴ ఇతఁడు వచ్చునప్పు డాతనివెంట కొకబంటు నీళ్లు తెచ్చువాఁడు వచ్చెనఁట. వానివంశజు లిప్పుడు బస్తరుసంస్థానమున పేట్ కేల్ జమీందారీ నధిపతులుగ నున్నారు.⁵ బస్తరుసంస్థానమందు కాపాయా లను జాతివారు కలరు. వారిపూర్వులు ఓరుగంటినుండి యన్నమదేవునితో వచ్చినారఁట.⁶ అన్నమదేవుఁడు విక్రమ సంవత్ ౧౪౧౫-వ సంవత్సరమున, అనఁగా క్రీ శ ౧౩౬౦ లోఁ గాలముచేసెనఁట బస్తరు ఓరుఁగంటికి మిక్కిలిదూరముగా లేదు. ఈశాన్యమునందు రమారమి రెండువందలమైళ్లదూరమున నుండును.

ఇప్పటిబస్తరురాజులు ప్రతాపరుద్రునితమ్ముఁ డైన అన్నమదేవునివంశజులా రని చూపుటకు నాసంస్థానమందలి దంతేశ్వరీదేవాలయములో నొకశాసనము కలదు అది బస్తరురాజులపూర్వుఁ డైన దిక్పాలదేవునిచే వ్రాయింపఁబడినది అందలిసంవత్సరము విక్రమశకము ౧౭౬౦, అనఁగా క్రీ శ ౧౭౦౩ దిక్పాలదేవుఁ డన్నమదేవునుండి పదియవపురుషుఁడు. అన్నమదేవునికుమారుఁడు హమీరదేవుఁడు⁸ కాని శాసనమును ప్రకటించిన శ్రీయుత హీరాలాలుగారు రెండు రెండు అసందర్భములఁ జేసినారు. ఒకదానికి వారే సమాధానము చెప్పినారు రెండవదానికిఁ జెప్పలేదు. మొదటి యసందర్భము : ఈశాసనమునందు అన్నమదేవుఁడు చంద్రవంశజుఁ

1. ఇది వ్రాఁతప్రతి. ఇనీషలివారిచే (బహుశః కొంకణి సమాస్తాచే) వ్రాయఁబడినది. చెన్నపురి, ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో నున్నది.

2. 'అర్వాచీనకోశ' మనునది చరిత్రాత్మకకోశము మరాటీభాషలో నున్నది. కర్త రఘునాథభాస్కరగోడబోలె ఇం దున్నయంశము లన్నియు కావలి వెంకటరామస్వామిగారు ౧౮౨౯ లో కలకత్తాలోఁ బ్రకటించిన 'Dekkan Poets' అను గ్రంథమునందుఁ గూడఁ గలవు

3. Imperial Gazetteer of India, Bastur

4. Central Provinces Gazetteers, Chhattisgarh Feudatory States, p. 86

5. Ibid, p. 81.

6. Chhattisgarh, Feudatory States, 46

7. Ibid, 87.

8. Epi. Indica., vol. IX, p. 165.

‘మృదుమధుర క్రొక్కారుఁ గోయిల గతి మీఱఁ బలికినట్లు’ (౨-౭౦)

‘కాకఁ గాదనవచ్చుల గాద త్రికటు’ (౨-౭౪)

‘కరమఁ గాల్గొ ముంతముఁ జెవులు గల్పించినట్లు’ (౪-౨౫)

‘పంచటికాదమునఁ గొమ్ము మొల్చినట్లు’ (౪-౨౫)

అచ్చటచ్చటఁ గొన్ని వివిధవర్ణనలు కొంచెమునఁ గల్గియున్నవి ద్వితీయాశ్వాసమునందలి మాయాబ్రాహ్మణ - బ్రాహ్మణి (శివ, పార్వతుల) వర్ణనలు, తృతీయాశ్వాసమునందలి బోయకేటగాడివర్ణనయు, మాట అను పఠనీయములు

కవి తనకంటెఁ బూర్వకవులయొక్కయు, తనకాలమువారి యొక్కయు కావ్యములను జూచి వారికావ్యములలోని సీసపద్యముల మాదిరి, కొన్ని సీసపద్యములను రచించినట్లు కానవచ్చుచున్నది. ఈక్రిందికొన్ని యుదాహరణములను జూడుఁడు —

సీ అర్కసన్నుతమహోన్నతదివ్యనిర్మితపంచ
బాణుచే రక్షితబాణుచేత [౧-౨

సీ అపరంజి బలంగట్టు యశికుసుంబలగుట్టు
విల్లుగా విల్లుగా వెలయువతని [౨-౧౧౬

సీ మైకుమ్మరసనసాళ్యర్ణముల్ కర్ణముల్
మానవివానంబు మానసంబు. [౨-౭

సీ ధైర్యదూర్యమదిమించునస్త్రాలు కన్నులు
తపనీయవిన్యాస్త్రిఁ దొలఁ జెవులు [౩ ౧౫౬

సీ అది సుధాకరబింబ మాకో కాదో
కాదు చక్కనిచెక్కిగంబు గాని [౪-౧౧౩

(కొ. వేం. ల.)

**అన్నలూరు** — కడపజిల్లా, ప్రొద్దుటూరుతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౩౧౦ (౧౯౩౧)

**అన్నవరం** — ౧ గుంటూరుజిల్లా, తెనాలితాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౮౩౬ (౧౯౩౧)

౨ పశ్చిమగోదావరిజిల్లా, భీమవరము తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౬౬౭ (౧౯౩౧).

౩, కృష్ణజిల్లా, దివితాలూకాయందలి జమీందారీ గ్రామము జనసంఖ్య ౩౬౬ (౧౯౩౧).

౪ గుంటూరుజిల్లా, బాపట్లతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౪౬౨ (౧౯౩౧).

౫. నెల్లూరుజిల్లా, కావలితాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౭౨౩ (౧౯౩౧).

౬. కర్నూలుజిల్లా, కోయిలకుంట్ల తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౩౨ (౧౯౩౧).

౭ గుంటూరుజిల్లా, నర్సారావుపేట తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨,౦౦౮ (౧౯౩౧)

౮ నెల్లూరుజిల్లా, కావలితాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౭౪౯ (౧౯౩౧).

౯ నెల్లూరుజిల్లా, దర్శితాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౯౮ (౧౯౩౧).

౧౦ కృష్ణజిల్లా, నందిగామ తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౫౨౯ (౧౯౩౧).

౧౧. కృష్ణజిల్లా, నూజివీడుతాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౦౦౯ (౧౯౩౧)

౧౨. తూర్పుగోదావరిజిల్లా, పెద్దాపురం తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౮౪౨ (౧౯౩౧)

౧౩ తూర్పుగోదావరి, ఏజెన్సీ జిల్లా, భద్రాచలంతాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౨౮౦ (౧౯౩౧)

౧౪ విశాఖపట్టణముజిల్లా, భీమునిపట్టణముతాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧,౧౬౨ (౧౯౩౧)

౧౫ విశాఖపట్టణముజిల్లా, గొల్గొండ తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౯౭౪ (౧౯౩౧)

౧౬ విశాఖపట్టణముజిల్లా,పాల్కొండ తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౪౫౦ (౧౯౩౧).

౧౭ విశాఖపట్టణముజిల్లా, వీరఘల్లి తాలూకాయందలి జమీందారీ గ్రామము జనసంఖ్య ౩౩౦

**అన్నవరప్పాడు** — గుంటూరుజిల్లా, నర్సారావుపేట తాలూకాయందలి ఈనాంగ్రామము జనసంఖ్య ౫౨౩ (౧౯౩౧).

**అన్నవరము అగ్రహారము** — విశాఖపట్టణము జిల్లా, బొబ్బిలితాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౬౬౨ (౧౯౩౧).

**అన్నసముద్రం** — కర్నూలుజిల్లా, మార్కాపురం తాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౧,౪౧౧ (౧౯౩౧).

**అన్నా** — ఆసియాఖండమునందలి టర్కీదేశములోని రేవుపట్టణము. ఇది ఖాస్గాడ్ నదిపాయలో ‘యూఫ్రటీస్’ నదియొడ్డున నున్నది. దీనిచుట్టు ఫలవంతములైన సుక్షేత్రములుగల చిన్నచిన్న

మొదట ౧౭౪౧ వరకు నీసర్కారులను పాలించెను. ఈసర్కారుల యందలి విప్లవము నణఁచుటలో నితనికి ౧౭౩౭-౧౭౩౮ సంవత్సరములందు రాజమహేంద్రవరమునకు ప్రభువుగనుండి, యిప్పటికిని స్థానికగాథలందు కోటిపాంస్సను అనువానుమునఁ బరఁగు రుస్తుంఖాను సహాయకుఁడుగ నుండెను. అన్వరుద్దీన్ ఖానుపరిపాలనము తీవ్రతము, కాఠిన్యమునకును పేరుకెక్కినది. రుస్తుంఖానునకు మారుఁడగు మారుద్దీను తనతండ్రిని జంపి, రాజమహేంద్రవరముసర్కారునకుఁ దానే యధికారియై నిజాము ప్రభుత్వమును ధిక్కరించినపుడు అన్వరుద్దీన్ అతనిని సంహరించి యాసర్కారును దనయధీనమునకుఁ దెచ్చుకొనెను. ఆసఫ్జా తిరుగఁబాటుల నణఁచి శాంతిని నెలకొల్పుటకు ౧౭౪౩-౧౭౪౪ న కర్ణాటకముపయి దండెత్తి వెళ్లినప్పుడు అతఁడు అన్వరుద్దీన్ ఖానుశక్తిసామర్థ్యములను, రాజభక్తిని గుర్తించి హైదరాబాదుసుబా నాతని కొప్పగించి తద్వ్యవహారభారము నాతని పయి నుంచెను. ఆకాలమున నవాబు అన్వరుద్దీన్ వ్యవసాయాభివృద్ధికిఁ జాలఁ బనిచేసెను.

కర్ణాటకమునందలి యల్లరుల నణఁచి ఆసఫ్జా ఆర్కాటు సుబాకు ఖోజా అబ్దుల్లాఖానును నవాబుగ నియమించెను, కాని నియామకము జరిగిన కొలఁదికాలమునకే అతఁడు చనిపోవుటచేత ఆపదవికి ౧౭౪౪లో అన్వరుద్దీనుఖాను నియమితుఁడయ్యెను. క్రీ. శ. ౧౭౪౮లో ఆసఫ్జా కాలధర్మము నొందినపిదప సింహాసనమునకయి ముజఫరుజంగు పితూరీ లేచెను. అతఁడు చందాసాహేబు ప్రోత్సాహమున అన్వరుద్దీనుఖానుపయి దండెత్తివచ్చెను. ఉభయబలములకు అంబూరువొద్ద క్రీ. శ. ౧౭౪౯లో యుద్ధము జరగెను. ఆయుద్ధమున నితఁడు డెబ్బదిరెండుసంవత్సరములవయసున వీరమరణము నొందెను. మొదట నితనికళేబరమును ఆర్కాటుజామామసీదులో సమాధిచేసిరి, కాని యటుపిదప దానిని హైదరాబాదునకుఁ గొనిపోయి మక్కిన్ షా వలీఉల్లా మసీదుప్రక్క స్థాపితము చేసిరి. ఈతనిపరిపాలనము కడు జనరంజకమయిన దని పేరుపడినది. ఈ యన్వరుద్దీనుఖానుకుటుంబమునకు సంబంధించిన చరిత్రమును 'అన్వరు-నామా' యను పేర మీర్ ఇస్మాయిల్ ఖాన్ అబ్జది యను కవి పారసీ భాషలో రచించెను.

**అన్వష్టకము** — అష్టకముయొక్క తరువాతితిథి అన్వష్టకము. అది గౌణచాంద్ర పౌష, మాఘ ఫాల్గున అశ్వయుజమాసములయందలి కృష్ణపక్షనవమి యగును. అదినమున నాహితాగ్నులు మాతృకశ్రాద్ధమును చేయవలయును. పితృ, పితామహ, ప్రపితామహులభార్యలగు ముగ్గురుమాతలనిమిత్తము ద్విజుల భుజింపఁజేయవలయు ననియు, అది కేవలము మాతలకొరకే కావున మాతృశ్రాద్ధమను పేరఁ బరఁగుననియు దీనిని సాగ్నికుఁడే కావింపవలయు ననియు శంఖస్మృతి వచించుచున్నది. అష్టకములందువలె నన్వష్టకములందుఁ గూడ నగ్నియందు హవనము జేసి పూర్వమువలెనే మాతృపితామహీప్రపితామహ్యాదులనిమిత్తము బ్రాహ్మణభోజనము చేయింపవలయు నని విష్ణుస్మృతియందు లిఖింపఁబడియున్నది. ఇచ్చట హోమము చేయవలయు ననిమాత్రమే వ్రాసినచో నగ్నియందుఁ జేయవలె ననుయర్థము రాకపోవచ్చును. ఇటు లుండ నగ్నియందు హోమము గావింపవలయు నని వ్రాయఁబడియుండుటవలన నగ్నియందే చేయవలయును గాని విధాంతరప్రాప్తమగు విప్రనిహస్తమునందుఁ జేయ వలనుపడదు. ప్రకృతిభూతమైన శ్రాద్ధమందలి యథార్థాంతరమునకు వికృతిభూతశ్రాద్ధమందలి విశేషవిధాధారమువలన బాధ కలుగును. కరముయొక్కవలన ముఖముయొక్క బాధింపఁబడుచున్నది. లౌకికాగ్నిలోఁగూడ హోమము చేయుట గూడదు. పితృసంబంధిహోమమునకు లౌకికాగ్నియందు విధానము లే దని ముఖమునను ఇటులే శ్రాద్ధచింతామణిలోఁగూడ వ్రాయఁబడియున్నది.

**అన్వాధి** — ఒకఁడొకవస్తువును కొడుకునిద్వారాఁ గుదువపెట్టినచో వాఁడు మఱియొకనికడ కేగి యతనితో నీ వీవస్తువును ఫలానివానికి సమర్పింపు మని చెప్పుచు నతనికిఁ గుదువ యిచ్చిన యెడల నది అన్వాధి యనఁబడు నని వివాదార్ణవసేతువునందు లిఖింపఁబడియున్నది. వచనమూలకముగ నీ వీవస్తువు నతనికమునుపుగా ఇవ్వవలసిన దని మడువుచుఁ గుదువ యొందినచో నది అన్వాధి యని హలాయుధుఁడు.

**అన్వాధేయము** — స్త్రీధనము, వివాహానంతరము బంధువులవలనఁగాని భర్తకులమువారివలనఁగాని స్త్రీకి లభించుధనము.

"వివాహాత్పరతో యత్తు లబ్ధం భర్తృకులాత్ స్త్రియా,
అన్వాధేయం త దుక్తం తు లబ్ధం బంధుకులా త్తథా."

అని కాత్యాయనుఁడు వచించియున్నాఁడు.

**అన్హాల్ట్** — జర్మనీదేశమునందలి ఒకచిన్నస్వతంత్రరాజ్యము ౧౯౧౮వ సంవత్సరమునకు పూర్వము ఇది జర్మనీసామ్రాజ్యములో నొకభాగముగ నుండినది కాని ఆయేఁటనే జర్మనీదేశమున సంఘటించిన విప్లవమునకు తరువాత అన్హాల్ట్ ప్రభుత్వము ప్రజాస్వామికముగ (Republican Government) మారినది. దీనివైశాల్యము ౮౮౮ చ మైళ్లు, జనసంఖ్య ౩,౩౧,౨౫౮ పరిశ్రమలు కొన్ని అభివృద్ధిలో నున్నను ఇందలి ప్రజలకు వ్యవసాయమే ముఖ్యవృత్తి.

**అన్హిల్వాడ** — ఈ రాజ్యము ప్రస్తుతము బొంబాయి రాజధానిపరిపాలనములోఁ జేరిన గుజరాత్ రాష్ట్రమునం దుండెను. క్రీ. శ. ౭౪౬-౭౪౫ సంవత్సరప్రాంతమున చావదరాజపుత్రులలో నొకఁడగు వనరాజు దీనిని స్థాపించెను. అతఁడు ౬౦ సంవత్సరములు పాలించి చనిపోయెను. అతనిపిమ్మట అతనివంశమువారలు ఏడుమంద్రు పాలించిరి ఆఖరు అతఁడు ౯౬౧లో చనిపోయెను. పిమ్మట చాళుక్యవంశజుఁడగు మూలరాజు (౯౬౧-౯౯౬) అను నతఁడీరాజ్యమునకు ప్రభువై, రాజ్యమును కాఠియావార్, కచ్, దక్షిణగుజరాత్ దేశములలోనికి వ్యాపింపఁజేసి ప్రసిద్ధి గాంచెను. ఇతనిచే

స్థాపితమైన వంశమునకు 'సోలంకి' వంశ మని పేరు. తదనంతర కాల మిక్కడి చెండుకళాల్లులవంశము పాలించిరి. వీరు జైనమతస్థు లగుటచే సోమనాథపట్టణమందలి సోమనాథునియాలయమునుగూర్చి చాల శ్రద్ధ తీసికొనిరామిరివారలు. అప్పటిప్రభు వగు భీమదేవుని ఓడించి ౧౦౨౬ లో మహమ్మదుగజనీ దేవాలయమును పడఁగొట్టి ద్రవ్యమును కొల్లగొనెను. గజనీ వెళ్లినతరువాత తిరుగ భీమునిచే మరలఁ గట్టఁబడెను. తదనంతరమువారు ౧౧౪౩ వఱకు నీదేశమును పాలించిరి. అటుతర్వాత మాలరాజాయొక్క జ్ఞాతు లీదేశమునకు ప్రభువులై ఒకశతాబ్దికాలము పాలించిరి. వీరు వాఘేలాస్, మూర్ఖులు కూడ నధికారులై యుండుటచేత ౧౨౬౦ లో కొంకణదేశముపై దండయాత్ర నడిపిరి. ౧౨౪౨ న ఈ మాలరాజువంశ మంత రించినపిమ్మట ధోల్కాదేశస్థు లగు 'వాఘేలులు' అను సోలంకీవా రీ ప్రాంతము చేరిరి. పిదప ౧౨౯౭ లో అల్లాఉద్దీను ఖిల్జీ తఱిమి వైచెను.

**అపభరణి** — భరణీనక్షత్రమునకు అపభరణి యని నామాంతర మున్నట్లు కనబడుచున్నది. తైత్తిరీయసంహితలో భరణీ యమునకు కనబడుచున్నది, తైత్తిరీయబ్రాహ్మణములో 'యమస్యా పభరణీః అపకర్షంతి' అని యున్నది. కృత్తికతో సంవత్సర మారంభ మైనప్పుడు భరణీ ఆఖరు నక్షత్రము అయియుండెడిది. ఆఖరునక్షత్ర మగుటచేత భరణికి యముఁ డధిదేవత యని చెప్పఁబడినది. వివరములకు తిలక్ లోకమాన్యుని (Orion) గ్రంథము నందలి ౮౨-౮౩ పుటలు చూడనగును.

(గో వేం రా)

**అపర తింగణము** — తంగణదేశమును అంటియున్న భారతవర్షీయదేశము (భార, భీష్మ, అ ౯).

**అపర కాలము** — కాలదేశము నంటియున్న భారత వర్షీయదేశము. కేకయదేశమునుండి అయోధ్యకు పోయెడివారలు మొదట నీదేశము తగులుదురు (వా రా, అయో, స. ౬౮).

**అపరదక్షిణకుంతిరాష్ట్రము** — ఇంద్రప్రస్థమునకు దక్షిణమునం దున్న కుంతిరాష్ట్రమును తగిలియున్న దేశము (భార, భీష్మ, అ ౯)

**అపరదక్షిణనిషాదము** — ఇంద్రప్రస్థమునకు దక్షిణమునం దున్న మ్లేచ్ఛరాజులదేశమునకు దక్షిణమునందును, పుర మనఁ బడు గోకులదేశమున కుత్తరమునందును ఈ దేశ ముండెను (భార, సభా, అ ౩౧).

**అపరదక్షిణపాండ్యదేశము** — పాండ్యదేశమును తగిలియున్న దేశము. పాండవులకాలమున నిది ద్రవిడదేశమునకు దక్షిణమున నుండెను (భార, సభా, అ. ౩౧).

**అపరదక్షిణమత్స్యము** — ఇంద్రప్రస్థమునకు దక్షిణమున మత్స్యదేశమును తగిలియున్న దేశము (భార, సభా, అ. ౩౧).

**అపరదక్షిణ సేకము** — ఇంద్రప్రస్థమునకు దక్షిణమున నున్న యొకదేశము (భార, సభా, అ. ౩౧).

**అపరనంద** — హిమాలయముమీఁది యొకతీర్థము

**అపరపూర్వవిదేహము** — ఇంద్రప్రస్థమునకుఁ దూర్పున నున్న రెండువిదేహదేశములలో నొక్కటి. గంగదేశము నకుఁ దూర్పున నున్నది యొకవిదేహము. ఇది రెండవది. ఈరాజ్యము నకే జనకవంశజులు రాజ్యము చేయుచుండిరని కొందఱియభిప్రాయ మైయున్నది. అట్లయిన శ్రీరామునికాలమున సీత దేవితండ్రియైన జనకుఁడును, పాండవులకాలమున బహులాశ్వుఁ డను జనకుఁడును రాజ్యము చేయుచుండిరని చెప్పవలసియున్నది (భా ప్ర కో)

**అపర పూర్వసుహ్మము** — భారతవర్షీయ దేశవిశేషము (భార, భీష్మ, అ ౯).

**అపరపల్లవదేశము** — భారతవర్షీయ దేశవిశేషము (భార, భీష్మ, అ ౯).

**అపరాంతదేశము** — భారతవర్షీయ మైన యొక దేశము (భార, భీష్మ, అ ౯).

**అపరాజిత** — శాకద్వీపములోని యొకనది.

**అపరాజితపృచ్ఛ** — భువనదేవవిరచిత మయిన యొకశిల్పశాస్త్రము. హేమాద్రి తన 'దానచింతామణి' యందు 'పరిశేషఖండము'న దీని నుదాహరించినాఁడు.

**అపరాజితవాస్తుశాస్త్రము** — విశ్వకర్మకృత మని చెప్పఁబడు నొకశిల్పశాస్త్రము

**అపరాజితుఁడు** — ౧ ఏకాదశరుద్రులలో నొక్కఁడు.

౨ శ్రీకృష్ణునకును లక్షణకును పుట్టినకుమారుఁడు.

౩ ధృతరాష్ట్రుని నూర్గురుపుత్రులలో నొక్కఁడు.

**అపరార్కుఁడు** — విజ్ఞానేశ్వరునికాలమునకుఁ దాపునఁ గొంచెము తరువాతనే శిలాహారరాజు-అపరార్కుఁడు (అపరాదిత్యుఁడు) అనువాఁడు ౧౧౩౮-౧౧౫౦ సంవత్సరములనడుమ కాలమున యాజ్ఞవల్క్యస్మృతి కొక పెద్దభాష్యము రచించెను.

భగీరథునకోరథ యయొక్కయు పర్ణభక్షణముకూడ విడిచినందున నాపేరు నీకేరు వచ్చెను.

**అపర్ణి** — ఒక బ్రహ్మర్షి.

**అపలేచియను పర్వతములు** — ఉత్తర-అమెరికాదేశమందలి పర్వతమాలిక ఇది యాదేశమునకు దూర్పున నుండును ఇది ౧,౩౦౦ మైళ్లు పొడవుగ నున్నది. ఎత్తుశిఖరములు రమారమి ౭,౦౦౦ అడుగులయెత్తున నుండు దీని కనేక శాఖలును, శిఖరములును కలవు ఈ పర్వతములందు నేలబొగ్గు, మట్టినూనె విశేషముగ దొరకును

**అపవుడు** — ఒకముని కార్తవీర్యార్జునుడీతని యాశ్రమవనమును మార్యుని కాహుతిగా నొసంగెను. ఈకోపమున నపవుడు కార్తవీర్యుని వేయిచేతులును బరశురామునిచే ఖండింపబడునట్లు శపించెను.

**అపస్మారము** — దీనిని వాడుకలో కొందఱు 'కాకిచస్తు' అని చెప్పెదరు అపస్మారములో ననేకవిధములు గలవు. కొందఱి కిది చాలతీవ్రముగా వచ్చును హఠాత్తుగ స్మృతి తప్పి కాళ్లుచేతులు విలవిల కొట్టుకొని నోటినుండి చొంగపడును. మఱికొందఱు స్మృతి తప్పి తప్పనిస్థితిలో కొన్ని నిముసములుండి కాళ్లుచేతులు కొట్టుకొనకయే తెలివితెచ్చుకొందురు. ఒకానొకడు తాను చేయుపని క్షణమాత్రము నిలిపి ప్రపంచజ్ఞానమంతయు మఱచి, అంతలోనే తనపనిని తాను చూచుకొనును జ్వరాది ఇతర వ్యాధులతో సంబంధము లేక ఇతరవిధముల నారోగ్యముగ నున్నమానవుని కకస్మాత్తుగ క్షణమాత్రమో, అధిక కాలమో స్మృతి తప్పి ప్రపంచజ్ఞానము బొత్తిగ లేకుండగజేయు వ్యాధికి అపస్మార మని పేరు కాళ్లుచేతులు కొట్టుకొనినను లేకపోయినను సరే

వ్యాప్తి.— ఈవ్యాధి ప్రజలలో నెంతమంది కున్నదో సరిగా లెక్కించి చెప్పుట కింతవఱ కాధారము లేనియు లేదు గాని సామాన్యముగా నన్ని దేశములందును కూడ జనసంఖ్యలో వెయింటికి ఒకనికీ వ్యాధి యున్నదని చెప్పవచ్చును. కొన్ని దేశములలో నింతకంటె హెచ్చుగ నుండవచ్చును వంశపారంపర్యముగ కుటుంబములో లేనిదే ఈవ్యాధి సంతతికి వ్యాపించదని చెప్పుటకు నిదర్శనములు లేవు. కాని ఉన్మాదము త్రాగుడు గల కుటుంబములలో నీవ్యాధి గలవారలు ఎక్కువగా నున్నారని చెప్పవచ్చును. చిన్నతనములో బిడ్డలకు వచ్చు మూర్ఛ (దంటిబిడ్డ గుణము)కును, అపస్మారమునకును కొంత సంబంధము కానవచ్చుచున్నది అపస్మారపు తల్లుల బిడ్డలను ౫౯ మందిని గుఱించి శోధనచేయగా వందు ౩౩గురికి చిన్నతనములో దంటిబిడ్డ గుణము చూపి చనిపోయి రనియు, మిగిలిన ౨౧ మందిలో ౩ గురికి అపస్మారవ్యాధి యేర్పడిన దనియు తెలియుచున్నది.

వయస్సునుబట్టి చూడగా అపస్మారము ౧౦ నుండి ౨౦ సంవత్సరములలోపు వయస్సులో హెచ్చుగా గానవచ్చుచున్నది. అందు ౧౩ నుండి ౧౪ ఏండ్లు మిక్కిలి తఱచుగ నీవ్యాధి అంకురించుచున్నట్లు నిదర్శనములు కలవు. ఒకకుటుంబములో ఈవ్యాధి వంశపారంపర్యముగ నున్నకొలది చిన్నవయస్సునందు అంకురించు నని కొందఱియభిప్రాయము. కొందఱకు చిన్నతనమునందు దంటిబిడ్డవ్యాధి అప్పుడప్పుడు వచ్చుచు కొంతకాలమునకు అదే అపస్మారముగ పరిణమించును

## ఆంగ్లేయ వైద్యశాస్త్రము ననుసరించి

కారణము.— అపస్మారమునకు మనోవ్యాకులత, భయము మొదలగునవి కారణము లని యనేకులు సంబంధము కల్పించుటకు ప్రయత్నించిరి కాని యట్టి సంబంధము మాటికి ౩౦ మందిలో కంటె నెక్కువవారిలో కనబడదు నెత్తిమీద తగిలిన దెబ్బవలన పుఱ్ఱెఎముక లోపలికి వంగి దాని ఒత్తుడువలన అపస్మారము వచ్చునని కొందఱి యభిప్రాయము కాని యొకానొకచో నట్లున్నను సాధారణ వ్యాప్తి కిది కారణము కా దని చెప్పవచ్చును అట్టివారికి శరీరములో దేదో యొకభాగమందే ఈడ్పు సాధారణముగా గన్పట్టును ముష్టిమైథున (Masturbation) మను దురాచారమువలన అపస్మారము జనించు నని కొందఱును, అపస్మారపురోగుల కిది యొకలక్షణమే కాని అపస్మారమునకు కారణము కా దని కొందఱును చెప్పుచున్నారు

త్రాగుబోతులలో వయస్సు చెల్లినపిమ్మట అపస్మారము హెచ్చుగ కానవచ్చుచున్నది కాని యపస్మారమునకు త్రాగుడు కారణ మని నిర్ణయించుటకు వీలులేదు పైని చెప్పినట్లు త్రాగుడునకును, ఉన్మాదమునకును, అపస్మారమునకును వరుసలసంబంధ మేదో కలదు

లక్షణములనుబట్టి అపస్మారమును మూడుతరగతులుగ విభజింపవగును ౧ ఈడ్పుతోగూడిన పెద్దమూర్ఛ, ౨ ఈడ్పులేని చిన్నమూర్ఛ, ౩ ఈడ్పుతోగూడిన చిన్నమూర్ఛ

లక్షణములు — అపస్మారలక్షణములలో కొన్ని వ్యాధి పైకి కనబడుటకు పూర్వము కొన్ని గంటలలో లేక దినములలో రోగియందు కన్పట్టును, మఱికొన్ని లక్షణములు వ్యాధి బయటికి దెలియుటకు పూర్వము కొద్దినిముసములలో క్షణములలో మాత్రము కన్పట్టును ఇట్టి లక్షణములను వ్యాధియొక్క పూర్వరూప మని చెప్పవచ్చును

అపస్మారపు రోగితో నివసించువారలు రోగికి ఎప్పుడు మూర్ఛ వచ్చునో సాధారణముగా చెప్పగలరు. కొందఱు వ్యాధి బయల్పడుటకు పూర్వము కొంతకాలము దిగులుగ నుండుచు చీటికిమాటికి కోపపడుచుందురు. కొందఱు విచారగ్రస్తులుగ నుండి చనిపోవుచు తిరుగుచుందురు. మఱికొందఱు ఎన్నడును లేని యుత్సాహము గలిగియుందురు కొందఱు విచిత్రమైన స్వప్నములు చెందుదురు. కొందఱకు మూర్ఛ రాకపూర్వము అరుచి కల్గును. తలనొప్పి, తలతిరుగుట మొదలగు గుణములు కన్పట్టును.

పైని చెప్పినవి గాక మూర్ఛరాకముందు ఒకానొకరోగికి ఒక్కొక్కరీతిని సూచనలు గన్పించును. ఒకఁడు ముందునకు పరుగెత్తిపడును ఒకఁడు వెనుకవెనుకకే పరుగెత్తి పడును. మఱియొకఁడు గుండ్రముగ చుట్టుచుట్టు తిరిగి పడును. మూర్ఛ రాకపూర్వ మొకానొక రోగి యేదో పని యున్నట్టుగా ముంచుకునుండి క్రిందకు వంగి చూచి గభీలున పడిపోవుచుండె నని యొక వైద్యుఁడు వ్రాసియున్నాఁడు. కొందఱకు ఒకదెబ్బ లాగినట్లును, తిమ్మిర పట్టినట్లును మూర్ఛ రాకముందు సూచన గాన్పించును. కొందఱకు కడుపునొప్పి యొక్కటము, లేదా తల త్రిప్పుట ఇట్లే ఒక్కొక్కరోగికి ఒక్కొక్కవిధమైన సూచన యుండును. కొంద లేవిధమైన సూచనయు లేకయే అకస్మాత్తుగ పడిపోవుదురు.

మూర్ఛ — నిజమైన మూర్ఛలో మూఁడవస్థలను వైద్యులు వర్ణించియున్నారు. ౧. మూర్ఛ ఇందు శరీరమునందలి కండ లన్నియును ఒక్కపెట్టున బిగఁబట్టి స్మృతి తప్పి రోగి పడిపోవును. ఈయాదప్పు ఒకప్రక్కను రెండవప్రక్కకంటె బలముగ నుండవచ్చును. అప్పుడు తల కన్నులు ఒకప్రక్కకు తిరిగిపోవును. శరీరమంతయు కొయ్యవలె నుండు వడుకు విల్లువంపుగా వంగియు వెంగ్గలేసిన ట్లుండు ఎదురురొమ్ము కండ లన్నియు బిగిసికొనిపోవుటచే విచిత్రముగ మూలిగినట్లు రోగి ఒక పెద్దకేక వేయును. మొదట ముఖము తెల్లఁబడి వెంటనే యెఱుపెక్కి అంతలో నల్లఁబాఱి కంటిలోని పాపలు పెద్ద వగును నాడి సన్నగిల్లును. ఈపైని చెప్పిన మొదటి యవస్థ యంతయు వరినిమసములో ముగియును. పిమ్మట రెండవయవస్థ వెంటనే ప్రారంభ మగును. ఇప్పుడు కండ లన్నియుఁ దీవ్రముగా గిజగిజ కొట్టుకొనును. నాలుక పండ్లమధ్యనుండి బయలు వడును ఒకానొకప్పుడు నాలుక తెగి రక్తమువచ్చును మలమూత్రముల విసర్జన మగును. కనుగ్రుడ్లు గిరగిర తిరుగును. ఊపిరి క్రమము దప్పి యుండును. ముఖము నల్లఁబాఱును. మెడయందలి నెత్తుటికాలువ లుబ్బిపోవును. తీవ్రమైన మూర్ఛలో రోగి ఊపిరాడక చనిపోవునేమో యని భయము కలుగును. కాని అంతలోనే ఈయవస్థ మాఱి మూఁడవ యవస్థ ప్రారంభ మగును. రోగి కొంచెము తెలివి వచ్చునట్లు కాలో చేయియో త్రిప్పుకొనును. నిట్టూర్పు విడుచును. ఒకానొకఁడు తిరిగి వెంటనే నిద్రపోవును. మఱియొకఁడు పిచ్చిపట్టినట్లు కేకవేయును. ఇంకొకఁడు ప్రక్కనున్నవారితో జగడమాడును, కొట్టును, పరుగెత్తిపోవును. కాని కొంతసేపటికి నిద్రపోవును.

౧. మొదటియవస్థ అరనిముసము లోపుగను, రెండవయవస్థ ఒకటి రెండు నిముసములును, మూఁడవయవస్థ అయిదు మొదలు పదినిముసములవఱకుఁగూడ సామాన్యముగ నుండవచ్చును. మూర్ఛ విడిచినతరువాత పట్టు నిద్ర ఒకటి రెండుగంట లుండును ఒకానొకప్పుడు రోగి దినమంతయు నిద్రమత్తులో పడియుండును. మొదటి యవస్థయందు సన్నగిల్లిన నాడి రెండవయవస్థయందు దృఢమై వేగముగలది యగును. కొందఱకు మూర్ఛ విడిచినపిమ్మట తీవ్రమైన తలనొప్పి వచ్చును. మూర్ఛలో నుండఁగా శరీరముయొక్క వేడిమి ఒకటి రెండు డిగ్రీలు హెచ్చవచ్చును. వెంటవెంటనే మూర్ఛ విడిచివిడిచి వచ్చుచున్నయెడల అధికజ్వరము రావచ్చును. కొందఱకు ప్రతిసారియు వాంతి కావచ్చును. అట్టివారలకు గొంతుకలో నేదైన పదార్థము లడ్డుపడి ప్రాణాపాయము గలుగవచ్చును.

౨. ఈతప్పులేని చిన్నమూర్ఛ. ఇది ఒకక్షణము మొదలు అయిదు క్షణములవఱకు నుండు నని చెప్పవచ్చును. ఇది వచ్చినప్పుడు రోగి ముఖము ఇతరులకు విచిత్రముగ కన్పింపవచ్చును. రోగి తా నేదియో మఱచిపోయినట్లు మాటాడుచున్నవాఁ డట్లే అకస్మాత్తుగ నిలుపును. ముఖము తెల్లఁబాఱును, కంటిపాపలు పెద్ద వగును. క్షణములో నంతయు మాఱి యథాస్థితికి వచ్చును. రోగి నడచుచున్నయెడల కాళ్లు కొంచెము తడఁబడును, లేదా ఒకప్రక్కకు వంగును. కాని క్రింద పడఁడు. చేతిలోని వస్తువును జాఱవిడువఁడు. ఈచిన్నమూర్ఛ రాకపూర్వము రోగి కేమియు సూచనలు తెలియవు. తరువాతఁగూడ బుద్ధిమాంద్య ముండదు.

౩. ఈతప్పుతోఁ గూడిన చిన్నమూర్ఛ. ఇందు శరీరముయొక్క దేదోభాగము బిఱ్ఱుగ బిగిసికొనును, లేదా పట్టుకొనును. క్షణమాత్రము స్మృతి తప్పును. క్షణమాత్రము కనుగ్రుడ్లు తల యొక ప్రక్కకుఁ దిరుగును. ఈమూర్ఛ వచ్చినపుడు ఒక్కొక్కసారి క్షణమాత్రమున్నను ఒకదినములో ననేకపర్యాయములుగా వచ్చును. నిద్రలో వచ్చినపుడు బిడ్డలు పడక తడుపుదురు.

నిదానము. — అపస్మారమును గుర్తించుట సాధారణముగా కష్టము కాదు. కాని రోగిని చూడక ఇతరులు చెప్పువర్ణనను బట్టి వ్యాధి తెలిసికొనవలె ననిన కొంచెము కష్టమే. ఈ క్రింది మూఁడు ప్రశ్నలకును జవాబు తెలిసికొనినయెడల కొంతవఱకు సహకారి యగును.

౧ రోగి అకస్మాత్తుగ స్మృతి తెలియక పడెనా?

౨ రోగి నాలుక కఱచుకొనెనా?

౩ మూత్రము పడకలో తెలియకుండ పోసికొనెనా?

ఈమూఁటికి 'అవు' నని జవాబు చెప్పినయెడల అపస్మారమని నిదానము చెప్పవచ్చును. కాని 'లేదు' అని జవాబు చెప్పినయెడల వ్యాధి అపస్మారము కాదని నిశ్చయింప వీలులేదు. ఏల యన చిన్నమూర్ఛలలో పైని చెప్పిన మూఁడుప్రశ్నలకును వ్యతిరేకపు జవాబు వచ్చును ఒకానొకప్పుడు రావచ్చును కాని వ్యాధి యపస్మారము కావచ్చును కాఁబట్టి అట్టిచో నితరవిషయములను గమనించి అపస్మారనిదానమును గ్రహింపవలెను. అపస్మారమునందును, హిస్టీరియా అను మూర్ఛ (దయ్యము)యందును ఈ క్రిందివిషయములను గమనింపవలెను.

అపస్మారము

౧. రోగి తననాలుక కఱచుకొనును.

పూర్వము నిండనీయుకృత్యంబులకు జేసినా ' నని చెప్పక క్రియలను, మనోవికారములను అను విషయంబులం జెప్పి వాని మనస్సున కుత్సాహము కలుగ జేయవలెను

(గం. దూ.)

గత పదిసంవత్సరముల యూరోపు అపస్మారముయొక్క నిదానమునందుఁ గాని, చికిత్సయందుఁ గాని విస్తారము జ్ఞానాభివృద్ధి కలుగ లేదు ఇది యెంతయు శోచనీయము. చరక, సుశ్రుతాదులవిద మతలలో చెప్పిన అదే ప్రకారము ఈకాలమునఁగూడ ఈవ్యాధికి ఇద మిత్థ మని చెప్పఁదగిన చికిత్సను నిశ్చయింపఁజాలకున్నారు. కాని సామాన్యముగ అనేకులకు జీర్ణసంబంధమయిన దోషములు లేకుండఁ జేయుటచేత అపస్మారము మార మగుచున్నది మా యనుభవమున బృంగామలకాది తైలములచేత స్నానములు, నస్యములు ఉపయోగ కరములుగా నున్నవి లోపలికిచ్చుమందులలో మిందటిరకము చెంగ ల్వకోష్టు వచాచూర్ణములు గుణము నిచ్చుచున్నవి ఒక్కొకటి పది గుంజలయెత్తు మోతాదు చేర్చి కాని, విడివిడిగాఁ గాని, పదిగుంజలయెత్తు అతిమధురముచూర్ణముతోఁ గాని యిచ్చుటచేత కొంతకాలమునకు మూర్ఛలక్షణములు తగ్గుచున్నవి అనుపానముగా కూష్మాండస్వరసము గాని, ఆవునేయి చక్కెరగాని ఉపయోగింపవచ్చును పై నుదాహ రించిన పదియోగములను, నస్య, అభ్యంగములకు చిత్తముప్రయోగము లను గూర్చి హెచ్చుగ శోధన చేయఁదగియున్నది ఇవి యన్నియు ఒక్కొకరోగికి చిరకాలము వాడి చూడఁదగినవి మొత్తముమీఁద ఆంగ్లేయౌషధములకంటె దేశీయౌషధములును, దేశీయపద్ధతుల ననుస రించి చికిత్సయును మరి పథ్యములును ఎక్కువ యుపయోగకరము లని చెప్పవచ్చును

'శతశ్లోకి' యను గ్రంథమునందు అపస్మారమున కీ క్రింది యోగములు చెప్పఁబడినవి

ఆవుపాలుగా గుగ్గి పేమలను మంగిన
పిల్లి యడుగును నక్క చేదుచేత
నస్యంబు చేయించి నయమైన వెల్లుల్లి
త్రికటు వామగవిత్తు త్రిఫలమునను
నస్యంబు చేయించి నయముస్నాన మొనరించి
కల్హారయూకును చల్లగడ్డ
గోపాంగనా తెల్లగంచవస్త్రాచారు
పంచగవ్యము గుమడిపండుతోడ
పానంబు చేయించి పక్షితెక్కలు తెచ్చి
అగ్నిచేతను ధూప మమరఁజేసి
ఇన్నివిధములు చేయ మెక్కుడౌనా యప
స్మార రోగ ముడిగి చను రతోశ1 !

(కు. ల)

అపస్యాముఁడు — ఒక బ్రహ్మర్షి.

అపాండువు — ఒక బ్రహ్మర్షి

అపాంతరతముఁడు — ఒక బ్రహ్మర్షి

అపాంప్రదము — భారతవర్షము తీర్థము.

అపామియా — ౧ పడమటి ఆసియాయందలి ఓరాం టెస్ నదియొడ్డునఁ గల పట్టణము సెల్యూకస్ నికేటర్ భార్య యగు అపామా పేర నీనగరమున కీపేరు వచ్చెను తరువాత క్రీ శ 3-వ శతాబ్దిలో నిది శత్రువులచేతఁబడి నాశనము గావింపఁబడెను అటుపై నరబ్బులు దీనిని మరల నిర్మించి ఫామియా యని పేరిడిరి 'క్రూసేడ్' యుద్ధములవలన నీనగరము కొన్నితత్త్వము వహించియుండెను

౨ ఆసియామైనరునందలి ఫ్రిజియాలో నిది యొకపురాతననగరము దీనిని గట్టించినవాఁడు అంటియోకస్ సోటర్ అతనితల్లి పేరు అపామా యగుటచే నాతఁ డామెపేర నీనగరమునకు అపామియా యని పేరిడెను క్రీస్తుశకము 3-వ శతాబ్ది నుండియు నీనగరము చాల ప్రసిద్ధి గాంచి చాలకాలము ఆసియా మైనరునందలి గొప్పపట్టణములలో నొకటి యైయుండెను

**అపినైన్పర్వతములు** — ఇటలీదేశమునందు నుత్తర మునుండి దక్షిణమునకును, అచ్చటనుండి ఒక్షిణమున సిసిలీవఱకును గొలుసువలె పొడుగుగఁ బ్రసరించియున్న యొకపర్వతపంక్తి ఇది యూరోపుఖండమందలి గొప్పపర్వతములలో నొక్కటి దీనిపొడుపు రమారమి ౭౫౦ మైళ్లు ఇటలీలో నున్న యీపర్వత భాగము యొక్కయెత్తు శిఖరము 'మాంటెకోర్నో' అనునది ౧౦,౦౦౦ అడుగులయెత్తున నున్నది సిసిలీలో ఎట్నా (Etna) అను శిఖరము గలదు అది ౧౧,౦౦౦ అడుగులయెత్తున నున్నది. ఇదియు, నేపిల్సు కొద్దనున్న వెసూవియస్ అనునదియు గొప్ప యగ్నిపర్వతములు మిక్కిలి యెత్తుమీఁద నీపర్వతము వృక్షవిహీనముగను, గరుసుగను ఉండును కొంచెము మెత్తుతక్కువ ప్రదేశము వనములతో నిండి యుండును. ఈపర్వతములమీఁద ఖనిజము లంతగ లేవు. కాని గృహ ములకు ఉపయోగపడు చలువరాళ్లు మాత్రము విశేషముగ నున్నవి

అపిశలి — ప్రాచీనసంస్కృతవ్యాకరణశాస్త్రకారుఁడు, మిగులఁ బ్రసిద్ధుఁడు, పాణినికిఁ బూర్వుఁడు.

అపిశలిశిక్ష — వైదికశబ్దోచ్చారణములను గూర్చి తెలుపు గ్రంథము ఇందు అచ్చు లేవో, హల్లు లేవో, అవి యే స్థానములో ప్రత్యేక ప్రత్యేకముగ నిర్దేశింపఁబడినవి అపిశలిపండితుని యభి ప్రాయము ననుసరించి వానివ్యుత్పత్తులను వివరింపఁబడియున్నవి.

1 పద్యమంతయు తప్పులతడికగ నున్నది. ఉన్నదున్నయట్లు ప్రకటించినాము.

**అపూరిమక్** — పెరూదేశమునందలి యొక ప్రదేశము. అచ్చటి ఆండీస్ పర్వతములయందు పుట్టిన అపూరిమక్ అనునదినిబట్టి దాని కీపేరు వచ్చినది. వైశాల్యము ౮,౩౬౬ చ మైళ్లు జనసంఖ్య ౧,౬౬,౮౮౬.

**అపూలియా** — ఇటలీదేశములో నొక ప్రదేశము దీని వైశాల్యము ౮,౩౬౬ చ మైళ్లు జనసంఖ్య ౨౨,౩౭,౬౮౧.

**అపెల్లిస్** — సుప్రసిద్ధుడగు నొక గ్రీసుదేశపు చిత్రకారుడు. ఇతఁడు క్రీ పూ నాల్గవశతాబ్దిలోనివాఁడు. అపెల్లిస్ మెసిడోనియాకు వెళ్లినప్పుడు అలెగ్జాండరుచక్రవర్తితో బాగుగ పరిచయము సంపాదించుకొనెను. వీనస్ (రతీదేవి) తడిసి ముద్దయైన తనశిరోజములనుండి నీటిని పిండివేయుచు సముద్రములోనుండి బయటికి వచ్చుచున్నట్లుగ రచించినచిత్రము ఇతనిచిత్రములలో శ్రేష్ఠమైనది క్రీ పూ నాల్గవశతాబ్దిచివరిదినములలోనే అపెల్లిస్ మరణించెను.

**అపోలో** — ఇతఁడు గ్రీకుదేవత ఒలింపియన్ దేవగణములందు ప్రధానస్థానము నాక్రమించినవారిలో నితఁడు నొకఁడు. రాజకీయ, సాంఘిక, నైతిక, ధార్మికము లను గుణసర్వములఁ బెక్కింటి నితఁడు గలిగియుండెను అందువలన వానియధిష్ఠానదేవతా పదములను, అనేకనామధేయములను లభించెను ఊసెనర్ నామక పండితుఁడు గ్రీకుభాషయందలి తఱిమివేయుట యనునర్థముగల ధాతువునుండి అపోలోశబ్దము పుట్టియుండవచ్చు నని యూహించెను రాస్చెరను జర్మనువిద్వాంసుఁడు సూర్యపరమగు నర్థమును దీసెను ఈయర్థము సర్వసమ్మతమగు నంగీకారమును బడసియుండలేదు కాని యనేకపురాణములలో నితఁడు సూర్యదేవతయొక్క సంబంధముమ దెలుపు 'ఫోబస్ అపోలో' యనుపేరను వ్యవహరింపఁబడియుండెను

ఇతఁడు స్వర్గాధిపతి యగు జ్యూస్కు లెటోయందు జన్మించిన కుమారుడు జ్యూస్ సోదరియు, పత్నిపట్టపురాణియు నగు జూనో (హీరో) కామెపై నసూయ జనింప ఆమె యిటు నటు పరిభ్రమించుచు తొమ్మిది దినములపర్యంత మత్యంతకష్టము ననుభవించి తుదకు తోడేలురూపమును దాల్చి మతికొన్నితోడేళ్లసాయముతో డెలోస్ అనుద్వీపమును జేరి యచట సింథస్ శిఖరమునకు దిగువగ నున్న యొకతాటిచెట్టుక్రింద నిరువురు కవలపిల్లలను గనెను ఈయిద్దఱు బిడ్డలను నింటిక వ్యవధానముతో వేఱువేఱు ప్రదేశములందు ప్రసవించె నని కొందఱియభిప్రాయము ఆయిద్దఱిలో నొకకుఱ్ఱవాఁడు అపోలో, రెండవది ఆర్టిమిస్ నామక దివ్యకాంత ఈమె పాతివ్రత్యాధిదేవత అపోలో జన్మాంతరముఁగూడ లెటోకు జూనోబాధ తప్పినది కాదు. అందువలన నితఁడు థెమిస్ అను నొకదేవతవలనఁ బోషింపఁబడెను. థెమిస్ కూడ జ్యూస్ యొక్కభార్యలలో నొకతె; న్యాయధర్మముల కధిదేవత యైయుండెను. పుట్టినెండుట నీథెమిస్ యొక్క యాధీనమందే డెల్ఫీలోనిదేవాలయ ముండె ననియు, నా

నామెయే తరువాత అపోలోకు ప్రదానించె ననియు కొన్నిగాథలు వక్కాణించుచున్నవి. థెమిస్ యొక్క పరిపోషణ ముందుచు అపోలో అమృతము సేవించి దగిలినవెంటనే శైశవమునుండి యొక్కపెట్టున యౌవనావస్థను బొందెను అపోలో జన్మమునకుఁ బూర్వము డెలోస్ ద్వీప మస్థిరమై, సస్యవిహీనమై, తుపానుక్షేత్రసంయుతమై, జనవాసయోగ్యమైన స్థానముగ నుండి యీతఁడు పుట్టినతోడనే సుస్థిరము, జనవాసార్హము, సస్యపరిపూర్ణము నైనదిగ మారెను మాసమునందలి సప్తమదినమున నితఁ డవతరించెను దీనిని బురస్కరించుకొని యీసప్తమదినమునందును, మాసమునందలి ఇరువదవనాఁడును, పూర్ణిమ, అమావాస్యలందును ఇతనిపేర మత్సవములు జరుపఁబడుచుండును మఱియు కర్నియా, డఫ్నెఫోరియా, డెలియా, హైసింథియా, ప్యానెప్సియా, పిథియా, థర్గలియా మొదలగు పండుగలుకూడ నితనిపేరను గావింపఁబడుచున్నవి



అపోలో

ఇతఁడు దేవవాణి, వ్యాధిపీడానివారణము, యుద్ధము, ప్రకృతి, వనస్పతులు, చరాచరములు, సంగీతగానకళాదులు, కృషి మున్నగువాని కధిదేవత ఇన్నిభిన్నవిషయముల కధిదేవత యగుటవలన నే ఇతని కనేకనామధేయములును గలిగినవి

భూర్వము నిండనీయక పృత్యంబులను జేసినా' నని చెప్పక క్రియలను, మనోవికారములను అను విషయంబులం జెప్పి వాని మనస్సున ధర్మానాము కలుగజేయవలెను

(గం. మా.)

గత పదిసంవత్సరముల యీలోపల అపస్మారముయొక్క నిదానమునందుఁ గాని, చికిత్సయందుఁ గాని విస్తారము జ్ఞానాభివృద్ధి కలుగలేదు ఇది యెంతయు శోచనీయము. చరక, సుశ్రుతాదులచిన ములలో సెల్లో అదే ప్రకారము ఈకాలమునఁగూడ ఈవ్యాధి కిది మిత్ర మని చెప్పఁదగిన చికిత్సను నిశ్చయింపఁజాలకున్నారు. కాని సామాన్యముగ అనేకులకు జీర్ణసంబంధములైన దోషములు లేకుండఁ జేయుటచేత అపస్మారము దూర మగుచున్నది మా యనుభవమున బృంగామలకాది తైలములచేత స్నానములు, నస్యములు ఉపయోగకరములుగా నున్నవి లోపలి కిచ్చుమందులలో మొదటిరకము చెంగల్వకోష్టు వచాచూర్ణములు గుణము నిచ్చుచున్నవి ఒక్కొకటి పది గుంజలయెత్తు తేనెతో చేర్చిగాని, విడివిడిగాఁ గాని, పదిగుంజలయెత్తు అతిమధురముచూర్ణముతోఁ గాని యిచ్చుటచేత కొంతకాలమునకు మూర్ఛలక్షణములు తగ్గుచున్నవి అనుపానముగా కూష్మాండస్వరసము గాని, ఆవునేయి చక్కెరగాని ఉపయోగింపవచ్చును పై నుదాహరించిన పదియోగములను, నస్య, అభ్యంగములకు పిత్తము ప్రయోగములను గూర్చి హెచ్చుగ శోధన చేయఁదగియున్నది ఇవి యన్నియు ఒక్కొకరోగికి చిరకాలము వాడి చూడఁదగినవి మొత్తముమీఁద ఆంగ్లేయౌషధములకంటె దేశీయౌషధములును, దేశీయపద్ధతుల ననుసరించి చికిత్సయు మన పథ్యములును ఎక్కువ యుపయోగకరములని చెప్పవచ్చును

'శతశ్లోకి' యను గ్రంథమునందు అపస్మారమున కీ క్రింది యోగములు చెప్పఁబడినవి

అపుపాలుగా గుల్ల మెసంగు మంగిస
  పిల్లి యుడుము నక్క చేదుచేత
నస్యంబు చేయించి నయమైన వెల్లుల్లి
  త్రికటు వాసగలిత్తు త్రిఫలములను
నస్యంబు చేయించి నయమ్మున పొనరించి
  కల్హారయోగము చల్లగడ్డ
గోపాంగనా తెల్లగంపన్నపూచారు
  పంచగవ్యము గుమడిపండుతోడ
పానంబు చేయించి పక్షి కొక్కులు తెచ్చి
  అగ్ని చేతను ధూప మమరఁజేసి
ఇన్నివిధముల చేయ నెక్కడౌ నా యప
  స్మార రోగ మడిగి చను రమేశ1!

(శ. ౮)

అపస్యాముఁడు — ఒక ఋషి.

అపాండువు — ఒక ఋషి

అపాంతరతముఁడు — ఒక ఋషి

అపాంప్రదము — భారతవర్షీయ తీర్థము.

అపామియా — ౧ పడమటి ఆసియాయందలి ఓరాంటెస్ నదియొడ్డునఁ గల పట్టణము సెల్యూకస్ నికేటర్ భార్యయగు అపామా పేర నీనగరమున కీపేరు వచ్చెను తరువాత క్రీ శ ౭-వ శతాబ్దిలో నిది శత్రువులచేఁబడి నాశనము గావింపఁబడెను. అటుపై నరబ్బులు దీనిని మరల నిర్మించి ఫామియా యని పేరిడిరి 'క్రూసేడ్' యుద్ధములవఱకు నీనగరము ఔన్నత్యము వహించియుండెను.

౨ ఆసియామైనరునందలి ఫ్రిజియాలోనిది యొక పురాతననగరము దీనిని గట్టించినవాఁడు అంటియోకస్ సోటర్ అతనితల్లి పేరు అపామా యగుటచే వాఁడు డామెపేర నీనగరమునకు అపామియా యని పేరిడెను క్రీస్తుశకము ౩-వ శతాబ్దినుండియు నీనగరము చాల ప్రసిద్ధి గాంచి చాలకాలము ఆసియామైనరునందలి గొప్పపట్టణములలో నొకటి యైయుండెను

**అపినైనుపర్వతములు** — ఇటలీదేశమునందు నుత్తరమునుండి దక్షిణమునకును, అచ్చటనుండి దక్షిణమున సిసిలీవఱకును గొలుసువలె పొడుగుగఁ బ్రసరించియున్న యొకపర్వతపంక్తి ఇది యూరోపుదేశమందలి గొప్పపర్వతములలో నొక్కటి దీనిపొడుగు రమారమి ౮౦౦ మైళ్లు ఇటలీలో నున్న యీపర్వత భాగము యొక్కయెత్తు శిఖరము 'మాంటెకోర్నో' అనునది ౧౦,౦౦౦ అడుగులయెత్తున నున్నది సిసిలీలో ఎట్నా (Etna) అను శిఖరము గలదు అది ౧౧,౦౦౦ అడుగులయెత్తున నున్నది. ఇదియు, నేపిల్సు నొద్దనున్న వెసూవియస్ అనునదియు గొప్ప యగ్నిపర్వతములు. మిక్కిలి యెత్తుమీఁద నీపర్వతము వృక్షవిహీనముగను, గడుసుగను ఉండును కొంచె మెత్తుతక్కువ ప్రదేశము వనములతో నిండియుండును. ఈపర్వతములమీఁద ఖనిజము లంతగ లేవు. కాని గృహములకు పనికివచ్చు చలువరాళ్లు మాత్రము విశేషముగ నున్నవి

**అపిశలి** — ప్రాచీనసంస్కృతవ్యాకరణశాస్త్రకారుఁడు, మిగులఁ బ్రసిద్ధుఁడు, పాణినికిఁ బూర్వుఁడు.

**అపిశలిశిక్ష** — వైదికశబ్దోచ్చారణములను గూర్చి తెలుపు గ్రంథము ఇందు అచ్చు లేవో, హల్లు లేవో, అవి యే స్థానములనుండి ప్రత్యేక ప్రత్యేకముగ నిర్దేశింపఁబడినవి అపిశలిపండితుని యభిప్రాయము ననుసరించి వానివ్యుత్పత్తులను వివరింపఁబడియున్నవి.

1 పద్యమంతయు తప్పులతడికగ నున్నది. ఉన్నదున్నయట్లు ప్రకటించినాము.

**అపూరిమక్** — పెరూదేశమునందలి యొక ప్రదేశము. అచ్చటి ఆండీస్ పర్వతములయందు పుట్టిన అపూరిమక్ అనునదినిబట్టి దాని కీపేరు వచ్చినది. వైశాల్యము ౬,౩౬౬ చ మైళ్లు జనసంఖ్య ౧,౬౬,౮౮౬.

**అపూలియా** — ఇటలీదేశములో నొక ప్రదేశము. దీని వైశాల్యము ౬,౩౬౬ చ మైళ్లు జనసంఖ్య ౨౨,౩౯,౬౮౧.

**అపెల్లిస్** — సుప్రసిద్ధుడగు నొక గ్రీకుదేశపు చిత్రకారుడు. ఇతడు క్రీ పూ నాల్గవశతాబ్దిలోనివాడు. అపెల్లిస్ మేసిడోనియాకు వెళ్లినప్పుడు అలెగ్జాండరుచక్రవర్తితో బాగుగ పరిచయము సంపాదించుకొనెను. వీనస్ (రతీదేవి) తడిసి ముద్దయైన తనశిరోజములనుండి నీటిని పిండివేయుచు సముద్రములోనుండి బయటికి వచ్చుచున్నట్లుగ రచించినచిత్రము ఇతనిచిత్రములలో సెల్ల శ్రేష్ఠమైనది క్రీ పూ నాల్గవశతాబ్దిచివరిదినములలోనే అపెల్లిస్ మరణించెను.

**అపోలో** — ఇతడు గ్రీకుదేవత ఒలింపియా దేవగణములందు ప్రధానస్థానము నాక్రమించినవారిలో నితడు నొకడు రాజకీయ, సాంఘిక, నైతిక, ధార్మికము లగు సుగుణధర్మములన్నిటి నితడు గలిగియుండెను అందువలన వానియధిష్ఠానదేవతాపదములను, అనేక నామధేయములను లభించెను ఈ పెనర్ నామక పండితుడు గ్రీకుభాషయందలి కఠినపేయుట యనువర్థముగల ధాతువునుండి అపోలోశబ్దము పుట్టి యుండవచ్చు నని యూహించెను రాస్చెరను జర్మను విద్వాంసుడు సూర్యపరముగు వర్థమును దీనెను ఈయర్థము సర్వసమ్మతముగు నంగీకారమును బడసియుండలేదు కాని యనేకపురాణములలో నితడు సూర్యదేవతయొక్క సంబంధమును దెలుపు 'ఫోబస్ అపోలో' యను పేరను వ్యవహరింపబడియుండెను

ఇతడు స్వర్గాధిపతి యగు జ్యూస్‌కు లెటోయందు జన్మించిన కుమారుడు జ్యూస్‌సోదరియు, పట్టపురాణియు నగు జూనో (హీరా) కామెపై నసూయ జనింప ఆమె యిటు నటు పరిభ్రమించుచు తొమ్మిది దినములపర్యంత మత్యంతకష్టము ననుభవించి తుదకు తోడేలురూపమును దాల్చి కుటీరాన్నితోడేళ్లసాయముతో డెలోస్ అనుద్వీపమును జేరి యచట సింథస్ శిఖరమునకు దిగువగ నున్న యొకతాటిచెట్టుక్రింద నిద్దరు కవలపిల్లలను గనెను. ఈయిద్దరు బిడ్డలను నింపుగ వ్యవధానముతో వేరువేరు ప్రదేశములందు ప్రసవించె నని కొందరియభిప్రాయము అయిద్దరిలో నొకనికిపేరు అపోలో, రెండవది ఆర్టిమిస్ నామక డియానాకన్య ఈమె పాతివ్రత్యాధిదేవత. అపోలో జన్మాంతరమునగూడ లెటోను జూనో బాధ తప్పినది కాదు. అందువలన నితడు థెమిస్ అను వేరొక దేవతవలన బోషింపబడెను. థెమిస్‌కూడ జ్యూస్‌యొక్క భార్యలలో నొకతె; న్యాయధర్మముల కధిదేవత యైయుండెను. మొట్టమొదట నీథెమిస్ యొక్క యధీనమందే డెల్ఫోని దేవవాణి యుండె ననియు, కాని నామెయే తరువాత అపోలోకు ప్రసాదించె ననియు కొన్నిగాథలు వక్కాణించుచున్నవి. థెమిస్‌యొక్క పరిపోషణమందుండు అపోలో అమృతము గోటికి దగిలినవెంటనే శైశవమునుండి యొక్కసారిగ యౌవనావస్థను బొందెను అపోలోజన్మమునకు బూర్వము డెలోస్ ద్వీప మస్థిరమై, సస్యవిహీనమై, ఊషరక్షేత్రసంయుతమై, జనవాసాయోగ్యమైన స్థానముగ నుండి యితడు పుట్టినతోడనే సుస్థిరమును, జనవాసార్హమును, సస్యపరిపూర్ణమును నైనదిగ మారెను మాసమునందలి సప్తమదినమున నితడవతరించెను దీనిని బురస్కరించుకొని యాసప్తమదినమునందును, మాసమునందలి ఇరువదవనాడును, ప్రార్థనము, ఆయావ స్థలములందును ఇతనిపేర మహోత్సవములు జరుపబడుచుండును మఱియు కర్నియా, డఫ్నెఫోరియా, డెలియా, హైసింథియా, ప్యానెప్సియా, పిథియా, థర్గేలియా మొదలగు పండుగలుకూడ నితనిపేరను గావింపబడుచున్నవి



అపోలో

ఇతడు దేవవాణి, వ్యాధిపీడానివారణము, యుద్ధము, ప్రకృతి, వనస్పతులు, చరాచరములు, సంగీతనాదవినోదములు, కృషి మున్నగువాని కధిదేవత ఇన్నిభిన్నవిషయముల కధిదేవత యగుటవలననే ఇతని కనేక నామధేయములును గలిగినవి

హోమరు గ్రంథమునం దితనికి అపాదింపఁబడినధర్మములలో దేవవాణి యధిపతిత్వ మొకటి. ఇతఁడు జన్మించిన దైవదశాఁడె పైథన్ నామకసర్పమును వధించి భవిష్యద్వాణి కధిపతి యయ్యెను. కాని వీరగాథల ననుసరించి యీసర్పము భూతభేతాళాదులలోఁ జేరినది కాదు. తనతల్లి యగు లేటోను హింసించె ననియో లేక భవిష్యద్వాణిని పైథన్ స్వయముగఁ బ్రకటించుచుండె ననియో ఇతఁడు దానిని దెగటార్చి దానిభవిష్యత్కథనాధిపత్యమును తాను స్వయముగ గ్రహించెను. ఇందువలన నితనికి పాపము కలుగఁ దన్నివారణార్థము పరిభ్రమణము సలిపి టెంపె యను లోయయందు లారెల్ వృక్షములతోఁటలోఁ గూరుచుండి ౯ సంవత్సరముల పర్యంతము తపస్సును గావించి యాపాపమునుండి విముక్తుఁడయ్యెను. ఈ ప్రకారము తపము నొనరించి పాపవిముక్తుఁ డగుటవలన నితరులను గూడ పాపదూరులను జేయుశక్తి లభించెను. దేవవాణుల నితఁడు స్వయముగఁ గాక జ్యూస్ పేరను బ్రకటించుచుండెను. కాని యితని భావములను సాధారణముగ నందఱును గ్రహింపఁజాలకుండిరి. వాగ్రూపమునను భవిష్యత్తులను జెప్పుచుండెనే కాని పక్షుల పాటలెప్పుడు, [illegible] పదార్థములు మొదలు, బల్లెన్నము, దేవధనుస్సు, కలలు మున్నగువానివలనఁ గలుగుసంకేతములనుండియు దేవతాభిప్రాయము గనుగొనఁబడుచుండెడిది. కాలాంతరమున నితఁడు తన కభీష్టులైన కస్సాండ్రా, హెలెనస్, మెలంపస్, ఎమిడెస్ లోనగు మర్త్యులకును భవిష్యద్వాణిని వదింపఁగలుగుశక్తిని బ్రసాదించెను. మహామారి (ప్లేగ్) మొదలగు రోగముల వినాశము గావించువాఁ డగుటంజేసి యితనికి స్మింథియస్ అను పేరు కలిగెను. స్మింథియస్ అనఁగా మూషకధ్వంసి. ఇదికాక మఱికొన్ని రోగముల నివారించువాఁ డగుటవలన అయాట్రోమెంటిస్, పాలియాన్ అను పేరులు గూడ నితనికి లభించెను

యుద్ధాధిదేవత యగుకారణమున ఎకేబియస్ (యుద్ధప్రోత్సాహకర్త), అర్గురోటోక్సోస్ (రజతధనుర్ధారి), హెకటెబోలోస్ (దూరమునుండి గుఱికొట్టువాఁడు), క్రైసావోరోస్ (స్వర్ణఖడ్గధారి), బోడ్రోమియాన్ (సహాయకుఁడు) లోనగు బిరుదములు ప్రాప్తమయ్యెను. పాషాణములమీఁదను చెక్కఁబడిన ఇతని విగ్రహములు కొన్ని సమస్తయుద్ధోపకరణములతో సుసజ్జితమై యున్నట్లు నిర్మింపఁబడియున్నవి. ఇందువలన కొంద ఱితనిని సంహారదేవత యనియుఁ దలఁచిరి.

ప్రకృతివనస్పతుల యధిదేవత యగుటచే మనోరమ్యములు, వనములు, ఆరామములు, పర్వతగుహలు, లోయలు నితనినిరీక్షణమునందే యుండెను. వృక్షములలో ముఖ్యముగ లారెల్, తాటివృక్షము లితని కత్యంతపవిత్రములు. దేవళ్లయొక్క ఆరుల బలిపూజావిధానములందును, ఒలింపియాక్రీడాసమారంభములందును విజేతలకుఁ దాల్చుటకును నుపయోగపడుచుండెను. లారెల్ వృక్షపత్రములును నిందులకే యుపయోగించుచు. తాటిచెట్టుక్రింద నితఁడు జన్మించెనని యదియు నితనికి పవిత్ర మయ్యెను.

పశ్వాదులసంరక్షణ మితని కర్తవ్యములలో నొకటి. స్వయముగ నితఁడు పశువుల మేపియుండెను. పశు, పక్షి, సరీసృపాదులలో సింహము, తోఁడేలు, హంసము, జింక, కాకి, గృధ్రము, సర్పము మొదలగునవి ఇతనికి పవిత్రములు

మానవపాలకుఁ డగుటవలన నితఁడు కౌరోట్రోఫోస్ (బాలపోషకుఁడు) అను బిరుదమును గాంచెను.

సంగీతగానకళాదివిద్యాపరిపోషకుఁడై దేవతలు గావించుకొను ఉత్సవములందు లైర్ నామకవీణావాదనమును వాయించుచుండెడివాఁడు. క్లియో (ఇతిహాసము), యూటెర్పె (శృంగారకావ్యము), థాలియా (సుఖాంతనాటకము), మెల్పొమెని (దుఃఖాంతనాటకము), టెర్ప్సికోర (నృత్యగానములు), ఎరాటో (ప్రేమగీతము), పాలిహిమ్నియా (ఉన్నతమంత్రము), యురానియా (జ్యోతిషము), కల్లియోప్ (ఐతిహాసికకావ్యము) అను పేరులు గల తొమ్మండ్రు కళాదేవత లితనికి తోడుగను సేవకులుగ నుండిరి. వీరందఱితోఁ గూడి ఇతఁడు హెలికన్ పర్వత శిఖరములందును, పెర్నాసస్ మహీధ్రాగ్రములందును విహారము గావించుచు, కాస్టేలియన్ నామకనిర్ఝరిణీజలములఁ గ్రోలుచు సకలకళారసధారాసంపాతములచే లోకుల నానందింపఁజేయుచుండును

కృషి, పశ్వాదుల కధిదేవత యగుటవలన అపోలో సిటాల్కాస్ (ధాన్యరక్షకుఁడు), ఎరిథిబియస్ (కీటపరిహర్త), వస్పరియస్ (అన్నదేవత), హెర్పాన్ (కుఠారదాత), నోమియోస్ (పశువులదేవత) మొదలగు బిరుదములను గాంచియుండెను. మఱియుఁ గృషికర్త యగుటవల్ల నితఁడు సంవత్సరాయనగమనాగమనములతోడను, ఋతువులతోడను సంబంధము కలిగి కాలనియామకుఁడై యుండుచుండును. ఇందువలన నితనికి హోరోమెడస్ (ఋతుపాలకుఁడు) అను పేరు కలిగెను

క్రీటుకాలోని తనయుపాసకుల నితఁడు డెల్ఫీకిఁ దోడుకొని గొంపోయెను. ఆకారణమున నితనికి సాముద్రికదేవత్వముగూడ లభించెను. డెల్ఫీనియస్ (నౌకారోహి), ఎపొబెటీరియస్ (నౌకావరోహి), నసియోటాస్ (ద్వీపవాసి), యూర్యాలస్ (విశాలసాగరదేవత) మొదలగు పేరు లితనికి సముద్రదేవతరూపమునఁ గలిగెను. లోకపాలకుఁడై గ్రామముల స్థాపించుటవలన పాట్రూస్ అను పేరును, రాజమార్గములకు, వీధులకు నధిదేవత యగుటచేత అగూయియాన్, ప్రొస్టేటిరియాన్ అను నామభేదములను కలిగెను. ఇతని శిలావిగ్రహములు, స్తంభములు గృహములకెదుట స్థాపింపఁబడి యుండుటయు నాచారమయ్యెను. అట్లు చేయుటవలన కీడును, అనిష్టములను [illegible] మందిరమునకు లోనికి బ్రవేశింపఁజేయక నని గృహ [illegible]

ఇతనియుత్సవకాలములందు వ్యాయామసంబంధము లైన పోటీలు జరుగుచుండును. అపోలో స్వయముగ వ్యాయామపటువుకూడను. ఇతఁడు ఒలింపియాక్రీడాసందర్భములలోఁ బాల్గొని పరుగెత్తుటయందు హెర్మెస్‌ను జయించినట్లును, ముష్టియందు ఏరెసును గెలిచినట్లును గాథలు కలవు.

ఇన్ని ప్రకారముల లలితగుణధర్మములు గలిగి, యున్నివిషయముల అధిదేవత్వమును పొందియుండినప్పటికి నితఁ డొనరించిన కొన్ని క్రూరకార్యములు అద్వితీయములే కాదు, అమానుషికములకంటెను నీచాతినీచములై యున్నవని చెప్పవచ్చును. గానమునందుఁ దనతోఁ బోటీ పెట్టుకొను నపరాధమున మార్స్యాస్‌చర్మమును బ్రతికియుండఁగనే ఒలిచివైచెను. మరియు నియోబే యనుస్త్రీకి ౭ గురు కొడుకులును, ౭ గురు కూఁతులును నుండిరి. ఒకసందర్భమున నీమె తన కున్నంత సంతానము లెటోకు లేదని పరిహాసము సల్పెనట! అందుమీఁద నితఁడు మహోగ్రుఁడై తనచెల్లెలగు ఆర్టిమిస్‌ను చేదోడుగాఁ గైకొని నియోబేయొక్క ౧౪ గురు బాలికాబాలకులను కొక్కెపెట్టునఁ దుదముట్టించెను. ఇందులకు భిన్నముగ ననుగ్రహమును జూపినతావులును గలవు. హాసింథస్‌నామకబాలకునిపై నితని కత్యంత మగు ప్రేమ యుండెను. వీరిద్దఱు నొకదినమున నాడుకొనుచుండ ఘటనావశమున నాబాలుఁ డితనిచే మృతి బొందెను. అంత నితఁడు తదనుస్మరణార్థము అతనిరక్తమునుండి నీలపుష్పముల సృజించెను. ఈ పుష్పము లిప్పటికిని నతనిపేరను హాసింథస్‌పూవు లని పిలువఁబడుచున్నవి.

మెండియు నితఁడు తాను ప్రేమించిన డాఫ్నె నామకకన్యకను లారెల్‌వృక్షముగ మార్చి నిరంతరము పచ్చగ నుండులాగునఁ జేసె ననియు, కోరోనిస్ తనప్రియురాలిపై నబద్ధము చెప్పినకాకిని శ్వేతవర్ణమునుండి నల్లనివర్ణమునకు మార్చె ననియు గాథలు కలవు.

అపోలోయొక్క యుపాసనమును రోమనులు గ్రీకువారినుండి గైకొనిరి. టార్క్వినియస్‌సూపర్‌బస్ కాలమున డెల్ఫియాదేవవాణిని సంప్రతించినట్లు కొన్ని యాధారములు గలవు. క్రీ. పూ. ౪౩౦ సంవత్సరప్రాంతములందు గలిగినటువంటి యుత్పన్నము గాఁగా నచట అపోలోనిమిత్త మొకదేవాలయము నిర్మింపఁబడెను. క్రీ. పూ. ౨౧౨-వ సంవత్సరమున రెండవప్యూనిక్ యుద్ధావసరమునాఁటివి అపోలోనుగురించిన వృత్తాంతములు కొన్ని కలవు. అగస్టస్‌రాజ్యకాలమున నితనియుపాసనము రోమునందు సుస్థిరముగ నెలకొనిపోయి నితఁ డచటి దేవతాప్రముఖులలో నొకఁ డయ్యెను. ఆక్టియంయుద్ధానంతరము అగస్టస్ అపోలోమందిరమును దిరుగఁ గట్టించి యుద్ధమున దొరకినద్రవ్యములోఁ గొంతభాగమును వినియోగించి అపోలోనిమిత్తము పంచవార్షికోత్సవముల నేర్పాటు చేసెను.

పాశ్చాత్యశిల్పులందు ప్రాచీనకాలపు కళాప్రపంచమునఁ జెక్కఁబడిన అందముకంటె ఎక్కువగఁ గన్పించునది ఈయపోలోశిల్పము. యూరోపుఖండమున ఉన్న కొన్నిస్థలములం దితనివిగ్రహములు కలవు. రోడ్స్‌ద్వీపము అపోలో కత్యంతపవిత్రమైనది. కారణ మేమనఁగా దేవత లందఱు భూమిని విభజించుకొనుచుండ అపోలో అచట లేకుండుట సంభవించెను. అందువలన నితనికంతున కేమియు దొరకినదికాదు. రోడ్స్‌ద్వీప మప్పుడు సముద్రమున మునిఁగియుండెను. ఆద్వీపము ముందు నీటిపైకి వచ్చునని తెలిసియున్నవాఁ డగుటచే నితఁడు దానిని దన కొసఁగు మని జ్యూస్‌ను ప్రార్థింప నతఁడు మంచి దని సమ్మతించెను. అది మొదలు కాని రోడ్స్‌ద్వీప మితనికిఁ బవిత్రవాస మయ్యెను. ఈద్వీపము జ్వాలాముఖీపర్వతముల కాకరము. బృహదాకృతి గొప్ప అపోలో విగ్రహ మొకటి ఇచట నుండెను. పరిమాణమం దిది నూఱడుగుల ఎత్తు కలిగి ప్రపంచమందలి ఏడు అద్భుతములలో నిదియు నొకటియైయుండెను. కాని యీ ప్రశస్తమైన విగ్రహము భూకంపమువలన ధ్వంసముకాఁగా నామమాత్రావశిష్టమైపోయెను. ప్రస్తుతము దొరకువానిలో రోమునగరమందలి వాటికన్ మ్యూజియములోని అపోలోబెల్వెడర్‌విగ్రహము మిగులఁ బ్రశస్తమైనది. క్రీ. శ. ౧౪౯౫-వ సంవత్సరమున ఆంటియమ్‌శిథిలావశేషములలో దొరకిన ఈవిగ్రహమును వాటికన్‌చిత్రవస్తుప్రదర్శనశాలాసంస్థాపకుఁ డగు పోపు రెండవజూలియస్ గొనియుండెను. ఇది క్రీ. పూ. ౩-వ శతాబ్దియందలి యొకవిగ్రహమునకు నకలనియు, ప్రాయశః నీరోకాలము నాఁటి దైయుండవచ్చు ననియు నూహింపఁబడినది.

**అపోలోనియస్** —(పెర్గస్) ౧. ఇతఁడు క్రీ. పూ. మూఁడవ శతాబ్దియం దున్న గొప్ప రేఖాగణితశాస్త్రవేత్త ('The Great geometer') నాల్గవ, అయిదవ టాలెమీరాజుల రాజ్యకాలమున నీతఁడు అలెగ్జాండ్రియా పట్టణమునందు యూక్లిడ్ శిష్యులపాఠశాలలో మొదట శిష్యుఁడుగను, తరువాత గురువుగను నుండెను. ఇతఁడు వ్రాసిన గ్రంథములలో మ్యాగ్నమ్ ఓపస్ (Magnum Opus) అనునది ముఖ్యమైనది. ఇందు దీర్ఘవృత్తములు (Conic Sections) గుఱించిన ౪౦౦ ల సిద్ధాంతములు కలవు. ఇందుఁ బెక్కు లాతఁడు క్రొత్తగఁ గనిపట్టినవి యున్నవి.

అపోలోనియస్ —(రోడిఅస్) ౨. గొప్పకవి, పండితుఁడు. ఆర్గొనాటికా (Argonautica) యను మహాకావ్యమునకుఁ గర్త. ఇది మన మహాభారతమువలె క్షత్రియవీర్యమును వర్ణించునట్టిది. దీనిభాష, వర్ణనాకౌశలము మిక్కిలి యద్భుతమైనవి. వర్జిల్ మొదలగు మహాకవులకుఁ గూడ నిది మార్గదర్శకమైన దందురు. ఈతఁడు మొదట రోడ్సులో సాహిత్యాచార్యుఁడు (Rhetorician) గా నుండి తరువాత అలెగ్జాండ్రియాలో పుస్తకభాండాగారాధ్యక్షుఁడు (Librarian) గా నుండెను. ఇతనికాలము రమారమి క్రీ. పూ. ౨౪౦ మొదలు ౧౯౦ వఱకు, అనఁగా నితఁ డిప్పటికి రెండువేల నూటడెబ్బది సంవత్సరముల క్రిందట నుండెను.

**అపొలోనియస్** — (మొలన్) ౩ గ్రీకు (యవన) సాహిత్యవేత్త (Rhetorician). క్రీ. పూ. ౧-వ శతాబ్దియందు ఉన్నవాఁడు. సిసిరోకు సాహిత్యము నేర్పెను (క్రీ. పూ. ౭౭)

**అపొలోనియస్** — (ట్యానిఅస్) ౪ పైథాగొరస్ సంప్రదాయమునందలి తత్త్వవేత్త. ఇతనికాలము రమారమి క్రీ. పూ. ౪-వ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. ౯౭-వ సంవత్సరమువఱకు. ఈతఁడు అసియామైనరు, పార్థియా, హిందూదేశము మొదలయిన దూరదూర దేశములు తిరిగి వచ్చెను. హిందూదేశమునందు బ్రాహ్మణులతో తత్త్వమును గురించి సంభాషించె నని క్రీ. శ. ౨౦౦ లో నితనిచరిత్రము వ్రాసిన ఫిలాస్ట్రటస్ (Philo tratus) వ్రాసియున్నాఁడు. ఇతఁడు పెక్కు దైవిక చిత్రంబులును, అమానుష కృత్యంబులును చేసి చూపెనట

**అపోస్తలచర్చి** — అపోస్తలులసమయమం దుండిన ప్రార్థనాలయము. వారియొక్క ఇచ్ఛానుసారముగ నిది నిర్మింపఁబడియుండెను. మఱియు రోమునగరము, అలెగ్జాండ్రియా, జెరూసెలెం, అంటియోక్ పట్టణములం దున్న చర్చిలకును నిదే నామధేయము. ప్రఖ్యాత మగ్యోగు అపోస్తలచర్చి తమ దని రోమనుకాథలిక్కులును, తమ దని ఎపిస్కోపలులును తగవులాడుచుందురు

**అపోస్తలపారంపర్యము** — బిషప్పులు, పురోహితులు, డీకనులు అను మువ్వురు గలసినది యపోస్తలసంఘ మనఁబడును. విస్ముక్తసంస్కారములతో వీర యేర్పాటు చేయఁబడుచుండుట ప్రగమునందలి అపోస్తలులు మొదలుకొని నేఁటివఱకును వీరలసంఘ మవిచ్ఛిన్నముగ వచ్చుచున్నది. దీనికే అపోస్తలపారంపర్య మని పేరు. ఎపిస్కోపల్ చర్చివారి కిట్టి సంస్కారములవిషయమై యంతగ పట్టింపు లేకపోయినను, కాథలిక్కులును, కొందఱు ఇంగ్లీషుచర్చివారును దీనివిషయమున గట్టిశ్రద్ధను బూనుచుందురు.

**అపోస్తలపితరులు** — అపోస్తలులతో సమకాలికులైన లేఖకులు క్లెమంట్, బర్నబస్, హెర్మస్, ఇగ్నేషియస్, పాలికార్పు అనువార లయిదుగురు అపోస్తలపితరు లని పేరుపడసిరి.

**అపోస్తలభ్రాతలు** — మధ్యయుగమునందు పోపు లమితద్రవ్యవంతులై రాజాధిరాజభోగము లందుచుండ వారియందుఁ బ్రవేశించిన దురాచారములను రూపుమాపి సంఘమును, గురువులను మంచిమార్గములోనికిఁ గొనిరావలయు నని కొందఱు ప్రయత్నములు సలిపియుండిరి. వారే యపోస్తలభ్రాతలు. అదియు అపోస్తలుల-ఆచారవ్యవహారముల నవలంబించుటచే వీరల కీపేరు గలిగెను. వీరిలోఁ గట్టకడపటిదియు, మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచినదియు నగు సంప్రదాయము క్రీ. శ. ౧౨౬౦-వ సంవత్సరమున పర్మానివాసి యగు జెరార్డ్ సెగరల్లి యనువానిచే స్థాపింపఁబడెను. వీరు రిక్తపాదములతో, భిక్షాటనమున నుదరపోషణము జేసికొనుచు, ధార్మికగీతములఁ పాడుకొనుచు ఇటలీ, స్విట్జర్లాండ్, ఫ్రాన్సు దేశములలోఁ బర్యటనము జేసి యుపదేశింపసాగిరి. ఆకాలంగోపాలము పొత్తు మనుభవింపఁగల స్వర్గసుఖ్య మగు రాజ్యము రానున్న దనియు, దివ్యమైన కాలము సమీపించుచున్న దనియు లోకులకు బోధించుచు, పోపు పదవిని, అందలిదురాచారములను, కేవలము భోగవిలాసములకు స్థానములుగ మాఱినచర్చిలను జాల కఠినముగ నిందింప మొదలిడిరి. ధన ధాన్యసంపత్తుల నమకూర్చుట మాని అనికేతనులు, అవివాహితులునై సాంసారికపదార్థనిర్మోహులైన విరాగులవలెఁ వీరు జీవనము గడపుచుండిరి. కాని పోపునకును, వారియనుయాయులకును వీరిబోధనములు కంటకము లయ్యెను. క్రీ. శ. ౧౨౮౬-వ సంవత్సరమున పోపు హానోరియస్ ఈప్రచారము మానివేయుటకు ఉత్తరువు నొసంగెను. ౧౩౦౦ ల సంవత్సరమున పోపుసంప్రదాయము సెగరల్లిని బట్టికొని మతద్రోహి యనుదోష మారోపించి యతనిని గాల్చివైచిరి. ఇతని మరణానంతరము ఈసంప్రదాయములకు మిలాను నగర నివాసియు, గొప్ప విద్వాంసుఁడు నగు డోల్సినో యనునతఁడు నాయకుఁ డయ్యెను. అది మొదలుకొని యీసంప్రదాయులు స్వరక్షణార్థము దుర్గములందు నివసింప మొదలిడిరి. క్రీ. శ. ౧౩౦౪-వ సంవత్సరమున రేనేరియస్ అను బిషప్పుయొక్క సేనలు మిలాను చుట్టుప్రక్కల నున్న దేశములను ధ్వంసము చేసి వర్సెల్లి యందలి జెబెల్లి దుర్గమును ముట్టడించి, యపోస్తలసోదరుల నందఱను బట్టికొని, వారినాయకుఁడగు డోల్సినోను గాల్చివైచిరి. అనంతర మీసంప్రదాయము క్రమముగా క్షీణించి పోయినట్లు తోఁచుచున్నది.

**అపోస్తలమతము** — క్రైస్తవమతమునకుఁ జెందిన యొకసిద్ధాంతము. ఆదిమ-అపోస్తలులు దీనిని గావించి రని పూర్వకాలమున నందఱును నమ్ముచుండిరి. కాని యిటీవల నీసిద్ధాంతము నాలుగవశతాబ్దియం దేర్పడియుండె నని నిశ్చయింపఁబడినది.

**అపోస్తలరాజులు** — పోపువలన హంగేరిదేశపు రాజునకు ఒసఁగఁబడినబిరుదము. క్రీ. శ. ౧౦౦౧-వ సంవత్సరమున పోపు రెండవసిల్వెస్టర్ హంగేరియారాజగు సెంట్ స్టీఫెనుకు ఈబిరుదము నొసఁగెను. ఇతఁడు తనరాజ్యములోని అన్యధర్మములవారి నందఱను క్రైస్తవమతమునఁ గలుపుటకుఁగాను ప్రబలప్రయత్నములను గావించియుండెను. అటుతరువాత క్రీ. శ. ౧౭౫౮-వ సంవత్సరమున పోపు ౧౩-వ క్లెమెంట్ మేరియాథెరిస్సాచక్రవర్తినికి, ఆమె వంశీయులకును నీబిరుదమును బ్రసాదించెను. క్రీ. శ. ౧౯౧౮ వఱకును హంగేరియారాజులు దీనిని ధరించుచునేయుండిరి

**అపోస్తలసంస్థలు (నియమములు)** — క్రైస్తవ ధర్మవిషయమున లిఖింపఁబడిన విధినిబంధనములు. ఇవి ౮ భాగములుగ విభజింపఁబడియున్నవి. అంతిమభాగము అపోస్తలుల ౮౫ నియమములలోఁ బూర్తి యగును. ఇవి యపోస్తలులచే రచింపఁబడినవని క్లెమెంటుచే చర్చికి నొసంగఁబడిన వని పూర్వ మందఱును విశ్వసించి

యుండిరి. కాని మొదటినుండియు నీయొక్కయొక్కభాగములు చేర్చ బడినవని తలంపఁబడుచుండెను. దీనిలో ౧౨ నియమములు లెక్కించు ప్రమాణభూతములు. ష్విస్టర్ అనువాఁడు దీనిని క్రైస్తవధర్మమునకు ప్రమాణము అనియు, బైబిల్ తరువాత దీనిని మించిన ప్రామాణిక గ్రంథమేదియు లే దనియు శ్లాఘించియుండెను. కాని యిది అపోస్తలులు రచించినది కాక తరువాత వచ్చినవారు వ్రాసిన దనియు ననేకులు తలంచియుండిరి. అట్లు వ్రాసినవారిలో ఆర్చిబిషప్ ఉషర్ అనువాఁడు ముఖ్యుఁడు. ఇతఁడు దీనిని ఆధునిక విమర్శపద్ధతిని పరిశీలించి యందలివిషయములను వ్రాఁతయందలి శైలిని పరిపోల్చి చూచి యివి యపోస్తలరచితములు కావనియు, ఇగ్నేషియస్ లేఖలను పోలియున్న వనియు తీర్మానము చేసెను. అటుతరువాత నిది సిరియా వాస్తవ్యుఁ డొకఁడు దీనిని క్రీ. శ. నాల్గవశతాబ్దియంతమున రచించియుండవచ్చు నని నిశ్చయింపఁబడెను. చర్చికి సంబంధించిన ఆర్చిబిషప్పులు, బిషప్పులు, ప్రెస్బిటరులు, డీకనులు మున్నగువారు గమనించి యవలంబింపవలసినవిధులు, నీతులు, నియమములు నిందు వ్రాయఁబడియున్నవి. మరియు చర్చియందు జరుపవలసిన సంస్కారములు పర్వాదులు మున్నగువానింగూర్చియు నిందు నియమములు కలవు.

**అపోస్తలాధికారము** — రోమునందలి పోపులకును, బిషప్పులకును ఉండెడి అధికారము. దీనిని సెంటుపీటరునుండి నేటి వఱకు వచ్చుచుండిన పోపు లందఱును గలిగియుండిరి.

**అపోస్తలులు** — ఆరంభకాలమునఁ దన మతధర్మమును దేశదేశాంతరములందు ప్రచారము సేయునిమిత్తము ఏసు క్రీస్తు ౧౨ గురు మనుష్యుల నేర్పాటుచేసియుండెను. పంపఁబడినవారని అపోస్తలశబ్దార్థము. కావున మతప్రచారార్థము పంపఁబడిన ఈ ౧౨ గురకు అపోస్తలు లను పేరు కలిగెను. అసలు అపోస్తలులు ఈ ౧౨ గురే. మొదట తాను గావించు నుపదేశముల నాలించి యనంతరము వానిని జనులకు బోధించుటకుఁగాను క్రీస్తు వీరల నేర్పఱిచియుండెను. సైమన్‌పీటర్, అతనిసోదరుఁడు ఆండ్రూ, జెబిడీ యొక్క కుమారులగు జేమ్స్ జాన్ లనువారు, ఫిలిప్, బర్తొలోమ్యూ, థామస్, మాథ్యూ, అల్ఫియస్ పుత్త్రుఁడగు జేమ్స్, అతని సోదరుఁడు లెబ్బియస్ — వీరిద్దఱు జూడాస్, జూడ్ యనియుఁ బిలువఁబడుచుండిరి — సైమన్ కెనానైట్, జూడాస్ ఇస్కారియట్ అని మొత్తము ౧౨ గురు ఆదిమ అపోస్తలులు. తరువాత వీరికిఁ దోడుగ మఱికొందఱు నియమింపఁబడిరి. జూడాస్ ఇస్కారియట్ కు బదులుగ మథియాస్ అనువాఁడు చేర్పఁబడెను. అనంతరము సెంట్ పాల్ అనువాఁడు నియమితుఁ డయ్యెను. పాల్ వెనువెంటఁ బోయిన బర్నబాస్ అనువానికిని అపోస్తలబిరుదము లభించెను. ఇందువలన ఆరంభకాలమునందును, తరువాతను క్రీస్తుమతప్రచారార్థము వెడలినవా రందఱు నీ పేరను బిలువఁబడుచువచ్చి రని తెలియుచున్నది. గాల్ దేశమునఁ బ్రచారము సల్పిన సెంట్ డెన్నిస్ అచటి అపోస్తలుఁ డయ్యెను. ఇదేవిధముగ సెంట్ బోనిఫేస్ జర్మనీదేశపు అపోస్తలుఁడు. సెంట్ అగస్టైన్ ఇంగ్లాండుదేశపు అపోస్తలుఁడు. ఫ్రాన్సిస్ జేవియర్ 'ఇండీసు'లయపోస్తలుఁడు. అడాల్బర్ట్ ప్రష్యాదేశపు అపోస్తలుఁడు. ఏసు క్రీస్తు జీవించియున్నతరుణమందే వీ రతని యుపదేశములందు విశ్వాసము గోలుపోవుచుండిరి అని యన్నియు నటు లుండ క్రీస్తు సిలువమీఁద దారుణమైన యాతన లనుభవించునపుడు వీ రతనియెడల సహానుభూతి నైనఁ గనుపఱుప సాహసింపక పోయిరి. క్రీస్తుమరణానంతర మతని దివ్యాత్మ పెంటెకోస్ట్ అనునుత్సవదినమున జనుల కందఱకు దర్శన మిచ్చెను. అప్పు డీ యపోస్తలులు క్రీస్తుయొక్క ఆత్మసందర్శనముచేత నైనను తాము గోల్పోయిన ధైర్యమును బడసి, యతనినియోగములు సరితరీతి నిర్వర్తింపఁగలుగుదు మను గొప్పయాసతో నాయాత్మను దర్శించిరి. ఏసు క్రీస్తు సెంట్ పీటరును మొదటి అపోస్తలునిగ నేర్పఱిచియుండెను. అతనినుండి నేటివఱకును పోపు మతగురుపారంపర్యము అవిచ్ఛిన్నముగ వచ్చుచున్నది. ఈ హేతువున ధార్మికవిషయములందుఁ దనకు మించిన యధికారము మితరుల కుండరాదని పోపు వాదించుచుండును.

**అపోహాయుఁడు** — ఒకబ్రహ్మర్షి.

**అప్పకవి** — ప్రసిద్ధుఁ డగు నాంధ్రలక్షణకర్త. అప్పకవీయ మను లక్షణగ్రంథమునకుఁ గర్త. ఆంధ్రపండితులలో నప్పకవీయమున కసమానగౌరవము కలదు. ఇందుండి ప్రమాణము చూపినయెడల నిప్పటి తెలుఁగుపండితులలో నూటికిఁ దొంబదిమంది మాఱుమాట లేక సహింతురు. ఆంధ్రమునందుఁ గవిత్వము చెప్ప వారికిఁ గావలసిన విషయము లన్నియు నిందు సవిస్తరముగఁ జెప్పఁబడియున్నందున నింతకుఁబూర్వ మున్న ఛందశ్శాస్త్రము లన్నియు వెనుకఁబడి దీని కింత యాధిక్యము కలిగినది. ఈ కవి తనగ్రంథమును గురించి యీ గ్రంథవిషయమునఁ జెప్పినమాటలు చాలభాగము నిజమనియే యొప్పుకొనవలసియున్నది.—

వ లక్షణగ్రంథములు లక్షోపలక్షలు గల వందు,

క. ఒకదానికంటె మఱి వే
ఱొకటి విశేషంబుఁ జెప్పుచుండుఁ గతమునన్
సకలగ్రంథములను జదు
వక తెలియదు లక్షణప్రపంచం బెల్లన్ [౧ ౧౧౧

క. ఇది చదివినవిస్తుట మఱి
యొందియునియుఁ జదువ బుద్ధి యేలా పొడమున్!
బహుపద్యగ్రంథము లన్నియు
వెదకివెదకి సార మెల్ల వివరింపంగన్ [౧ ౧౧౨

కాలము.—తనకాలమును నివాసస్థానమును స్పష్టముగ వ్రాసినవి తెలుఁగుకవులు తక్కువ. అట్లు స్పష్టముగ వ్రాసినవారిలో అప్పకవి యొకఁడు. శా. శ. ౧౫౭౮ మన్మథనామసంవత్సర శ్రావణ బహుళ ౮ (క్రీ. శ. ౧౬౫౬ ఆగస్టు ౩) దినమున దేవుఁడు కలలోనఁ

ఈ యొక్క యర్థము ఆధారము చేసికొని యతిప్రాసములకు సంబంధించిన నియమము లన్నియుఁ జెప్పుచు క్రింది పద్యములు వ్రాసియున్నాఁడు. కావున అప్పకవీయ మాంధ్రశబ్దచింతామణికి భాషాంతర మని కాని రూపాంతర మని కాని తలఁపఁగూడదు. స్వతంత్రగ్రంథ మనియే చెప్పవలసియున్నది.

అప్పకవీయము స్వతంత్రగ్రంథ మని తెలిసికొని దానిని జూచి మొదలుపెట్టిన పెట్టివారికిని దానివిషయమై గౌరవము కలుగక మానదు. ఈ గ్రంథమునందు లక్ష్యలక్షణములను సంగ్రహించుటకు గ్రంథకర్త మిక్కిలి పాటుపడినాఁ డని తప్పక చెప్పవలసియున్నది. కవి చెప్పుకొనినట్లు 'పరికిపరికి సార మెల్ల వివరించినాఁ' డనుటకు సందేహము లేదు. తనకాలమునకుఁ బూర్వము పుట్టినలక్షణగ్రంథము లన్నియు నీతఁడు శోధించెను. లక్ష్యములకై పెక్కుకావ్యములను గాలించెను. ఇతఁ డిచ్చినలక్ష్యము లన్నియుఁ గ్రొత్తవి కావనియుఁ, బూర్వలాక్షణికులు లిచ్చిన పెక్కులక్ష్యముల నాయాగ్రంథములలోనుండి యుదాహరించె ననుటయు స్పష్టమే యైనను, అట్టి యప్పుడు తీసికొనినలక్ష్యములు గాక స్వతంత్రముగఁ దాను శోధించిన లక్ష్యములుగూడఁ బెక్కు లిచ్చియున్నాఁడు. ఆంధ్రలక్ష్యలక్షణగ్రంథములు గాక సంస్కృతఛందశ్శాస్త్రగ్రంథములను, కొంతవఱకు సంస్కృతప్రాకృతవ్యాకరణగ్రంథములను శోధించి వానిలోఁ గావలసినవిషయముల నీగ్రంథమునందుఁ జేర్చియున్నాఁడు. గణితశాస్త్రమునందలి కఠినమైన అంకయోగవ్యవహారములనుగూడ (Permutations and Combinations) ఛందశ్శాస్త్రమునకు సంబంధించినంతవఱకు సంగ్రహించియున్నాఁడు. విశేషముగఁ జతుర్థాశ్వాసమును జూడుఁడు.

అప్పకవీయము పైదాశ్వాసములు కలది యని యిదివఱకే చెప్పియున్నాము. ప్రథమాశ్వాసమునకు భాషాపరిచ్ఛేద మనియు, ద్వితీయాశ్వాసంబునకు వర్ణపరిచ్ఛేద మనియు, తృతీయాశ్వాసంబునకు యతిప్రాసపరిచ్ఛేద మనియు, చతుర్థాశ్వాసమునకు పద్యపరిచ్ఛేద మనియు, పంచమాశ్వాసమునకు సంధిపరిచ్ఛేద మనియు నామాంతరములు. తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదంబు లనఁబడు మూఁడుపరిచ్ఛేదంబు లింకను వ్రాసెద నని కవి మొదట (౧ ౬౭) ప్రతిజ్ఞ చేసెను. గాని యేకారణముచేతనో యవి యెచ్చటను గానరావు. వానిని వ్రాయకమునుపే కవికి నవసానకాలము ప్రాప్తించె నని తలఁపవలసియున్నది. తత్సమ, దేశ్య ప్రకరణము లప్పకవి వ్రాసియుండినయెడల నవి యాంధ్రభాషాచరిత్రమునకు మిక్కిలి యుపయోగకరము లైయుండు ననుటకు సందేహము లేదు. ఇఁక నొక్కొక్క యాశ్వాసమునందలి కొన్నికొన్ని విశేషములఁ జూపెదము.

ప్రథమాశ్వాసము — ప్రథమాశ్వాసమునందుఁ గవి సంస్కృతాద్యష్టభాషలనుగుఱించియు, కావ్యభేదంబులనుగుఱించియు, రసభావ నాయకానాయకులనుగుఱించియు, ఆంధ్రభాషాభేదములనుగుఱించియు విపులముగ వ్రాసియున్నాఁడు. ఇందలి శబ్దార్థలక్షణాలంకారసీసమాలిక, శబ్దార్థదోషసీసమాలిక, భావసీసమాలిక, శృంగారరససీసమాలిక, అష్టరససీసమాలిక, నాయకనిర్ణయసీసమాలిక యనునట్టి మాలికలు కవియొక్క యసామాన్యసాహిత్యజ్ఞానమును వెల్లడి చేయుచున్నవి. నూతనముగా నీవిషయము నభ్యసించువారికి జ్ఞానము చేయుటకు వీలుగ నుండుటకై యివి సీసమాలికలుగ వ్రాయఁబడినవి. ఇదివఱకు షడ్భాష లనియే వాడుక. వీనికి సంస్కృతము, ఆంధ్రము కలిపి యప్పకవి అష్టభాష లని యనెను. ఈ విభాగములో నప్పకవి, తనకాలమునందు వాడుకలో నున్న యట్టి హిందీ, బంగాళీ, కన్నడము, అఱవము మొదలయిన అన్యదేశభాషలను గా నిచ్చినవాఁడు కాఁడు. కన్నడవ్యాకరణము వ్రాయువారు అష్టభాషలలోనుండి ఆంధ్రమును తొలఁగించి, దానిస్థానమందు కన్నడమును ఉంచుకొనవలయుననియు, అఱవమువా రఱవము నుంచుకొనవలయు ననియు అప్పకవితాత్పర్యము కాఁబోలును. నాటకములలో నేయేభాష లేయేవారి కుపయోగింపవలసినది చూపుటకు నప్పకవి యీక్రిందిపద్యము వ్రాసియున్నాఁడు

సీ. క్షపణ శైవాదిక కర్మహీనులకును
  భామాజనులకును ప్రాకృతంబు
క్షితి వైశ్య శూద్ర ప్రభృతి మధ్యమాధమ
  జాతుల కెల్లను శౌరసేని
ధీవర లుబ్ధకాది వినీచజాతుల
  మానవులకు నెల్ల మగధభాష
మొగిఁ బిశాచాసుర ముఖ్యుల కెల్లఁ బై
  శాచికానామభాషాద్వయంబు
గీ. పతిత చండాల యవనాది పరమనీచ
జాతినరుల కపభ్రంశ, మీతెలుంగు
సీమవారికి నాంధ్రంబుఁ జెప్పవలయుఁ
గావ్యనాటకముల గోపికాభుజంగ! [౧.౧౫౬

ఈ పద్యమునుగూర్చి కొంత ఆలోచింపవలసియున్నది. సంస్కృతనాటకములలో భిన్నభిన్నపాత్రలకు భిన్నభిన్నభాషలు వాడుచుండెదరు. రాజు మాటలాడుభాష యొకటి, రాణి మాటలాడునది మఱియొకటి, రాజుస్నేహితుఁ డగు విదూషకుఁడు మాటలాడునది యింకొకటి. ఆ నియమముల ననుసరించి యప్పకవి యీపద్యమును వ్రాసెను. తెలుఁగువాఁ డనుటచే అందు 'ఆంధ్ర' మొకటి యెక్కువగాఁ గలిసెను. కాని యిందలినియమము లాంధ్రకావ్యములకుఁ గాని, ఆంధ్రనాటకములకుఁ గాని యెట్లు పనికివచ్చును! తెలుఁగులో నాటకములు వ్రాయుచు నాయకునకు సంస్కృతము, నాయికకుఁ బ్రాకృతము, వైశ్యునకు శౌరసేని, తెలుఁగువానికిఁ దెలుఁగుభాష వాడుట పొసఁగునా? పొసఁగదు. అప్పకవికాలమునందు, వీథినాటకములు తప్ప నాంధ్రమునందు కావ్యము లనఁదగు నాటకములు లేవు. వీథినాటకములభాష గ్రామ్యము. తెలుఁగులో నాటకములు వ్రాయునప్పుడు తెలుఁగుతెలుఁగువారలకును, [illegible]

పొల్లులయొక్కయు, స్వరసహితములను విడివిడిగా వ్రాసి చూపినాఁడు. కాని లేఖకు లప్పకవి వ్రాసినయక్షరములయాకారములు తెలియ నందున తద్రూపము లొక్కొక్కప్రతిలో నొక్కొక్కవిధముగ నున్నవి. అప్పకవి యెట్లు వ్రాసెనో కనుఁగొనుట కప్పకవినాటిప్రతి గాని, తరువాతఁ గొలఁదిదినములకు వ్రాయఁబడిన ప్రతి గాని దొరక వలెను. అప్పుడు గాని అప్పకవియిచ్చినలిపి యెట్టిది యని తెలియరాదు. ఈ ప్రకరణమునందు రేఫఱకారసంబంధ మైన సీసమాలికలును, పట్టిక లును మిక్కిలి పెద్దవి. అవి కవియొక్క శోధనకును పరిశ్రమమునకును గొప్పసూచకములు. ఈతనికిఁ బూర్వులైన తాళ్లపాక చిన్నయ్య మొదలయినవారు రేఫఱకారములజాబితా లిచ్చినను నింకను శోధించి యితఁడు క్రొత్తవి చేర్చెను.

అప్పకవి రేఫఱకారములనుగుఱించి మిక్కిలి పట్టుదలగల వాఁడు. యతిస్థానమందుఁ గాని, ప్రాసస్థానమందుఁ గాని మఱి యెక్కడనైనను రేఫ ఱకారములకు మైత్రి చేయఁగూడ దని యాతని యభి ప్రాయము (౨ ఆ౹౯౦-౨౫౯) రేఫ ఱకారములపట్టిక యేర్పఱుచు టలో నప్పకవి యేమార్గము నవలంబించెనో స్పష్టముగ వ్రాయలేదు. కాని యొకానొక తెలుఁగుశబ్దమందలి 'ర' అను అక్షరము రేఫమా ఱకారమా యని సంశయము వచ్చినప్పు డది రేఫ మని కాని ఱకార మని కాని నిశ్చయించుటకు నిచ్చినలక్ష్యములవలన మనము కొంత వఱకు నూహింపవచ్చును. తాను ప్రమాణముగఁ దీసికొనఁదలఁచు కొన్న గ్రంథములలో సంస్కృతపదములందలి రేఫముతోఁ బ్రాస యందుఁ గాని, యతియందుఁ గాని మైత్రిం బొందిన 'ర' అను అక్ష రము రేఫము అని మొదట రేఫముల నేఱుకొనెను. మిగిలినవానిని ఱకారము లనెను. సంస్కృతపదాంతర్గత మైన 'ర' కారముతో నన్నయాదులు (తాను శోధించిన) గ్రంథములలో మైత్రిఁ బొందని వన్నియు ఱకారము లనెను. ఒకప్పుడు రేఫముతోను, మఱియొకప్పుడు ఱకారముతోను (పైని చెప్పినరీతిని నిడఁదీసిన రేఫఱకారములతో నని యర్థము) మైత్రిఁ బొందినవానికి నుభయరూపము లున్న వనెను. ఇట్లు రేఫ ఱకారనిర్ణయము చేసి మరల రేఫ ఱకారములకుఁ బూర్వ కవులు మైత్రి యొప్పరే దని చెప్పుట అన్యోన్యాశ్రయదోషా భాసము కాదా? అది యట్లుండె. ఈరెండువర్ణములకును పూర్వ మొకప్పుడు భిన్నోచ్చారణ ముండినను లేకపోయినను అప్పకవి కాలమునాటికే యది లోపించి యీరెండువర్ణములకును ఒక్కటియే యుచ్చారణ ముండె ననుట స్పష్టము. అప్పకవి దీనిని విభజించుటకు నింతకష్టపడుటయే యిందులకు సాక్ష్యము. సమానోచ్చారణముగల యీయక్షరములకు మైత్రి యుండవచ్చును, అనఁగా ప్రాసస్థలము లలో నిది రేఫ మని కాని, ఇది ఱకార మని కాని ఆలోచింప నక్కఱలే దని కవిజనాశ్రయాదిగ్రంథకారులయభిప్రాయ మైనం దున దానిని ఖండించుట కప్పకవి యింత పరిశ్రమ చేయవలసివచ్చినది!

అక్షరస్వరూపనిర్ణయ మైనతరువాత నీయాశ్వాసమందు నాగ మాదుల ననుసరించి, అక్షరదేవతలు, వానిలింగములు, వానిని బూజ చేయువిధము మొదలగు విధ్యంశములు చెప్పఁబడినవి. చివర సారస్వ తౌషధము అని రెండు మూఁడు మందులు చెప్పఁబడినవి. అందులో నొకమందు తినిన 'మూర్ఖులు ఘటించు', రెండవమందు తినిన 'గడియ కొకపద్యశతకంబు నుడువు' సామర్థ్యము గలుగును. మూఁడవ మందు తినిన 'వాణిజాలుకను గాత్రంబు నందు నలువనెలలు' (౨ఆ-౩౧)

తృతీయాశ్వాసము — మూఁడవయాశ్వాసము యతిప్రాసము లకు సంబంధించినది. ఈ ప్రకరణమునందును అప్పకవి పూర్వలక్షణము లను ఎక్కువగఁ బరిశోధించి, పూర్వలక్షణకర్తలకంటె నెక్కుడుగ నిరూపించినాఁడు. భీమకవి పదియతులు చెప్పినాఁడు. అనంతా మాత్యుఁ డిరువది చెప్పెను. అటుపిమ్మటఁ గొందఱు కవులు యతుల నిరువదియేడువిభాగములుగఁ జేసిరి. అప్పకవి నలువదియొక్క విధము లైనయతులను చెప్పెను (౩, ౮)! ఇట్లు యతులసంఖ్య పెరిఁగిన దనఁగాఁ గ్రొత్తయతులు తెచ్చిపెట్టఁబడిన వని కాదు. పూర్వకవులచేఁ జేయఁబడినపెద్దవిభాగములలోఁ బరకవు లింకను సూక్ష్మము లైనవిభేద ములను గనిపట్టి రని యర్థము. సంస్కృతసాహిత్యవాఙ్మయమునందు నిట్లే యలంకారములసంఖ్య దినదినప్రవర్ధమాన మైనది. అప్పకవిచేఁ జెప్పఁబడిన ౪౧ యతులలో స్వరయతులు ౭, వ్యంజనయతులు ౨౧, ఉభయయతులు ౧౨, ప్రాసయతి ౧. అప్పకవి చెప్పినప్రాసములు పదునేడువిధంబులు.

చతుర్థాశ్వాసము — నాలుగవ యాశ్వాసమునందు ఛందం బులలక్షణములు వివరింపఁబడినవి. చిత్రబంధగర్భకవిత్వమునుగూర్చి యిందుఁ గొంత యిందుఁ జెప్పఁబడియున్నది. పద్యముల నల్లువా రీభాగమును ఎక్కుడుగ వల్లించుచుందురు. ఈ యాశ్వాసమునందు గద్యములనుగుఱించి యొకవిశేషము గలదు. అప్పకవి యిందు రెండు విధము లయిన గద్యములను (వచనములను) వ్రాసియున్నాఁడు. ఒకటి సాధారణ మైనగద్యము, మనగ్రంథాదులలో వాడఁబడునది. రెండవది వ్యవహారభాషలో వ్రాయఁబడినగద్యము. కవి మొదటిరకము గద్యమున కీ క్రిందియుదాహరణ మిచ్చినాఁడు.—

" శ్రీవిలాసినీవక్షోరుహద్వయగిరిదుర్గసంచారద్యుతి, పద్మజాండానేకభరణదక్ష, దక్షజామాతృధాతృప్రముఖనిఖిలదేవప్రముఖవిబుధ బర్హిర్ముఖప్రస్తూయమానశుభశీల, * * * * వాసవరత్నాభ, వారిజనాభ, నాగారిస్యందన, నందగోపనందన, కరుణాలవాల, కాంచనచేల, భుజగేంద్రశయన, ఆర్తరక్షణపరాయణ, గోవింద, ముకుంద నమస్తే నమస్తే నమస్తే "

ఇఁక రెండవవిధ మైన గద్యమున కీ క్రింది యుదాహరణము నిచ్చెను.

" ఓ వృత్తసంఖ్యాప్రత్యయ మనఁగాను ఇన్నివర్ణంబులకుండు యెన్ని సమవృత్తములు పుట్టినవి అని అడిగితేను వరి చెప్పెడివిధము, వారు యెన్నివర్ణంబులని కడిగితేను అన్నిగురువులు అడ్డముగాను

**అప్పనరామునిలంక** — తూర్పుగోదావరిజిల్లా, రాజోలుతాలూకాయందలి గ్రామము జనసంఖ్య, ౧,౬౮౪ (౧౯౩౧).

**అప్పన్నదొరపాలెం** — విశాఖపట్టణముజిల్లా, గొల్గొండతాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧౬౫ (౧౯౩౧).

**అప్పన్నదొరవలస** — విశాఖపట్టణముజిల్లా, పార్వతీపురముతాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౨౦౮ (౧౯౩౧).

**అప్పన్నవలస** — విశాఖపట్టణముజిల్లా, చీపురుపల్లి తాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౯౬.

**అప్పమాంబాపురం** — నెల్లూరుజిల్లా, కనిగిరితాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧౬౬.

**అప్పమ్మపాలెం** — విశాఖపట్టణముజిల్లా, వీరవల్లి తాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౨౦ (౧౯౩౧)

**అప్పయదీక్షితులు** — దక్షిణదేశమున నిటీవలికాలమున వెలసిన సంస్కృతపండితుల కెల్ల శిరోమణియును సుప్రసిద్ధ కవియు, భాషాపోషకుఁడు నగు శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందలి పేరెన్నిక గన్న రాజమంత్రుల పండితులలో నొకఁడయిన వక్షస్స్థలాచార్యదీక్షితపౌత్రుఁ డగు రంగరాజాధ్వరికుమారుఁడు, ఉత్తరార్కాటుజిల్లాయందలి అడయపలమునివాసి. వక్షస్స్థలాచార్యులకే ఆచార్యదీక్షితుఁ డని నామాంతరము కలదు. ఈయాచార్యదీక్షితులు రాయలగౌరవాదరములను చూఱగొన్నవాఁడు. ప్రతిభ ననుసరించి, రంగరాజాధ్వరికి చాలకాలమువఱకును సంతానభాగ్యము లేకపోయెను. తుదకతనికి శివునివరప్రసాదమున నొకశిశువు కలిగెను. ఆతఁడే అచిరకాలమున పేరు ప్రఖ్యాతులు గాంచిన అప్పయదీక్షితులు. అప్పయదీక్షితుల బాల్యకాలపుగాథ లనేకములు కలవు. వీనిలో చాలభాగము శ్రీ కంచి కామకోటిపీఠాధిపతుల ప్రాపున ప్రచురింపఁబడు 'ఆర్యధర్మ' మను పత్రికయందు ప్రకటింపఁబడినవి.

కాలనిర్ణయము — అప్పయదీక్షితుల జననకాలము మనకు స్పష్టముగఁ దెలియదు. కాని యాతఁ డున్నకాలమును కొంచెమించుమించుగ సరిగనే నిర్ణయింపవచ్చును. ఇటీవల కొన్ని సంవత్సరముల క్రిందట అప్పయదీక్షితవంశజుఁ డగు శివానందయోగి స్వవంశమునఁ బరంపరాగతముగ వచ్చుగాథలను సంకలితము చేసి వానిసాయమున రచియించిన 'దీక్షితచారిత్రము'న అప్పయదీక్షితులకాలమును నిర్ణయించియున్నాఁడు. ఆయన కయినను అప్పయదీక్షితుల సరియైన జన్మకాలము లభింపలేదు. అందువలన నష్టజాతకపద్ధతి నాధారము చేసికొని ఆయన అప్పయదీక్షితులజాతకము వేసెను; తద్విధమున ఆయన క్రీ. శ ౧౫౫౩ అప్పయదీక్షితుల జననకాలముగ నిర్ణయించెను.

| చ | | శ, రా | కు |
| --- | --- | --- | --- |
| — | రాశి | | — |
| మాంది | | | |
| | గు, కే | శు | ల ర, బు |

ఇట్టి యాతని యవధారితమైన ప్రకారము అప్పయదీక్షితులజాతకము. ఇంతవఱకు విదితమైన దీక్షితుల సరియైన జన్మకాల మని పండితుల భావన. అప్పయదీక్షితుల సోదరపౌత్రుఁ డయిన నీలకంఠదీక్షితులు తన 'శివలీలార్ణవము'నందు 'ద్వాసప్తతిం ప్రాప్య సమాః' అనుశ్లోకమునం దప్పయదీక్షితులు డెబ్బదిరెండుసంవత్సరములు జీవించినట్లు తెలిపియున్నాఁడు. చిదంబరమున నున్నకాలమున కాలినఁ గొంత కాలమునకు మరణించు నవఁగ అప్పయదీక్షితులే 'వయాంసి మమ సప్తతే రుపరి నైవ భోగే స్పృహా' అని చెప్పినట్లు ప్రతీతి. పూర్వోక్తవిషయముల యాధారమున దీక్షితులు క్రీ. శ. ౧౫౫౪ - ౧౬౨౬ వఱకు నడుమ నుండినట్లు పండితులు విశ్వసించుచున్నారు. కాని యిది సరియైనది కా దని తోఁచుచున్నది.

అప్పయదీక్షితులు తాను రచియించిన 'యాదవాభ్యుదయ వ్యాఖ్యానము' నవతారికయందు చినతిమ్మప్పతి తన కాశ్రయుఁడుగ తెలిపినాఁడు. ఈచినతిమ్మభూపాలుఁడు క్రీ. శ. ౧౫౪౨ - ౧౫౭౦ ల నడుమ దక్షిణదేశమునకు ప్రతినిధిపాలకుఁడుగ నుండెను. వేలూరి చినబొమ్మనాయకుఁడు దీక్షితుల నాదరించిన మఱియొక ప్రభువు. ఈతని ప్రోత్సాహముననే దీక్షితులు 'శివార్కమణిదీపిక'ను రచియించెను. క్రీ. శ ౧౫౮౦ ప్రాంతమున చినబొమ్మనాయకుఁడు వేలూరునందు ప్రభువుఁడుగ నుండెను. క్రీ. శ ౧౫౮౫ న రాజ్యమునకు వచ్చిన వేంకటపతిదేవరాయల ప్రాపకమున దీక్షితులు 'విధిరసాయన', 'కువలయానందము'లను రచియించెను. 'కల్పతరుపరిమళము'ను దీక్షితులు రచియించినకాలమున ఆయనకోరిక మీఁద, ఆయనకు భృత్యుఁడుగ చినబొమ్మనాయకుఁడు అడయపలమునందు కాలకంఠేశ్వరాలయమును గట్టించెను. అప్పయదీక్షితులవివాహమునకు పాండ్యరాజగు మధుర చంద్రశేఖరుఁడు (౧౫౭౨ ప్రాంతము) కారకుఁ డనియు ప్రతీతి. అదికాక, పరిమళమును రచియించుటకు తంజావూరినాయకప్రభువుల సుప్రసిద్ధప్రధాని యయిన గోవిందదీక్షితులు కారకుఁ డని చెప్పుదురు. పరిమళము అప్పయదీక్షితుల కడపటి గ్రంథము. ౧౬౦౫ వఱకు విదప గోవిందదీక్షితులు జీవించియుండలేదు. అడయపలముశాసనమున నుదాహరింపఁబడినదానిని, అప్పయదీక్షితులు ౧౫౮౨ వఱకు పూర్వ మీగ్రంథమును రచియించెను. మఱియొక్కవిషయము రసగంగాధర కర్తయయిన జగన్నాథపండితుఁడు షాజహానుపాదుషా (క్రీ. శ ౧౬౨౮ - ౧౬౫౮) కాశ్రితుఁడు. జగన్నాథపండితునితండ్రి పేరుభట్టు ఖండదేవుని యొద్ద మీమాంసాశాస్త్రము నభ్యసించెను. ఖండదేవుఁడు తన 'భాట్టదీపిక'న అప్పయదీక్షితులు ప్రసిద్ధులయిన మీమాంసకులలో నొకఁ డని వచించినాఁడు. తద్విషయము నన్నితని గమనించి చూచినచో

దీక్షితుల జీవితకాల మని చెప్పఁబడు ౧౫౫౪-౧౬౨౬ సరియైనది కా దని సిద్ధాంత మగుచున్నది. ఒకచాటుశ్లోకమునందలి 'విక్రమే భూతలం ప్రాప్య విజయే స్వర్గ మాయయౌ' అనుదానియర్థమును పూర్వోక్తవిషయములతో సమన్వయించి చూచినయెడల, అప్పయ దీక్షితులు క్రీ. శ. ౧౫౨౦ (విక్రమ)లో పుట్టియుండునని, ౧౫౯౩ (విజయ)లో గతించియుండు నని యూహింపఁదగియున్నది

జీవితము.— అప్పయదీక్షితుల చిన్ననాటి వృత్తాంతములు విశ్వాసపాత్రము లయినవి తెలియరావు. ఇంకను చిన్నవాఁడుగ నుండఁగనే దీక్షితుల వేద ప్రతిష్ఠ ఎల్లకడల వ్యాపించినది. ఈ కారణమున మహాపండితుఁడు సర్వజ్ఞమంగలము రత్నఖేట శ్రీనివాసదీక్షితులు అప్పయదీక్షితులకుఁ దన కూఁతురు మంగళనాయకి నిచ్చి వివాహము చేసెను. దీక్షితుల కామెయందు తనయు లనేకులు కలిగిరి, కాని కొడుకులలో నొక్కఁడును తండ్రియంతటివాఁడు కాలే దని ప్రతీతి. అంతియకాక వారిలో వారెల్లప్పుడు ఏదోవిషయమునఁ గలహించువారు. అప్పయదీక్షితులు తనకడపటిదశలో తనయాస్తిలోఁ గొంత భాగమును సోదరపౌత్రుఁ డయిన నీలకంఠదీక్షితుల కియ్యఁదలఁచి నప్పుడు కొడుకు లంగీకరింపరై రని, అందుమీఁద దీక్షితులు కుపితుఁడై కొడుకుల సంతతులు మూర్ఖులు కాఁగలరని శపించె నని చెప్పుదురు. దీక్షితులయాస్తి ఆయనకొడుకులకే చెందినను, ఆయన యశస్సు మాత్రము నీలకంఠునకే చెందినట్లు కన్పట్టును. తనజీవితావసానకాలమున అప్పయదీక్షితులు చిదంబరమునఁ గడపి తుద కచ్చటనే కాలధర్మము నొందెను. ఆయన అచ్చటనుండిన తన కడపటి దినములలో నీక్రిందిశ్లోకము చెప్పె నని వాడుక

'చిదంబర మిదం పురం ప్రథిత మేవ పుణ్యస్థలం,
వయాంసి మమ సప్తతే రుపరి నైవ భోగే స్పృహా'

దీక్షితకృతగ్రంథములు — అప్పయదీక్షితులు శతాధికగ్రంథకర్త యని, సంస్కృతసాహిత్యమున న్యాయ, మత, వ్యాకరణములకు సంబంధించిన గ్రంథము లనేకము రచియించిన వన్నియుఁ గలసి ౧౦౪ కల వని చెప్పుదురు. తత్కృతగ్రంథము లివి.—

అద్వైత వేదాంతము.— ౧. పరిమళము అమలానందుని కల్పతరువు మీఁది వ్యాఖ్యానము, ౨. సిద్ధాంతలేశసంగ్రహము — స్వతంత్రగ్రంథము, ౩. న్యాయరక్షామణి — శంకర భాష్యము నాధారముగఁ జేసికొని రచియించిన స్వతంత్ర గ్రంథము, మొదటిపరిచ్ఛేదమునకుమాత్రమే దొరకినది,

శైవవేదాంతము.— ౪. శివార్కమణిదీపిక శ్రీకంఠభాష్యము మీఁది వ్యాఖ్యానము; ౫. శిఖరిణీమాల, ౬. శిఖరిణీమాలా వ్యాఖ్య; ౭. ఆనందలహరి, ౮. ఆనందలహరీవ్యాఖ్య; ౯. శివాద్వైతనిర్ణయము,

శైవగ్రంథములు — ౧౦ భస్మవాదావళి, ౧౧ శివార్చనా చంద్రిక, ౧౨ శివార్చనాచంద్రికావ్యాఖ్య, ౧౩ శివ ధ్యానపద్ధతి, ౧౪ శివపూజావిధి, ౧౫ వీరశైవము;

విశిష్టాద్వైతము —౧౬ న్యాయమంజరి, ౧౭ నయమయూఖమాలిక;

ద్వైతము — ౧౮ న్యాయముక్తావళి, ౧౯ న్యాయముక్తావళీ వ్యాఖ్య,

విశిష్టాద్వైతఖండనము — ౨౦ రామానుజశృంగభంగము,

ద్వైతమత ఖండనము — ౨౧ మధ్వతంత్రముఖమర్దనము, ౨౨ మధ్వతంత్రముఖమర్దనవ్యాఖ్య,

మీమాంస — ౨౩ విధిరసాయనము, ౨౪ విధిరసాయనవ్యాఖ్య; ౨౫ ఉపక్రమ పరాక్రమము, ౨౬ నక్షత్రవాదావళి, ౨౭ చిత్రపటము, ౨౮ మయూఖావళి, ౨౯ అధికరణ కంచిక,

అలంకారము — ౩౦ కువలయానందము, ౩౧ లక్షణావళి, ౩౨ చిత్రమీమాంస, ౩౩ వృత్తివార్తికము, ౩౪ వృత్తి వార్తికవ్యాఖ్య,

వ్యాకరణము — ౩౫ నక్షత్రవాదావళి,

నిఘంటువు — ౩౬ నామమాల, ౩౭ నామమాలావ్యాఖ్య; ౩౮ శబ్దప్రకాశము,

కావ్యము.— ౩౯ యాదవాభ్యుదయవ్యాఖ్య, ౪౦ పాదుకా సహస్రవ్యాఖ్య, ౪౧ రామాయణ తాత్పర్యసంగ్రహము, ౪౨ రామాయణతాత్పర్య సంగ్రహవ్యాఖ్య, ౪౩ భారత తాత్పర్యసంగ్రహము; ౪౪ భారతతాత్పర్య సంగ్రహ వ్యాఖ్య, ౪౫ హరివంశసారచరితవ్యాఖ్య, ౪౬ దశ కుమారచరితసంగ్రహము, ౪౭ హంససందేశవ్యాఖ్య;

స్తోత్రములు — ౪౮ బ్రహ్మతర్కస్తవము, ౪౯ బ్రహ్మతర్క స్తవవ్యాఖ్య, ౫౦ వరదరాజస్తవము, ౫౧ వరదరాజస్తవ వ్యాఖ్య, ౫౨ పంచరత్నస్తవము, ౫౩ పంచరత్నస్తవ వ్యాఖ్య, ౫౪ ఆదిత్యస్తవరత్నము, ౫౫ ఆదిత్యస్తవరత్న వ్యాఖ్య, ౫౬ చంద్రకలాస్తుతి, ౫౭ చంద్రకలాస్తుతి వ్యాఖ్య, ౫౮ గంగాధరాష్టకము; ౫౯ భక్తిశతకము, ౬౦ హరిహరస్తుతి, ౬౧ కృష్ణధ్యానపద్ధతి; ౬౨ అపీత కుచాంబాస్తవము, ౬౩ శివమహిమకాలిక, ౬౪ నిగ్రహాష్టకము, ౬౫ ఆత్మార్పణస్తుతి, ౬౬ మానసోల్లాసము; ౬౭ శివకర్ణామృతము, ౬౮ శివకర్ణామృతవ్యాఖ్య,

ఇతరగ్రంథములు.— ౬౯ రత్నత్రయపరీక్ష, ౭౦ రత్నత్రయ పరీక్షావ్యాఖ్య; ౭౧. శుకవిలాసము, ౭౨. వాయుదేవతత్త్వము.

దీక్షితవిరచితము లను నితరగ్రంథములవలనను మనకుఁ దెలియును.

పూర్వోక్తప్రామాణికము లయిన గ్రంథముల ననుసరించి చూడఁగా హిందూతత్త్వశాస్త్రమునందును, సంస్కృతవాఙ్మయమునందును అప్పయదీక్షితు లెట్టిస్థానము నలంకరించినది మనము నిర్ణయింప వీలగుచున్నది. శివోత్కర్ష చేయుచు, శైవధర్మము నుగ్గడించుచు అప్పయదీక్షితు లనేకగ్రంథములు రచియించియున్నను, అతఁడు సమర్థించిన తత్త్వమును, అతని తత్త్వలక్ష్యమును శ్రీశంకర భగవత్పాదులచేతఁ బ్రతిపాదితమైన శుద్ధాద్వైతమే. ఇతఁడు రచియించిన గ్రంథములలోని వెల్లఁ గడు శ్రేష్ఠ మయినది పరిమళము. శ్రీశాంకర బ్రహ్మసూత్రభాష్యమునకు వాచస్పతిమిశ్రుఁడు రచియించిన వ్యాఖ్యానము భామతిమీఁదను అమలానందుఁడు వ్రాసిన కల్పతరు వను వ్యాఖ్యకు ఈపరిమళము టీక. సంస్కృతమునందలి పెక్కు టీకా, వ్యాఖ్యాన గ్రంథములవలెనే పరిమళమును స్వతంత్రగ్రంథము. ఇందు వాచస్పతి ప్రతిపాదించి విశదీకరించిన శంకరాద్వైతమునే అప్పయదీక్షితులు తన యావచ్ఛక్తిని వినియోగించి సమర్థించెను. పదునెనిమిదవ శతాబ్దిని విలసిల్లిన గొప్పవేదాంతులలో నొకఁ డగు బ్రహ్మానందసరస్వతి ఇటీవలికాలమున వెలసిన యద్వైతులలో నగ్రగణ్యుఁడు. ఇతఁడే అద్వైతవేదాంతమునకు మూలస్తంభాయమాన మయిన రెండు గురులలో అప్పయదీక్షితుఁ డొకఁ డని తన సిద్ధాంతబిందుటీకయందు పేర్కొనినాఁడు.

వేదాంతశాస్త్రమునఁ దనకుఁ గల యసమాన పాండితిని తేటము స్పష్టీకరించుటకయి అప్పయదీక్షితులు ద్వైత, విశిష్టాద్వైతములనుగూర్చికూడ గ్రంథములు వ్రాసెను. ఈ రెండుసంప్రదాయములమీఁద నతని కెంతమాత్రము నాదర, గౌరవములు లే వనుటకు వానిని ఖండించుచు వ్రాసిన మధ్వతంత్రముఖమర్దన, రామానుజశృంగభంగనామక గ్రంథములే నిదర్శనము. ద్వైత, విశిష్టాద్వైతముల మీఁద నీతఁడు రచియించిన గ్రంథములను ద్వైతులును, విశిష్టాద్వైతులుంగూడ ప్రమాణగ్రంథములుగ నంగీకరింతురు. అట్లే తన్మతములమీఁది ఖండనములుఁగూడ ఇంతవఱకు అద్వైతదృష్టితోఁ జేయఁబడిన విమర్శనములలో నుత్తమ మయినవి. అప్పయదీక్షితుల మతము కడుస్పష్టమే. అతనిది భామతిప్రస్థానమందు వివరింపఁబడిన శంకరాద్వైతము. మొత్తముమీఁద నితనికి శివునియెడలఁ గొంత పక్షపాతముండినప్పటికిని శ్రీశంకరభగవత్పాదులవలెనే యితనికిని శివ, కేశవుల యెడల సమానభక్తిగౌరవప్రపత్తులు కలవు. ఇతఁడు మతమునందు శైవుఁ డయినప్పటికిని తన దేవుని భూషించి యితరుని దూషించు మతమూఢులలోఁ జేరినవాఁడు కాఁడు 'శైవా వయం నఖలు తత్త్వవిచారణీయః' అని స్పష్టముగఁ జెప్పుచుండుటచే అతఁడు శివ, కేశవులు పరమార్థభిన్నరూపములే కాని వేఱు కా రని నిస్సంశయముగ స్వీకరించియున్నాఁడు. వరదరాజస్తవ మతని విష్ణుభక్తిని, హరిహరస్తుతి శివ, కేశవులయెడల నతనికిఁ గల సమానభక్తిగౌరవప్రపత్తులకును తార్కాణములు. కాని యతఁడు శివపారమ్యమును ఘోషించినతరి విష్ణుపారమ్యమును ఘోషించి గ్రంథ మేదియు రచింపలే దనిమాత్రము గమనింపఁదగినది.

రామానుజభాష్యమునకువలెనే శ్రీకంఠభాష్యమునకుఁగూడ సమానగౌరవస్థానము కల్పింపవలె నను తలంపుతో అప్పయదీక్షితులు శివార్కమణిదీపికారచనమునకుఁ బూనుకొనె నని ప్రతీతి. రామానుజభాష్యమునకు సుదర్శనమిశ్రుని శ్రుతప్రకాశిక ముఖ్యభాష్యమున్న గౌరవము గడించినది కాని యప్పయదీక్షితులకాలమువఱకును పండితబృందమున శ్రీకంఠభాష్యమునకు రామానుజభాష్యమున కున్న గౌరవము లేదు. ఈ లోటును పోఁగొట్టుటకయి యతఁడు శివార్కమణిదీపిక రచియించె నని చెప్పుదురు. అప్పయదీక్షితులు శివార్కమణిదీపికయందు శివుఁడే ప్రధానదైవముగ, శ్రీకంఠుని అద్వైతసిద్ధాంతమును ప్రపంచించెను. ఈ గ్రంథమున మత, వేదాంతములు రెంటికిని చక్కని మేళనము కుదిరినది, మఱి తత్త్వ మిందు చక్కఁగ పరిగత మయినది.

సంస్కృతసాహిత్య చారిత్రమునందు అప్పయదీక్షితులతో పరిపోల్పఁదగినవారు చాల కొలఁదిమంది కలరు. మహాకవియు, భావి శాస్త్రుఁడు నగు అప్పయదీక్షితులు కాలమురాటుపోటుల కాఁగి నిలువఁగల భక్తిగీతము లనేకములు రచియించెను. వరదరాజస్తుతి, శివకర్ణామృతము, భక్తిరసప్రధానము లయిన యితరశ్లోకములు చాల ప్రశస్తము లయిన రచనలు. అతఁడు మహాకావ్య మేదియు రచింపలేదు, కాని యాదవాభ్యుదయ, హరివంశసారచరితములవంటి కొన్ని ముఖ్యము లయిన మహాకావ్యములకు వ్యాఖ్యానములు వ్రాసెను. ఇంతవఱకు ప్రకటితముకాని నిఘంటువు నామమాలయే కాక, ఇతఁ డమరకోశముమీఁద నొకవ్యాఖ్యానముకూడ రచియించినట్లు చెప్పుదురు. సాహిత్యవిమర్శగ్రంథము లయిన కువలయానంద, వృత్తివార్తిక, చిత్రమీమాంసా, లక్షణావలుల ననుసరించి యాతఁ డొకగొప్పసాహిత్యవిమర్శకుఁ డని చెప్పఁదగును. అతఁడు సాహిత్యకర్తగనే కాక, సాహిత్యవిమర్శకుఁడుగకూడ పేరుగన్నవాఁడు.

(టి. ఆర్. చిం.)

**అప్పయ్యరాజుపేట** — కడపజిల్లా, రాజంపేట తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౭౯ (౧౯౩౧).

**అప్పరాజుచెఱువు** — అనంతపురంజిల్లా, ధర్మవరం తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౧౩౩ (౧౯౩౧).

**అప్పరాజుపల్లి** — కడపజిల్లా, కడపతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౨౪౪ (౧౯౩౧).

**అప్పరు** — ౭ - వ శతాబ్దియందు సుప్రసిద్ధుఁడగు అరవ కవి. జన్మమున శూద్రుఁడు. ఇతని అసలుపేరు మరుళ్ నీక్కియర్. చిన్నతనమునందే యితని తల్లిదండ్రులు మరణించిరి. బాల్యమందియు

**అప్పాసాహెబ్ భోంస్లా** (నాగపూరు) — నాగపూరురాజా రెండవ రఘూజీరాజునకు వెంకాజీ యను పినతండ్రి కలఁడు. అతనికి సేనాధురంధరుఁ డన్న బిరుదును, చాందా, ఛత్తీస్‌గఢ ప్రాంతముల జాగీరును ఉండెను. అతనికుమారుఁడే అప్పాసాహెబు[1]. ఇతనికి ముధోజీ యన్న పేరుండెను. కాని వ్యవహారమందుమాత్రము అప్పాసాహెబన్న పేరే కలదు. ఇతఁడు చాందాలోఁ బుట్టి కొన్ని సంవత్సరములవఱకు నచ్చటనే పెరిఁగినట్టు కానవచ్చుచున్నది. ౧౮౧౧ లో నితనితండ్రి చనిపోఁగా నితనికి సేనాధురంధరత్వమును జాగీరును ప్రాప్తించెను. రెండవ రఘూజీ ౧౮౧౬ లో మరణము నొందెను. అతనికుమారుఁ డైన పర్సోజీ రాజయ్యెను. కాని యాతఁడు పిచ్చివాఁ డగుటచే రాజప్రతినిధి (Regent) కావలసివచ్చెను. రాజతల్లి యైన బాకాబాయికిని, రాజ్యమున కనంతరవారసత్వము గల అప్పాసాహెబునకును ఈ ప్రతినిధిత్వమునుగుఱించి పేచీపడెను. తుదకు రాజ్యమందలిసరదారులయొక్క మతివలనను, ఇంగ్లీషురెసిడెంటు సాయమువలనను అప్పాసాహెబే రాజప్రతినిధి యయ్యెను. ఈతఁడు ప్రతినిధిగా నున్నకాలమందింగ్లీషువారికిని ఈతనికిని సంధి జరగెను. 'ఇంగ్లీషువారు పర్సోజీకి సాయము చేయుటకై ఆఱు కాల్బలముల పటాలములను, కొంత గుఱ్ఱపుసైన్యమును, తోఫ్ఖానాయును ఉంచునట్లును, దానికి బదులుగ పర్సోజీ ఇంగ్లీషువారికి యేడులక్షల యేఁబదివేలరూపాయలు ప్రతియేఁట నిచ్చుటయేకాక ౨,౦౦౦ కాల్బలమును, ౨,౦౦౦ అశ్వసైన్యమును ఉంచవలెను.' ౧౮౧౭ లో అప్పాసాహెబు తన జాగీరైన చాందాకుఁ బోయెను. అతఁడు వెళ్లిన కొలఁది దినములకే పర్సోజీ చచ్చెను. అప్పాసాహెబే పర్సోజీని చంపించెనని కొందఱింగ్లీషుచరిత్రకారులు వ్రాసిరి. కాని యందుల కాధారమేమియు లేదు. పర్సోజీ తరువాత నప్పాసాహెబు రాజయ్యెను.

ఈతఁడు రాజ్యారూఢుఁ డైనప్పటినుండియు నీతనికి నింగ్లీషువారియెడఁ గల గౌరవము తగ్గఁజొచ్చెను. ఇంగ్లీషువారికిఁ బ్రతికూలురగు పూనాపేష్వాతోడను, గ్వాలియర్ సింధియాతోడను రహస్యముగఁ గలసి యింగ్లీషువారిమీఁదికి యుద్ధప్రయత్నములు చేయసాగెను. మహారాష్ట్రసైన్యముల కన్నిటికి నప్పాసాహెబును సేనాధిపతిఁ జేసి పూనాపేష్వా బాజీరావు సన్నదులను, దుస్తులను నాగపురమునకుఁ బంపెను. అంతఁబూర్వమే యింగ్లీషువారికిని బాజీరావునకును యుద్ధము ప్రారంభమైయుండుటచే, నా సన్నదులను దుస్తులను గ్రహింపవలదని బ్రిటిషు ప్రెసిడెంటు ఎంతచెప్పినను వినక అప్పాసాహెబు ౨౪-వ నవంబరు ౧౮౧౭-వ దివసమునఁ బెద్ద సభ చేసి పూనానుండి వచ్చిన యధికారమును వహించెను. ౨౬-వ తేదీని రెసిడెన్సీలోని యింగ్లీషువారిపై సైన్యమునకును, అప్పాసాహెబు సైన్యమునకును యుద్ధము ప్రారంభమాయెను.

రెసిడెన్సీ యనఁగా నింగ్లీషురెసిడెంటు ఉండుస్థలము. ఇది నాగపూరుపట్టణమునకుఁ బశ్చిమమున మూఁడుమైళ్లమీఁద నున్నది. దానికిఁ గొన్ని గజములు తూర్పున సీతాబల్డి[2] గుట్ట కలదు. ఇందు రెండు శిఖరములు కలవు. ఒకటి యెత్తుగను, మఱియొకటి దానికంటెఁ దక్కువ యెత్తుగను. ఈ రెండు శిఖరములకును నడిమిభాగము ఈ రెంటికంటెను ఎత్తు తక్కువదిగను నుండును. ఈ గుట్ట మొదట నెవ్వరి యధీనమందును లేదు. 'ఈగుట్టను స్వాధీనము చేసికొని, దానిమీఁదనుండి రెసిడెన్సీకి గుఱిపెట్టవలయును' నని అప్పాసాహె బాలోచించెను. కాని యీ సంగతి మొదటనే తెలిసికొని యప్పటి రెసిడెంటగు జెంకిన్సు గుట్టను స్వాధీనపఱుచుకొనెను. పైగుట్టమీఁద ౪౦౦ భటులును, క్రిందిగుట్టమీఁద ౩౦౦ భటులును ఒక ఫిరంగియు నుంచఁబడెను. రెసిడెన్సీ కాపువలకు గుఱ్ఱపుదళము ఉండెను. ఇంగ్లీషువారు గుట్టను పట్టుకొనుట కొంచెము ఆలస్యమైయున్నయెడల నప్పాసాహెబుసైనికులగు నరబ్బీవారు గుట్టను స్వాధీనపఱుచుకొని యుందురు. గుట్టను కొంచెము దూరమున వారు యజమానునియాజ్ఞకై యెదురుచూచుచుండిరి.

౨౬-వ తేదీ సాయంకాలము ౬ గంటల కరబ్బీసైనికులు సీతాబల్డిగుట్టను పట్టుకొనవలయునని దానిమీఁదికి వచ్చిరి. తెల్లవాఱుజామున రెండుగంటలవఱకు ఎన్నియోపర్యాయములు అరబ్బీవారింగ్లీషువారిమీఁదికి నొత్తుకొనివచ్చిరి. ౨౭-వ తేదీ యుదయమువఱకును గొండక్రింద ౧౮,౦౦౦ సైన్యమును, ౩౬ ఫిరంగులును వచ్చిచేరెను. గుట్టమీఁదివారు తమరక్షణనిమిత్తము చుట్టును ధాన్యపుబస్తాలు పేర్చి చిన్నయడ్డగోడను నిర్మించుకొనిరి. తొమ్మిదిగంట లగుసరికి నరబ్బీసైనికులు చిన్నగుట్టను స్వాధీనపఱుచుకొని యందున్న ఫిరంగితో పైగుట్టమీఁదికిఁ గాల్పఁజొచ్చిరి. ఇంగ్లీషుసైనికులు పెక్కుమంది హతులైరి. కాని మధ్యాహ్నమువఱకు నాగుట్ట మరల నింగ్లీషువారి యధీనమాయెను. అరబ్బీసైన్యమును ఫిరంగులును గుట్టయొద్దనుండి వెడలిపోయెను.

ఇట్లు పరాభూతుఁ డైన యప్పాసాహెబు తనయాజ్ఞ లేకయే స్వతంత్రించి యరబ్బీవారు పోరాడిరని రెసిడెంటునకు కబురంపెను. వీరికిని వారికిని రాయబారములు జరుగుచుఁ గొంతకాలము గడచెను. డిసెంబరు ౧౬-వ తేదీని అప్పాసాహె బింగ్లీషువారియధీనుఁ డయ్యెను. కాని యాతనిసైనికులుమాత్రము వశులయినవారు కారు. ఆసైనికులతో నాగనదికిని మక్కూర్దరా చెఱువునకును నడుమ నింగ్లీషువారికి యుద్ధము తటస్థమాయెను. అందు మరాటీవారు పరాజితులైరి

1 ఈ శబ్దమునకు మరాటీలో 'అప్పా', 'ఆపా' అని రెండురూపములును గలవు. ఈ శబ్దము తెలుఁగు కన్నడములలోని 'అప్ప' (అయ్య) శబ్దమే కాని వేఱు కాదు.

2. దీనినే యింగ్లీషులో సీతాబల్డి (Sitabaldi) అని వ్రాయుదురు.

కాని అప్పాసాహెబువెనుక నున్న అరబ్బీసైనికులును, హిందూస్థాని సైనికులును అప్పాసాహెబు చెప్పినను 'నాగపురపట్టణము నింగ్లీషు వారి యధీనము చేయ' మని డిసెంబరు ౩౦-వ తేదీవఱకు నాపట్టణమును వశమం దుంచుకొనిరి. చివరకు వారికి ముట్టవలసిన జీతమంతయుఁ దీసికొని యింకను గొంత బహుమతి వడసి, సురక్షితముగఁ దమ శస్త్రాస్త్రములతోఁ బోవుట కధికారమును బొంది వారు నాగపూరు పట్టణమును విడిచి వెళ్లిరి. అప్పటినుండి హైదరాబాదునవాబు కొద్దకుఁ బోయి యాతనికొలువులోఁ జేరిరి.

ఇచ్చట నప్పాసాహెబును జనేవరి ౯-వ తేదీవఱకును రసిడెన్సీలో నుంచి యాతనిచే నీక్రిందిప్రకార మొప్పుదలలు చేయించుకొని యింటికిఁ బోనిచ్చిరి —

'నర్మదానదికి నుత్తరమం దున్న రాజ్య మంతయు, దక్షిణమందలి కొన్ని ప్రదేశములును బర్హాడ్ (దీనినే యింగ్లీషులో బీరార్ అందురు), గావిల్‌గడము, శిర్‌గుజా, జబ్బుపురము అను సంస్థానముల పైఁ దనకుఁ గల హక్కును అప్పాసాహెబు ఇంగ్లీషువారి కియవలయును. ఇంగ్లీషువా రాతనినిమిత్తమై యుంచునట్టి 'సబ్‌సిడీ' సైన్యమునకును కంటింజెంటుసైన్యమునకును నీపైని జెప్పిన ప్రాంతములు ప్రతిఫలముగ నీయవలెను. రెసిడెంటుసలహా ననుసరించియు, బ్రిటిష్ గవర్న్మెంటువారినమ్మకమునకుఁ బాత్రు లయిన మంత్రుల యనుమతి ననుసరించియు అప్పాసాహెబు రాజ్యము చేయవలయును. ఆతఁడు నాగపురరాజభవనమునం దింగ్లీషు సైనికుల సంరక్షణములో నుండవలయును. పైని చెప్పఁబడిన ప్రాంతము లన్నియు నింగ్లీషువారి యధీన మగుటవఱకును వారికి 'సబ్‌సిడీ' క్రింద రావలసిన మూనాల పైకము ముట్టుచుండవలెను. ఇంగ్లీషువా రాతనిరాజ్యమందలి యే కోటను గోరినను వెంటనే యది వారి యధీనము చేయవలయును. ఆజ్ఞ వినవట్టి పురుషుని నింగ్లీషువారికి వెంటనే పట్టియీయవలయును. సీతాబర్డీ రెండు గుట్టలును, బాజారులును, దానికి సమీపమునందలి భూమి వలయునంతయును బ్రిటిషుగవర్న్మెంటువారి కిచ్చివేయవలయును. వారి కావశ్యక మని తోఁచిన పనులు, యుద్ధమున కక్కఱపడు నని వా రాగుట్టమీఁదఁ జేయుటకు వారికి (ఇంగ్లీషువారికి) స్వాతంత్ర్యము కలదు.'[1]

అప్పాసాహె బిట్లు మరల రాజ్యమును పొందియు నింగ్లీషు వారిమీఁది వైరమును మానఁడయ్యెను. ఇంగ్లీషువారి కిచ్చిన నన్ని ప్రదేశములు వారికి స్వాధీనము గాకుండ యత్నించెను. బాజీరావును చాందామీఁదికి నెత్తిరమ్మని చెప్పి తానుగూడ నచ్చటికిఁ బోవఁ దలంచెను. అందుచే రెసిడెంటు ఆతనిని పట్టుకొని, తగిన సిబ్బంది నిచ్చి ప్రయాగకోటలో నుంచుటకై పంపెను. కాని త్రోవలో నతఁడు తప్పించుకొని మహాదేవపర్వతములమీఁదికిఁ బోయెను. పెండారీ నాయకుఁ డగు చిత్తూతోఁ గొన్ని దినములు కలసియుండెను. అచ్చట నుండి అసీర్‌గఢమునకుఁ బోయెను. మరల నచ్చటినుండి పంజాబు దేశమునకుఁ బోయి రంజిత్‌సింగుకొద్ద నుండి యచ్చటనే మరణము నొందెను.

1 Atchinson's Treaties, Vol ii, pp. 109-110.

**అప్పాసాహెబ్ భోసలా (సతారా)** — సతారా రాజులలోఁ జివరవాఁడు. ఇతనికి శహాజీ యన్న పేరు కలదు. అప్పాసాహెబ్ అనునది గౌరవనామము, వ్యవహారనామము. శివాజీ పెద్దకుమారుఁడైన సంభాజీయొక్క సంతతివారు సతారాలో రాజ్యము చేయుచుండిరి. క్రీ. శ. ౧౮౩౯ లో 'ప్రతాపసింగ్ నారాయణ' యనురాజును సింహాసనభ్రష్టునిఁ జేసి, యాతని మీఁదట తమ్ముఁడైన అప్పాసాహెబును ఇంగ్లీషువారు రాజ్యమునిమీఁదఁ గూర్చుండఁబెట్టిరి. ఆతఁడు రాజ్యమునకు వచ్చిన తోడనే స్త్రీల సహగమనము చేయుట అడ్డివేసెను. రెండులక్షల రూపాయలు వెచ్చించి సతారాకు నీటివసతి చేర్పఱిచెను. రెండు లక్షలు పెట్టి వేణా కృష్ణానదులకు వంతెనలు కట్టించెను. నూతనరాజభవన మొకటి నిర్మించెను. అది యిప్పుడు న్యాయస్థానముగ నుపయోగింపఁబడుచున్నది. ఇతఁ డింగ్లీషువారియెడ మిక్కిలి విశ్వాసముతోఁ బ్రవర్తించెను. ఆతఁడు ౧౮౪౮-వ సంవత్సరము, ఏప్రిల్ నెల ౫-వ తేదీని మృతినొందెను. మరణమునకుఁ బూర్వము బలవంతరావు భోసలా యను పిల్లవానిం బెంచుకొనెను. వానికి వెంకాజీ యని పేరు పెట్టెను. కాని యింగ్లీషువా రాదత్తతను ఒప్పుకొనక సతారా రాజ్యము తమ యధీనము చేసికొనిరి.

**అప్పాశాస్త్రి** — ఒకకవి. లవలీపరిణయము, సారస్వతాదర్శము అను రెండునాటకములను రచించెను. ఈనాటకములే కాక యితఁడు రచించినవి 'అప్పాశాస్త్రీవాదార్థః', 'చిల్లరవాదాః' అను మఱిరెండు గ్రంథములుకూడ నున్నట్లు తెలియుచున్నది.

**అప్పికట్ల** — ౧. గుంటూరుజిల్లా, బాపట్లతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౬౩౨ (౧౯౩౧)

౨. కృష్ణజిల్లా, గుడివాడతాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౭౯౪ (౧౯౩౧)

**అప్పికొండ** — విశాఖపట్టణముజిల్లా, విశాఖపట్టణము తాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౯౬౬ (౧౯౩౧)

**అప్పిశెపల్లి** — అనంతపురముజిల్లా, కల్యాణదుర్గము తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౭,౧౨౦ (౧౯౩౧).

**అప్పకొండయ్యఖండ్రిక** — చిత్తూరుజిల్లా, తిరుత్తనితాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౫౬

**అప్పేచెర్ల** — అనంతపురము జిల్లా, గుత్తి తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౨,౧౮౭ (౧౯౩౧).

**అప్రతిరథుడు** — ౧ ఋగ్వేదమునందలి ఒక సూక్తము (౧౦ ౧౦౩) రచించిన ఋషి. (ఐతరేయబ్రాహ్మణము, ౮ ౧౦)

౨ (సూ వం) ఇక్ష్వాకువులలో తృష్ణుఁడైన కువలయాశ్వరాజునకు నామాంతరము (భా, వన, అ ౨౦౪).

౩ (చం వం) యయాతి పుత్రుఁడైన పూరురాజు వంశజుఁడగు అంతినారుని మువురుపుత్రులలోఁ జిన్నవాఁడు ఇతని పుత్త్రుఁడు కణ్వుఁడు

**అప్సరసలు** — స్వర్గమందలి భోగస్త్రీలు నాట్యకర్త్రులు వీరి ఉత్పత్తి అగ్నిపురాణమందు వీరు ముఖ్యముగఁ బండ్రెండుగురని చెప్పఁబడినది, ఊర్వశి, మేనక, రంభ, మిశ్రకేశి, అలంబుష, విశ్వాచి, ఘృతాచి, పంచచూడ, తిలోత్తమ, భానుమతి, అబల, రమ్య (గణభేదాధ్యాయము). మహాభారతమునందు వేఱుగాఁజెప్పఁబడినది అలంబుష, మిశ్రకేశి, విద్యుత్పర్ణ, తిలోత్తమ, అరుణ, రక్షిత, రంభ, మనోరమ, కేశిని, సుబాహు, సురత, సురస, సుప్రియ, అతిబాహు (మహా భా, ఆది). వీరందఱును దేవదానవులవలెనే కశ్యపప్రజాపతిసంతతివారనియుఁ జెప్పఁబడినది. అప్సరసలు పదునాలుగుకులములవారు, అం దొకటి బ్రహ్మదేవునిమనస్సునుండియు, రెండవది వేదములనుండియు, మూఁడవది అగ్నినుండియు, నాల్గవది గాలినుండియు, అయిదవది అమృతమునుండియు, ఆఱవది జలమునుండియు, ఏడవది సూర్యకిరణములనుండియు, ఎనిమిదవది చంద్రకిరణములనుండియు, తొమ్మిదవది మేఘమునుండియు, పదవది భూమినుండియు, పదునొకండవది మృత్యువునుండియు, పండ్రెండవది మన్మథునినుండియు, పదుమూఁడవ పదునాలుగవ కులములు దక్ష ప్రజాపతి కూఁతు రయిన ముని, అరిష్ట యనువారికి గంధర్వులవలన నుండియు పుట్టెను అని కాదంబరిలోఁ జెప్పఁబడియున్నది (వాచస్పత్యము)

**అప్సరోయుగము** — భారతవర్షీయ తీర్థము.

**అఫ్ఘాన్ తుర్కిస్థానము** — ఇది అఫ్ఘానిస్థానపు ఆమూదారు నదీతీరమునందు ఉన్న తుర్కిస్థానములోనిభాగము. అఫ్ఘాన్ తుర్కిస్థాన మన్న పేరు ఇంగ్లీషువారు వాడుదురే కాని యీదేశమునందు వాడుకలో లేదు. ఆదేశమువారు తమదేశమును తుర్కిస్థాన మనియెదరు. ఇది అఫ్ఘానిస్థానమునకు మిక్కిలి ఉత్తరమునను మధ్యఆసియా కొండలలోనియు ఉన్నది. దీని ఉత్తరమున రష్యారాజ్యము గలదు. పూర్వము బదక్షాన్, బాల్ఖ్, కటఘాన్ అనునవి యందులో నివిగాను యుండెను. కాని యిటీవల వానిలోటిని ప్రత్యేకముగా విభజించి ఒకపరగణా నిర్మింపఁబడినది. ఇందలి కొంత భాగము పర్వతమయముగను, మిగిలినది మైదానములు కలదిగను ఉన్నది. దీని విస్తీర్ణము ౫౪,౦౦౦ చదరపుమైళ్లు జనసంఖ్య ౪,౫౦,౦౦౦ ఇందలి 'బాల్ఖ్' అను ప్రదేశమును పూర్వము బాక్ట్రియానా యని యనుచుండిరి జరత్సుష్ట్రుఁడు (Zoroaster) తన మతమును మొదట నచ్చటనే బోధించె నని చెప్పుదురు ఈ బాక్ట్రియానా మిక్కిలి పురాతనకాలమందు 'అకిమినియన్' సామ్రాజ్యములో (Achaemenian Empire) నిమిడియుండెను క్రీ పూ. ౨౫౦లో థియోడోటస్ అనువాడు, అచ్చట 'సెల్యూకసు'చే రాజునకు ప్రతినిధిగా నుండి స్వతంత్రుఁడయ్యెను ఇతఁడ గ్రీకో బాక్ట్రియన్ వంశమునకు మూలపురుషుఁ డని చెప్పవచ్చును తరువాత క్రీ పూ ౧౨౦ ప్రాంతమున పార్థియనులు, శ్వేతహూణులు, కుషాణులు మొదలయినవారిచే నీవంశ మంతరించెను తరువాత బౌద్ధయుగము వచ్చెను ఇచ్చట బౌద్ధమతప్రచారము విశేషముగా నుండినట్లు ఇప్పటికిని గనుపడువిగ్రహాదులవలన స్పష్టపడుచున్నది. అప్పు డుండిన నవవిహార మను పేరుగలది ఇప్పటికిని అచ్చట నొకటి గలదు

చెంగీస్ ఖానుని దాడికి లోఁబడి పాడై యీప్రదేశము మిక్కిలి దీనావస్థం జెందెను ఇది కొంతకాలము ఢిల్లీశ్వరులయాధీనమం దుండి తరువాత యూజ్ బేగ్ వంశీయులచే నాక్రమింపఁబడియెను ౧౮-వ శతాబ్దియం దిది అహమ్మద్ ఖాను రాజ్యములోఁ జేరియుండెను తరువాత నాతనికుమారుఁడైన తైమూరుకాలమున విడిపోయెను ౧౯-వ శతాబ్ది ప్రారంభమున నిది బొఖారారాజ్యమునకుఁ జేరియుండెను దోస్తు మహమ్మద్ కాలమున అఫ్ఘానులు ౧౮౫౦ లో బాల్ఖ్ తష్కురగా అను ప్రాంతములను, ౧౮౫౫ లో, అక్చా మొదలయిన అయిదు పశ్చిమ ప్రాంతములను, ౧౮౫౯ లో కుందుస్ ప్రాంతములను స్వాధీనపఱచుకొనిరి ఇందులోఁ గొంతభాగమునుగుఱించి తగాదా లుండెను కాని ౧౮౭౩-లో ఇంగ్లీషువారును, రష్యావారును కలసి ఒక పంచాయతీ చేర్చిరి ఆ పంచాయితీదారులా ప్రాంతములను అఫ్ఘానుల కొసంగిరి అబ్దుర్రహిమాన్ ఖాను కాలమున నీ ప్రాంత మఫ్ఘానులకు పూర్తిగ లోఁబడెను

**అఫ్గానిస్థానము** — భూమండలముయొక్క పూర్వార్ధగోళమందలి యాసియాఖండదేశములలో నొకటి ఇది హిందూదేశమునకు వాయవ్యదిశయం దున్నది బదక్షాను, కాఫిరిస్థానములనుగూడఁ గలిపినచో మొత్త మీ దేశముయొక్క వైశాల్యము ౨,౪౦,౦౦౦ చదరపుమైళ్లు ఇందలిజనసంఖ్య ఎనుబదిలక్షలు

సరిహద్దులు - భౌతికలక్షణములు — ఈదేశమున కుత్తరమున రష్యాతుర్కిస్థానమును, తూర్పున కాశ్మీరము, పెషావరు ఇలాకాయును, దక్షిణమున బలూచిస్థానమును, పడమట పర్షియాదేశమును గలవు. ఈదేశ మీశాన్యకోణమునందుండి నైరృతిదిశకు అండాకృతిని

కోహాక్ పర్వతములనుండి చమను నగరము మీదుగ నుష్కి ప్రాంతము నుండి హెల్మండ్ ఎడారిని దాటి సైస్థానమునకు దక్షిణమునఁ బర్షియాదేశపు సరిహద్దుతోఁ గలయును అచటనుండి ఇది ఉత్తరాభిముఖమై పర్షియారాజ్యపు తూరుపు పెల్లగ హారిరూడ్ అను నదివఱకు నవ్యవస్థితమార్గమునఁ బోవును. అక్కడినుండి జుల్ఫకీర్ వఱకును హారిరూడ్ నదియే అఫ్గాని-పర్షియా సీమారేఖ

పర్వతములు, నదులు — ఈదేశ మంతయు నొక విశాలమైన భూమి. పర్వతమయము సముద్రపు నీటిమట్టమునకంటె నిది ౨,౦౦౦ లు మొదలు ౪,౦౦౦ల యడుగుల ఎత్తువఱకును గలుగు పీఠభూమి యడుగుల ఉన్నతప్రదేశములును గలవు, అనఁగా ఖందరు, కాశిబాద మున్నగు కేవుపట్టణములందు నివసించువారికంటె నొకమైలు ఎత్తుగలప్రదేశములందు నివసించు జనులు ఇచటి పర్వతశిఖరములు ౨౪,౦౦౦ ల యడుగులయెత్తువఱకు నున్నవి హిందూకుశపర్వతములును, వాని శాఖోపశాఖలును దేశము నంతటను వ్యాపించియున్నవి ఈ పర్వతశాఖ లన్నియు హిమాలయోన్నతభూముల వాయవ్యభాగమునే కావచ్చును ఈశాఖ లన్నియు దక్షిణ, వాయవ్యాభిముఖములుగ తాలవృంతాకృతిని ప్రసరించి క్రమముగఁ దిగ్గిపోవుచు తుదకు పర్షియాపరిహద్దులం దున్న ఎడారులందును, మైదానములందును లోపించి పోవును ఈ దేశపు నైరృతికోణమున అఫ్గాని - పర్షియా సరిహద్దులదగ్గఱ సముద్రతటమునకు ౧,౮౦౦ అడుగుల యెత్తున విశాలమును పల్లపుప్రదేశము గలదు సముద్రగాములు కానినదు లన్నియు నీ పల్లమునకే చేరుచుండును ఇట్టిపల్లములే హామూను లని పిలువఁబడు చున్నవి. కోహిబాబాకొండలు హిందూకుశములకు పశ్చిమముగ వ్యాపించి యక్ వలంగ్ అనుచోట మూఁడు పాయలుగఁ జీలిపోయినవి వీనిలోఁ బడమట హారిరూడ్ నదికి దక్షిణముగ సఫేద్ కోహకొండలును, దాని యుత్తరమున బందిబాబాకొండలును, వాని కింపుక ఈశాన్యముగ బంద్-ఇ-తుర్కి-స్తాన్ కొండలును గలవు పామీరు పీఠభూమియందలి కొంతభాగ మీదేశమునకుఁ జెందినది కలదు జలాలాబాదున కాగ్నేయముగ నున్నకొండలను సఫేద్కోహా లనియే పిలువఁబడుచున్నవి ఇతిహాసప్రసిద్ధము కైబర్ కనుమ ఈ కొండలలోనిదే

దేశమందలి ఈ నానాపర్వతశ్రేణులవలన నేర్పడిన లోయ లన్నియు నదులు, వాఁగులుగఁ బరిణమించియున్నవి కాని వాని యన్నింటిలో ముఖ్యమైనవి నాలుగైదుమాత్రమే పామీరు పీఠభూమిలోఁ బుట్టిన అక్సస్నదియు, దాని యుపనదులును ఈదేశపు ఉత్తరభాగమును జాలవఱకుఁ దడుపుచున్నవి ముర్ఘబ్, హారిరూడ్ నదులు కొంతదూరము ప్రవహించి యిసుకలో మాయమైపోవును కాని విశాలమైన యీ అక్సస్ యొక్క ఉపనదులే గడ్డమంచుచే నిండు కొనియుండు పర్వతకందరములనుండియు, హిమానీనదముల( Glaciers )నుండియు, కరఁగు మంచునీరు అక్సస్నదిని జేరుచుండును. ఇది బొఖారాదేశమునుండి ప్రవహించి ఏరల్ సముద్రమునఁ గలయును హెల్మండ్ నదియు, దాని యుపనదులును, దానిశాఖలును నైరృతి భాగమున వ్యాపించియున్నవి. కాబూలునది అదేపేరు గల రాజధానీపట్టణమునకుఁ బశ్చిమముగ ౪౦ మైళ్లదూరమునఁ బుట్టి తూర్పుగఁ బ్రవహించుచు పోయి అటక్-ఖైరాబాదులదగ్గఱ సింధునదములోఁ గలయును వేదప్రసిద్ధము కుభానది ఇదియే. గోమల్ నదియు, దాని యుపనదులును ఈదేశపు ఆగ్నేయభాగమును నీటివసతి కలదానిగఁ జేయును ఇదియు సింధునదముయొక్క ఉపనదియే

తటాకములు — ప్రాకృతికసరోవరము లీదేశమునఁ జాలఁ గలవు కాని ముఖ్యమైనవి రెండుమాత్రమే గజనీనగరమున కఱువది మైళ్లదూరమున అబ్-ఇ-ఇస్తాదా యను సరస్సు కలదు దీని పొడవు ౧౭ మైళ్లు, వెడల్పు ౧౫ మైళ్లు, కాని లోఁతు ౧౨ అడుగుల మించి లేదు గజనీపట్టణమునకు దగ్గఱగనే ఒక సరోవరము కలదు. దీనిపేరు అన్వార్ సరస్సు మూఁడువది మీఁద నదించిన విక్టోరియా సరస్సు అచటివారు దీని నేమందురో తెలియదు కాని, ఆంగ్లేయులు దీనికి పేరు పెట్టిరి ఇది సముద్రతటమునకు ౧౩,౨౦౦ ల యడుగుల యెత్తున నున్నది దీని పొడుపు పదిమైళ్లు, వెడల్పు మైలున్నరమాత్రమే

పురాతత్త్వము — కాబూల్ నది ప్రవహించు లోయ లన్నియు బౌద్ధకాలమునాఁటి వస్తుజాలముల మునికిపట్లు కాబూలున కుత్తరముగ నున్న బామియానామకనగరమున రాతివిగ్రహము లనేకములు గలవు ఉత్తరమందలి తాష్కుర్గాన్ పట్టణమునుండి కాబూలునకు వచ్చు మార్గమున నున్న హైబక్ అను నగరమునందుఁ బురాతన బౌద్ధావశేషము లనేకములు గన్పట్టుచున్నవి కోహి దమన్ అను ప్రదేశమందు వినష్టప్రాచీనస్థానములను సూచించు మంటదిబ్బ లపరిమితముగఁ గలవు కినిలో బెగ్రాం అనునది యొక పెద్దదిబ్బ ఈదిబ్బలను త్రవ్వించుటవలన అనేకములగు నాణెము లమితముగ దొరకుచున్నవి జలాలాబాదు సమీపమునందును, కాబూలుదగ్గఱను, చుట్టుప్రక్కల నున్న కొండలమీఁదను స్తూపములు గన్పించుచున్నవి టర్నాక్ నది ప్రవహించులోయయందు మట్టిలో మరుఁగైపోయిన నగరచిహ్నములు గానవచ్చుచున్నవి ఇదే కోట ప్రాచీనకాలపు అరోక్సియా యయియుండవచ్చునని పురాతత్త్వవిదు లనుమానించియున్నారు. హెల్మండ్ నదీతీరమందలి గిరిష్కనగరమునఁ బూర్వకాలపుభవనముల గుర్తులు కలవు ఇవన్నియుఁ బురాతనపు దాంగ్రియానాకుఁ జెందిన వని యూహించిరి కంధహారము(గాంధారము)నందలి యొకమసీదులో పాషాణభిక్షాపాత్ర మొకటి కలదు. ౫-వ శతాబ్దియందు పెషావరులో నుండిన శాక్యమునియొక్క భిక్షాపాత్ర మిదియే యని నిర్ణయింపఁ బడెను ఇట్లు గ్రీకు-బాక్ట్రియాపరిపాలనావశేషములు, బౌద్ధప్రాచీనకాలపునవశేషములుమాత్రమే కాదు-లెక్కకు మిగిలియున్నవి ఈ రెండు యుగములకును పూర్వ మిచట హిందువు లుండి రని యూహించుటకుఁ దగిన చిహ్నములు, మఠములు లోనగునవి గూడ నీదేశమునఁ గలవు. లండీకోటల్ సమీపమందున్న పర్వతములోయ లలో భగ్నావశిష్టము లైన మహాదుర్గములు కలవు ఇవి బౌద్ధకాలము

వాఁటివో తెలియదు. ప్రస్తుత మిదియన్నియు కాఫిర్ కోటయని పిలువఁ బడుచున్నది. కాని మహమ్మదీయయుగము నాఁటి కట్టడము లంతగాఁ గానరావు. గజనీ మిక్కిలి పురాతననగరము. అనేక సంవత్సరముల పర్యంతము ఇది మహమ్మదునకును, వరని సంతతివారికిని రాజధానిగ నుండెను. కాని ఇచటఁ జెప్పఁదగిన కట్టడ మేదియు లేదు. ప్రాచీనకాలపు నాణెములు దేశము దన్ని దిక్కులఁ గలవు. వీని త్రవ్వి తీయుటనధికారము ఫ్రెంచి దేశీయులు పడసియున్నారు.

ఖనిజములు. — ఖనిజసంపదయందుఁ జేరెన్నికగన్న దేశములలో నిదియు నొకటియని చెప్పవచ్చును. కంధహారమునకు మూఁడు మైళ్లదూరమునను, మారుఫ్ న కుత్తరముగనున్న కొండలయందును, ఇస్తాలిఫ్ సందును, లాఘమాన్ దగ్గఱివాఁగులందును బంగారము కలదు. హజారాజత్, పంజషీర్ లోయలందు వెండిగనులున్నవి. కుర్రంఘోమాల్ వాగుకవదుల మధ్యమున్న పెర్వాలీ ఇలాకాయందును, జబల్-అస్-సిరాజ్, పంజషీర్, హిందూకుశములందును ఇనుము దొరకును. కావియాకుఁ బోవు కనుమలన్నియు లోహమయములే. మఱియు నీదేప్రాంతమున కొన్ని మైళ్ల పొడువున నుండి ఇనుము గలకొండల పంక్తి యొకటి వ్యాపించి యున్నది. ఘర్ద్-కాబూల్ సమీపమునను, కర్కచాపర్వతములందును, సైఘన్ ఫూలేలమధ్య నున్న సురఖబ్ లోయలందును, ఆ నదియొక్క యెడమవైపున నున్న ఇమప్టియందును, కుందుజ్ నకు ౨౦ మైళ్లదక్షిణమున నరీన్ నందును, అఫ్గానిస్తానమందలి కరాకోహ పర్వతముల కుత్తరముగ నున్న భగాల్ నందును, దానికిఁ బడమరగ నున్న షినలంగ్ నందును, ఘోర్బంద్ లోయలందును రాతిబొగ్గు కావలసినంత దొరకును. కాబూలునగరమునకు ౫ మైళ్లు దక్షిణముగను, ౫౦ మైళ్లు నైరృతిదిక నున్న ఖుపేఖో నావురమందును తామ్రపుగనులు కలవు. ఇది కాక దేశమందింకను పలుతావుల రాగి లభించును. దానినిమయపై ఇంతవఱకు త్రవ్వి ప్రయత్నములు కాని సలుపఁబడుట లేదు. కుర్రంజిల్లా యుత్తరభాగమునందును, షిన్వారీదేశమందును, సఫేద్ కోహ్ పర్వతములందును, కకరదేశమునందును, హజారాజాత్, ఫరింజాల్, ఘోర్బంద్ కనుమలలోని లోలింజ్ మున్నగు స్థానములందును సీసము విస్తారముగఁ గలదు. హిరాత్ నందలి సీసపుగనులు త్రవ్వఁబడుటయే లేదు. కాబూలునగరమునకు ౩౨ మైళ్లు, వాయవ్యముగ నున్న అఘుబాడద్ ప్రాంతమున అంజనమిశ్రితమైన సీసపుగనులు కలవు. కాని, ప్రస్తుత ముపయోగింపఁబడు సీస మంతయు హజారాజాత్ నుండి కొనిరాఁబడుచున్నది. అచట నిది భూమిని త్రవ్వవలసిన యవసరము లేకయే లభించును. ఫరింజాలునందలి గని అతి ప్రాచీనకాలమునుండియుఁ బనిచేయఁబడుచున్నది. కంధహారమునకు ౩౦ మైళ్లు మారమున షామకుల్ నాముక పర్వతశ్రేణియందు అంజనము లభించును. బదక్షానమునందును, ఫైజాబాద్, జలాలాబాద్ మార్గమధ్యమున ఫిర్గాహ్ ప్రదేశమునకు దక్షిణమునను కెంపులు దొరకును. కంధహారము, హిరాత్, అఫ్గానిస్తానములందును, కామ్రద్ లోని దస్త్-ఇ-నఫీస్ సమీపమునందును కొన్నివిధముల ముగ్గుసున్నపు రాయి దొరకును. గంధకపుగనులు హిరాత్ ప్రాంతమున నున్నవి. కాని ప్రస్తుత ముపయోగమునిమిత్త మీవస్తువు హజారాజత్ దేశమునుండియు, మైమనాలోని ఫిర్కి త్రిబాముక ప్రదేశమునుండియుఁ గొని రాఁబడుచున్నది. మూలకార మెక్కడఁబట్టిన నక్కడ దొరకును. దేశము దన్ని దిక్కులను పాలరాయి కలదు. కటఘనమునందును, కుందుజ్ సమీపమునను రాతియుప్పు లభించును. అఫ్గానిస్తానమంతయుఁ బలకరాతిమయము. కెంపులు మున్నగు విలువగల రాళ్లు ఉత్తరమార్గమున రష్యాకుఁ బోవుచుండును.

కాలమానము — ఈదేశపుటెత్తుభూములందు వేసవికాలమునం దెండ లతితీవ్రముగను, శీతకాలమునందుఁ జలి యపరిమితముగను నుండును. కాబూల్, గజనీప్రాంతములందు శీతకాలమున మూఁడు నెలలపర్యంతము మంచు గురియుచుండును. అనవాఁయములు దొరికిన ఖజానాలలోఁ దిరుగుటకు వీలుండదు. శ్రేయంబవత్లు జనులు నిప్పులతో నిండిన కుంపట్లను దగ్గఱఁ బెట్టుకొని దినములు గడపుచుందురు.

చలికాలమున కంతకును సరిపోవు ఆహారసామగ్రులు ముందుగనే సేకరింపఁబడియుండును. కావున వీరికి శలువుగ వెలుపలికిఁ బోవలసినయవసర ముండదు. ఇంటికప్పులు, కాకాలులు, బయళ్లు, బీళ్లు, పొలములు మొదలగున వన్నియు స్వచ్ఛస్ఫటికమువంటి హిమముతో నిండి సూర్యకాంతులవలనఁ దళతళ మెఱచుఁ గనుల కానంద మొనగూర్చుచుండును. వృక్షము లన్నియు నీ హిమపాతము మూలమునఁ బర్ణవిహీనములై యెండిపోయినవానివలెఁ గన్పించును. అగ్నిస్పర్శము లేక యొక్కొక్కసమయమున చేతివ్రేళ్లుపైత మాడవు. ఆ సమయమున తాపమాపకము (Thermometer) నందలి పాదరసము సున్నకుఁ 'క్రింద ౧౫' అంకములు దిగియుండును. గజనీనగర మనేకపర్యాయములు మంచు తుపానులచే ధ్వంసమైపోయినట్లు గాథలు కలవు. ఇఁక యెండకాలమున యెండలును పెద్దలఁ దలపించుచుండును. అందును కంధహార ప్రాంతమునందలి వేఁడిమి భరింప నలవి కానిది. ముడిగాడ్పులు, గాలిదుమారములు విజృంభించి మట్టమధ్యాహ్నమునకైనఁ జీఁకట్లు క్రమ్మునట్లు చేయును. కంధహారు-ఇలాకాయందుఁ జలికాలమున మంచు మిక్కుటముగ పడదు. హిరాత్ ప్రాంతములందును ఒకవిధమగు గాలి వీచుచుండుటచేత వేసవిని ఎండ లంతయెక్కువగ నుండవు, చలికాలమున మంచును ఎక్కువ పడదు. ఈదేశమందలి వాతావరణము శుష్కము. ఆంధ్రదేశమున వెండకాలమునఁ దొలకరివానలు కురియునట్లు ఈదేశమునఁ గురియవు. హేమంతము గాని నిర్మలాకాశము, ప్రకాశవంత మగు సూర్యకాంతి, స్వచ్ఛచంద్రికాపూర్ణమగు రాత్రి నిశాసమయములు ఈ దేశమున ఆనంద మొసగూర్చుచుండును. కాబూలునందు సగటున సంవత్సరమునకు ౧౧ అంగుళములవాన కురియును. మొత్తముమీఁద సంవత్సరమునందు ౯ నెలలు పొడుగ యెండ కాయుచుండును.

జనులు - జాతులు, మతములు - భాషలు .— ఈ దేశమందలి జనులలో నలిగజాతులు కలవు. వానిలో అఫ్గనజాతి ప్రధాన

(Archosia) అనియుఁ జెప్పఁబడెను. మక్రాన్ అనుప్రాంతమునకు గడ్రోషియా (Gedrosia) అనియు, బాల్కు అనుదానికి బాక్ట్రియా (Bactria) అనియుఁ జెప్పఁబడెను. ఈభాగము లన్నియు పారసీకరాజులక్రింద నుండెను. క్రీ. పూ. ౩౨౭-౨౬ లో నీదేశముల నన్నిటిని మహావీరుఁడైన అలెగ్జాండరు[1] జయించెను. ఇతఁడు క్రీ. పూ. ౩౨౩ లో మృతుఁడు కాఁగా వానిని రాజ్యములోని పూర్వభాగ మాతనిసేనాని యైన సెల్యూకస్ నికెటర్ అనువానికిఁ జెందెను. అతనిరాజ్యములోనే అఫ్గానిస్థానమందలి పైరాజ్యములు కలవు. క్రీ. పూ. ౩౦౩ లో నితనిని ఓడించి (బాల్కు రాజ్యము తప్ప) యీ రాజ్యము లన్నియు మగధదేశపు మౌర్యచక్రవర్తి యైన చంద్రగుప్తుఁడు స్వాధీనపఱచుకొనెను.[2] కొన్ని దినములకు నీరాజ్యములు మగధరాజులచేతినుండి జాఱిపోయెను.

ఈ దేశములో పార్థియను లనువారు కొంతభాగమును, శక వంశమువారు కొంతభాగమును క్రీ. పూ. ౧౩౦ ప్రాంతమున ఆక్రమించిరి. గ్రీకువారిప్రభుత్వము బాక్ట్రియాలోఁ గొంతదనుక నుండెను. రెండు శతాబ్దులతరువాత యూచీ అనువారు మధ్య ఆసియానుండి వచ్చి గ్రీకువారిని పార్థియనులను వెడలఁగొట్టిరి. వీరినే కుషాణవంశమువా రని చెప్పుదురు. వీరిలో కనిష్కుఁ డనువాఁడు మిక్కిలి గొప్పరాజు (౭౮-౧౨౩). ఈతనిరాజ్యము హిందు దేశమందు గంగవఱకును, కాశ్మీరము, పెషావర్, కాబూల్, ఆక్సస్‌నదీప్రాంతము మొదలగునప్రదేశము లన్నియు వ్యాపించియుండెను. ఈతఁడు బౌద్ధమతాభిమాని. ఈ వంశమువారు ౫-వ శతాబ్దివఱకు నీదేశముపై రాజ్యము చేసిరి. ఆ శతాబ్దియందు వారు తెల్లనివారైన హూణులచే నోడింపఁబడిరి. కాని వీరిప్రభ పూర్తిగ నేడవశతాబ్దివఱకును బోలేదు. వీరినే షాహిరాజు లందురు. వీరికాలములో నీదేశమున బౌద్ధమతము వ్యాపించియుండెను. ఇప్పటికిని బౌద్ధమతచిహ్నము లాదేశమునందుఁ గానవచ్చును. ఈ షాహివంశము చివరపురుషుఁడు లోరమానుఁ డనువాఁడు దుర్మార్గుఁడైనందున వానిని చంపి యాతని మంత్రి యగు కలారుఁ డనువాఁడు క్రీ. శ. ౮౫౦-వ సంవత్సర ప్రాంతమున రాజయ్యెను. వీఁడు బ్రాహ్మణుఁ డని కొందఱు తురకలు వ్రాసినారు. కాని క్షత్రియుఁడై యుండు నని యితరుల యూహ. ఈవంశమువారు క్రీ. శ. ౧,౦౦౦ వఱకును గాబూలులో రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది. ఈ వంశమువారు 'మిక్కిలి రాజ్యవిస్తారము గలవారయ్యును ఉత్తమసద్గుణసంపన్నులుగను, ఆడిన మాట తప్పనివారుగను, తమకంటెఁ దక్కువవారిని దయతోఁ జూచువారుగను నుండిరి' అని యొకమహమ్మదీయచరిత్రకారుఁడే వ్రాసియున్నాఁడు.[3]

కాబూలును జయింపవలె నని మహమ్మదీయులు చేసినప్రథమప్రయత్నములు సిద్ధింపలేదు. అరబ్బీవారు ౭-వ శతాబ్దియంతమువఱకును పశ్చిమమువైపు అఫ్గానిస్థానమును జయించి మహమ్మదీయ మతమును స్థాపించిరి. హీరాత్ మహమ్మదీయమతసంబంధమైన యొక ముఖ్యపట్టణ మయ్యెను. తొమ్మిదవశతాబ్దియందుఁ గొంత కాలమువఱకును హీరాతులోను, బాల్కులోను పారసీకు లయిన సఫావిదులు రాజ్యము చేసిరి. వారితరువాత సామానీదు లనువారు వచ్చిరి. వారిని పాఱఁదోలి గజ్నీలోని తుర్కీవంశమువారు రాజు లయిరి. వీరిలో గొప్పవాఁడు హిందూదేశముమీఁదికి పదునేడు సారులు దండెత్తివచ్చిన మహమూద్ అనుమూర్తిభంజకుఁడు (౯౯౮-౧౦౩౦). ఈతఁడు గజనీలో గొప్పవిద్యాపీఠమును స్థాపించెను. గొప్పగొప్ప పండితులకు నాశ్రయ మిచ్చెను. తనరాజధానిని బహుసౌధములతో నలంకరించెను. ఈవంశమువారిని వెడలఁగొట్టి అఫ్గాను రాజ్యమును ఆక్రమించుకొనినది ఘోర్ వంశము. ఈవంశమునందుఁ జేరొందినవాఁడు మహాబుద్దీన్ ఘోరీ (౧౧౭౩-౧౨౦౬). ఈతఁడు ఢిల్లీశ్వరుఁడైన పృథ్వీరాజును ఓడించి హిందూదేశమందు తురుష్కులసామ్రాజ్యమును స్థాపించెను. ఇతనిప్రతినిధులే స్వతంత్రులై బానిసవంశజు లనఁబడు ఢిల్లీశ్వరు లైరి. వీరు అఫ్గానిస్థానముతో సంబంధము లేకుండ స్వతంత్రు లైరి. కొంతకాల మీ అఫ్గాన్ రాజ్యము ఖ్వారిజ మన్న పేరుతో కొలఁదికాలము విలసిల్లినసామ్రాజ్యమునఁ జేరెను. తరువాత చంగీజుఖానునిబందిపోటుమూఁక లీదేశము నాక్రమించుకొనెను. ఇందలిచాలభాగము మఱియొక బందిపోటు నాయకుఁడగు తైమూరు వచ్చి యాక్రమించుకొనువఱకును (౧౩౯౮) వారి యధీనమందే యుండెను. ఇతనితరువాత నీతనిగొప్పరాజ్యము తునకలుతునకలై పోయెను. కాని హీరాత్, బాల్కు, గజనీ, కాబూల్, కంధహార్ ప్రదేశములలో నీతనివంశజులే రాజ్యము చేయుచుండిరి. ఇతనివంశజుఁడే బాబరు. ఈతఁడు బదక్షానము (బదక్షాన్), కాబూల్, కంధహారుప్రాంతములకుఁ బ్రభువుగ నుండెను. అతఁడు ౧౫౨౬ లో ఢిల్లీలో రాజ్యము చేయుచున్న ఇబ్రాహీం లోడీ సుల్తానును ఓడించి హిందూదేశములో మొగలసామ్రాజ్యమును స్థాపించెను. ఈమొగలులకు హిందూరాజ్యము వచ్చినతరువాత చిన్నదియగు అఫ్గానురాజ్యము పులగములోఁదిపప్పువలె నయ్యెను. అక్బరుప్రభుత్వకాలమునందు తిరుగఁబడిన అఫ్గానుదేశజులను గెలుచుటకై అక్బరు తనసేనానులగు రాజా బీర్‌బల్, రాజా తోడర్‌మల్, రాజా మానసింగ్ అను హిందూసరదారులను వానిమీఁదికిం బంపెను. రాజా బీర్‌బల్ యుద్ధమునందు మడిసెను. ఔరంగజేబుకాలమందు మార్వాడదేశపురాజగు యశవంతసింహుఁడు రాజకార్యమునిమిత్తమై కాబూలున కంపఁబడెను. అతఁ డచ్చటనే మరణము నందెను. కొన్ని

1. ఈశబ్దమునకు పారసీభాషలో సికందర్ అనియు, సంస్కృతభాషలో అలెకసుందరుఁ డనియు రూపాంతరములు కానవచ్చుచున్నవి.

2. V. A. Smith's Early History of India, 3rd edition, p. 119.

3. Elliot's History of India, as told by its own historians, Vol. II, pp. 12 and 40.

సంవత్సరములతరువాత బదఖ్షానము ఉత్తర పెక్కు లాక్రమించుకొనిరి. కంథహారును పారశీకరాజు లయిన సఫావిదులు తీసికొనిరి. గజనీ, కాబూలులయాత్రము మొగలులకు దక్కినవి. ౧౭౩౮ లో నాదిర్‌షాహా యనువాడు అఫ్గానిస్తానములోని రాజ్యముల నన్నిటిని నాక్రమించి ౧౭౩౯ లో ఢిల్లీని దోచుకొనెను. ఇట్లెన్నియో శతాబ్దుల పారతంత్ర్యము ననుభవించి యీదేశము నాదిర్‌షాహా మృతినందగనే (౧౭౪౭ న) స్వతంత్రమయ్యెను. దీనికి స్వాతంత్ర్యమును, జాతీయతను ఇచ్చినవాడు అహమద్‌షాహా అబ్దాలీ.

నాదిర్‌షాహా తనసైన్యములో అఫ్గానులను కొందఱను చేర్చుకొనెను. అట్లు చేరినవారిలో అహమద్‌షాహా అబ్దాలీ యొకడు. నాదిర్‌షాహా మరణమందగనే ౧౭౪౭ లో కంథహార్ పట్టణమందు అఫ్గాన్‌నాయకు లందఱును గలసి యీతనిని రాజుగ నెన్నుకొనిరి. అతడు 'దుర్-ఇ-దురాన్' (ఈయుగమునకు ముత్యము) అను బిరుదమును ధరించెను. తనజాతివారికి (అబ్దాలీల కందఱికి) దురానీ లన్న బిరుదు నొసంగెను. ఈదురానీవంశమే ఇప్పటివఱకును రాజ్యము చేయుచున్నది. అబ్దాలీ ప్రభుత్వమునకు వచ్చినప్పటినుండియే అఫ్గానిస్తానమునకు స్వతంత్రరాజ్యమన్న పేరుప్రతిష్ఠలు వచ్చినవి. అంతకు పూర్వ మది యీదేశమువారికి నాదేశమువారికిని లోబడి స్వతంత్రమేమియు లేకయుండెను. పానిపట్టుయుద్ధరంగమునందు మరాటావారిని నోడించినవాఁ డీయహమ్మదుషాహా అబ్దాలీయే. ఇతడు మిక్కిలి శూరుడై తనరాజ్యమును చాలవఱకు వ్యాపింపజేసెను. ఈతనిమరణకాలమువఱకు అఫ్గానిస్తాన మంతయు నతనియధీన మగుటయేకాక, ఉత్తరమున తుర్కిస్తానము, దక్షిణమున సింధు బలూచిస్తానములు, తూర్పున కాశ్మీరము, పశ్చిమమున ఖురాసాను దేశప్రాంతాలు ఈతనిసార్వభౌమత్వము నొప్పుకొనిరి. ఇతడు ౧౭౭౩ లో కాలధర్మము నొందెను.

ఈతనికుమారుడగు తైమూరు రాజధానిని కంధహారునుండి కాబూలునకు మార్చెను. ఇతఁ డిరువదియేండ్లు రాజ్యముచేసి ౧౭౯౩ లో చచ్చిపోయెను. ఈతని ప్రభుత్వకాలములో సింధుదేశము వీరి యధీనమునుండి తప్పెను. బాల్ఖ్, అఫ్గాన్‌తుర్కిస్తానముయొక్క యుత్తరభాగములు చాలవఱకు స్వతంత్రము లయ్యెను. ఖురాసాన్, కాశ్మీరములలో తిరుగుబాటులకు బీజారోపణము చేయబడెను. తైమూరునకు నిరువదిమంది పుత్రు లుండిరి. ఆరాజ్యమునుగురించి వారిలో వారికి పెక్కుతగాదాలు కలిగెను. జమాన్ అనువాడు అమీ రయ్యెను (౧౭౯౩). ఈతనికాలములో పంజాబు వీరిచేతినుండి జారిపోయెను. ౧౭౯౯ లో నీతనిసహోదరుడైన మహమూదు అనువాడు రాజ్యము నాక్రమించుకొనెను. ౧౮౦౩ లో కొన్ని కుట్రలు జరిగి రాజ్య మీతనిసోదరుడైన షాహాషుజా ఉల్‌ముల్క్ అన్నవానియధీన మయ్యెను. మహమూదు రాజ్యభ్రష్టుడయ్యెను. నెపోలియన్ పారసీకదేశపురాజుతోఁ జేయుచున్న స్నేహమువలన బ్రిటిషురాజ్యమునకు నష్టము రాకుండ జాగ్రత్తపడుటకై ౧౮౦౯ లో ఇండియాదొరతనమువారు మౌంటు స్టు అర్ట్ ఎల్ఫిన్‌స్టన్ అను వానిని షాహాషుజాయొద్దకు దూతగా బంపిరి. కాని యింతలో రాజ్యభ్రష్టుడైన మహమూదు షాహాషుజాను ఓడించి మరల రాజయినందున (౧౮౦౯) ఈదూత వెళ్ళినప్రయోజనము సఫలము కాలేదు. మరల రాజయినమహమూదు తొమ్మిదిసంవత్సరములు రాజ్యము చేసెను. ఈతనికాలమందు నీతనిమంత్రియైన ఫతేఖాన్ అనువాడు (బరక్‌జాయ్‌వంశజుడు) సర్వాధికారిగ నుండెను. కాని మహమూదు ౧౮౧౭ లో నీమంత్రి కన్నులు దీయించెను. అంగహీన మంత్రి యొక్క తమ్ముడైన మహమ్మద్ అజీమ్ అనువాడును, అతని సవతి తమ్ముడైన దోస్తుమహమ్మద్ అనువాడును రాజుపైఁ దిరుగఁబడి ౧౮౧౮ లో వానిని రాజ్యభ్రష్టునిఁ జేసిరి.

తరువాతఁ గొంతకాలమువఱకు నిశ్చితుడైనరాజు ఏర్పడలేదు. మహమ్మద్ అజీమ్ కాబూలును స్వాధీనపఱచుకొనెను. కాని యితర ప్రాంతములగవర్నరు లాతనియాజ్ఞకు లోబడరైరి. హీరాత్ స్వతంత్ర మాయెను. అఫ్గాన్‌తుర్కిస్తానమును, బదఖ్షానమును చీలిపోయినవి. పంజాబుసింహుడైన రణజిత్‌సింగు కాశ్మీరము, ముల్తాన్, డేరాగాజీఖాన్, అటక్ అనుదేశములను, ప్రాంతములను స్వాధీనపఱచుకొనెను. నౌషహరయొద్ద ౧౮౨౩ లో అఫ్గానులను పూర్తిగఁ బరిభవించి పెషావరుగూడ లాగుకొనెను. మహమ్మదుఖాను ౧౮౨౩ లో మృతుడయ్యెను. అంత వారి (బారక్‌జాయ్) యన్నదమ్ములలో రాజ్యమునకై కలహములు ముదిరి ౧౮౨౬ లో దోస్తుమహమ్మద కాబూల్, గజనీప్రదేశములను స్వాధీనపఱచుకొనెను. జలాలాబాదు కూడ త్వరలోనే యతనికి వశమయ్యెను. ౧౮౩౪లో షాహాషుజా మరల రాజ్యము సంపాదించుటకు యత్నము చేయఁగా నాతని నోడించి దోస్తుమహమ్మద్ 'అమీర్' అన్న పదవిని ధరించెను. షాహాషుజా యింగ్లీషువారియొద్దకు వచ్చి హిందూదేశమునందు దాఁగియుండెను.

మొదటి అఫ్గాన్‌యుద్ధము (౧౮౩౮-౪౨) — ౧౮౩౭ లో పారసీకరాజు హీరాతును ముట్టడించెను. రష్యావారికి, నమీరునకును స్నేహ మధికము గాఁజొచ్చెను. ఈ కారణములచేత నిండియాదొరతనమువారి కాందోళనము గలిగి వారు అఫ్గానిస్తానమునకు బర్నెస్ అనురాయబారిని పంపిరి. కాని అమీర్ వీరికి నమ్మకముగఁ జెప్పక పోవుటయేకాక యప్పుడు వీరికి స్నేహితుఁడుగా నున్న రణజిత్‌సింగు మీఁదికిఁ దాను యుద్ధమునకుఁ బోయెద ననియుఁ, దనకు సాయము చేయవలసిన దనియుఁ గోరెను. అంత నిండియాగవర్నమెంటువారు అఫ్గానిస్తానము మీఁదికి దండువెడలి దోస్తుమహమ్మదును రాజ్యభ్రష్టునిఁ జేసి తమయాశ్రయమునం దున్న షాహాషుజాను రాజ్యముపైఁ గూర్చుండఁబెట్ట నిశ్చయించిరి. రణజిత్‌సింగుకూడ సాయము చేయ నొప్పుకొనెను. కాని యంతగా సాయము చేసినవాఁడు కాఁడు.

ఉత్తరసింధుదేశమునందు ౧౮౩౮ లో అఫ్గాన్‌దండయాత్రనిమిత్తము ౨౧,౦౦౦ సైన్యము సిద్ధము చేయఁబడెను. సర్ జాన్ కీన్

కట్టి తిరిగివచ్చుటకు సిద్ధము చేయుచుండిరి. ఇంతలో షేర్ అల్లీ కుమారుఁడైన యాకూబ్ ఖాను తాను అమీరు నైతి ననియు, సంధి చేసికొనెద ననియు నింగ్లీషువారికి వర్తమాన మంపెను. ౧౮౭౯ మే నెలలో గండమక్ కొద్ద నిద్దఱకును సంధి జరిగెను. ఈ సంధి ప్రకారము సరిహద్దుమీఁద నున్న కొండలు గుంటలపై నధికారమును, కుఱ్ఱం, పిషిన్, సిబీ తావులును, కైబర్ మిచ్నీ కనుమలమీఁది స్వత్వమును ఇండియా ప్రభుత్వమువారి కీయఁబడెను. బ్రిటిషు రెసిడెంటు కాబూలులో నుండుటకు కొప్పుకొనెను. ఇంగ్లీషువారిసలహా లేనిది యితర రాజులతో రాజకీయవ్యవహారములు నడుప నని సమ్మతించెను. ఇందుకు బదులుగ నింగ్లీషువారు అమీర్ మీఁదికిఁ బరరాజులు రాకుండఁ గాపాడెద మని యొప్పుకొనిరి (౧౮౭౯ మే) మేజర్ సర్ లూయి కవన్యరీ యనువానిని కాబూలులో రెసిడెంటుగా నేర్పఱిచిరి. కాబూలునుండి సైన్యము వెడలిపోయెను. అంతయు మనకు ననుకూలముగ జరిగె నని సంతసించిరి. కాని అఫ్గానులు మోసము చేసి సెప్టెంబరు నెలలో రెసిడెంటును అతనిసిబ్బందిని చంపివైచిరి.

ఈ సమాచారము తెలియఁగనే హిందూదేశమునుండి జనరల్ (తరువాత లార్డు) రాబర్ట్సును పెద్దసైన్యముతోఁ బంపిరి. అతఁడు అఫ్గాన్ సైన్యమును ఓడించి ౧౮౭౯ అక్టోబరులో కాబూలును స్వాధీనపఱుచుకొనెను. యాకూబ్ ఖాను ప్రభుత్వము వదలుకొని, యింగ్లీషువారియధీనుఁడై హిందూదేశమునందు వారివలన నుపకారవేతనమును పొందుచు నుండసాగెను. ౧౮౭౯-౮౦ సంవత్సరపుఁజలికాలములో కాబూలుదేశమందున్న యింగ్లీషు సైన్యమునకు మరల విపత్తు సంభవించునేమో యన్న భయము కలిగెను. అఫ్గానుసర్దారులు తిరుగఁబడిరి. ఎట్టకేలకు వారి నింగ్లీషుసైన్యము లోడించెను.

కాబూలు, కంధహారు ప్రాంతములను విడఁదీసి యింగ్లీషువారు కాబూలునకు అబ్దుర్‌రహిమాన్‌ఖాన్ అనువానిని, కంధహారునకు షేర్ అల్లీ ఖాన్ అనువానిని ప్రభువులుగా నొప్పుకొనిరి (౧౮౮౦, జూలై, మే). అబ్దుర్‌రహిమాను దోస్తుమహమ్మదునకు మనుమఁడు, షేర్ అలీకి తమ్మునికుమారుఁడు. కంధహారురాజయిన షేర్ అల్లీ చేతఁగాక రాజ్యము వదలుకొని హిందూదేశమునందు ప్రభుత్వమువారిచ్చు పెన్‌షను పుచ్చుకొనుచుండెను. ౧౮౮౧ లో నింగ్లీషుసైన్యములు అఫ్గానిస్తానమును విడిచి హిందూదేశమునకుఁ బోయెను.

అబ్దుర్ రహిమాన్‌ఖాను (౧౮౮౦-౧౯౦౧) — ఈతఁడిరువదియొక్క సంవత్సరములు రాజ్యము చేసెను. ఇండియాప్రభుత్వము వారితో మైత్రి కలిగియుండెను. ఈతనిప్రభుత్వకాలములో అఫ్గానిస్తానమునకు నంతవఱకు బూర్వ మెన్నఁడును లేనియేకచ్ఛత్రాధిపత్యము, శాశ్వతసైన్యము (Standing Army), ఇతరరాజ్యములతో సమానముగ నుండు రాజ్యమున్నగౌరవము కలిగినది. ఇంతకుఁబూర్వము సరకారులును, ప్రాంతాధిపతులును తమయిష్టము వచ్చినరీతుల అమీర్ ఆజ్ఞ మీఱుటయు, లేనిపోని విరోధములు సంభవించుచుండెను. ఈతఁడు తనప్రచండవిక్రమముచే నాపద్ధతు లన్నియు మాన్పి వారందఱను తనయాజ్ఞలో మెలఁగునట్లు చేసెను. ఈతనికాలములోనే రష్యాకును అఫ్గానిస్తానమునకుఁ గల పొలిమేరలును, పారసీకదేశమునకు నీదేశమునకుఁ గల పొలిమేరలును గొలవఁబడి సిసలు చేయఁబడినవి. ఈతనికి నిండియాగవర్నమెంటువారు సరిహద్దుసంరక్షణనిమిత్తము మొదట పండ్రెండులక్షలరూపాయ లిచ్చుచుండిరి. ౧౮౯౩ లో నీమొత్తము పదునెనిమిదిలక్షలు చేయఁబడినది. ౧౮౯౬ లో కాఫిరిస్తాన్ అనుదేశముపై అమీరుయొక్క సార్వభౌమత్వము స్థిరపడెను. ఈతఁ డన్నివ్యవహారములలోను తనస్వాతంత్ర్యమునకు భంగము రాకుండ మిగుల జాగ్రత్తతోఁ గాపాడుచుండెను. ఏసలహాలు వినినను తనరాజ్యములో పరదేశీయులు రైల్లు టెలిగ్రాములు వేయుద మన్న వినినవాఁడు కాఁడు.

హబీబుల్లా (౧౯౦౧-౧౯౧౯) — అబ్దుర్ రహిమాన్‌ఖాను మృతినొందఁగా నాతనికుమారుఁడు హబీబుల్లాఖాను అమీ రయ్యెను. ఈతఁడు కొంతవఱకు తండ్రిమార్గమునే యవలంబించెను. ఈతఁడు ప్రభుత్వమునకు వచ్చినతరువాత క్రొత్తషరతులతో సంధి చేసికొనవలయు నని యిండియాగవర్నమెంటువారు ౧౯౦౫ లో మిస్టర్ (ఇప్పుడు సర్) లూయీడేను పంపిరి. కాని హబీబుల్లా క్రొత్తషరతు లొప్పలేదు. అదివఱకు నాతనితండ్రికాలమున నున్న షరతులనే యొప్పుకొనుచు సంధి చేసెను. ఈప్రసంగమునకే యాతనికి 'హిజ్ మెజెస్టి' అన్న బిరుద మీయఁబడినది. ౧౯౦౭ లో నీతఁడు హిందూదేశమును చూచుటకు వచ్చెను. అప్పు డీతఁడు ఇండియాదొరతనమువారిచే మిక్కిలి గౌరవింపఁబడెను.

ఇతఁడు తన పూర్వపరిపాలకులకాలమున లేనినవనాగరకతా చిహ్నములను జాలవఱకుఁ దనదేశమునఁ బ్రవేశపెట్టెను. మోటార్లు, టెలిఫోనులు, వార్తాపత్రికలు, జలవిద్యుద్యంత్రములు మున్నగు వానిని రాజ్యమం దంతట నెలకొల్పె. పూర్వాచారపరాయణులందఱును వీనియెడల నసమ్మతినే ప్రకటించుచువచ్చిరి. కాలాంతరమున అమానుల్లాసమయమున నతిభయంకరముగఁ జెలరేఁగిన విద్రోహమున కిది యారంభ మని చెప్పవచ్చును.

యూరోపునందు జర్మనీయుద్ధ మారంభమైనవెంటనే హబీబుల్లాఖా నిరుపక్షము గాని వహింపక తాటస్థ్య మూనియుండెను. తుర్కీదేశము యుద్ధమునఁ బ్రవేశించినవెంటనే ఆంగ్లేయులయెడల ద్వేష మూనియున్న అఫ్గానులందఱును తుర్కీఖలీఫా ననుసరింప వలసిన దని యితనిని ప్రోత్సహించియుండిరి. కాని ఇతఁడు వారి మాటలను పాటింపక యుద్ధమునుండి దూరముగనే యుండెను. తటస్థ మూనియుండినందున బ్రిటిష్‌వారును నితనిని యథోచితరీతిని సత్కరింపవలె నని యభిప్రాయము గలిగియుండిరి. కాని క్రీ. శ. ౧౯౧౯-వ సంవత్సరమున నితఁడు దారుణముగ హత్య గావింపఁబడెను. ఇతనిమరణానంతర మితని సోదరుఁడగు నసరుల్లాఖాన్ అమీరు

పదవును దాల్చి సింహాసన మెక్కి యాఱువదదినములమాత్రము రాజ్యము చేయఁగలిగెను. అంతలో హబీబుల్లాయొక్క మూడవ కుమారుఁడగు అమానుల్లాఖాను పినతండ్రిని దొలఁగించి రాజ్యకార్యములను దనవశము చేసికొనెను.

అమానుల్లాఖాను (౧౮౯౨ - ౧౯౬౦) — రాజ్యమందలి ప్రధానులు, అధికారులు, సామంతప్రభువులు ఇతనిని స్వీకరించిరి. ఇతఁడు రాజ్యమునకు వచ్చినవెంటనే ఆంగ్లేయులతో విరోధమూనియున్నవారందఱు నితనిని యుద్ధమునకుఁ బ్రోత్సాహపఱచిరి. స్వపరబలాబలముల నెఱుఁగక బాగుగ గుర్తెఱిఁగియుండియు లోకుల సంతృప్తికొఱకు ౧౯౧౯-వ సంవత్సరమున ఆంగ్లేయులతో యుద్ధఘోషణము సలిపెను. కాని ఆంగ్లేయులు జర్మనీయుద్ధమువలనఁ గలిగిన ఆయాసమునుండి ఇంకను కోలుకొనకపూర్వమే ఇతఁడీ ఘోషణము సలుపుట చూడ దొరకిన యవకాశమును పోఁగొట్టుకొనక సాధ్యమగునంతవఱకు దానిని వినియోగించుకొనుటకొఱకే ఇట్లు చేసెనని తలంపవచ్చును. ఈ సమాచారము దెలిసినవెంటనే ఇండియాయొక్క వాయవ్యసరిహద్దులలోని బ్రిటిష్ సేనలు సంసిద్ధములై యచట వేచియుండి అఫ్గానులు వారిసీమను దాటి వచ్చినతోడనే వారిమీఁదఁ బడి ఓడించి అఫ్గానులసీమయందుఁ బ్రవేశించి దక్కానామకస్థానమును వశపఱచుకొనెను. కాబూలునగరముమీఁదికి వాయువిమానములు సైత మంపఁబడినవి. కాని యుద్ధమింకను దారుణావస్థను బ్రాపింపకపూర్వమే రెండు పక్షములవారును సంధి గావించుకొనిరి. తదనుసారము ఇండియా దొరతనమువారినుండి వచ్చుచున్న ౧౮ లక్షలరూపాయల సహాయకభృతి అఫగానిస్థానమునకు లోపించిపోయెను. కాని ఆంగ్లేయుల దాస్యమునుండి విడివడి యాదేశము సంపూర్ణస్వాతంత్ర్యదేశములం దొకటి యగుట కవకాశము లభించెను. అదివఱకు ఆంగ్లేయుల యనుమతి లేకుండ విదేశములతో రాయబారముల నడపుకొనుట కధికారము అమీరునకు లేకుండెడిది. ౧౯౨౧-వ సంవత్సరమున జరిగిన సంధిషరతులప్రకారము ఎవరిరాజ్యకార్యములు వారు ఇతరులజోక్యము లేకుండ చేసికొనుట కవకాశములు లభించెను. అఫగానులు వారికిఁ గావలసిన యుద్ధసామగ్రుల నన్నిటిని పన్ను చెల్లింపవలసిన యవసరము లేకయే హిందూస్థానమార్గమునఁ దెప్పించుకొనుట కధికారములను బొందిరి. మఱియు అఫగాణదేశమునుండి హిందూదేశమునకు వచ్చు సరకుల మీఁదఁ గల ప్రతిబంధకము లన్నియుఁ దొలఁగింపఁబడినవి.

అమానుల్లాఖాను దేశహితైషి, స్వాతంత్ర్యాభిలాషి, చాల మంచి సమయాచారముల ప్రవర్తకుఁడు. సాధ్యమగునంత శీఘ్రకాలమున స్వదేశమును పాశ్చాత్యసభ్యదేశములలో నొకదానిగఁ జేయవలయు నని యితని హార్దికాభిమతము. అట్టి యుద్దేశముతో నితఁడు రాజ్యభారమును వహించినది మొదలుకొని ముఖ్యముగ యుద్ధానంతరమున జరిగిన ఆంగ్లో-అఫ్గాను సంధికాలము మొదలుకొని స్వదేశమునందు వివిధప్రకారము లగు సంస్కారములను గావింప మొదలిడెను.

ఈ దేశమునందు మతగురువు లగు ముల్లాలు ఖురాను గ్రంథ నియమముల ననుసరించి బాలురచే విద్యాభ్యాసము చేయించుచు వచ్చిరి. పాశ్చాత్యదేశములం దవలంబింపఁబడుచున్న ఆధునికవిద్యాశిక్షణపద్ధతు లెవ్వియు నిచట లేకుండెను. అమానుల్లాఖాఁ డొక్క పెట్టున పురాతనరీతు లన్నింటిని దొలఁగించి సర్వసామాన్యముగ నందఱకును విద్య లభించునట్లును పాశ్చాత్య విశ్వవిద్యాలయ పద్ధతుల ప్రకారము పాఠశాలలను, కళాశాలలను స్థాపింపఁజేసెను. యోగ్యు లగు ఫ్రెంచిశాస్త్రవేత్త లీ విద్యాలయముల నుత్తమరీతి నడపుచువచ్చిరి. ఈ విద్యాలయములయందు చారితేఱిన అఫ్గానుయువకులు ఉన్నతవిద్యాభ్యాసములకై విదేశముల కేఁగునిమిత్తము ఇతఁడు సకలసౌకర్యము లొనఁగూడులాగునఁ జేసెను. ఈ విద్యావిషయకపరివర్తనములవలన పూర్వకాలపుముల్లాలకు స్వప్రతిష్ఠాభంగము వాటిల్లుటవలన నపరిమిత మగు క్రోధము జనింప వీరందఱు నమానుల్లాఖానునకుఁ బ్రతిపక్షులైరి. విద్యావిషయమున నట్లుండ నితఁడు (అమానుల్లాఖాను) కృషిసంబంధము లగు సంస్కారముల మూలమున వ్యవసాయదారుల స్థితిగతులను జక్కనగునట్లు గావించెను. మఱియు కాబూలునగరమును బునర్నిర్మాణము చేయించి దానికిఁ దగిలియుండులాగుననే నొకపట్టణము గట్టించి దానిని నివాసముగ నేర్పఱచుకొనెను. సైనికశిక్షణ మనివార్యమొనర్చి తత్ప్రబంధమునకుఁగాను గొప్పగొప్ప సైనికకళాశాలల (Military Colleges) స్థాపించెను. నేర్పరు లగు తుర్కీదేశపు సర్దారులు (Officers) యుద్ధశిక్షణమొసంగుటకు నియోగింపఁబడిరి. సైనికశిక్షణము జర్మనీ, తుర్కీపద్ధతుల ననుసరించి నడపులాగున నియమింపఁబడెను. విదేశవ్యాపారము నభివృద్ధి నొందించునిమిత్తము వ్యాపారిక సంఘముల నేర్పాటు చేయించెను. దేశమున నాలుగుదిక్కులందును రైలుబాటల నిర్మించుటకై సుత్తిదీసికొనుటకు విదేశీయులు కొంద ఱభిలషించియుండిరి కాని దానివలన కలుగులాభము పరదేశములవారికే పోవుచుండులాగున నితఁ డట్టి కంట్రాక్టుల నెవరికిఁ గాని యొసఁగియుండలేదు. స్వదేశీయు లగు ఇంజనీరులద్వారా ఈ కార్యమును జేయింపవలయు నని ఇతనికోరికయై యుండెను. ఇదేవిధమున దేశమందలి గనుల పనులను గూడఁ దీసికొనవలయు నని విదేశీయులు ప్రయత్నించియుండిరి కాని ఇతఁ డందులకు సమ్మతింపఁడయ్యెను.

నేఁటికాలపు నందిన యభివృద్ధులతోపాటు టెలిగ్రాఫ్, రేడియో, సినిమా మున్నగువాని నితఁడు స్వదేశమున నెలకొల్పెను. కాబూలునందు విదేశమంత్రికార్యాలయమును బెట్టించెను. దీనికిని పెషావరునందలి విదేశమంత్రిస్థానమునకును సంబంధము కలదు. ప్రతిసంవత్సరము మీఁద వచించిన సహాయకభృతి బన్నును ఇండియా దొరతనమువారినుండి వైకొనుచుండిన కారణమున స్వతంత్రించి ఇతఁ డే కార్యమును చేయుటకును సమర్థుఁడు కాకయుండెను. అందుచే సమయమును గనిపట్టి అంగ్లదాస్యమునుండి ఇతఁడు విముక్తిని బొందెను. అఫగానిస్తానపు స్వాతంత్ర్యదినమహోత్సవము నితఁడు ప్రతిసంవ

**అఫ్రీదీలు** — పఠానులందలి ఒకశాఖీయులు మిగుల బలశాలులు. కోహాట్, పెషావరులోయలు, తిరాహ్‌భూములందు గల సఫేద్‌కోహ్‌పర్వతములయొక్క తూర్పుభాగమందలి శాఖలన్నియు వీరినివాసభూములు. వీరిప్రదేశములకు ఉత్తరముగ ఖైబరుకనుము వ్యాపించియున్నది. తిరాహ్‌పరభూమి సముద్రమట్టమునకు సుమారు ౬, ౭ వేల అడుగుల ఎత్తు కలిగియుండును. దీనిపైభాగము ౬ లేక ౭ వందల చదరపుమైళ్లు ఇందు మైదాన్, రజ్‌గుల్ వరన్, బరా, మస్తురా అనుపేరులుగల జననివాసయోగ్యములైనవి అయిదు లోయలు కలవు. వీనిలో మైదాన్, మస్తురానామకకందరములు ౭,౦౦౦ల అడుగులకంటె ఎత్తయి మిగుల మనోజ్ఞములై యుండును. ఇంత ఎత్తును, దుర్గమమును, అరణ్యమయమును నగుతిరాహ్‌భూమి యయిన కారణముననే ఇతరులదండయాత్రలకు లోనుగాకుండెను. అఫ్రీదీప్రాంతములకు నాలుగుప్రక్కలను పెషావరుజిల్లా వ్యాపించియున్నది. ఉత్తరమున మోహామందులు, పడమట షిన్వారీలు, దక్షిణమందలి బరా, బజౌరుకనుములందు ఓరక్‌జాయిలు, బంగష్ అను జాతులు వాసము చేయుచున్నవి.



అఫ్రీది

అఫ్రీదీలయొక్క ఉత్పత్తినిగురించి నిశ్చయమైన విషయము తెలియదు. ఇస్రాయేల్‌వంశజులని వీరు చెప్పుకొనుచుందురు. వీరి రూపరేఖలు మెడిటరేనియన్‌జాతికి చెందిన యూదులవలెనే యుండును. హెరోడొటస్ వీరిని అపరితయి (Aparytai) అని పేర్కొనియుండెను. ౨,౦౦౦ ల శతాబ్దముల వీరినిగురించిన వృత్తాంతము లేమియు దొరకవు. కాని ౧౬-వ శతాబ్దిప్రాంతమున వీరు తిరా ప్రదేశము నాక్రమించుకొనిరి. కొంతకాలమున కాబూలుప్రక్కనుండు మరికొన్నిజాతులవారు వీరి నోడించి యీప్రాంతమునందలి కొన్నిభాగములను వశపఱచుకొనిరి. ఆంగ్లేయకాలమున ఓరక్‌జాయిల వలనండి వారినుండి తమప్రాంతము నంతటిని వశపఱచుకొనిరి. అప్పటికాలమున వీరు నిండ్లుగను రోహిల్లాయానామక మతము నవలంబింప నది అదంచిపేయఁబడెను.

మలిక్‌దీన్‌ఖేల్, కంబర్‌ఖేల్, కమర్‌ఖేల్, జక్కాఖేల్, సిపహ్, అకాఖేల్, అదంఖేల్ అని అఫ్రీదీలలో ఎనిమిది అంతర్భాగములు కలవు. అదంఖేలులు కోహాట్‌లోయయందును దానిచుట్టుప్రక్కలను నివసించుచుందురు. సాధారణముగా వీరు స్వస్థానములను వదలరు. తక్కినతెగలవారు ఖైబరుకనుమయందును, పెషావరుచుట్టుప్రక్కలను నివసించుచు వేసవికాలమున తిరాహ్‌భూమియందలి శీతలప్రదేశములకు తరలిపోవుచుందురు. వీరు మిగుల స్వాతంత్ర్యస్వభావమును గలిగియుందురు. ఒకరియాధీనమున నుండుటకు సమ్మతింపరు. వీరికి నామమాత్రమున కొకసర్దారు ఉండును గాని రాజకీయవిషయము లేమైన వచ్చినచో ఎవరిమతము వారిదే. వీరియం దేదైన వివాదము సంభవించినయెడల దానిని దీర్చుటకు సర్దారునకును శక్యము గాదు. ఈకారణమున దోపిడిగాండ్రను వీరినుండి పట్టుకొనుటకే వలనుగాదు. వీరిచేత నియమముల నవలంబింపఁజేయుటకు వీలు లేదు. దేహఘటనమునందు వీరు మంచి ఒడ్డుపొడుగును గలిగియుందురు. దృఢగాత్రులు, విశాలముఖులు, ఉన్నతనాసులు, విశుద్ధమగు శరీరచ్ఛాయను గలిగియుందురు. స్వదేశపర్వతములందు యుద్ధమొనరింప నిపుణులు. కాని అన్యప్రాంతముల కేఁగినచో సాధారణముగా రోగముపాలగుచుందురు. కపటమునకు స్వార్థమునకుఁ బుట్టినిండ్లు. ఒకరిని విశ్వసింపరు. క్రూరులు. కాని నమ్మకమిచ్చినయెడల నొకరిని రక్షించుటకు స్వకీయప్రాణములనైన వదలుదురు. బ్రిటిష్‌సేనలందు నౌకరులుగఁ గుదిరి వారిని మెప్పించినవా రనేకులు కలరు. హిందూస్థానప్రభుత్వమునుండి వీరు నివసించు ఇలాకాకు సుమారు ౪౦ మైళ్లుండును. అత్యున్నతములు, దురారోహములునైన పెనుపర్వతములు వేరంగులు మున్నగువానితో వీరిస్థానములకుఁ బోయి పోరాడుట కష్టము. ఈకారణమున వీరు నిర్భయులై లేక నిరంకుశులై వర్తింపుచు ఉండిరి. బ్రిటిష్‌ఇలాకాపైఁబడి దోచుకొనుచుందురు. ధనాఢ్యులగు ప్రజలను దొంగతనముగ తమప్రదేశములకుఁ గొంపోయి చంపెద మని బెదరించి వారినుండి పుష్కలముగ ద్రవ్యమును లాగి విడిచిపుచ్చుచుందురు. ఒక్కొక్కపర్యాయము సింధునదిలోని నావలపైఁ బడి దోచికొనిపోవుచుందురు. లోయలన్నియు వీరియాధీనము నం దుండుటచే వానిమార్గమున పట్టియపాయము కాని కలుగకుండ

రించుకొనుటకు వచటనే యుండెను. అటుపిమ్మట నేటివఱకును కొండలోయయందు మరల చెప్పదగినట్టి యుద్ధములు జరిగియుండలేదు.

౨. క్రీ. శ. ౧౮౭౮-వ సంవత్సరమున ఖైబరులోయయందలి అఫ్రీదీలపైన బ్రిగేడియర్ జనరల్ మైట్లర్ అనునతఁడు దండయాత్రను గావించెను. రెండవ అఫ్గానుయుద్ధసమయమున జక్కాఖేలులు బ్రిటిష్‌వారి నెదిరించి వీరి సైన్యనివేశనములను ముట్టడించిరి. ౨,౫౦౦ల మంది సైనికులతో మైట్లర్ వీరి ఇలాకాయందుఁ బ్రవేశింప వండఱును లోఁబడిపోయిరి.

౩. ౧౮౭౯-వ సంవత్సరమున ఖైబరులోయలోని జక్కాఖేలులపై రెండవదండయాత్ర జరుగగా లెఫ్టినెంట్ జనరల్ మాడ్ అనునతఁడు దీనినాయకుఁడు. మొదటిదండయాత్ర ముగిసినపిదప అఫ్గానుయుద్ధ మింకను జరుగుచుండఁగనే ఖైబర్‌లోయలోని జక్కాఖేలులు బ్రిటిష్‌వారి పురోగమనము నాటంకపఱుపసాగిరి. అందుచే ౩,౫౫౦ మందిగల బ్రిటిష్‌సేన వీరిదేశముమీఁదఁ బడి కొంత నష్టము కలిగించినపిదప వీరు లోఁబడిరి. అది మొదలుకొని గ్రోహాట్ లోయయందువలె ఖైబరులోయయందును ౧౮౯౭-వ సంవత్సరమున జరిగిన తిరుగుబాటువఱకును శాంతముగనే యుండెను.

౪. క్రీ. శ. ౧౮౯౭-౯౮ లందు తిరాయుద్ధము జరిగియుండెను. పశ్చిమోత్తరసీమాంతప్రాంతములందు ఆంగ్లేయులు స్థిరపడుచున్న కొలఁదియు వందలకొలఁది అఫ్రీదీలు బ్రిటిష్‌సైన్యమందుఁ జేరఁగా వారిని ఖైబరుమున్నగులోయలందు సేనానివేశనముల చేర్చుచుండిరి. ఈవిధానమున అఫ్రీదీసైనికోపేతములైన సేనాస్థానము లనేకము లేర్పడెను. వివాదము జక్కాఖేలులతో నారంభమై క్రమముగ నన్నిజాతులలోను వ్యాపించెను. ఓరక్‌జాయిలుంగూడఁ గలసిరి. తిరాయందలి లోయలలోనివా రందఱును సుమారు ౪౦,౦౦౦ల మందిని ప్రోవుచేయుటకు సమర్థులై యుండిరి. వీరు ఆకస్మికముగ ఖైబరులోని సేనాస్థానములపైఁ బడి పెషావరుసమీపమందలి సమన పర్వతాగ్రముమీఁది దుర్గములను ముట్టడించిరి. అంతట సర్ విలియమ్ లాక్‌హార్ట్ సేనానాయకత్వమున బ్రిటిష్, దేశియసైనికులు సుమారు ౩౪,౦౦౦ల మందిగల సైన్యము అనేకసంఘములుగఁ జేరి ఈప్రదేశపు లోయలలో నానామార్గములఁ బ్రవేశించి పెక్కుచోట్ల నఫ్రీదీల నోడించి వశవర్తు లగునట్లు గావించెను. ఈయుద్ధమున హిందూదేశమందలి దేశియరాజులును బ్రిటిష్‌వారికిఁ దోడ్పడి తమకుఁగల రాజభక్తిని వెల్లడించియుండిరి.

౫. జక్కాఖేలులు మఱియొకపర్యాయము తిరుగఁబడుటచే ౧౯౦౮-వ సంవత్సరమున సర్ జేమ్స్ విల్‌కాక్స్ అధిపత్యమున మఱియొకదండయాత్ర అవసరమయ్యెను. ఇది శీఘ్రముగనే సమాప్తమయ్యెను. కాని వెంటనే మోమాండుజాతివారి విప్లవము జనించ మఱొకపోరాట మవసరమయ్యెను (దీనివిషయమున అఫ్గానిస్థాన వ్యాసమును జూడుఁడు).

**అఫ్రొడైట్** — గ్రీకు పురాణములందు ప్రేమ సౌందర్యముల కధిష్ఠానమును వహించిన దేవత. రోమనులు దీనికి వీనస్ అను పేరు గలిగియుండెను. హిందూపురాణములందలి లక్ష్మి ఈమెతో సరిపోల్చుటకు కొంతవఱకుఁ దగియున్నది. ఎట్లనఁగా, మన్మథుని లక్షణములు గల 'క్యూపిడ్' ఈమె కుమారుఁడు. లక్ష్మికి జన్మస్థానమైన సముద్రము అఫ్రొడైటునకుఁగూడ జన్మస్థానము. లక్ష్మీచంద్రులకు బాంధవ్య మున్నట్లు అఫ్రొడైటు చంద్రులకు సంబంధమే [illegible] రియపుడు నభిన్నులుగఁ దలంపఁబడిరి.



అఫ్రొడైట్

ఈ దేవత పూర్వదేశములనుండి కొనిరాఁబడిన దనియు, అసలు సెమిటిక్ జాతులవారే యీమెను కల్పించి రనియు పాశ్చాత్యుల యభిప్రాయము. సెమిటిక్కులలోని భిన్న భిన్న సంప్రదాయముల వారు పూజించు దేవతాలక్షణము లీమెయందును గలవు. ఒక్క హీబ్రూలు తప్ప తక్కిన సెమిటిక్ జాతులవా రందఱును ఒక ఉత్కృష్టస్త్రీదేవతను భిన్న భిన్న నామధేయములతోఁ బూజించుచుండిరి. అస్సీరియనులు ఇష్టర్ నామక దేవతను, ఫొనిషియనులు అష్టరత్ లేక అష్టరొతె యను దేవతను, సిరియనులు అటర్‌గాటిస్ డెర్కెటొ యను దేవతను, బాబిలోనియనులు బెలెతిట్

# అఫ్రొడైట్

మిలిట్టా దేవతను, అరబ్బులు ఇలాత్ లేక అల్ ఇలాత్ నామకదేవతను ఆరాధించుచుండిరి చంద్రునివలన ప్రకృతియందును, తద్ద్వారా ప్రాణికోటియందును కొన్ని భౌతిక పరివర్తనములు గలుగుచుండును అట్టిమార్పు లీ దేవతల మాహాత్మ్యములవలన కలుగు నని వారివారి యభి యాయాలనమ్మక మగుటంజేసి వీరందఱును చంద్రదేవత లనియే భావింపఁబడిరి. కాని సెమిటిక్కులలో చంద్రుఁడు పురుషదేవత. వీరు స్త్రీదేవత లగుటంజేసి ఈ పోలిక తగి యుండదేమో కాని అష్టార్త చంద్రులు అభిన్నులుగాఁ దలంపఁబడినట్లు కొన్ని యాధారములు గలవు.

అఫ్రొడైటు పూర్వదేశీయ సంపర్కమున వచ్చిన దయ్యు గ్రీసుదేశమునఁ బ్రవేశించిన స్వల్పకాలమునకే యచటి ఒలింపియను దేవగణములలో సమానమగు స్థానము నాక్రమించెను.

చరాచరములను ఫలవంతములుగాఁ జేయుట ఈ దేవతయొక్క ముఖ్యధర్మము. కావుననే స్త్రీదేవతగ గణింపఁబడినది కాని కాలక్రమమున ఫొయినీషియనుల సంబంధము గల స్థానములందు — ముఖ్యముగా కారింథ్ నగరమందును, ఎరిక్స్ పర్వతశిఖరమందును — ఈమె పూజనము ఘృణాస్పదము లగు దురాచారములక్రిందను బరిణమించెను సృష్టియందలి క్రియాక్రియాత్మకము లగు గుణధర్మముల సమ్మేళనమును సూచించు స్త్రీపురుషమిశ్రితమైన దేవతావిశేష మింకటి కల్పింపఁబడినది సైప్రస్‌లోని గడ్డముగల అఫ్రొడైట్ విగ్రహ మిట్టిదే

ప్రాచీనకాలమున నీ దేవతాపూజనము ఫొయినీషియనులద్వారా సైప్రెస్, సైథేరా, క్రీట్‌ద్వీపములందుఁ బ్రవేశించి యచటనుండి క్రమముగా సమగ్ర గ్రీసుదేశమందును, ఇటలీ, సిసిలీ ప్రాంతములందును వ్యాపించెను ఈమెకు సైప్రెస్, సైథీరియా, పథియా, అమథుసియా, ఇడలియా యని మఱికొన్ని పేరులు గలవు వీనిలో కడపటి మూఁడు పేరులును సైప్రెస్‌లోని కొన్ని స్థలములద్వారా వచ్చినవి కారింథ్ పట్టణమున నీమెకుఁ గావింపఁబడుపూజనములన్నియు పూర్వదేశములనుండియే గ్రహింపఁబడెను. ఎరిక్స్‌పర్వతాగ్రమున సలుపఁబడుపూజనము క్రమముగా కార్తేజ్, రోమ్, లాటియమ్‌లందు వ్యాపించిపోయెను.

చరాచరాత్మకమైన సృష్టియందు అఫ్రొడైట్ ఫలప్రదాయిని యగుదేవత యని యిదివఱకే వ్రాయఁబడినది. భూచర, జలచర, వాయుచరములమీఁదనే కాక దేవతలమీఁదసైతము ఈమె యధికారము పూనియుండెను.

ఆగామిదేవతారూపమున నీమె వస్తుసంవర్ధకము లైన తైదానములందును, వసంతవాసరములందును బూజింపఁబడుచుండెడిది. ఇట్టివే యగు గుణాదర్శములతో క్రీటునందు పుష్పదేవత యను పేరను బిలువఁబడుచుండెను ఏథెన్స్, సామోస్ లోనగు ప్రదేశములందును ఈమెకు యజ్ఞోచితసత్కారములు దొరకుచుండెను. అడోనిస్, అట్టిస్ లనువారితో పాటు నిర్వర్తింపఁబడు క్రియాకలాపములం దీమె వనస్పతిదేవతాస్థానమును గైకొనుచుండెను జంతుకోటియం దీమె కామోద్రేకమును పుట్టించుదేవత. మానవుల విషయమున జన్మ, వివాహ, గార్హస్థ్యములకుఁ జెందినదేవత అట్టి తరుణమున నీమెకు జెనిటిల్లిస్ (జన్మదాత్రి), నింఫియా (వివాహదేవత), కౌరోట్రోఫోస్ (బాలవర్ధని) మున్నగు బిరుదములు లభించుచు గ్రీకుల మతానుసారము స్త్రీపురుషులపవిత్రసంబంధమును గాపాడు దేవత కాని రోమకుల కొక్కతటి దుర్మోహాధిదేవతయై స్త్రీపురుషులందు ప్రబలమైన సంగమవాంఛను జనింపఁజేయుచుండును తనకుఁ బ్రియులైనవారి కీమె అత్యంతసౌందర్యము నొసంగఁగలదు ఇట్టి వరదానము స్త్రీలకు హానికరముగఁగూడ [illegible]ంచెను

మఱియొకసమయమునందు ప్రియయొక్క విటీషు[illegible] కృ మధ్యవర్తినిదర్శనము చాల్పుచుండును ఇందువలన నీమె సౌందర్యాధిదేవత యయ్యెను. సౌందర్యమునకు ప్రమాణభూత మగు నీమెవిగ్రహము స్పార్టాయొద్దఁ గలదు కాని వేశ్యాధిదేవతగ నీమెకుఁ గావింపఁబడు పూజనము కడునిందనీయముగ నుండును అశ్లీలమైన యీ యారాధనమును వలసవచ్చిన ఫొయినీషియనులే ప్రవేశపెట్టి రని పాశ్చాత్యులవిశ్వాసము ఒక్క కారింథ్ పట్టణమునం దేతల్లడుకా వ్యక్త యగుదేవత కర్పింపఁబడినదేవదాసీజనము వెయ్యిమందికంటె యెక్కువగ నుండిరి ధనాఢ్యు లగు కారింథియనులు తమ యధీనమున నుండు దాసీనికరములలో నందముకంటెను మించిన సౌందర్యవతులను దైవకైంకర్యార్థ మర్పణముచేయుట గౌరవమని భావింపుచు వచ్చిరి.

ఈమె యురేనస్‌యొక్క విచ్ఛిన్నావయవముచుట్టును జేరిన ఫేనమువలననుండి జనించె నని హెసోడ్ వ్రాసియుండెను ఇదియే ఈమెకు సముద్రముతోఁ గల సంబంధము ఇదికాక ఈమెకు సాగరసంబంధమును తెలియఁజేయు మఱికొన్ని బిరుదములు గలవు మఱియు నావికాగణము లీమెను గౌరవదృష్టితోఁ జూచుచుండురు సముద్రతీరమున నిర్మింపఁబడిన అరియాడిక్ - అఫ్రొడైట్ సమాధియు, అడోనిస్‌గాథయు నీమెకుఁ గల సముద్రసంబంధమును బలపఱుచుచున్నవి.

అస్సీరియనుల - ఇష్టదేవతవంటిదే అఫ్రొడైటునకు పాతాళలోకసంబంధమును గలదు. ఎట్లనఁగా, అడోనిస్ అనునతఁ డీమె ప్రేమించినవారిలో నొకఁడు. ఇతఁ డత్యంతసుందరుఁ డగుటంజేసి ఈమె స్వర్గమును సైతము విడనాడి ఇతని వెంటనే భూలోకారణ్యములందు సంచరింపసాగెను అడవులందు దుష్ప్రవర్తనము లైన హింస్రకజంతువులను వేటాడుటవలన నతని కెక్కడ ముప్పు కలుగునో యను భయమున నీమె యట్టి కార్యములనుండి యతనిని దూరముగ నుంచుచుండెను. కాని యతఁ డీ ప్రేమపాశముల గమనింపఁ డగుటచే నీమెనుండి తప్పించికొనిపోయి వేటాడఁగడఁగి ఘటనావశమున నొక భల్లూకముతోఁ దలపడి దానిచే హతుఁ డయ్యెను. అంత నీమె కావించిన విలాపములవలన మనసు కరఁగి పాతాళాధిపతి యామె కోర్కి ఆఱునెలలు అడోనిస్ భూమిపై నుండునటులను, మఱియాఱు

నెలలు పాతాళమున మంచులాగునను వర విడ్చిపోయెను. ఇది యి ట్లుండ అడోనిస్ పెర్సెఫోనీ దగ్గఱ నాలుగునెలలును, అఫ్రొడైటు కొద్ద నాలుగునెలలును, అతని యిచ్ఛానుసారము నాలుగునెలలును ఉండునట్లు వరము బడసెనని వేఱొక గాథ కలదు. ప్రతిసంవత్స రము ఋతువుల గమనాగమనములవలన పృథివిపైఁ గలుగు మార్పు లిట్లు అలంకారయుక్తమైన భావములో వ్రాయఁబడిన వని తోఁచు చున్నది. పాతాళసంబంధమును సూచించునట్టి ఈమెవిగ్రహ మొకటి డెల్ఫీయందు కలదు. మృతులైనవారి నుద్దేశించి ఒసంగఁబడు పదార్థ ములను గ్రహించునిమిత్తము నా కీ దేవత సమ్ముఖమునందే యావాహ్య నింపఁబడుచుండిరి

అత్యంత ప్రాచీనకాలమున గ్రీకు లీమెను యుద్ధదేవతగఁగూడఁ బూజించియుండిరి. ఇది కేవలము పూర్వదేశముల సంటికొనియున్న గ్రీసుయొక్క దీవా ప్రాంతములందుమాత్రమే కాదు, పూర్వదేశ ములకు మారముగ నుండు స్పార్టా మున్నగు ప్రదేశములందుగూడ నిట్టి పూజనములు జరుగుచుండెను. ఇట్టి యుద్ధవిషయకగుణధర్మముల వలన నీమెకు ఏరియా యను నామధేయముకూడఁ గలిగెను. ఈమె శిరస్త్రాణ ఖడ్గములను దాల్చియుండినట్లు కొన్ని యాధారములు గలవు. యుద్ధదైవమగు ఎరిస్ ఈమె ప్రియులలో నొకఁడు. అస్త్రశస్త్రసజ్జితమైన ఈమెవిగ్రహముగూడ నొకటి థీబ్సునం దుండెను. ఈమెయందలి గుణధర్మములకుఁ బ్రత్యామ్నాయముగ పొట్టేలు, చింబోతు, బాతు, హంసము, తాఁబేలు మొదలగు పశు పక్షులును, గులాబీ, నిమ్మ మొదలగు వృక్షములును పటములందు చిత్రింపఁబడియున్నవి

అఫ్రొడైట్ సౌందర్యాధిదేవతయై తన కెవ్వరుగాని పోటి లే రని తలఁచుచుండిన సమయమున సైకి (Psyche) యను కన్య ఈమెకంటె సుందరి యని వదంతి పుట్టెను. జను లందఱు నీమెతీర్థ ములకు వచ్చుట మాని సైకియొద్దకుఁ బోఁగడఁగిరి. అంత నీమె కుపితయై సైకిమీఁద పుష్పబాణములఁ గురిపించి యామె నీచునొకని వరించులాగునఁ జేయుమని తన కుమారుఁడగు 'క్యూపిడు'న కాజ్ఞ నిచ్చెను. అతఁడును తల్లిపంతము నెఱవేర్పవలయునని పట్టుదల తోడనే పోయెను. కాని యాకన్యను జూచుటతోడనే తన్నుఁ దానే మఱచి, యామెను నీచుని వరించునట్లు చేయుటకు మాఱుగఁ దానే యామెను ప్రేమించి యామెతో దినములు గడపసాగెను. ఈ వార్త అఫ్రొడైటుకోపాగ్నికి ఇంధన మయ్యెను. అంత నామె వారిద్దఱను విడఁదీసి సైకిచేత నానాబాధలు పెట్టుచు అసాధ్య ములగు కార్యములు నామెచేత చేయింపసాగెను. అట్టి సమయమున క్యూపిడ్ జ్యూపిటర్‌యొద్దకుఁ బరువెత్తుకొనిపోయి తనసమాచారము నంతయు వివరించి మొఱపెట్టుకొనఁగా నతఁడును గనికరించి వీరి యిద్దఱకును గూడ సమాధానము చేసి పంపెను.

పెక్కులి పురాతనము లగు చిత్రములందు అఫ్రొడైటు వస్త్రా న్వితయై ఒక్కొక్కపర్యాయము గూర్చుండియున్నట్లును, ఒ కొకపర్యాయము నిలువఁబడియున్నట్లును చిత్రింపఁబడియుండెను. తరువాత దిగంబరముగా సముద్రమునను డి లేచుచున్నట్లును, స్నానాంతరావస్థయం దున్నట్లును ఈమెమూర్తి చిత్రింపఁబడెను. అటుతరువాత దేవతాభావ మంతయుఁ బోవ, చిత్రకారు లీమెను కోమలాంగముతో ఆకర్షణీయసౌందర్యముతో, తరళనేత్రములతో, నవ్వుమోముతో నుండి చక్కని యువతిగాఁ బ్రకటించిరి. ఈమెయొక్క ప్రాచీనకాలపుచిత్రములందు ప్రాక్సిటేల్స్ అనునతఁడు వ్రాసినది ప్రశస్తమైనది. ఇది క్నిడస్‌యొద్దనుండెను. ప్రస్తుతము గనుపించువానిలో లూవ్రెప్రదర్శనశాలయందలి మెలోస్‌యొక్క అఫ్రొడైటు విగ్రహము గణింపఁబడినది. ఆద్వీపముమీఁద నిది ౧౮౨౦-వ సంవత్సరమున ఒక నాటకశాలాసంబంధమైన శిథిలావశేషములలో దొరకెను. రోమ్, ఫ్లారెన్సులందును ఈమెవిగ్రహములు గలవు. వటికన్, సెవిల్లా లలోని ఈమెవిగ్రహములు మనోమోహనోద్రేకకరములు

అబట్ — ఐరోపాఖండమునందలి ఒకరకపు మతగురు వులకు 'అబట్' అని పేరు. ఈ అబట్‌యొక్క అధికారమున కొకమఠము ఉండును. ఇది మొట్టమొదట సిరియాదేశములో ప్రచార మున నుండి తరువాత ఐరోపాఖండమం దంతట వ్యాపించినది. ఈ అబట్‌ను నియమించు నధికారము రాజునకును ప్రధానమతగురు వగు 'పోపు'నకును గలదు. పూర్వకాలమున నీపదవికి మంచిగౌరవ ముండె డిది. కాని యీకాలమున నది సాధారణ మయిపోయినది. ఈపదవిని స్వీకరించువాని కొకయధికారదండముగూడ నొసంగఁబడెడిది

అబట్, లీమన్ — అమెరికాదేశమునందలి ఒక ధర్మోప దేశకుఁడు (మతప్రచారకుఁడు) ౧౮౩౫-వ సంవత్సరమున నితఁడు జన్మించెను. న్యాయశాస్త్రమునందు మంచిపండితుఁడైయుండెడి వాఁడు. లీమన్ గొప్పలేఖకుఁడుకూడ. ది క్రిస్టియన్ యూనియన్, ది ఔట్‌లుక్ మొదలగు కొన్నియూ పత్రికల కితఁడు సంపాదకుఁ డుగ నుండెను

ఇతనివ్రాఁత లన్నిటిలోను తత్త్వపరిశీలనము ప్రధానస్థాన మాక్రమించుకొనియుండెడిది. ఇతఁడు వ్రాసినగ్రంథములలో ముఖ్య మయినవి రెండు ౧౮౯౬-వ సంవత్సరమున రచించిన 'క్రైస్తవ మతము', 'సాంఘికసమస్యలు' (Christianity and Social Problems), ౧౯౦౧ సంవత్సరములో రచించిన 'మానవుని హక్కులు' (The Rights of man)

**అబర్‌క్రోంబి సర్ జాన్** (౧౭౭౨ - ౧౮౧౭) — ఇతఁడు సర్ రాల్ఫ్ క్రోంబి యనునతనికుమారుఁడు. ౧౭౭౨ లో జన్మించి ౧౭౮౬ లో సైనికోద్యోగములో చేరెను. కొంతకాల మితఁడు ఫ్లాండర్సులోను, పశ్చిమ ఇండియాదీవులలోను పని చేసి తన తండ్రికి ఈజిప్టుదేశములో నున్నపుడు మిలిటరీసెక్రటరీగ నుండెను. ౧౮౦౩ లో నెపోలియను ఇతనిని చెఱసాలలో నుంచి ౧౮౦౮ లో

నియమించబడెను. ౧౮౦౯ లో బొంబాయి చేరి అక్కడ ముఖ్య సైన్యాధిపతి అయెను. ఆమఱుసటిసంవత్సరమున మారిషస్ ద్వీపము ను స్వాధీనపఱచుకొనుటకు వెడలినదండయాత్ర కితఁడు నాయ కుఁడు. తరువాత నీతఁడు చెన్నపురికి వచ్చి యచ్చట సైన్యాధిపతి యగుటకు తటస్థించెను. ౧౮౧౩ - ౧౮౧౪ సంవత్సరములయందు నీరాజ ధానికి గవర్నరుపని ఖాళీ వచ్చుటచే గవర్నమెంటువా రీతనిని అపనిని జూచుటకు నియోగించిరి. ఈతనికి ౧౮౧౨ లో లెఫ్టినెంటు జనరలు, ౧౮౧౪ లో కె. సి. బి., ౧౮౧౫ లో జి. సి. బి. యను బిరుదు లీయఁబడెను. ౧౮౧౭ లో నీతఁడు మరణించెను.

## అబర్‌క్రోంబి సర్ రాబర్ట్ (౧౭౪౦-౧౮౨౭) —

ఈతఁడు సర్ రాల్ఫ్ క్రోంబి యనునతనితమ్ముఁడు ఈతఁడు ౧౭౫౮ లో సైన్యమున ప్రవేశించి అమెరికాదేశములో ౧౭౬౩ వఱకును సైనికుఁడుగ నుండెను తిరిగి ౧౭౭౬ మొదలు ౧౭౮౩ వఱకును యునైటెడ్‌స్టేట్సు అమెరికా స్వాధీనపఱచుకొనుపర్యంతము అక్కడ యుద్ధము చేయుచుండెడివాఁడు.

తరువాత నీతఁడు ౧౭౮౨ లో ఇండియాకు వచ్చి ఆమఱు సటిసంవత్సరమే బొంబాయిరాజధానికి గవర్నరుగను ముఖ్యసైన్యాధి పతిగను నియమింపఁబడెను ౧౭౯౦ లో మేజరుజనరలు అయ్యెను మలబారుప్రాంతములందు కొన్నికార్యముల నెఱవేర్చి ౧౭౯౨ లో శ్రీరంగపట్టణముకడ్డ టిప్పుసుల్తాను నోడించుటకై చేయఁబడిన ప్రయత్నములో కారన్‌వాలీసున కితఁడు చాల సాయ మొనర్చెను

౧౭౯౩ లో కారన్‌వాలీసు హిందూదేశమునుండి వెడలిపోవు టచే నీతఁడీదేశమునకు ముఖ్యసైన్యాధికారి అయ్యెను అకాలము నుండి ౧౭౯౭ పర్యంతము సుప్రీముకౌన్సిలులో సభ్యుఁడుగాఁగూడ నుండెను ౧౭౯౪ లో రోహిల్ ఖండునందలి బాటినా యనుచోట రోహిలాల నోడించెను

**అబర్డీన్** — ఉత్తర స్కాట్లండుదేశమునందలి ముఖ్య మగు రేవుపట్టణము అబర్డీన్‌షైరునకు రాజధాని జనసంఖ్య ౧,౬౭,౨౫౩ (౧౯౩౧) జనసంఖ్యనుబట్టియు, పరిశ్రమలను బట్టియు, భాగ్యమునుబట్టియు చూచినచో స్కాట్లండుదేశమునందలి పట్టణములలో నిది నాలుగవదిగ పరిగణింపఁబడుచున్నది ఇది ఉత్తరసముద్రపు అఖాతముమీఁద నున్నది, ఉత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించియున్నది ఇది గొప్ప నౌకాశ్రయస్థానము చేపలవ్యాపారమునకు ప్రధానస్థానము ఈనగరము వైశాల్యము ౬,౩౬౮ యకరములు

ఇది పంద్రెండవ శతాబ్దియందుండి క్రమక్రమముగ వృద్ధినంది నది ఉత్తమమార్గములు అన్నియు తెల్ల చలువరాతితో నిర్మింపఁబడి యుండుటచేత నీ పట్టణమునకు 'చలువరాతి ప్రోలు'ను అర్థమునిచ్చు నామ మొకటి కలదు. నావ నెలిపెడివారలకు స్వచ్ఛముగ కనుపించు నీ పుర వరము కొండయొద్దనుండి సముద్రమునుండి చూచిన నతి రమణీయమైనదై యుండునని యని వర్ణింపఁబడియున్నది. ఇచ్చటనుండి పనితనంపుచలువ రాతి వస్తువులు నానాదేశముల కెగుమతి యగుచున్నవి.

ఇచట రెండు గొప్ప విశ్వవిద్యాలయములు కలవు. ఇందు ౧౯౧౩-వ సంవత్సరమున 'రోవెట్ ఇన్స్టిట్యూట్' అనుపేర జంతుపుష్టి శాస్త్రమునుగూర్చి పరిశోధన సలుపుట కొకసంస్థ యేర్పాటుచేయఁ బడినది 'కార్నెజీ ట్రస్టు'వా రిందునిమిత్తము ధనవినియోగమున కొఱకార్యములో ధనసాహాయ్యము చేసియున్నారు అబర్డీన్, సెంట్ ఆండ్రూస్, ఎడింబరో, గ్లాస్గోవిశ్వవిద్యాలయములు నాలుగును కలసి పార్లమెంటునకు ముగ్గురు సభ్యులను బంపుచుండును

ఇచట కట్టడములు మొదలగువానినిమిత్తము రాతిని త్రవ్వి తీయుదురు ఇది యిచ్చట చాలకాలమునుండి వర్ధిల్లుచున్న పరిశ్రమ ఈ రాయి నానాదేశములకు ఎగుమతియగుచున్నది. ఇదికాక, ఉన్ని, నార, ప్రత్తి, కాగితము, రసాయనపదార్థములు, సబ్బు, క్రొవ్వు వత్తులు, దువ్వెనలు, శేవ్యాములు మొదలగునవి ఇచటి యితరపరి శ్రమలు

## అబర్డీన్, జార్జిహ్యామిల్టన్‌గార్డన్ (౧౭౮౪-౧౮౬౦)

— ఈ పేరుగల అర్లనుసరదారులలో నీతఁడు నాల్గవ వాఁడు స్కాట్లాండురాజధాని యగు ఎడింబరోపట్టణమున జన్మించెను రాజకార్యనిపుణుఁడు ౧౮౧౩లో ఆస్ట్రియాలో నింగ్లండుతరఫున రాయబారిగా నుండెను టోప్లిట్జుసంధిపత్రము మీఁద నింగ్లీషువారితరఫున సంతకము చేసెను వెల్లింగ్టన్ ముఖ్యమంత్రిగా నుండినప్పుడు ౧౮౨౮-౩౦ వఱకు నీతఁడు విదేశాంగ మంత్రిగ (Foreign Secretary) నుండెను, ౧౮౩౪-౩౫ లో ఉపనివేశయుద్ధకార్యదర్శిగ (Colonial and war Secretary) నుండెను పీల్ ముఖ్యమంత్రిగ నున్నపుడుకూడ నితఁడు పెక్కు రాజకీయోద్యోగములను నిర్వహించెను ౧౮౫౨ లో ముఖ్యమంత్రి యయ్యెను ఈతనికాలములో క్రిమియాయుద్ధము జరిగెను ఇది రష్యావారికిని, తుర్కీవారికిని జరిగిన యుద్ధము ఇందు బ్రిటిషు వారును, ఫ్రెంచివారును తుర్కీవారికి మిక్కిలి సాయము చేసిరి ఈ యుద్ధమునందు క్రమముగా వ్యవహారములు జరుపలే దని ఈతని ప్రతిపక్షు లొకప్రతిపాదనమును తెచ్చి 'బహుమత'ము పొందినందువలన నీతఁడు ముఖ్యమంత్రిత్వమును వదలుకొనెను (౧౮౫౫) ఇతఁడు గ్రంథకర్త గ్రీకువారిశిల్పకళలోని 'సౌందర్యతత్త్వము' అను గ్రంథమును రచించెను.

**అబలాసచ్చరిత్రరత్నమాల** — చూడుఁడు, అచ్చమాంబ.

**అబాఖాన్** — పారసీకదేశపురాజు, మంగల్ లేక తార్తరీజాతివాఁడు. చంగిజ్ ఖాను వంశజుఁడు. ఇతనితండ్రి హులా

కృషి, వ్యాపారమునార్గములు.—ఈదేశమందలినేల మిక్కిలి సారవంతమైనది. వ్యవసాయము విస్తారముగఁ జేయఁబడుచుండును. కొన్ని ప్రాంతములందు రెండుకార్లును, మరికొన్నిచోట్ల సంవత్సరమునకు మూఁడుకార్లును పండుచుండును. మొక్కజొన్నలు, బార్లీ, రై, టెఫ్ (ధాన్యవిశేషము), బటానీలు, ప్రత్తి, చెఱకు ఎక్కువగఁ బండింపఁబడుచుండును. 'ఎకుస్సా' యను నేకొకవిధమగు ధాన్యము కలదు. దీనితో నల్లనిరొట్టెలు తయారుచేయుదురు. పలురకముల మాసెగింజలు, వేరుసెనగలు బాగుగ ఫలించును. హారర్ ప్రాంతమున కాఫీ అనుకొకమూలిక దొరకును. ౧౦,౦౦౦ అడుగులయెత్తుగల ప్రదేశములందుఁగూడ బార్లీ, ఓట్, బీనులును అక్కడక్కడ గోదుమలును సైతము పైరగును.

ఉన్నతభూములయందు మేకలలోపలను, నిమ్నస్థలములందు జొన్నమాసము నందును సాగుచేసి విత్తనము వేయుచుందురు. గడ్డి యపరిమితము. కావున పశుపాలనమున కిది మిక్కిలి యుపయుక్తమైన ప్రదేశము. కోట్లకొలఁది యావులుండ లిచటఁ గలవు. మేఁకలు, గొఱ్ఱెలు అసంఖ్యాకములు. ఇచట ఉన్ని నిచ్చుగొఱ్ఱెలు చాల తక్కువ. గుఱ్ఱములు మంచి బలముకలవి. కొండ లెక్కుటయందు చులుకైనవి కంచరగాడిదలు. ఇవి ౧౫౦ మొదలు ౨౦౦ల పౌనుల వఱకుఁగల బరువును మోయుచుండును.

గల్లాప్రాంతవాసులు వ్యవసాయమునకుఁ దోడు బంగారము దీయు వ్యాపారముగూడ సలుపుచుందురు. వాలెగాజిల్లాయందు ప్లాటినమ్‌ధాతువు దొరకును. ఇనుము, నల్లబొగ్గు, పెట్లుప్పు, గంధకము, రాగి, వెండి, రాతియుప్పు లోనగుపదార్థము లెక్కువగఁ గలవు.

ప్రతిసంవత్సర మిచట ౨౫,౦౦,౦౦౦ల పౌనులవ్యాపారము జరుగుచుండును. వ్యాపారమున కావశ్యకము లగు మంచిమార్గము లిచట లేవు. ఫ్రెంచిసోమాలీలాండ్ నందలి జిబూటీపట్టణమునుండి రాజధాని యగు అడ్డిస్అబాబావఱకు ౪౮౦ మైళ్లదూరముగల రైలుమార్గ మొకటి తప్ప వేఱొండుమార్గ మేదియును వ్యాపారమున కనుకూలమైనది లేదు. గుఱ్ఱములు, ఒంటెలు, కంచరగాడిదలద్వారా దేశమునఁ దక్కినచోట్ల వ్యాపారము జరుగుచుండును. రాజధానినుండి తక్కిన పెద్దపెద్దపట్టణములకు టెలిగ్రాఫ్‌సంబంధము కలదు. టెలిఫోను సంబంధముగూడఁ గలదు కాని నగరములోపల సుచిత్రబంధము లేకుండుటచే వార్తలు సరియగువిధమున నడచుట లేదు. గిల్లబట్, గొరైర్స్, గంబేలాపట్టణములదారిని ఆంగ్లో-ఈజిప్షను-సూడాను దేశముతో వ్యాపారము జరుగుచుండును. వేఱొకవ్యాపారమార్గము ఎరిత్రియానుండి మస్సావానగరమువఱకును బోవును. మఱియొకదారి హారార్ మీఁదుగ బ్రిటిష్‌సోమాలీలాండులోని బెర్బెరాపట్టణమువఱకును బోవును. కాఫీ, తోళ్లు ముఖ్యమైన యెగుమతులు. ఇవి గాక బంగారము, పునుగు, దంతము, మైనము, జవాది మొదలగునవియును నెగుమతి యగుచుండును. ఉప్పు, ఇనుపసామానులు, నానావిధవస్త్రములు దిగుమతి యగుచుండును. రాజ్యాదాయము 'కస్టమ్ సుంకములు', భూమి పన్నులయాదాయమును గ్రోవసుచుండును. రాష్ట్రాధికారు లగు గవర్నరులు అధికారనివాసులు. అందువలన నిచటియాదాయము నిలుకడగ నుండదు. ఉత్పత్తియగు సమస్తపదార్థములమీఁదను పన్ను విధింపఁబడియున్నది.

జనులు, మతములు — అబిసీనియాయం దనేకజాతులు కలవు. అన్నింటిలో దక్షిణ-అరేబియానుండి వచ్చిన సెమిటిక్కులు ప్రముఖులు. రెండుభాషల నిచటివారు వాడుచుందురు. అందు అమ్హారిక్ రాజకీయభాష. ఎథియోపియాకు అనువాదాంతరముగల గీజుభాష. కూడ ఎక్కువప్రచారమం దున్నది. ఇందలిరాజమతము క్రైస్తవమతము. నాల్గవశతాబ్దియందు ఈజిప్టుదేశమునుండి కులపతి యగు అథ్నాసియస్‌వలనఁ బంపఁబడిన ఫ్రూమెంటస్ అనునతఁడు మొట్టమొదట నీదేశమువారికి క్రైస్తవమతదీక్ష నొసంగెను. కాని యిప్పుడిది యొకవిచిత్రమగు క్రైస్తవమతముగఁ బరిణమించినది. ప్రస్తుతము వీరు రోమనుకాథలిక్కులు గారు, ప్రొటెస్టెంటు తెగలోఁ జేరరు. కాప్టుచర్చికిఁ జెందినవారుగ నుందురు. మఱియు వీరిమతమును 'మానోఫైసైట్'మత మందురు. తరువాత యూదులును నిచట నెక్కువగఁ గలరు. అఫార్, సోమాలీలాండ్, గల్లాప్రాంతములలో ముసల్మాను లెక్కువ. ఇచటి క్రైస్తవులు, సాధువులు, స్వర్గదేవతలను నెక్కువగఁ బూజించుచుందురు. కాని విగ్రహారాధన మచట లేనే లేదు.

వీరిలో మసవాసములు చేయు నాచారము కలదు. ఆరయుపవాసము లతికఠినములు, అత్యంతదీర్ఘములునై యుండును. జెరూసలేం నగరమునకు యాత్రపోవుటవలన పాపనాశనమగునవియు పాపస్వీకరణమున ముక్తి గలుగు ననియు వీరిదృఢవిశ్వాసము. ఇందుమూలమున వీరిలోఁ బురోహితులపని బాగుగ నున్నది.

దేశవిభాగము.— చక్రవర్తిచే స్వయముగఁ బాలింపఁబడు భాగము గాక షోవా, కాఫా, గల్లా, మధ్యసోమాలీ యను సామంతరాజ్యములును గలవు. పరిపాలనార్థ మిది పూర్వము టైగ్రె, అమ్హారా, గోజాం, షోవా అని నాలుగుమహామండలములుగ విభజింపఁబడియుండెను. కాని యిప్పటివిభజనము వేఱు. ఇప్పుడు పెద్దవి, చిన్నవి కలసి ౨౦ ప్రాంతములు. వానిలో గోజాం, ఉత్తరటైగ్రే, దక్షిణటైగ్రే, బెజెండిర్, హారర్, సలకే, వాగ్, జిమ్మా, లస్టా అనుపేరుగలవి ప్రధానమైనవి.

దేశచరిత్రము.— అనాదిగ నీదేశము నిరంకుశులగు రాజులచేఁ బరిపాలింపఁబడుచువచ్చెను. ప్రాచీనకాలమున దీనికిని, ఈజిప్టుదేశమునకును నెక్కువసంబంధ ముండెను. కావున నీరెండురాజ్యములు సర్వకాలములయందును బరస్పరపోషకములుగ నుండెను. టాలెమీలకాలమునందు గ్రీకులయధినివేశము లీదేశమున నెలకొల్పఁబడియుండెను. క్రైస్తవమత మీదేశమునఁ బ్రవేశించినయారంభకాలమునందు క్రైస్తవాచార్యులవలనఁబడి రాజుకొద్ది చెల్లుచుండెను. కాలెబ్ అనురాజు

సరిహద్దులవిషయమున ౧౯౦౪ నందును, మరల దిగుమతులమీద సుంకము మున్నగువానివిషయమున ౧౯౧౭-వ సంవత్సరమునను సంధులు జరిగియుండెను ౧౯౦౮ న అమెరికాతో వ్యాపారవిషయకసంధి జరిగెను ౧౯౨౮ న ఇటలీ, ఫ్రాన్సుదేశములు తూర్పు దిక్కున సరిహద్దులవిషయమున సంధి చేసికొనెను ౧౯౩౦, ౧౯౩౪ లందు హాలెండ్, జాపాను దేశములు క్రమముగా వ్యాపార, మైత్రి సంధులు చేసికొనెను.

టఫారీయొక్క ప్రయత్నమువలన నిప్పుడీదేశము 'లీగ్ ఆఫ్ నేషన్స్'నందు స్థానము పడసియున్నది. ౧౯౨౮-వ సంవత్సరమున రీజంటునకును, చక్రవర్తిని యగు జౌదియారాణికిని మనస్పర్థలు కలిగెను అంత రాజ్యములోని ప్రముఖులయాదేశానుసారము టఫారీ తన్నే రాజుగ బ్రకటించుకొనెను.

**అబుతాలిబ్ కలిం** — ప్రసిద్ధుడగు నొక ఈరాను దేశకవి మొదట జహాంగీరుచక్రవర్తికాలములో నితడు హిందూదేశమునకు వచ్చెను. తరువాత తనదేశమునకు మరలిపోయి షాజహాను పాదుషాకాలమున మరల ఢిల్లీకి వచ్చెను. షాజహా నితనికి గొప్పబిరుదు నొసంగి ధనాదికముతో విశేషముగ సన్మానించెను 'ఝఫర్ నామా-ఇ-షాజహానీ' అనుపేర నిత డొకగ్రంథమును రచించెను

**అబుల్ అలా ఉల్ మా అరీ** (౯౭౩ - ౧౦౫౭) — సిరియాదేశమున జన్మించిన ఒకగొప్ప అరబ్బీకవి ఇతడు పసితనమునసే తండ్రిని గోల్పోయెను ఇది యైదవయేంటనే స్ఫోటకము గూడ సంభవించినది అయినను మిగుల పట్టుదలతో నితడు అలెప్పో, అంటియోకు, ట్రిపోలీ మున్నగు పట్టణములకు బోయి యచ్చటిపండితులకడ చదువుకొని గొప్పపాండిత్యము గడించెను అటుపై బాగ్దాదు పట్టణమునకు పోయి యచటను దనపాండిత్యమువలన గొప్పపేరు సంపాదించెను

**అబుల్ కాసిమ్** — కామ్రాను మీర్జాకుమారుడు, హుమాయూను చక్రవర్తితమ్ముడు. క్రీ శ ౧౫౬౫-వ సంవత్సరమున అక్బరుచక్రవర్తి యితనిని గ్వాలియరుకోటలో ఖైదుచేసెను తుదకు చంపించివైచెను

**అబుల్ ఘాజీ బహాదర్** (౧౬౦౫ - ౧౬౬౩) — ఇతడు ఖైవా ప్రభుత్వమును కుమారునకు నొప్పగించి చెంగిస్ ఖాను యొక్క వంశచరిత్రమును వ్రాసెను అయ్యది జర్మను, ఫ్రెంచి భాషలలోనికి తరువాత తర్జుమా చేయబడినది.

**అబుల్ ఫజల్, షేక్** — అక్బరుచక్రవర్తికి ప్రాణస్నేహితుడు, మంత్రి, చరిత్రలేఖకుడు. ఇతడు 'షేక్ ముబారక్' అను సంఘసంస్కర్తయొక్క కుమారుడు. ఇతడు ౧౫౫౧-వ సంవత్సరము, జనవరి ౧౪-వ తారీఖున ఆగ్రా పట్టణమందు జన్మించెను అప్పుడు 'ఇస్లాంషా' రాజ్యము చేయుచుండెను అబుల్ ఫైజీ అను కవి యితని యన్న ముబారక్ మహమ్మదీయమతమునందు పిచ్చినమ్మకము గలవాడు కాడు. అందుచే నితరమహమ్మదీయులవలన వానికి కష్టములు కల్గుచుండినందున వాడు తన పుత్రులను ఆగ్రాలోనే విడిచి పారిపోయెను. అన్నదమ్ము లిద్దరు అబుల్ ఫైజీ, ఫజల్ ఇద్దరును తండ్రియాజ్ఞానుసారముగనే పారసీక-అరబ్బీభాషల నభ్యసించిరి పదునైదుసంవత్సరములు వచ్చునప్పటికే యాతడెన్ని విద్యలనో సాధించి గొప్పపండితుడు డనిపించుకొనెను. అతనిగురించి యాకాలమునం దొక కథ కలదు 'ఇస్ఫహాని' అను నొక పూర్వకవిచే రచింపబడిన గ్రంథ మతనికి దొరకెనట! అందలిప్రుట లన్నియు చినిగిపోయుండెను. అతడా సగభాగమును దహ్రప్రజ్ఞచే బూరించెను తరువాత సంపూర్ణప్రతి యొకటి దొరకెను దీనికి దానికిని భేదము కొంత యున్నను మొత్తముమీద గ్రంథములోని భావము పోకుండ అబుల్ ఫజల్ దానిని పూరించె నని స్పష్టపడెను



అబుల్ ఫజల్

ఇతడు మొదట నేకాంతవాసమునం దుండి కొందఱు శిష్యులకు దన విద్య నేర్పుచుండెను. కాని ౧౫౭౪ లో నితనికి ఇతని యన్నవలన అక్బరుచక్రవర్తితో స్నేహము కలిగి దినదినాభివృద్ధి నొందెను అప్పటికే యాతడు మహమ్మదీయులమతగ్రంథ మైన 'ఖురాను' మీద వ్యాఖ్య వ్రాసియుండెను. ఇతడు దితరమహమ్మదీయులవలెగాక అన్ని మతములయందును సమభావము గలవాడు. అన్ని మతములందును సత్య మున్న దనియు, ఒకమతమునం దెనింకొకమత మెక్కు డని చెప్పుటకు వీలు లే దనియు నితని యభి

౩ ౧౮-వ శతాబ్దియందలి ఒక మహమ్మదీయ పండితుడు 'తారీఖ్-ఇ-అహ్మద్', 'ముహారబ్-ఇ-కాబు-ఓ-కంధహార్', 'తారీఖ్-ఇ-పంజాబ్-తుహోపత్ అల్ అహ్బాబ్' (ఈ మూడవది సిక్కు యుద్ధమునకు సంబంధించిన గ్రంథము) అనునవి యితడు రచించిన గ్రంథములలో ప్రధానమైనవి.

౪ నాదిర్ షా ఆస్థానమున నుండిన యొక పండితుడు 'బయాన్-ఇ-వాకీ' యను పేర నితడు నాదిర్ షా చరిత్రమును రచించెను.

౫ అఫ్గాన్ దేశనివాసి ఖాజా ఖాన్ లోడీయను గ్రహామునకు శాస్త్రుడై కాలము గడుపుచు నతడు చనిపోయినపిమ్మట విజాపురరాజ్యమునం జేరి తక్కాలమునం గాలుడైన ఆదిల్ షాహాచేత మిరాజ్, దక్షిణమహారాష్ట్రదేశము, కొంకణము మున్నగు ప్రాంతములకు రాజప్రతినిధిగ నేర్పఱుప బడెను. అంతకుబూర్వము పశ్చిమభాగమునకు రాజప్రతినిధిగ నుండినకాలమున పన్హాలానిూడ నండెత్తిపోవ విజాపురపుదొరతన మువారితని కాజ్ఞ నొసగిరి. తదనుసార మితడు పన్హాలాను ముట్టడించెను. ఆ సమయమున శివాజిచే నితని నెదిరింపబంపబడిన ప్రతాపరావుగూజరు పన్హాలాచుట్టుప్రక్కల నున్న యిలాకాను ధ్వంసము గావింప కరీము నిరకుడై మఱికొంత సైన్యముసంగ్రహార్థము విజాపురమునకుం బోయెను. అబ్దుల్ కరీమును జంపకుండ వదలినందులకు శివాజీ ప్రతాపరావుమీద నత్యంతకుపితుడు కాగా నితడును మిగుల రోషముగాని దొరకినమట్టునకు సైన్యమును వెంటంగొని ఓరంగాబాదు ఇలాకాలను నాశనము చేయుచు బీరదు పరిసరములపర్యంత మేగి యా చుట్టుప్రక్కలనుగూడ విధ్వంసముం జేసెను. ఇంతలో అబ్దుల్ కరీము విజాపురమునుండి సైన్యమును కూడచేసికొని పన్హాలా ప్రవేశించునప్పటికిం బ్రతాపరావుగూడ మరలివచ్చెను. ఇతడు మొదట శివాజీవలన మాట పడియుండినందున ముందువెనుక లరయక మహమ్మదీయులమధ్యముం బ్రవేశించి భీకరముగం బోరి యుద్ధరంగమందే వీరగతిని బొందెను. ఈ సంగతి తెలిసినతోడనే మహారాష్ట్రులు పరుగిడజొచ్చిరి. కాని యింతలో హంసాజీమోహితే యను వేరొక మహారాష్ట్రవీరుడు ౫,౦౦౦ ల సైన్యముతో వచ్చి పరుగిడుచున్న శత్రువారలను బిలిపొల్చి యుద్ధ మొనరింప అబ్దుల్ కరీము మరల విజాపురమున కేగవలసినవాం డయ్యెను. ఆదిల్ శాహామరణానంతర మీ యితడు మిరాజ్, కొంకణము మొదలగు దేశములకు రాజప్రతినిధి యయ్యెను. ఖావజ్ ఖాన్ అను పేరుగల అబిసీనియానివాసి బాల్యోనుకుడుగ నియమింపబడియెను. ఖావజ్ ఖాను తన స్థానము దృఢపఱచుకొన నెంచి దక్షిణమందలి మొగలాయి రాజప్రతినిధి యగు బహదూర్ఖానుతో రాయబారములు సలిపి యతని కొండిక కుమారునకు దనకూతు నిచ్చి పెండ్లి చేయుటయే కాక గతించిన ఆదిల్ శాహాకూతురు ఖాదుషాబీబీని చక్రవర్తికొడుకులలో నొకని కిచ్చి వివాహ మొనరించెద నని వాగ్దానముం జేసెను. ఈలాగున వీరియుభయులకు సంబంధబాంధవ్యములు దృఢము లగుటం జూచి కరీము ద్వేషగ్రస్తుం డయ్యెను. ఈర్ష్యాగ్రస్తుం డగు నీ యొకదినమున విశ్వాస మొసంగి ఖావజ్ ఖానుని రావించి మాటలాడుచు హఠాత్తుగ నతనిని గడతేర్చెను. ఈసమాచారము బహదూరుఖానునకుం దెలిసినవెంటనే యాతడును మిగుల కోప మూని కరీముపై నెత్తివచ్చెను. గాని దిలేర్ ఖాను మాధ్యస్థ్యము వహించి యాతడును అఫ్గానుదేశవాసి యగుటవలనం గరీమున కేమియు నష్టము రాకుండులాగున వారిద్దఱకును సంధి గావించెను. అనంతరము కొంతకాలమునకు బహదూరుఖాను, శివాజీ, గోలకొండనాయకుడగు అబుల్ హసేను వీరు మువ్వురు నేకీభవింప గిలేర్ ఖాను, కరీము - వీరిద్దఱును గలసి గోలకొండను ముట్టడించిరి. కాని లాభము కలుగ దయ్యెను. ఈ సమయమందే కరీము రోగగ్రస్తుడై క్రమముగ వృద్ధికాగా నెన్ని ప్రయత్నములు లొనరించినను విఫలము లగుటవలన మరణించెను.

**అబ్దుల్ కాఫ్ ఖాన్** — సావనూరురాజవంశీకుడు. క్రీ. శ. ౧౬౮౬-వ సంవత్సరమున విజాపురము క్షీణించినతరువాత వంతవఱకును వారికొలువులో నున్న యితడు మొగలాయిచక్రవర్తి కొలువులోం బ్రవేశించెను. ఇతనికి దిలేర్ ఖాన్ బహాదూర్, దిలేర్ జంగను బిరుదములు లభించుటయే కాక బాంకీపురము, అజమునగరము, తొరగల్లులోని ౨౨ మహాలులయిలాకా దొరకినది. ముట్టమొదట నితడు బాంకీపురమును రాజధానిగం జేసికొనెను. కాని జన్నరవహళ్లీ యను గ్రామముకడ్డం బ్రాకృతికదృశ్య మతిమనోహరముగ నుండుట యవలోకించి యక్కడ నొకనగరమును గట్టించెను. ఆనగరము శ్రావణమాసమున స్థాపింపబడుటవలన శ్రావణూ రని పేరు గాంచి క్రమముగ సావనూరుగ మాఱెను.

**అబ్దుల్ ఖాదర్**, అమీర్ (౧౮౦౮-౧౮౮౩)— ౧ అల్జీరియా దేశములోని యొక దేశభక్తుడు. ఇతడు ఫ్రెంచి వారితో మతయుద్ధము జేయుటకై తన దేశీయులను బురికొల్పుచు ౧౮౩౩-వ సంవత్సరములో ఓరాన్ వద్ద యుద్ధము మొదలుపెట్టెను. ఇతడు ఫ్రెంచివారితో సంధి చేసికొన్నతరువాత అమీరుగ నొప్పుకొనంబడియెను (౧౮౩౪), కాని వెంటనే మరల యుద్ధము ప్రారంభము కాగా అబ్దుల్ ఖాదరు మొరాకోదేశమునకుం బాఱిపోయెను (౧౮౪౩). ఇతడు ౧౮౪౭-లో డీ లా మొరిసీర యను ఫ్రెంచిసేనానాయకునకు వశుడై టూలోనునకు పంపబడియెను. ౧౮౫౨-వ సంవత్సరమున లూయీ నెపోలియనుచే విడిచిపెట్టబడుటయే కాక ౧౮౬౦-వ సంవత్సరమున లక్ష ఫ్రాంకుల నవకారవేతనముం బడసి కుటుంబముతో డెమాస్కసు పట్టణమున నివసించుచుండి తత్త్వశాస్త్రమునుగూర్చి కొన్ని గ్రంథములను విరచించెను.

౨ అబ్దుల్ ఖాదర్ అల్ గిలానీ అని యితని పూర్ణ మైనపేరు (౧౦౭౮-౧౧౬౬) ఇతడు పారసీక

ఖాన్ అనువదించుటకు ప్రారంభించెను. జహాంగీర్ కాలమున ఇతడు ౭,౦౦౦ మన్‌సబ్‌దారు డయ్యెను. ఆలీజంగ్ అను పదవిని బడసెను. ఫరుఖ్‌సియార్ కాలమున నితడు లాహోరునకు గవర్నరయ్యెను. సిక్కుల నోడించి వారి గురువైన బాందా అనువానిని చెరబట్టెను. మహమ్మద్ షా కాలమున నితడు ముల్తానునకు రాజయ్యెను. 'సంసాం-ఉ-ద్దౌలా' అను బిరుదమును వహించెను. ఇతడు ౧౭౩౯ లో నాదర్‌షాహ దాడికాలములో మృతుడయ్యెను. ఇతని కుమారుడు జకరియా ఖాను లాహోరునకు సుబేదారుగా నుండెను. ఇతని తండ్రి పేరు ఖ్వాజా అబ్దుల్ కరీమ్.

అబ్దుల్ హక్, షేక్ (౧౫౫౧-౧౬౪౨) — గొప్ప మహమ్మదీయ విద్వాంసుడు. చరిత్రము, మతము, సూఫీ సిద్ధాంతములు, యాత్రలు మొదలైన విషయములపై నూటికంటె ఎక్కువ గ్రంథములు వ్రాసినవాడు. ఇతని గోరీ ఢిల్లీపట్టణమందు గలదు. ఇతనిని భగవద్భక్తునిగా భావించెదరు. తండ్రి పేరు సైఫ్-ఉద్దీన్ షేక్ నూరు ఉల్లా.

**అబ్దుల్ హకీంఖాన్** — ఇతడు సావనూరు నవాబు. ఇతని జనకుని పేరు మజీద్ ఖాను. మజీద్ ఖానుయొక్క పూర్వులందరును నిజామునకు లోబడియుండి శాంతిపూర్వకముగ రాజ్యమేలుచు వచ్చిరి. కాని మజీద్ ఖాను నిజాము ఫర్మానా పొందకయే సింహాసనమెక్కినకారణమున వారిద్దఱకును విరోధము గలిగెను. తనదేశమున గొంతభాగ మిచ్చి మహారాష్ట్రులతో మైత్రి చేసికొని యితడు నిజాము నెదిరించెను. ఈ వైరమే యితని కొడుకగు హకీంఖానునకు గూడ సంక్రమించెను. హకీంఖాను రాజ్యమునకు వచ్చినతోడనే యితని కన్నివైపుల శత్రువులతో బోరాడవలసివచ్చెను. నిజాము నెదిరించునిమిత్తము తనదేశమందలి కొంతభాగమును మహారాష్ట్రుల కిచ్చి వారితో సంధి గావించుకొనెను. మహారాష్ట్రుల సాయముననే యితడు హైదరాలీని గూడ నొకపర్యాయ మెదిరించి పాఱదోలెను. యుద్ధానంతరము మహారాష్ట్రులు వెడలిపోయినతోడనే హైదరు మరల నితని దేశముమీద దండెత్తి దక్షిణప్రాంతముల జయించెను. కాని యీసందర్భమున వీరిద్దఱకును పరస్పరసంబంధబాంధవ్యములు చేకూర మైత్రి కలిగినది. ఈమైత్రి హైదరు జీవించియుండినంత కాలము స్థిరముగనే యుండెను. కాని యతని మరణానంతరము టిప్పుతో మరల యుద్ధాపూర్వ మయ్యెను. అంత నితడు సావనూరు వదలి పునహానగరమునకు జేరి మహారాష్ట్రు లొసంగు ౧౦,౦౦౦ ల మాసికవృత్తివలన జీవనము గడపుచు క్రీ శ ౧౭౯౫-వ సంవత్సరములో గాలధర్మము నందెను.

**అబ్దుల్ హమీద్** — ౧. ఇతడు (౧౭౨౫-౧౭౮౯) తుర్కీ సుల్తాను, మూడవ అహమ్మదు కుమారుడు. [illegible] అహమ్మదు అను పేరుతో తన సోదరుడైన ముస్తఫాకు పిమ్మట తుర్కీ సింహాసన మలంకరించి సుల్తా నయ్యెను. ఇతని ప్రభుత్వకాలములో రష్యనులకును తురుష్కులకును యుద్ధములు జరిగి రష్యనులకు జయము లభించెను.

౨. ఇతడు (౧౮౪౨-౧౯౧౮) అబ్దుల్ మజీదునకు పుత్రుడు. తన సోదరుడును, పెద్దవాడును నగు మురాదునకు పిమ్మట తుర్కీసింహాసన మధిష్ఠించి సుల్తానై ౧౯౦౯-వ సంవత్సరములో సింహాసనమునుండి తొలగింపబడెను. ఇతని ప్రభుత్వకాలములో జరిగిన ముఖ్యవిషయములు సర్వియాతో యుద్ధము (౧౮౭౬), రష్యాతో యుద్ధము (౧౮౭౭-౭౮), ఆర్మీనియాలో ఘోరకృత్యములు జరుగుట, గ్లాడ్‌స్టన్ ప్రభువుచే ఘాతకుడని దూషింపబడుట, క్రీటులో అల్లరులు, గ్రీసుతో యుద్ధము (౧౮౯౭), ౧౯౦౮-వ సంవత్సరములో తురుష్కరాష్ట్రములో రాజకీయసంస్కారములకై తరుణతురుష్కులు ప్రభుత్వము నెదుర్కొనుట, ౧౯౦౯-వ సంవత్సరములో దేశీయమహాజనసభ యేర్పడి సుల్తాను దుష్పరిపాలనము చేయుచున్నందున ఖలీఫాపదవిని వహించుటకు దగిన పాత్రతను గోల్పోయెనని చెప్పి యతనిని సింహాసనమునుండి తొలగించి యాతని సోదరుని ఐదవ మహమ్మదను పేరుతో సుల్తానుగా చాటుటయును సంభవించెను.

అబ్దుల్లా — మతప్రవర్తకుడైన మహమ్మదుయొక్క తండ్రి. అబ్దుల్ ముత్తలిబ్ అనువాని కుమారుడు. ఇతడు మిక్కిలి చక్కనివాడు. ఇతడు ఒంటెలకాపరి. ఇతనిభార్యపేరు అమీనా. ఈదంపతులకు చిరకాలమునకు మహమ్మదు కలిగెను. మహమ్మదు శిశువుగ నుండగనే ఇతడు మరణించెను. ఇతని మరణకాలము క్రీ శ ౫౭౧ ప్రాంతము.

**అబ్దుల్లా కుతుబ్ శాహ** (౧౬౧౪-౧౬౭౨) — గోలకొండలో ప్రభుత్వము చేసిన కుతుబ్ షాహి వంశములోని ఆఱవ నవాబు. ఇతడు మహమ్మద్ కుతుబ్ షాహు తరువాత రాజ్యమునకు వచ్చెను. మీర్ జుమ్లా అనువానినిగురించి యీతనికిని, ఢిల్లీశ్వరుడైన షాజహానునకును వైరము వచ్చెను. అంత ఢిల్లీశ్వరుని కుమారుడైన ఔరంగజేబు గోలకొండమీదికి యుద్ధమునకు బోయి దానిని వశపఱచుకొనెను. అపుడు కుతుబ్ షాహా కోటిరూపాయ లిచ్చి సంధి చేసికొనెను. ఈతడు ౧౬౭౨ లో మృతి నొందెను. ఇతనికి పుత్రసంతానము లేదు. ముగ్గురు కూతులు. వారిలో రెండవకూతురైన ఔరంగజేబు పెద్దకొడుకున కిచ్చి వివాహము చేసి తన మరణానంతరము గోలకొండరాజ్య మతనికే యిచ్చునట్లుగ నిర్ణయము చేసికొనెను. కాని అబ్దుల్లా మరణించుటకు పూర్వమే అల్లుడు పరలోకగతుడయ్యెను. కాబట్టి చనిపోయినను [illegible]

గాని కొంతకాలము అబ్దుల్లాతరువాతను సింహాసన మెక్కిన యతని సోదరుని యబ్దుల్లాయను అబుల్ ఖానుమీద దండెత్తివచ్చి యతని నాశ



అబ్దుల్లా కుతుబ్ షాహ

నము గావించెను. అబ్దుల్లాయొక్క సమాధిదగ్గఱ నిప్పటికిని ప్రతి సంవత్సర మొకపర్యాయము బీదలకు అన్నము పెట్టెదరు.

**అబ్దుల్లాఖాన్** — షంగిన్ ఖానునివంశములో నైన సికందర్ ఖానుని కుమారుడు. ఇతడు 'ఉజ్ బేగ్' లనువారికి నాయకుడు. తండ్రితో గూడ చేరెను. తండ్రి చనిపోయినతరువాత ౧౫౫౭-లో సమర్ కండ్, బొఖారా రాజ్యములకు నధిపతి యయ్యెను. ౧౫౮౮-లో ఖొరాసానుమీదికి దండెత్తిపోయి హీరాత్ పట్టణమునకు ముట్టడి వేసి దానిని వశపఱచుకొనెను. అచ్చట నధికారిగా నున్న అలీ కులీఖానుని ఇతరులతో గూడ నఱికి వైచెను. ఇతడు పారసీకపుషా అబ్బాస్ తోడను, ఢిల్లీచక్రవర్తి యైన అక్బరుతోడను సమకాలికుడు. ఇతడు ౧౫ సంవత్సరములు రాజ్యము చేసి ౧౫౯౮-లో మరణము నొందెను.

**అబ్దుల్ ఖాన్ ఉజ్ బేగ్** — ఇతడు అక్బరుకాలములో ప్రఖ్యాతి గాంచిన ఉజ్బెగ్ చక్రవర్తి. ఇతనిని మాల్వా దేశమునకు పాలకునిగ నొనర్చెను (౧౫౬౪). ఇతడు అక్బరుపై తిరుగబాటు చేయుటచేత ఓడింపబడి దేశమును విడిచి పరారి ఆయెను.

**అబ్దుల్లాఖాన్ సయ్యద్** — ఇతనికి కుతుబ్-ఉల్-ముల్క్ అను పదవి కలదు. ఇతడు ఢిల్లీచక్రవర్తి అయిన బహాదూర్ షా కాలమున (౧౭౦౭ - ౧౭౧౨) అలహాబాదునకు గవర్నరుగ నియమింపబడెను. ఇతనితమ్ముడైన సయ్యద్ హుసేన్ అలీ ఖాను బీహారునకు గవర్నరుగ నుండెను. ఈ సోదరులు మతకర్తలైన 'మహమ్మదు' వంశమువారట! ఫరుక్ సియర్ (౧౭౧౩ - ౧౭౧౯) అను ఢిల్లీచక్రవర్తి వీరి సాహాయ్యమునచే సింహాసనాసీనుడయ్యెను. అబ్దుల్లాఖా నాతనికి ముఖ్యమంత్రి యయ్యెను. అతని తమ్ముడు 'అమీర్-ఉల్-ఉమ్రా' అను గొప్పపదవిని (సేనాధిపత్యమును) పొందెను. 'అందుచే నీ సయ్యదుసోదరు లిద్దఱును సర్వాధికారము కలవారై పాదుషానుకూడ లక్ష్యము చేయరైరి. వారిని నాశము చేయవలె నని పాదుషా యత్నించెను. కాని అతనియుపాయము లన్నియు నాతనికే చెఱుపు చేసెను. వారిబాధ తప్పించుకొనుటకై వారిలో నొక్కడగు హుసేన్ అలీ యనువానిని దక్షిణదేశమునకు సుబేదారుగా బంపెను. కాని వాడచ్చట మరాటావారితో స్నేహము చేసి వారిసైన్యములను, బాలాజీవిశ్వనాథుడను పేష్వాను వెంటబెట్టికొని ఢిల్లీపట్టణమునకు పోయి తనయధికారమును మరల స్థాపించెను (౧౭౧౮). ఇట్లు మరల సర్వాధికారము కలవారైన యీయన్నదమ్ములు ౧౭౧౯ లో ఫరుక్ సియరును జంపించి యాఱునెలలలో నిద్దఱు రాజపుత్రుల సింహాసనస్థులజేసిరి. కాని వా రకారణము వలననో మృతులయిరి. తుదకు వీరు 'మహమ్మద్ షా' అనువానిని పాదుషాను చేసిరి. కావున నీ సయ్యదుసోదరులకు 'రాజనిర్మాతలు' (King makers) అని పేరు వచ్చెను.'[1]

మహమ్మదుషా రాజయినతరువాత నతని ప్రేరణవలన ౧౭౨౦ లో హుసేన్ అలీఖాను చంపబడెను. అబ్దుల్లాఖాను తిరుగబడగా నాతని నోడించి చెఱబెట్టిరి. అతడచ్చటనే ౧౭౨౩-లో మృతుడయ్యెను.

**అబ్దుల్లా ఎల్ తెయిషియస్ సయ్యద్** (౧౮౪౬-౯౯) — ఇతనిని ఖలీఫా యందురు. మహమ్మదు అహమ్మదునకు పిమ్మట మహదీపదవి వహించెను (౧౮౮౫). ఇతడు బగ్గరతెగలోనివాడు. ౧౮౮౯-వ సంవత్సరమున అబిసీనియా చక్రవర్తి యగు జానును నోడించెను గాని ౧౮౯౩-వ సంవత్సరమున అగరుడోట్ అను ప్రదేశమున ఇటాలియనులచే తఱుమబడెను. ౧౮౯౮-వ సంవత్సరమున కిచనరుప్రభువుచేతను, తరువాత ఓస్ డెబ్రికాట్ అను ప్రదేశమున సర్ ఆర్ వింగేటుచేతను ఓడింపబడి యాయుద్ధములోనే మరణము నొందెను.

**అబ్బయామాత్యుడు** — ఈతడు తెనుగున అనిరుద్ధచరిత్రము, కవిరాజమనోరంజనము అను రెండుకావ్యములను

1. మహమ్మదీయ మహాయుగము, రెండవభాగము, ౧౧౧.

కథాసంగ్రహము.— అబ్బయామాత్యుఁడు శ్రీమద్భాగవతమునందలి కథ ననుసరించి యీ యనిరుద్ధచరిత్రమును వ్రాసెను. వర్ణనములు పెందలైనవి తప్ప మూలకథలో నేమాత్రము మార్పులను జేసియుండలేదు. అనిరుద్ధచరిత్ర మని పేరు పెట్టినందునఁ గవి మొదటియాశ్వాసమునందు, అనిరుద్ధునకును రుక్మియొక్క పౌత్రి యైన రుక్మలోచనకును జరిగిన వివాహమును వర్ణించినాఁడు. రెండవ యాశ్వాసమునందు బాణాసురుఁడు శివునివలన వరంబును బడయుటయు, ఉష స్వప్నమునఁ గాంచుటయు, చిత్రరేఖ యఖిలరాజవరుల పటముల వ్రాసి యుషకుఁ జూప నామె యనిరుద్ధుని గుర్తించుటయు నను కథాభాగము కలదు. ఉషయొక్క విరహతాపమును, చిత్రరేఖ వెళ్లి యెవరికిని తెలియకుండ ద్వారకనుండి యనిరుద్ధునిఁ దీసికొని వచ్చుటయు, ఉషానిరుద్ధుల సమాగమంబును, బాణుఁ డనిరుద్ధునిఁ జెఱఁబెట్టుటయు తృతీయాశ్వాసమున వర్ణితములు. చతుర్థాశ్వాసమునందు యాదవులకును బాణునకును జరిగినయుద్ధము వర్ణింపఁబడినది. అయిదవయాశ్వాసమునందు బాణుఁ డోడుటయు కృష్ణుఁడు వానిని గరుణించుటయు, ఉషానిరుద్ధుల వివాహమును, దంపతులతో యాదవులు ద్వారకకుఁ బోవుటయు, అనిరుద్ధునకు వజ్రుఁ డను పుత్త్రుఁడు పుట్టుటయు, వాఁడు రాజసూయాదియజ్ఞములను జేయుటయు, ప్రజారంజకంబుగ రాజ్యంబు నేలుటయు నను కథ కలదు.

కవిజనమనోరంజనము, శశాంకవిజయమునకు నాధారము — ఇది అబ్బయామాత్యునిచే రచింపఁబడిన రెండవకావ్యము. ఇందైదాశ్వాసములును, ౧౧౬౦ పద్యములును గలవు. చంద్రుఁడు బృహస్పతియొద్దఁ జదువుకొని తారను లేవఁదీసినది మొదలు, పురూరవుఁడు ఊర్వశినిగూడి సంతానమును వడయువఱకును గల కథ ఇందు వర్ణితము.

ఊర్వశీపురూరవులకథ మొదట ఋగ్వేదమునందుఁ గలదు (౧౦-౯౫). బృహద్దేవతయందును (౭ ౧౪౦-౧౫౮), శతపథ బ్రాహ్మణమునందును (౫ ౧-౨), విష్ణుపురాణమునందును (౪-౬), దేవీభాగవతమునందును (౧-౧౩), హరివంశమునందును (౧౦-౨౬), మత్స్యపురాణమునందును (౨౪), కథాసరిత్సాగరమునందును (౩ ౪-౩౦) ఈ కథ కలదు.

ఈ కథ యంతయు శ్రీమద్భాగవతమునందుఁ జక్కఁగ వర్ణింపఁబడినది. సంస్కృతభాగవతమున నవమస్కంధమందలి ౧-వ అధ్యాయమునందు ఇలాకన్యచరిత్రమును, ౧౪-వ అధ్యాయమునందు చంద్రతారలచరిత్రయు, ఊర్వశీపురూరవులచరిత్రయుఁ గలవు. ఇవియే గాక బ్రహ్మపురాణము, పద్మపురాణము, స్కాందపురాణము (కాశీఖండము) మొదలగు పురాణములలోఁ జంద్రవంశవర్ణనము వచ్చినచోట్ల సంగ్రహముగనో, విస్తరముగనో యీకథ వర్ణింపఁబడినది. విక్రమోర్వశీయ మను నాటకమునందుఁ గాళిదాసుఁ డీ కథాభాగమునే మిగుల మనోహరముగఁ జిత్రించియున్నాఁడు. పురూరవునకే విక్రముఁ డని నామాంతరము. తెనుఁగున బమ్మెరపోతరాజు భాగవతమునందు నవమస్కంధమున నీకథాభాగ మంతయుఁ జక్కఁగ భాషాంతరీకరించియున్నాఁడు. ఈస్కంధమునందు రెండు తావులఁ గల యీ కథను తీసికొని యబ్బయామాత్యుఁడు పురూరవశ్చరిత్రమును రచించినట్లు కానవచ్చుచున్నది. కాళిదాసునాటకమును ఈతఁడు చూచినట్టు లేదు. భాగవతములోని కథను ఈతఁడు మార్పలేదు. ఊర్వశీపటమును వ్రాయించి పురూరవునియొద్దకుఁ బంపుట యనునది (అ. ౫, ౧౯-౩౮) కవి క్రొత్తగఁ గల్పించినది. కావ్యము వర్ణనలతోఁ నింపఁబడినది.

కథాభాగము.— ప్రతిష్ఠానపురమునందుఁ బురూరవుఁడు రాజ్యము చేయుచుండఁగా నొకదినమున నారదుఁడు వచ్చి, రాజధర్మములను, వేదాంతమును రాజునకు బోధించి యింద్రలోకమునకుఁ బోవుచు అచ్చట నింద్రుఁ డడుగఁగాఁ బురూరవుని చరిత్ర చెప్పఁ దొడఁగెను (అ ౧). చంద్రుఁడు బృహస్పతియింట విద్యాభ్యాసము చేసి గురుభార్యయైన తారను లేవఁదీసి బుధుఁ డను కుమారునిఁ గాంచెను [1]. వైవస్వతమనువు పుత్త్రునకై యజ్ఞము చేసెను. కాని యాతని భార్య పుత్త్రిక కావలయు నని కోరినందున ఇల యనుకన్యక పుట్టెను. తండ్రికిఁ గన్యయందు విష్టము లేనందున గురు వగు వసిష్ఠుఁడు నారాయణుని వేఁడి ఇలాకన్యను సుద్యుమ్నుఁ డను పురుషునిఁగ మార్పించెను. సుద్యుమ్నుఁ డొకనాఁడు వేటకుఁబోయి కుమారవనముఁ బ్రవేశింప మరల ఇలాకన్యగ మారి బుధునితోఁ బొందుచేసి పురూరవునిఁ గనెను. అంత శివుని యనుగ్రహంబున ఇల యొకనెల పురుషుఁడుగను, ఒకనెల స్త్రీగను ఉండునట్లు వరము వడసి పుత్త్రునితో తన రాజధానికిఁ బోయి (అ ౨) కొన్నాళ్లు రాజ్యము చేసి, పురూరవునకుఁ బట్టము కట్టి యరణ్యమునకుఁ బోయెను. పురూరవుఁడు దిగ్విజయయాత్ర వెడలి యన్ని దేశముల జయించెను. నారదుఁ డిట్లు పురూరవుని వర్ణింపఁగా విని ఊర్వశి యను నప్సర యాతనియందు బద్ధానురాగ యయ్యెను. విరహతాప మధిక మయ్యెను (అ ౩). అప్పుడే మిత్రావరుణులు ఘోరమైన తపస్సును భంగము చేయుటకై యింద్రుఁ డూర్వశిని భూలోకమునకుఁ బంపెను. ఆమె వారితపస్సునకు విఘ్నము కావింపఁగా 'నీవు భూలోకమందు నుండెదవు. స్వర్గమునకుఁ బో' యని శాప మిచ్చిరి. పురూరవుఁడు గంగకు వెళ్లి మాఘస్నానము చేసెను. విష్ణువు ప్రత్యక్షమై దివ్యస్త్రీలాభము గలుగు నని వర మిచ్చెను (అ ౪). ఇట వింధ్యపర్వతమునందు పురూరవునిసమాగమం బెట్లు గలుగు నని యోజించి యూర్వశి తనపటమును వ్రాయించి రాజునకు పంపునట్లు చేసెను. ఆ పటమును జూచి రాజు ఊర్వశియెడల ననురాగము గలవాఁ డయ్యెను.

1. చంద్రతారలమైత్రితో సంబంధించినకథ శ్రీనాథుని కాశీఖండము (౪-వ ఆశ్వాసము)నందును, శేషము వేంకటపతి తారాశశాంకమునందును వర్ణింపఁబడినది.

బహూంకృతి చేసెను. అప్పటినుండియు రాజు విరహతాపముచేతను, పశ్చాత్తాపముచేతను పొగులుచుండెను. ఇంతలోఁ గాలనేమి యను దైత్యులను జంపుటకు రావలసిన దని ఇంద్రుఁడు దుష్యంతునియొద్దకు రథ మిచ్చి మాతలిని బంపఁగా నాతఁ డింద్రునియొద్దకు వచ్చెను.

[మేనక శకుంతలను దీసికొనిపోయి స్వర్గమునకును భూలోకమునకును నడుమ నున్న కింపురుషపర్వతమైన హేమకూటపర్వతముపై మారీచ (కశ్యప) ఋషియొక్క ఆశ్రమములో నుంచెను. అచ్చట నామె ప్రసవమై బాలునిఁ గనియె. అతనికి నాతని సత్త్వమును బట్టి యచ్చటివారు సర్వదమనుఁ డని పేరు పెట్టిరి]

దుష్యంతుఁడు కాలనేముల సంహరించి యింద్రుని వీడ్కొని తిరిగి భూలోకమునకు వచ్చునప్పుడు త్రోవలో నున్న మారీచాశ్రమమును దర్శింపఁబోయెను. అచ్చట దైవవశమునఁ దనభార్యాపుత్రులఁ గలిసికొనెను[1]

రెండు కథలకును గల భేదము — భారతములోని మూలకథయు నాటకసంవిధానమునకు ననుకూలమైనదిగనే యున్నను, కాళిదాసుఁ డందుఁ గొన్ని మార్పులు చేసి దానికి వన్నె తెచ్చె ననుటకు సందేహము లేదు. పైని యీయఁబడిన రెండు కథలను ముఖ్యముగ గమనించితిమేని వానిలో ముఖ్యమైన కథాభేదములు నాల్గుతావులందుఁ గానవచ్చును.

౧. మొదటిమార్పు నాయికానాయకులరాగోదయమునకు ననురాగాభివృద్ధికిని సంబంధించినది. మహాభారతమునందు దుష్యంతుఁడు శకుంతలను కుటీరములో నొంటిగాఁ జూచి మోహించి, నీకుఁ బుట్టినకుమారునకు రాజ్య మిచ్చెద నన్నులంచ మిచ్చి గాంధర్వమున వివాహమాడును. ఈవ్యాపార మంతయు నొకటిరెండుసంభాషణములలోఁ బూర్తి యగును. ఇందు రాజుయొక్క నిర్వ్యాజమగు రాగము కనుపడునే కాని శకుంతలకు రాజుపైఁగల ప్రేమ గానరాదు. కానవచ్చినంతవఱకు 'నాకుమారుని యౌవరాజ్యాభిషిక్తునిఁ జేసినఁ గాని నిన్నుఁ బెండ్లాడ' నన్నందున సవ్యాజముగఁ గానవచ్చునే కాని నిర్వ్యాజప్రేమ లేదు. నాటకమునందు నీ ప్రేమ పరస్పరమైనట్టును, నిర్వ్యాజమైనట్టును వర్ణింపఁబడుటయే కాక, దీని యుత్పత్తికిని వభివృద్ధికిని పరిపూర్ణతకును అయిదారుదినములకాలము పట్టినట్లు చూపి నాయికానాయకులమనంబులందలి భావోదయాదులు నేలంకేలు రంగములు మూలమునను, ప్రసంగములుమూలమునను ప్రదర్శింపఁబడినవి. భారతమునందు రాజు దొంగవలె భీతితోఁ బాఱిపోవును. నాటకమునందు నాతఁడు ఋషిపుత్రుల ప్రార్థనపై నాశ్రమములోఁ గొన్నిదినము లుండి వారివలన సెలవు పొంది వెళ్లును.

౨. రెండవమార్పు దుర్వాసఋషిశాపము. భారతకథానకమందు కాళిదాసునిచేఁ జేయఁబడిన ముఖ్యమైన మార్పిదియే యని చెప్పవలసియున్నది. భారతకథయందు దుష్యంతుఁడు మొదటినుండియు నసత్యసంధుఁడుగను, మోసగాఁడుగను గాన్పించును. 'పట్టణమునకు వెళ్లినతోడనే నిన్నుఁ దెచ్చుటకు జనులను బంపెద' నని శకుంతలతో నాతఁడు చెప్పెను. ఇట్లు చెప్పునప్పుడే యాతనికి మనమునం దొక యుద్దేశము పైకి మఱియొక యుద్దేశము గలిగె ననుట స్పష్టము. శకుంతలను పట్టణమునకుఁ దీసికొనిపోవుటకు జనులు వలయు నన్న నాశ్రమమునకు పంపవలెనే యాతని మైత్య మంతయు నుండెను కణ్వుఁ డాశ్రమమందు లేనందున శకుంతలను తీసికొనిపోవుటకు వీలులేదనుకొనిన నాతఁడు వచ్చినతరువాత నాతని యాజ్ఞ గొంది తీసికొని వచ్చుటకుఁ గొందఱ నచ్చట నుంచి వెళ్లఁగూడదా? తరువాత రాజు తొమ్మిదిసంవత్సరములవఱకును, శకుంతల వివాహమునంగతి జ్ఞాపకముండియే యామె యేమియైనదియుఁ గనుఁగొనినవాఁడు కాఁడు. పిదప నామె పుత్రునితోఁగూడ వచ్చి వివాహవిషయమును సూచించియు, యౌవరాజ్యవరము నడిగియు జ్ఞాపకముచేయఁగాఁ దెలిసియు వారిని నిరాకరించెను. కావున శకుంతల చెప్పినట్లు అతఁ డసత్యసంధుఁడుగఁ గానవచ్చుచున్నాఁడు. ఇదియుఁగాక ఆశ్రమమునందు మనసును పట్టలేక శకుంతలను వరించెనే కాని యామెయందలి నిర్వ్యాజప్రేమచేఁ గా దనియుఁ దోఁచును. 'ఇన్ని దోషములు గలవాఁడు నాయకుఁడుగఁ బనికిరాఁడు. అతనియందు నీదోషములు లేకుండఁజేయు టెట్లని తలంచి కాళిదాసుఁ డీమార్పు చేసెను. రాజు శకుంతలాసంబంధమును వెంటనే మఱచిపోవుటకు దుర్వాసశ్శాపమును కల్పించెను. రాజు తపోవనమునుండి వెడలిపోయినదినమే దుర్వాసశ్శాపవృత్తాంతము జరిగినది. అతఁ డాదినమునుండియే యంతయు మఱచిపోయెను. కావున నామాసీరములసంఖ్య పూర్తియగునంతవఱకు నాతఁడు శకుంతలను తీసికొనిపోవుటకు జనులను పంపకపోవుటయు, తరువాత శకుంతల యాతనియొద్దకుఁ బోయినప్పు డామెను గుర్తింపక నిరాకరించుటయు సుసంగతములే. దుర్వాసశ్శాపము రాజు స్మృతినష్టమును

1. శకుంతలను గుఱించి ఈ నాటకమునం దున్న కథవంటి కథయే పద్మపురాణమునందు స్వర్గఖండమున ౧–౫ అధ్యాయములలోఁ గలదు. అది భారతకథవలె నుండక, అంగుళీయకముతో సంబంధించిన కథగలిగి అభిజ్ఞానశాకుంతలకథను పోలియున్నది. కావునఁ గొందఱు కాళిదాసుఁ డీకథ నంతయు నీ పురాణమునుండియే గ్రహించె నని తలంపవచ్చును. కాని పద్మపురాణము కాళిదాసునకుఁ దరువాతిది యని చెప్పుటకుఁ దగిన కారణము లుండుటచేతను, ఈ కథ గల స్వర్గఖండము ఉత్తరదేశప్రతులలో మాత్రము నుండి, దక్షిణదేశప్రతులలో లేకుండుటచేతను (చూడుఁడు, పూనాలోఁ బ్రకటింపఁబడిన ఆనందాశ్రమముద్రాలయములోని పద్మపురాణము) పద్మపురాణము వ్రాసినవాఁడే నాటకమునుండి కథను గ్రహించె ననుట స్పష్టము. ఇదియుఁగాక యొక ప్రతిలోఁ గానిపించి యొకప్రతిలో లేనందున ప్రక్షిప్తమైన దనియుఁ జెప్పవచ్చును, అనఁగా నిటీవల నెవరిచేతనో వ్రాయఁబడి యందుఁ జేర్పఁబడిన దని భావము.

3 భారతకథలోఁ గాళిదాసునిచేఁ జేయఁబడిన మూఁడవ మార్పు కుమారసంబంధమైనది. కుమారుఁడు పుట్టినతరువాత వానితోఁగూడ శకుంతల రాజునొద్దకు వెళ్లినట్లు భారతమునం దున్నది శకుంతల గర్భముతో నున్నప్పుడే, యనఁగా నింకను పిల్లవాఁడు పుట్టకుండుటకుఁబూర్వమే రాజునొద్దకుఁ బోయె ననియు, నచ్చటనుండి యామె నిరాకరింపఁబడినతరువాత మారీచమునియొక్క యాశ్రమములో నామె ప్రసవమై పుత్రునిఁ గనియె ననియు నాటకమునందుఁ గథ మార్పఁబడినది. ఇట్లు చేయుటకు రెండు మూఁడు కారణము లున్నవి పిల్లవానితోఁగూడఁ దల్లి వచ్చియున్నయెడల, తల్లిని గుర్తింపకపోయినను చక్రవర్తిచిహ్నాంకితుఁడును, అమితసత్త్వుఁడును, దుష్యంతప్రతిమూఁడును అగు సర్వదమనుని రాజు తనపుత్రునిగా గుర్తింపకయుండుట యసంభవము గుర్తించినయెడల సంవిధానమునకు భంగము కలుగును. గుర్తించియో లేక గుర్తింపకయో రాజు కుమారునిఁగూడ విడఁగొట్టె నన్న యనౌచిత్యప్రసంగము సంభవించుటయే కాక సప్తమాంకమందలి సర్వదమనుని బాలలీలావినోదాదికభాగ మంతటికిని నాటకమునందుఁ బ్రసక్తి లేకపోవును

౪ నాల్గవమార్పు శకుంతలాదుష్యంతులను ప్రేమయాటము మీఁదఁ గళ్యపాత్రమందుఁ గలుపుట రెండవ, మూఁడవ మార్పులను బట్టి యీ నాల్గవమార్పు చేయవలసివచ్చినది

వేఱు మార్పులు — పైని చెప్పఁబడినవి కథానకమందలి ముఖ్యమైనమార్పులు ఈ మార్పులు చేసినంతమాత్రమున మూల కథనుండి చక్కనినాటకము వెలువడునా? వెలువడనేరదు. ప్రదర్శనీయమైన యప్రతిమనాటకరూపము వచ్చుటకు నింకను క్రొత్త కథలును, క్రొత్తరంగములును, క్రొత్తపాత్రములును కావలెను ఈ నాటకమందలి ప్రథమ, పంచమాంకములకును, సప్తమాంకమందలి స్వల్పభాగమునకును మూలభారతమునందు నాధారము గలదు ద్వితీయ తృతీయ చతుర్థ, షష్ఠాంకములు పూర్తిగను, కొంచెము తప్ప మిగిలిన సప్తమాంక మంతయును కాళిదాసునియొక్క నూతనసృష్టి యనియే చెప్పవలసియున్నది, అనఁగా నిందలికథయు, నాయికానాయకులు దప్ప నితరపాత్రలును, రంగములును, కల్పనలును నవీనముగఁ గవిచే నిర్మింపఁబడినవి మొదటఁ జెప్పినయంకములందుఁగూడ నూతనపాత్రలు కలవు. కాని మొత్తముమీఁదను గవికి మూలమందు నాధార మున్నది. రెండవభాగమునకు నా యాధారమైనను లేదు

నాటకమునకు వన్నె పెట్టుటకై కవిచే నిర్మింపఁబడిన నూతన కథాసందర్భములలో, ప్రథమాంకమందలి భ్రమరప్రకరణమును, శకుంతల విడలిపోవునప్పుడు రాజును చూచుటకై కాలికి దర్భ గ్రుచ్చుకొనె ననియు, బట్ట చెట్టునకుఁ బట్టుకొనె ననియు మిషలు కల్పించి యాఁగుటయు, నాల్గవయంకమందలి శకుంతల యత్తవారింటికి బోవునప్పుడు లేడి యడ్డగించుటయు, ఐదవయంకమందలి హంసపదికాగానమును, ఆఱవయంకమందలి ధనమిత్రుని మరణవార్తయు, మాతలి వచ్చి విదూషకునిఁ బట్టుకొని పీడించుటయు, ఏడవయంకమందలి సర్వదమనుని పెదలో నితరయుకుమారాత్త్వమును ముఖ్యముగఁ జేర్పఁదగినవియున్నవి ఈ చిన్నచిన్న వ్యాపారములవలనఁ గవి కథయొక్క పూర్వాపరసందర్భములను చక్కఁగఁ గల్పుటయేకాక మానవులకుఁ దెలియకుండ మానవాంతఃకరణములో నుండునట్టి యుదాత్తభావములను మనోహరముగ వ్యక్తపఱచియున్నాఁడు గొప్ప మార్పులకంటె నిట్టి కొలఁది మార్పులలోనే రసభావములను చిత్రించునట్టి కవి ప్రతిభయొక్క మనోహరాకృతి దృగ్గోచర మగును ముఖ్యముగ దృశ్యకావ్యమునందు నాలుపద్యములకంటె పదిరంగములకంటె నొక్కచోటభావము, ఒక్కనయనకటాక్షము, ఒక్కచిఱునవ్వు, ఒక్క చిన్నమాట నాలుగింట్లు కథాసౌందర్యమును, సంవిధానకమాధుర్యమును హెచ్చించును

శకునములమీఁద ననుటకుఁగల నమ్మిక ననుసరించి, వానిని గథలోఁ జేర్చి యచ్చటచ్చటఁ గవి ముందు రాఁబోవుసంవిధానకమును ప్రేక్షకు లూహించునట్లు చేసియున్నాఁడు రాజు తపోవనమునఁ బ్రవేశింపఁగనే యాతనిబాహువు స్ఫురింప నాతఁ డిట్లనును

‘శాంత మిద మాశ్రమపదం
స్ఫురతి చ బాహుః కుతః ఫల మిహాస్య,
అథవా భవితవ్యానాం
ద్వారాణి భవన్తి సర్వత్ర.[1]’ [౧-వ అంకము

రాజునకుఁ గలుగఁబోవు మేలు, స్త్రీలాభ మిందువలన స్పష్టముగ సూచింపఁబడెను

నాల్గవయంకమందు శకుంతల యత్తవారింటికిఁ బోవ నుద్యుక్తయై కదలినపు డొకచక్రవాకి తామరాకుచాటున నున్న తన ప్రియునిఁ గానక తల్లడిల్లుచున్నట్లు కానవచ్చును.

‘హలా పేక్ఖ! ణలిణీపత్తన్తరిదం వి సహఅరం అదేక్ఖన్తీ ఆదురా చక్కవాఈ ఆరడది[1] దుక్కరం అహం కరేమి.[2]’

కొంతకాలమువఱకును శకుంతలకుఁ గలుగఁబోవు పతివిరహము ప్రేక్షకులకీ శకునము చెప్పక చెప్పును.

---

1 గీ. ఇది ప్రశాంత మా శాశ్రమపదము చూడ, నదరెడు భుజంబు, ఫల మెట్టు లొదవు నిందు?
ఆ ట్లయినఁగ నేల భావ్యంబు లమర నున్న, కాలమందు, సర్వత్ర మార్గములు గలుగు

2. సఖీ! చూడుము. తామరాకుచాటున దాగిన ప్రియవల్లభుని గానక యాతురయై చక్రవాకాంగన కూయుచున్నది. దుష్కరమును నేను జేసితిని

ఇట్లే సప్తమాంకమునందు రాజా మారీచాశ్రమమునఁ బ్రవేశించినప్పుడు మరల దుష్యంతుని బాహువు అదరును

[నిమిత్తం సూచయిత్వా]

'మనోరథాయ నాశంసే కిం బాహో! స్పందసే వృథా,
పూర్వావధీరితం శ్రేయో దుఃఖం హి పరివర్తతే 1'

నాయికానాయకసమాగమము త్వరలోనే కానున్న దని యీ పద్యము చదివిన లేక విన్న యెడ చదువరికిఁగాని ప్రేక్షకునకుఁగాని తోఁచదు?

ఔచిత్యప్రశంస — ముఖ్యముగ నిది శృంగారకావ్యమైనను, నాయికానాయకులనుగూర్చిన సంభోగవిప్రలంభశృంగారరసమును వర్ణించుటయే కవియొక్క యుద్దేశమైనను, విషయమునకును, అత్యుచ్ఛనీతికల్పనలకును, మర్యాదకును భంగము రాకుండ నాటకమందలి సంభాషణములును, వర్ణనములును రచింపఁబడినవి. ఔచితికి భంగము రాకుండుటకై కవిపుంగవుఁడు పడినశ్రద్ధ యధిక ప్రశంసనీయము. రంగమువిూఁదను స్త్రీపురుషు లొకరి నొకరిని దాఁకి కూర్చుండుట గాని, కౌఁగిలించుట గాని, ముద్దాడుట గాని చూపుటయు గాదరాదు. ఈ విషయమునందు నీతఁడు పాశ్చాత్యనాటకకారులచే ననుకరణీయుఁ డని చెప్పవలెను. దుష్యంతుఁడును శకుంతలయు నేకాంతమునం దుండఁగా నామె వెళ్ళఁబోవును దుష్యంతుఁ డామె నాపఁబోవును, అప్పు డామె మర్యాదాభంగ మగు నని భయపడి,

'పౌరవ! రక్ష వినయం'

'పౌరవ! వినయమును రక్షింపుము' అనఁగా 'అవినయశీలుఁడవు గాకుము' అని యనును. పాపము, దుష్యంతుఁడు వినయమునకు భంగము చేయఁదలంచినను మాకవిమాత్రము నూరకుండువాఁడు గాఁ డని యామె యెఱుంగదు!

నాయికానాయకు లొకచోటఁ గొంతకాల మున్నప్పుడు, శృంగారచేష్టలకుఁ దావు కల్గుట స్వాభావికము, మొద్దులవలె యూరకుండుట యస్వాభావికము. కావునఁ గవి యట్టి సమయమున వినయభంగము కలుగు నేమో యని ప్రేక్షకులకు భీతి కలుగునంతలోనే కథాప్రసంగము తెచ్చిపెట్టి, ఆకస్మికమును, చమత్కారకరమును అగు ప్రసంగ మొకటి కల్పించి యా వినయభంగప్రసంగమును తప్పించును.

ఏకాంతమునం దున్నప్పుడు దుష్యంతుఁడు శకుంతలను ముద్దుపెట్టుకొనఁ బోవును. ఆమె నాట్యముచేఁ దప్పించుకొనును. అప్పటికింక కొంచెముకాలము గడచిన స్వాభావికముగ నేమి జరగవలెను? నాయకుఁడు నాయికను బలవంతముగ ముద్దుపెట్టుకొనవలెను. అట్లు జరగలేదని చూపుట అస్వాభావికము జరిగినదని చూపుట అశ్లీలము, అనౌచిత్యము కావునఁ గవి గౌతమియొక్కరాక యను ఆకస్మిక ప్రసంగమును గల్పించి వారి యేకాంతమునకు భంగము కల్పించెను. ఆభాగముయొక్క యాంధ్రీకరణము మాత్ర మిచ్చుచున్నాము. గ్రంథవిస్తరభీతిచేత మూల మిచ్చుట లేదు.—

శకుంతల — ఆర్యా! ఇప్పుడు నన్ను విడువుము మరల సఖీజనముఁ గని యనుమతంబు వడసివచ్చెద

రాజా — అలాగుననే విడిచెదను

శకుంతల — ఎప్పుడు?

రాజా — గీ. లలన! యపరిక్షతము గోమలంబునైన
క్రొత్తపూఁదేనె శృంగంబు గ్రోలినట్లు
నీయనుగ్రహమునఁ జేసి నే నొకింత
తనివి నీయధరసుధను ద్రావువిదప

[అని ఆమెముఖము నెత్తఁబోవుచున్నాఁడు]

శకుంతల — [నాట్యముచే మోము త్రిప్పుకొనుచున్నది]

[తెరమఱుఁగున]

ఓ చక్రవాకకాంతా! నీ సహచరుని వీడ్కొనుము రాత్రి సమీపించుచున్నది.

శకుంతల — [అలికించి తొట్రుపాటుతో] ఓ పౌరవా! సందేహము లేదు నా దేహస్థితిని దెలిసికొనుటకై పూజ్యురాలైన గౌతమి యిచ్చటికి వచ్చుచున్నది ఆకొమ్మలచాటున దాఁగియుండుము

రాజా — అలాగునే [అని దాఁగుకొనుచున్నాఁడు]

[అంత చేతను పాత్రమును బట్టుకొని గౌతమియును సఖులును ప్రవేశించుచున్నారు]

నైపథ్యములో 'చక్రవాకకాంతా' యన్న యన్యోక్తిచే శకుంతలకు గౌతమిరాక తెలిపినవా రామెసఖులైన యనసూయాప్రియంవదలె యని చదువరు లూహించియుందురు. ఇట్లు ఔచితి పోషణకుఁ గల్పింపఁబడినయుక్తియు, దానికి ననుకూలముగఁ జెప్పఁబడిన యన్యోక్తియుఁ గవిసార్వభౌముని యద్భుతకల్పనాశక్తికి నిదర్శనములు.

శకుంతల మొదలగువారు వెడలిపోయినతరువాత రాజా ఈవలకు వచ్చి,

'ముహు రంగుళిసంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షరవిక్లవాభిరామమ్,

---

1. గీ. కోరను మనోరథం బేను గొంచెమేని, వ్యర్థముగ నో భుజంబ! నీ వదరె దేల?
మును నిరాకరించినమేలె పూని యిపుడు, దుఃఖముగ మాఱుచున్నది దుస్సహముగ

ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమప్యున్నమితం న చుంబితం తు ॥ [1]

అని చింతించుచు ముద్దు పెట్టుకొనలేకపోవుట, రాజా! నీ తప్పు కాదు అది కవిసార్వభౌముని యాజ్ఞ దానిని నీవు మాత్రమె యతిక్రమింపఁ గలవు?

శాకుంతలనాటకము దృశ్యకావ్యము అందు ముద్దు పెట్టుకొనుట మొదలయిన వ్యాపారములు కూడ దని నాట్యశాస్త్రనియమము లుండుటచేఁ గవి వానిని తప్పించెనే కాని యట్లు తప్పించుట బుద్ధిపూర్వకము కా దని కొందఱు వాదింపవచ్చును కాని కాళి దాసాది మహాకవు లిట్లు పవిత్రమైన శృంగారమును ప్రదర్శించిరి కావుననే నాట్యశాస్త్రములయందు నట్టి నియమములు పుట్టుటకుఁ గారణ మైన దని చెప్పుట న్యాయ్యము, కాని విరంకుశు లగుకవులు శాస్త్రనియమములను పాటించుట కిట్లు వ్రాసి రనుట న్యాయ్యము కా దని మా తాత్పర్యము

ఇదియుఁ గాక నేఁడు మనదేశమునందేమి, పాశ్చాత్యదేశములందేమి యీ శాకుంతలనాటకము శ్రవ్యకావ్యముగఁ జదివి పండితు లానందించుచున్నారే కాని దృశ్యకావ్యముగఁ గాదు మన పూర్వతన పండితులు దానిని పొగడినను, గెటేవంటి పాశ్చాత్యకవిపుంగవులు దానిని తలఁదాల్చినను కావ్యము చదివి యానందించినవారే కాని నాటక ప్రదర్శనము జూచి యానందించినవారు కారు కావున దీని దృశ్యకావ్యములలోను, శ్రవ్యకావ్యములలోను శ్రేష్ఠ మనియే చెప్ప వలెను మేము పైని చెప్పిన ఔచితి యనునది యీ కావ్యమునకు శ్రవ్యకావ్యముగఁగూడ ఖ్యాతిఁ దెచ్చుటకుఁ గారణ మని చెప్ప వచ్చును

ఇంకొకవిశేషము కవియను కథాభాగమునందే కాక విన బడుకథాభాగమునందు కూడ కవి శృంగారవర్ణనములందు సౌచితిని మిక్కిలి జాగరూకతతోఁ బోషించినాఁడు మహాభారతమునందు శకుంతలాజన్మవృత్తాంత మంతయు దుష్యంతునకు శకుంతలయే చెప్పును అంతియ కాదు మేనక వెళ్లి విశ్వామిత్రుని మోహింపఁజేసి యాతనితపమునకు విఘ్నము కల్గించినవిధ మంతయు విపులముగా వర్ణించును ఇది యంతయు నస్వాభావికము కాయిక సిగ్గు విడిచి తనతల్లియొక్క వ్యభిచారవృత్తాంత మంతయు నాయకు నకు వివరముగఁ జెప్పుట విపరీతముగదా? కావున ఈ కథను మహాకవి దుష్యంతునకు శకుంతల సఖియైన అనసూయచేఁ జెప్పించెను ఆ చెప్పించుటలోను మొదటిభాగము కొంతెము చెప్పించి మిగిలినభాగము వినయముచే ననసూయ చెప్పలేకపోయినట్లును, రా జూహించినట్లును జెప్పెను ఆ భాగ మిం దుదాహరించుచున్నాము —

రాజా — మహానుభావుఁ డగు కాశ్యపుఁడు శాశ్వత బ్రహ్మనిష్ఠుఁ డని ప్రసిద్ధి అట్టివాని కెట్లు మీ గెలిచ్చెలి కూఁతు రయ్యెను?

అనసూయ — దేవా! యాకర్ణింపవలయును కౌశికుఁ డని వంశ నామము గల మహాప్రభావసంపన్నుఁ డయిన రాజర్షి యొకఁడు కలఁడు

రాజా — కలఁడు వినియున్నాను అనంతరము

అన — అతఁడే మా చెలియకు గన్నవాఁడు కన్నవారిచే విడువఁ బడినయామెను పెంచుటమొదలుగాఁగల పనుల నిర్వర్తించుటం జేసి పూజ్యు లగు కణ్వులును నీమెకు జనకు లయిరి

రాజా — 'విడువఁబడిన' యను శబ్దశ్రవణముచేతనే వేడుక పొడము చున్నది మొదటినుండియు వినఁగోరుచున్నాను

అన — దేవర యవధరింపవలయును పూర్వ మారాజర్షి యుగ్ర తపస్సు చేయుచుండఁగా, దేవతలు భయపడి యా నియమమున కు విఘ్న మాచరింప మేనక యను నప్సరసం బుచ్చిరి

రాజా — దేవతల కీ పరసమాధిభయశీలత యొప్పును మన్నదియె తర్వాత, తర్వాత

అన — అంత నత్యంతరమణీయ మగు వసంతకాలమున మన్మథయును బుట్టించు నామెరూపమును జూచి

[అని సగము చెప్పి లజ్జచే నూరకున్నది]

రాజా — అపయిని తెలియనే తెలియుచున్నది తప్పక యీమె యప్సర స్సంభవయే

ఇచ్చటి 'అని సగము చెప్పి లజ్జచే నూరకున్నది' యన్న యొకవాక్యము వినయమునుతెలుపు కవియొక్క భావ మెంత పవిత్ర మైనదియో తెలిసికొనుటకుఁ జాలును ఇక్కడ మేనకకథ వర్ణనవిష యము గాని నర్తనవిషయము కాదు కోటఁ జెప్పవలసినదే కాని చేసి చూపవలసినది కాదు శ్రవ్యకావ్యవిషయమే కాని దృశ్యకావ్య విషయము కాదు కావున నిష్టము వచ్చినట్లు శృంగారము వర్ణించు టకుఁ గవి కిచ్చట నాట్యశాస్త్రనియమము లడ్డము రావు రంగ మందు ముద్దు పెట్టుకొనవలదన్నాఁడు, కౌఁగిలించుకొనవలదన్నాఁడు కాని ముద్దుకౌఁగిలింతలు వర్ణింపవల దని చెప్పలేదు అయినను నక్కడి యౌచితి విచారింపఁడా? ఇచ్చట వర్ణన చేయుచున్న దొక స్త్రీ ఆమె యొకపురుషునకు మరియొక స్త్రీపురుషులశృంగారచేష్టలను వర్ణించుట వినయమునకు భంగకరము కావున నీకవిపుంగవుఁడు మిగిలినభాగ మంతయు రాజే యూహించుకొనునట్లు చేసెను

స్వభావవర్ణనము — నాటకము లోకవ్యవహారమునకుఁ బ్రతి బింబముగ నుండవలయును నాటకమందలి ప్రసంగములు ప్రకృతుల

1 గీ మాటి కధరంబు ప్రేళ్లతో మాటికొనుచు, నడ్డగింపుమాటలను వివ్వలతఁ జూపి
మాఁపుగనంకఁ ద్రిప్పిన కల్కి మద్దుమోము, లేవనెత్తియు ముద్దిడలేకపోతి

౫. ఆకాశముమీఁదనుండి త్వరగా క్రిందికి దిగుచున్నవారికి భూమి యెట్లు గానవచ్చునో యీ క్రిందిపద్యమందు వర్ణించి యున్నాఁడు —

రాజా—[ అధో౽వలోక్య ]

'మాతలే! వేగావతరణా దాశ్చర్యదర్శన స్సంలక్ష్యతే మనుష్య లోకః, తథాహి¹

శైలానా మవరోహతీవ శిఖరా దున్మజ్జతాం మేదినీ
పర్ణాభ్యంతరలీనతాం విజహాతి స్కంధోదయాత్ పాదపాః,
సంతానై స్తనుభావనష్టసలిలా వ్యక్తిం భజం త్యాపగాః
కే నా ప్యుత్క్షిపతేవ పశ్య భువనం మత్పార్శ్వ మానీయతే ²'

[ ౭-వ యంకము

౬. చిన్నబాలునిచేష్టలును, అందువలనఁ దండ్రికిఁ గలుగునంతోషమును ఈ క్రిందిపద్యమునందు వర్ణింపఁబడినవి చిన్నబిడ్డలను ముద్దులాడి యా యానందమునఁ బరవశతఁ జెందుభాగ్యము లభించిన తలిదండ్రులందఱకును నింతలిభావము స్వానుభవైకవేద్యము

'ఆలక్ష్యదంతముకులా ననిమిత్తహాసై
రవ్యక్తవర్ణరమణీయవచఃప్రవృత్తీన్,
అంకాశ్రయప్రణయిన స్తనయాన్ వహంతో
ధన్యా స్తదంగరజసా మలినీభవంతి ³'

ఈ శ్లోకతాత్పర్యమును చదివి గెటే యను జర్మనుకవి సార్వభౌముఁ డానందాతిరేకమునఁ దాండవ మాడెనఁట!

ఇవి విడివిడి శ్లోకములకు నుదాహరణములు ఇఁకఁ బ్రసంగములయుదాహరణము లొకటిరెండిచ్చి యీప్రకరణమును ముగించెదను. ప్రథమాంకమునందు శకుంతలా ప్రియంవదానసూయలు చెట్లకు నీరుపోయుటయు, వారిసంభాషణమును నైసర్గికముగ నుండుటవలన రసము నెంతయుఁ బోషించుచున్నవి. ముగ్ధత్వయౌవనములకు నడుమ నుండు ఈడుగల బాలిక లిట్లు మాటాడుకొనుట సహజముగదా!

నాల్గవయంక మిందుకన్నమిన్న విశేషముగఁ జేర్కొనఁబడఁదగి యున్నది ఈనాటకమునందు నాల్గవయంకమును, అందు నాల్గు శ్లోకములును విక్కిలి మనోహరము లని ప్రఖ్యాతి గలదు.

'కావ్యేషు నాటకం రమ్యం తత్ర రమ్యా శకుంతలా,
తత్రాపిచ చతుర్థోఽంక స్తత్ర శ్లోకచతుష్టయమ్'

కావ్యములలో నాటకము రమ్యము, నాటకములలో శాకుంతలము, అందు నాల్గవయంకము, అందు నాల్గుశ్లోకములును మిక్కిలి రమ్యములు ఈనాల్గవయంకమునకు నింత రమ్యత గల్గుటకుఁ గారణ మేమి? ఎల్లప్పుడును మనకుటుంబములలో జరుగుచున్న ఆఁడుపిల్లను అత్తవారియింటికిఁ బంపుట యనువ్యాపారమును కవి యీ యంకమునందు నున్నది యున్నట్లుగాఁ జిత్రించుటయే యీ యంకమునొక్క యౌన్నత్యము నెచ్చుటకుఁ గారణము ఈయంకము చదివి కాని చూచి కాని యే సహృదయుఁడు కంటఁ దడి పెట్టకుండును? జాలి పడకుండును? తాను తనకూఁతును అత్తవారియింటికిఁ బంపినప్రసంగము జ్ఞప్తికిఁ దెచ్చుకొనకయుండును? అందఱకును దెలిసినట్టియు, నందఱు ననుభవింపఁ గఱఁగించునట్టియు నీకూఁతు నత్తవారియింటి కంపు ప్రసంగము కవిపుంగవునిచే నింత యథార్థ్యముగ వర్ణించుటఁ జూచి యచ్చటఁ గవి తన స్వానుభవమునే వర్ణించెనా యేమి యని మన మూహించినను యూహింపవచ్చును శ్లోకచతుష్టయములోనిది యను 'యాస్యత్యద్య శకుంతలేతి' యన్న పద్య మెవ్వనిమనసు గరఁగింపకుండును?

ఇచ్చటఁ దండ్రి ఋషి యైనను, తల్లి లేకపోయినను, ఇల్లు తపోవన మైనను, ఇతరజనులు బ్రహ్మచారులును, బ్రహ్మచారిణులును అయినను, వారిపవిత్రత యెంతయు భంగము రాకుండఁగ, సామాన్య గృహస్థునియింట నంశకములు జరుగుచున్నట్లుగనే కవి ఛాయాపటమును దింపియున్నాఁడు ఇది విశేషములోని విశేషము.

పిల్లను పతియింటికిఁ బంపునప్పు డామెకు వస్త్రాభరణము లిచ్చుటయు, వడి నింపుటయు, వెంటఁ దగినబంధువుల స్త్రీపురుషుల నిచ్చి పంపుటయు, పిల్లకు దగినబుద్ధులు చెప్పుటయు, వెంటఁ జాల దూరము వఱకును బోవుటయు, ఆఁగవలసిన నని యితరులు చెప్పువఱకును బోవుచుండుటయు, పిల్ల బంధువులను కౌఁగిలించుకొని దుఃఖించుటయు, పోలేకపోలేక పోవుటయు, చివరకు 'అమ్మాయిని అత్తవారియింటికిఁ బంపితిని నాభారము తీఱినది మనఁసు నెంతయో సుఖముగ నున్నఁజాలు' అని తండ్రి యనుకొనుటయు నీయంకమునందు మనయింట జరిగినట్లే చూపఁబడినవి ఈసందర్భమున ఈ క్రిందిగద్యపద్యములు గమనింపఁదగియున్నవి

శకుంతలా—

[ కామ్యం విస్మృత్య ]

ఉత్థే సఖ్యౌ - మహా ఉజ్జదం ణ దే ముంగలాకో తోజ్జదుం

1 రాజా (క్రిందఁజూచి) — మాతలీ! వేగముగా దిగుచుండుటవలన మనుష్యలోక మాశ్చర్యదర్శన మయి కనఁబడుచున్నది.

2 చ అదె మహీ ప్రస్ఫుటాద్రిశిఖరావళినుండియు దిగ్గనట్లు తా, కొందరులు తోఁచఁ జెట్లు దిగ మున్నటు లాకులలో నడంగుటల్ నదులు తొలంగ డాయుట జలంబు కనంబడ నట్టిరూపముల్, ఇదిగ కొందరో భూమి నిటు ప్రక్కకుఁ ద్రోసెడుకిత తోఁచెడున్.

3. ఉ పోఁడుపు లేనినవ్వుల నొకించుక యూత్రమ లేఁతదంతముల్, వాతెర దిండ నందముగఁ బల్కెడు స్పష్టము గానివాక్కులన్ ధూళలఘూళి దేహముగఁ బూరుము నైన యువర్ప పుత్రులం, బ్రీతిని దక్కుకత్తి తొడమీఁదను జేర్చి సుఖింతు రెంతయున్.

ఇట్టి దీప్తిగుణమును ఆత్మగౌరవ ముండుట తాను కర్తవ్య మనుకొన్న పనిని ఎన్ని యాటంకములు వచ్చినను సాధించువాఁడు దృఢవ్రతుఁడు మొదలగుగుణములఁబట్టి చూడ మన యాలంకారికుల మతమున ధీరోదాత్త నాయకుఁ డనవద్యసామాన్యసద్గుణభూషితుఁ డై యుండవలెను.

మననాయకుఁడైన దుష్యంతుఁడు నాల్గవయంకమునందుఁ దప్ప మిగిలినయాఱంకములలోను వేఱు వే ఱవస్థలలో రంగముపైని గానిపించుట కావున నాతనియందు గల వేఱువేఱు గుణములను మనము పాఠకులముగఁ జూడవచ్చును. మొదట నాటకము ప్రారంభ మైనతోడనే దుష్యంతుఁడు మనకు వేటకాఁడుగఁ గానిపించును 1

వాయువేగముతోఁ బరుగెత్తుచున్న లేడివెంటఁ దగిలి దానిని జంప వలెనని వచ్చుచున్న యాతని మృగయాప్రియత్వము స్పష్టపడును. వేట వ్యసన మని యెన్నఁ బడు రాజులకు నది యుద్ధమునకుఁ బూర్వప్రయత్నముగ నెంచఁబడినది. ఇందుమూలముగ వారికిది యొక వ్యసనముగఁ బేరుపెట్టినట్టును. కావున పైనఁ జెప్పఁబడిన మూచనప్రకారము రంగమునఁ దా! రాజా వచ్చినతోడనే యాతనిధనుర్విద్యాప్రతిభ వెల్లడియగును. ప్రవేశించఁగనే సూతునివాక్యము చూడుఁడు —

'కృష్ణసారే దదచ్చక్షుస్త్వయి చాధిజ్యకార్ముకే,
మృగానుసారిణం సాక్షాత్పశ్యామీవ పినాకినమ్ 2'

ధనుర్ధరులలో పినాకపాణి (శివుఁడు) శ్రేష్ఠుఁడు. రాజు యొక్క ధనుర్ధరత్వము వెల్లడిచేయుటకై సూతునినోట నీసాదృశ్యము చెప్పింపఁబడినది. రాజుయొక్క యమితసత్త్వమును, గంభీరాకృతియు ద్వితీయాంకమునందు నీ క్రిందిశ్లోకమున సేనాపతిచేఁ జక్కఁగఁ జిత్రింపఁబడినది —

'అనవరతధనుర్జ్యాస్ఫాలనక్రూరపూర్వం
రవికిరణసహిష్ణు స్వేదలేశై రభిన్నమ్,
అపచితమపి గాత్రం వ్యాయతత్వా దలక్ష్యం
గిరిచర ఇవ నాగః ప్రాణసారం బిభర్తి 3'

దుష్యంతుఁడు రెండవ మూఁడవ యంకములందు విశేషముగఁ గాముకుఁడుగనే కానవచ్చును. అతనియశము మరలఁ జిత్రించఁబడినది. షష్ఠసప్తమాంకములయందు నింద్రుఁడు మాతలిని రథముతో బంపి తన సాహాయ్యమునకు దుష్యంతునిఁ బిలిపించుకొనుటయు, ఇంద్రసభ యందు నతనికి జరిగినగౌరవమును ప్రత్యక్షముగ రంగముపైఁ జూపక పోయినను సంభాషణలలో వర్ణించి, చదువరులు దుష్యంతుని నమ నమకారాద్భుతములుగల యద్వితీయవిభూతి యని తెలిసికొనునట్లు కవి కల్పించెను. నాటకము ప్రాప్తి యనుసమయమున దేవతలతండ్రి యైన మారీచమునిచే దేవతలతల్లి యైన అదితికి నీకాజానుడుతెంచి, ఈప్రకారము చెప్పించి ప్రేక్షకు లందఱును దుష్యంతునిగుఱించి యధికాదరములో నిండునట్లు చేసెను

'మారీచః (రాజాన ముద్దిశ్య) దాక్షాయణి,
పుత్రస్య తే రణశిరస్యయ మగ్రయాయీ
దుష్యంత ఇత్యభిహితో భువనస్య భర్తా,
చాపేన యస్య వినివర్తితకర్మ జాతం
తత్కోటిమత్కులిశ మాభరణం మఘోనః'

అదితిః — సంభావనీయానుభావా సే ఆకిదీ (సంభావనీయానుభావా అస్య ఆకృతిః)4

దుష్యంతుఁడు కేవలము చక్కనివాఁడు, గంభీరాకృతిగల వాఁడు, గొప్పబలముగలవాఁడు, ఇంద్రునియర్ధాసన మెక్కినవాఁడు మాత్రమే కాఁడు. ఇది యన్నియు నాయకునియొక్కసామర్థ్యమును తెలుపునేకాని యందువలనముగ నాతనిసద్గుణములు, సచ్చారిత్రము బోధపడవు. దీనుల సాధువుల రక్షించుటయు, అర్థుల నుద్ధరించుటయు, తనసౌఖ్యము నైనఁ బోవిడిచి ప్రజలకు సౌఖ్యము కలుగఁజేయుటయు రాజుయొక్క ముఖ్యధర్మములు. ప్రకృతిరంజనమే, అనఁగాఁ బ్రజలకు సౌఖ్యము కలిగించుటయే, రాజుముఖ్య కర్తవ్య మని కాళిదాసుని సిద్ధాంతము. ఆ సిద్ధాంతమునకు నమూనా ముగ నాతఁ డీనాటకమునం దంతటను, దుష్యంతునిఁ జిత్రించి నాఁడు. మొదటియంకమునుండి చివరయంకమువఱకును, పెక్కు ప్రసంగములు కల్పించి కవి నాయకునియనురాగాభివృద్ధి నెట్లు కనఁబఱచినాఁడో యట్లే యాతనికర్తవ్యదక్షతనుగూడఁ గనఁబఱచి యున్నాఁడు

మొదటియంకమున మొదటిరంగముననే దుష్యంతునిదయాగుణము, కర్తవ్యదక్షతయు వెల్లడియగును. అతఁ డెట్టాడిన లేడిని వేయ

---

1 'తతః ప్రవిశతి మృగానుసారీ చాపహస్తో రాజా రథేన సూతశ్చ' (అంత మృగమును వెంటఁ దఱుముచు రాజు రథముతోఁ గూడ సారథితోఁ ప్రవేశించుచున్నాఁడు)

2 గీ ఆ మృగముపై నధిజ్యశరాసనంబుఁ, గరమున ధరించియున్న నిన్నుఁ గాంచి నాకు
యజ్ఞమృగము వెన్నంటి యరుగునట్టి, యల పినాకపాణిని గన్న యట్లు దోఁచె

3 చ పొరిపొరి మౌర్వి లాగుటను బూర్వశరీరము గట్టిబాఱి భాస్కరకిరణాళి సెంతయును సైఁచుచుఁ జెమ్మట లేక మైనమెం
పొరయక చిక్కియు దృఢతఁ బొందుటఁ బల్చనిదైన విక్రమ, స్థిరుఁ డగు నాతఁ డొప్పెడును శైలచరద్విపంబనన్.

4 కశ్యపుఁడు — (రాజుఁ జూపి) ఓ దక్షపుత్రీ!

ఉ ఎంతయు నీదుపుత్రునకు నీతఁడు తోడగు ముందు నిల్చి దుష్యంతధరాతలేశ్వరుఁడు సంగరరంగమునందు వింటిచే
సంతత మెల్లకార్యములుఁ జక్కఁగ నిర్వహించు బౌనర్ప, నిశ్చింతత భూషణంబై యగుఁ జేతి వజ్రము గోత్రభేదికిన్.

మూఁడువిధముల నుచ్చరింపవలయును. అట్లుచ్చరించినఁ గాని యందలి యర్థవిశేషము ప్రేక్షకులకు బోధపడనేరదు.

ఆహార్యాభినయము — ఆహార్య మనఁగా వేషకల్పనవిధానము. కేవలము వేషముచేతనే పాత్రముయొక్క భావముల సామాజికులహృదయము నందు కలిగించేయుట యాహార్యాభినయము, అనఁగా నటులను వారి వారి భూమికలకుఁ దగినట్లుగ వస్త్రభూషాదులచే నలంకరింపఁ జేయుట. నటులకు తమకాలమునందలి వస్త్రభూషాదులజ్ఞాన మావశ్యక మగుటయే కాక, పూర్వకాలమునందలి ఋషినృపకంచుక్యాదులవస్త్రభూషాదులజ్ఞానము కొంతవఱకుఁ గలిగియుండవలెను. మాలతీమాధవ నాటకమునందలి అఘోరఘంటుఁడు, కపాలకుండల మొదలయిన భూమికలకు వేషములు వేయుటకై తాంత్రికమతమువారు పూర్వము జేసికొనుచుండిన వేషముల నెఱుంగవలయును. అట్లే ప్రబోధచంద్రోదయమునందలి పాత్రములకు సింగారించుటకు నందు వర్ణింపఁబడిన మతములవారి కట్టుబొట్టులు మొదలయినవి సరిగా నెఱింగి యుండవలెను. లేనియెడల వేషములు శోభింపనేరవు. రంగాలంకారము లన్నియు, రంగమునందును నాపఁబడు వనజలపర్వతాదు లన్నియు నిప్పటివారిచేఁ బ్రదర్శింపఁబడుతెరలు మొదలగునవియు నాహార్యాభినయమునకు సంబంధించినవియే.

సాత్త్వికాభినయము — సాత్త్విక మన మనస్సత్త్వముచే నిర్వర్తింపఁబడునది. సాత్త్వికాభినయ మనఁగా రసనిష్పత్తిని గలిగించు విభావ స్థాయి సంచారి సాత్త్వికభావములను అనుభావములచే సామాజికుల హృదయములకుఁ దత్తద్భావముల నుద్బోధింపఁజేయు ప్రక్రియ. కావున సాత్త్వికాభినయమున నాయికానాయక ప్రవృత్తులను మనోవృత్తిరూపములగు ననవిశేషములలోని స్థిరభావము లగు రతి, శోకము, ఉత్సాహము, భయము, విస్మయము, క్రోధము, నగవు, జుగుప్సయును, నిర్వేదాదు లగు ముప్పదిమూఁడును, స్తంభప్రళయాదు లగు నెనిమిదియు ననుభావములచేఁ జూపఁబడును. అనుభావము లనఁగ క్రియలు. ఉదాహరణముగాఁ గ్రోధమున — నిశ్వాసోచ్ఛ్వాసపుటము, ఉద్వృత్తనయనము, సందష్టోష్ఠపుటము, గండస్ఫురణము మొదలగునవి యనుభావములు. వీనిచేఁ గ్రోధభావము నభినయింపఁదగు. ఇట్లే శంకకు — ముహుర్ముహురవలోకనము, అవకుంఠనము, ముఖశోషణము, జిహ్వాపరిలేహనము, ముఖవైవర్ణ్యము, స్వరభేదము, కంపము, శుష్కోష్ఠము, కంఠావమర్శనము — మొదలగునవి యనుభావములు. వీనిచే శంకావస్థ నభినయింపఁదగు.

సాత్త్వికభావములఁగూడ నిట్లే అభినయింపఁదగు. అలంకారికులమతమున సాత్త్వికభావము లెనిమిది. స్వేదము (చెమట), స్తంభము (ప్రాణపాటు), రోమాంచము (గగుర్పాటు), స్వరభేదము (మాట మాఱుట), వేపథువు (మాట తడఁబడుట), వైవర్ణ్యము (వెలవెలఁ బాఱుట), అశ్రువు (కన్నీరు), ప్రళయము (మూర్ఛ).

ఇతరులసుఖదుఃఖములను గాంచి వానియెడ మనస్సునకు సానుభూతి గలిగినఁగాని యీభావము లుత్పన్నములు కావు గనుక వీనికి సాత్త్వికభావము లని పేరు వచ్చెను. సత్త్వము అనఁగా మనస్సులో నుండి పుట్టినవి, లోకధర్మమును అనుసరించుటచే నాట్యమునకు సత్త్వము కావలెను. ఏభావమును అభినయించునప్పు డాభావముగల పురుషునితో తాదాత్మ్యమును బొందవలెను. దుఃఖము రోదనాత్మకము. దానిని అదుఃఖితుఁ డెట్లు అభినయించును? సుఖము ప్రహర్షాత్మకము. దానిని దుఃఖితుఁ డెట్లు అభినయింపఁగలఁడు? కావున నటుఁడు తాను గైకొనినభూమికతోఁ గొంతవఱకైనను ఐక్యమును బొంది యీభావములను ఘటింపవలె నని భరతాచార్యులవారి యభిప్రాయము.[1]

ఈ సాత్త్వికాభినయమున స్థాయిసంచారిభావాభినయము నొకొక సాత్త్వికభావముల నభినయించుటయుఁ గైని సూచింపఁబడెను. సమస్తభావములకును ప్రయోజనస్థానములు కలవు. అందులో సాత్త్వికభావముల నేయేపట్ల నభినయింపవలెనన దిట్లు చెప్పినాఁడు.

హర్ష భయ శోక విస్మయ విషాద రోగములను నాశ్రయించు స్తంభమును, క్రోధ భయ హర్ష లజ్జా దుఃఖ శ్రమ రోగ తాప వ్యాయామ శ్రమములపరిణామమగు స్వేదమును, శీత భయ హర్ష రోష స్పర్శ జరారోగములకుఁ గంపమును, స్పర్శ భయ శీత హర్ష క్రోధ రోగములవలన రోమాంచమును, భయ హర్ష క్రోధ జరా రోగ మద జనితమగు స్వరభేదమును, సంతోషము, వెదకించుట, జ్వరము, కోపము మొదలయినవానిచే వేపథువును, శీత క్రోధ భయ శ్రమ రోగ శ్రమతాపజము వైవర్ణ్యమును, ఆనందము రోషము పొగ గాని కాటుక గాని కనులలోనికిఁ బోవుట, శోకము, రెప్పవాల్పక చూచుట శీతము రోగములవలన అశ్రువులు, శ్రమ మూర్ఛా మద నిద్రాభిఘాత మోహాదులవలన ప్రళయము.

ఇట్లు వీని ప్రయోజనములు చెప్పుచు, అభినయమునందు వీని నెట్లు చూపవలయునో యీ క్రిందివిధముగఁ జెప్పినాఁడు —

---

1 అత్రాహ - కిమన్యే భావాః సత్త్వేన వినాభినీయంతే యేన హ్యేతే సాత్త్వికా ఉచ్యంతే అత్రోచ్యతే - ఇహ హి సత్త్వం నామ మనః ప్రభవమ్ తచ్చ సమాహితమనస్త్వా దుచ్యతే మనసః సమాధానాచ్చ సత్త్వనిర్వృతి రితి తస్య యోఽసౌ స్వభావో రోమాంచాదికృతః న శక్యతేఽన్యమనసా కర్తు మితి లోకస్వభావానుకరణాచ్చ నాట్యస్య సత్త్వ మీప్సితమ్ కో దృష్టాంతః, ఇహ నాట్యధర్మప్రవృత్తాః సుఖదుఃఖకృతో భావా స్తథా సత్త్వవిశుద్ధాః కార్యా యథా సరూపా భవన్తి దుఃఖం నామ రోదనాత్మకం తత్కథ మదుఃఖితేన, సుఖంచ ప్రహర్షాత్మకం తత్కథం దుఃఖితేనాభినేయమ్? ఏతదేవాస్య సత్త్వం య ద్దుఃఖితేన సుఖితేన వా అశ్రు రోమాంచౌ దర్శయితవ్యా వితి కృత్వా సాత్త్వికా భావా ఇత్యభివ్యాఖ్యాతాః (నాట్యశాస్త్రము, ౭-వ అధ్యాయము).

# అభినయము




౪౬. ఖట్వాహస్తము లక్షణము

చతురే చతురం న్యస్య తర్జన్యంగుష్ఠమోచనాత్,
ఖట్వాహస్తో భవేత్

౪౭. లతాహస్తము లక్షణము

పతాకా డోలికాకారా లతాఖ్యః

౪౮. ముష్టిస్వస్తికహస్తము లక్షణము

ముష్టిహస్తౌ స్వస్తికతాం కటిస్థానే గతౌ యది,
ముష్టిస్వస్తికతాం స్యాతాం

౪౯. కుశలహస్తము లక్షణము

అన్యోన్యాభిముఖా వర్ధచంద్రా కుశలసంజ్ఞకః

౫౦. నృసింహావతారహస్తము లక్షణము

వామే సింహముఖం ధృత్వా దక్షిణే త్రిపతాకకః,
నరసింహావతారస్య హస్త ఇత్యభిధీయతే

౫౧. వామనావతారహస్తము లక్షణము

ఊర్ధ్వాధోధృతముష్టిభ్యాం సవ్యాసవ్యాభ్యాం యది స్థితిః,
స వామనావతారస్య హస్త ఇత్యభిధీయతే

అంగము లన్నియు నిష్క్రియముగ నుండుటయే స్తంభము. ఎండలో నుండుట, వివశత్వముతో నిలుచుండుట, గాలిని కోరుట యను క్రియలచేత స్వేదమును, శరీరమును చేత స్పృశించుటవలన (గాత్రసంస్పర్శముచే) రోమాంచమును, దుస్థితి (గద్గదము) నొంద వలనగానిచే స్వరభేదమును, ధ్వనికంపమును, స్ఫురణము (అదరుట), శరీరకంపములవలన వేపథువును, ముఖమునకు ఆదికొనిన మార్పియు ఇదా పిండాదివాతములను చిఁదిట్టియు వైవర్ణ్యమును, కనులు కుడుచుకొనుట కన్నీరు గార్చుట మొదలయినవానివలన నశ్రువులను, నిశ్చేష్ట నిష్కంపమూర్గ జడాకృతి దాల్చుటవలనను, భూమిపైఁ బడుటవలనను ప్రళయమును అభినయింపవలెను

పై భావములు గనుపఱుపవలసినవిధము లిట్లు తెల్పఁబడినను, అభినయమునకు నటునియొక్క యనుకరణకౌశలమే మూలాధారము ఈచాతుర్యము లేనివాఁడు నటుఁడుగ నుండలేఁడు. అందఱు నటులకు నన్నిరసములను గాని, అన్ని భావములను గాని అనుకరణము చేయుకౌశల ముండదు కొందఱకు హాస్య మభినయించుటయందును, కొందఱకు వీరరౌద్రాదులను జూపుటయందును, కొందఱకు శాంతాదికముల నటించుటయందుమాత్రము ప్రజ్ఞ యుండును వారివారి ప్రజ్ఞల ననుసరించి వారివారికి వేషములు వేయవలయును

పైని అభినయముయొక్క భేదములు నాల్గు చెప్పఁబడియెని వానిలో సాత్త్వికాభినయము రసభావోద్ద్యోతకము గావున సర్వోత్కృష్టము. సిద్ధికారి ఆంగికవాచికభేదములు ముఖ్యము లనియు, ఆహార్య మంగరూప మనియు కొలఁదిగాఁ జెప్పనగును సాత్త్వికా(?)దికాహార్యాభినయములు సహిత మాంగికమునందే పర్యవసించు చున్న వని కొందఱిమతము సమాచేశభేదముచే సాత్త్వికాద్యభినయములు భేదించుచున్నవి. నందికేశ్వరాదులు కేవల మాంగికమునందే సాత్త్వికాదుల నంతర్భవింపఁజేసి నాట్యవిద్యను నృత్తిప్రధానముగాఁ జేయుచున్నా రని భరతవ్యాఖ్యాతలమతము నందికేశ్వర కోహళాదులు ప్రతిపాదించిన అంగికాభినయమే ప్రధానముగఁగల విద్యలలో మనదేశమందు భోగమువాండ్రయాటయు, పాశ్చాత్య దేశమునందు ప్యాంటోమైమ్ (Pantomime) అను నాట్యవిశేషము ముఖ్యములు. ఇటీవల వెలసినట్టిబయోస్కోపు అను ఆటలును ఇట్టివే. ఇందు శబ్ద మెంతమాత్రము లేకుండ కేవల మభినయము వలననే కథాభాగ మంతయుఁ జూపఁబడును అంగికాభినయము మనోభావము నెంత చక్కఁగ వెల్లడి చేయఁగలదో చూపుటకు బయోస్కోపు ఆటలు మంచిదృష్టాంతములు. డిడారొ(?) అను ఫ్రెంచివిద్వాంసుఁడు నాటకమును జూడఁబోయినప్పుడు చెవులు మూసికొని యుండువాఁడఁట! కేవ లాంగికాభినయమువలన నటు లెంత యర్థమును బోధింపఁగలరో చూచుట యాతని యుద్దేశము వాచికాభినయము ప్రధానముగాఁ గలది యొకయర్థమునందు సం

గీతము, మఱియొకయర్థమునందు నృత్త్యము అన్నియభినయములను గావలసినది నాటకము ఇందును పెక్కుభేదములు గలవు. ఇందును గుఱించి యింకను అధికము తెలిసికొనఁగోరువారు 'నాటకము', 'నాట్యము', 'భరతము' అనుశబ్దములను జూడనగును.

(కో వేం ల)

(మా రా క.)

**అభినవకాళిదాసు** — ౧. సంక్షేపశంకరవిజయము రచించిన మాధవాచార్యునిబిరుదము

౨ కాశ్యపగోత్రమునందుఁ బుట్టిన యొకసంస్కృతకవి ఇతఁడు రచించినగ్రంథము శృంగార కోశభాణము.

3 'అభినవభారతచంపు',

'భాగవతచంపు' అను గ్రంథములను రచించిన సంస్కృతకవి.

**అభినవగుప్తాచార్యుఁడు** — ౧ కాశ్మీరమందలి గొప్పపండితుఁడు, అలంకారికుఁడు, మహామాహేశ్వరాచార్యుఁడని ప్రసిద్ధుఁడు. ఇతఁడు క్రీస్తాబ్దియమైన పదవశతాబ్దియొక్క చివరకాల మందును, పదునొకండవశతాబ్దియారంభమందును ఉండెను వరాహగుప్తుఁడు తాత, నృసింహగుప్తుఁడు తండ్రి, మనోరథగుప్తుఁడు తమ్ముఁడు, లక్ష్మణగుప్తుఁడు, భట్టేందురాజు, భట్టతౌతుఁ డనువారు విద్యాగురువులు, క్షేమరాజాదులు శిష్యులు ఇతనిచే రచింపఁబడిన గ్రంథములు (౧) అనుత్తరాష్టికా (౨) కావ్యకౌతుకవివరణమ్, (3) క్రమస్తోత్రమ్ (౪) ఘటకర్పరకులక వివృతిః (౫) తంత్రవటధానికా (౬) తంత్రసారః (౭) తంత్రాలోకః (౮) దేహస్థదేవతాచక్రస్తోత్రమ్ (౯) ధ్వన్యాలోకలోచనమ్ (౧౦) నాట్యాలోచనమ్ (౧౧) పరమార్థచర్చా (౧౨) పరమార్థద్వాదశికా (౧3) పరమార్థసారః (౧౪) పరాత్రింశికా వివరణమ్ (౧౫) ప్రకరణస్తోత్రమ్ (౧౬) ప్రత్యభిజ్ఞావిమర్శినీ బృహతీవృత్తిః (౧౭) ప్రత్యభిజ్ఞావిమర్శినీ లఘువృత్తిః (౧౮) ప్రబోధ పంచదశికా (౧౯) భగవద్గీతాటీకా (౨౦) అభినవభారత్యాఖ్య భారతీయనాట్యశాస్త్రటీకా (౨౧) విజ్ఞానభైరవోద్ద్యోతటీకా (౨౨) మహోపదేశవింశతిః (౨3) మాలినీవిజయవార్తికమ్[1] (౨౪) భైరవ స్తోత్రమ్ – మొదలగునవి.

౨ అస్సాము దేశమందలి మహాపండితుఁడు. శాక్తుఁడు. బ్రహ్మసూత్రములపై శాక్త భాష్యమును రచించెను శంకరాచార్యులు దిగ్విజయార్థము బయలుదేఱి కామరూపదేశమునకుఁ బోయినప్పు డీతనితో వాదము సల్పి యాతనిని గెల్చెను అంత నీతఁడు వెలుపలికి నాచార్యులశిష్యత్వము నంగీకరించెను కాని మనస్సునందు ద్వేషము నుంచుకొని మంత్రతంత్రము లెఱింగినవాఁ డగుటచేఁ దన మంత్రబలముచే నాచార్యులవారికి భగందరరోగమును బుట్టించెనఁట! ఎంతగొప్పవారలకైనను దుష్టులు నచ్చి యుపచారము చేసినను

1. (కావ్యమాల ౨౫, కృష్ణశాస్త్రిగోకనముకర సంపాదకులు ప్రాసినట్టియుపోద్ఘాతమును జూడుఁడు)

అరోగము కుదురలేదు. అందుమీఁద పద్మపాదాచార్యుఁడు ప్రతి ప్రయోగమును జేసి యాచార్యుని బాగుచేసెనట! అభినవగుప్తుఁ డా రోగముతోనే చచ్చెనట! (మాధవకృత శంకర దిగ్విజయము, ౧౬-వ సర్గము).

ఈ యభినవగుప్తుఁడు వాదించినది యాదిశంకరునితోఁ గాదనియు, ఆ పీఠమును నలంకరించిన విద్యాశంకరభారతి యను శంకరాచార్యునితో ననియు, ఈసమాచారము క్రీ శ ౧౪ లో జరిగె ననియు అర్వాచీనకోశకారుఁడు వ్రాసినాఁడు, కాని ప్రమాణ మేమియు నిచ్చినవాఁడు కాఁడు

**అభినవచంద్రుఁడు** — ఇతఁడు కన్నడమున 'అశ్వ వైద్యము' అను గ్రంథమును వ్రాసిన బ్రాహ్మణగ్రంథకర్త. ఈతఁడు క్రీ శ పదునాలుగవశతాబ్ది సంవత్సర ప్రాంతమునం దుండియుండు నని కర్ణాటకకవిచరిత్రకారు లభిప్రాయపడియున్నారు

**అభినవబాణుఁడు (వామనభట్టబాణుఁడు)** — కొండవీటిరాజగు వేమభూపాలునియాస్థానకవి. ఇతఁడు 'వీరనారాయణచరితము', 'పార్వతీపరిణయము' అను రెండునాటకములను రచించెను పార్వతీపరిణయములోనికథ కాముదహనము, పార్వతీవివాహము. ఈయభినవబాణుఁడు రచించినవి 'శృంగారభూషణ భాణము', 'శర్వచరితము' అను మఱిరెండుగ్రంథములు కలవు.

**అభినవమంగరాజు** — 'కవిమంగాభిధాన' మనఁబడు అభినవనిఘంటువును కన్నడమందు వ్రాసినవాఁడు. 'చింతామణిపతిపదము' అనుగ్రంథమునుగూడ నితఁడు వ్రాసె నని ప్రతీతి కలదు కాని ఆగ్రంథము దొరకినది కాదు. అభినవనిఘంటువు క్రీ శ ౧౩౯౮ లో రచింపఁబడుటచే నీకవి పదునాల్గవశతాబ్ది అపరార్ధమున నుండినవాఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడు

**అభినవశ్రుతముని** — ఇతఁడు మల్లిషేణరచిత మైన 'సజ్జనచిత్తవల్లభము'నకు కర్ణాటకవ్యాఖ్య వ్రాసినవాఁడు. శ్రవణబెళ్గొళయందలి యొకశాసనమునుబట్టి యీ కవి పదునాల్గవశతాబ్ది చివరకాలమున నున్నవాఁ డని యూహింపఁదగియున్నది.

**అభిమతి** — అష్టవసువులలోని యొకవసువుభార్య

**అభిమన్యుఁడు** — ౧. అజుని చతుర్దశపుత్రులలో నొకఁడు

౨ (చం. వం) పాండవమధ్యముండగు అర్జునునకు, శ్రీకృష్ణునకుఁ జెల్లెలగు సుభద్రకును బుట్టినకుమారుఁడు. ఇతఁ డష్టవసువులలోని సోమనామకవసువు పుత్త్రుఁడైన 'వర్చ' యనువానియంశమునఁ బుట్టెను (భార, ఆది అ. ౬౭) ఈతఁడు జన్మకాలమునందు దీర్ఘబాహుఁడుగను, మహాక్రోధుఁడుగను గానవచ్చినందున ఇతని కభిమన్యుఁ డని నామకరణము చేసిరి. ఇతఁ డర్జునునియొద్ద దశవిధధనుర్వేదమును అభ్యసించి దివ్యాస్త్రములను సంపాదించెను ధనుర్వేదమం దితనికిఁ గల యప్రతిమప్రావీణ్యమును గాంచి బలరాముఁడు సంతసించి యీతనికి రౌద్రనామకశ్రేష్ఠధనుస్సు నొసంగెను. ఇతనిరథమునకు పింగళవర్ణముగల గుఱ్ఱములును, కార్ణికారవృక్ష ధ్వజమును గలవు. సుమిత్రుఁ డనువాఁ డితనిసారథి ఇతఁ డాకారమునందును, శౌర్యమునందును తన మేనమామ యైనకృష్ణుని పోలియుండెను ఇతని పెద్దభార్య యుండిరి పెద్దది బలరామునికూఁతు రైన వత్సల (జైమిని - అశ్వ). రెండవది విరాటరాజుకూఁతు రయిన ఉత్తర శౌర్యమునం దీతఁడు కృష్ణార్జునులకు సమానుఁడు. ఇతఁడు భారతయుద్ధమునందు పదుమూఁడవనాఁడు, అనఁగా ద్రోణాచార్యులు సైన్యాధిపత్యమును వహించిన మూఁడవనాఁడు, కౌరవులచే నిర్మింపఁబడిన పద్మవ్యూహమును, ధర్మరాజప్రేరణచే భేదించి, లోనికిఁ జొచ్చి, సైంధవుఁ డడ్డపడుటచే ధర్మరాజాదులు తనకు సాహాయ్యార్థము రాకపోయినను, ఒక్కఁడే, కౌరవసైన్య మంతటితోను భీకరముగఁ బోరాడి, గొప్పగొప్పవారైనపెక్కురాజులను సంహరించి ద్రోణకర్ణకృపదుర్యోధనదుశ్శాసనాదివీరుల ననేకపర్యాయములు లోడించి పాఱఁద్రోలి తనయసదృశపామాన్యపరాక్రమంబును వెల్లడించెను ఆనాఁ డితనిచేఁ జచ్చిన పదివేలరథులలో దుర్యోధనభ్రాత యైన వృందారకుఁడు, మగధరాజపుత్త్రుఁ డయిన శ్వేతకేతువు, అశ్వకేతువు, కుంజరకేతువు, కోసలరాజైన బృహద్బలుఁడు, దుర్యోధనకుమారుఁ డయిన లక్ష్మణుఁడు, శల్యపుత్రుఁడు, శల్యునందనుఁ డైన రుక్మరథుఁడు, శల్యునిసోదరుఁడు, కర్ణునితమ్ముఁడు, కర్ణపుత్త్రుఁ డయిన వృషసేనుఁడు ముఖ్యులు తుదకు కర్ణద్రోణాదులార్గురు మహావీరు లన్యాయయుద్ధమునకుం బూనుకొని, వెనుకనుండి కర్ణుఁడు విల్లు ద్రుంచి, ద్రోణుఁడు కవచమును భేదించి, అశ్వములను జంపి, కృతవర్మ పారశ్విక చక్రరక్షకులను గూల్చి అభిమన్యుని విరథునిం జేసిరి అంతి నాతఁడు వాలుం బలకయుం దీసికొని కొంతవడితుఁ బోరాడె శత్రువులు వాలుం బలకయుం ద్రుంగఁగొట్ట, రథచక్రముతోడను, గదతోడను కొంతకాలము యుద్ధము చేసి పెక్కురయోధుల సంహరించెను తుదకు దుశ్శాసనకుమారుఁడు పోరుటకు రాఁగా వా రుభయులును ఘోరముగాఁ బోరుచుండ కౌరవసైనికు లందఱును జుట్టుముట్టి, తమబాణములచే నభిమన్యుం జంపిరి. ఇట్లు భారతమునంగు వర్ణింపంబడిన అభిమన్యుని యుద్ధప్రకార మత్యద్భుతము. ఈతఁడు కీర్తిశేషుఁ డైనప్పు డీతని భార్య యైన ఉత్తర గర్భము దాల్చియుండె, తరువాతఁ బుత్త్రుని బడసెను. అతఁడే పరీక్షన్నరేంద్రుఁ డని విఖ్యాతిం బడసె (భార., ద్రో౹ అ ౩౫-౪౯)

౩ ఇతఁడు కాశ్మీరదేశపురాజు. కనిష్కునితరువాత రాజ్యమునకు వచ్చెను. క్రీ శ రెండవశతాబ్ది ప్రారంభమునం దున్నవాఁడు. అభిమన్యుపుర మనుపట్టణమును కట్టించి యచ్చట శివాలయమును ప్రతిష్ఠించెను. ఈతనికాలమునందుఁ జతంజలి

కృతములో భోక్తృత్వముయొక్క ప్రచారము కాశ్మీరమునందు లోపించి నందున, నీతఁడు దేశాంతరములనుండి చంద్రాచార్యాదులచే దానిని తెప్పించెను. చంద్రాచార్యాదులుకూడ వేఱువ్యాకరణములను క్రొత్తగా వ్రాసిరి. కాశ్మీరమునందు బౌద్ధులుమిక్కిలి హెచ్చినంగున నాగదేవతలకుఁ గోపము వచ్చి శిశిర కాశ్మీరమునందుఁ బ్రతిసంవత్సరమును మంచు అధికముగఁ గురిసి, జనక్షయము కలుగుచుండెనఁట! యజ్ఞయాగాదులు చేయునట్టి బ్రాహ్మణులకు అది బాధ చేయకుండెను, కాని బౌద్ధులుమాత్రము నాశమును చెందుచుండిరి! కాశ్యపగోత్రుఁడైన చంద్రదేవుఁ డను బ్రాహ్మణుఁడు నీలుఁడను నాగదేవుని తపస్సుచే మెప్పించెను. అతఁడు నీలపురాణము నిచ్చి కాశ్మీరమును మంచువలననుండియు, బౌద్ధభిక్షువులవలననుండియు రక్షించెను (రాజతరంగిణి ౧-౧౩౪-౧౮౪)

౪ కాశ్మీరరాజు,

శ్రీ శ ౯౫౮ మొదలు ౯౭౨ వఱకును రాజ్యము చేసెను. ఇతనితండ్రి క్షేమగుప్తుఁడు, తల్లి దిద్ద. ఇతఁడు రాజ్యమునకు వచ్చినప్పుడు చిన్నవాఁడుగ నున్నందున నాతనితల్లి యాతనిపాలికగా రాజ్యముచేసెను. ఈతనిపాలనకాలమందుఁ గొందఱు సరదారులు తిరుగఁబడిరి. కాని వారు చివరకు నోడిపోయిరి. రాజయక్ష్మచే అభిమన్యుఁడు ౯౭౨ లో మృతుఁ డయ్యె. ఆతనికుమారుఁడు నందిగుప్తుఁడు (రాజతరంగిణి ౬-౧౮౭-౩౧౨)

అభిమానిని — షాడవ-షాడవరాగము. అయిదవ మేళకర్త యగు మానవతీజన్యము. స రి గ మ ధ ని స — స ని ధ మ గ రి స యని ఆరోహణావరోహణములందు సంచారము

అభిమానుఁడు — స్వాయంభువ మన్వంతరమునం దుండిన ధర్మఋషియొక్క పుత్త్రుఁడు. ఈయనతల్లిపేరు ఉన్నతి

**అభిలషితార్థచింతామణి** — ఇది రాజనీతి సంబంధించిన గ్రంథము. రాజకవియు, పశ్చిమచాళుక్యవంశజుఁడునగు మూఁడవ సోమేశ్వరునిచే లిఖింపఁబడినది. ఇతనికి భూలోకమల్ల బిరుదము కలదు. ఈగ్రంథ మైదుభాగములు. మొదటిభాగములో రాజ్యాభిలాషి రాజ్య మేలాగున సంపాదింపవలెననదియు వ్రాయఁబడియున్నది. రెండవభాగములో సంపాదించినరాజ్యమును రక్షణము చేసికొనఁదగిన విధానములు వివరింపఁబడెను. తనకును, తనరాజ్యమునకు సేవిధమైన హానియు రాకుండులాగున రాజైనవాఁ డనుభవింపఁదగిన విహారములు, ఆనందములు లోనగువానింగూర్చి మూఁడవ, నాలుగవ, ఐదవభాగములలో వర్ణింపఁబడియున్నది. పై నుదాహరించినవినోదములుగూర్చి వ్రాయుచు నితఁడు సందర్భానుసారముగ నాయాస్థలములందు రెండు ప్రకారములను జ్యోతిషము, సాహిత్యము, కావ్యము, సంగీతము, చిత్రలేఖనము, శిల్పము, ఔషధము మున్నగువానిని వివరించి తన విశాలవిద్యానైపుణ్యమును వెల్లడిచేసియున్నాఁడు.

అభిషిక్తరాఘవము — దీనికి తిరువేంకటనాథచరిత్ర మనియుఁ బేరు. కవి నడిమింటి వేంకటకవి. ఇది మట్ల అనంతభూపాలునికుమారుఁ డగు తిరువేంగళనాథుని ప్రేరేపణచే వ్రాయఁబడిన గ్రంథము. గ్రంథాదిని మట్లసంతతివారి చరిత్ర కొంత గలదు. కాని గ్రంథము సమగ్రముగ లేనందున నితరవిశేషము లెవ్వియు తెలియంగరాలేదు

అభిషేకనాటకము — ఇది యొక సంస్కృత దృశ్యకావ్యము. కాళిదాసమహాకవికంటెఁ బ్రాచీనుఁడగు భాసమహాకవి రచించె నని ప్రసిద్ధిఁగన్న రామాయణనాటకము. మహామహోపాధ్యాయ, గణపతిశాస్త్రులవారు ప్రచురించిన పదుమూఁడు భాసనాటకములలో నిదియుఁ గలదు. ఇందుఁ గిష్కింధా, సుందర, యుద్ధకాండములకథ సంక్షేపముగ వర్ణింపఁబడినది.

భాసునిరామాయణనాటకములలోఁ బ్రతిమానాటకము చాల బాగుగ నుండు నని ప్రతీతి. ఈయభిషేకనాటకముమాత్రము ప్రతిమానాటకముతోఁ గులఁదూఁగఁగలదు. ఇందు దోషవిశేషము కలదు. ప్రాచీనరూపకములఁ బరిశీలించినచోఁ బాత్రపోషణ మిందు చేయఁబడిన ట్లింకెందును జేయఁబడలే దని తెలియనగును. ఇందు రాముఁడు, రావణుఁడు మొదలగు ముఖ్యపాత్రముల శీలము బాగుగఁ బోషింపఁబడినది. నిరపరాధుండ నగు నన్నేల చంపితి వను వాలిప్రశ్నకు రాముని యుత్తరమును, విభీషణుని లంకనుండి పొమ్మని రావణుఁడు పలుకుసందర్భమునకుగూడ నించుకంతేనియుఁ బాత్రల యందలిలోపము కల్పింపలేదు

కాళిదాసుని శాకుంతలనాటకముఁ బోలికలు కొన్ని భాసనాటకము లన్నింటియందును గన్పించుచుండుటచేఁ గాళిదాసు భాసునిశ్లోకముల నాదర్శముగఁ దీసికొనె నని విశ్వసింపవీలగు చున్నది. ఇందలి 'యస్యాం న ప్రియమండనాపి మహిషీ దేవస్య మందోదరీ' అను నిందలిపద్యమే కాళిదాసుని 'తత్ర శ్లోకచతుష్టయ' మ్మనఁబడు నాల్గుశ్లోకములలో నొకటి యగు 'పాతుం న ప్రథమం వ్యవస్యతి జలమ్' అను శ్లోకమున కాధారమై యలరారెను. ఈవిషయముఁబట్టి దీని ప్రాశస్త్య మూహ్యము

(బు వేం ర)

**అభిషేకము** — ప్రజాపాలనాదికర్తవ్యభారము గల మహాకార్యములందు నియోగింపఁబడునారంభకాలమున పట్టిపురుషునకుఁ జేయు మంగళస్నానము ముఖ్యముగ నీపేరను పిలువఁబడుచున్నది. ఋగ్వేదసంహితాపదములలో నీశబ్దము కానవచ్చుట లేదు కాని అథర్వవేదమం దున్నది. శుక్లయజుర్వేదమునందు, కృష్ణయజుర్వేదముయొక్క మూఁడుసంహితలలోను బ్రాహ్మణములలోను, శ్రౌతసూత్రములందును రాజసూయసమారంభకాలమున నీయభిషేకము కావింపఁబడవలయు నని వ్రాయఁబడియున్నది. పోలాయాత్రాభిషేకము, దుర్గా

పుణ్యాభిషేకము, దేవప్రతిష్ఠాభిషేకము, రాజాభిషేకము నని ఇది యనేకవిధములు. అందు రాజాభిషేకము పునరభిషేక మనియు, ఐంద్రమహాభిషేక మనియు రెండుప్రకారములు. ఇందులో మొదటిది రాజసూయయజ్ఞమునకుఁ జెందినది. ఐతరేయమం దీ యభిషేకమును గురించి విపులముగ లిఖింపఁబడియున్నది.

పవిత్రజలములతో నిట్లు స్నాన మొనరించు నాచారము క్రొత్తది కాదు. ఇది అత్యంతప్రాచీనకాలమునుండియు వచ్చుచున్నది. మఱియు నిది కేవలము హిందూస్థానమునందే కాదు, తక్కిన దేశములలోఁగూడ నలుపఁబడుచువచ్చినది. ఇట్టియభిషేకమువలన స్నాతుఁ డగువాని కొకవిధ మగు సామర్థ్యము గలుగు నని ప్రాచీను లందఱును నమ్మకము కలిగియుండిరి. దీనివలన సార్వభౌమికస్వాతంత్ర్యము లభించు నని ఐతరేయబ్రాహ్మణము వక్కాణించుచున్నది. పూర్వకాలమున నీసంస్కారమును బొందిన కొందఱు మహారాజుల పేరులును బ్రాహ్మణములలోఁ గలవు. యుధిష్ఠిరుని - అభిషేకమును మఱికొన్ని యభిషేకములును మహాభారతములో సభా, శాంత్యాది పర్వములలో వర్ణింపఁబడియున్నవి. కాళిదాసునిరఘువంశమందును ఒకయభిషేకవిషయ మైనవర్ణనము గలదు. ప్రాచీనకాలమున నభిషిక్తులైనవారిలోఁ గొందఱినామములు బ్రాహ్మణములం దీవిధమున లిఖింపఁబడియున్నవి.

| అభిషిక్తమహారాజులు | అభిషేచనముం జేసినవారు |
|---|---|
| పరీక్షితునికొడుకు జనమేజయుఁడు | కవషసుతుఁడు తురుఁడు |
| మనుసుతుఁడు శర్యాతి | భృగుసుతుఁడు చ్యవనుఁడు |
| సత్రాజిత్సుతుఁడు శతానీకుఁడు | వాజరత్నసుతుఁడు సోమశుష్మ |
| అంబాష్ఠ్యుఁడు | పర్వతనారదులు |
| ఉగ్రసేనసుతుఁడు యుధాంశ్రౌష్టి | పర్వతనారదులు |
| భువనునికొడుకు విశ్వకర్మ | కశ్యపుఁడు |
| పిజవనునికొడుకు సుదాసుఁడు | వసిష్ఠుఁడు |
| అవిక్షిత్సుతుఁడు మరుత్తుఁడు | అంగిరస్సుతుఁడు సంవర్తుఁడు |
| అంగుఁడు | అత్రిసుతుఁడు ఉదమయుఁడు |
| దుష్యంతునికొడుకు భరతుఁడు | మమతాసుతుఁడు దీర్ఘతమసుఁడు |

బృహదుక్థుని వలననుండి పాంచాలదుర్ముఖుఁడును, వసిష్ఠసాత్యహవ్యునివలననుండి జనంతపయసుతుఁడు అత్యరాతియు నీయభిషేకసంస్కారమును సేర్పుకొనినంతమాత్రముననే విజయులైరి.

క్రమముగ నీయభిషేకకార్యము కొంచెముగఁ గాని, గొప్పగఁ గాని స్వాతంత్ర్యముగల సకలవిధభూపాలురకును నలుపఁబడుచు వచ్చినది. ఐతరేయమువలన సామాన్యరాజులకుఁగూడ నీసంస్కారముండినట్లు దెలియుచున్నది. మఱియు నథర్వవేదమునకుఁ జెందిన కౌశికసూత్రములలో సామాన్యభూపాలునకును రాజాధిరాజునకును జేయవలసినవానిలో భేద మున్న దని ప్రతిపాదింపఁబడియున్నది. ఏదేశపాలకుఁ డైనను పట్టభద్రుఁ డగుసమయమున నభిషేచనముం జేసికొనితీరవలయును. హర్ష శిలాదిత్యునితండ్రి యగుప్రభాకరుఁడు తనరాజ్యారంభకాలమున నభిషేచనముం జేసికొనియుండెను. ఇతఁడు సామాన్యభూపాలుఁడే కాని సార్వభౌమకోటికిఁ జెందినవాఁడు కాఁడు. అథర్వవేదమందలి ఒకసూక్త మభిషేకమంత్రములతోడనే నింపఁబడియున్నది. సైత్యకసింహాసనమున కధికారముగల యువరాజునకును కొకవిధ మగు అభిషేకసంస్కారము గలదు. రామునిరాజ్యాభిషేకము రామాయణములో నయోధ్యాకాండము దారంభమై యుద్ధకాండానంతరము పరిసమాప్త మైనది. ఇట్టిదానికి పుష్యాభిషేక మని పేరు. ఈవిధాన మథర్వవేదపరిశిష్టమందును, వరాహమిహిరునిబృహత్సంహితయందును, కాళికాపురాణమందును వివరింపఁబడియున్నది. దీని యందలి విశేష మేమనఁగా, నిది చంద్రపుష్యయోగకాలమునఁ గావింపఁబడినది. ఆదేవరణమున నింద్రుఁడు రాక్షసులను జయించియుండెను. బృహత్సంహితా కాళికాపురాణములలో వ్రాసినదానిని బట్టి పుష్యాభిషేకములు కేవలము సార్వభౌమికము లని ఎంతమాత్రము నగపడదు.

ఈయభిషేకము రాజులకు, చక్రవర్తులకే కాదు ప్రధానమంత్రులకును జేయఁబడుచుండెడి దని 'మూర్ధాభిషిక్తామాత్య రాజానః' అని హర్షచరిత్రమందలివాక్యమువలన విదిత మగుచున్నది. మఱియు రాజ్యములోని ప్రధానపురోహితునకును బృహస్పతిసవమను ప్రత్యేకసంస్కారము దభిషేచనము గలుగుచున్నది. ఈసవము ప్రత్యక్షముగ వాజపేయముతోడ సంబంధము కలిగియుండినట్లు శతపథమువలన నమూనింపవచ్చును. తరువాత సేనానాయకత్వము వహించు వీరపురుషు లభిషిక్తు లగుచుండుట మహాభారతములోని యుద్ధపంచకమువలనఁ దేటతెల్ల మగుచున్నది. ప్రతిష్ఠించునప్పుడు, ఉత్సవసమయములందు, నిత్యముగను, నైమిత్తికముగను విగ్రహముల నభిషేకించుట మనదేశమం దాచార మైయున్నది. పూజావిధానము లందును, ప్రతిష్ఠాసమయములందును దేవతావిగ్రహస్నానాదులం గూర్చి యనేకనియమములు గలవు. ఈసంస్కారములందు పాలు, వివిధవృత్తికాయుతము లైన జలములును ముఖ్యముగ నుపయోగింపఁబడుచుండును.

ముక్తిమార్గము లని బౌద్ధులచేఁ గల్పింపఁబడిన పదివిధములగు దశలలో అభిషేకభూమిక యొకటి యైయున్నది. ఇది యటుండఁగా పుణ్యక్షేత్రములలో తీర్థములలో నిచట స్నానము గావించినను నదియు నభిషేకము లనియే పిలువఁబడుచున్నవి. మఱియు నుపనయనాదులందేమి, స్త్రీలవంధ్యాత్వదూరీకరణకార్యము లందేమి చేయింపఁబడుస్నానము లభిషేచనము లనియే వాడఁబడుచున్నవి.

ఈయభిషేకవిధాన మైతరేయబ్రాహ్మణకాలము మొదలుకొని నేఁటివఱకును పెక్కుమార్పులను జెందుచువచ్చినది. కావున వైదికయుగమునఁ జేయఁబడుచుండిన విధానమునకును పౌరాణికయుగమునఁ గావింపఁబడినదానికిని చాల వ్యత్యాసము కలిగినది. ఇందులకు ముఖ్యకారణము శ్రౌతవిధానమును బరిత్యజించుటయే. మఱియు

క్షత్రియులు గాని ఇతరభూపాలురుమాత్రము ఈయభిషేకము లాభిషేకము నగుటంజేసి శాస్త్రకర్తలు తత్తత్కాలములకు, రాజులకును దగినట్లు మార్పులు గలుగఁజేసి వ్రాయుచువచ్చిరి

అభిషేకము జరుగుట కొకదినము ముందుగ రాజదంపతులు మంగళస్నాన మొనరించి దీక్షాగ్రహణ మొనరింతురు మఱియు గణేశ పూజనము, మాతృకా పూజనము, పుణ్యాహవాచనము, నాందీశ్రాద్ధము లోనగు పూర్వాంగక్రియ లాదినమందే కావింపఁబడును రాజదంపతు లానాఁ డుపవాసము చేయుదురు రాజ్యమందలి సమస్తప్రముఖ్యాధికారులు నంతకుఁబూర్వమే నియమింపఁబడియుందురు మృగచర్మావగుంఠిత మైన సువర్ణభద్రాసనము, గంగాయమునాసంగమ జలము, సకల పుణ్యనదీజలము, పూర్వ పశ్చిమముఖనదీజలము, తీర్థనదీజలము, సకలసముద్రజలము, న్యగ్రోధ, ఉదుంబర, అశ్వత్థ, పాలాశ, ప్లక్ష (పాలాశమునకు బదులు శిరీషముగాని వేతసము గాని స్వీకరింపఁబడును) వృక్షముల పల్లవములు, పద్మోత్పలపుష్పములంకృతము లైన సువర్ణజలపూర్ణకుంభములు, రుచకము, రోచనము, ఘృతము, తేనె, పాలు, పెరుగు, పుణ్యతీర్థజలము, పుణ్యతీర్థమృత్తిక, మంగళద్రవ్యములు, మణిసంపమండిత శ్వేతచామరములు, మాల్యాలంకృత శ్వేతచ్ఛత్రము, శ్వేతవృషభము, శ్వేతాశ్వము, మహాగజము, స్త్రీలంకారభూషిత లైన యెనమండ్రుకన్యకలు, సకలవాద్యములు, సుభాషితుండగు వంది మొదలగు పరికరములు, ద్రవ్యములు, మనుజులు సిద్ధముగ నుంపఁబడుదురు మఱునాఁ డమాత్యసామంతప్రముఖసమేతముగ పురోహితుఁడు రాజదంపతులను మంగళస్నానము చేయించి తనవెంట నడపించికొని వచ్చి మణికాంచనవస్త్రభూషణములను వారిచే స్పర్శనముచేయించి నానావిధరత్నములతోను, చాందనీతోను నలంకరింపఁబడిన మండపాభ్యంతరమునఁ బూర్వోక్త వ్యాఘ్రచర్మావగుంఠిత మైన భద్రసింహాసనముపైని కూరుచుండఁజేయును తక్కిన మంత్రులు లోనగువారు సుఖాసనములపై నాసీను లైయుందురు ఇంద్రప్రార్థనముతో నభిషేకసంస్కార మారంభ మగును అంత నతఁడు పూర్వోత్తర దిశల నేర్పఱుపఁబడియున్న వేదులపై స్వకీయగృహ్యోక్తవిధి ననుసరించి వహ్నిస్థాపనము చేసి వేదమంత్రోచ్చారణపూర్వకముగ హోమము చేయును ఔదుంబరస్రువముతో నంత మంత్రముల నుచ్చరించుచు ఘృతాహుతుల నొసంగవలయును. అనంతరము సర్వతోభద్రమండపమునందు స్థాపింపఁబడియున్న స్వర్ణరజతతామ్రమృణ్మయ కుంభములలోని సకలౌషధిపల్లవమిశ్రితంబును, ఏలాలవంగాదిసుగంధద్రవ్యవాసనావాసితంబును నగు పుణ్యనదీజలమును స్వర్ణశంఖములలో నింపుకొని పురోహితుఁడు ఋత్విక్సహితుఁడై తూర్యాదిఘోషములు మంగళవాద్యములు చెలరేఁగుచుండ రాజునాయవాజసనేయమునభిషేకోక్తమంత్రోచ్చారణపూర్వకముగ సస్త్రీకుఁ డైన రాజును బూర్వాభిముఖునిగ నాసీనుం జేసి యతని యుత్తమాంగముపైని కళ్ళలచేత నభిషేకము చేయించుచు అటుపిమ్మట సమామాత్యులు, బ్రాహ్మణులు, బంధువులు, నగరవాసు లందఱును నతనికిఁ బ్రోక్షింతురు. అనంతరము, పురోహితమంత్రిసామంతప్రకృతిప్రముఖు లందఱును గన్యకలతోపాటు సువస్త్రగంధమాల్యాలంకృతు లగు రాజదంపతుల లలాటసీమలందు కుంకుమాగరుకస్తూర్యాదిద్రవ్యమిళిత మైన తిలకముల నిట్టుదురు అప్పుడు రాజదంపతులశిరములపైని కిరీటములను బెట్టి ఛత్రచామరములు లోనగు రాజచిహ్నములను సమకూర్తురు అంత దుందుభివాద్యము లాలాపు స్వస్తివాచకములతోపాటు వేదమంత్రములు విప్రులు ఘోషించుచుండ స్వకీయుల క్రమాగతముగ నామధేయము నిడి 'నీవు రాజవు గమ్ము' అని ప్రభువుమీఁద శ్వేతపుష్పములను, లాజలను వఁగదజల్లుదురు తరువాత వందిమాగధులస్తుతిపాఠములు, బ్రాహ్మణులయాశీర్వాదపూర్వకజయజయధ్వానములు మిన్ను ముట్టుచుండ సామంతు లందఱును కానుక లర్పించి వందనములు చేయుదురు రాజును అందఱకును బహుమానము లొసఁగును పురోహితులకు భూరిదక్షిణ లొసంగఁబడును అటుపిమ్మట నశ్వము నధిరోహించి రాజు నగరప్రదక్షిణము గావించి వచ్చు నని అగ్నిపురాణమునందు వ్రాయఁబడియున్నది. ఇట్టి సందర్భములలో కొన్నికొన్నిసమయముల రాజ్యములోని ఖైదీ లందఱును విడుదల చేయఁబడుచుండిరి ఇది సర్వసాధారణముగాఁ జేయఁబడుచుండు నభిషేకవిధానము

ఇది పునరభిషేక మనియు, నైంద్రమహాభిషేక మనియు రెండు ప్రకారము లని యిదివఱకే వ్రాయఁబడినది. దేవతాధిపత్యము వహించుకాలమున నింద్రుఁ డీ విధి నభిషిక్తుఁ డగుటవలన దీని కీ పేరు కలిగినది. సార్వభౌమత్వమును వాంఛించు రాజునకుఁ బురోహితుఁ డీ క్రిందివిధానమున క్రియాకలాపమును జరిగింపవలయును

"అహం సర్వా జితీర్జయేయ మహం సర్వాన్ లోకాన్ విందేయ మహం సర్వేషాం రాజ్ఞాం శ్రైష్ఠ్యం ప్రతిష్ఠాం పరమతాం గచ్ఛేయం సామ్రాజ్యం భౌజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠ్యం రాజ్యం మహారాజ్య మాధిపత్య మహం సామంతపర్యాయీ స్యాం సార్వభౌమః సార్వాయుష ఆంతాదాపరార్ధాత్ పృథివ్యై సముద్రపర్యంతాయా ఏకరాట్"

ఏతన్మంత్రపఠనపూర్వకముగ తంత్రము నడుపఁబడును. న్యగ్రోధ, ఉదుంబర, అశ్వత్థప్లక్షముల పల్లవసహితముగ, రాజసూయ యాగమున కవసరము లయిన పదార్థములే ఇందు సేకరింపవలయును రెండు ప్రకారము లైన వరిగడ్డి, ప్రియంగు, యవలను అభిషేకజలములలో నుంపవలయును ఉదుంబరకాష్ఠనిర్మిత మైన సింహాసనము, కలశము, ఉదుంబరశాఖ మున్నగువానిఁగూడ సంసిద్ధము చేయవలయును సింహాసనమును యోగ్యమైన మంత్రముతో దానిని బఱచినమీఁద రాజును దానిపైని గూర్చుండఁబెట్టి రాజకర్త లుద్ఘోషములఁ జేయుదురు అంత పురోహితుఁడు వరుణమంత్రములఁ బఠించుచుఁ బరిస్రుత మైన యభిషేకజలమును నుదుంబరపల్లవములు, స్వర్ణపవిత్రముతోఁడ బదులాగున నృపశిరముపై నభిషేకించును అంత రాజుచే నమస్కరింపఁబడి సురల నతఁడు సురాపాత్రము నృపున కొసంగును. పైని వచించిన రాజాభిషేకవిధానమున నభిషిక్తు లైనవారే.

పురవరాభిషేకమునుకూడ పైన వచించినలాగే జరుపఁబడును గాని యందుఁ గొంత వ్యత్యాసము గలదు. ఈ సంస్కారము నూతనముగ రాజు సింహాసనము నధిష్ఠించునపుడుగాక అభిషిక్తుఁడైనరాజు స్థానమునందు స్థిరముగ నుండుటనిమిత్తము రెండవపర్యాయమైనా లేక మూఁడవ నాల్గవ పర్యాయములందో చేయఁబడును గావుననే ఇది పురవరాభిషేక మని పిలువఁబడుచున్నది. ఈ సంస్కారమువలన రాజుయొక్క సామర్థ్యము మఱింత తేజోవంత మగును. ఇందుపయోగింపఁబడు నానావిధపదార్థములు రాజసూయయాగమునఁ జేయుట వలన నతనినుండి వెలుపడిపోయిన వివిధశక్తులను మరల నతనియందుఁ బ్రవేశింపఁజేయు నని విశ్వసింపఁబడియున్నది. ఈ యభిప్రాయము తోడనే ఇంద్రమహాభిషేక రాజసూయయాగములలో స్తుతింపఁబడిన సవితృదేవత యిచటఁగూడ స్తుతింపఁబడును. కార్యవిధానము చాల వఱకు ఐంద్రమహాభిషేకవిధానమునకు సమానముగనే యుండును. పైన వచించిన ద్రవ్యములతోపాటు ఎండలో కురిసిన వర్షజలము, తృణము, పల్లవములు, సుర, మార్వాలు, పుళులు మొదలగునవికూడ సంగ్రహింపఁబడును.

ఈ సంస్కారమునిమిత్తము కావలసిన వేది స్ఫ్యకాష్ఠముగాని నిర్మితఖడ్గముతో గీయఁబడియుండును. సింహాసనము సగము వేది లోపలను, సగము బయట నుండులాగున నమర్పఁబడును. పిదప వెలుపల భూమిపై నానించి సింహాసనముప్రక్క వాకిఁట నైన రాజు స్వహస్తములతో దానిని బట్టుకొని దాని నధిరోహించుటకును రాజ్యసుస్థితికి, సార్వభౌమప్రాప్తికిని దేవతాస్తోత్రముల నొనరించి తరువాత దానిపై నెక్కి కూర్చుండును. అంత పురోహితుఁడు పరిస్రుతజలములను ఉదుంబరశాఖాంతర్గతములై యతనిమీఁదను జను లావునఁ బ్రోక్షించి సురాపాత్రమును రాజున కొసంగ నతఁడు దానిలోఁ గొంతభాగమును ద్రావి మిగిలినదానిని దనమిత్రున కిచ్చును. పిదప నా యుదుంబరశాఖలమీఁదఁ బాదముల నిడుచు రాజు క్రిందికి దిగివచ్చి పూర్వాభిముఖముగఁ దిరిగి ముమ్మాఱు 'నమో బ్రహ్మణే' అని యుచ్చారణము సేయును. అనంతర మతఁడు పురోహితునకు దానము నొసంగి యక్కడినుండి లేచి విజయాభిలాషియై యగ్న్యాగారము ద్రవ్యములనైచి మఱికొన్ని యాహుతిద్రవ్యేంధనములఁ జేత నిడుకొని పూర్వోత్తరదిశగా, నుఁగా నపరాజిత మను నింద్రప్రదేశమునకై ప్రగమించి తేజమునకొఱకు, విజయమునకొఱకు మూఁడడుగులు నడచిపోవును. పిట్టదివరకు గృహమున కేగి దాని వెనుకటిభాగమునఁ గూరుచుండి యుండఁగాఁ బురోహితుఁడు గవాక్షప్రజాభ్యుదయమునకై ప్రార్థనముల సలుపుచు సురాపాత్రమునుండి యాహుతుల నొసఁగును. తక్కిన విధి యంతయుఁ బూర్వోక్తరీతిగనే జరుగును.

**అభిసారము** — కాశ్మీరమునకు సమీపమునం దుండిన యొకదేశము (భార, సభా, అ. ౨౭).

**అభిసారిక** — స్వాధీనపతికాదు లను అష్టవిధశృంగారనాయికలలో నిది యొకర్తె. అభిసరించునది యభిసారిక, అనఁగాఁ ప్రియునిగూర్చి సంకేతస్థలమునకుఁ బోవునది స్త్రీ. అట్లే యభిసరింపఁ జేయు వనితకూడ నభిసారిక కావచ్చును. తా నొకసంకేతస్థానమున నుండి తా నున్నస్థానమునకు 'ప్రియుని రప్పించుకొను నాయిక, కాన అభిసరతీత్యభిసారికా, అభిసారయతీత్యభిసారికా' అని రెండువిధములుగ నర్థము చెప్పవచ్చును.

**అభిసారిపురి** — అభిసారదేశమునకు రాజధాని. ఇచ్చటిరాజు చిత్రసేనుఁడు (చూడుఁడు చిత్రసేనుఁడు).

**అభూతరజస్సు** — రైవతమన్వంతరంబునం దుండెడి దేవతావిశేషము.

**అభ్రకము** — ఇది శిలాపరివర్తనమందు ఖనిజములను దాయము ఇగి యనేకప్రదేశములందు దొరకును. వీనిలోఁ గొన్ని వ్యాపారమునకు ముఖ్యమైనవి. మస్కొవైట్ (Muscovite), బయోటైట్ (Biotite), ఫ్లోగోపైట్ (Phlogopite), లెపిడొలైట్ (Lepidolite) నామకాభ్రకము లీసముదాయమునందు ప్రధానమైనవి. ఇది ఇంగ్లీషులో 'మైకా' యనియు, జర్మనీలోఁ దళుకు అర్థముగల 'గ్లిమ్మర్' అనియు పిలువఁబడును.

ఖనిజశాస్త్రీయలక్షణములు — పొరలుపొరలుగ ఒకపైన ఒకటి మిక్కిలి సులభముగఁ జీలుటయు, మిగుల పలుచనైన రేకులుకూడ గట్టితనము గలిగి రెట్టువైపు వంచిన నటువైపు వంగుటయు, కొట్టు వంచినను మరల పూర్వస్థితినే పొందుటయు ననునవి అభ్రకమునందలి విలక్షణములు. ఒకపేపళుప్రన నివి యన్నియు స్ఫటికములుగ ఘనీభవించుచుండును గాని తఱుచుగ చతుష్ఫలకములుగను, సమచతురస్రములుగను అచ్చుకట్టుటయుఁ గలదు. ఈ అచ్చులు సాధారణముగా షట్ఫలకములవలెఁ గాని, చతురస్రములపెట్టెవలెఁ గాని, పలకలవలెఁగాని, త్రిపార్శ్వములవలెఁ గాని యేర్పడి ౬౦-౧౨౦ అంశముల సరళకోణములు (Plane Angles) గలిగియుండును. అడుగుమట్టుపలకలు తప్పఁ దక్కినపార్శ్వములు స్నిగ్ధములై పరివృత్తములైన యాకృతులు గలిగియుండవు. వివిధప్రకారములగు అభ్రకములును సమాకారమును, అంతర్భాగమున సమానములు కోణములను గలిగియుండును. అభ్రకస్ఫటికములు తఱుచుగా కలిసి మెలసి సమాంతరస్థితిలో పెంపొందుచుండును. సంపూర్ణముగ వికాసమును బొందినది పెనూవియన్ నందలి బయోటైట్ అభ్రకము. అభ్రకపురేకుమీఁదను మొక్కపోయిన సూదితో పొడిచినయెడల 'సూత్రకృతి' (Percussion Figure), అనఁగా, షట్కిరణనక్షత్రమువంటి గురు తేర్పడును. ఈకిరణములు సరాసరి ౬౦ అంశముల కోణములందు సంధించుచుండును. ఇందు బాగుగ వికసించినకిరణము అభ్రకస్ఫటికపుసరళ సమ్మితాకారమునకు సమాంతరముగ నుండును. అభ్రకపురేకుమీఁదను మొక్కపోయిన అరసు కొక్కుదు బోయినచో పైని వచించినషట్కిరణమువంటి గురులు వెనుకటిదానికిరణముల నడిమికోణములను సంధించులాగున నేర్పడును.

విశేషంబులచే విదేశీయ వస్తువనియు ప్రాచీనరసతంత్రకారు లెంచి గినట్లు తోచుచున్నది. అభ్రకము నందు సయికము లోహమువంటిపదార్థ మొకటి గల దనియు, అయ్యది రసగ్రాసకర్మమందు ప్రధానం బనియు, అట్టి సత్త్వము గ్రహించి దానిని భస్మము గావించి సేవించిన సర్వరోగములు శమించు ననియు వివరింపబడియున్నది. తదనుసారంబుగా నధునాతన రసాయనతంత్రవేత్తలు అభ్రకమును పరిశోధించి యందు మగ్న శైలికము (Silicate of Magnesia), లోహము (Iron) విశేషముగాఁ గల వని సిద్ధాంతము చేసియున్నారు. ఆయుర్వేదమునందు వివరింపబడిన అభ్రకసత్త్వపాతనప్రకారము లీక్రిందఁ గొన్ని వివరింపబడును. ధాన్యాభ్రకంబును నీటిప్రబ్బలిరసముతో నయిదు మాఱులు భావనచేసి పిమ్మట నయిదుపుటంబు లిడిన భస్మంబగును. ఆభస్మంబును కొలిమిలోనుంచి యూఁదిన నిర్మలంబై కిట్టరహితమై లోహంబుతో సమంబగుచుండు సత్త్వ మందుండి వెలువడును. (రసహృదయతంత్రము)

అభ్రకఖండములను మెత్తగాఁ జూర్ణము గావించి యాచూర్ణమునకుఁ గంగ్, అడవికందరసము అరఁటిగడ్డరసము — వీనితోఁ బ్రత్యేకముగ నొక్కొక్కదినము భావనచేసి యనంతరంబున నీయభ్రకపు చూర్ణంబులో నాలవపాలు టంకణము, చిటుచేపలు — వీనిని గలిపి మాత్రే పిమ్మట మహిషీఘృతము (బఱ్ఱెనేయి)తోఁ గలిపి ఉండలుగాఁ జేసి ఎండఁబెట్టి పిమ్మట మూసయందుంచి కొలిమిలో నూఁదిన లోహతుల్యంబగు సత్త్వంబు పూసలుపూసలుగా మూసయందు పడును. అట్టి పూసలను గ్రహించి మిత్రపంచకము (నేయి, తేనె, గుగ్గిలము, గురువెందత్తులు, టంకణము) తోఁ గలిపి మరల మూసయందుంచి కొలిమిలో నూఁదిన నాపూస లన్నియు కంచుపోలెఁ గరఁగి ఏకంబగును. (ఆయుర్వేదప్రకాశము)

అభ్రకద్రుతి — ద్రుతి యనఁగా ఖనిజపదార్థములు ప్రక్రియావిశేషంబులచే శాశ్వతంబుగ పారదమువలె ద్రవీభావమును జెంది యుండుట. రసాయనతంత్రములలోఁ బ్రతిగ్రంథకారులును ప్రతి ఖనిజపదార్థమునకును ద్రవీకరణప్రక్రియలను దెలిపియున్నారు. ఇట్టి ద్రుతి ప్రాచీనగ్రంథకర్తలు నిజముగాఁ జేయఁగలిగిరా యనుసందేహము బాధించుచున్నది. ఏలయనఁగా రసరత్నసముచ్చయకారుండగు వాగ్భటుఁడు ఇట్టిద్రుతిని చేయుటకై యనేకపరిశోధనలం జేసియు నందు కృతార్థుండు కానేరక ఇట్లు వచించియున్నాఁడు 'ద్రుతి ప్రక్రియలు శాస్త్రములం దనంతములుగ వివరింపబడియున్నవి అయినను అట్టి ద్రవీకరణసామర్థ్యంబు పరమేశ్వరానుగ్రహంబు లేకున్న దుర్లభంబు. అభ్రకద్రుతిప్రక్రియలలో నొకటి యీక్రింద వివరింపబడును.

ధాన్యాభ్రకమును అవిసియాకులరసముతో మర్దన చేసి, ఆ ముద్దను అడవికందగడ్డలో నుంచి పైని మన్నుతో లేపనముచేసి పశువులు వసించుచోటునందు బారెడులోతుగ గోమూత్రపుయాగోతియందు, ఆపదార్థపుముద్ద నునిచి గోతిని పూడ్చి నెలదినము లుంచినపిమ్మట తీసిన నా యభ్రకంబు పాదరసమువలె శాశ్వతద్రవీభావమును జెంది యుండును (ఆయుర్వేదప్రకాశము)

అభ్రకగుణములు, యోగములు — భస్మరూపంబుగఁ బరిపాకింపఁజేసిన యభ్రకంబుగాని, యట్టి భస్మముచే నిర్మింపబడిన యౌషధంబుగాని నరులకు బలమును గలుగఁజేయును. వీర్యమును వృద్ధిపొందించును. పాండురోగము, కామిల, మూత్రరోగములు, గ్రహణి, అతిసారము, ప్లీహోదరము, పురాణజ్వరములు, క్షయ — వీనిని తొలఁగించును. ఇయ్యది ప్రధానంబుగా ప్రమేహరోగంబున స్వతంత్రశక్తి గలిగియున్నది. ఇంతియకాక ఇతర ఖనిజపదార్థసమ్మిళితంబై యనేకరోగములఁ బాపును. అట్టి యోగంబులలోఁ గొన్ని క్రింద నుదాహరింపబడును.

జ్వరాశని రసము — శుద్ధిచేసిన పాదరసము, శుద్ధగంధకము, సైంధవలవణము, శుద్ధిచేసిన వత్సనాభి — వీనిని సమముగ గ్రహించి యామొత్తమునకు సమముగ లోహభస్మము, లోహభస్మమునకు సమముగ నభ్రకభస్మము గలిపి మొత్తముగ నీయౌషధములు ఖల్వములో వైచి వావిలియాకురసముతో బాగుగ మర్దన చేసి పిమ్మట నందు పాదరసమునకు సమముగ మిరియపుచూర్ణమును గలిపి రెండుయవల (2 Grains) ప్రమాణముగ తమలపాకులరసముతో నిచ్చిన సర్వజ్వరములు నశించును. ప్లీహోదరము శమించును (వైద్యజ్వరరత్నావళి).

అర్జునాభ్రకము — వేయిపుటంబులు వైచిన యభ్రకభస్మమును మద్దిపట్టకషాయములో నేడుదినములు భావనచేసి ఎండించి పిమ్మట రెండు యవల ప్రమాణముగ నుపయోగించినచో హృద్రోగమును శమింపఁజేయును. అతిసారము, రక్తపిత్తము, అగ్నిమాంద్యము మున్నగు రోగముల వణంచును (రసేంద్రసారసంగ్రహము)

గళితకుష్ఠారిరసము — శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, లోహభస్మము, శుద్ధిచేసిన గుగ్గిలము, చిత్రమూలము, శిలాజిత్తు, శుద్ధిచేసిన విషముష్టివిత్తులు, త్రిఫలములు — ఇయ్యవి ఒక్కొక భాగము, అభ్రకభస్మము నాలుగుభాగములు, కానుగవిత్తులు నాలుగుభాగములు — ఇటులు వీనిని ఖల్వములో వైచి తేనె, నేయి — వీనితో ప్రత్యేకముగ మాత్రే ఒక నేతిపాత్రయం దుంచి కర్షప్రమాణముగ సేవించిన దారుణంబగు కుష్ఠరోగము శమించును. ఈయౌషధంబును సేవించునపుడు పరిపథ్యంబు అన్నము, పాలు, తేనె, నెయ్యి, చక్కెర — వీనిమాత్రము సేవింపవలెను. స్త్రీసంయోగమును వర్జింపవలయును (భావప్రకాశము).

అనుపానవివరణము — మంచియభ్రకభస్మంబు అనుపానభేదంబులచే ననేకరోగములను నశింపఁజేయును. అభ్రకంబును పసుపు, పిప్పళ్లు, తేనె — వీనితో సేవించిన ప్రమేహంబులను, కరకకాయ, బెల్లము, ఏలకులు, చక్కెర — వీనితో సేవించిన రక్తపిత్తమును, ఏలకులు, పెద్దపల్లేరు, నేలయుసిరిక, చక్కెర, ఆవుపాలు — వీనితోఁ

(౧౦-౧౫) మఱియు యాజ్ఞవల్క్యుఁడు షష్ఠభాగమును (౧-౫-౩౩౮,౫,౭), ఆపస్తంబుఁడు దర్ధభాగమును, గౌతముఁడు దశమభాగమును గాని, అష్టమభాగమును గాని, షష్ఠభాగమును గాని (౧౦-౫-౨౪), బోధాయన (౧ ౧౦-౧౫ ౧), నారద (౧౮-౫-౪౮) విష్ణువులు (౩-౫ ౨౨) షష్ఠభాగమును పుచ్చుకొనుట కధికారము గల దని ధర్మశాస్త్రములయందు వ్రాసియుండిరి మఱియు మనుస్మృతియం దేయేస్థితియం దిట్లు రాజునకు భాగగ్రహణము నధికారము గలదో, ఎట్టియవసరములయం దింతకంటె నెక్కువగాఁ బుచ్చుకొనుట కధికారము గలదో, ఎట్టిసమయములయం దేభాగమును బుచ్చుకొనక యూరకుండవలయునో, ఎట్టియట్టికాలములయందగు శిక్షావిధిగా పన్ను వసూలు చేయుటకు రాజున కధికారము గలదో సవిస్తరముగాఁ జెప్పఁబడినది (అ ౭, ౮, ౧౦) భూమి పన్ను విషయమున వింత సవిస్తరముగాఁ జెప్పఁబడినను హిందూ ధర్మశాస్త్రములయం దెక్కడను నేభూస్వామివలననుండి భూమిని తీసికొనుటకుఁ గాని, యట్టిభూమిని మఱియొకని కిచ్చుటకుఁ గాని రాజున కధికార మున్నట్లు చెప్పఁబడియుండలేదు కాని మహమ్మదీయరాజులపరిపాలనకాలమందు పన్నీయని భూస్వాములయొద్దనుండి భూమిని దీసికొని మఱియొకని కిచ్చుస్వాతంత్ర్యపద్ధతి యేర్పడినది మహమ్మదీయులపరిపాలనకాలములో భూమిపైని పన్నెక్కువ సేయఁబడినకారణమున భూస్వాములు భూములను వదలిపెట్టుచుండిరి, నట్లు విడుదల చేయఁబడినభూములను దమపన్నులకు మహమ్మదీయరాజు లితరులకు సేద్యమునిమిత్త మిచ్చుటయుఁ దటస్థించుచుండెను కాని, హిందూధర్మశాస్త్రమునుబట్టి పన్నులకు గాను భూమిని జప్తు చేసి యితరుల కిచ్చుట గాని విక్రయ మొనర్చుట గాని వాడుకలో నున్న ట్లెక్కడను గానరాదు

## ఇటీవలి ధర్మశాస్త్రటీకాకారులు

పయిని వ్రాసినవిషయమునుబట్టి హిందూ ధర్మశాస్త్రములయం దెచ్చటను రాజునకు భూమియం దగు సంపూర్ణస్వాతంత్ర్యాధికార మెన్నఁడును గలిగియుండలే దనియు, నట్టియధికార మెన్నఁడును జెలాయించియుండలే దనియు స్పష్టము మగుచున్నది పైని తెల్పిన జైమినిమతము ననుసరించియు రాజునకు భూమియందు సర్వాధికారము లేనట్లే కన్పించుచున్నది కాని జగన్నాథతర్కపంచాననుఁడుమాత్రము భిన్నాభిప్రాయము నిచ్చియున్నాఁడు. ౧౭౭౩-వ సంవత్సరమునందు సర్ విలియమ్ జోన్సు అను నాతఁ డతని నడుగఁగా రాజునకు సర్వస్వాతంత్ర్యాధికారము భూమియందుఁ గల దని యభిప్రాయ మొసఁగెను ఇందులకు జగన్నాథతర్కపంచాననపండితుఁడు, పరశురాముఁడు క్షత్రియనిర్మూలనము జేసి భూమి యంతయుఁ గశ్యపునకు ధారవోసినట్లును, అందువలనఁ గశ్యపుఁడు సర్వస్వాతంత్ర్యాధికారము గలిగి భూమి ననుభవించినట్లును, నాయధికార మంతయుఁ దరువాత రాజులకు సంక్రమించినట్లును, నందువలన రాజులే భూమియందు సర్వస్వాతంత్ర్యాధికారము గలవా రగునట్లును పరశింహాసురాగమునుండి యొకయుక్తిని పన్నెను కాని శ్రీకృష్ణ తర్కాలంకారుఁ డిందులకు సమ్మతింపక భూమి జంతువులయాధారముకొఱకు సృజింపఁబడిన దగుటవలన భూమియం దన్ని జంతువులకును స్వాతంత్ర్యము గల దనియు, ప్రజలను సంరక్షించినకారణమును బట్టి రాజునకుఁ గొంతపన్ను బుచ్చుకొనుటకుమాత్రమే అధికారము గల దనియు, నీయంశము భాగవతపురాణమునందును, మనుస్మృతియందును జెప్పఁబడియున్న దనియుఁ జెప్పి జగన్నాథపండితుని సిద్ధాంతమును ఖండించెను వీని నన్నింటినిబట్టి చూడఁగా హిందూసిద్ధాంతమునుబట్టి రాజునకు సేద్యములో నున్న భూమియందు సర్వస్వాతంత్ర్యాధికారము లేదనియు, హిందూరాజు లెన్నఁడు నట్టియధికారమును జెలాయించుకొనలే దనియుఁ గనిపించుచున్నది

## మహమ్మదీయుల సిద్ధాంతము

మహమ్మదీయశాస్త్రము ననుసరించి యీవిషయమున కొంతవఱకు భిన్నాభిప్రాయము లున్నట్లు పైనే వ్రాయఁబడినదిగదా

హిందూదేశముపైకి మహమ్మదీయులు కొండపర్వతములు దాఁటి వచ్చినట్లును, ఉత్తరహిందూస్థానము నాక్రమించుకొన్న విధముగఁ గాకపోయినను దక్షిణహిందూస్థానమును గూడ జయించి స్వాధీనపఱచుకొన్నట్లును చరిత్రలు తెలుపుచున్నవి క్రీ శ ౧౩౦౦ సంవత్సరములో అల్లాఉద్దీను దక్షిణహిందూదేశమును సంపూర్ణముగా జయించెను క్రీ శ ౧౩౮౪ వ సంవత్సరములో కృష్ణానదికుత్తరమున గల దేశము మహమ్మదీయులయధికారమునకు లోఁబడెను రాజునకు భూమియం దధికార మున్న దనుసిద్ధాంతము మహమ్మదీయులది గాని హిందువులది గాదు బలవంతముగా జయింపఁబడినదేశమును ఇమామ్ సెలవుప్రకారము పంచిపెట్టుటకుఁ గాని, అంతకుఁబూర్వ మున్న భూస్వాముల స్వాధీనమునందే యుండనిచ్చుటకుఁ గాని రాజునకు స్వాతంత్ర్యముగల దని మహమ్మదీయులయభిప్రాయము జజియత్తు అను తలపన్ను గాని, ఖిరాజ్ అను భూమిపన్ను గాని విధించి పూర్వపు భూస్వాములచే భూమి ననుభవింపనిచ్చుచుండిరి ఉషర్ అను పన్నుమాత్రము మహమ్మదీయులవలననే వసూలు చేయుచుండిరి హిందూదేశమున, అబూహానీఫాసిద్ధాంత మిదియే ఈసిద్ధాంతమునే మన దేశమునందు మహమ్మదీయు లనుసరించిరి ఇతరమహమ్మదీయశాస్త్రసిద్ధాంతమునుబట్టి జయింపఁబడినదేశమునందలి సేద్యమందున్నభూము లన్నియు నాయాభూస్వాములయనుభవములో నుండనిచ్చినను వాని యందలి సంపూర్ణాధికారముమాత్రము రాజుదే యని కనిపించుచున్నది, ఇక జగత్ అనుభూమిపన్ను అతిసులభమైనది గనుక నాశాఫి మానమునుబట్టి యిది మహమ్మదీయులకుమాత్రమే విధించిరి ఖిరాజ్ అనుపన్ను బలువైనది ఇది మహమ్మదీయేతరులకు విధించిరి మహమ్మదీయులకుఁగూడఁ గొన్నిచోట్ల ఖిరాజ్ అనుపన్ను విధించుట సంభవించినది ఈఖిరాజ్ అనుపన్ను సేద్యము చేయఁబడినభూమి నంత

టకు భూములు చేయవలయును అని అల్లాఉద్దీను మొదలైన మహమ్మదీయ ప్రభువు లనేకపర్యాయములు ప్రయత్నించిరి కాని అంతకుఁ బూర్వము హిందూరాజులకాలములో వాడుకలో నున్న విధముగా భూమియొక్క ఫలసాయములోఁ గొంతభాగముమాత్రమే పన్నులు చేయఁగలుగుచుండిరి తరువాత షేర్షా సలీమ్ షాల్ అనువారు ఫలసాయములో భాగమునకు మారుగా రొక్కము పుచ్చుకొను పద్ధతి కల్పించిరి

పిమ్మట, అక్బరుపాదుషాకాలములో సేద్యము చేయఁబడు భూమియొక్క విస్తీర్ణమును, ఫలమును యోజించి న్యాయ్యమైన ఖిరాజ్ పన్ను వసూలు చేయుపద్ధతి యేర్పడెను ఇట్లు మహమ్మదీయప్రభువులు ఖిరాజ్ ను వసూలు చేయుచున్నను, దీని నిచ్చుచున్నంతవఱకు భూమిని లాగికొనుటకుఁగాని, అట్టిభూమిని మఱియొకరి కిచ్చుటకుఁగాని అధికారము కలిగి దానిని చెలాయించినట్లు కనుపడదు అట్టిభూమి లితరుల కిచ్చినప్పుడు తమకు వచ్చుచున్న పన్నులు వసూలు చేకొనుటకుమాత్రమే అధికారము పొందినట్లును, భూమియందు సర్వస్వతంత్రాధికారము పొందనట్లును కన్పించుచున్నది ఈవిషయమునుబట్టి యోజింపఁగా భూమిపైని స్వతంత్రాధికారవిషయమున హిందూమహమ్మదీయమతములకు భేదమంతగాఁ గానిపింపదు కాని హిందూరాజులకాలమందువలెఁ గాక తురక రాజులప్రభుత్వమందు భూమిపన్ను మిక్కిలిగా హెచ్చింపఁబడుటచేత భూస్వాములు భరింపఁజాలకుండిరి ఇంతేకాక, పలాస్ అనుపరగణాలు ఔరంగజేబును, అక్బరాబాద్, ఇలహాబాద్ అనుకోటలు కట్టుటకొఱకుఁ గొన్ని భూములు అక్బరుపాదుషాయును, షాజహానాబాద్ కోట కట్టుటకుఁ గొన్ని భూములను షాజహానును, ఔరంగాబాద్ అనుకోటను గొన్ని మసీదులను గట్టుటకుఁ గావలసినభూమును ఆలంగీర్ పాదుషాయును భూస్వాములయొద్దనుండి కొనుట చూడఁగా మహమ్మదీయులకాలమందుఁగూడ రాజులకు భూమియందు సర్వస్వతంత్రాధికారము లేనట్లు గ్రహింపవలసియున్నది

## బ్రిటిషు అధికారులయభిప్రాయము

మహమ్మదీయులు హిందూదేశమును జయించినప్పటికిని అంతకుము న్నున్న పద్ధతులను, వ్యవహారాచారములను సంపూర్ణముగా మార్చినదిలేదు క్రొత్తక్రొత్తవ్యవహారపద్ధతుల నేర్పఱుపలేదు తరువాత నాంగ్లేయప్రభుత్వ మారంభమైనప్పుడు మొదట నాంగ్లేయదేశవ్యవహారపద్ధతి ననుసరించి భూమియందలి సర్వస్వతంత్రాధికారము రాజులదే యని యుద్దేశించిరి మహమ్మదీయప్రభువులకాలమందు భూమిపన్ను ఎక్కువ చేయఁబడుటవలన సేద్యము చేయుటయందు లాభము లేక కొందఱును, పేదపడి కొందఱును భూములను వదలుచుండుట తటస్థించినది అట్టిభూములపై సిస్తు రాకపోవుటవలన సర్కారునకు నష్టము వచ్చు నని వాని నితరులకు నమర్చుట సంభవించుచువచ్చినది

మఱియు జనసంఖ్య హెచ్చుటచేతను, సేద్యము చేయుటకుఁ గ్రొత్తభూములు కావలసివచ్చుటచేతను, ఎన్నఁడును కృషి లేక బంజరుగా నున్నభూములను పన్ను కట్టి కొందఱు తీసికొనుచుండుట సంభవించుచువచ్చినది ఈ సందర్భమునుబట్టి ఆంగ్లేయులు మహమ్మదీయప్రభువులకు సర్వస్వతంత్రత భూమిపైని గల దనియు, వారు హిందూరాజులవ్యవహారపద్ధతులను సంపూర్ణముగా మార్చియుండరో పోవుటవలన వారికిఁగూడ నట్టిస్వాతంత్ర్యమే యుండిన దనియు నభిప్రాయపడి యుండవచ్చును

ఇంగ్లండునందలి పూర్వపుఁబద్ధతిప్రకారము రాజే భూమి యంతకును ప్రభువు కావున హిందూదేశమునందు నట్టిపద్ధతియే యున్న దనుకొని ధ్రువపడి క్రీ శ ౧౮౬౫ వ సంవత్సరమునందు మద్రాసుప్రభుత్వమువా రట్టియభిప్రాయమును దెల్పిరి[1] కాని రెవిన్యూబోర్డువారు వెంటనే యాయభిప్రాయము సరియైనది కా దని తెలిపిరి[2] హైందవు లయిన రైతులహక్కులనుగుఱించి మిక్కిలి వ్యతిరేకాభిప్రాయముగల సర్ థామస్ మన్రోకంటివాఁడు గూడ 'హిందూదేశమున భూమిభాగము దన్నుదియ దానికైనను చెల్లునదని రైతునకే చెల్లును ఆతఁడు భూమియందలి హక్కు లన్నియు దొరతనమువారితో సమానముగఁ బంచుకొనును దొరతనమువారికి లేనిహక్కు లాతనికి భూమియందుఁ గల్గును ఎప్పుడు వచ్చినప్పుడు గాని, కొన్ని సంవత్సరములకుఁ గాని వానిని వదలఁగొట్టుటకు వీలు లేదు ఇంకొకఁ డెక్కువసిస్తు ఇచ్చెద నన్న వానిని వదలఁగొట్టుటకు వీలు లేదు' అని చెప్పియున్నాఁడు ఇందును గుఱించి కేమ్బెల్ స్టూవర్టు మిల్ ఈ విధముగ వ్రాసియున్నాఁడు — 'రైతునకు భూమియందు స్వత్వ మున్న దనుటకు సందేహము లేదు. కాని యాస్వత్వ ముపాధిసహితము ( with a limitation) దొరతనము వారికి భూమియందు స్వత్వ మున్న దనుటకు సందేహము లేదు కాని, యదియు నుపాధిసహితమే రైతుస్వత్వమునకు దొరతనము వారి స్వత్వము ఉపాధి, దొరతనమువారిస్వత్వమునకు రైతు స్వత్వము ఉపాధి'[3]

భూమియొక్క స్వామ్య మెవరిది యన్న విషయమునుగుఱించి భేదాభిప్రాయము లన్నియు నాలోచించి మద్రాసు గవర్నమెంటువారీ క్రిందితీర్మానమును జేసిరి

---

1 Mirasi papers, 26

2 Mirasi papers, 88.

3 As quoted in Srinivasaraghava Iyengar's Forty year'sProgress of the Madras Presidency, p. 57.

క్రిందికి రైతులకు భూమిలో శాశ్వతహక్కు మ లేదనెడిసిద్ధాంతమే యిప్పటికిని సర్వత్ర అంగీకరింపఁబడుచున్నది.

రాజు భూస్వామితోఁ గాని, భూస్వామి సేద్యగానితోఁ గాని భూమిపన్ను విషయమునఁగాని, ఫలసాయములోనిభాగము విషయమునఁ గాని, అట్టిభాగమునకు సరియైన ఖరీదుగల రొక్కము విషయమునఁ గాని జరుపుకొనుకేర్పాటే అమరకము. భూమిపన్ను నిర్ణయించు విషయములో ననేకవిధములగు నేర్పాటు లున్నవి. స్వామికిని భూస్వామికిని గాని, భూమికిని సేద్యగానికిని గాని కలసంబంధము లనేకవిధము లైనవి. ఇట్టిసంబంధభేదములంబట్టి క్షేత్రపతిత్వములు (Tenures) కూడ ననేకవిధము లైనవి. ఇందు, పన్నిచ్చుచు ననుభవించునవి కొన్నియు, పన్నీయనక్కఱ లేకుండ ననుభవించునవి మఱికొన్నియు నున్నవి.

## గ్రామము, గ్రామస్థులు, వారిక్షేత్రములు

నిలుకడ కలిగి యొకప్రదేశము నాక్రమించి యందు గృహములం గట్టుకొని మనుష్యులు కాఁపురము చేయుచుండు పట్టునకు 'గ్రామము' అని పేరు. ఇట్లు గ్రామమందు నివసించు గ్రామస్థులకును ఆగ్రామమునకుఁ గంగుపాటుగా నుండు భూమికిని గల సంబంధమును, గ్రామస్థులం దొండొరులకుఁ గల సంబంధమును, గ్రామస్థులకుఁ దాము సేద్యము చేయు భూమియందుఁగల హక్కును మనము విమర్శించి నిశ్చయింపవలసియున్నది. రివిన్యూశాఖాసంబంధమునకు గ్రామము ముఖ్యమైనది. కావున గ్రామముయొక్క విధములును, వాని యేర్పాటులును బాగుగాఁ దెలిసికొనుట యావశ్యకము. భూమిని బాగుపఱిచి సేద్యమున కర్హముగాఁ జేయుటకును, శత్రుమృగముల వలనిబాధలను తప్పించుకొనుటకును, అన్యోన్యసహాయ్యము చేసికొనుచు నొక్కగ్రామములోనివా రందఱును గలసి తమ క్షేమలాభములకై పాటుపడుట అత్యావశ్యకముగా నేర్పడినది. అందువలన గ్రామస్థు లందఱకు నొకవిధమగు స్నేహబంధమును స్థలాభిమానమును గలుగుట తటస్థించినది. హిందూదేశమందలి గ్రామముల స్వభావములను బరిశీలించినయెడల రెండువిధములుగా గ్రామములు విభజింపఁబడఁదగియున్నవి.

ఇందు, గ్రామములలోఁ గృషి చేయఁబడు క్షేత్రములు వేఱువేఱుగా గ్రామస్థులలో నొక్కొక్కనిహక్కుగా నెంచఁబడుచుండునవి యొకవిధమైనవి. ఇట్టిగ్రామములు రైతువారీగ్రామము లని చెప్పఁబడును. ఇట్టిగ్రామములలోని గ్రామస్థులు ప్రత్యేక క్షేత్రములు (వేఱువేఱుపాలములు) కృషి చేసికొని యొకరితో నొకరు సంబంధము లేనట్లున్నను దమక్షేమలాభములకొఱకుఁ దమలో బలవంతుఁ డగువా నొక్కని గ్రామాధికారిగా నెన్నుకొని యతనికి లోఁబడి గ్రామస్థులవలన నేర్పడుటకుఁ గొందఱు గ్రామసేవకుల నేర్పఱచుకొని సుఖముగా నుందురు. ఈ గ్రామాధికారిని పటేలు, లంబార్దారు, రెడ్డి, పెత్తనదారు మొదలగు పేర్లతోఁ పిలుతురు. ఇట్టిరైతువారీగ్రామములు మదరాసు, బొంబాయి, బీరారు రాష్ట్రములయందును, మధ్యపరగణాలయందును విస్తారముగా నున్నవి. మధ్యపరగణాలలోని గ్రామములస్వభావము తర్వాత మార్పుఁ జెందినను ప్రథమమున నిట్టిదియే యని నిశ్చయింపవలెను. బంగాళ రాజధానిలోని గ్రామములుకూడ నిట్టివియే యైనను అనేక గ్రామములను గలిపి పరగణాలుగను, జమీందారీ స్టేట్లుగను నేర్పఱిచి జమీందారీసెటిల్మెంటు చేసియున్నందువలన నారాజధానియందలి గ్రామములస్వభావ మంత విచారణీయముగాఁ గనిపింపదు. ఇఁక రెండవతరగతి గ్రామములస్వభావము విచారింతము. ఒకఁడు గాని యొకకుటుంబమువారు పలువురు గాని, పరస్పరసంబంధబాంధవ్యము గల యొక్కతెగవారు గాని యొక్కచో గ్రామము నిర్మించుకొని యాగ్రామమునకు సంబంధించినభూమి యంతయు స్వాధీనభుక్తమైనదిగాఁ జేసికొని తిరువాత కుటుంబము వృద్ధియై జనసంఖ్య హెచ్చినప్పుడు పైభూమి యంతయు పిత్రార్జితమునవలె భాగములుగాఁ బంచుకొని యనుభవించుచుందురు. రెండవతరగతిగ్రామములు ఇట్టిగ్రామములలో గ్రామస్థు లందఱు నించుమించుగా సమానమైనహక్కు గలవారు. కనుక గ్రామాధికారి నొకనిని నియమించుకొని యతనికి లోఁబడియుండక వారందఱును గలసి యొకపంచాయతి నేర్పఱుచుకొని గ్రామవ్యవహారములు చక్కఁబెట్టుకొనుచుందురు. ఈ రెండవతరగతిగ్రామములు, 'ల్యాండులార్డువిలేజిలు' అని పిలువఁబడును. రైతువారీగ్రామములలో సేద్యములో నున్నభూమి యంతయు నన్యోన్యసంబంధము లేని వేఱువేఱు క్షేత్రములుగా వేఱువేఱు గ్రామస్థులభుక్తములో నుండును. ల్యాండులార్డువిలేజిలో సేద్యములో నున్నభూమి యంతయు గ్రామస్థులు తమతమతరములంబట్టి భాగములు గలిగి యనుభవించుచుందురు గాని యాభూమి యంతయు సంఘాధికారము గలదిగా నుండును. ఒకప్పుడు రైతువారీస్వభావముగల గ్రామము ల్యాండులార్డుగ్రామముగా మాఱుట గూడఁ గలదు. అది మరల రైతువారీగ్రామముగా నుండుట తటస్థించును.

ఇట్టిమార్పులు దక్షిణహిందూస్థానమునందలి గ్రామములలోఁ గలిగినవి. మదరాసురాజధానిలో చెంగల్పట్టు మొదలైన జిల్లాలలో నున్నగ్రామము లొకప్పుడు ల్యాండులార్డుగ్రామములస్థితియం దుండి మిరాసిగ్రామము లని పిలువఁబడుచుఁ దరువాత రైతువారీగ్రామము లైపోయినవి. ల్యాండులార్డుగ్రామములు పైని చెప్పినప్రకారమునకే కాక యితరవిధములుగాఁగూడ నగుచున్నవి. ఇట్టిగ్రామములు పట్టీదారీగ్రామము లనియు, భాయాచారాగ్రామము లనియు రెండువిధములు. ఈరెండువిధములలో లక్షణములు సంపూర్ణముగాఁ బట్టినవి కూడఁ గలవు. ల్యాండులార్డుగ్రామములయందు భూమిపన్ను న గ్రామస్థు లున్నభాగములబట్టి గ్రామము స్వతంత్రముగ వసూలు చేయఁబడుచుండెను. గ్రామములు నానావిధములు.

౧. ఒకరే అధికారిగాఁ గలవి వీనిని 'జమీన్దారీఖాలిస్' అందురు.

౨. అవిభక్తులైన కొంపఱభుక్తములో నున్నవి వీనిని 'జమీన్దార్ ముస్తారక్' అందురు

3 పూర్వస్థానుసార భాగములు (I ivided on ancestral shares) గలవి లేక పట్టీదారీ గ్రామములు

౪ సంపూర్ణలక్షణము లేని పట్టీదారీ గ్రామములు

గ్రామస్థులు తాము కేవలము భుక్తపఱచుకొనుచున్న క్షేత్రము పెట్టభూమిలో సెన్నవవంతో పెట్టగ్రామము క్రిస్తులో వన్నవవంతే సిస్తు నిచ్చుగ్రామములు రెండవతరగతిల్యాండులార్డు నిలేకీ గ్రామములు ఇవి రెండు విధములు

౧ భాయిచారా

౨ అసంపూర్ణ భాయిచారా

మదరాసు రాజధాని కాక హిందూదేశమున నితర ప్రదేశముల యందు గ్రామస్థులలో కొన్ని భేదము లున్నట్లు కన్పడుచున్నది అందు

(౧) 'ఖుద్ ఖాస్త్'[1] అనువారు — ఈ రైతులు ప్రప్రథమమున గ్రామమును నిర్మించినవారి సంతతిలోనివారు వీ రితర గ్రామస్థులకంటె యెక్కుడు స్వాతంత్ర్యము కలిగి యాస్వాతంత్ర్యము ననుస్రుతమగు నాచారమువలన ననుభవింపఁగలిగినవారు. వీరు స్వామిపన్నిచ్చునంతవఱకు భూమియందుండి తొలఁగింపఁబడకుండు వీ లగువారు కారు వీరికి తమభూముల నితరుల కిచ్చుటకుఁగాని యమ్ముటకుఁగాని యధికారము లే దని సర్ జాన్ షోర్ (Sir john shore), హారింగ్టన్ (Harrington) అనువారి యభిప్రాయము

(౨) పైఖాస్తు అనువారు — వీ రితర గ్రామములనుండి వచ్చి గ్రామమునఁ గాఁపురమున్నవారు వీరికి పై (ఖుద్ ఖాస్తు) రైతుల కున్న స్వతంత్రత లన్నియు లేవు. వీరికి ఖుద్ ఖాస్తు రయితుల కున్న హక్కు లన్నియు లేకపోయినను శాశ్వతముగా వంశపారంపర్యమగు హక్కుమాత్రము లేకపోలేదు. కాని గ్రామమునందు మొదటితెగవారి కుండుగౌరవముమాత్రము లేదు.

(3) పాయికారీ అనువారు — వీరు ప్రథమతరగతి రయితులభూములను సేద్యముచేసిపెట్టుటకు నితర గ్రామములనుండి వచ్చినవారు వీరిని భూములనుండి యిచ్చవచ్చినట్లు తొలఁగింపవచ్చును వీరికి భూములయం దేవిధమగు హక్కుగాని, గౌరవము గాని లేదు వీరు మొదటితరగతిరైతులకు సిస్తు చెల్లించుటలో 'పాయికార' రైతులు అంతదేశపు గ్రామములయందు భూములు 'వారపట్టు', 'తీరువాపట్టు', 'తరిసు', 'పోరంబోకే' అని నాలుగువిధములుగా విభజింపఁబడినట్లు కన్పించుచున్నవి. వారపట్టు అనఁగా ఫలసాయములో భాగ మిచ్చి సేద్యము చేయునది ఈవిధమైనవి సాధారణముగా పల్లపుసాగుబడికి అర్హమైనభూములు తీరువాపట్టు అనఁగా ద్రవ్యరూపకముగాఁ బన్నీయఁబడినది సేద్యమయిన బంజరు భూములు తోఁటలు నిట్టివి 'తరిసు' అనఁగా గయాళ్ సూములు ఇవి రెండువిధములు షేక్ కరంబో, అనఁగా సేద్యము చేయఁబడిన గయాళ్లులును, అనాదికరంబో అనఁగా సేద్యము చేయఁబడని గయాళ్లును 'పోరంబోకే' అనఁగా, సేద్యము చేయఁగూడనట్టి, సేద్యమునకుఁ బనికిరానిభూములు ఇందుఁ గొండలు, రాజమార్గములు, నదీప్రవాహ ప్రదేశములు, చెఱువులు, జలాశయములు, సముద్రతీరములు, మాలపల్లెలు మొదలైన ప్రదేశములు చేరును

## ఈనాములు, మాన్యములు వగైరా

తెలుఁగుదేశములోని గ్రామము లఱవదేశములోని గ్రామముల వంటివే అయియున్నవి ఇందుఁగూడ భూమి యంతయు సేద్యము చేయఁబడుచున్న భూమిగను, గయాళ్ సూమిగను విభజింపఁబడియున్నది. సేద్యముగుభూములు మాన్యములు, అనఁగా సర్కారువారిచే నీయఁబడుచున్న గృహస్థులు వనూలు చేసికొనుటకు హక్కు గలిగినవియు, 'ఇంద్రీగలు', అనఁగా సర్కారువారికిఁ జెందవలసిన పన్నులోఁ గొంతిభాగముమాత్రమనకే గృహస్థులు వసూలు చేసికొని అనుభవించుటకు హక్కు కలిగినవియు నని రెండువిధములు ఇందు మాగాణిభూము, లనఁగా పల్లపుపంట పండునవి ఈభూములలోఁ బండుపంటలోని సర్కారుభాగమునకు 'కోరు' అని పేరు రయితు భాగమునకు 'మేడిపా' లని పేరు. మెరక సూములపై అంతభూముల కరెన్సీ రొక్కపుసిస్తు వసూలు చేయఁబడుచున్నది మధుర, తిరునెల్వేలిజిల్లాలలోని గ్రామములకు 'కారె' అని పేరు ఈగ్రామములు మిరాశిగ్రామములవంటివే అయినను ఇందలి గ్రామస్థులహక్కులు కేవలము మిరాశిగ్రామస్థులహక్కులవంటివి కావు మఱియు సముదాయము లేక 'ఘసంకరే' అను గ్రామములుగూడ కలవు ఇట్టి గ్రామములలో గ్రామస్థు లనుభవించు భూమిభుక్తము 'ఫలభాగ' మనియు, 'ఆచంద్రార్కము' లేక 'అరుండికరే' అనియుఁ జెప్ప గ్రామసముదాయమువారు భూమియొక్క మంచిచెడ్డలనుబట్టి కొన్ని సంవత్సరముల కొకపర్యాయము పంచుకొనక భూస్వభావములు తెలిసినతరువాత మరల మార్పుకొనకుండ తమభూములను శాశ్వతముగా నుంచుకొనినప్పుడు అవి పైపేళ్లఁ బరఁగును ఇట్టిభూముల మీఁద సర్కారువ నీయఁబడవలసిన సర్కారుభాగ మాయాభూము లనుభవించువారినిరే అయియున్నది కావున నిట్టి గ్రామములు గ్రామసముదాయపుహక్కు గల గ్రామము లయినను రైతువారీగ్రామములస్వభావము గల గ్రామములలక్షణములే కలవి యైయున్నవి తంజావూరుజిల్లాలో 'ఏకభోగము' లేక 'యాజమాన్ గ్రామము' అను గ్రామములు గూడఁ గలవు. చెంగల్పట్టుజిల్లాలో నున్న మిరాశి గ్రామములమిరాశిదార్లు మిరాశిదార్లు కాని గ్రామస్థులకు దొరకవను

1. 'ఖుద్ ఖాస్త్' అనఁగా స్వయముగ వ్యవసాయము చేయువా రని యర్థము.

వచ్చిరి దక్షిణహిందూస్థానమునం దొక్కొక్కభాగమున నొక్కొక్క యాచార ముండెను కాని అంతట నొకేవిధముగ భూమిభుక్తముండలే దని పైనివ్రాసిన యంశములనుబట్టియే తెలియఁగలదు. ఆంధ్ర దేశమున నొకవిధముగను, తెలుంగు దేశమున మఱియొకవిధముగను మలయాళ, కన్నడదేశములం దింకొకవిధముగను నిట్లు ఒక్కొక్క ప్రదేశమున నొక్కొక్కవిధముగ భూమిభుక్తము వాడుకలో నున్నది

మద్రాసురాజధాని యంతయు నేకకాలమున నొకేవిధముగ నాంగ్లేయపరిపాలనలోనికి వచ్చియుండకపోవుటఁబట్టియు, నంతకు పూర్వమునం దున్నపద్ధతులనే సాధ్య మయినంతవఱకు ననుసరింపవలయు ననుతలంపుచేతను నొక్కొక్క భాగమున నొక్కొక్కవిధముగు అమరకపుఁబద్ధతు లేర్పఱుపఁబడినవి ఉత్తరసర్కారు లను గంజాం, విశాఖపట్టం, గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలయందు బంగాళదేశపు - అమరకపుపద్ధతి ననుసరించి 'శాశ్వత మునుజమీం దారీ-అమరకపుఁబద్ధతి' యేర్పాటు చేయఁబడెను మదరాసుపట్టణమునకు చుట్టుపట్ల నున్నదేశము ఆర్కాటునవాబువలన ౧౭౫౦, ౧౭౬౩ సంవత్సరములయందు దఖలుపడి యుండుటవలన ఆ ప్రదేశమునందలిజిల్లాలయందు అంతకు పూర్వమునం గున్నపద్ధతి ననుసరించి 'జాగీరు' పద్ధతిని అమరకము చేయఁబడెను. ౧౭౮౩-వ సంవత్సరమున టిప్పూసుల్తాను ఓడిపోయినతరువాత బారామహాలును సేలముజిల్లాయు మలబారు కెనరా ఆంగ్లేయులయాధీన మైనవి టిప్పుసుల్తానుతో రెండవయుద్ధ మయినతరువాత కన్నడదేశమును కోయంబత్తూరుజిల్లాయును వచ్చినవి ౧౮౦౦-వ సంవత్సరమున హైదరాబాదునవాబుతో జరిగినసంధి ననుసరించి తుంగభద్రాకృష్ణానదులకు దక్షిణమునం గున్నప్రదేశ మంతయు నాంగ్లేయులయాధీన మయినది ౧౮౦౧-వ సంవత్సరములో ఆర్కాటునవాబునకు కర్ణాటదేశమునం దున్నరాజ్య మంతయు నాంగ్లేయులయాధీన మైనది. ఇట్లనేకపూర్వ రాజులనుండి యనేకవిధములుగ నాంగ్లేయుల కధీనపడిన యీప్రదేశములయందు ననేకవిధములుగు నమరకపుఁబద్ధతు లేర్పాటు చేయవలసి వచ్చినవి

## పాలెగాండ్రు

ఉత్తరసర్కారు లని పిలుపఁబడు ప్రదేశమునందు మహమ్మదీయప్రభువులవలనను, అంతకు పూర్వపుహిందూరాజులవలనను చెందఁబడిన భూములు గాని, అట్లు భూములు చెందినభూస్వాములవలనఁ జెందినభూములు గాని యనేకము లుండుటవలన వీనినియమమున నాంగ్లేయప్రభుత్వమువారి కొకవిధముగు అమరకము చేయవలసిన యవసరము కలిగినది భూస్వాములవలనఁ జెందఁబడిన భూములు కలవారిని 'పాలెగాండ్రు' అని పిలుతురు వీరు మూఁడువిధములుగా నుండినవారు

౧ పూర్వము రాజ్యము లేలినవిజయనగరము, కాంచీపురము, మధుర మొదలగుదేశాధీశులసంతతిలోనివారు కొందఱు

౨ పూర్వపురాజులయొద్ద సేనాధిపతులుగా నుండి మహమ్మదీయులదండయాత్ర నడ్డగించుకొని స్వశక్తివలనఁ గొంతదేశమునకు నాయకులై తరువాత నాయాప్రదేశములకుఁ బ్రభువులుగా నంగీకరింపఁబడినవారు కొందఱు

౩ జిల్లా కధికారులుగ నుండి కాలక్రమమున మహమ్మదీయుల యధికారమునకు లోఁబడక స్వతంత్రులై ఆయాజిల్లాలపైని ప్రాభవమును సంపాదించుకొన్నవారు కొందఱు

మహమ్మదీయు లీదేశమును జయించుకొనుటకు గనఁబఱుపక యీ మొత్తగలపాలెగాండ్రను నొకవిధముగానే చూచుచు పాలెగాండ్రబలాబలములనుబట్టియుఁ, దాము చెల్లింపఁదగిన యధికారమునుబట్టియుఁ గప్పముఁ గొనుచుండిరి కాని ఒకపద్ధతి ననుసరించి యమరకముఁ జేసి పిస్తు గాని, కప్పము గాని వసూలు చేయలేదు ఈపాలెగాండ్రు తమ యిచ్చ వచ్చినట్లు తమక్రింద నున్నప్రజలను, గ్రామములను పరిపాలించుకొనుట కధికారము కలిగి మహమ్మదీయుల కంతగా లోఁబడక యుండిరి వీరు సర్వదా ఒండొరులతోఁ బోరాడుచు మహమ్మదీయ ప్రభువులతోఁ బోరాడుచుఁ గాలముఁ గడపుచుండిరి మహమ్మదీయులకుఁ గట్టవలసిన కప్పము బరువు అని తోఁచినప్పుడు సాధ్య మయినంతవఱకు పిస్తు చెల్లింపకుండ ప్రయత్నము చేయుచు, నట్లపహరించుటకు వీలు గానప్పుడు తా మీయవలసినపిస్తు చెల్లించి తమ యిరుగుపొరుగుల ప్రాంతములయం దున్నసర్కారు గ్రామములను దోఁచికొని తాము స్వాధీనములు చేసికొనుచుండిరి ఇట్లు దోఁచికొనఁబడు గ్రామములయం దున్నసర్కారురైతు లడుగడుగున కీబాధ పడలేక తమ్ము బాధింపకుండ విడిచిపెట్టినందులకు 'కావల్' అను పన్ను ఇచ్చుచుండిరి తరువాత నాంగ్లేయప్రభుత్వదినములలో నీపాలెగాండ్ర దౌర్జన్యము లడఁచుటకనేక ప్రయత్నములు జరిగినవి కాని యీపాలెగాండ్రయొస్టేట్లమీఁద వీరి కున్న స్వామ్యమైన హక్కువిషయమున మాత్రము నిశ్చయముగాఁ దెలిసికొనుట కవకాశము గలిగినదికాదు. అప్పుడు వారితో శాశ్వతమైన యమరకపుపద్ధతి నొకదానిని నేర్పఱుచుకొని వారియెస్టేట్లమీఁద వారికి రాఁదగినమొత్తమున మూఁడవవంతు తమ కిచ్చుపద్ధతిని చిత్తూరు, కాళహస్తి, వెంకటగిరి, బొబ్బిలి, రాజాపాళెము మొదలగు ఎస్టేట్ల నమరకము గావించిరి దక్షిణమునం దున్న ఆంధ్రదేశములో ౩౩ గురు పాలెగాండ్రుండిరి వీరిసంఖ్య నానాఁటికి క్షీణించి యిప్పుడు కొందఱుమాత్రమే మిగిలియున్నారు. బారామహాల్ ప్రదేశమునందు రైతువారీపద్ధతి నమరకము చేయఁబడినది.

## మలయాళదేశమందలి అమరకపు విధములు

పశ్చిమతీరమునం దుత్తరమున గోకర్ణక్షేత్రము మొదలు దక్షిణమునఁ గన్యాకుమారివఱకును, కేరళము లేక మలయాళదేశ మని వాడఁబడును. తిరువాన్కూరు కొచ్చిరాజ్యములు స్వప్రభుత్వమున నుండియు స్వదేశప్రభువులపాలనమునందే యుండెను. మలయాళము కూడ కొన్నిదశాబ్దులవఱకు, నీవిధముననే స్వదేశప్రభువులపాలన

చట్టములవలన భూమిని సొంతముగా సేద్యము చేయు పరంపట్టం దార్లకు ఒకవిధమయిన శాశ్వతపు ఆరాయితీహక్కు కలిగినది. అందుచే శిస్తుచెల్లింపక తప్పిపోయినప్పుడును, భూస్వామికి భూమియందు హక్కు లేదని వాదించినప్పుడును, భూస్వామికి నిజముగా తాను సొంతముగా వ్యవసాయము చేసికొనుటకు భూమి అవసర మయినప్పుడును తక్క 'పరంపట్టందారు' నిప్పుడు చట్టముప్రకారము భూమినుండి తొలగించుటకు వీలులేదు. ఒక్కసంవత్సరపుశిస్తునకు బాకీ యున్న యెడల భూస్వామి 'పరంపట్టందారు'ను కోరవచ్చును. 'పరంపట్టందారు' భూస్వామికి న్యాయ్యమయినశిస్తు చెల్లించుచుండవలెను. న్యాయ్యమయిన శిస్తును నిర్ధారణ చేయుపద్ధతులు చట్టమందు వివరముగా చెప్పబడినవి. ఈనియమములకు లోబడి పరంపట్టందారు తనకాలంలో నున్నభూమి వీలునామాప్రకారము ఇతరులకు దానవిక్రయాదికము చేయవచ్చును. చట్టమునందు ఈహక్కులు స్వయముగా వ్యవసాయము చేసికొను 'పరంపట్టందార్ల'కే కలుగజేయబడినవి. ఆధారముపట్టి తదితరులకు పరంపట్టందారులు కనోమ్దార్లతో తుల్యముగా నుందురు.

కనోమ్దార్లకుకూడ శాశ్వతపుఆరాయితీహక్కులు కలుగజేయబడినవి. కనోమ్దార్లను పూర్వమువలె తొలగించుటకుగాని, గడువుకాలముకు ఆదుకున్న తరువాత 'కనోమ్' తీర్పు 'జన్మి'లు భూములను స్వాధీనము చేసికొనుటకుగాని వీలులేదు. అయినను 'కనోమ్' సొమ్ము దక్షిణమలబారుజిల్లాలో భూమియొక్కవిలువలో నూటికి అరువది భాగములకును, ఉత్తరమలబారుజిల్లాలో నలుబదిభాగములకును తక్కువకానియెడల అట్టి 'కనోము'లకు చట్టము వర్తింపదు. 'కనోమ్దారు' చట్టమునకు పూర్వమువలెనే 'మిచ్చవారం', అనగా 'పొలీవసిస్తు'ను, నజరానాను (Renewal Fee) చెల్లించుచుండవలెను. 'మిచ్చవారము' నకును, నజరానా (Renewal Fee) కును భూమి జవాబుదారీగా నుండును. ఒక్కగవర్నమెంటురెవిన్యూతప్ప భూమిమీది యితరబాధ్యతలన్నియు 'మిచ్చవారం', 'నజరానా' లకు లోబడియుండును. 'కనోమ్దారు' ఈ క్రింద నుదాహరించిన కారణములవల్ల తప్ప వేఱువిధముగా భూమియందుండి తొలగింపబడరాదు:

౧ భూమిభాగమందునకు భూమిమీద హక్కు లేదని వాదించుట.

౨. భూమిని వ్యవసాయమున కనుపయుక్తము గునట్లు చేయుట

౩. నజరానా యిచ్చి 'కనోము'ను మరల పుచ్చుకొనక పోవుట.

౪. భూమిభాగమందుయొక్క హక్కునకు భంగకరముగా ఇతరులు భూమి ఆక్రమించుకొనగా నూరకచేయుట.

౫. 'కనోమ్' గడువుకాలము ముగిసినపుడు 'జన్మి' కి సొంత వ్యవసాయమునకు భూమి యావశ్యక మగుట.

పొడుభూములకనోములకు ఈచట్టము వర్తింపదు

## కుడియిరుపు

'కుడియిరు' పదముగా రైతు కాపురముండు నిల్లు, దానినంటి యుండు నివేశనము, దానికి సంబంధించిన యితరస్థలములకు హక్కులు. ఈచట్టమువల్ల ఇట్టి 'కుడియిరుప్పు'లో రైతుగాని, అతని కుటుంబమువారు గాని పదేండ్లకు తక్కువకాకుండ నివసించుచుండిన రూ. ౩౦ల జానీభరీగుకు భూమిభాగమందునకు చెల్లించి నిర్బంధముగా గొనవచ్చును. అట్టిభరీదును ఒక్కసారి యియ్యలేకపోయినచో పండ్రెండు సంవత్సరపువాయిదాలలో నూటి కర్ధరూపాయవడ్డీతో చెల్లింపవచ్చును

ఈచట్టమువలన మలబారురైతులస్థితి పూర్వముకంటె చాల వఱకు బాగుపడినది. ఇంకను ఎక్కువహక్కులు కావలెనని 'పరంపట్టందార్లు'ను, 'కనోమ్దార్లు'ను ఆందోళన సలుపుచునే యున్నారు.

దక్షిణకన్నడదేశమందలి భూమియాజమాన్యము మలయాళదేశస్థుల సాంప్రదాయమనుభవమునందుకూడ నున్నట్లగపడుచున్నది. కన్నడదేశమునందలిభూమియందు శాశ్వతపు హక్కు గల సేద్యగానికి 'ముల్గెని' అని పేరు. ఒక్క సేసిస్తునకు పూర్వమునుండియు వ్యవసాయమునం దుండినట్టిదికాని, క్రొత్తగా వ్యవసాయము చేయబడుచున్నట్టిదిగాని అనుభూమిని దున్నుటకు వంశపారంపర్యము 'మలి' అని 'ముల్గె' పదమున కర్థము. శాశ్వతపుకవులు కలిగి భూమినుండి తొలగింపబడకుండ కృషి చేయురయితు 'ముల్గెనిగారు' అని పిలువబడును. కొంతసొమ్ము పుచ్చుకొని వ్యవసాయదారునకు కవు లిచ్చుపద్ధతి 'అర్ధముల్గె'ని యందురు. ధాన్యరూపముగాగాని, ద్రవ్యరూపముగాగాని భూమిపై శిస్తు వసూలు చేయుపద్ధతి దక్షిణకన్నడదేశమునం దున్నది. కాని ఫలసాయములో కొంతభాగము పుచ్చుకొనుపద్ధతి యున్నట్టు తోచదు. ఈ 'ముల్గెని' రైతు 'సాయర్ ముల్గెని' యనియు, 'మూడ్ ముల్గెని' యనియు రెండువిధములు. 'సాయర్ ముల్గెని' యనునది పురాతనపద్ధతి. 'మూడ్ ముల్గెని' యనునది భూమి కొనినతరువాత చేర్పడినపద్ధతి. కొన్ని సంవత్సరములకుమాత్రమే కవు లిచ్చుపద్ధతి 'చెయిగ్గెని' యందురు.

## భూమికి వెల పుట్టుట, హెచ్చుట, తగ్గుట

రైతువారీఆమరకపుపద్ధతి చేయబడుటకు పూర్వము హిందూరాజులకాలమందును, తరువాత మహమ్మదీయరాజులకాలమందును రైతులకును భూస్వాములకును పూర్వమునుండియు భుక్తములో నున్న హక్కుల సాంగ్లేయదొరతనమువారు సాధ్య మగునంత వఱకు గమనించిరి. భూమి సమృద్ధిగ ప్రప్రథమమున హిందూరాజుల ప్రభుత్వకాలమందు కృషికి దగినభూమి అమితముగా నుండుట వలనను, భూమి సంతతము సేద్యములోనికి దీసికొనినప్పుడు దాని నంతనుండి రైతులు కొనిపోవుచేతను, ప్రజోపయోగమునకొఱకు

మాత్రమే కావలసినంత ధాన్యమును పండించుకొనుటవసరము కలిగి యుండుటచేతను కృషికరులు తమకక్కఱ యగినట్లు తమకు తలకు వచ్చినంత ప్రదేశమును మాత్రమే వ్యవసాయము చేయుచుండిరి. ఆకాలమున భూమి నపేక్షించువారు గాని, భూరూప మైన ఆస్తిని సంపాదించుకొనవలయు నని యాసక్తిపడువారు గాని, భూములు కొను వారు గాని యుండుట కటస్థపడలేదు. అట్టిసమయమందు పంటలో కొంతభాగమును మాత్రము రాజులు పన్నులు చేసికొనుచు కర్షకుల కిచ్చి వచ్చినట్లు భూమిని స్వేచ్ఛగా ననుభవించునట్లు అవకాశ మొసగుచు వచ్చిరి. అందువలన భూమి సేద్యమైనకొలందియు రాజునకు ద్రవ్యము వచ్చుటయు, సేకారగామిచేత నయినను భూమి సేద్యము కాఁబడని యప్పుడు రాజునకు ద్రవ్యము రాకపోవుటయు తటస్థించుచుండెను. గ్రామములు కొంతవిరకు నైన వనియు, గ్రామముయొక్క స్థితి ననుస రించి ఆ గ్రామమునకు సంబంధించియున్న పంటభూమియందు గ్రామ స్థులకు హక్కేర్పడిన దనియు నింతకుముందే వ్రాయఁబడెను. గ్రామస్థు లావిధముగా భూమియందు హక్కు భుక్తములు కలిగి దేశాచారమును బట్టి సంచరించుచు తమతమ గ్రామవ్యవహారములను తామే సరి చేస్కొనుచు రాజులకు లోఁబడియుండిరి. తరువాత మహమ్మదీయుల కాలములోఁగూడ పూర్వపుపద్ధతులను మార్పిచేయక పంటభూముల మీఁద పన్ను వసూలు చేయుటకు కొన్ని క్రొత్తపద్ధతులనుగూడ వసూలులోనికిఁ దీసికొనివచ్చిరి. ఈకాలమున వ్యవసాయము చేయు వారు వృద్ధి యగుటయు, భూమిపన్ను మిక్కిలిగా హెచ్చింపఁ బడుటయు, కొంతమంది కయినను భూమి సంపాదింపవలయు నను నాసక్తి కలుగుటయు సంభవించినది. మహమ్మదీయుల ప్రభుత్వకాల ములో భూమి లేనివానికన్న భూమి కలవాని కెక్కువపరపతియు గౌరవమును కలుగుట తటస్థపడెను. రొక్కరూప మైన ద్రవ్య మెంత యున్నను భూస్వాస్థ్యము కలవాని కెక్కువ గౌరవ ముండెను. ఈకారణములబట్టి కొందఱకు భూమి సంపాదింపవలయు ననుకోరిక పుట్టుట కవకాశము కలిగినది. అయినను భూమిపన్ను మిక్కిలి హెచ్చింపఁబడుటచేత సేద్యము సేయుటవలన లాభము లేక భూములను వదలిపెట్టవలయు ననుతలంపు కలవార లనేకు లుండిరి. భూమి సేద్య మయినకొలందియు తమకు ద్రవ్య మెక్కువ వచ్చు నను నాశచే సాధ్య మగునంతవఱ కెక్కువభూమిని పాగుచేయించుట కమర్చవలె నని మహమ్మదీయ ప్రభువులయొద్ద నున్న యుద్యోగస్థు లనేక ప్రయత్నములు చేయ నారంభించిరి. దేశ మభివృద్ధి చెందుట కును, ప్రజలు భాగ్యవంతు లగుటకును, రాజులకు విస్తారము ద్రవ్యము వచ్చుటకును భూమి హెచ్చుగ మంచిపద్ధతులమీఁద సేద్యము చేయఁబడు టయే ముఖ్యకారణము. ఈవిషయము మహమ్మదీయ ప్రభువులును వారి యుద్యోగస్థులును గ్రహింపకపోలేదు. అయినను నిప్పటివలె ధాన్యా దులకు ధరలు లేకపోవుటవలన నెంతప్రయత్నము చేసినను అభి రుచితో వ్యవసాయము చేయువలె ననుకాశమాత్రము రైతులకు చాల కాలమువఱకును లేకపోయెను. సాధ్య మగునంతవఱకు భూమిని పాగుచేయునట్లు రైతులను ప్రోత్సాహపఱచియు, నిర్బంధపఱచియు భూములు వదలిపెట్టకుండ నల్పాంతరములు కలుగఁజేయుచు మహమ్మ దీయ ప్రభువులు కిందియుద్యోగస్థు లనేకసాధనములతోఁ బహువిధము లగుపద్ధతులమీఁద భూమి నమరకము చేయుచుండిరి. మహమ్మదీయ ప్రభుత్వకాలమున సేద్యము చేయుట కిష్టము లేనప్పుడు గాని, సేద్యమువలన లాభము లే దని తోఁచినప్పుడు గాని రైతు భూమిని వదలిపెట్టినట్లును, అట్టిపనులు మహమ్మదీయ ప్రభువు లంగీకరించి నట్లును కనిపింపదు. హిందూరాజులపరిపాలన కాలమునఁ గాని మహమ్మ దీయ ప్రభుత్వకాలమునఁ గాని రైతు గాని భూస్వామి గాని భూమిన స్వాధీనపఱచి దట్టినన్ను అతనిని రాష్ట్ర సమ్మించికాని అతనిని దండించి కొంపాల నుండి శిక్షించికాని బాధపెట్టి రని వినియుండుము గాని భూమి జప్తుచేసి పన్ను వసూలుచేయుపద్ధతి యున్నట్లు వినము. కాని హిందూరాజులకాలములో భూమిని క్రయవిక్రయములు చేయువాడుక తక్కువగ నుండెను. మహమ్మదీయరాజ్యసమయమునమాత్ర మక్క డక్కడ భూము లమ్ముకొనుపద్ధతి హెచ్చినది. సర్కారుభూమిని జప్తుచేసి అమ్మించుపద్ధతిమాత్ర మంతగాఁ గన్పింపదు.

## రైతులను తొలఁగించుట

వారసులు లేక చనిపోయినవాని(ఖాతి)యొక్కగాని, యూరు విడిచి పాఱిపోయినవాని(పరారి)యొక్కగాని భూములను దప్పఁ దక్కినవాం డ్రభూములను సర్కారు తీసికొని యనాక్రాం తము చేయుపద్ధతికూడ మహమ్మదీయులకాలములో నైన నంతగాఁ గానిపింపదు. రాజద్రోహులు, గొప్పనేరములు చేసినయపరాధులు శిక్షింపఁబడుటయే కాక వారిభూములను మహమ్మదీయ ప్రభువులు తీసి కొని యితరుల కుచితముగా నిచ్చుట గాని, పన్ను కట్టి యిచ్చుట గాని వాడుక కలదు. దీనింబట్టి యోచింపఁగా రైతు భూమిపన్ను చెల్లించు చున్నంతవఱకుఁ దనభూమిని స్వేచ్ఛగా కృషి చేసికొని అనుభవించు టకు హక్కు కలిగియుండె నని చెప్పవలసియున్నది. మఱియు రైతులు సాధారణముగా ఫలవత్తర మైన మంచిభూములు నుంచుకొని తక్కిన నీరసభూములను బరిత్యజించువాడుకకూడ నుండియుండెను.

## పెక్కు విధములయిన అమరకపుపద్ధతులు : కారణము

లాభము లేనిపని చేయుట మనుష్యస్వభావము కాదు. కొన్ని సేద్యము సేయుటవలన లాభ మున్నభూములను నితరులు వ్యయప్రయా సము లక్కఱలేకుండ లాభమునకు వ్యవసాయము చేయఁదగినభూము లనుమాత్రమే వ్యవసాయము చేయుటకు రైతు లిచ్చగించుచుఁ దక్కినభూములను నిరాకరించుచుండిరి. కాని మహమ్మదీయ ప్రభువులు భూమి నంతయు మంచిస్థితిలోనికిఁ దీసికొనివచ్చి అన్నివిధముల రా భూములను సేద్యమగునట్లు ప్రోత్సాహము చేయుటవలన లాభ మును గ్రహించి అందునిమిత్తమునఁ దమయుద్యోగులను బహువిధముల బనిచేయుటకుఁ దగినయుపాయములను వన్ని ఆయుపాయములను పెంపొందిం

కొంత సర్వస్వతంత్రాధికార మున్నట్లగపడుచున్నది. కాని తరు వాత ౧౮౨౨-వ సంవత్సరములో ౪-వ నెంబరు 'రిగ్యులేషను' జారీ చేయఁబడినది. ఈచట్టములో స్పష్టముగ నేమి చెప్పఁబడి యున్న దనఁగా ౧౮౦౨-వ సంవత్సరపు ౨౫-వ చట్టమువలన రైతుల కదివఱ కున్న యేహక్కును తీసివేయఁబడలేదు, అనఁగా నాచట్టమువలన రైతుహక్కు తీసి జమీందారుల కీయఁబడలేదు ఇందును గుఱించి కొన్ని తీర్పులును బుట్టియున్నవి ౧౮౦౨-వ సంవత్సరపు ౨౫-వ చట్టలోని ౨-వ సెక్షనులో వాడఁబడిన 'స్వామ్య స్వాధీనత' (Proprietary Possession) అనుపదమును పారిభాషిక (Technical) పదముగ నెంచి గవర్నమెంటునకు స్వయముగ శిస్తు చెల్లించుచున్నవాఁ డని అర్థము చేయవలెను భూమియందు సర్వాధికారి యని అర్థము చేయఁగూడదు[1] రైతుయొక్క హక్కులు దొరతనమువారికిఁ బూర్వమే (జారు ఈయకుండఁగనే) పుట్టినవి గనుక, గవర్నమెంటువారు తమకు భూమియొక్కఁగల హక్కును మాత్రమే యీయఁగలరు గాని రైతునకుఁగల స్వామ్యము నీయ లేరు దొరతనమువారికి, మేల్వారమ్, కుడివారమ్ అను రెండు హక్కులును గల గ్రామభూములవంటివానివిషయమున వారు, ఈరెండుహక్కుల నీయఁగలరేకాని, తక్కిన యన్నిభూములవిష యమున ఒక్క మేల్వారమ్ (శిస్తువసూలు చేసికొను) హక్కు మాత్ర మీయఁగలరు[2]

ప్రివికౌన్సిలువారు రిమద్ధము చేసినతీర్పులలో పూర్వప్రభువుల కును, వారివల్ల నొసఁగఁబడిన జమీందార్లకును జమీందారీల లోని భూములయందు స్వామ్యము గల దనియు, వా రగ్రహారములు, ఈనాములు ఇతరులకు ఇచ్చినప్పుడు కేవలము మేల్వారము, అనఁగా శిస్తు వసూలు చేసికొనుహక్కుమాత్రమే అగ్రహారీకులకు ఈనాం దార్లకు నిచ్చినట్లు ఎంచవలె నని, రయితులకు అట్టి అగ్ర హారములలోను ఈనాములలోను భూయిష్టహక్కుగలదా లేదా అను విషయము ఏకేసులో వచ్చినసాక్ష్యమునుబట్టి ఆకేసులో తీర్మానించ వలసియుండు ననియు తీర్మానించి యున్నారు పూర్వప్రభువులకు భూములలో స్వామ్యము గల దని ప్రివికౌన్సిలువారు చెప్పిన అభి ప్రాయమునకు ఆధారములు అంతగా కానరావు.

ఈరెండు రిగ్యులేషనులబట్టియు జమీందారీఅమరకపుపద్ధతి యిప్పటికి వ్యవహరింపఁబడుచున్నది ఈ యమరకపుపద్ధతిని విధింపఁ బడిన 'పేష్కష్' భూమిపన్ను శాశ్వత మైనది. రైతువారీఅమ రకమునందువలె దీని కేకారణమునఁ గాని 'రివిజను' అనఁగా శిస్తు హెచ్చించుట అనుట జరుపఁబడదు జమీందారులకు వారి వారియొస్టేటులకొర్పు "సనద్-ఇ-మిల్కియ్-ఇ-ఇస్తిమరార్" అను శాశ్వ తపుపట్టా లీయఁబడి వారివలన 'కబూలియత్' అను ఒడ్పులేఖలు తీసికొనఁబడినవి. ఈ పట్టాలనుబట్టి ఉప్పుపన్ను మాదకద్రవ్యముల పన్ను కాయదలేట్లు, సముద్రమునుండికాని భూమిమీఁద నుండి కాని వచ్చుసరకులమీఁద పన్నులు, కల్లు, సారా మొదలగు మత్తుద్రవ్యములమీఁదిపన్నులు, సాగుబడిభూములమీఁది పన్నులు, అదివఱకు సాగుకేయుక్త మీయఁబడినభూములమీఁది పన్నులు, మోటర్ పాపన్నులు మొదలగునవిమాత్రము వసూలు చేయు టకు జమీందారుల కధికారము లేదు కొంటలు, చెట్లు, పుల్లరి భూములు, చేఁపల పట్టుప్రదేశములు, కాగ్గానాలక్రింద నుప యోగింపఁబడుభూములు, దుకాణము మొదలగు నితరకట్టడములు మొదలగువానినుండి పన్ను వసూలు చేయుట కధికార మీయఁబడి నది. దేవుళ్ళను పరిరక్షణస్థితిలో నుంచినందుల కీవాందారుల వలన జమీందారుల కీయఁబడు 'ఘట్టుకూములు' అను పన్ను జమీందారు వసూలు చేసికొనవచ్చు నని తీర్మానింపఁ బడినది ఈవిధముగా జమీందారుల కుండుస్వాతంత్ర్యము లన్నియు స్పష్టముగా నిశ్చయింపఁబడినవి జమీందారు తనయిష్టము వచ్చి నట్లు అంతయుఁ గాని కొంతమాత్రము గాని దానవిక్రయాదిముల ములు చేయుట కధికార మీయఁబడినది అట్లు జమీందారులచే విక్రయింపఁబడినవి, దత్తములు, అయినజమీందారీలలోనిభాగము వేఱుజమీందారీలుగా విభజించి వానిమీఁద 'పేష్కష్' పంచి కట్టి శాశ్వతపుహక్కు గలుగునట్లు చేయుటకు కలెక్టరుల కధి కార మీయఁబడినది

ఇట్లు శాశ్వతపుహక్కుతో జమీందారీపద్ధతులమీఁద అమర కము చేయఁబడిన జమీందారీయొస్టేటులో చాలకాలమువఱకును రైతులయొద్దనుండి జమీందారులు పన్ను వసూలు చేసికొనుటకు తగినయేర్పాటులు చేయఁబడి యుండకపోవుటచేతను శిస్తులు చాల భాగము రైతులవల్ల చెల్లక బాకీయుండిపోవుటవలనను, జమీందారులు కాము సర్కారునకు చెల్లింపవలసిన 'పేష్కష్' చెల్లింపలేక పోవుట తటస్థించుచువచ్చినది. అట్లు 'పేష్కష్' చెల్లింపలేని యొస్టేటులను దొరతనమువారు వేలము వేసి బాకీ మొత్త మిచ్చినవానికి మరల పూర్వప్రమరకములతో శాశ్వతపుహక్కుతో పేష్కష్ నిర్ణ యించి వేలంపాటమీఁద విక్రయించుచువచ్చిరి తరువాత కొంతకాల మునకు, అనఁగా ౧౮౪౪-వ సంవత్సరమునకుఁ దర్వాత నట్లు పేష్కష్ చెల్లింపలేనియొస్టేటులను విభజించి కాని యేకముగాఁ గాని పూర్వపుఅమరకపుపద్ధతికి అమర్చక రైతువారీపద్ధతి ననుసరించి చేయ నారంభించిరి ౧౮౬౫-వ సంవత్సరమున 'రెంటు రికవరీ' ఆక్టు అనుచట్టము జారీచేయుటవఱకును జమీందారులకు తమతమ రైతుల యొద్దనుండి శిస్తు వసూలు చేయుటకుఁ దగినచట్టమే లేకపోయెను ఇందువిషయమున కొన్ని రిగ్యులేషనులు, నిబంధనలు ఉన్నను అవి అంతగాఁ బని చేయునవిగా నుండలేదు

1. The Collector of Trichinopoly, V. Lakkamani I. 1 A. 282; 14 Ben. L. R. 115; 21 W. R. 358.

2. 1 Mad. 205 (213); 16 Mad. 271; 20 Mad. 299 (303); 26 Mad. 252.

## పేషావరు మొదలగు దేశములు

పేషావరు జిల్లా మొదలుకొని యమునానదివఱకు నున్న ప్రదేశమందలి గ్రామములు సాధారణముగా 'ల్యాండులార్డ్సు' గ్రామములు. కావున నవి 'పట్టాదారీ', 'భాయిచారీ' తరగతులక్రింద నుండుట తటస్థించినది. బంగాళా రాజధానియందువలెనే ఈ దేశమునందుఁగూడ గ్రామాధికారులకు భూస్వాములతో ౧౦-సంవత్సరములవఱకునకు కొకవిధముగ అమరకము చేయఁబడినది. గ్రామాధికారిత్వము ఒకనికిఁ గాని అనేకభాగస్వాములకుఁగాని, గ్రామసమాజమునకుఁగాని యుండవచ్చును. సంపూర్ణ, అసంపూర్ణ, పట్టాదారీ, భాయిచారీ భేదములతో నున్న ల్యాండులార్డ్సు గ్రామలక్షణములనుబట్టి యిట్టియధికార మేర్పడును గాన ల్యాండులార్డ్సుగ్రామలక్షణములను సవిస్తరముగా గ్రహింపవలసియుండును. ఈ గ్రామముల నమరకము చేయుటలో పదిసంవత్సరముల యమరక మయినపిమ్మట నా యమరకములయందు భేదముంబట్టి శాశ్వతముగాఁ జేయవలయును నని మొట్టమొదట నుద్దేశించిరి గాని అట్లు చేయుటవలన గ్రామములయందలి స్వాతంత్ర్యమైన హక్కుగాఁ గలహక్కులకు భంగము కలుగుట తటస్థించు ననియు, గ్రామసంఘములోఁ జేరియుండు హక్కుభుక్తములను నిర్ణయించు యత్యావశ్యక మనియుఁ దలఁచి శాశ్వతపుటమరకపుపద్ధతిని వదలిపెట్టి ౧౮౨౨-వ సంవత్సరమున జారీచేయఁబడిన ౭-వ నంబరు 'రిగ్యులేషను'ను బట్టి మొంబాయిరి గ్రామవారీఅమరకము చేసిరి. ఈవిధముగా నీరిగ్యులేషనుబట్టియే ఓఢ్రదేశమందుఁగూడ నమరకము చేయఁబడినది. అందు ప్రతియొక్క గ్రామమును దీసికొని ప్రతిక్షేత్రమునకు పాయదారునియొక్కయు రైతుయొక్కయు భూస్వామియొక్కయు హక్కుభుక్తములను సవిస్తరముగాఁ బరిశీలించి ౧౮౩౩-వ సంవత్సరమున ౬౦-సంవత్సరముల వఱకునకు గ్రామవారీఅమరకము చేయఁబడినది. తరువాత ౧౮౯౦-సంవత్సరము మొదలుకొని ౧౯౦౦-సంవత్సరము లోపున నీయమరకము మరలఁ బరీక్షింపఁబడి గ్రామవారీఅమరకము చేయఁబడినది. ఈ గ్రామవారీఅమరకపుపద్ధతిలో శిస్తు [illegible] మునకు పూర్వపురాజభాగమైన పంటలోని యాఱవవంతు పన్నుగాఁ బుచ్చుకొనుటయే ప్రధానోద్దేశము. ఈ గ్రామవారీ సెటిలుమెంటు ఆగ్రా, అయోధ్య సంస్థానములలోఁ జేయఁబడినను ఆయాదేశములలోఁ గొంచెముకొంచెము భేదములు కలిగియున్నవి. ఈ యమరకపుపద్ధతి ౧౮౩౩-వ సంవత్సరములోఁ గొన్ని మార్పులు చెందినది. గ్రామములయొక్క సరియైన రాబడిమొత్తమును నిర్ణయించుట ముఖ్యమయినందున [illegible] ననేకములయిన యేర్పాటులు చేసి నిశ్చయింపవలసివచ్చినది. ఆమొత్తము నిశ్చయించినపిదప గ్రామమందు హక్కుభుక్తములు గలవారిహక్కుభుక్తములంగతి సరిగా నిర్ణయించినపిమ్మట నాయా గ్రామములపైఁ జెల్లవలసినశిస్తు నిర్ణయింపవలసివచ్చినది. ఇట్టియేర్పాటు లన్నియు సాధ్యము కానంతకాలము [illegible]తోఁ జేసి గ్రామవారీసెటిలుమెంటు చేయఁబడినది. అయోధ్యయందు తాలూకాదారీసెటిలుమెంటు చేయునప్పుడు గ్రామవారీశిస్తు మొత్తము నీవిధముగానే నిశ్చయించి తాలూకాదారుల స్వాధీనములో నున్న గ్రామము లన్నింటికిని శిస్తుమొత్తము తాలూకాదారులవలన వసూలు [illegible] వారు పుచ్చుకొనుచుండిరి. మధ్యపరగణాలలో నీ గ్రామవారీఅమరకమే కొన్నియేర్పాటులతోఁ జేయఁబడినది. పంజాబుదేశమందుఁగూడ నీ గ్రామవారీయమరకమే యించుకఁగొన్ని యేర్పాటులతోఁ జేయఁబడినది. ఈపైనిఁ జెప్పినదేశములయం దంతటను సాధారణముగా గ్రామవారీ అమరకపు పద్ధతినే అమరకము చేయఁబడినను శిస్తు నిర్ణయించుట మాత్రము వేఱువేఱువిధములగురీతి ననుసరించి చేయఁబడినది.

ఎడారులయందును పెద్దపెద్ద నదులవలన నప్పుడప్పుడు భంగముఁ జెందుచుండు ప్రదేశములయందును, కొన్ని సంవత్సరములవఱకునకు శిస్తు నిర్ణయించి అమరకము చేయుపద్ధతి వీలు లేదు. కాఁబట్టి అట్టి భూములయందుఁ బ్రతిసంవత్సరము సాగు చేయఁబడిన ప్రదేశమును నందలి పంటను నిశ్చయించి దానింబట్టి శిస్తు నిర్ణయించు నేర్పాటు జరుగుచున్నది. ప్రస్తుత మిట్టియమరకపుపద్ధతి పంజాబు బర్మాదేశములలో నున్నది. పంజాబుదేశమున సాగుబడిలో నున్న ప్రదేశములో ౧౫-వ వంతు ఇట్టియమరకములోనే యున్నది. ఉత్తరబర్మాదేశములో వర్షవృష్టిదోషము తఱచు గావున నచ్చటఁగూడ నీయమరకపుపద్ధతియే అవలంబింపఁబడినది. పంజాబులో 'కెనాల్ కాలనీస్' యందును బొంబాయి రాజధానిలో సింధునదీప్రాంతములయందును నీయమరకపు పద్ధతియే అవలంబింపఁబడినది. [illegible] రాష్ట్రమందు బొంబాయి రాష్ట్రమునందలి రైతువారీపద్ధతికి అతిస్వల్పభేదములతో నమరకము చేయఁబడినది.

గ్రామవారీసెటిలుమెంటుపద్ధతిలో నొక్క భూస్వామిభుక్తాధికారములో ననేక గ్రామము లుండి వాని కన్నింటికిఁ గలిపి యొకమొత్తముగా శిస్తు నిర్ణయించి అట్లు శిస్తు నిర్ణయింపఁబడిన గ్రామములుగల యెస్టేటులోని గ్రామములను మరల లోపాయికారీ సెటిలుమెంటు చేసి గ్రామవారీశిస్తు నిశ్చయించుటయుఁ గలదు. ఒక్క గ్రామము గాని, అనేక గ్రామములలో నున్న వేఱువేఱుభూములు గాని కలసి కొందఱు భూస్వాములయధీనములో నుండుట తటస్థపడి యాజమాన్యమును బట్టియు సెటిలుమెంటు చేయఁబడినప్పుడు అట్టి గ్రామమునకుఁ గాని అట్టిభూముల సముదాయమునకుఁ గాని యేర్పఱుపఁబడిన శిస్తుమొత్తమునకు వారియం దనుభోగభుక్తము గలవారందఱును [illegible] యుందురు. ఆశిస్తును కొందఱును కలసికాని ప్రత్యేకముగఁగాని చెల్లించుటకు బాధ్యత కలిగియున్నారు. ఎవరిభాగము వారు చెల్లింపని [illegible] దీసికొనువారు నిబాధ్యత తప్పదు. అయినను గ్రామములన్నిటిలో [illegible] బట్టి భాగస్వాములయొక్క హక్కుబాధ్యతలను ప్రత్యేకముగా నిర్ణయించి లెక్కలలో వ్రాయఁబడుచున్నవి. గ్రామమందలి భూములను అట్టిభూములు సేద్యము చేయువారిని, శిస్తు చెల్లింపవలసిన బాధ్యత గలవారిని గ్రాములు సర్వేచేసి సెటిలుమెంటు చేయునప్పుడు [illegible] ముగా లెక్కలలో వ్రాసియుంచుటవలన గ్రామవారీశిస్తు నిర్ణయించుట

కును పిస్తు చెల్లించుటకుహక్కుకలవారి చేర్పులుచుటకును, గ్రామాధికారులయొక్కయు కొన్ని రయితులయొక్కయు లోపాయికారీభూస్వాములయొక్కయు దేవస్థానములయొక్కయు ఇతరులయొక్కయు జాగ్రాముభూములయందలి హక్కులు, ఫలసాయములోనిభాగములును విశ్వాయించబడుచున్నవి.

## అస్సాము

అస్సాంరాష్ట్రములోని సిల్హెట్, గోల్పారా అను రెండు రాష్ట్రములను కారణవాలీను ప్రభువుకాలమందు, అనఁగా పదునెనిమిదవ శతాబ్దియంతమున శాశ్వతపు సెటిల్మెంటుక్రింది కేఁబడినవి. అజిల్లాలమిరాసీదారులును, జమీందారులును అప్పు డేర్పడిన రీతిన్యాయశాల్లనే ఇప్పటికిని శాశ్వతముగా చెల్లించుచున్నారు. వారికి తాము పేద్దకు చేయుభూములలో సంపూర్ణమయిన స్వామ్యము కలుగు వంశపారంపర్యముగా అనుభవించుహక్కు కాక వారియిష్టానుసారము దానవిక్రయాదివినియములు చేసికొనవచ్చును. రివిన్యూ శాఖకు తప్ప గవర్నమెంటువారికి దానిని విక్రయించుటకుఁ గాని, లేక మిరాసీదారులను, జమీందారులను తొలఁగించుటకుఁ గాని హక్కు లేదు. సిల్హెట్లో గవర్నమెంటునకు చెందు ల్యాండు రివిన్యూ మిక్కిలి స్వల్పము. 'టెంపొరరి సెటిల్మెంటు'లో నున్న భూములకు సగటున మీఁద ఎకరమునకు రు ౧-౩-౦ చెల్లుచుండఁగా శాశ్వతపు సెటిల్మెంటునకు లోఁబడినభూములమీఁద ఎకరమునకు సుమారు రు ౦-౩-౬ లు చెల్లుచుండినట్లు నిర్ధారణచేయఁబడినది. సిల్హెట్లో ఇట్టిభూస్వాములక్రింద నున్న రైతులకు 'జోతిదారు' లనియు, 'జోతిదారుల' పట్టాలలోనిభూములకు 'జోతు' లనియు పేరు.

౧౮౬౯-వ సంవత్సరపు ౩-వ నెంబరు చట్టముప్రకారము జోతిదారులకు శాశ్వతపుజిరాయితీహక్కు కలిగింపఁబడినది కాని, భూస్వామియనుమతి లేక 'జోతిదారు' తనపట్టాభూమిని విక్రయించుటకు వీలు లేదు. ఇందువల్ల రైతులకు, అనఁగా జోతిదారులకు తమపట్టాభూములను తనఖాపెట్టుకొనుటకును, విక్రయించుకొనుటకును చాల చిక్కులు కలుగుచున్నవి. భూస్వామియిష్టము లేనియెడ తనఖా గాని, క్రయము గాని జరిగినప్పుడు తనఖాదారులును, 'విక్రయదారు' లును భూస్వాములచేత భూమియందుండి తొలఁగింపఁబడి చిక్కుపడుచున్నారు.

గోల్పారాజిల్లాలో జోతిదారులకు తమభూముల నితరరైతుల కమరకము చేసికొని అనుభవించు ఆచారము కలదు. ౧౮౮౬-వ సంవత్సరము 'గోల్పారా టెనెన్సీయాక్టు' ప్రకారము జోతిదారులకును భూములలో శాశ్వతపుజిరాయితీహక్కు కలుగఁజేయఁబడెను. జోతిదారులక్రిందిరైతులకు వారొకగ్రామములో పండ్రెండుసంవత్సరము లెడతెగకుండ భూమిని సాగు చేసినయెడల వారికిఁగూడ భూమిలో జిరాయితీహక్కు ఏర్పడుచున్నది. కొన్ని షరతులకు లోఁబడి జోతిదారులును, వారిరైతులును వారిజిరాయితీహక్కులను తనఖాపెట్టుకొనవచ్చును. తమజిరాయితీహక్కుల నితరులకు సంక్రమింపఁజేసినప్పుడు భూస్వామికి 'ట్రాన్స్ఫరుఫీజు' చెల్లింపవలసియుండును.

ఇట్టి శాశ్వతపుసెటిల్మెంటునకు లోఁబడియుండిన సిల్హెట్, గోల్పారాప్రాంతములు తప్పఁ దక్కిన అస్సాంరాష్ట్రమునందలి భూమి యంతయు గవర్నమెంటువారిక్రిందనే యున్నది. గవర్నమెంటువారు భూమిని కొన్ని సంవత్సరముల కాలపరిమితితోఁ గాని, లేక ఏఁటేటఁ గాని కౌలున కిచ్చుచుందురు. నూతనముగా సాగు లోనికి తీసికొనిరాఁబడిన భూముల కిట్టి 'పాలీవాకాల్లు' ఈయఁబడును. ఏఁటేట, కౌలుదారుని మార్చుటకు గవర్నమెంటున కధికార మున్నను సరిగా పిస్తు చెల్లించినంతకాలము ఒకరైతునకే కౌలు ప్రతిసంవత్సరము నియ్యఁబడుచుండును. ఈ 'పాలీవాకాల్లు' పొందు రైతులకు వారిపట్టాలోని భూమిని విక్రయించుటకు వారి కధికారము లేదు. అయినను, అట్లు వారు విక్రయించుకొనుటయు, గవర్నమెంటువా రట్టియాక్షేపణయు చేయకుండుటయు జరుగుచున్నది. ఇట్టిభూమి సంపూర్ణముగా వ్యవసాయమునకు లాయకు చేయఁబడిన తరువాత ఈ 'పాలీవారైతు' లకు మరతుకాల్లు ఇయ్యఁబడుచున్నవి. మరతుకాలు పొందురైతులకు వారిపట్టాభూమియందు సంపూర్ణమయిన జిరాయితీహక్కు ఏర్పడుచున్నది. వంశపారంపర్యముగ అనుభవించుటకే కాక విక్రయాదికములు చేసికొనుటకుఁగూడ హక్కు కలదు. ౧౮౮౬-వ సంవత్సరమునకు తరువాత అస్సాంవాలీ(లోయ)లో గవర్నమెంటువారికాల్లలో కొత్తప్రకరణము చేర్చుచున్నారు. అది ఏమనఁగా, కౌలుదారు తనపట్టాభూమిని మతియొకవ్యవసాయదారునికి తప్ప అన్యులకు విక్రయింపఁగూడ దని. దీనియుద్దేశ మేమనఁగా, భూమి పెట్టుబడిదారులయిన మార్వాడీలపరము గాకుండుటకే. ఈమరతుకాల్లు పొందినపట్టాదారులలో పాయకారీరైతులకు భూమియం దెట్టిహక్కును లేదు. భూమిని స్వయముగా సాగు చేయులోపాయకారీరైతులకు జిరాయితీహక్కులు కలుగఁజేయవలెనని గవర్నమెంటువారు పెక్కుసారులు ప్రయత్నించిరి కాని ఈప్రయత్నము లింతవఱకును కార్యరూపమును దాల్చలేదు.

అస్సాంవాలీ(లోయ)లో సంపూర్ణముగా పిస్తు లేనట్టియు, సగముపిస్తు చెల్లించునట్టియు భూములు కలవు. మొదటిరకముభూములకు 'లాఖిరాజ్' భూము లనియు, రెండవరకముభూములకు 'నిస్ఫఖిరాజ్' భూము లనియు పేరు. ఇవి పూర్వకాలమందు హిందూదేవస్థానములలో నౌకరీ చేయు అర్చకులు మొదలగువారి కియ్యఁబడిన ఈనాములవంటివి. ఇవి ముఖ్యముగా కామరూపము జిల్లాలో ఎక్కువగానున్నవి. ఇట్టి 'లాఖిరాజ్' దార్లకును 'నిస్ఫఖిరాజ్' దార్లకును వారిక్రిందిరైతులకును గలహక్కులను గూర్చిన వివాదములు మిక్కిలి క్లిష్టముగాను, అస్పష్టముగాను యున్నవి. వీనిని నిర్ధారణ చేయుటకు గవర్నమెంటువారు ప్రయత్నించుచున్నారు.

గోరీలు మొదలగువానికి ఈయఁబడినవి. భూమిమీఁదను చెల్లింపఁబడు చున్న పిస్తు కొట్టివేయఁబడినట్టివి గాని పిస్తు లేకుండఁగనే యియ్యఁబడి నట్టివి గాని అగుభూములు 'మఆఫీ' లేక యీనాము లనఁబడును. ఇట్లీయఁబడినభూములు గాక సర్కారునకు యుద్ధవిషయమునఁ గాని యితర వ్యవహారవిషయమునఁ గాని మేలు చేసినవారికి పెద్ద పెద్ద ప్రదేశములు పిస్తు లేకుండ 'జాగీర్లు' అను పేరుగల ఈయఁబడి నవి. మొగలాయీచక్రవర్తులరాజ్యమున సర్కారు ఉద్యోగము చేసిన యుద్యోగస్థుల కందఱకును మనసబ్దారీలతోపాటు పిస్తు లేకుండ కొన్నికొన్నిప్రదేశములు వారివారిప్రవర్తులంబట్టి యియ్యఁబడెను. వీని యన్నిటిని జాగీర్లు అని పేరు

సాధారణముగా నున్న బంజరుభూములు దేశమం దంతటను గలవు. బంగాళరాజధానిలో నిట్టిబంజరుభూములు శాశ్వతముగా నమరకము చేయఁబడినయెస్టేట్లకు సంబంధించినవి. ౧౮౧౯-వ సంవత్సరము వఱకు జమీందారులు యెస్టేట్లజమీందా రిష్టము వచ్చిన ట్లాక్రమించుటకు వీలు కలుగుచుండెను. తరువాత ౧౮౩౫-వ సంవత్సరమున జారీ చేయఁబడిన రిగ్యులేషనునుబట్టి అట్టిబంజరుభూముల నాక్రమించు కొనక కొన్నింటిని పల్లెలు అడవులక్రిందను దక్కినవానిని వ్యవ సాయదారులకు కవులుక్రిందను ఇచ్చుచునుండిరి. సంయుక్తపరగ ణాలు అయోధ్యయం దున్న అవధ్ శేగ్రామముతో సంబంధించినవి, ఆగ్రామముతో కలిసి అమర్చుచుండిరి.

పర్వతప్రాంతమందలిజిల్లాలలోని పెద్దబంజరుభూములును పెద్ద పెద్ద అడవులును దొరతనమువారివశమునందే యుంచుకొనిరి. అయోధ్యలో తాలూకాదారీయెస్టేట్లకు సంబంధించినబంజరుభూమి ౫౦౦ యెకరములవఱకు, ఆయెస్టేట్ల కిచ్చి దక్కినవానిని దొరతనము వారే వశము చేసికొని పిస్తు నిర్ణయించిరి. మధ్యపరగణాలయందును పంజాబుదేశమందును ప్రతిగ్రామమునకును సేద్యము కాఁబడినభూమికి ౧౦౦-కి ౨౦౦ లుగా బంజరుభూమి గ్రామస్థులయుపయోగమునిమి త్తము వదలిపెట్టి దక్కినభూములకు పిస్తు కట్టిరి. రయితువారీ-అమర కములో నున్న బొంబాయి, మదరాసురాజధానులయం దున్న బంజరుభూమిలోఁ బ్రతిగ్రామమునకును బశువుల మేఁతకు కావలసి నంతభూమి విడిచిపెట్టి దక్కిన దంతయు సొంతహక్కుగల భూమిగా నెంచఁబడి సర్వేనెంబర్లుగా విభజింపఁబడి ఆ యాభూముల స్థితినిబట్టి పిస్తు ఏర్పఱచి అమలులోనికి తీసికొనిరాఁబడెను. బంజరు భూములు సాధారణముగా నీక్రింద వివరింపఁబడినపద్ధతులనుబట్టి అమరకము చేయఁబడుచున్నది —

## బంజరుభూముల-అమరకము

౧. పెద్దపెద్దచెట్లచే నిండియుండి అడవిగా నుపయోగింపఁ బడుటకు వీలైనను అమరకము చేయఁబడదు. గాని చెట్లచేతనో నిండి యుండి సేద్యమునకుఁగాని తోఁటలు మొదలగునవి వేయుటకు తగిన గాని పెంపకమునకైనభూము అమరకము చేయఁబడును. బంజరుభూములు ముందు తనిఖీచేసి అవి అడవిగా నుపయోగించుటకు పనికిరా వని తోఁచినప్పుడు బంజరుభూమి అమరకముచేయుటకు వ్రాయఁబడిననిబంధనల ననుసరించి అమరకము చేయఁబడును.

౨. ఇట్లమరకము చేయఁబడుభూమి కొన్ని సంవత్సరములకు వ్యవసాయమునకు లాయకుగా చేసికొనుట కవసరమైనకాలపరిమితి ననుసరించి సరుసాయమైనపిస్తునకు కవు లీయఁబడుచుండెను.

౩. ఇట్టిభూములను సర్వే చేసి కోర్టులు రస్తాలు నగరులు వంటకొల్వాలు చేయఁబట్టు ప్రదేశములు గనులు రాలు మొదలగువాని యందు హక్కు గలుగకుండ నీయఁబడుచుండును.

౪. ఇట్టికవులందారు తనకవులంలో నున్నభూమిని న్యాయ్య ముగా నుపయోగించి సరియైనస్థితిలోనికిఁ దీసికొనివచ్చినయెడల కొన్ని పద్ధతులమీఁద నాభూమియందు శాశ్వతపుహక్కు పొంద వచ్చును.

౫. ఇట్టిభూమికి కడమసాధ్రైటకీయెస్టేట్లకువలెనే సెటిల మెంటు చేసి పిస్తు నిర్ణయింపఁబడును. ఇట్టిభూములవిషయమున కొక్కొక్కరాజధానియం దొక్కొక్కవిధముగ నిబంధన లేర్పడి యున్నవి. విశేషధనము వెచ్చించి పెద్దపెద్దవై కాల్వలుగల భూముల యందు తేయాకు, కాఫీ, చింకోనా మొదలగుతోఁటలు వేయు భూముల కమరకము వేఱుగా నుండుటయు, ౧౦ యెకరములు మొదలుకొని ౨౦౦ యెకరములవఱకును సాధారణముగా వ్యవసాయము చేయుటకు కవులు పొందఁబడుభూములయొక్క అమరకపుపద్ధతు లు వేఱువేఱుగా నుండుటయు నవసరమును న్యాయ్యమును గావున వానివిషయమున సందర్భానుసారముగా నమరకపుపద్ధతు లేర్పఱుపఁ బడుచుండును. ఒకప్పుడు బంజరుభూములు దరఖాస్తుమీఁదనే యీయఁబడును. కాని విస్తారప్రదేశ మమరకము చేయునప్పు డట్టి ప్రదేశము సర్వే చేయుటకు కావలసినఖర్చు లిచ్చుపద్ధతిని కొంత సొమ్ము వసూ పుచ్చుకొని ఆభూమికి తగినపిస్తు కట్టి అమరకము చేయఁబడును. ఈవిధముగా హిందూదేశమందలి రాజధానులయందు అనేకవిధములగు అమరకపుపద్ధతు లమలులో నున్నవి. ఈ యమర కపుపద్ధతు లన్నియు కొంచెముగనో గొప్పగనో సర్కారునకు పన్ను చెల్లించునవి. ఇట్లు సర్కారునకు పూర్ణమైన పిస్తు చెల్లింపఁ బడకుండ భూస్వాములయనుభవభుక్తములో నున్నభూములనుగూర్చి వివరింపవలసియున్నది.

## భూస్వాముల లబ్ధికొఱకుఁ జేయఁబడిన యమరకము

ఇట్టి యమరకపుపద్ధతిలో నున్నభూములను మాన్యము లనియు ఈనాము లనియు వాడుదురు. పిస్తు లేకుండఁ గాని తక్కువ పిస్తునకుఁ గాని సైనికసేవక్రిందను ఉద్యోగస్థులసేవనముల క్రిందను దేవాలయములయొక్క సంరక్షణార్థమును వానిసేవకుల యొక్క భుక్తికొఱకును సత్రములు మొదలగు ధర్మములనిమిత్తమును కవులకు, శాస్త్రజ్ఞులకు, పండితులకు, దైవజ్ఞులకు మొదలగువారికిని సాధా

గముకొఱకును దొరతనమువారికిఁ గాని దొరతనమువారి సెప్పున బడసిన వట్లు చేసినప్రజాసేవకులకుఁ గాని చేసినగొప్పకార్యములకును బహుమతిగా భూములను గ్రామములను నిచ్చువాడుక చిరకాలమునుండి హిందూదేశమునఁ గలదు. హిందూరాజులకాలములో నిట్లు గ్రామములు భూములు నిచ్చునప్పుడు, అట్టియీవిని బ్రకటించుచు శాసనములమీఁద వ్రాయువాడుక కలదు. ఇవి రాజు గాని, సంధివిగ్రహాధికారి యను పిలువఁబడుమంత్రి గాని యిచ్చువాడుక కలదు. సైనికుల కిట్టిభూముల నిచ్చుపద్ధతి విజయనగరరాజ్యమందును, దక్షిణహిందూస్థానమును మహమ్మదీయులు జయించినప్పు డక్కడను గలిగియుండెను.

## హిందూరాజులు

ఇట్లు హిందూరాజులచే నవలంబింపఁబడుపద్ధతిని మహమ్మదీయులుగూడ నవలంబించి జాగీర్లను యిల్లుభూములు మొదలుగా నిచ్చుచుండిరి. అట్టిభూముల నన్నింటిని 'ఈనాముభూములు' అను సామాన్యపదముచే వాడుచున్నారు. ఇట్టి యీనాములలో విజయనగరము నేలిన హిందూరాజులును, మధురరాజ్యమును పాలించిన పాండ్యులును, తంజావూరు మొదలగువని యేలినమహారాష్ట్రప్రభువులును, ఓఢ్రదేశము నేలినగజపతులును నాయకులును, ఆయాదేశము లేలుచు విస్తారముగా ధర్మకార్యములనిమిత్త మిచ్చినభూములు నగ్రహారములు నాయాప్రదేశములందును మద్రాసుసర్కారులయందును ఇట్టి యీనాములలో నెక్కువగాఁ గలవు. తరువాత హిందూరాజ్యములు క్షీణించి దేశ మరాజకస్థితికి వచ్చి పిమ్మట మహమ్మదీయులవశమైనతరువాతఁ జిన్నచిన్న దేశనాయకులును బ్రబల సైన్యాధికారులును బలవంతులై సర్కారుయొక్కయాజ్ఞ లేక స్వతంత్రించి యిట్టి భూముల నిచ్చుచువచ్చిరి. ఉత్తరసర్కారులలో నిట్టియీనాముభూము లనేకము లప్పటిజమీందారులవలన, పాళెగాండ్లవలన, గ్రామములు పరగణాలు నిజారాపాడిన యిజారాదారులవలనఁగూడ నీయఁబడిన యిట్టిచిన్నచిన్నయీనాము లనేకములు గలవు. దత్తమండలములోను దక్షిణాదిజిల్లాలలోను మన్నెపాళెగాండ్లుగూడ నంతకంటె నెక్కువగా నీనాము లిచ్చుచువచ్చిరి.

## మహమ్మదీయరాజులు

శాశ్వతముగా శిస్తు లేకుండ భూములను గ్రామముల నిచ్చుపద్ధతి మహమ్మదీయరాజుల కంగీకారము కాకపోయినను బ్రాహ్మణులయొక్క దేవాలయము మొదలగువానియొక్క అనుభవములో నున్న భూములభుక్తమునకుమాత్రము, అడ్డగించుట వారి కిష్టము లేకపోయెను. ఇంతియేకాక వారుగూడఁ గ్రొత్తగా నట్టివారి కట్టి భూముల నిచ్చిరి. తరువాత నింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని జరిగిన యుద్ధములలో దేశ మల్లకల్లోలముగా నున్నయవసరమందు నేవిధమైనన్యాయము నైనయధికారము లేనివారుగూడ నిట్టిభూముల నిచ్చుచుండిరి.

## ఇంగ్లీషుప్రభుత్వము

ఆంగ్లేయప్రభుత్వారంభదినములలోఁ బూర్వాచారము ననుసరించి శాశ్వతముగాఁ గాని కొన్నితరములవఱకు ననుభవించునట్లు గాని కొన్నిజాగీర్లు నిచ్చుచుండిరి. తరువాత ౧౭౭౭-వ సంవత్సరమునందును, ౧౭౭౮-వ సంవత్సరమునందును, ఈస్టిండియాకంపెనీవారి యొక్కనౌకర్లు ఇంగ్లాండుదేశమునుండి 'కోర్టు ఆఫ్ డైరక్టర్సు' పంపించినయుత్తరువులనుబట్టి, పారితోషికముగా నీనాముభూముల నొసగువాడుక మాని అట్టివారికి పెన్షను రూపముగా రొక్కమే యిచ్చుపద్ధతి నవలంబించిరి. ఇట్టిభూములు ప్రకారమున నియమింపఁబడినపనులకంటె భిన్నమగుపనులక్రింద వినియోగపడుటకు వలనుపడదని ౧౮౦౨-వ సంవత్సరమున శాశ్వతనిర్ణయము పూర్వమే ౧౮౦౫-వ సంవత్సరము మొదలుకొని అట్టిభూముల నన్నింటిని సర్కారునకు దాఖలు చేసికొనుపద్ధతి నవలంబించిరి.

## ఈనాం కమీషను

తరువాత ౧౮౫౮-వ సంవత్సరము నవంబరునెలలో 'ఈనాము కమీషను' ఒకటి యేర్పాటుచేయఁబడి, ఈనాములసంగతి యంతయుఁ బరిశీలించి న్యాయముగ మునువానికి శాశ్వతపుపట్టా లీయ నారంభింపఁబడెను. ౫౦ సంవత్సరములభుక్తము ఋజువుపడినయీనాముభూము లన్నింటికి నట్టిభూము లెనియమమునకో ప్రస్తావించినను శిస్తు లేకుండ శాశ్వతముగా నీయఁబడినవి. అట్లు ౫౦-సంవత్సరములభుక్తము కనుపడకపోయినను చాలసంవత్సరములు కనఁబడినవారికిఁగూడ శిస్తు లేకుండ నీయఁబడినవి. ఈ విధముగా నీయఁబడినయీనాములు దానవిక్రయాద్యధికారములు లేకుండ నిప్పుడు వచ్చినంతకాల మనుభవించుటకుఁ గాక, అట్టిదానవిక్రయాదిస్వతంత్రాధికారము పొందవలెనన్నచో సంవత్సరమునకు స్వల్పముగా 'క్విట్ రెంటు,' అను పన్ను నిచ్చుకొను పద్ధతియేర్పడెఁగాని, ఒక్కపర్యాయమే క్విట్ రెంటుక్రింద కొంతసొమ్మిచ్చి స్వేచ్ఛగా పన్ను లేకుండ ననుభవించుపద్ధతియేర్పడదు. గాని యేర్పాటు గావించి పట్టా లొసంగిరి. ఇట్లు విధింపఁబడిన 'క్విట్ రెంటు' స్వల్పమైనది యని యిప్పటి కేమిగాన కొందఱు ఈనాముదారులు తమకుఁ గలుగఁజేసిన విక్రయాద్యధికారమును బోఁగొట్టుకొనిరి. అట్టియీనాములు 'నట్రీ' ఈనాము లని చెప్పఁబడును. అట్టియీనాము లిప్పటికిని కొన్ని గలవు. వానిని ఈనాముదారులు వంశపారంపర్యముగా ననుభవించుటకు హక్కున్నది గాని ఇతరులకుఁ జెందఁజేయుట కధికారము లేదు. అట్టిభూములు దానవిక్రయాదిమార్గమున నితరులకుఁ జెందినప్పుడు సర్కారువారాయీభూమిని గాంచఁబడి తగినశిస్తు విధింపఁబడును. నౌకరీక్రింద నీయఁబడినయీనాములలో ననవసర మున్ననౌకరీలకొఱకువాని నుంచి తక్కినవానికి క్విట్ రెంటు కట్టితాని కొన్ని సంవత్సరముల క్విట్ రెంటు పుచ్చుకొని పన్ను లేకుండఁ గాని యిచ్చిరి. అట్టివారికి యీనాములమాత్రము, ఈనాందారు లంగీకరించినను వంశపరంపర కోరినను క్విట్ రెంటు శాశ్వతముగాఁ గట్టియుంచిరి. దేవాలయ

ఇట్టి యీనాములలో, 'క్విట్ రెంటు' లేక 'జోడీ', 'శేరిక', 'పాలుపు', 'కట్టుబడి' అనుపన్నులు చెల్లించి యనుభవించు ఈనాములు చేరియున్నవి. ఇట్టియీనాములలో కొక్కపర్యాయమే నిర్ణయింపఁబడినసిస్తు ఏఁటేట చెల్లించునవి 'బిల్మక్తా' యీనాము లనియు, ప్రతిసంవత్సరమును పంచుపంటను బట్టి యీయవలసినసిస్తు నిర్ణయింపఁబడినవి 'హంగామీజోడీ' యీనాము లనియుఁ జెప్పఁబడును. పూరాసిస్తుకంటె తక్కువసిస్తు రొక్కరూపకముగాఁ జెల్లించునవి 'కట్టుకట్టుగె' భూము లనఁబడును. ఇట్టిభూములు యుద్ధములోఁ బనిచేసిన సైనికుల కీయఁబడినవి. ప్రతిసంవత్సరము నొకపర్యాయము నిర్ణయింపఁబడిన క్విట్ రెంటుపన్ను నిచ్చు ఈనాము భూములు 'భాయమ్‌జోడీ' లేక 'జారపాత్‌మక్తా' లనఁబడును 'జోడీ' కంటె తక్కువగాను, న్యాయమైన సర్కారుపన్నుకంటెఁ దక్కువగను సిస్తు చెల్లించుదు భాయమైన అమరకపుపద్ధతిలో నున్న గ్రామములు 'రొక్కకట్టుగె' గ్రామము లనఁబడును.

## ధాన్యరూపముగా పన్నిచ్చి యనుభవింపఁబడుభూములు

౧ శేల్‌కట్టుగె — పూరాసిస్తుకంటె తక్కువయినసిస్తు ధాన్యరూపముగాఁ గాని, అప్పటి కైన ధాన్యమూల్యముగాఁ గాని పన్నిచ్చునవి.

౨ పాలంభూములు - ధాన్యరూపముగా తక్కువసిస్తు చెల్లించుపల్లపుభూములు స్థలనిర్ణయము లేకుండ భూములు పాయింపు చేయఁబడకుండ నీయఁబడినయీనాములు

౧. గ్రామముపైఁ జెల్లు సర్కారుసిస్తుమీఁద రూపాయకుఁ గొన్ని అణాలవంతున అనుభవించుటకు హక్కు గలుగఁజేయఁబడిన గ్రామము లన్నియు శ్రోత్రియము లనఁబడును

౨ దిట్టము — అనఁగా గ్రామములో ఏఁటేట సాగుబడి చేయఁబడుభూమిలోఁ గొంతభాగము జేరుపటిచి, అభాగముమీఁది సిస్తు గ్రామలెక్కలలోఁ జేర్పకుండ ననుభవించు గ్రామములు.

3 ఈవుమాన్యము — 'సర్కారువకుఁ జెల్లవలసు భూమిసిస్తులోఁ గొంతభాగము' అని అనుభవించునది.

## చక్‌బందీ యీనాములు

ఇట్లు గాక స్థలనిర్దేశ చేర్పడి సరిహద్దులు గలిగినయీనాములు 'చక్‌బందీ' ఈనాము లనఁబడును. ఈయీనాములు రెండువిధములు.

౧. రివిన్యూలెక్కలలో నమోదా కాఁబడినవి దాఖలా యీనాములు.

౨ అట్లు లెక్కలలో నమోదా కానివి గైర్‌దాఖలా యీనాములు

మఱియును, ఈనాములు ప్రతిఫల మపేక్షించక యీయఁబడిన వనియు, నౌకరీ నపేక్షించి యీయఁబడిన వనియు రెండువిధములు. ఇవి గాక దస్తర్‌తోటలు అనియు, తోఁపుఈనాము అనియు దక్షిణార్కాటుజిల్లాలో నొకతెగయీనాముభూములు గలవు. ఇవి తోఁటలు వేసి పెంచుటకుఁ బ్రోత్సాహము కలిగించునిమిత్తము తోఁటలు వేయువారి కీయఁబడినవి. అట్టియీనాముభూములలోనితోఁటలు చచ్చిపోయినప్పుడు భూములు సర్కారువకుఁ జెందును. వీనికే ధర్మారాము ఈనాము లందురు.

స్వకుటుంబపోషణార్థ మెంతవి కమగ్రహార్యకముగా బహుమతిగా వంశపారంపర్యముభవము గలహక్కుతో దానవిక్రయాద్యధికారములతో నీయఁబడినవి కొన్నియు, ప్రతిగ్రహీతవంశ మున్నంతవఱకు ననుభవింపఁబడునట్లు కొన్నియు, ప్రతిగ్రహీతయావజ్జీవము మాత్రమే యనుభవింపఁదగినట్లు కొన్నియు, నీయఁబడినయీనాములు గలవు ఈనాముకమీషనుకాలమందు దానవిక్రయాద్యధికారము లేనియీనాములు దత్తపుత్రులవంశస్థులకు దానరూపముగాఁ గాని దయారూపముగాఁ గాని దఖలుపడినవానికిని దప్పఁ దక్కిన యీనాము లన్నింటికిని క్విట్‌రెంటుపన్ను కట్టఁబడి పట్టా లీఁబడినవి. బ్రాహ్మణుల కీయఁబడిన యీనాములు బ్రహ్మోదాయము లనఁబడును. ఇవి అగ్నిహోత్ర, భారత, భట్టవృత్తి, పంచాంగ, పురాణ, వేదవృత్తులను నామభేదములు చెందియున్నవి ఇట్లు గ్రామ మంతయు నీయఁబడినప్పుడు అగ్రహారము అని పిలువఁబడుచు నొక్కకుటుంబము వారికి నిచ్చినప్పు డాకుటుంబమువారును, ఒక్కకుటుంబముకంటె హెచ్చుకుటుంబములవారి కిచ్చినప్పుడు, అన్నికుటుంబములు సమ్మభాగములుగా ననుభవించుటకును హక్కు గలిగియున్నారు. ఇట్టియగ్రహారములలోఁ గొంత క్విట్‌రెంటు కట్టి యీయఁబడినవి బిల్మక్తా అగ్రహారము లనియు, కొంతపన్ను కట్టి యీయఁబడినవి కట్టుబడి లేక జోడీ అగ్రహారము లనియు, అగ్రహారములోఁ బండినపంటమీఁద పుట్టి ౧-కి ఇంతసిస్తు అని నిర్ణయించి సిస్తు కట్టఁబడినవి పుట్లకట్టుబడి అగ్రహారము లనియు, ఏపన్ను లేకుండ నీయఁబడినవి సర్వాగ్రహారము లనియు, పంటలో మూఁడవవంతు సిస్తుగా నిచ్చి యనుభవింపఁబడు నగ్రహారములు త్రిభోగాగ్రహారము లనియుఁ జెప్పఁబడును. అగ్రహారములో నున్న బ్రాహ్మణకుటుంబములవారందఱును తక్కువపన్ను చెల్లించుచు ననుభవించు నగ్రహారములు ధర్మాసనాగ్రహారము లని పిలువఁబడును శ్రోత్రియాగ్రహారములు వేదాధ్యయనసంపన్ను లగు బ్రాహ్మణుల కీయఁబడినవేగాక యితర బ్రాహ్మణుల కీయఁబడినవి కూడఁ గలవు బ్రాహ్మణేతరులకు ధర్మార్థమీయఁబడిన యీనాములు ఖైరాతీయీనాము లనఁబడును. తొల్లింటి హిందూరాజులచే శాసనములు వ్రాయఁబడి దఖలుపడినయీనాములు 'అత్తమఖా' యీనాము లని పిలువఁబడును. ఆయీనాందారులకు దానవిక్రయాద్యధికారములతో సర్వాధికారము గలిగి వంశపారంపర్యముగా శాశ్వతముగా నని యనుభవింపఁబడుచున్నవి.

ఈయీనాములు కొన్ని పారితోషికముగాఁ గాని, ప్రతిగ్రహీతలు చేసినకార్యములకు బహుమతిగాఁ గాని యీయఁబడినయీనాములు కొన్ని గలవు అవి యేవనఁగా —

అద్దెయోధిమాన్యము - అడవి కొట్టి భూమిని వ్యవసాయార్హముగాఁ జేసినందుల కీయఁబడినయీనాము.

అరసినాగ యీనాము - వివాహకాలమందు కట్నముగా నీయఁబడినయీనాము.

కాఘమారీ - పెద్దపులిని జంపినందుల కీయఁబడినయీనాము

బహద్ లేక కోటాఖడ్డి - గ్రామము కాపాడుకొఱకు కోట బురుజు కట్టినందులకై యీయఁబడినయీనాము

దండుగ - రాజకార్యములనిమిత్తము విస్తారమువ్యయముఁ దీసికొనఁబడుటవలన మిక్కిలి నష్టముం బొందినవారి కీయఁబడినయీనాము

ఏరువాక - గ్రామములో భూమిని మొట్టమొదట నాఁగలి కట్టి దున్నినవాని కీయఁబడినయీనాము

గడ్డితీరువ - వ్యవసాయము చేయుటకు మిక్కిలి కష్టతరమైన మెరకభూములను సేద్యముచేసినందులకు తక్కువశిస్తు కట్టి యీయఁబడినయీనాము

ఈడిగ - కల్లునిమిత్తము నీరాఁతచెట్లు వేసినవాని కీయఁబడిన యీనాము

ఇరుంబుకట్టి - రాళ్లనుండి యినుము తీసి కమ్మరిపని చేయుటకుఁ బ్రోత్సాహము కలిగించినందుల కీయఁబడినయీనాము

కాలాపాట్కా - నేఁతగాండ్రు గ్రామములో నివసించియుండుటకుఁ బ్రోత్సాహము కలిగించినందుల కీయఁబడినయీనాము

కేటి - నేఁతగాండ్రను దీసికొనివచ్చి గ్రామమునఁ గాఁపురము పెట్టించిన పెద్దరైతున కీయఁబడినయీనాము

నారికట్టి - వేఁటలో నక్కలను జంపినందుల కీయఁబడినయీనాము.

నెత్తురుకట్టు, నెత్తురుపట్టు, రక్తమాన్యము, ఉదరపట్టు, వలిక్కడీ, రక్తకొడగ అను పేర్లుగల ఈనాములు యుద్ధములోఁ జచ్చిపోయినవారికుటుంబపోషణార్థము గాని, పరోపకారార్థము శరీరమునందు గాయములు పొందినవారికిని వారికుటుంబమునకుఁ గాని ప్రతిఫలముగా నీయఁబడినయీనాములు.

పీర్‌సరిహద్దు - ఇంకొక గ్రామము సరహద్దుమార్గము కనుభూముల నడిపి నీటికాలువ ప్రత్యేకముగ కంగీకరించినందులకుఁ బ్రతిఫలముగా నీయఁబడినయీనాము.

పెల్లట్టు - పెండ్లి ప్రత్యేకమగు మొట్టమొదటఁ బిల్ల వితెచి ప్రత్యేకముగ మొదటిసారి తెచ్చినవాని కీయఁబడినయీనాము.

పల్లికట్టు - గ్రామము కట్టినవాని కీయఁబడినయీనాము.

పులికట్టు - మంత్రసామర్థ్యముచేత పులినోరు కట్టి జానపదుల యపాయము తప్పించినందుల కీయఁబడినయీనాము.

పంటువారీ లేక పట్టువారీ - గ్రామము దున్నుటకుఁ గల రైతులకు, ఆ గ్రామకృషి వృద్ధిపఱచినందుల కీయఁబడినయీనాము.

స్థలకీనాము - ఉత్తరార్కాడుజిల్లాలో పల్లికట్టు ఈనాము లనే స్థలయీనాము లని పిలుతురు తిరుచునాపల్లి మొదలగు కొన్ని దక్షిణాదిజిల్లాలలో గ్రామస్థు లందఱకును సామాన్యపసులమేఁతయై సేద్యము చేయఁబడుభూములలోనుండి రైతు లందఱుచే గొంచెము గొంచెముగా నీయఁబడుమాన్యములు స్థలకీనాము లందురు.

ఛత్రీగ్ - రాజాస్థానమునకుఁ దఱుచుగా రానీయఁబడుచు నచట గౌరవమును బొందుట కర్హతగల పెద్దమనుష్యులపోషణముకొఱకును, వారు రాజగౌరవమును కాపాడుకొనుటకు నీయఁబడిన యీనాము.

మడవ లేక నవ్వణి - నంవత్సరీకముంటివాని కీయఁబడినయీనాము

ముతలికన్ - ఒక గొప్పగౌరవస్థుని నాశ్రయించుకొన్నవారికిని సేవ చేయువారికి నీయఁబడినయీనాము

నిర్వాణమాన్యము - దిగంబరుఁడై తిరుగుసన్యాసికి కీయఁబడిన యీనాము

రాజబంధువు - పాళెగార్లయొక్కయు, జమీందారులయొక్కయు బంధువులకుటుంబపోషణార్థ మీయఁబడినయీనాము

బేదార్ - వేఁటలోఁ బ్రజ్ఞకలవాని కీయఁబడినయీనాము

## నౌకరీయీనాములు

భూస్వాములకుఁ గాని జమీందారులకుఁ గాని సొంతనౌకరి నిమిత్త మీయఁబడినవియు, గ్రామసముదాయమునకుఁ గాని ప్రజాక్షేమముకొఱకుఁ గాని నౌకరి చేయుట కేర్పఱుపఁబడిన వనియు నివి రెండువిధములు ఇందు మొదటిరకముఈనాములు పాళెగార్లవలనఁ గాని, దేశాధిపతులవలనఁ గాని పోలీసు లేక మిలిటరీనౌకరీలు చేయఁబడినందుల కీయఁబడినభూములు ఇవి ‘అమరం’ భూములనఁబడును వీని ననుభవించువారి నమరందారు లని పిలుతురు. అట్టి యుద్యోగములను చేయుబంట్రౌతుల కీయఁబడినభూములు కట్టుబడులనఁబడును. గంజాముజిల్లాలో పర్లాకిమిడిజమీందారిలో నేటికి ‘మలయి’ లను కొండభూములయందు నొకవిధమగు మిలిటరీనౌకరీయీనాముల పద్ధతి కలదు ఈప్రదేశమున నివసించు ప్రజలు సవర లనఁబడుదురు. వీరు తిరుగఁబాటు చేయుచు పల్లెడి ప్రదేశములందలి ప్రజలను బాధించుచుండెడివారు.

ఇట్టి యీనాములలో, 'క్విట్ రెంటు' లేక 'జోడీ', 'శేరీక', 'పాలుపు', 'కట్టుబడి' అనుపన్నులు చెల్లించి యనుభవించు ఈనాములు చేరియున్నవి. ఇట్టియీనాములలో కొక్కపర్యాయము నిర్ణయింపఁబడినసిస్తు ఏఁటేఁట చెల్లించునవి 'కిల్పస్తా' యీనాము లనియూ, ప్రతిసంవత్సరము పండుపంటనుబట్టి యీయఁదలసినసిస్తు నిర్ణయింపఁబడినవి 'హంగామీ జోడీ' యీనాము లనియూఁ జెప్పఁబడును. పూరాసిస్తుకంటె తక్కువసిస్తు రొక్కరూపకముగాఁ జెల్లించునవి 'కట్టుకుట్టగి' భూము లనఁబడును. ఇట్టిభూములు యుద్ధములోఁ బనిచేసిన సైనికుల కీయఁబడినవి. ప్రతిసంవత్సరము నొకపర్యాయము నిర్ణయింపఁబడిన క్విట్ రెంటుపన్ను నిచ్చు ఈనాము భూములు 'ఖాయమ్ జోడీ' లేక 'మారపాల్ మస్తా' లనఁబడును. 'జోడీ' కంటె నెక్కువగాను, శాశ్వతమైన సర్కారుపన్నుకంటెఁ దక్కువగను సిస్తు చెల్లించుచు శాశ్వతమైన అమరకపుపద్ధతిలో నున్న గ్రామములు 'రొక్కకుట్టగి' గ్రామము లనఁబడును

## ధాన్యరూపముగా ప న్నిచ్చి యనుభవింపఁబడుభూములు

౧. సేత్ కుట్టగి — పూరాసిస్తుకంటె తక్కువయినసిస్తు ధాన్యరూపముగాఁ గాని, అప్పటి ధర ధాన్యమూల్యముగాఁ గాని పన్నిచ్చునవి.

౨. పాళంభూములు - ధాన్యరూపముగా తక్కువసిస్తు చెల్లించుపల్లపుభూములు స్థలనిర్ణయము లేకుండ భూములు పాయింపు చేయఁబడకుండ నీయఁబడినయీనాములు

౧ గ్రామముపైఁ జెల్లు సర్కారుసిస్తుమీఁద రూపాయకుఁ గొన్ని అణాలచొప్పున అనుభవించుటకు హక్కు కలుగఁజేయఁబడినగ్రామము లన్నియూ శ్రోత్రియము లనఁబడును.

౨. దిట్టము — అనఁగా గ్రామములో ఏఁటేఁట సాగుబడి చేయఁబడుభూమిలోఁ గొంతభాగము వేఱుపఱిచి, ఆభాగముమీఁది సిస్తు గ్రామలెక్కలలోఁ జేర్పకుండ ననుభవించుగ్రామములు.

౩ అవుమాన్యము — 'సర్కారునకుఁ జెల్లబడు భూమిసిస్తులోఁ గొంతభాగము' అని అనుభవించునది.

## చక్ బందీ యీనాములు

ఇట్లు గాక స్థలనిర్దేశ మేర్పడి పరిమాణము కలిగినయీనాములు 'చక్ బందీ' ఈనాము లనఁబడును. ఈయీనాములు రెండువిధములు

౧. రివిన్యూలెక్కలలో నమోదు కాఁబడినవి దాఖలా యీనాములు.

౨ అట్లు లెక్కలలో నమోదు కానివి గైర్ దాఖలా యీనాములు.

మఱియును, ఈనాములు ప్రతిఫల మపేక్షించక యీయఁబడిన వనియూ, సాకరీ నపేక్షించి యీయఁబడిన వనియూ రెండువిధములు. ఇవి గాక దస్తర్ తోఁట లనియూ, తోఁపుఈనాము లనియూ దక్షిణాది జిల్లాలలో కొన్ని ఈనాముభూములు కలవు. ఇవి తోఁటలు వేసి పెంచుటకుఁ బ్రోత్సాహము కలిగించునిమిత్తము తోఁటలు వేయువారి కీయఁబడినవి. అట్టియీనాముభూములలోనితోఁటలు చచ్చిపోయినప్పుడు భూములు సర్కారునకుఁ జెందును. వీని కే ధర్మాదాయ ఈనాము లందురు.

స్వకుటుంబపోషణార్థ మొకని కనుగ్రహపూర్వకముగా బహుమతిగా వంశపారంపర్యానుభవము గలహక్కుతో దానవిక్రయాద్యధికారములతో నీయఁబడినవి కొన్నియూ, ప్రతిగ్రహీతవంశ మున్నంతవఱకు ననుభవింపఁబడునట్లు కొన్నియూ, ప్రతిగ్రహీతయావజ్జీవము మాత్రమే యనుభవింపఁదగినట్లు కొన్నియూ, నీయఁబడినయీనాములు కలవు. ఈనాముకమీషనరుగారిచేఁ దానవిక్రయాద్యధికారము లేనియీనాములు దత్తపుత్రులవంశస్థులకు దాయరూపముగాఁ గాని దయారూపముగాఁ గాని దఖలుపడినవానికిని దప్పఁ దక్కినయీనాము లన్నింటికిని క్విట్ రెంటుపన్ను కట్టఁబడి పట్టా లీయఁబడినవి. బ్రాహ్మణుల కీయఁబడిన యీనాములు బ్రహ్మోదాయము లనఁబడును. ఇవి అష్టాయన, భారత, భట్టవృత్తి, పంచాంగ, పురాణ, వేదవృత్తి అను నానాభేదములు చెందియున్నవి. ఇట్లు గ్రామ మంతయూ నీయఁబడినప్పుడు అగ్రహారము అని పిలువఁబడుచు నొక్కకుటుంబమువారికి నిచ్చినప్పు డామకుటుంబమువారును, ఒక్కకుటుంబముకంటె నెక్కువకుటుంబములవారి కిచ్చినప్పుడు, అన్నికుటుంబములు నన్నిభాగములుగా ననుభవించుటకును హక్కు కలిగియున్నారు. ఇట్టియగ్రహారములలోఁ గొంత క్విట్ రెంటు కట్టి యీయఁబడినవి కిల్పస్తా అగ్రహారము లనియూ, కొంతపన్ను కట్టి యీయఁబడినవి కట్టుబడి లేక జోడీ అగ్రహారము లనియూ, అగ్రహారములోఁ బండినపంటమీఁద పుట్టి ౧-కి ఇంతసిస్తు అని నిర్ణయించి సిస్తు కట్టఁబడినవి పుట్ల కట్టుబడి యగ్రహారము లనియూ, ఏపన్ను లేకుండ నీయఁబడినవి సర్వాగ్రహారము లనియూ, పంటలో మూఁడవవంతు సిస్తుగా నిచ్చి యనుభవింపఁబడునగ్రహారములు త్రిభోగ్యాగ్రహారము లనియూఁ జెప్పఁబడును. అగ్రహారములో నున్న బ్రాహ్మణకుటుంబములవారందఱును తక్కువపన్ను చెల్లించుచు ననుభవించునగ్రహారములు ధర్మాసనాగ్రహారము లని పిలువఁబడును. శ్రోత్రియాగ్రహారములు వేదాధ్యయనసంపన్ను లగు బ్రాహ్మణుల కీయఁబడినవేకాక యితర బ్రాహ్మణుల కీయఁబడినవి కూడఁ గలవు. బ్రాహ్మణేతరులకు ధర్మార్థ మీయఁబడిన యీనాములు ఖైరాతీయీనాము లనఁబడును. ఢిల్లీయందలి హిందూరాజులచే శాసనములు వ్రాయఁబడి దఖలుపడినయీనాములు 'ఆల్తమఘా' యీనాము లని పిలువఁబడును. ఆయీనాముదారులకు దానవిక్రయాద్యధికారములతో సర్వాధికారము కలిగి వంశపారంపర్యముగా శాశ్వతముగా నని యనుభవింపఁబడుచున్నవి.

ఈయీనాములు కొన్ని పారితోషికములుగాఁ గాని, ప్రతిగ్రహీతలు చేసినకార్యములకు బహుమతిగాఁ గాని యీయఁబడినయీనాములు కొన్ని గలవు అవి యేవనగా :—

అద్దెయీనామీమాన్యము - అడవి కొట్టి భూమిని వ్యవసాయార్హముగాఁ జేసినందుల కీయఁబడినయీనాము

అరసినాగె యీనాము - వివాహకాలమందు కట్నముగా నీయఁబడినయీనాము.

బాఘుమారీ - పెద్దపులిని జంపినందుల కీయఁబడినయీనాము

బహూద్ లేక కోటాభద్ది - గ్రామము కాపాడుకొనుటకు కోట బురుజు కట్టినందులకై యీయఁబడినయీనాము.

దండుగ - రాజకార్యములనిమిత్తము విస్తారముసొమ్ముఁ దీసికొనఁబడుటవలన మిక్కిలి నష్టమును బొందినవారి కీయఁబడినయీనాము.

ఏరువాక - గ్రామములో భూమిని మొట్టమొదట కాఁడి కట్టి దున్నినవాని కీయఁబడినయీనాము

గడ్డిబీరుమ - వ్యవసాయము చేయుటకు మిక్కిలి కష్టతరమైన మెరకభూములను సేద్యముచేసినందులకు తక్కువశిస్తు కట్టి యీయఁబడినయీనాము

ఈడిగ - కల్లునిమిత్తి మాఁకచెట్లు వేసినవారి కీయఁబడిన యీనాము.

ఇరుంబుకట్టి - రాళ్లనుండి యినుము తీసి కమ్మరిపని చేయుటకుఁ బ్రోత్సాహము కలిగించినందుల కీయఁబడినయీనాము.

జాలాపాట్కా - పేరగాండ్రు గ్రామములో నివసించియుండుటకుఁ బ్రోత్సాహము కలిగించినందుల కీయఁబడినయీనాము

కుటి - వేద్యగాండ్రను దీసికొనివచ్చి గ్రామములోఁ గాఁపురము పెట్టించిన పెద్దరైతున కీయఁబడినయీనాము

వారిపట్టి - చేఁటలో వక్కలను జంపినందుల కీయఁబడిన యీనాము.

నెత్తురుకట్టు, నెత్తురుపట్టు, రక్తమాన్యము, ఉదరిపట్టు, పలికూలి, రక్తకొడెగ అను పేర్లుగల యీనాములు యుద్ధములోఁ జచ్చిపోయినవారికుటుంబపోషణార్థము గాని, పరోపకారార్థము శరీరమునందు గాయములు పొందినవానికిని వానికుటుంబమునకుఁ గాని ప్రతిఫలముగా నీయఁబడినయీనాములు.

సిర్‌కటిపొద్దు - ఇంకొక గ్రామము మునసబుగార్థము కమభూములను సిరికాలుక ప్రత్యేట కంటకించినందునకుఁ ప్రతిఫలముగా నీయఁబడినయీనాము.

పెల్లెట్టు - కొంతు ప్రత్యేకత్వము పెట్టుకొనుటకు ఎల్లు నిచ్చి ప్రత్యేట మొదటిచేసినవాని కీయఁబడినయీనాము.

పల్లికట్టు - గ్రామము కట్టినవాని కీయఁబడినయీనాము.

పులికట్టు - మంత్రసామర్థ్యముచేత పులినోరు కట్టి దానివలని యపాయము తప్పించినందుల కీయఁబడినయీనాము.

పంటువాలి లేక పట్టువాలి - గ్రామము దున్నువానికి గల రైతులకు, ఆ గ్రామకృషి వృద్ధిపఱిచినందుల కీయఁబడినయీనాము.

స్థలకీనాము - ఉత్తరార్కాడుజిల్లాలో పల్లికట్టు ఈనాములకే స్థలయీనాము అని పేరు. తిరుచునాపల్లి మొదలగు కొన్ని దక్షిణాదిజిల్లాలలో గ్రామస్థు లందఱును గామిలిసినపనులనిమిత్తమై సేద్యము చేయఁబడుభూములలోనుండి రైతు లందఱుచేఁ గొంచెము కొంచెముగా నీయఁబడుమాన్యములు స్థలకీనాము లందురు.

ఖిల్లాత్ - రాజాస్థానమునకుఁ దఱచుగా రానీయఁబడుచు నచట గౌరవమును బొందుట కర్హతగల పెద్దమనుష్యులపోషణము కొఱకును, వారు రాజగౌరవమును కాపాడుకొనుటకు నీయఁబడిన యీనాము.

ముడుప లేక సప్పతి - సపకలేనిపుండినవాని కీయఁబడినయీనాము

మురతిలిక్ - ఒక గొప్పగౌరవస్థుని సాత్రయం మఱొకన్న వారికిని సేవ చేయువారికి నీయఁబడినయీనాము.

నిర్వాణమాన్యము - దిగంబరుఁడై తిరుగుసన్యాసి కీయఁబడిన యీనాము.

రాజబంధువు - పాళెగార్లయొక్కయు, జమీందారులయొక్కయు బంధువులకుటుంబపోషణార్థ మీయఁబడినయీనాము

పదార్ - పేటలోఁ బ్రజ్ఞకలవాని కీయఁబడినయీనాము

## నౌకరీయీనాములు

భూస్వాములకుఁ గాని జమీందారులకుఁ గాని సొంతనౌకరీనిమిత్త మీయఁబడినవియు, గ్రామసముదాయమునకుఁ గాని ప్రజాక్షేమమునకుఁ గాని నౌకరీ చేయుట కేర్పఱుపఁబడిన వనియు నివి రెండువిధములు. ఇందు మొదటిరకము యీనాములు పాళెగార్లవలనఁ గాని, దేశాధిపతులవలనఁ గాని పోలీసు లేక మిలిటరీనౌకరీలు చేయఁబడినందుల కీయఁబడినభూములు ఇవి 'అమరం' భూము లనఁబడును. వీని ననుభవించువారి నమరందారు లని పిలుతురు. అట్టి యుద్యోగములను జేయుటం దొరకుల కీయఁబడినభూములు కట్టుబడు లనఁబడును. గంజాముజిల్లాలో పర్లాకిమిడిజమీందారిలో చేరిన 'మలియా' అను కొండభూములయందు నొకవిధమగు మిలిటరీ నౌకరీయీనాముల పద్ధతి కలదు. ఈ ప్రదేశమున నివసించు ప్రజలు సవర అనఁబడుదురు. వీరు తిరుగఁబాటు చేయుచు పల్లెటి ప్రదేశములయందలి ప్రజలను బాధించుచుండువారు.

దశబంధము

గ్రామస్థులకు నౌకరి చేయుటకొఱకు ఇయ్యఁబడిన యీనాము భూములు కొన్ని కలవు. ఇందు దశబంధము, లేక కట్టుకొడిగె అనునది నాలుగుల ముఖ్యమైనది. పెట్టుబడులలో ౧౦-వ వంతు ఈనాముగా నీయఁబడుటచే వీని దశబంధయీనాము లని పేరు పొందినవి. చెఱువు గాని మాయి గాని నీటికాల్వ గాని త్రవ్వి దానిని మంచిస్థితియం దుంచుచున్నందులకు భూరూపముగాఁ గాని పిస్తురూపముగాఁ గాని యీయఁబడు ఈనాములు దశబంధయీనాము లనఁబడును. భూరూపక ములకు 'ఖండదశబంధ' మనియు, పిస్తురూపకముగా నీయఁబడినప్పుడు 'మమిూల్దర్‌దశబంధ' మనియుఁ జెప్పఁబడును. ఇట్టీనాముగా నీయఁ బడినభూమిశిస్తు గాని రొక్కపుమొత్తము గాని అవసరమై చెల్లింపఁ బడినసొమ్ముమొత్తమునుబట్టి యీయఁబడుచుండెను. కడపజిల్లాలో సర్కారుభూములకు నీరు సమకూర్చుచెఱువులను మంచిస్థితియం దుంచుటకుఁ గాని, భూములను చదును చేసి కృష్యర్హముగాఁ జేసి నందులకుఁ గాని బంజరుభూమి సేద్యము చేయఁబడుస్థితికిఁ దెచ్చి నందులకుఁ గాని దశబంధ మనుపేరచే యీనాములు పుట్టఁబడెను. ఉత్తరార్కాటుజిల్లాలో దశబంధ యీనాందారు ఆయకట్టుభూమి మీఁదిశిస్తులవంతు, ఈనాముగాఁ బొందినప్పుడు 'చౌకాయిదశబంధం దారు' అనియు, ఆయకట్టుభూమి యంతయుఁ దక్కరపిస్తున ఖమ్మ వించునప్పుడు 'కలవాడీదశబంధందారు' అనియుఁ బిలువఁబడుచుందురు. ఈదశబంధం ఈనాందారులు చెఱువులను మంచిస్థితిలో నుంచనప్పుడు వారి కీయఁబడినయీనాముభూములను గాని చేసినసదుపాయములను గాని తొలగింపవచ్చును. లెక్కదాఖలాభూములకన్న ఎక్కువ నేల దంప సాగుబడి అయినప్పు డట్లు అదనముగా సాగుబడి అయినభూములలో వచ్చిన లాభములోఁ గొంతభాగముకూడ మమిూల్దర్‌దశబంధయీనాందార్లు పుచ్చుకొనుటకు హక్కు కలిగియుండుట గలదు. క్రొత్తగా, పల్లపుసాగుబడి కాఁబడుభూములమీఁదను చెల్లఁబడు నీటిపన్నులో రు ౧౦౦-కి రు ౨౦ వంతున ఖండదశబంధందారు లనుభవించు టకు హక్కు కలిగియున్నారు. శాశ్వతపుజమీందారీసెటిలు మెంటు నాఁటి కిట్టి దశబంధం ఈనాములు భుక్తములో నుండి యున్నను జమీందారీయెస్టేటులో నున్న అట్టియీనాములహక్కు సర్కారువారు సంపూర్ణముగా వదలివైచిరి

ఇతర యీనాములు

అలొట్టి - మామూలుగాఁ జేయవలసినపనులకొఱకు రయితుల వందలను సమకూర్చుటాని కీయఁబడినయీనాము.

అంబర్ లేక పల్లిబాఁడి లేక తెప్పక్ - ఏఱు దాఁటించునౌకరి కీయఁబడినయీనాము.

అక్కరమ్ - ఏటిగట్లు, ఆనకట్టలు మొదలగువాని పనులు త్రొక్కి పాడు చేయకుండఁ గాపాడి వానిపై గడ్డి పెంచినందుల కీయఁబడిన యీనాము.

బందెలా - పశువులు చేలలోఁ బడి సస్యము పాడుచేయకుండఁ గాపాడినందుల కీయఁబడినయీనాము.

కరేమాఫ్లం లేక కలంపట్టు లేక కప్పాంపట్టు - చెఱువులు బాగుచేయునిమిత్తము మాలివాండ్రను సమకూర్చినందుల కీయఁబడిన యీనాము

ఖుల్గా లేక పటాళా - ఇవి చెఱువులకును కాలువలకును చిన్న చిన్న రిపేర్లు గావించి త్రవ్వినందుల కీయఁబడినయీనాము

కులంకావల్ - రయితులు చెఱువులో నీరు వృథాగా కర్చు పెట్టకుండఁ గాపాడినందుల కీయఁబడిన యీనాము

కాసల్ - ఆనకట్టలమీఁదను, పంటకాల్వలగట్లమీఁదను దుబ్బు గడ్డి పెంచునౌకరి కీయఁబడిన యీనాము.

నీరుమునక - నీటిలో మునిఁగి చెఱువుతూములను తెఱచునౌకరి కీయఁబడిన యీనాము

పట్టి - పశువులు చేలలోఁ బడి మేయకుండఁ గాపాడునౌకరి కీయఁబడిన యీనాము

పాసుబడి - సర్కారుభూములను పాలుబడి చేయుటకుఁ బ్రోత్సాహపఱచు చున్నందులకుఁ జెత్తనదారుల కీయఁబడిన యీనాము

ఉప్పర లేక ఒడ్డె - చెఱువులు మరమ్మత్తు చేయునౌకరి కీయఁ బడినయీనాము

ఊరమి - గ్రామస్థులవాడుకనిమిత్తము మంచినీళ్ల చెఱువులను మంచిస్థితియం దుంచునౌకరి కీయఁబడినయీనాము

వాయిక్కాల్ - నీటికాల్వలు, పంటనూతులయొక్క యితర జలాధారములు పరియాయనస్థితియం దుంచినందుల కీయఁబడిన యీనాము

కృషి యాధారముగను వృత్తిగను కల గ్రామమందుఁ గాఁపుర మున్న గ్రామస్థులు తమస్వతంత్రము లన్నియుఁ జక్కఁగా నెఱవేర్చు కొనుటకును, తమవృత్తులకు భంగము లేకుండ సుఖముగా జీవించుట కును ముఖ్యమనుకొన్నాటు లన్నియుఁ బ్రతిగ్రామమందును జేయఁ బడియున్నవి. గ్రామలెక్కలు వ్రాయుటకు కరణము అను వధికారు లుండిరి. వీరికే మహారాష్ట్రదేశమున కులకరణీ అనియు, ఉత్తర హిందూదేశమున పటవారీ అనియు, ఆంధ్రదేశమున కరణాల్ అనియు నందురు. ఈస్వతంత్రకృషకులు ప్రతిగ్రామమునకు జోగరిడ్డలు ప్రత్యేక మనుమనుండియు ఏర్పడియున్నారు. ఈయుద్యోగస్థులకును, గ్రామ ములసదుపాయములనిమిత్త మేర్పడినయితరగ్రామసేవకులకును వారు చేయుపనులకుఁ బ్రతిఫలముగఁ గొంతభూమి గాని కొంతశిస్తు గాని పంటలోఁ గొంతభాగము గాని మేరలు, రుసుములు, 'స్వతంత్రము' అనుపేర నీయఁబడుచున్నవి. ౧౮౦౨-వ సంవత్సరములో జారీకాఁ బడిన ౨౯-వ రెంబరు రెగ్యులేషను ననుసరించి శాశ్వతముగా

పెట్టిలో పెట్టుటకు గాఁబడిన జమీందారీయెస్టేట్లయందలి కరణము లను నియమించుట, శిక్షించుట మొదలగునధికారములు జమీం దారుల కీయఁబడినవి. ఈ కరణములయుద్యోగము వంశపారంపర్య ముగ వచ్చుహక్కు కలది. ఈ రిక్కార్డులను కరణములవిమయ మునకే గాక తక్కిన గ్రామనౌకర్లు, అనఁగా గ్రామవడ్రంగి, గ్రామ కుమ్మరి, గ్రామమంగలి, గ్రామచాకలి, గ్రామకమ్మరి, గ్రామజ్యోతి షుఁడు, గ్రామపురోహితుఁడు వగైరా యేడుగురవిషయమునను సంపూర్ణమైన యేర్పాటులును నిబంధనలును గలిగియున్నవి. తరువాత ౧౮౯౪-వ సంవత్సరమున జారీచేయఁబడిన ౨-వ నెంబరు ఆక్టు అను మదరాసుప్రొప్రైటరీయెస్టేట్లవిలేజిసర్వీసుఆక్టు జారీకాఁబడి దానిని బట్టి జమీందారులకు కరణములమీఁదియధికారమునకుఁ గొన్ని మార్పులు కలుగఁజేసి అంతకుమున్ను కర ము లనుభవించుచున్న నౌకరీయీనాములకు శిస్తు కట్టి శాశ్వతముహక్కుతోఁ బట్టాల నిచ్చి సర్కారుగ్రామములయొక్క శిస్తునుబట్టియు, కరణములు చేయవలసిన పనులనుబట్టియు జీతమును ఏర్పఱిచిరి. తరువాత ౧౮౯౫-వ సంవ త్సరమున ౩-వ నెంబరున జారీకాఁబడిన 'హెరిడిటరీ విలేజి ఆఫీ సర్సు' ఆక్టునుబట్టి గ్రామవడ్రంగి, మంగలి, చాకలి, కుమ్మరి, జ్యోతి షుఁడు, పురోహితుఁడు తప్పఁ దక్కిన గ్రామసేవకుల ఏర్పాటు విషయమున విపులముగా నిబంధన లేర్పఱుపఁబడినవి. గ్రామకరణము, గ్రామమునసబు, గ్రామతలారులను దప్పఁ దక్కిన గ్రామనౌకర్లను గ్రామములోఁ గాపుర ముండకపోయినను వమ తమనౌకరీలను జేయక పోయినను సుచితముగా ప్రవర్తింపకపోయినను దొలఁగించుటకుఁ గాని కొంతకాలము నిలుపుదల (సస్పెండు) చేయుటకుఁ గాని జమీందారుల కధికార మీయఁబడినది.

మతవిషయకముగ దేవాలయములు మొదలగువానికొఱకీ కీయఁ బడిన యీనాము లమ్ముకొనుటకుఁ గాని యితరుల కిచ్చుటకుఁ గాని యీనాందారుల కధికారము లేదు. దేవాలయాదికముతో సంబంధించిన నౌకర్ల కీయఁబడినయీనాములు వారివారికి నిర్ణయింపఁబడిన పనులు వారు యథోచితముగా చేయుచున్నంతవఱకు వారి కాయీనా ములపై నధికారము గలదు. అట్టినౌకరీలు వారు చేయనప్పుడు వారి స్థానము దితరులను నియమించి వారి కాభూము లనుభవించు నధి కార మీయఁబడును. శాశ్వతపుపెట్టిలో పెట్టునపుఁ బూర్వ మీయఁ బడినవియు, ఎస్టేట్లయొక్క జమా మొత్తములోఁ (Assets) చేర్పఁ బడనివిస్తుగలవియు నయినయీనాములను లాఖిరాజ్ భూములను వాని నియ్యఁబడినయుద్దేశము నెఱవేర్పఁబడనప్పుడు వానిని దీసికొనుటకు సర్కారువారికి హక్కు గలదు. శాశ్వతపుపెట్టిలో పెట్టునపుఁ బూర్వము 'కోడీ' యన్న పేర్లించుచున్నభూములు, అట్టికోడీయన్న ఎస్టేట్లజమామొత్తములోఁ జేర్పఁబడినభూములు కోడీయన్నమాత్రము పుచ్చుకొనుటకు జమీందారులకు హక్కు గలదు గాని యీనా ములను దీసికొనుటకు హక్కు లేదు. సాధారణముగా సర్కారు ఈనాములుభూములకు పట్టాలు నిచ్చునపు పట్టియీనాములు భుక్త

ములో నున్నవారికే యుత్తరు స్థలనిర్దేశము గాఁబడనియీనాములకు శిస్తు కట్టవలసివచ్చినపు డాభూమికి శిస్తు కట్టి దానికి పట్టా జమీం దారునకే యీయఁబడును. శాశ్వతపుపెట్టిలో పెట్టునపు దరిమిలా నీయఁబడినయీనాములు తీసికొని జిరాయితీభూములవలె పన్ను కట్టుట కధికార మున్నది. పైని వివరింపఁబడిన పలువిధము లగు ఈనాములహక్కుభుక్తములు వ్యాయశాస్త్రములనుబట్టియు, నితర శాసనములనుబట్టియును, దేశాచారములనుబట్టియు, హిందూధర్మశాస్త్ర సమ్మతము లైనహక్కులనుబట్టియును వ్యవహరింపఁబడుచుండును.

## ఇతరాస్తుల యమరకము

ఇట్లు సేద్యము సేయఁబడుభూమిరేయే గాక యితరాస్తులు కూడ నమరకము చేయుపద్ధతి కలదు. ఇండ్లు, ఫ్యాక్టరీలు, ఇతర మయినకట్టడములు మొదలగునవి కట్టుటకు స్థలము కొన్నిసంవత్సర ములవఱకు కమరకము చేయుట కలదు. తోఁటలు, దొడ్లు మొదలగునవి తదధికారియు రయితును ఏర్పఱుచుకొనుషరతులమీఁద నమరకము చేయఁబడుచుండును. తోఁటలు కాపునుబట్టికాని అంతకుఁ బూర్వమే కాని నిలుపుబట్టి కొంతమొత్తము శిస్తున కమరకము చేయఁబడుచుండును. కల్లు గీయుకొనుటనిమిత్తము తాటిచెట్లమీఁద గీతప న్నొకటి విధించి చెట్టునకు కొంతసొమ్ముచొప్పున వసూలు చేయుపద్ధతికూడ కలదు. ఇట్టిచెట్లు అబుకారీయుద్యోగులు నెంబర్లు వేసి చెట్లను కల్లునిమిత్తము గీయుకొనువారియొద్ద నట్టిపన్ను వసూలు చేయుచుందురు. ఈపన్ను కొన్నిసంవత్సరములక్రింద లేదు. ఇప్పు డెజన్సీప్రదేశములయందుఁగూడ నీపన్ను వసూలు చేయఁబడుచున్నది.

సముద్రప్రాంతములయందలి చవిటినేలలు ఉప్పు పండించు కొనుటకును కుఠారము చేయుటకును అమరకము చేయఁబడు చుండును. ఈ యమరకముగూడ ఖలసాయముంబట్టి రయితులు కొంత మొత్తము శిస్తున కమర్చుచుందురు. ఉప్పుపంట సర్కారు తప్ప నితరులు పండింపఁగూడనిది కావున నట్టిభూము లమర్చుకొనునధి కారము భూస్వామికి కలిగియుండినను, అందు పండినపంటమాత్ర మందువిషయమున ఏర్పడినవిబంధనల ననుసరించి సర్కారువారికే అమ్మవలయు ననునేర్పాటు గలదు. చెఱువులు జలాశయములు మొద లగువానిలో సర్కారుగ్రామములలో నున్నవానిని సర్కారును, ఇతరభూస్వాముల గ్రామములో నున్నవానిని నితరభూస్వాములును చేపలు పట్టుకొనుటకును, నందలి తామరాకులు మొదలగునవి యుప యోగించుకొనుటకును శిస్తున కమరకము చేయఁబడుచుండును. సముద్ర తీరములయందు నున్న పుగుల్లు మొదలయినవి తీసికొనుటకుఁగూడ నొకవిధ మయినయమరకము కలదు. ముత్యములు పగడములు మొద లగునవి దొరకుప్రదేశములోనినముద్రప్రదేశములు విశేషముమొత్తపు శిస్తున కమర్పఁబడుచున్నవి. మఱియు లవు దాఁటునట్టియేటిప్రదేశ ములు, స్రోతలలోనిభూమిలు, సంతలు, ఉత్సవదినములలోని పెంపా రకీదుకాగములు మొదలగునవికూడ నాయాప్రదేశముల కధికారు లగువారికి కొంతశిస్తుమొత్తమున కమర్పఁబడుచుండును. మఱియు

కల్లు, సారాయి, దుకాణములు, నల్లమందు, గంజాయి మొదలగు మత్తుద్రవ్యములందుకాలముల సర్కారువారి 'అబుకారీ' యుద్యోగస్థులచేత వేలంపాట పాడఁబడి యెక్కువనిచ్చి కట్టుకొన్నవాని కమరకము చేయఁబడుచుండును ఇట్టిదుకాణము లమరకము చేయఁబడుటయందు కిస్తు రాఁబట్టవలె ననుయుద్దేశమే కాక అట్టిమత్తుద్రవ్యముల యుపయోగము సాధ్యమైనంతవఱకు నిర్బంధించి కట్టిపెట్టింపవలయు ననియు దొరతనమువారియుద్దేశము అడవులు, పుల్లరిభూములు, పాటిపెరళ్లు మొదలగునవియును వానియం దధికారము కలవారిచే నమర్పఁబడుచుండెను

## పురాతనకాలపు భూమికొలత

భూమికొలత యనఁగా జదరపుఁగొలత ఒకానొకక్షేత్రము యొక్క వైశాల్యమును దెలిసికొనుట దీనిని మనగణితశాస్త్రములో క్షేత్రవ్యవహార మనియెదరు క్షేత్రపరిమాణమును దెలిసికొనుట సులభమైన పని కాదు అందులకుఁ గొంత రేఖాగణితమును (Geometry), క్షేత్రగణితమును (Mensuration) తెలిసియుండవలెను హిందువు లీవిద్యలు క్రీస్తుపూర్వకాలమునుండియుఁ దెలిసియుండె ననుటకు సందేహము లేదు శ్రౌతవేదిభాగమును సంబంధించినట్టి కల్పసూత్రములలోఁ జివరది 'శుల్బసూత్రము' లుండును ఇది క్షేత్రపరిమితిని దెల్పు రేఖాగణితమునకు సంబంధించినవియమములు పురుష మన్నది యెప్పటి యొకమానము చేతు లెత్తి పురుషుఁడు నిల్చిన నెంతపొడుగగునో యంత (౧౨౦ అంగుళములు) పురుషమానము[1] ఇట్టిపురుషప్రమాణము పొడుగును, పురుషప్రమాణము వెడల్పునుగల క్షేత్రము చతురస్రపురుషము, చదరపుపురుషము. చిన్న యజ్ఞకుండము ౭½ చదరపుపురుషము లుండవలెను ఇది చతురస్రముగ నుండవలెను. ఇంతియె వైశాల్యముగల ముక్కోణపుకుండమును, చక్రాకారపుకుండమును గట్టవలెను తరువాత దీనివైశాల్యముకంటె కొక్కొక్క చదరపుపురుషము వైశాల్య మధికముగ నుండువానిని నిర్మింపవలెను రెండుకుండముల వైశాల్యములు కలిపి యెంత యగునో యంతదియు, ఒకదానిలోనుండి యొకటి తీసివేసిన నెంత యగునో యంతదియు నగుకుండములను నిర్మింపవలెను వైశాల్యము హెచ్చింపక తగ్గింపక సమచతురస్రముగను, (Square) దీర్ఘచతురస్రముగను (Oblong), వృత్తముగను (Circle) మార్పవలెను ఇట్టివాని కన్నిటికిని శుల్బసూత్రకారుఁడు మార్గనియమము లను జెప్పియున్నాఁడు కావున భూమివైశాల్యమును గనుఁగొనుటకు వారికిఁ దెలియు ననుట స్పష్టము ఈసూత్రములు క్రీ పూ ౫–౬ శతాబ్దులనాఁటివి

చంద్రగుప్తచక్రవర్తికాలమునందుఁ (క్రీ పూ ౩౨౧–౨౯౭) భూములు కొలుచువాడుక యున్నట్టు స్పష్టముగఁ గానవచ్చుచున్నది కౌటిల్యార్థశాస్త్రమునందు భూమికొలత లీయఁబడినవి దేశమానములలోఁ బొడుగుమానములును, చదరపుమానములును జెప్పఁబడినవి[2]

౧౦ అంగుళములు ౧ గార్హపత్యధనుస్సు (గజముబద్ద) గృహపతి యనువాఁడు వడ్రంగి దీనిని తోరణఁ గొలుచుటకును, ప్రాకారములు కొలుచుటకును, నుపయోగించుచుండిరి అగ్నిచితులు కట్టుటలోఁ బౌరుష మను మానము నుపయోగించుచుండిరి ఆఱు కంసములు పొడుగు గల దండము బ్రాహ్మణుల కిచ్చిన స్థలములు కొలుచుటలో నుపయోగింపఁబడెను పదిదండము లైన నొక్కరజ్జువు, రెండు రజ్జువు లైన నొక్కపరిదేశము, త్రిరజ్జుక మైన నొకనివర్తనము. పరిదేశ, నివర్తనములు క్షేత్ర(చదరపు)మానము

నీటిపారుదలకు సంబంధించిన యధికారులె భూములు కొలుచుచుండి రని మెగస్థనీసు వ్రాసియున్నాఁడు[3] ౯–వ శతాబ్దివాఁడయిన మహావీరాచార్యుఁ డతని సారసంగ్రహగణితములో దేశమానము లిచ్చుటయె కాక క్షేత్రవ్యవహార మని యొక్క అధ్యాయము వ్రాసియున్నాఁడు అందు త్రిభుజ చతుర్భుజ వృత్తాది క్షేత్రముల చదరపుకొలత కనుఁగొను స్థూల (Approximate), సూక్ష్మ (Exact) పద్ధతులు చెప్పియున్నాఁడు పండ్రెండవశతాబ్దిఁ గల భాస్కరాచార్యుఁడు లీలావతీగణితమునందు 'నివర్తన' మను చదరపుమాన మిచ్చి[4] క్షేత్రవ్యవహారాధ్యాయమందు పొలములవైశాల్యమును గనుఁగొనువిధములను వివరముగఁ దెల్పెను ఈ 'నివర్తనము' అనునది రమారమి రెండు–ఎకరము లగును ఈమానము చంద్రగుప్తునికాలమున

---

1 'అర్ధాష్టమపురుషాః ప్రథమోఽగ్నిః' అన్న ౨–వ అధ్యాయమందలి ౧–వ సూత్రముమీఁద నిట్లు వృత్తి వ్రాయఁబడియున్నది. 'పురుషశబ్దేన పంచారత్నినా వింశత్యధికశతాంగులేన వేణునా పరిమితం క్షేత్రముచ్యతే తత్ర చతుర్దశసహస్రాణి చత్వారింశదాన్యంగులయః పురుషే సంతి' [కాశీవిద్యాసుధానిధి, ౧౮౭౫ అగస్టు నెలసంచికలోని శుల్బసూత్రములు]

2 "గార్హపత్య మష్టశతాంగులం ధనుః పథిప్రాకారమానం, పౌరుషంచ అగ్నిచిత్యానామ్, షట్కంసో దండో బ్రహ్మదేయాతిథ్యమానమ్, దశదండో రజ్జుః, ద్విరజ్జుకః పరిదేశః త్రిరజ్జుకం నివర్తనం, ఏకతో ద్విదండాధికో బాహుః" [కౌటిలీయం అర్థశాస్త్రమ్, Bibliotheca Sanskrita, No 37, Pages 106-107, Mahadeva Sastry's edition]

3. Vincent Smith's Early History of India, 3rd Edition, p 132

4 "తథా కరాణాం దశకేన వంశః, నివర్తనం వింశతివంశసంఖ్యం క్షేత్రం చతుర్భిశ్చ భుజైర్నిబద్ధమ్. ౬." [౧–వ అధ్యాయము] పదిమూరలు (మూరకు) కొలవంశము (వెదురు), ఇరువదివంశముల పొడుగు, ఇరువది వంశముల వెడల్పుగల చదరము నివర్తనము అని నాలుగుభుజములచే సాధింపఁబడియుండును.

నుండియు వచ్చుచున్నట్టున్నది.[1] మితాక్షర[2] లోఁగూడ భూమి వాదము వచ్చినప్పుడు 'ఒకఁడు నివర్తనముకంటెఁ పెద్దది యనుచు, ఒకఁడు నివర్తనముకంటెఁ చిన్నది యనుచు' అని చెప్పఁబడెను

శ్రీ శ ౬౨౩-౨౪ నిది యగు పశ్చిమచాళుక్యరాజులయొక్క తామ్రశాసనములో రెండువందల నివర్తనములభూమి దాన మిచ్చినట్లు చెప్పఁబడియున్నది[3] కావున, మహమ్మదీయులకాలములో 'బీగా' మానమును, ఇంగ్లీషు ప్రభుత్వకాలమున 'ఎకరము' అను మానమును వాడుకలో నున్నట్లు హిందూరాజుల ప్రభుత్వకాలమున మిక్కిలి పురాతనకాలమునుండియు 'నివర్తన' మను క్షేత్రమానము వాడుకలో నుండెనని స్పష్టమగుచున్నది

పూర్వము సాధారణముగా భూములను వెదచల్లి పంట పండించు వాడుకయే యున్నట్లును, నాటు వేసి యాచ్చుకాచారము లేనట్లును గన్పించుచున్నది దీనినిబట్టి యెన్ని విత్తనములు చల్లుటకు తగిన భూమియో ఆ విత్తనముల కొలతనుబట్టి భూమికొలత యేర్పడినట్లు తోఁచుచున్నది. అనఁగా కుంచెఁడువిత్తులు వెదచల్లుటకుఁ జాలిన భూమి కుంచెఁడనియు, తూమెఁడు విత్తులు విత్తుభూమి తూమెఁడనియు, ఏఁగురు విత్తులు చల్లఁబడుభూమి యేడు మనియు, పంగుము విత్తులు చల్లఁబడుభూమి పంగు మనియు, పుట్టెఁడువిత్తులు చల్లఁబడుభూమి పుట్టెఁ డనియు పిలువఁబడెను పుట్టి యనఁగా ౮౦ కుంచములు పరిమాణము గలదియే యిచట గ్రహింపవలెను రాజు, పండినపంటలో భాగము పుచ్చుకొనుటయే కాని మొదట కొలిచిన భూమిపరిమాణము ననుసరించి పన్ను పుచ్చుకొనువాడుక యున్నట్టు కానరాదు మిక్కిలి పురాతనకాలమందు వెదచల్లువిత్తనములమానము చేతనే విత్తనములు చల్లుభూమినిగూడ వాడుచుండిరి పాణిని యష్టాధ్యాయి సూత్రములలో 'తస్య వాపః' (అ ౫, పా ౧, సూ ౪౫) విత్తెడు విత్తనములనుబట్టి భూమికి పేరు వచ్చువిధము చెప్పఁబడియున్నది ధాన్యపరిమాణవాచిపదములమీఁద 'ఠక్' అను తద్ధితప్రత్యయము వాపార్థమందు, అనఁగా వెదచల్లఁబడు నమవర్థమందు విధింపఁబడినది దానిచే కాడవికీ, ప్రాస్థికీ, ద్రౌణికీ, ఖారికీ, అని క్షేత్రభుక్తికి (క్షేత్రపరిమాణమునకు) పేర్లేర్పడినవి మఱియు నష్టాధ్యాయి 'తదస్మిన్ వృద్ధ్యాయ లాభశుల్కోపదా దీయతే' (అ ౫, పా ౧, సూ ౪౭) అనుసూత్రమునుబట్టి 'ఇంత రాజభాగ మీయఁబడు' నను వర్థమందుఁ బ్రత్యయము విధింపఁబడుచున్నది. దానింబట్టి పంచకీ, శతికీ అని పేర్లు భూమికి వచ్చినవి కావునఁ బూర్వ మీయఁబడు రాజభాగమునుబట్టియు, చల్లఁబడువిత్తనములనుబట్టియు, భూమికి మానమేర్పడినట్లు కానవచ్చుచున్నది పిమ్మట ధాన్యమానము ననుసరించి భూమాన మేర్పడినను, భూమి బలము ననుసరించి యొకపరిమాణము గల వేఱువేఱుపొలములలో ధాన్యము హెచ్చుతగ్గుగ విత్తుట సంభవించుటచే నామాన మజ్ఞులకుఁ దప్పు లెక్కకన్పట్టిఁ కొంత లేదు వ్యవహారమునకుఁ జిక్కు వచ్చును కావున నీధాన్యమానములు క్షేత్రమానములుగాఁ ద్వరలోనే మార్పఁబడెను, అనఁగా నింత పొడవు ఇంత వెడల్పుగల భూమి పుట్టెఁడు అని మాన మేర్పడును. శ్రీ శ ౧౧-వ శతాబ్దియందుఁ దక్షిణదేశమునందు భూమికొలత బాగుగఁ దెలిసియుండె ననియు, 'పుట్టెఁడు', 'తూమెఁడు' భూమి అను మానములు క్షేత్రమానములు (Area measures) గా మార్పఁబడియుండె ననియు పావులూరి మల్లనచే రచింపఁబడిన సార సంగ్రహగణితమందలి యీక్రిందిపద్యములవలనఁ దెలుపఁగలము.

క మానుగ నినుము వెవల్పున,
గా నొకకోల కుంట గడియఁగా నగుఁబుట్టిం
దేనూఱుకుంట, లిరువది,
యే నొకతూమెఁడు, తివర్థ మిర సనఁ బరఁగున్

క కానుల వెసలంగఁ జిన్నము,
మానము కోల యగును కుంటమానము, మఱి యీ
మానము ధాన్యముతోడి స,
మానముగా వ్యవహరింత్రు మహి నాంధ్రజనుల్ [౧-వ ఆశ్వా]

## మహమ్మదీయ కాలపుకొలతలు

మఱియు వ్యవసాయము చేయఁబడుభూములు ఇన్ని 'కత్తులు' అని వ్యవహరింపఁబడుట కలదు పూర్వము దవనిగా నున్నవ్య ద్రాళకత్తితో పోసు కొట్టి యొకదినములో నొకమనుష్యుఁడు దేవ్యమునకుఁ దీసికొని రాఁదగినంతభూమి యొకకత్తిపరిమాణము కలది యని ప్రమాణ మేర్పడినది అక్బరుచక్రవర్తికాలమున భూమి యొక్కమాన మేమి యనఁగా ౩౩ ఇంగ్లీషుచదరపు టంగుళములు ౧ గాజు, ౬౦ గాజులు ౧ పొడవుగల 'బిఘా', ౧ బిఘా = ౩౦౨౫ చతురపుగజము = ౫౨ $(\frac{5}{8})$ ఎకరము

బంగాళరాజధానిలో వాడుకలో నున్న బిఘా-౧౬౦౦ చతురపుగజములు |-| $(\frac{1}{3})$ ఎకరము

బిఘా ౨౦ బిస్వాలక్రిందను, బిస్వా ౨౦ బిస్వాన్సీలక్రిందను విభజింపఁబడెను బంగాళరాజధానిలో బిస్వా, బిస్వాన్సీలను కొట్టా లేక కట్టా లేక గండా అని వాడుకురు పంజాబుదేశములో భూమి కొలత 'ఘుమావ్ల' ను బట్టి చేయఁబడును హిందూస్థానీలో

---

1. చూడుఁడు, అర్థశాస్త్రము, ఇది కౌటిల్యుఁ డుదాహరింపఁబడినభాగము
2. వ్యవహారకాండము, భూవాద ప్రకరణము
3. Epigraphical Report for 1915—1916, No 7th in the List of Copper-plates examinedduring 1915—1916
4. 'కోల' యనఁగా 'దండము'. కాలను 'హస్తములు' (మూరలు) అయిన కోల 'దండము' అని యీగ్రంథమునందు చెప్పఁబడియున్నది.

వసూలు చేయుదురు ఇట్లు భూమికొలత ఒక్కొక్కజిల్లాలో కొన్నికొన్ని ప్రదేశముల కొన్నికొన్నివిధములుగా నుండెను గాని యిప్పుడు సాధారణముగ ఎకరములపరిమితి వాడుకలోనికి దేబడి అంతటను ఎకరములపరిమితియే వాడబడుచున్నది. ఎకరము= ౪౮౪౦ చదరపుగజములు.

రివిన్యూ వ్యవహార పద్ధతి — రివిన్యూవ్యవహారవిధానమున గ్రామము ప్రధానాంశముగా గ్రహింపబడదు అని యిదివరకే చెప్పబడియున్నది. గ్రామముయొక్క అమరకపుపద్ధతులు, భూమి విషయమై మంజూరైనదియు శిస్తువిషయమై మాఫీయైనదియు నగు లెక్కలను తయారుచేయుటకును, గ్రామమునుండి చెల్లవలసినశిస్తు వసూలు చేయబడుటకును, గ్రామకరణము, గ్రామమునసబు, గ్రామమునకు గారు లను గ్రామోద్యోగులు కలరు. గ్రామమునసబునకు కొంతవరకు సివిల్ క్రిమినల్ అధికారములుకూడ కలవు. ఇట్టి గ్రామములను కొన్నింటిని చేర్చి ఫిర్కా లేక రివిన్యూఫిర్కాగా చేయబడి అందలి గ్రామములయొక్క భూములయమరకము, దఖలు, వరకట్టులు, రివిన్యూకాదరకట్టులు మొదలగువానిని తనిఖీ చేయుటకు రివిన్యూయిన్‌స్పెక్టరను ఉద్యోగస్థుడు నియమింపబడి యుండును. ఇట్టి ఫిర్కాలు రెండుమూడు కలసి ఒకతాలూకాగా[1] చేయబడి దానిని తహశీల్దారు అను ఉద్యోగస్థునిక్రింద నుంచెదరు. ఇట్టితాలూకాలు రెండుగాని మూడుగాని కలిసి యొక్క డివిజనుగా చేయబడి దానిని ఒక డివిజనల్ ఆఫీసర్ క్రింద నుంచుదురు. ఇట్టి డివిజనల్ ఆఫీసర్లుగల కొన్ని డివిజనులు కలిసి జిల్లాగా చేయబడి దాని కధికారిగా కలెక్టరు నియమింపబడును. ఇట్టిజిల్లాలు కొన్నింటిని చేర్చి యొకరాజధానిగా చేసి జిల్లాకలెక్టర్లందఱిపైని కొందఱు మెంబర్లతోగూడిన రివిన్యూబోర్డు అనుకార్యస్థాన ముండును. అది పెద్దప్రాంతములలో (మేజర్ ప్రావిన్సులలో) కార్యాలోచనసంఘముతోగూడిన గవర్నరుక్రిందను, చిన్నప్రాంతములలో (మైనరు ప్రావిన్సులలో) లెఫ్టినెంటుగవర్నరుక్రిందగాని చీఫ్‌కమీషనరు అనుపధికారిక్రిందగాని యుండును. కొన్ని రాజధానులలో రివిన్యూబోర్డునకు మాఱుగ నాలుగైదుజిల్లాల కొకకమీషనరు నియమింపబడి, అతడు ఆయాజిల్లాలరివిన్యూ మొదలగు శిస్తులవ్యవహారము పరిశీలించును. భూములపై శిస్తు చెల్లింపబడుచున్నంతవఱకు జిరాయితీభూములు పట్టాదార్లు మొదలగు భూస్వాములయొద్దనుండిగాని, ఈనాముభూములను ఆయాయీనాముదార్లయొద్దనుండిగాని, సర్కారువారునిమిత్తము లేకుండ తీసికొనరు. దేశోపయోగకరములగు కార్యములకు దీసికొనవలసివచ్చినప్పుడు ప్రభుత్వమువారు వానిని దీసికొని వానికి మఱియొకచోట వాని కిందుమిందుగా సరియగు భూమి నిచ్చుచుండెడివారు. ఇప్పు డట్టి భూములను దీసికొని వానికిధరగులు కట్టి సొమ్ము ఇచ్చుచున్నారు. ఇట్లు దొరతనమువారు భూములను భూస్వాములనుమతము లేకపోయినను దీసికొనుటకు 'ల్యాండు అక్విజిషన్ ఆక్టు' (Land Acquisition Act) వలన అధికారము గలిగించుకొనియున్నారు.

ఈ యాక్టుబట్టి భూములకే గాక అంతకంటె ఎక్కువ వెలగలవానిని, ఇండ్లు మొదలగునవి కట్టబడియుండినను వానికి న్యాయముగా నిష్కర్షగసొమ్మిచ్చి తీసికొని యిచ్చుటకు చట్టము యుపయోగపడునట్లు కొనుటకు దొరతనమువారికి హక్కు కలదు. జమీందారీగ్రామములోనిభూములు ప్రజలయుపయోగముకొఱకు చేయబడునవి మాత్రము గావలసివచ్చినప్పుడు జనోపయోగకరములగు పనులు చేయుంచువారు సర్కారువారైనను జమీందారైనను ఈ యాక్టుబట్టి భూములను సొమ్మిచ్చి తీసికొనుట కవకాశము చేర్పఱుపబడినది.

## అనుబంధము

పయిని వివరింపబడిన అమరకపుపద్ధతులు గాక యీదేశమునందింకను కొన్నివిధము లగునమరకపుపద్ధతులు గలవు. అవి ఈక్రింద వివరింపబడుచున్నవి.

అయిమా - బంజరుభూములు వ్యవసాయమునకు తేబడు నిమిత్తము ముందుగా శిస్తు లేకుండ నీయబడి, క్రమక్రమముగా కొన్నిసంవత్సరములకు పూర్తిశిస్తు కట్టి అమర్చబడుభూములు. బంగాళరాజధానిలో మిన్నాపూరుజిల్లాలోను, బరామహలు జమీందారీలోను నీవిధమగునమరకము వాడుకలో నుండెను. మిన్నాపూరుజిల్లాలో 'మండలీదారీ' అనునమరకపుపద్ధతియు నిట్టిదే!

అయిని - భూమిలో బంధింపబడు ఫలసాయమునుబట్టి ముహామ్మదీయులు పనులు చేయుచుండిరనిస్తును మార్చి మహోత్తరముల గ్రామమునందలిభూము లన్నిటికిని దామాషాప్రకారము శిస్తుకట్టుటకు నిర్ణయించి దానిబట్టి పూర్తిశిస్తు వసూలుచేయుటకు దక్కనులో నేర్పఱచిన పద్ధతి.

ఖాల్సా - అజమీరు, మార్వాడ ప్రదేశములయందు స్థలాధికారి యగుమహారాజుయొక్కగాని దేశనాయకునియొక్కగాని యొప్పందమునందు మంజూరుగాని, చెఱువుగాని, మఱియొకవిధమగు నీటిసహాయముగాని యేర్పఱచుకొని వ్యవసాయము చేయుపద్ధతిని శాశ్వతప్రభుత్వముతో జాగీరుదారమునే సేద్యము చేయబడినంతభూమి యమరకముగ లెంగుపద్ధతి. ఈదేశములో వర్షము మిక్కిలి యరుదుగా గురియుటవలన నిట్టియమరకము చేయవలసివచ్చినది.

అనువాదా - రైతు సొమ్ము ఖర్చుపెట్టి క్రమపడి బంజరుభూమి సేద్యములోనికి దీసికొనిరావలసినయవసరము లేకుండ భూస్వామియే అట్టిపని చేయించి యితరబంజరుభూములకంటె ఎక్కువశిస్తు కట్టి అమరకము చేయుపద్ధతి ఇది పంజాబురాజధానిలో నున్నది.

బాచ్ - పంజాబురాజధానిలో 'బాచ్' అనుతెగవారు తమ గ్రామములోనిభూములను సమానముగా పంచుకొని యొకరికొ

1 ఉత్తరదేశమునందు 'తాలూకా' ను 'తహసీల్' అందురు, దాని నధికారి 'తహసీల్దారు'

# అమరావతీస్తూపము

ధాతువులమీద కొన్ని కొన్ని చోట్ల చిన్నచిన్న చైత్యములను నిర్మించిరి. వీనికి 'శారీరకచైత్యము' అని పేరు. అశోకునికాలపు కాలమున దిగ్విజయములవలనను, మతసంబంధ కారణములవలనను బౌద్ధమతము గొప్పగా వ్యాపించుటచేత తనరాజ్యమునందలి ప్రజలకు బౌద్ధధర్మతత్త్వమును తీర్చుటకును, అవిచ్ఛిన్నకార్యములైనను అతఁడు శారీరకచైత్యములలో నెనిమిదింటిని తెరపించి, అందలిధాతువులను ఎనుబదినాలుగువేల శకలములుగా విభజించి, తనరాజ్యమునందలి వేర్వేరుభాగములకు కొన్ని కొన్ని శకలములను గొనిపోయి, వానిపై నిట్లు ఎనుబదినాలుగువేల స్తూపములను గట్టించెనని ప్రతీతి కలదు. అశోకునికాలపు ప్రాకృతశాసనములు మనదేశమునందలి వేర్వేరు ప్రాంతములందుఁ దొరకుచున్నవి. శోధనలవలన పెక్కుచైత్యములు బయలుపడుచున్నవి. దీని నమునించి చూడఁగా ఈప్రతీతి అవిశ్వసనీయముగాఁ దోఁచదు.

'మహాపరినిర్వాణసుత్తము'నందే బౌద్ధశాస్త్ర, స్తూపముల యుత్పత్తికి సంబంధించిన వృత్తాంతకథలను మహిమోపేతములనుగూడ బుద్ధుఁడు చెప్పినట్లు కలదు. బుద్ధుఁ డానందునితో తననిర్వాణానంతరము బౌద్ధులు సందర్శింపవలసిన స్థలములు నాలుగు కలవని చెప్పెను. అవి యేవన (౧) తాను పుట్టినస్థలము, (౨) తాను 'సంబోధి' నొందినస్థలము, (౩) మొట్టమొదటిసారి తనధర్మమును బోధించిన స్థలము, (౪) బుద్ధుఁడు నిర్వాణమునొందిన స్థలము. బుద్ధుఁడు చెప్పినట్లు యీవిషయము చారిత్రకసత్యము మయినను కాకపోయినను బౌద్ధయాత్ర మిప్పటికి నీయాదేశము బుద్ధప్రోక్తమే యని శిరసావహించి నేటికిని ఈనాలుగుస్థలములకును, అనఁగా నేపాళతెరై ప్రదేశమునందలి కపిలవస్తునగరసమీపమునం దున్న లుంబినీవనమునకును, సంబోధి నొందిన బుద్ధగయకును, మొట్టమొదటి మారు ధర్మప్రవర్తనము గావించినమృగదావము (సారనాథ్) నకును, నిర్వాణము నొందినకుశీనగరమునందలి సాలవనమునకును యాత్రలు చేయుచున్నారు. బౌద్ధులయాచారమునందే బౌద్ధశిల్పబీజములు నిక్షిప్తము లయియున్నట్లు కన్పట్టును. ఎట్లన, ఈస్థలములను సందర్శించినయాత్రికులు బుద్ధజీవితముతో సంబంధించిన యీగొప్పవిషయములకు జ్ఞాపకార్థముగ నిటీకలమీఁద ముద్రిత మయినచిహ్నములను దమతోఁ దీసికొనిపోవుచుండువారు. పద్మము బుద్ధునిజననమునకును, బోధివృక్షము (అశ్వత్థము) బుద్ధునిసంబోధికిని, మొట్టమొదటిధర్మప్రవర్తనమునకు ధర్మచక్రమును, బుద్ధునినిర్వాణమునకు స్తూపము (చైత్యము)ను ప్రాయికముగ చిహ్నములుగ నుండెను.

బుద్ధునియాదేశములను విధయవిధేయతతో ననుసరింపఁ గోరిన బౌద్ధులు ఈనాలుగుస్థలములను దమపూజాభినివేశమునకు పరిపోషక తీర్థములుగాఁ జేసి బుద్ధజీవితముతో సంబంధము గల యితరస్థలములందుఁగూడ స్తూపములు నిర్మించిరి. బౌద్ధమత మశోకుని కాలములో నెక్కువగా వ్యాపించుటచేత ఈస్థలములందు బాలకబోధిసత్త్వునికి సంబంధించిన జాతకకథలు జరిగినచోట్లఁగూడ స్తూపములు కట్టిరి. కుడవ బౌద్ధులు స్తూపనిర్మాణమును పుణ్యప్రద మయిన మతధర్మముగ భావించి, తమమత మీ వ్యాపించిన ప్రతిదేశమునందును పెక్కుస్తూపములు నిర్మించుచువచ్చిరి. మంజుశ్రీ మొదలగు బోధిసత్త్వులకుఁగూడ స్తూపము లంకితము లయియుండుటచేత — బోధిసత్త్వులింకను నిర్వాణము నొందనివారు గను అస్థిప్రాయప్రాముఖ్యము లెట్టి — స్తూపము లన్నిటియందును ధాతువు లున్నట్లు భావింపరాదు. కాని యట్టివానిని ఆరాధ్యములయిన బౌద్ధాలయములుగ నెంచవలసియుండును. ఈయర్థమునందు స్తూపపదము చైత్యమునకు పర్యాయపదముగ గ్రహింపఁబడ్డది. కాలాంతరమున చైత్య మను పేరు వృక్షపీఠికకుఁ గాని, సంపూర్ణదేవాలయమునకుఁ గాని, గర్భగృహమునకుఁ గాని వర్తింపుచువచ్చినది. కాబట్టి చైత్య మనునది బౌద్ధమతవిషయక మయిన సాధారణపదముగను, స్తూప మనునది వస్తువిశేష సంబంధము గల నిర్మాణమునకు (Relic mound) వాస్తుశాస్త్రీయపదముగను (Architectural term) ఇటీవల వ్యవహరింపఁబడుచువచ్చినది.

కొందఱు 'ధాతుగర్భ'పదముయొక్క వికారరూపమయిన 'డాగొబ'ను స్తూపమునకు పర్యాయపదముగ నుపయోగించుచున్నారు కాని యిది సరియయినవ్యవహారము కాదు. ఏల యనిన, ఇది స్తూపమునందలి యొకప్రత్యేకప్రధానభాగమునకుమాత్రమే, అనఁగా, ప్రత్యేకము ధాతువు నుంచుస్థలమునకు మాత్రమే వర్తించును. ఈధాతు వుంచుస్థలము పెట్టెగాఁ గాని, భరణి (Casket) గాఁ గాని యుండవచ్చును. స్తూప మనునది నిర్మాణమున కంతకును వర్తించును. స్తూపము లన్నియు ధాతుగర్భములు కాకపోవుటచేత 'డాగొబ' పదము స్తూపమునకు పర్యాయపదముగ పరిగణించుట యసమంజసము. 'ధాతుగర్భ'పదమే 'డాగొబ', 'దగబ', దబ్బగ వికారములఁ బొంది తుదకు దిబ్బగ మారియుండవచ్చును, లేకా దిబ్బ యనునది తెలుగు - తమిళ పదములనుండి వచ్చినదై యుండునేమో?

చితాసంబంధి యైనను, లేక ధాతుగర్భసంబంధి యైనను ఈ నిర్మాణమున కీయాకృతి యెట్లు వచ్చిన దనువిషయమున భిన్నాభిప్రాయములు కలవు. కొందఱు ప్రాచీనకాలమున నగ నుదయించిన మట్టుదిబ్బనుండి, తదాకృతి ననుసరించి స్థపతి (Architect) ఈ నిర్మాణము నిట్లు రచియించెనని చెప్పుదురు. కాని బౌద్ధవాఙ్మయము ననుసరించి చూడఁగా నీస్తూపాకృతి బుద్బుదరూపమున వ్యక్తీకరింపఁబడిన శాస్త్రీయతాత్త్వికాభిప్రాయముయొక్క స్థాపత్యనిర్వచనము (Architectural expression) గాఁ దోఁచును. ఇందలి శాస్త్రీయతాత్త్వికాభిప్రాయమేది ప్రతిశరీరమునందును పరమాత్మ అంతర్నిహితముగ నున్నది, అనఁగా శరీరమే లక్ష్యముగ భావించువారికి పరమాత్మ వ్యక్తము కాదు. పరమాత్మాన్వేషకులయిన తత్త్వవేత్తలకు మహోన్నతిగల బుద్బుదమువలె నుండుశరీర మను తెర తొలఁగి పరమాత్మయే గోచరించును. అయినను వ్యవహారదశలో పరమాత్మ శరీరాంతర్నిహితముగానే యుండును. వ్యావహారికమయిన యీ శాస్త్రీయసత్యము అభివ్యక్తము గను, తత్త్వాదర్శముగను బౌద్ధులయందు స్తూపనిర్మాణమున బుద్బుదము ఆకారకృతి గల స్తూపరూపమునకు, పరమాత్మ ఆ వస్తుకృతి

# అమరావతీస్తూపచిత్రములు



పటము, ౧ అమరావతీస్తూప విన్యాస (Plan)ఖండికలు (Section)

( ౧౮౧౭ లో మెకల్నల్ కెంజి చేసిన సర్వే ననుసరించి)

ధాతువులను ౮౪,౦౦౦ల కుండలలో చేసి దేశమంతట దర్శించి ౮౪,౦౦౦ల స్తూపములను అశోకుడు కట్టించెనను గాథ దివ్యావదానమునం దగుపడుచున్నది. క్రీస్తుశకము మూడవశతాబ్దిని పూర్వము కాంచీనగరము ప్రాధాన్యమును వహించకముందే అమరావతి దక్షిణాపథమున కంతకును గొప్పవిద్యాస్థానముగను, బౌద్ధమతప్రధానపీఠముగను విఖ్యాతిని చెందియుండె నని చెప్పవచ్చును.

గ్రామనామము — అమరావతీస్తూపమునందలి ప్రాచీన శాసనములనుబట్టి ఈ గ్రామమునకు పూర్వము ధాన్యకటకము (ధంకటకము, ధంనకడక) అనియే పేరు క్రీస్తుశకము పదునాల్గవ శతాబ్ది వఱకు నీ పేరే వ్యవహారమునం దుండెను తరువాత నిది ధరణికోటగా మారినది క్రీ శ ౧౧౮౨ నాటి యొకశాసనమున,

'అస్తి శ్రీధాన్యకటకం పురం సురపురోత్తమమ్,
యత్రామరేశ్వరశ్శంభు రమరేశ్వర పూజితః,
బుద్ధో దేవస్య సాన్నిధ్యాత్ యత్ర ధాత్రోపపూజితః,
చైత్య ముత్తుఙ్గమస్తి యత్ర నానాచిత్రసుచిత్రితమ్'

అని యుండుటచేత నప్పటికిని కూడ ఇది ధాన్యకటక మనియే సుప్రసిద్ధమైయుండె నని, ఇక్కడ బుద్ధునిపూజయు, అమరేశ్వరుఁ డను పేర శివునిపూజకూడ నుండె నని, మతసహనము బాగుగ నుండుటచేత నిచ్చటిచైత్య మప్పటికిని శోభించుచుండె నని స్పష్టమగుచున్నది దీనినిబట్టి చూడఁగా, ఈనగరమున కమరావతి యను పే రమరేశ్వరుని బట్టి యెప్పుడో క్రీ శ ౧౧౮౨ తరువాత వచ్చిన దని నిశ్చయింప వచ్చును పదునాల్గవశతాబ్దిలోఁగూడ నిచ్చట బుద్ధపూజ జరుగుచుండె నని శాసనములు తెలుపుచున్నవి ఎట్లు మారినదో, ఎప్పుడు మారినదో కాని ధాన్యకటక మను పేరు తరువాత ధరణికోట యైనది ఈ పేరు క్రీ శ ౧౪౦౦ నాటి శాసనమునఁ గనఁబడును ఇప్పుడు వ్యవహారమునం దున్న ధరణికోట, అమరావతి యను పేరులు పూర్వ మొక్కనగరమునకే వర్తించుచుండెను కాని ప్రస్తుతకాలమున ఆనగర మున్న ప్రదేశమునందలి పడమటిభాగమునకు ధరణికోట యని, తూర్పు నున్నభాగమున కమరావతి యని వర్తించుచు, పూర్వమువలెగాక యిప్పుడు రెండు వేఱువేఱు గ్రామములుగ విడిపోయినది అయినను, ఈ రెండు గ్రామములందును గాక స్తూపాదులకు సంబంధించిన బౌద్ధ నిర్మాణావశేషములు దొరకుట కలదు

క్షేత్రప్రఖ్యాతినిబట్టి పార్మ్యాక్, ఎద్దగయలయం దిప్పటికిని దానస్తూపములు వెలయుచున్నట్లే, కాకతీ యమరావతీక్షేత్రమునందును ప్రధానచైత్యమునకు చుట్టును పెక్కు దానచైత్యములు వెలసినవి ఈ కారణమున అమరావతియందలి ప్రధానచైత్యమునకు మహాచైత్య మను పేరు కలిగినది అమరావతియందు వెలసిన యీదాన స్తూపములలో ఒకదానివెడల్పు ౧౧ అడుగులవ్యాసము గలిగి చైత్యచిత్రిత మయినశిలాఫలకములతో శోభించుచుండెను ఈ మహాచైత్యమును లక్ష్యమునఁ గొని ఈశిలాఫలకములను చెక్కినారు ఇట్టి చైత్యశిలాఫలకములలో కొన్నిటిని మద్రాసుగవర్నమెంటు మ్యూజియమునందు భద్రపఱుపఁబడినవి

ఈక్షేత్రము విద్యాస్థానముగను, గొప్ప యాత్రాస్థలముగను పేరుపడుటచేత బౌద్ధు లనేకు లిచటికి వచ్చుచుండిరి వారు నివసించు నిమిత్త మిచట సంఘారామము లనేకములు వెలయింపఁబడినవి ఇచట వేఱువేఱు బౌద్ధమతసంప్రదాయములవారును, శాఖలవారును చెందిన బౌద్ధభిక్షువులు నివసించుటకు వేఱువేఱుశాఖలవారి సంఘారామములు వెలసినవి వేఱువేఱుశాఖలకు చెందినబౌద్ధు లిచటికి వచ్చుచుండి నట్లును, ఇచట నివసించుచుండినట్లును అమరావతీస్తూపమునందలి శాసనములను పరిశీలించినచోఁ దెలియఁగలదు అందువలన ఆయా బౌద్ధమతశాఖలనుగుఱించి తెలిసికొనుట యుక్తము

బౌద్ధమతశాఖలు — శాక్యముని బుద్ధుని పరినిర్వాణకాలమునకుముందే, అతఁ డున్నతోద్దేశములతో నేర్పఱిచినసంఘమున అభిప్రాయభేదములు కలిగి పను లేర్పడినవి వైశాలియందు సమావేశమయిన 'సంగీతి' యందు ఈ యభిప్రాయభేదములు చాల ప్రస్ఫుటమయి బౌద్ధసంఘము మహాస్థవిరు లని, మహాసాంఘికు లని రెండుపక్షములుగ విడిపోయినది మహాస్థవిరశాఖ ఆత్మానుభవముగల వృద్ధులకే ప్రాముఖ్యము నొసంగును మహాస్థవిరులు శీలసంపన్నులు, వృద్ధాచార, గర్వములను, వైశిష్ట్యగుణములకును ప్రాధాన్య మిచ్చెదరు ఈ యాచారధర్మములప్రకారము నడచుకొనుట చాలఁ గష్టమయినందున యువజనుల కవి నచ్చక వారు స్థవిరవాదమును తిరస్కరించి స్వతంత్రవాదము సల్పిరి వీరు మహాస్థవిరులవలెఁ గాక వేదాంతవిషయములను, లోకోపకారకవిషయములను ప్రాముఖ్యము నిచ్చిరి మహాస్థవిరశాఖయందలి యొకసంప్రదాయమునకు 'విభజ్యవాద' మని పేరు మౌర్యవంశజుఁ డయినయశోకచక్రవర్తి బౌద్ధమతశాఖ లన్నిటిని సమానముగ నాదరించినను అతని కీసంప్రదాయమం దాదరము, ప్రీతియు నెక్కువ అశోకచక్రవర్తి యాదరమున నిది కొంతకాలము వర్ధిల్లినది కాని తరువాత దీని కాదరము తగ్గి, పుష్యమిత్రుఁడు మొదలగు శుంగవంశజులు పెట్టినహింసలవలన నిది క్షీణించినది ఈసంప్రదాయమునకు చెందినవారు పిదప దక్షిణదేశమునకు పాఱిపోయి తుదకు సింహళమున కరిగి యచ్చట నిలదొక్కుకొనిరి యువజనులయిన మహాసాంఘికులయుద్దేశము లున్నతము లయిన నగుటచేతను, వారత్యంత లోకోపకారబుద్ధితో తమసంప్రదాయధర్మములను ప్రచారము చేయుటచేతను, యుక్తిపరు లగుటచేతను వారిసంప్రదాయము జనసమ్మతమయి అతిశీఘ్రకాలమున దేశమున బాగుగ వ్యాపించినది మహాసాంఘికులు హిందూదేశమునకు క్రొత్తగా వచ్చినవిదేశీయులయిన యవన, శక, పహ్లవ, కుషాణాదులతో స్నేహము కలిపి వారిప్రాపు సంపాదించుకొనిరి వారు ముఖ్యముగా కనిష్కునికాలమున చాల ప్రాముఖ్యమును వహించిరి కనిష్కునికాలమున జరిగిన 'సంగీతి' యందు వీరు బుద్ధశాస్త్రములకు క్రొత్తవ్యాఖ్యలను రచించి వానిని 'విభాషా' శాస్త్రములుగ కావించిరి. కనిష్కునికాలమున జర

# అమరావతీ స్తూపము



స్తూపభాగముల సూచి

**ప్రాకారరేఖ**

- ౧ ఊర్ధ్వపటములు (వెలుపలివైపు)
- ౧ క ఊర్ధ్వపటములు (లోపలివైపు)
- ౨ సూచులు (వెలుపలివైపు)
- ౨ క సూచులు (లోపలివైపు)
- ౩ ఉష్ణీషము (వెలుపలివైపు)
- ౩ క ఉష్ణీషము (లోపలివైపు)
- ౪ అధిష్ఠానము
- ౫ ప్రదక్షిణపథ

**వేదిక**

- ౬ వే క ముందటి అరుగువంటిభాగము
- చైత్యశిలాఫలకములు
- ౮ చైత్యశిలాఫలకములు ఉష్ణీషము
- ౯ ఆయకస్తంభములు
- ౧౦ అండము
- ౧౧ హార్మిక
- ౧౨ ఛత్రము

## అమరావతీ స్తూపము



ఒక శిల  గము మీది మూనా నుంచి వ్రాసిన అమరావతీ స్తూప ఎంచార్ణము

# అమరావతీ స్తూపము



౫ ఊర్ధ్వపాత్రములు (పటము ౮)
(లోపలివైపు)

నెదురెదురుగా నలుదెసల నుండునట్లు తీర్పఁబడినది. ప్రతిద్వారమునకు ఎదురుగా ఈ మండలికి వచ్చిన భాగములమీఁద నైదేసి స్తంభములు చొప్పున నాలుగుదిక్కులందును గలసి యిరువది స్తంభము లుండును. వీనికే 'ఆయకస్తంభములు' (అర్ఘ్యకస్తంభములు – పూజనీయ స్తంభములు) అని పేరు. స్తంభాధిష్ఠిత భాగములతోఁ గలసి వేదికచుట్టుకొలత ౫౨౦ అడుగులు, ఆ భాగములను మినహాయించినచో, దానిచుట్టుకొలత ౪౩౦ అడుగులు. ఇంతదొడ్డయు నది రెండువైపుల శిల్పచిత్రములతో శోభిల్లుచుండును.

వేదిక పైంటివరుసయందు పోట అండముచుట్టుకొలత ౪౩౫ అడుగులు. హర్మ్యకవంటిఁ గల అండోపరితల మంతయు రకరకములైన సుందరములగు శిల్పచిత్రములతో నలరారుచుండును. పూర్ణఘటములు, స్తూపములు, ఇతర బౌద్ధోత్సవములకును సంకేతములగు ప్రాయకములు జెండాలతోను, పుష్పతోరణములతోను, దీపపాత్రములతోను అలంకరించువారు. రాత్రులయందు దీనిని జూచినయెడల నిది దీపాలతిన్నవలె కన్పడుచుండెడిది. ఇందువల్లనే కాబోలు నీస్తూపమునకు 'దీపాలదిన్నె' యని పేరువచ్చినది. వేదికను గప్పియుండు చైత్యశిలాఫలకము లొక ప్రాకారమునకు సంబంధించిన వనియు, ఇక్కడనే యింకొక పెద్దప్రాకార ముండియుండవలెనని యూహించి, యది వెలుపలి ప్రాకార మనియు, నిది లోపలి ప్రాకార మనియు ఈ యమరావతీస్తూపమునుగూర్చి యిదివఱలో ప్రాచీనపండితులు కొందఱు వ్యవహరించియున్నారు. కాని యిటీవలి పరిశోధనల ననుసరించి చూడఁగా నీవ్యవహారము తప్పని చెప్పవలసియున్నది. అంతేకాక, బౌద్ధవాస్తుకళయందు నేస్తూపమునకును రెండుప్రాకారములు కానరావు. ఈకారణము ననుసరించికూడ 'లోపలి ప్రాకార' మనువ్యవహారము తప్పనియు, లోపలి ప్రాకార మను వ్యవహారము కేవలము వేదికను గప్పియుండు చైత్యశిలాఫలకములకే వర్తించు ననియు తెలిసినది.

వెలుపలి ప్రాకారము — ఈ స్తూపప్రాకారమునకు రెండువైపుల నందమయిన శిల్పచిత్రములు గలవు. ఈ ప్రాకారరేఖ చాల గొప్పది. ఇందలి శిలాఫలకములమీఁద చెక్కినశిల్పచిత్రములు కొలఁదిరైనను అవి ఆశ్చర్యకరములును గొప్పవియు, మనోహరములుగ నున్నవి. ఈ కారణములవలన నీస్తూపమువెలుపలి ప్రాకారమునకు దీటువచ్చునది హిందూదేశమున మఱియొక్కటియు గానరా దని పరిశోధకపండితుల యభిప్రాయము (చూడుఁడు, ప్రాకారరేఖాచిత్రములు, పటము, ౫).

వేఱువేఱు బౌద్ధక్షేత్రములలోఁగల ప్రాకారములవలెనే యీ స్తూపప్రాకారముకూడ బౌద్ధులయందు సంప్రదాయసిద్ధముగ వచ్చుచుండిన పద్ధతినే యనుసరించి నిర్మింపఁబడినది. అది యెట్లనిన, సాధారణముగ నిట్టి ప్రాకారరేఖానిర్మాణములయందు శిలామయనిర్మాణముల యందు కాసెవాండ్రవలంబించుపద్ధతి కాక, దారుమయనిర్మాణముల యందు వర్ధకు లవలంబించుపద్ధతి ననుసరించుట వాడుకగఁ గన్పట్టును. వెలుపలివైపున నుండి చూచినచో ప్రాకారమునెత్తు రమారమి పదు మూఁడడుగులు, లోపల స్తూపమునకు, నీప్రాకారమునకును నడుమ నుండు ప్రదక్షిణమార్గము ఎత్తుచేయఁబడుటచేత లోపలనుండి చూచినచో ప్రాకారమునెత్తు పదియడుగులు మాత్రమే. చుట్టు నీప్రాకారము నిలువురాతిస్తంభములతోను, రెండేసి స్తంభముల నడుమ, వానిలో అడ్డముగాఁ దొనిపి కలిపిన మూఁడేసి రాతి అడ్డుకమ్ములతోను ఏర్పడినది. నిలువురాతిస్తంభములలో ప్రతిదానికి పెనపెద్ద మూఁడు తొలలు కొట్టి అడ్డుకమ్ముల చివరలు పసులుంగ తీర్చి వానిని స్తంభపుతొలలయందుఁ దూర్చి యతికినారు. శాసనములం దీ నిలువురాతిస్తంభములు ఊర్ధ్వపటములనియు, అడ్డుకమ్ములు సూచులనియు పేర్కొనఁబడినవి. నిలువురాతిస్తంభము లొక్కొక్కటి తొమ్మిదడుగుల యొకయంగుళ మెత్తుగ నుండెను. ఒక్కొక్క యడ్డుకమ్మి పొడుపు అ౩ అంగుళములు. స్తంభాగ్రములు పసులుగాఁ దీర్పఁబడినవి. ఈపసులు స్తంభములమీఁద మదురువలె ఘటింపఁబడిన రాతిమాలములలో వాని యడుగుభాగమునఁ దొలిచిన తొలలలోఁ దూర్చి బిగింపఁబడినవి. ఈ రాతిమాలములతో నేర్పడిన మదురు ఊర్ధ్వపటములకు పైని ఉష్ణీషము (తలపాగ) వలె నుండుట వలన నది ఉష్ణీష మని శాసనములందు పేర్కొనఁబడినది. ఈమాలములలో నొక్కొక్కటి చాల పొడుపును వెడల్పును గలది. ఈ రాతిమాలము లొక్కొక్కదానియెత్తు రెండడుగుల తొమ్మిదంగుళములు. ప్రాకారరేఖయందు దిగువభాగమునందు అడుగు ఎత్తున నొక యొటికోళ్ళ గలదు. ప్రాకారరేఖలోపలి భాగమున ప్రదక్షిణమార్గ మెత్తుగ నుండుటచేత ఈగోడ కానరాదు, వెలుపటమాత్రమే కనఁబడును. ఈగోడ కలంకారముగ వెలుపలితట్టున ప్రక్కలందు బొమ్మలుచెక్కిన రాతిపలకల నతికినారు. ఈపలకలమీఁద జంతువులయొక్కయు, బాలుర యొక్కయు చిత్రములు నవ్వుపుట్టించునట్టిరీతులలోఁ జెక్కఁబడినవి. ప్రాకారరేఖయందలి యీ భాగమునకు అధిష్ఠాన (Plinth) మనిపేరు (చూడుఁడు, అధిష్ఠానచిత్రములు, పటము, ౬). బొమ్మలుచెక్కిన కొన్ని శిలాఫలకములను ఈయధిష్ఠానమునకు సరిపడినట్లు మలిచి కోసివేసియుండుటచేత నవి పూర్వము మఱియొక ప్రాకారరేఖయందలి యుష్ణీషమునందలి వయి యుండు ననియు, ఏకారణమునకో యవి నశించినతరువాతనో యేమో వాని నధిష్ఠానశిలాఫలకములుగ మార్చినా రనియు పురాతత్త్వవిదులు చెప్పుదురు.

ద్వారములు — ఈ ప్రాకారరేఖ వృత్తాకారముగ నున్నదని యిదివఱకే తెలుపఁబడినది. అది నాలుగువైపులందు నడిమిభాగమున నుండునట్లు పొడుచుకొనివచ్చినట్లు తీర్పఁబడినది. నాలుగువైపులందును పొడుచుకొనివచ్చిన యీభాగము లొండొంటికి నడుమఁగల మడుపులలో నొక్కొక్కభాగమున ఇరువదిరెండేసిచొప్పున నిలువురాతిస్తంభము లున్నవి. రెండేసి స్తంభముల నడుమ మూఁడేసిచొప్పున ఒక్కొక్కమడుపునందు అఱువదియాఱు సూచు లున్నవి. ఒక్కొక్కవైపున నుండునటు పొడుచుకొనివచ్చిన ద్వారరేఖ ఉభయపార్శ్వములందుఁగల మూఁడేసి నిలువురాతిస్తంభములతో నేర్పడినది. ఒక్కొక ప్రక్క నీ స్తంభములనడుమ నెత్తముమీఁద పంద్రెండు

మూడు లున్నవి. ఈరీతి చేర్పడిన రెండుప్రక్కల ద్వారములవద్ద ఇరువదిరెండడుగులు, పొడవు పదునాలుగడుగులు. ఈ ప్రాకార ద్వార స్తంభములమీఁద వెనుకటికాళ్లమీఁద కూర్చుండియున్నట్లు చెక్కిన సింహప్రతిమలు కలవు (చూడుడు, పటము, ౬).

మొత్తముమీఁద నీ ప్రాకారరేఖయందు ౧౩౬ ఊర్ధ్వపటములును, ౩౪౮ సూచులును, ౮౦౩ అడుగుల పొడవుగల ఉష్ణీషమును ఉండెను.[1] ఈ ప్రాకారరేఖ వెలుపలితట్టునను, లోపలితట్టునను కూడ శిల్పచిత్రశోభిత మయియున్నది. వెలుపలివైపునఁ గల బొమ్మలు ఆచారసిద్ధ మయినరీతిని చెక్కఁబడినవి; చిత్రములయందలి కల్పనా పద్ధతి ఒకేవిధముగ నున్నది. వెలుపలివైపునను, లోపలివైపునను ప్రతి స్తంభము మధ్యభాగమునందును దారుమయప్రాకారమునఁ గాన వచ్చు మేకులతలలను స్ఫురణకుఁ దెచ్చునట్లు వృత్తములు తీర్పఁబడినవి. ఈ వృత్తములందు పద్మచిత్రములను చెక్కినారు. స్తంభాగ్రభాగము నందును అధోభాగమునందును అర్ధవృత్తములను మిగిలియుండు పద్మ చిత్రములు కలవు. మధ్యవృత్తమునకును, ఊర్ధ్వాధోవృత్తములకును నడిమిభాగములు మూఁడేసి నిలువుపట్టికలుగ విభాగింపఁబడినవి. ఈ పట్టికలందు రకరకముల జంతుచిత్రములు, మనుష్యచిత్రములు, పుష్పచిత్రములు మొదలైనవి కానఁబడును. స్తంభాగ్రభాగమున నుండు నర్ధవృత్తముమీఁదను, దిగువభాగమున నుండు నర్ధవృత్తము దిగువను కొంచెము వెడలుపయిన అడ్డుపట్టికలు (Horizontal Bands) కలవు. అందు సాధారణముగ పుష్పచిత్రములు, జంతు చిత్రములు కానవచ్చును.

స్తంభము వెలుపలివైపున దిగువఁగల వెడలుపయిన అడ్డు పట్టికయందు మధ్యభాగమున తఱచుగా స్తూపపుబొమ్మ కనఁబడును. స్తూపమున కుభయపార్శ్వములయందును దానిని పూజించుటకు వచ్చిన యుపాసకుల బొమ్మలు చెక్కియున్నవి. వెలుపలివైపునఁ గల స్తంభపు నిలువుపట్టికలలో సాధారణముగ ఆచారసిద్ధ మయిన శిల్పచిత్రము లుండును. స్తంభమధ్యభాగమునం దుండు పద్మవృత్తమున కెగువఁ గల నిలువుపట్టికలందు సాధారణముగ నాగము, దాగోబా, బుద్ధుఁడు, పూజచేయువారు మొదలయిన ప్రతిమలును, దిగువ నిలువుపట్టికలలో నాట్యముచేయు స్త్రీ, యక్షగణ చిత్రములును చెక్కియున్నవి. లోపలివైపునఁ గల వృత్తములందును, అవృత్తము లొండొంటికి నడు మఁగల నిలువుపట్టికలందును రకరకములయిన చిత్రములు కలవు. వీనిలోఁ జాలవఱకు బుద్ధజీవితమునందలి గాథలను, జాతకకథలను, బౌద్ధమతసంప్రదాయ చరిత్రాత్మకము లయిన కథలను సంబంధించినవి. ఎవని గార్హస్థ్య చిత్రములుకూడఁ గానఁబడును (చూడుడు, ఊర్ధ్వపటచిత్రములు, పటము, ౮).

అడ్డుకమ్ములు.— ఇవి సూచికలవని వ్యవహరింపఁబడుచు నగుట చేత వీనికి సూచులని పేరు కలిగినది. ఈసూచులు వృత్తాంచితములు ఒక్కొక్కప్రక్క వృత్తములమధ్యమున ౧ ౩ లు. వెలుపలివైపున లోపలి వైపున ఊర్ధ్వాధోభాగములందును గల వృత్తములందు పద్మములు చెక్కఁ బడినవి (చూడుడు, పటము ౯). నడిమిసూచులందలి లోపలి వైపునఁగల వృత్తములందు మాత్రము బుద్ధజీవితకథలును, జాతక కథలును చెక్కినారు (చూడుడు, పటము, ౧౦).

ఉష్ణీషము.— ఉష్ణీషము పైభాగమున గుండ్రనదేయయుం డును. దానికి లోపలివైపున, వెలుపలివైపున శిల్పచిత్రములు లేక ములు కలవు. వెలుపలివైపున నది తరంగాకృతి గల పొడుగయిన పుష్పదండము. ఇడనెడ మనుష్యులు మోయుచున్నట్లు చిత్రితమయి యున్నది. తరంగ మెచ్చటనైన వంగినప్పుడు దానిని దిగువ మనుష్యులు మోయుచున్నట్టి చిత్రములును, పతనము చెందినప్పుడు దానిమీఁద దాగోబా, బోధివృక్షము, ధర్మచక్రము, త్రిరత్నములు, నాగములు, యక్షులు - వీని చిత్రములను చెక్కఁబడినవి. లోపలివైపున జాతక కథలను, బౌద్ధసంప్రదాయచరితములను, బుద్ధజీవితకథలను చెక్కి నారు (చూడుడు, ఉష్ణీషచిత్రములు, పటము, ౧౦).

వేదిక.— అమరావతీస్తూప వేదిక యెత్తు ఆఱడుగు లని యిది వఱకే చెప్పఁబడినది. ఈ వేదిక చుట్టుకొలత ౫౭౧ అడుగులు. దీని లోపలివైపుభాగము నిర్మాణమునందుఁ బడిపోవుటచేత నిది వెలుపలి వైపునమాత్రమే చిత్రిత మయినది. ప్రాకారరేఖయందువలె, దీనియం దును మొత్తము చిత్రితమయిన భాగము పరిమితమే యయినను వేదిక యందలి చిత్రరంగములు ప్రాకారమునందలివానికన్న నెక్కుడి చిన్నవి. కాని ప్రాకారపురాతికంటె వేదికరాయి నెక్కుడి మెత్త నయిన దగుటచేత వేదికయందలి ప్రతిమాశిల్పము ప్రాకారమునందలి దానికంటె అతి ప్రశస్త మయినది. వేదికను గప్పియుండు నీ పైశిలా ఫలకములమీఁద సర్వసాధారణముగ దాగోబాలును, నాగములును చెక్కియున్నవి. ఈ దాగోబాలు చెక్కిన ఫలకలను కుడి, యెడమ వైపులందు నిడిరాలమీఁదఁ జెక్కిన స్తంభము లున్నవి. ఈ నిడి స్తంభములమీఁద బోధివృక్షము, ధర్మచక్రప్రవర్తనము, మారప్రలో భనము మొదలయిన చిత్రము లుండును (చూడుడు, నిడిస్తంభము, పటము, ౧౧). దాగోబాలును, స్తంభములును విడివిడిశిలాఫలకముల మీఁదఁ గాక యొక్కొక్కప్పుడు ఒకటే ఫలకముమీఁద చెక్కి యుండుటయుఁ గలదు. ఈ వేదికాపైశిలాఫలకములమీఁద నందు కట్టినట్లు చిత్రాలంకృతమయిన యొకపట్టిక (Frieze) యుండును. వేఱువేఱు రాతిపలకలను కూర్చి యమర్చుచును దీర్చిరి. కొన్ని కొన్ని సందర్భములలో ఒకటే రాతిఫలకముమీఁదను ధర్మచక్ర స్తంభమును, దాగోబాయును, వీని రెంటను చిత్రాంచిత మయిన యంచుమయినకూడ నుండుట గలదు. మత్రాము చిత్రకళాప్రదర్శన కాలమునందుఁ గల పైశిలాఫలక మాతరగతికి చెందినది (చూడుడు, పటము, ౧౨).

1 Burgess' The Buddhist Stupas of Amaravati and Jaggayyapeta, p. 25.

ఈ చైత్యశిలాఫలకములకు తలకట్టుగ నుండు చిత్రశోభిత మయిన ప్రాకారోష్ణీషమును నా యంచును దీర్చుటలో శిల్పులు దారు మయప్రాకారము నాదర్శముగఁ దీసికొని రని కదు ప్రాచీనములగు సంచులందలి నమూనరించి చెప్పుట కవకాశము కలదు. తొలుదొలుత తీర్చిన యిట్టి తీర్పులలో అంచు నడ్డముగ నంయానుభాగములు చేసి యగ్రమునందుఁ గల మొదటిభాగమున పుష్పకల్పలతయు, రెండవ భాగమునందు రెండవభాగమున ప్రాకారాకృతిని, మూఁడవభాగమున ప్రయాణముచేయుచున్నట్లు చిత్రింపఁబడిన వరాహము, సింహము, మృగము, వృషభము మొదలయిన జంతువుల చిత్రములను చెక్కినారు. రెండవభాగమున చిత్రింపఁబడుచుండిన ప్రాకారచిత్రమును మొదటికాలపు తీర్పులందును, తరువాతికాలపు తీర్పులందును భేదము కలదు. మొదటికాలపుతీర్పులందు ఈ ప్రాకారచిత్రము చిత్రాలంకారరహితముగఁ గన్పట్టును. తరువాతికాలపు తీర్పులందు ఈ ప్రాకారమునందలి సూచీవృత్తము లొండొంటికి నడుమనున్న స్థలమున మనుష్యప్రతిమలు మొదలయిన వేఱువేఱు రకముల చిత్రరంగములను దీర్చినారు. ఎగువను, దిగువను గల ప్రతి సూచీవృత్తమునందును పద్మములను చెక్కినారు, కాని ప్రతి నడిమి సూచీవృత్తమును మాత్రము పద్మముగ తీర్పక అద్భుతమూనమానవలీలలకు సంబంధించిన చిత్రరంగములను చెక్కినారు. ఈసూచీవృత్తము లొక్కొక్కటి రెండు మూఁడంగుళముల వ్యాసరేఖ గలవి. ఇంతటి స్వల్ప స్థలమునందు ఆకాలపు బౌద్ధశిల్పులు చక్కఁగ మనోహరములయిన మనుష్యప్రతిమలను చెక్కినారనిన వారి కళాకౌశల మెంతటిదో యాలోచించుకోవచ్చును. నాలుగవభాగమును చిత్రించుటలో నొక చిత్రము కలదు. ఈభాగ మంతయు దారుశిల్పపద్ధతిని చిత్రిత మయినట్లు కన్పట్టును. ఈభాగమున చతురస్రముగ నుండు రంధ్రములొకదాని కొకటి సమానదూరములం గుండునట్లు చేసినారు. తొలుదొలుత తీర్చిన యంచులం దీభాగమున రంధ్రమునకు రంధ్రమునకు నడుమనుండు భాగమునం దేచిత్రములను చెక్కకుండ వదలివేసినారు. తరువాతికాలమునఁ దీర్చిన యంచులను బరిశీలించినచో నా రంధ్రాంతరస్థలములను సూక్ష్మముగ సింహశీర్షములు చెక్కుటకు విడిచినవేని నట్లు స్పష్టమగును. అయినను దగు నప్పడుగుభాగము బొమ్మలు చెక్కవిచిత్రము కాక శాసనములు చెక్కుట కుద్దేశింపఁబడుటచేత నది చిత్రరహితముగ నున్నది. తరువాతి యందు చెక్కఁబడు శాసనములు సాధారణముగ నట్టి యలంకారఫలకములకు దానముగ నొసంగిన దాన పతులనుగూర్చి తెలుపును. ఈ శాసనములందు చిత్రశోభితములయిన యిట్టి యంచులు ' పటము ' అని పేర్కొనఁబడినవి (మొదటికాలపు ' పటము 'నకు చూడుఁడు, పటము, ౧౩ ; తరువాతికాలపు ' పటము 'నకు, చూడుఁడు, పటము, ౧౪ ).

' ఆయకకంభములు ' — నాలుగై పులందును, నాలుగు ద్వారములకు యెదురుగా నరుగులపై నుండుసుండిన వేదికాభాగముల మీఁద నొక్కొక్కచోట నైదేసి చొప్పున నాలుగైపులఁ గలవి యయిదవ స్తంభము లుండు నవి, వీనికి ' ఆయకకంభము ' లని పేరు. ఇవియే దక్షిణావర్తమునం దేడునెలకొనబడినవి. ఒక్కొక్కదిక్కునవిట్లయిదేసి స్తంభము లుండుట ఆంధ్రదేశస్తూపములందే కానవచ్చు విశిష్టలక్షణము. ఈ విధమున స్తంభములను ప్రతిష్ఠించుటవలె వనుభావము ప్రాయికముగ అమరావతీస్తూపమున కంటెను పూర్వకాలమునసే నిర్మింపఁబడిన యుత్తరహిందూస్థానమునందలి సాంచీ, భార్హూత్ మొదలగు స్తూపములనుబట్టి కలిగియుండవచ్చును. రాతిపలకలమీఁదఁ జెక్కిన భార్హూతు స్తూపాకృతులను గాంచినయెడల స్తూపవేదికమీఁద నుభయపార్శ్వములయందును అలంకారముగ నున్న కొన్ని ధ్వజములు చూడవగును. ఏతాదృశధ్వజభావమును నైకాని యాంధ్రకళావిదులు అట్టి ధ్వజములను గౌరవాలంకారార్థముగమాత్రమే కాక విశేషప్రయోజనము నిమిత్తము కూడ నుపయోగించియున్నారు. ఉపాసకులకు స్తూపసందర్శనమున బుద్ధనిర్వాణము స్ఫురించునట్లే ఈ స్తంభపంచకదర్శనమున బుద్ధజీవితమునందలి ప్రధానవిశేషములు స్ఫురించునట్లు చేసినారు. ఈ యైదు స్తంభములను పంచకల్యాణము లనఁబడు బుద్ధజీవితప్రధానవిశేషములకు గుర్తుగ నిలిపి గౌరవించినారు. (౧) బుద్ధావతారము, (౨) మహాభినిష్క్రమణము, (౩) మారప్రధ్వంసము, (౪) సంబోధి, (౫) ధర్మచక్రప్రవర్తనము అనునవి పంచకల్యాణము లనఁబడును. అప్పుడు మహాపరినిర్వాణమునకు స్తూపమే సూచనయగుటవలన మారప్రధ్వంస, సంబోధుల నొక్కవిశేషముగాఁ జేసికొనినయెడల నప్పుడు (౧) బుద్ధావతారము, (౨) మహాభినిష్క్రమణము, (౩) సంబోధి, (౪) ధర్మచక్రప్రవర్తనము (౫) మహాపరినిర్వాణము అను నీ యైదింటిని దెలుపుట కీ స్తంభములు ఉద్దిష్టమైనట్లు గ్రహింపవలెను. ఈవిషయము ప్రస్ఫుటమగుటకయి తరువాతికాలమున స్తంభము దిగువభాగములందు, చూచువారి దృష్టి పడునటుఁ బడునట్లు బోధివృక్షము, స్తూపము, ధర్మచక్రము మొదలయినవి చెక్కినారు. ప్రాకారమును గడచి లోపలికి వెళ్లినంతనే బౌద్ధులు, ఉపాసకులు పూజాద్రవ్యముల నీ స్తంభములయం దుంచి, వాని నారాధించి పిదప స్తూపప్రదక్షిణము చేయుదురు. ఈ స్తంభము లీవిధమున గౌరవపాత్రము లగుటవల్ల కాబోలును వీనికి ' ఆయకకంభములు ( ఆర్యక కంభములు - పూజ్య స్తంభములు ) అని పేరు కలిగెను ( చూడుఁడు, ఆర్యకకంభచిత్రములు, పటము, ౧౫ ) స్తంభములయితే పూజ్యములు కావు కాని యవి మతసంబంధ మయిన పూజ్యభావములకు చిహ్నములుగ నిలుచుటచేత నవి పూజ్యస్తంభము లయినవి. ఈ స్తంభములు దిగువభాగమున చతురస్రముగ నుండును. స్తంభపాదము ( Shaft ) అష్టకోణాకారముగ నుండును. అందము రూపమునఁ దేలిన చూలిక ( Capital ) ప్రతిదిక్కున తోరణముగ ( Arch ) మలచఁబడినది. దీనికి బౌద్ధుల స్తూపమున చైత్యతోరణ మని పేరు. చూలికయందలి తోరణముల దిగువభాగములు పట్టి గూండ్లుగ నుండవలెను; లేదా ఆగూండ్లయందు యక్షిప్రతిమలను చెక్కినారు ( చూడుఁడు, అమరావతి యక్షిప్రతిమ, ౧౬. ) చూలికశిఖరభాగమున

# అమరావతీస్తూపము



౧౩ చైత్యశిలా ఫలకము ( పటము ౧ )

కాఁ దగు నని విన్సెంటుస్మిత్తుగారు వ్రాసియున్నారు. యజ్ఞోపవీతము, ఛత్ర మీ విగ్రహములు ధరించుట చాల్పుటచేత వీని కుడిభుజమును, కుడిచేతిమొత్తయు గనఁబడుచుండును. ఇదియే యీ మూర్తులయందుఁ గానవచ్చు ముఖ్యమైన లక్షణము. ఈపద్ధతి ధరించిన వస్త్రము భుజములను రెంటినిగూడఁ గప్పివేయు గాంధారపద్ధతికి భిన్నమయినది. ఇట్టి విధి బుద్ధవిగ్రహములలో రెంటిని మద్రాసు మ్యూజియమునందుఁ జూడ వచ్చును. బుద్ధునివిగ్రహములే కాక యితరవిగ్రహములు కూడ — ప్రాయికముగ యక్షుల వగు కొట్టా — కానవచ్చును. ఇట్టివానిలో శీర్షరహితమయిన విగ్రహ మొకటి మద్రాసు చిత్రవస్తుప్రదర్శన శాలయం దున్నది. ఈ విగ్రహ మెవ్వరి దనువిషయమున పురాతత్త్వ విదులలోఁ గొంత వివాదము కలదు. ఈ విగ్రహముక్రిందిభాగము నందుఁ జెక్కియున్న శాసనమును సరిగా చదువక కొంద ఱది రెండవశతాబ్దికిఁ జెందినవాఁ డగు ఆంధ్రరాజు గౌతమీపుత్ర శాతకర్ణి దని వ్రాసియున్నారు. కాని శిల్పపురీతి ననుసరించి చూచినను, ఆ శాసనమునుబట్టి చూచినను ఆ విగ్రహ మంతకు పూర్వకాల పుదయి యుండు ననియే కాక, అది గౌతమీపుత్రశాతకర్ణిది కా దని కూడ నిర్ధారణ మగుచున్నది. అందలి పదివాని తనము ననుసరించి డాక్టరు ఆనందకుమారస్వామిగారు అది క్రీస్తుశకముఁ బూర్వము మూఁడవశతాబ్దమునాఁటి దయి యుండునని చెప్పినారు. దానిమీఁది శాసనమును 'గౌతమీ నమా ... దాన' అని కాని, 'గౌతమీన మా ... దాన' అని కాని చదువఁదగియుండుటచేత నది యెట్లయినను గౌతమి యనుపేరఁ బరఁగు స్త్రీ చేసిన దానమువలెఁ బ్రచున్నట్లు గ్రహింపవలసియుండును గాని దానిని గౌతమీపుత్ర శాతకర్ణివిగ్రహముగ భావించుటకు వీలులేదు. తలలేనికారణమున నావిగ్రహ మెవ్వరి దనువిషయమున నెన్నియో యూహాపోహలయినను కలుగుట కవకాశము కలదు. ఈ విగ్రహముయొక్క యంజలిబద్ధమయిన చేతిలో పద్మమువంటి పుష్ప ముండుటవలనను, బౌద్ధ పురాణగాథలందు శాక్యవర్ధనుఁడు మొదలయిన యక్షులను గురించి చెప్పఁబడి యుండుటవలనను ప్రాయికముగ నది బుద్ధుని పూజించుటకు వచ్చిన యక్షుని విగ్రహమే కావచ్చును.

పూర్వోక్తవిగ్రహములేకాక యిడిగా దొరకిన శిల్పకృతులను యింకను అనేకములు కలవు. వానిలో ముఖ్యముగ నిట పేర్కొనఁదగి నవి బుద్ధపాదములు. బుద్ధుని యీపాదముల యడుగున (అరకాలి యందు) మహాపురుషలక్షణాదికములయిన సంకేతము లెన్నో యుండును. అమరావతీస్తూపభూమియందు దొరకిన బుద్ధుని శ్రీపాదములలో ప్రాయికముగ సహస్రారచక్రమును, త్రిరత్నచిహ్నమును, త్రిశూలములను, స్వస్తికమును గానవచ్చును. సహస్రారచక్రము ధర్మచక్రమునకును, త్రిశూలము బుద్ధ, ధర్మ, సంఘములకును సంకేత మని యిదివఱకే మనకుఁ దెలియును. స్వస్తికమునుగురించి యించుక తెలిసి కొనవలసియున్నది.

స్వస్తికచిహ్నము చతురరసమన్వితము. కొనలతో నుండు నీ యాకులలో నొక్కొక్కటి యొక్కొక దిక్కున నుండును. ఉత్తరపుటాకుకొన తూర్పునకై పోవును, తూర్పునకై పోవువానికొన దక్షిణమునకు, దక్షిణపుటాకుకొన పడమటికి, పడమటివానికొన ఉత్తరమునకును పోయియుండును. ఈకొనల చతురరసమన్విత మగు స్వస్తికచక్రగతిని నిరూపించును. తూర్పునకై పోవునందు ఆకు చూపునది మనుష్యగతి. సరిగా దీనికెదురుగ పడమటికై పోవునందు ఆకు చూపు నది దేవగతి. దక్షిణమునకై పోవునందు ఆకు చూపునది నరకగతి. ఉత్తరమునకై పోవునందు ఆకు చూపునది సమ్యక్సంబుద్ధత్వగతి, అనఁగా గాఢముక్తస్థితి. మనుష్యుఁ డెప్పుడును తన మనసు వచ్చినట్లు తన్ను వదలిపెట్టినచో నతనియందలి జంతుప్రకృతివలన నతఁడు నరకమునకుఁ బోవుట సహజము కాన, పతితులయిన యట్టిమానవుల నుద్ధరించుటకు బుద్ధునివలన నిరంతరము ప్రయత్నము జరుగుచున్నది. తత్ప్రయత్నఫలము సమ్యక్సంబుద్ధి లేక పరినిర్వాణము. ఈ విధముగ సర్వమానవజాతిని దుఃఖమునుండి యుద్ధరించి సమ్యక్సంబుద్ధస్థితిఁ గొని వచ్చుటకయి బుద్ధుఁడు సంకల్పించిన సంకల్పమును దెలియఁజేయుట కీ స్వస్తికము చిహ్నమయి తనరారుచున్నది. బుద్ధుఁ డిట్లు చేయుటకు కరుణయే కారణము. కావున నీ చతురరస్వస్తికచక్రము నడుమ కరుణయే కీలకము (Pivot)గ నున్నది. ఈ కేంద్రమునుండియే బుద్ధుని విశ్వానుగ్రహము సర్వాశలకును సర్వమానవాభ్యుదయమునకయి ప్రవహించుచున్నదని యీచక్రమునందలి యాకులు తెలుపుచుండును. ఈ కరుణయే బౌద్ధమతమునందలి ప్రధానతత్త్వము. దీనిని తరువాతికాలమున బౌద్ధతత్త్వజ్ఞులు శక్తిగను, జగన్మాతగను వెలయించి ఆ దేవివలననే బుద్ధత్వప్రాప్తి కలుగునని నిర్వచించియున్నారు. ఈ కరుణాతత్త్వము వలననే తరువాతికాలమున బౌద్ధమునందు ఇదివఱలో నుడివినట్లు వజ్రయాన, మంత్రయాన, తంత్రయానాదులు వెలసినవి. ఈ బౌద్ధమత సంప్రదాయములందు కరుణ జగన్మాత యను స్త్రీగను, బుద్ధుఁడు జగత్పిత యను పురుషుఁడుగను వ్యక్తీకరింపఁబడిరి.

స్తూపనిర్మాణకాలము — అమరావతీస్తూప మొక్కకాలమునను, ఒక్కతడవను గట్టినదికాదు. దీనికి వేఱువేఱుకాలములందు మార్పులు, చేర్పులు చేయఁబడినవి. నాలుగుతడవలలో నీ నిర్మాణము పూర్తియైనట్లు స్తూపపు రాతిపలకలమీఁది శాసనములలిపిరీతి ననుసరించియు, చిత్రములరీతి ననుసరించియు సుకరముగను, స్పష్టముగను కని పట్టవచ్చును.

మొట్టమొదట కట్టిననాఁటి పనఁదిగిన శిలాఫలకములను గొన్నిటిని జూడఁగలము. వీనిలోఁ గొన్నిటిమీఁద శాసనములు చెక్కియున్నవి, మఱికొన్నిటిమీఁద చిత్రములు చెక్కియున్నవి, వేఱొకకొన్నిటి మీఁద రెండును గలవు. ఈ కాలపు పలకలయినను ముఖ్యముగ లేక చాల భాగము పగిలియున్నవి. ఈ పలకలమీఁదఁ గానవచ్చు శాసన, చిత్రములరీతిని భార్హూతుస్తూపమునందలి శాసన, చిత్రరీతిని ఎక్కువ పోలికయు, దగ్గఱ సంబంధమును కనఁబడును. దీని ననుసరించి మొదటి

అమరావతీస్తూపము



౧౫ 'ఆర్ద్రకకంథ చూలిక (పటము ౧౬)
(అమరావతి యక్షిప్రతిమ)

## అమరావతీస్తూపము



౧౬ అంచిత్రములు ( పటములు ౧౪ ౧౯, ౨౦ )

# అమరావతీస్తూపము



౧







౩



౪

౫

౧ ప్రాకారశిఖ సింహప్రతిమ (పటము ౪)

౨ బుద్ధపాదములు

• అండచిత్రము పూర్ణఘటము (పటము ౧౯)

౪. రామగ్రామస్తూపము (పటము ౩)

౫ వేదికావృత్తిచిత్రము ధర్మచక్రస్తంభము (పటము ౧౧)

లో నున్న లోహశిలాశాసనములు. ఈ భట్టిప్రోలుస్తూపశాసనముల ననుసరించి బ్రాహ్మీలిపి కృష్ణాజిల్లాయందు క్రీస్తుపూర్వము మూఁడవశతాబ్ది మధ్యకాలము నాఁటికే యుండినట్లు తెలియుచున్నది. భట్టిప్రోలుశాసనము లందలి ద, ధ, భ, చ, జ, మ, శ, ల వంటి వర్ణములు కొన్ని అశోకశాసనములందలివానితో భేదించునని బూలరుదొరగారు చూపి వానిని ద్రావిడీ వర్ణము లన్నారు. కాని యమరావతియందలి ప్రాచీన బ్రాహ్మీశాసన వర్ణములును, దక్షిణాదిరకము అశోకశాసనవర్ణములును ఒక్కటే పోలిక నుండును. 'గ' వర్ణమునకు పైని కోణమును, చ, డ, ప వర్ణములును రూపమున అర్షము (Archaic)గా నున్నవి, అనఁగా అశోకశాసనములలోనివానిని పోలియున్నవి.

౨ పూర్వకాలపుశాసనములకు తరువాతికాలపు వానియందలి ముఖ్యలక్షణము లివి (౧) 'ద' వర్ణముయొక్క యూర్ధ్వభాగము మూలకను నిలిచియుండుట, (౨) తలకట్టు లన్ని వర్ణములయందును సమానముగ నుండుట, (3) ఇక్ష్వాకుల, కడపటి ఆంధ్రరాజులనాటి పల్లవమహీంద్రదేశశాసనములయందలి ముఖ్యలక్షణముగాఁ గానవచ్చు 'అ', 'క', 'ర', వర్ణములకు దిగువభాగమున నుండు వంకరకొంకులు లేకపోవుట, (౪) వక్రరేఖలతోడి 'ఇ' వర్ణము. ఈ లక్షణములను బట్టి యివి క్రీస్తుపూర్వము మొదటిశతాబ్దికో, క్రీస్తుశకము మొదటి శతాబ్దికో అయియుండు నని నిర్ణయింపవచ్చును. వర్ణములయూర్ధ్వ భాగాంతమునందలి చిన్న యడ్డుగీటువల్ల నీరకము నానాఘాటు ఆంధ్రశాసనలిపియందు భేదించుచున్నది.

3 బూలరుదొరగారు లిపినిబట్టి, పశ్చిమదక్కనము, కొంకణములందలి గుహాశాసనములతో సరివచ్చిన వని తరగతివారీవిభజనము చేసి చూపిన అమరావతీ శాసనములలో చాలభాగము క్రీస్తుశకము రెండవశతాబ్దినాటివి.

౪ ఇక్ష్వాకువంశపురాజయిన శ్రీవీరపురుషదత్తునినాటి జగ్గయ్యపేట శాసనములందు కానవచ్చు లిపిని బోలి మిక్కిలి సొగసులు దేఱియుండులిపితో నున్న శాసనములు కొన్ని కలవు. బూలరుదొరగారివి క్రీస్తుశకము మూఁడవశతాబ్దినాటి వగు నని యూహించినారు.

ఈయమరావతీశాసనములందు వాడినభాష ప్రాకృతము. దీని కిని, వ్యాకరణశాస్త్రజ్ఞుల పైశాచీప్రాకృతమునకును దగ్గఱ సంబంధము కలదు. ఇందు 'గ'కు బదులుగ 'క'యును (ఉదా. నకర), 'జ'కు బదులుగ 'చ'యును (ఉదా: పచదితస), 'ద'కు బదులుగ 'త'యును (ఉదా. తేతి), 'ణ'కు బదులుగ 'న'యును (ఉదా. ఉపాస, ఉపాసిన, నమనస, తిని) ప్రయుక్తము లయినవి. కాశ్మీర దేశగాథ ననుసరించి పైశాచీప్రాకృతమున బృహత్కథ రచియించిన గుణాఢ్యుఁ డాంధ్రరాజాస్థానము నలంకరించిన విద్వాంసుఁడు. ఈ గాథనుబట్టి ఆంధ్రభృత్యరాజులక్రింద నాంధ్రరాజ్యమున పైశాచీ ప్రాకృతభాషకు కృషి జరుగుచుండినట్లు నిశ్చయించుట కవకాశము కలదు.

ఈశాసనములు చరిత్రాత్మకములయిన, అనఁగా రాజవంశములకు సంబంధించిన విషయముల నేమియుఁ దెలుపవు. ఆంధ్రరాజులలో వాసిష్ఠీపుత్ర శ్రీపులుమాయి, శివశ్రీశాతకర్ణుల శాసనములు మాత్రమే కలవు. అందు వాసిష్ఠీపుత్రునిదే యొక్కటి. ఈకారణమున నాగార్జునాచార్యుల మిత్రుఁడయిన శాతవాహనుఁడును ఆంధ్రరాజు వాసిష్ఠీపుత్రుఁడే యగునని కొంద ఱూహించుచున్నారు. నాగార్జునాచార్యులవారు బౌద్ధమున కొసంగినసూతనరూపము ప్రోత్సాహము నొందగాఁ గొని యాంధ్రులు మహానిర్మాణములను పెంపుసొంపులు నమర్చియున్నారు. ఆంధ్రులకుఁ బిదప నీశాసనములు ప్రాయికముగ 'పాకోటక' జాతినామమును, 'నాగాటక' మనవ్యక్తినామమును వెల్లడించుచున్నవి. రిగాపెంటుశ్శిత్తుదొరగారి మతముప్రకారము నాగాటక వంశము క్రీస్తుశకము 800 ల ప్రాంతమున రాజ్యమునకు వచ్చినది. ఈశాసనములందు వచ్చు నాగాటకపేరము సరియయిన దయినచో క్రీస్తునకు పూర్వము ౧౫౦ సంవత్సరములనాఁడే దక్కనమందు నాగాటకు లుండినట్లు గుర్తింపవచ్చును.

**అమరావతీకళ** :—అమరావతీస్తూపశిల్పచిత్రములను విడి విడిగాను, వాని నొండొంటితోను, ఇతరబౌద్ధ నిర్మాణములందలి శిల్ప చిత్రములతోను పోల్చి పరిశీలించి చూచినయెడల అమరావతీస్తూప నిర్మాణ మొక్కకాలమునఁ గాక నాలుగుతడవలలో జరిగినట్లును, అమ రావతీస్తూపశాసనలిపిపరిణామమున నొక్కరకము గాక నాలుగు రకము లుండినట్లును తెలియవచ్చునట్లు, అనఁగా నిర్మాణమునందును, లిపియందునుగూడ వికాసము కనఁబడునట్లే శిల్పచిత్రములతీరునందుఁ గూడ వేఱువేఱురకము లయినరీతులు కన్పట్టును. క్రీస్తునకు పూర్వము మూఁడునందల సంవత్సరములనుండి క్రీస్తుశకము మూఁడవ శతాబ్దివఱకును స్తూపమున వేఱువేఱు నిర్మాణములు జరుగుచుండినట్లే, స్తూపశాసనలిపికూడ పరిణామమును బొందుచుండినట్లే చిత్రశిల్పరీతులుకూడ అకాలమునకే పరిణామమును జెంది పరిణతములైనవి.

మొట్టమొదటికాలపు శిల్పచిత్రములు తరువాతికాలపుచిత్రము లంత వ్యాపకయరంజకముగ చిత్రింపఁబడలేదు. అంతియకాక మొదటి కాలపు శిల్పచిత్రములందు కథావస్తువిన్యాసముకూడ నతిసంగ్రహ ముగఁ జూపఁబడినది. ఇట్లు సంగ్రహముగుటవలన వివరములను చాల వఱకు వదలివేయుటయేకాక, కథావస్తుతత్త్వమునను శిల్పులు సమయ బద్ధమైన సంకేతపద్ధతి నుపయోగించినారు. ఇట్లు సంకేతముల నేర్ప ఱచుటవలన చిత్రితమయిన కథావస్తు వాకాలమునాఁటివారికి సుబోధ మగుచుండవచ్చినను, ఏయేవిషయముల కేయే సంకేతములో తెలియక యిప్పటివారికి యాచిత్రరంగములు దురవగాహము లయినవి. ఈకారణ మున కళావిమర్శకులు కొంద ఱట్టికళ ప్రశస్తమయినది కాదనియును, అకాలమున కళాకౌశలము లేదనియు స్థూలముగ తెగడియున్నారు; కాని యాకళ నట్లు తెగడుటకు వీలు లేదు, ఏలయన, కథావస్తు విన్యాసము పెద్దదిగాఁగాక సంకుచితము చేసినను అకాలపుశిల్పి తాను

తనకళాకౌశలమును జూపుట కవకాశమున్నచోటుల నెల్లఁ దననేర్పును విపులముగఁ జూపియే యున్నాఁడు. ఈ సంకేతపద్ధతిని ముఖ్యముగ బుద్ధజీవితగాథలను చిత్రించుటకు నుపయోగించియున్నాఁడు. కావున సంకేతపద్ధతి యేదియో విచారింతము. ఈ సందర్భమునకే చాల ప్రాధాన్యాకర్షకమును, వివాదగ్రస్తమును అయిన బుద్ధవిగ్రహావిష్కార మీవిషయమున నంతర్గర్భిత మయియుండుటవలన దానినిగూర్చి కూడ ఆలోచింతము.

బుద్ధజీవితమునందలి యన్ని గాథలలోను పంచకల్యాణములు ముఖ్యములయినవి. వీనిని శిల్పమునఁ జిత్రింపవలెను. ఆకాలము నాఁటికి బుద్ధుఁడు మహాపరినిర్వాణమును బొందెను. బౌద్ధమతానుసారము మహాపరినిర్వాణ మనఁగా విజ్ఞానస్థితి యని కాని, కేవలము శూన్యస్థితి యని కాని చెప్పవలెను. అనఁగా బుద్ధుఁడు నామరూపాతీత మయినస్థితిని పొందినవాఁడు. అట్టివానికి నామరూపములు కల్పించి, శిల్పచిత్రములందు చూపుట అసాధ్యమే కాక పాపకార్య మని కూడ వారు భావించుటచేత అకాలపుశిల్పులకు బుద్ధజీవితగాథలను చెక్కుటలో సంకేతములు చేర్పుటకే వలసి వచ్చినది. అయిన నీగాథలను అసలు చూపవలసినంత యవసర మేమి కలిగిన దని కొందఱనుకొనవచ్చును. క్రొత్తగా బౌద్ధమతమును స్వీకరించిన పామరులకు బుద్ధుఁడు బోధించినతత్త్వము సరిగా గ్రహింపరానందున బుద్ధజీవితమునందలి గొప్పవిషయములు బోధపడుటకు బొమ్మల రూపమున చిత్రించి చూపుటకును, తత్కారణమున బుద్ధునియెడఁ భక్తి విశేషించునట్లు చేయుటకును మహోత్సుఁడయిన యట్టిబుద్ధుని జీవితమునందలి ముఖ్యగాథలను చెక్కినారు. ఇట్లు చెక్కుటలో సంకేతపద్ధతి యావశ్యకమయినది. ముఖ్యముగ నీసంకేతములు పంచకల్యాణముల విషయమున ప్రయుక్తములయినవి. బుద్ధజననమునకు పొత్తిళ్లలో బుద్ధపాదములుగాని, పద్మమునుగాని చెక్కెదరు. మహాభినిష్క్రమణ, మనఁగా సర్వభోగపరిత్యాగమును జీవనగోపురమును వట్టిగుఱ్ఱమును చిత్రించుటవలనను (సిద్ధార్థుఁ డర్ధరాత్రమున తండ్రిని, భార్యాపుత్త్రులను, రాజభోగములను విడిచి కంటక మనుగుఱ్ఱము నెక్కి కపిలవస్తునగరమునుండి వెడలిపోయినట్లు మనకు బుద్ధచరితమునుబట్టి తెలియును), మారధర్షణపూర్వకమయిన సమ్యక్సంబోధిని బోధివృక్షమును, దానిక్రింద నొక యాసనమును దీర్చి, యాసనముమీఁదనో, క్రిందనో బుద్ధపాదములను చెక్కుటవలనను, బుద్ధుని ధర్మబోధను ధర్మచక్రమును, దానిక్రింద నొక యాసనమును చిత్రించుటవలనను — బుద్ధుని మొదటిధర్మబోధను తెలుపవలసివచ్చినపుడు ధర్మచక్రమును, దానిక్రింద నొకయాసనమును రచియించి, యాసనము నిరుపార్శ్వములందును మృగములను జూపుదురు —, మహాపరినిర్వాణమును స్తూపమువలనను దెలుపుదురు.

**అమరావతీకళ దేశీయము** — బుద్ధవిగ్రహమును మలచుట భారతీయశిల్పికి తెలియ దనియు, దానిని మలచుట వాఁడు గ్రీకులవలననుండియో, రోమనులవలన నుండియో నేర్చుకొనె ననియు కొందఱు విశ్వసింతురు కాని యిది మృషోక్తి యని అమరావతీశిల్పచిత్రములను పరిశీలించినచో తెలియఁగలదు. ఎట్లన, ఆశిల్పి సామాన్యమానవవిగ్రహములను, బౌద్ధేతరు లయిన బోధిసత్త్వుల విగ్రహములను మానవరూపమునను మలిచియుండుటవలన ఆతనికి మానవరూపమును జిత్రించుట తెలియ దని యనుకొనుట కవకాశము లేదు. ఆతఁడు మానవప్రతిమలను చెక్కుట రోమనులవల్లఁ గాని, గ్రీకులవల్లఁ గాని నేర్చుకొనవలసిన యవసరము లేదు. మానవరూపమును జిత్రించుటలోఁ గాక సంకేతపద్ధతిని దైర్ఘ్యముతోను, సాహసముతోను వదలిపెట్టునట్లు చేయుటలో గ్రీకులు తోడ్పడి రని మనకొందఱు వాదింతురు కాని యాసిద్ధాంతము నంగీకరించుటయుఁ గష్టమే, ఏల యన, అర్వాచీన శిల్పచిత్రములలో బౌద్ధవిగ్రహ మున్నచోటుల దానిప్రక్కనే దానితోపాటు సంకేతపద్ధతిని బుద్ధునిఁ జూపుటయు మనము గాంచఁగలము.

శిల్పమున బుద్ధవిగ్రహావిష్కరణమునకు మనము గ్రీకులదాఁక పోనవసరము లేదు. దీనికి మూలము మనము స్థానికవిషయపరిణామములందే కాంచవచ్చును. కాలక్రమమున బౌద్ధమపర్యవేక్షులో మొదట నామరూపరహితమూర్తిగ నెన్నఁబడిన బుద్ధుఁడు కరుణామూర్తిగ మార్పుచెందెను. ఈమార్పు బౌద్ధమతచారిత్రమున నిది వఱలోఁ దెలుపఁబడిన మహాయాన, మహాసుఖవాదములరూపముయిన పరిణామము. ఈమార్పు వచ్చినయనంతరము బౌద్ధాంధ్రశిల్పి బుద్ధునికి చక్కనిమానవరూపము నిచ్చి, యాతని ముఖమునై భక్తియుండును, అభయహస్తమునందును కరుణామూర్తి యని పరిణామమును చెందిన యాతని ముఖ్యస్వరూప మయినకరుణను చక్కఁగా వ్యక్తీకరించెను. శిల్పమున బుద్ధవిగ్రహావిష్కరణమునందు బౌద్ధమతతత్త్వపరిణామము మూలకముగా గ్రహింపఁగలము. భారతీయచిత్రశిల్పమున బుద్ధవిగ్రహ మేర్పడుటకు యిదే కారణము కాని, గ్రీకులయొక్కగాని, రోమనులయొక్కగాని తోడ్పాటు కా దని తెలియఁగలదు.

బౌద్ధాంధ్రశిల్పి తాను మలచుటకు ప్రత్యేకకళావస్తువున్నంత కాలము తనసొంతదారినే త్రొక్కెను కాని గ్రీకుకళాప్రభావమునకు మాత్రము వశుఁడు కాలేదు. గ్రీకులయుత్తమశిల్పరచనల నతఁడు చూచియుండవచ్చును కాని యాతఁడు వాని ననుసరించియుండ లేదు. అమరావతీచిత్రశిల్పములందుఁ గానవచ్చు బుద్ధవిగ్రహశిల్పమునకే కాక మఱి యేయితర మానవవిగ్రహరచనమునందునుగూడ గ్రీకు విగ్రహశిల్పముఖ్యలక్షణ మయిన స్నాయువిస్ఫుటత్వము గాంచ లేము. ఇది యొక్కటియే అమరావతీమానవవిగ్రహశిల్పము దేశీయమే కాని గ్రీకుకళానుసరణము కాని, గ్రీకుకళాప్రభావజన్యము కాని కా దని చెప్పుటకుఁ జాలును. స్త్రీప్రతిమాశిల్పమున గ్రీకుకళకును, అమరావతీకళకును గల వ్యత్యాసము మఱింత స్పష్టముగఁ గనఁబడఁగలదు. స్త్రీప్రతిమారచనమునందు అమరావతీశిల్పికి సాధారణముగ త్రిభంగములను జూపుట వాడుక. గ్రీకుశిల్పి కీపద్ధతి కేవలము విదేశీయము. కాని దుస్తులు, గిన్నెలు మొదలయిన కొన్ని పాత్రములు, అంకుశములు మొదలయినవాని రచనములందు గ్రీకుశిల్పసామాన్య మయిన లక్షణములు కొన్ని అమరావతీశిల్పచిత్రములందుఁ గానవచ్చును.

## అమరావతీ స్తూపము



అమరావతీ శిల్పములందలి యంత్రవాద్యములు నృత్యము

## అమరావతీ స్తూపము



అమరావతీశిల్పములనుండి వస్త్రధారణ పద్ధతులు

# అమరావతీస్తూపము



అమరావతీ స్తూపము నాగినులు (నాగకన్యలు)

అమరావతీకళయందు గ్రీకుకళాప్రభావము లేదని, అది గ్రీకుకళానుసరణము కాదని తెలుపఁబడినదికదా, ఇది రెండు కలిగి నన్న దీని నిట్లు సమర్థింపవచ్చును. బౌద్ధాంధ్రశిల్పి యుత్తమగ్రీకుశిల్ప పరికల్పనములను గాంచియుండవచ్చు నని యిదివఱకే తెలుపఁబడినది. ఈ కారణమున వాఁడు దాకళయందలి మనోహరములయిన యుత్తమశృంగార పరికల్పనములను చేపట్టి భారతీయకళావస్తువుల కనురూపమయినరీతి సింగారములకుఁ బ్రయోగించి తన నేర్పును, బుద్ధికౌశల్యమును జూపినాఁడు. ముఖ్యముగ బుద్ధునిచేలము, మిథునప్రతిమలు, సింహములు — వీనియందు గ్రీకుకళాప్రభావము స్పష్టముగ కనఁబడును. గిన్నెలను గ్రీకులు వాడుకొను గిన్నెలరూపమునను, గొల్లబోయలకఱ్ఱలను గ్రీకు దండముల విధమునను రచియించుటయందును, హిందూదేశమునకు సజాతములయిన సింహములను చిత్రించుటయందును గ్రీకుకళాప్రభావము పొడకట్టఁగలదు.

బుద్ధవస్త్రధారణమున నుత్తరీయమును యజ్ఞోపవీతధారణ పద్ధతిని వల్లెవాటుచేసికొని కుడిభుజమును నవాచ్ఛాదితముగ నుంచుట దేశీయ పద్ధతి. ఇందుకు భిన్నమయిన గ్రీకుపద్ధతియందు బుద్ధుఁడు తన యుత్తరీయము నురమును, భుజములను పూర్తిగ నాచ్ఛాదించునట్లు కప్పుకొనును. స్త్రీపురుషుల జంటలలో (మిథునప్రతిమలు) స్త్రీలును, పురుషులును వస్త్రములు ధరించుట గ్రీకుపద్ధతి, కాని దేశీయకళా పద్ధతి నీజంటలు కొంచెమించుమించుగ విగతవస్త్రులుగనే యుండును. కటిప్రదేశమునకు పైని స్త్రీ, పురుషుల మధ్యములను నగ్నులుగనే చూపుట దేశీయకళయందలి సామాన్యాచారము. కటిప్రదేశమునకు దిగువ పురుషులకు వసనధారణము చూపఁబడుట కలదు. కాని స్త్రీలను కేవలము నగ్నలుగఁ జూపుటయే వాడుక. కాని కొన్ని కొన్ని రచనలందు మానసంరక్షణమునకు కొన్నికొన్నిసందర్భములందు శృంగార రూపమయిన యాచ్ఛాదన ముండిన నుండవచ్చును. దేశీయకళయందలి యీవిషయము నగ్నతనుగూర్చి యించుక చర్చింతము

నగ్నస్త్రీచిత్రములు — అమరావతియందలివియు, దానిచుట్టుప్రక్కల దగ్గఱగ నున్న స్థలములయందలివియు నగు స్తూపముల మీఁది ప్రతిమాశిల్పమున స్త్రీలు కొన్నికొన్ని సందర్భములలో వస్త్రవిహీనలుగాఁ జూపఁబడుటచేత కళావిమర్శకులు కొందఱు అకాలపు స్త్రీలకు వస్త్రధారణ ముండెడిదికాదని సిద్ధాంతము చేసినారు, కాని యీవిషయము స్త్రీలకటిప్రదేశమునకు పైనుండు వక్షోభాగమునుగూర్చి చెప్పినప్పుడు సత్యముకావచ్చును కాని స్త్రీలకు అసలు వస్త్రధారణమే లేదని చెప్పుటమాత్రము సత్యదూరమే యగును. ఏలయన, అమరావతియందును, ఇతరసమీపస్థలములందును గల స్తూపములమీఁది శిల్పచిత్రములను పరిశీలించినచో వస్త్రవిహీనలయిన స్త్రీలతోపాటు వస్త్రధారులయిన స్త్రీచిత్రములును కానవచ్చుచున్న కారణమున నట్టిసిద్ధాంతమును చేయుట కవకాశము కనిపింపదు. స్త్రీప్రతిమారంగములు కొండొంటిలోను, ఒక్కొక్కరంగమునఁ జెక్కిన ప్రతిమలకే కొండొంటిలోను పోల్చి చూచినయెడల తన కళాకౌశలమును జూపుట కవకాశమును, స్వేచ్ఛయుఁ జిక్కిన సందర్భములయందు మాత్రమే యాంధ్రశిల్పి నగ్నస్త్రీప్రతిమలను చిత్రించె నని బోధపడఁగలదు

సంపూర్ణసౌందర్యపిపాసు వగుటచేత శిల్పికిఁ దనకళయందుఁ జూపరానిది కాని, అనుచితమైనది కాని యేదియు లేదు. ఈ కారణమున కళయందు నగ్నతామతము (Nude in art) అను కళావాదము కలుగు దీనిని ప్రబలముగఁ జేపట్టినవారు గ్రీకులు. కావుననే గ్రీకుశిల్పులకళా రచనములయందు నిట్టినగ్నత విశేషముగఁ గానుపించును. కాని గ్రీకు శిల్పి నగ్నపురుషచిత్రములను రచియించుటలోఁ జూపఁగలిగినంత నేర్పు నగ్నస్త్రీప్రతిమారచనముఁ జూపఁజాలఁడయ్యెను. బౌద్ధాంధ్రశిల్పి గ్రీకుశిల్పి కెదురొడ్డి నిలిచి యీతఁడు కృతార్థుఁడు కాని విషయమునఁ దాను తననేర్పును చూపఁదలపెట్టి నగ్నస్త్రీశరీరావయవవిన్యాస సౌందర్యరచనమున అతనిని ద్రోసిరాజని విజయి యయ్యెను. స్థానిక చిత్రరచనములయం దొక్కొక్క స్త్రీచిత్రములయందుమాత్రమే నగ్నత చూపఁబడుట కిదియే కారణము. గ్రీకుశిల్పి తనకౌశలమును జూపుట యం దెక్కడ నిలిచిపోయెనో యచ్చటనుండి యాంధ్ర శిల్పి తనప్రజ్ఞను జూపుటకుఁ దలపెట్టెను. ఇదియే బౌద్ధాంధ్రశిల్పి విశిష్టలక్షణము. ఆంధ్రశిల్పి గ్రీకుశిల్పికంటె భావోన్నతి కలవాఁ డని తెలుపుట కీయొక్క విషయమే చాలును. ఈ కారణమువలనే గ్రీకు శిల్పులు పురుషావయవ విన్యాససౌందర్యప్రదర్శనమున గొప్పనేర్పును చూపినవారు కాఁగా, భారతీయశిల్పి స్త్రీశరీరావయవవిన్యాససౌందర్య ప్రదర్శనమున తనకళావిదగ్ధతను జూపి ప్రశస్తి వహించెను. తనకళాకౌశలమును జూపుటయే యిట్టి నగ్నస్త్రీప్రతిమారచనమునందలి ప్రయోజనము. అగుటచేత బౌద్ధశిల్పి పవిత్రములయిన బుద్ధజీవితగాథలనుకాని, జాతక కథలనుగాని చెక్కునప్పుడు నగ్నత చూపియుండలేదు. పాప మని, అపవిత్రమని, బౌద్ధభిక్షుబృందమునకు హృదయావేదనకర మని మత విషయకగాథాచిత్రరచనమున శిల్పి నగ్నతజోలికి పోయినవాఁడు కాఁడు. దీని కిదే కారణము కానిచో మారధర్షణసందర్భము లందు మారకన్యలు నగ్నలుగ వచ్చినట్లు బౌద్ధగ్రంథములందుఁ దెలుపఁబడినను శిల్పి వారిని నగ్నలుగ నేల రచియింపలేదు? మతవిషయకము లయిన గాథలయం దవి పవిత్రములయిన వని శీలభంగము చేయరాని వని శిల్పి ఆట్టివిషయములందు నగ్నత యావశ్యకమయినను ప్రదర్శించియుండ లేదు. సౌందర్యప్రయోజనము నిమిత్తమును, శృంగారసౌభాగ్యము నిమిత్తమును అవకాశమును, స్వేచ్ఛయును లభించిన సందర్భములందు మాత్రమే, అనఁగా స్త్రీపురుషులజంటలు మొదలయిన చిత్రరచనము లందే యిట్టినగ్నతను జూపుచువచ్చెను. ఇట్టి నగ్నప్రతిమలు కేవల మిట్టిశృంగారసౌభాగ్యమునకు మాత్రమే యన్న విషయము సింగారించుకొనుచుండినట్లు చిత్రింపఁబడిన యక్షీప్రతిమలను గాంచిన స్పష్టమగును. బౌద్ధజీవితగాథలను కాని, జాతకకథలనుగాని రచియించినప్పు డట్టిరంగములందు నగ్నతను జూపక ప్రక్కనే శృంగారముకొఱకు చిన్నగడి కల్పించుకొని యందు మిథునచిత్రములను జెక్కి నగ్నతఁ

వ్యాపియుండుటచేత శిల్పికి నగ్నతయెడఁగల యభిమానము వెల్లడి కాఁగలదు బుద్ధజీవితగాథా, జాతకచిత్రరంగములయందే అవకాశము చిక్కినచో, స్థలము దొరకినచో నతఁడు కథావస్తువునకు సంబంధింపని సామాన్యస్త్రీరచనములందును నగ్నతఁ గనఁబఱుచుట కలదు ఇందు వల్ల నతఁడు మతగాథాపవిత్రతకు భంగము రాకుండ జాగ్రత్తపడుచు తన నగ్నతకవకాశము కల్పించుకొనుచుండెనని భావింపవచ్చును విలాసినీరంగములందే యొక్కొక్కప్పుడు కేవలము నగ్నలుగనే కాక స్త్రీలమానము నీవచ్ఛాదనముతోఁ జూపుటకూడ నుండుటచేత స్త్రీ లాకాలమున నగ్నలుగ నుండిరేకాని అట్టినగ్నప్రతిమలన చెక్కుటయే యాకాలపు శిల్పులయాచార మనికాని వచించుటకు వీలులేదు శిల్పి నగ్నతను జూపదలఁచినప్పుడు స్త్రీని వసనము పూర్తిగ ధరించిన ట్లయినను, మోఁకాలివఱకు ధరించిన ట్లయినను, కుడకు కటిబంధమున కంటియుండి సువ్యక్తముగ గప్పు నీవచ్ఛాదనముతో నైనను రచియించువాఁడు ఇందువలన, శిల్పియుద్దేశము స్త్రీమానసంరక్షణమున కున, నగ్నతాభావమునకు నీవచ్ఛాదన మయినను జాలు నని చెప్పఁగలము ఈయాచ్ఛాదన మయినను వస్త్రరూపమున నేయుండ నక్కఱలేదు ఇప్పుడు బాలికలు ధరించు 'అంగళ్ల' రూపమున నుండవచ్చును కొన్నికొన్ని యమరావతీశిల్పచిత్రములం దిట్టివిళ్లలనే చూడవచ్చును శిల్పి నగ్నాభావమునకు ఈవిళ్లను దిగువకు ప్రేలాడఁ జేసియు, నగ్నత వాటిళ్లపై త్తియుఁ జూపి యాతఁడు తృప్తి నొందఁగలఁడు

సంగీతవాద్యములు — లలితకళలలో నొకటియైన సంగీతమునకుఁగూడ అమరావతీశిల్పమున ప్రాధాన్య మియ్యఁబడినట్లు శిల్పచిత్రములనుబట్టి తెలియవచ్చుచున్నది శిల్పికి చిత్రరచనమున నెట్టి ప్రాధాన్యము కలదో యట్లే యాకాలపువారికి నృత్త, గానవిద్యలయందును అంతటి విశేషాకాశాభిమానములు కలవని చిత్రశిల్పములనుబట్టి విశద మగుచున్నది.

నాట్యచిత్రరచనములను బరిశీలించినచో స్త్రీలే నాట్యశాస్త్రవిధిని అమరావతీశిల్పి యంగీకరించినట్లు కనఁబడదు, ఏల యన, నాట్యాభినయములు చేయుచున్నట్లు రచియింపఁబడిన పురుషచిత్రముల నెన్నిటిలో అమరావతీశిల్పమునఁ గాంచఁగలము ఒక్క స్త్రీపురుషులే కాక, నాట్యాభినయానర్హ లయిన కుబ్జయుక్త గణములుగూడ లయకట్టి చక్కనినృత్తభంగిమలతో వాస్తవతయుట్టిపడునట్లు నాట్యము చేయుచుండినట్లు శిల్పి రచియించినాఁడు నాట్యాభినయానర్హలుకూడ నృత్యముచేయుచుండినట్లు శిల్పి చిత్రించుటకుఁగలకారణము మనము గ్రహింపఁగలిగినచో నతనిభావోన్నతి మనకు బోధపడఁగలదు; అది యే దన, మానవునియంతరసంవర్తకరణమే నాట్యము తదానందము లోకమున నందఱకును సామాన్య మగుటవలన తద్విహీర్లక్షణము లయిన నాట్యాభినయములుకూడ నందఱకును సామాన్యమే ఈకారణమున నతని కిచ్చ యున్నచో, నవకాశము దొరకినచో నెంతటివారలుగూడ నాట్యము చేయుచున్నట్లు చూపియుండెడివాఁడేమో! బౌద్ధమతమున నెట్లు సర్వసత్త్వములకును బుద్ధత్వప్రాప్తి లభ్యమో అట్లే నాట్యాభినయములును సర్వసత్త్వలభ్యములే, బుద్ధత్వప్రాప్తియందు కష్ట ముండిన నుండవచ్చునేమోకాని యందెంతమాత్రము కష్టము లేదని యాభ్రాంతికే శిల్పి సామాన్య లయిన కుబ్జాదిగణములు కూడ లయబద్ధము లైన శరీరభంగిమలతో నాట్యాభినయములు చేయుచుండినట్లు రచియించినాఁడు

అభినయమును బురస్కరించుకొని యుండు జంత్ర, గాత్ర సంగీతము కూడ చిత్రశిల్పమునఁ బ్రదర్శిత మయినది గాత్రపాట శిల్పమునఁ జూపుట యసాధ్య మగుటచేత తాళము వేయుచుండినట్లు చూపఁబడిన చిత్రరచనములవలన నది యూహాసాధ్యము కావింపఁబడినది ఇఁక జంత్రవాద్యము వేణువు, ఒకవిధమయినవీణ (Harp) మొదలయినయుపకరణములవలనఁ దెలుపఁబడినది ఇప్పుడు మనదేశమున నరుదుగను, పాశ్చాత్త్యదేశములందు సామాన్యముగను గానఁబడు నిట్టివీణ (Harp) అమరావతీశిల్పచిత్రములయం దతిసామాన్యముగఁ గనిపించుట విశేషము కొన్నికొన్నిసందర్భములందు తంతులను వేళ్లతోనే మీటియు, మఱికొన్నిట నొకవిధమయిన సాధనముతో మీటియు వీణ వాయించెడు ఈవిధ మగుపద్ధతి నేఁడు మనము గోటువాద్యమునందుఁ గాంచగలము

వేణువేణురకము లయినజంత్రసాధనములచే కొందఱు సంగీతమొదను వర్తించుచుండ నితరులు కొందఱు మృదంగములు మొదలయిన సాధనములతో తాళము వేసి మేళము చేయుచుండినట్లు చెక్కినశిల్పచిత్రము లమరావతియం దనేకములు కలవు ఈనాఁడు మనకుఁ దెలిసినసంగీతసాధనము లన్నియు నానాఁడుకూడ వాడుకలో నుండినట్లు అమరావతీశిల్పచిత్రములవలన విశద మగుచున్నది శంఖము, ఒకవిధమయినవీణ (Harp), వేణువు, సితార మొదలయిన జంత్రవాద్యముల నమరావతీచిత్రశిల్పమున గుర్తింపఁగలము తాళము వేయుటలో నెక్కుసాధనములు గలవు కరతాళము, తాళపుచిప్పలు, మృదంగము, తబలా, ఢక్కి, ఖంజర, తప్పెటలు, చిరతలు- ఇంత యేల తాళమునకు నేఁ డుపయుక్తములగున వన్నియు శిల్పచిత్రములందుఁ జూడఁగలము.

క్షాత్రజీవనము — అమరావతీ చిత్రశిల్పమునఁ జూపఁబడిన యుద్ధచిత్రములనుబట్టి యప్పటి సైన్యము రథ, గజ, తురగ, పదాతిసమేత మని తెలియవచ్చుచున్నది రథముల నెక్కి యుద్ధము చేయురథికులును, గజతురగముల నెక్కి పోరునట్టి యాశ్వికులును నెక్కియుండువారు యుద్ధమున నుపయోగింపఁబడుచుండిన రథములు ద్విచక్రయుతములే యని యుద్ధచిత్రములను బరిశీలించినఁ దెలియఁగలదు ఇట్టిరథములను సాధారణముగ రెండుగుఱ్ఱములను గట్టువారు. ఈరథములందు రథచోదకునికిని, రథికునకును సరిపడిన స్థలమాత్ర ముండును ఉత్తరహిందూదేశమున నిప్పుడు వాడుకయందున్న 'టోంగా' యను శకటము ప్రాయికముగ నీమాదిరిరథమున నుండి నది

జాతకము చెందినవిరో శాతవ్రము రచియించె చెప్పఁదుంత ధారుమున్నది. ప్రాచీనకాలమున రచితరామాయణము ధారుమున్నది. అన్నవిషయ మీ చిత్ర శిల్పములవలనే కాక పురాణాదిగ్రంథములవలనను, అర్వాచీన వాస్తు యములవలనను తెలియవచ్చుచున్నది. ఈ శిల్పచిత్రములందు రథములు చెప్పఁబడు నిలుచుండినరీతి శుద్ధము చేయుచున్నట్లు చూపట్టును.

అశ్వద్వయయుతము యొక్క ప్రాచీన్యోక్తరథములు కేవలమేయుద్ధ వ్యాపారమునందే కాక, కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భములందును వాడుకయందుండినట్లు తెలియుచున్నది. రాజ పట్టాభిషిక్తుఁడై యూరేగునప్పుడును, దేవదర్శనార్థము కాని, మహోత్సవ సందర్శనార్థము కాని వెడలునప్పుడును, భక్తిగౌరవ ప్రపత్తులు చూపవలసిన యిట్టి యితరసందర్భములయందును ఇట్టిరథములే వాడుకయందుండెడివి. సామాన్యవ్యవహారములయందు రథములను బాహుట వాడుక కాదు అనివిషయము వెస్సంతరజాతకకథాచిత్రరంగములను పరిశీలించిన విస్పష్టము కాఁగలదు. ఈజాతకకథయందు యువరాజా వెస్సంతరుఁడు రాజ్యబహిష్కృతుఁడై దారపుత్రాదులతో నరణ్యములకేఁగు నప్పుడు, అశ్వవాహకమయిన రథమునెక్కి వెళ్ళినట్లు బౌద్ధగ్రంథము లయం దున్నను అమరావతీశిల్పి యీకాలమునందలి విధి ననుసరించి రథమునకు పూర్వోక్తమయిన విశేషప్రయోజనమును బాహుటచేత యువరాజయినను వెస్సంతరుఁడు సామాన్యమయిన యెద్దులబండి నెక్కియే వెళ్ళినట్లు చిత్రించినాఁడు. వెస్సంతరజాతక కథావిషయమున చిత్రశిల్పమునందుఁ గనఁబడునట్టియూర్ప్ర కేవల మొక్కయమరావతియందే కాక, దాని కెనుబోరుగుల ననఁగా, నాగార్జునకొండ, గోలి మొదలగు స్థలములయందు కొంచె మించుమించుగ నాకాలమునందే వర్ధిల్లిన బౌద్ధచిత్రశిల్పమునందును జూపట్టును.

యుద్ధచిత్రములుగల యమరావతీచిత్రశిలాఫలకము లతిశిథిలము లయియుండుటవలన శస్త్రశిక్షాదిత మయిన సేన, భూషా, శిరస్త్రాణాదులనుగూర్చి విశేషముగఁ దెలిసికొనుటకు వీలు లేకయున్నది. కాని శస్త్రవ్యాపారమున నుపయోగింపఁబడుచుండిన యాయుధము లను చిత్రములను జూచి గుర్తింపవచ్చును. ధనుస్సు, బాణము, ఖడ్గము, డాలు — (ఇందు సామాన్యముగఁ గావఁబడు కడుచిన్నరకము డాలును, మనుష్యునంతటి యెత్తుగల పెద్దరకము డాలును గూడఁ గలవు)—, చక్రము, చిన్న యీఁటె, బల్లెము — ఇవి యాకాలమున వాడుకయందుండిన ముఖ్యమయిన యాయుధములు. ఒంటెలుకూడ యుద్ధరంగమున వాడుకయం దుండినట్లు అమరావతీచిత్రశిల్పమువలన తెలియుచున్నది.

**కట్టడములు :—** అమరావతీచిత్రశిల్పమును పరిశీలించిన యెడల నందు సామాన్యము లయిన పూరిగుడిసెలు మొదలు రాజ ప్రాసాదములవఱకును గానవచ్చును. మట్టితోఁ గట్టిన గుడిసెలమీఁద నిర్మితములైన వెదురు అర్ధచంద్రాకారమైన కప్పులు కప్పువారు. ఇట్టి పూరిగుడిసెలలో చుట్టుగుడిసెలు, చతురస్రములుగఁ దీర్చిన గుడిసెలును గూడ గలవు. రెండవరకము గుడిసెలు లోపలికి గాలి వచ్చుట కేర్పాటుచేసిన వాతాయనములతోఁ గూడి శిల్పమునఁ గానవచ్చును. పేదవారు గుడిసెలయందే కాఁపురము చేయువారు. ఇట్టి పూరిగుడిసెలతోఁ గూడిన చిన్న పల్లెలయందు చుట్టును ప్రాకారపుఁగోడ యుండెడిది. ఈగోడ ప్రాయికముగ గ్రామస్థులు సామూహికముగ మీఁదఁ గట్టిన దడులచేఁ గాని సాధారణముగ నిటుకలతో నిర్మింపఁబడుచుండెడిది.

గుడిసెలకుఁ బిదప, కాఁపురముండువారిస్థితికిఁ దగినట్లు సాధారణ గృహములు మొదలు అంతస్తులుగల మేడలును, మిద్దెలును, రాజ భవనములును గూడ నుండెడివి. ముంగుభాగమున మిద్దెలుగల మేడలు కొన్ని, రెండంతస్తులవి, మూఁడంతస్తులవి కొన్ని శిల్పమునఁ జూపఁ గలవు. వీథిలో జరుగువిషయములను చూచుటకు వీలగునట్లు ముందు వైపునఁ గొన్ని మేడలకు వసారా లుండెడివి. మేడలకు గుఱ్ఱపునాడ ముల యాకృతిని (Horse shoe) వాతాయనము లుండెడివి, పెద్ద యిండ్లకు నింటికప్పుకొనభాగములను అట్టి యాకృతిని దీర్చుట గలదు. ఉద్యానవనముల నంటి చలువపందిరము లుండెడివి. ఉద్యాన వనములందు జనులు కూర్చుండుటకు నేఁటి పాశ్చాత్యోద్యానవనములందు వలెనే శిలాఫలకములతోఁ గాని, దారువుతోఁ గాని నిర్మించిన పీఠము లుండెను. వీనిలోఁ గొన్నిటికి జనులు కూర్చుండునప్పుడు వీపుకు ఆనుకొనుటకు కమ్ములుకూడ నుండెడివి.

కొన్ని కొన్ని యావరణపుగోడలు దారుమయనిర్మాణములను స్థాప కమునకుఁ దెచ్చుచు స్తూపప్రాకారములవలె నున్నవి. గ్రామప్రాకార ద్వారములును, విలాసద్వారములును (Gate-ways) తోరణసంశోభితములు. ఇట్టితోరణము లొకటికాని, రెండుకాని, మూఁడుకాని యుండెడివి. దుర్గముల చుట్టును, నగరములచుట్టును గొప్పప్రాకారము లను దీర్చువారు. వీనిని గడచి లోపలఁ బ్రవేశించుటకు పెద్దద్వారము లుండెను. ఏతద్దుర్గ, నగరద్వారపక్షములు మిక్కిలి యెత్తయినవి. వీనియగ్రభాగములు చైత్యవాతాయనాకృతిని పొంది, రక్షకాగారము లయి తనర్చుచుండెను. ద్వారకుడ్యముల లోపలివైపుభాగములందు ద్వారమునకుఁ బైని తోరణములవలె నుత్తరవాసము (Palisades) లమర్చువారు. వీనిపార్శ్వభాగములనుగూడ రక్షకాగారములవలెనే చైత్యవాతాయనాకృతిని దీర్చుట వాడుక.

బౌద్ధప్రార్థనాలయము లయిన చైత్యాగారములును, స్తూపములును గాక గంధకుటు లని, పుణ్యశాల లని పేరొందిన దేవాలయములు కొన్ని యుండెడివి. వీనియందు చిన్నస్తూపముగాని, బుద్ధపాదములుగాని పెట్టి పూజించువారు. వీని సమచతురస్రాకృతిని, చతురస్రాకృతిని, వృత్తాకృతిని నిర్మించుచుండిరి. వృత్తాకృతిగల యిట్టినిర్మాణము చుట్టు నధిష్ఠానకుడ్యములు, దానిమీఁద స్తంభములు నుండి, పైని ఛత్రాకృతి గల వితానముతో కప్పుండెను. ఈవితానమునుపార్శ్వములందు స్తూపప్రాకారపరికల్పనలను, చైత్యవాతాయనపరికల్పనలను క్రింతా

# అమరావతీస్తూపము



అమరావతీశిల్పములనుండి ఉష్ణీష వేణీబంధాలంకారములు

# అమరావతీస్తూపము



అమరావతీశిల్పములనుండి కేశబంధాలంకారములు

ఇంకను పై అర్జునదేవ, రుద్రదేవ, సూర్యదాస, శేషరామకృష్ణ, పెదకోమటివేమభూపాలాదిరచితము శైవవ్యాఖ్యానంబులు పెక్కులు కలవు వీనిలో పెదకోమటివేమభూపాలుఁడు కొండవీటిలో క్రీ శ ౧౪౦౦-౧౪౩౪ వఱకును రాజ్యము చేసినరెడ్డిరాజు

ఈ కావ్యమును కాశ్యపాక వెంకటేశ్వరదీక్షితులకుమారుఁడైన తిరువెంగళప్ప తెనిఁగించియున్నాఁడు [1] ఈభాషాంతరమందలి పద్యములు రసవంతములుగ నున్నవి ప్రతిపద్యమునకును పూర్వము వ్యాఖ్యానోక్తభావములో వచనరూపమైన యవతారిక గలదు గీనికి సీస పద్యములతో చేయఁబడిన మఱియొక భాషాంతరము గానవచ్చుచున్నది. కాని, అది యంత సరసముగ లేదు గ్రంథకర్త యెవఁడో తెలియదు [2] దీనికి తెనుఁగున ప్రతిపదార్థము వ్రాసి వేమభూపాలుని వ్యాఖ్యానముతో నిడవలు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు ప్రకటించియున్నారు

**అమరేశ్వరుఁడు** — ఒకయాంధ్రకవి ఇతనికావ్య మిద్దియు నిప్పుడు కానరాకున్నను ఒకప్పుడీతఁడు గొప్పయాంధ్రకవిగాఁ బరిగణింపఁబడుచున్నట్లితని నితరకవులు స్తుతించుటచే దెలియుచున్నది ఇతనిని మొట్టమొదట స్తుతించినవాఁడు ఛందస్సును రచించిన అనంతామాత్యుఁడు తనచే రచింపఁబడిన 'భోజరాజీయము'నందుఁ బూర్వకవులను స్తుతించుచు 'శే, రన్నిక కెక్కి నట్టియమరేశ్వరుఁ నలఁతు' నని చెప్పెను అనంతామాత్యుఁడు పదునైదవశతాబ్దిమధ్యమునందు (క్రీ శ ౧౪౩౫) నుండినవాఁడు (చూడుఁడు, అనంతామాత్యుఁడు) కావున నమరేశ్వరుఁడు ౧౩ లేక ౧౪-వ శతాబ్దిగాఁడై యుండవలెను 'శ్రీరామాభిరామము' అను గ్రంథమునందు వల్లభరాయకవి 'చిమ్మపూఁడి యమరాధిపుఁ డన్నమ సత్కవీశ్వరుల్' అని చెప్పి యీతనిని గొప్పకవులలోఁ జేర్చెను వల్లభరాయనికాలము క్రీ శ ౧౪౩౦ అని యందురు [3] ౧౬ వ శతాబ్ది యంతమువాఁడైన బట్టుమూర్తి 'నరసభూపాలీయము'నందు నితనిని 'శ్రీనాథునిపదప్రౌఢి భారతికుద్ధి, యమరేశ్వరునిమహాప్రయుక్తివృష్టి' యని మహాకవులతో సాటిగఁ బొగడియున్నాఁడు ఇట్లేని పూర్వకాలమునందు నన్నయ, తిక్కన, శ్రీనాథాదులతో సమానముగ స్తుతింపఁబడుచుండెను పదునాఱవశతాబ్దియంతమువఱకు నితనిచే రచింపఁబడిన 'విక్రమసేనము' అను కావ్యము వాడుకలో నుండినట్లు స్పష్టమగుచున్నది పదునాఱవశతాబ్దివాఁడగు జగన్నాథకవి యనునాతఁడు వేఱువేఱుకవులవర్ణనములను సంగ్రహించి ప్రబంధరత్నాకర మన్నకావ్యము నొకదానిని సమకూర్చెను [4] అందు నమరేశ్వరుని 'విక్రమసేనము' లో నుండి ౫౦ పద్యములకంటె నెక్కుడు పద్యము లుదాహరింపఁబడినవి ౧౮-వ శతాబ్దిమధ్యమునం దుండిన కూచిమంచి తిమ్మకవిరచితసర్వలక్షణసారసంగ్రహమునం దమరేశ్వరుని విక్రమసేనమునుండి రెండుపద్యము లిచ్చియున్నాఁడు అతఁడీగ్రంథమును స్వయముగఁ జూచియే వ్రాసెనో లేక యితరగ్రంథములందుండి గ్రహించెనో ? ఎట్లయిన నేమి యీ మహాకవియొక్క విక్రమసేనకావ్యము ౧౮-వ శతాబ్దినుండి తెలుఁగుదేశమున లోపించినది ప్రబంధరత్నాకరములో నిందుండి ౫౦ ౬౦ పద్యము లీయఁబడినను అన్నియు వర్ణనములు గనుక, గ్రంథవిషయము గుఱించి కాని, యందలి నాయికా నాయకులను గుఱించి కాని యేమియుఁ దెలిసికొనుటకు వీలు లేదు

అమర్షణుఁడు — (మా సం) శ్రీరామచంద్రుని పుత్త్రుఁడైన కుశునిసంతతివాఁడైన నఘునివంశమునందుఁ బుట్టినసంధి యమరాజుయొక్క కుమారుఁడు ఇతనిపుత్త్రునిపేరు మహాస్వంతుఁడు

అమరుకుఁడు — శుక్రాచార్యునియొక్క యిద్దఱు పుత్త్రులలో రెండవవాఁడు

అమల — వైవస్వతమన్వంతరమందలి అత్రిఋషియొక్క కన్య ఈమె మిక్కిలి బ్రహ్మనిష్ఠ గలది

అమలపాడు — గంజాంజిల్లా తెక్కలి తాలూకా యందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౩,౧౫౪ (౧౯౩౧)

అమలానందుఁడు — ౧ అనుభవానందుని శిష్యుఁడు ఇతఁడు 'శాస్త్రదర్పణము' (బ్రహ్మసూత్రములపై భాష్యము) అను గ్రంథమును రచించెను అమలానందుఁడు ౧౩ వ శతాబ్దివాఁడు కృష్ణయాదవుని యాస్థానమున నుండెను

౨ క్రీ శ ౧౨౪౭-౬ సంవత్సరమున దేవగిరిని పాలించిన కృష్ణభూపాలుని సమకాలికుఁడు శంకరాచార్యులవారు వ్రాసిన వేదాంతసూత్రభాష్యమునకు భామతి యనుటీక గలదు దీనిని రచించినవారు వాచస్పతిమిశ్రులు ఈభామతి మరల వ్యాఖ్యానరూపముగ నమలానందుఁడు వేదాంతకల్పతరువను గ్రంథమును లిఖించెను ఈయన గొప్పవేదాంతి

**అమలాపురము** — ౧ (గ్రామము) అమలాపురము తాలూకాకు ముఖ్యస్థలము జనసంఖ్య ౧౫,౧౬౩ (౧౯౩౧).

1 Triennial Catalogue of Manuscripts in the Oriental Manuscript Library, Madras 1910-11 to 1912-13

2 Ibid, R No 17 లైబ్రరీలోని నెంబరు ఆ ౪౧౪

3 బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు శ్రీరామాభిరామమును ప్రకటించి యందలిపీఠికలో 'ఈ గ్రంథము క్రీ. ౧౪౩౦ లోఁగా రచితమైనది' అని వ్రాసినారు కాని యీకవికాల మింకను నిశ్చయముగఁ దెలిసికొనవలసియున్నది

4 ఈ గ్రంథముయొక్క ప్రతి తంజావూరుపుస్తకభాండాగారమునం దున్నది

అందు మగవాండ్రు ౪,౫౯౧; ఆడువాండ్రు ౪,౫౯౨, హిందువులు ౧౮,౨౦౮ మహమ్మదీయులు ౬౫౧, క్రైస్తవులు ౨౪౪. ఇక్కడ నుండు అధికారులు.— తహసీల్దారు, స్టేషను సబ్ మాజిస్ట్రేటు, డిస్ట్రిక్టు మునసబు, సబ్ రిజిస్ట్రారు ఇచ్చట ఒక పోలీసుస్టేషను, రాదారి బంగళా, స్వదేశాలకై పోవువారి విశ్రాంతిగృహము, లోకల్ ఫండు ఆసుపత్రి, హైస్కూలు కలవు ఇది రాజమహేంద్రవరమునకు ఆగ్నేయదిక్కున ౩౫ మైళ్లదూరమున ముఖ్యమయిన కాలువమీఁద నున్నది

౨ (తాలూకా). తూర్పుగోదావరి జిల్లాలోని ఒక తాలూకా దీనివిస్తీర్ణము ౩౬౪ చదరపుమైళ్లు. ఇందు మొత్తముమీఁద ౧౦౪ గ్రామములు కలవు వానిలో ౯౬ గవర్నమెంటు గ్రామములు, ౨౪ జమీందారీ గ్రామములు, ౬ ఈనాం గ్రామములు ఈతాలూకా ఒక త్రిభుజమువలె నుండును. గోదావరీశాఖలైన వశిష్ఠ, వైనతేయము, గౌతమి యను నదులకును, సముద్రమునకును నడుమ నున్నది ఇందు నగరములంకయుఁ గలదు ఇది యంతయు గోదావరీనదియొక్క మధ్యడెల్టాలోనిభాగము ఈ తాలూకాలోని విశేషభూములు పంటకు మిక్కిలి అనుకూలమై వచ్చునట్టి ఒండుభూములు ఇందలి జనసంఖ్య ౨,౫౯,౦౫౯ (౧౯౩౧) వీరిలో ౧,౨౬,౦౧౯ మంది పురుషులు, ౧,౩౩,౦౪౦ మంది స్త్రీలు గోదావరిజిల్లాలో అన్ని తాలూకాలకంటె నిందు ఎక్కువ జనసమ్మర్దము కలదని చెప్పవచ్చును. ఇందలిజనులలో ౩,౦౦౩గురు మహమ్మదీయులు, ౯౮౩ మంది క్రైస్తవులు, మిగిలినవారందఱును హిందువులు

ఇందలి పల్లపుభూము లన్నియు కాలువ పాఱుదలవలన ఫలించును. అయినను అచ్చటచ్చట బావులక్రిందను వ్యవసాయము చేయు నాచారము కలదు. పురాతనకాలమునుండియు ఈ తాలూకాలో పెద్దపెద్దబావులక్రింద తోఁటలు పెంచదగినవి పండించు నాచారము కలదు కొన్ని పురాతనములైన బావులను జైనులబావు లని, రెడ్ల బావు లని అచ్చటి జనులు వాడుదురు. పూర్వకాల మిచ్చట జైనులు నివసించి రని చెప్పెదరు అచ్చటి జనులు ఈదేశము పాంచాలదేశ మనియు, అమలాపురము దానికి రాజధానిగ నుండె ననియు చెప్పుదురు కాని భారతమునందు వర్ణింపఁబడిన పాంచాలదేశ మిది గా దనుట నిశ్చయము ఈ తాలూకాలో వ్యవసాయమే ముఖ్యవృత్తి ఇదివఱకు దేవాంగులు బట్టలను నేసి యితర దేశములకుఁ బంపుచుండెడి. కాని కొండమూడిలంక రేవుయొక్క ప్రముఖత తగ్గినప్పటినుండియు ఈ వ్యాపారము నశించినది. కొండమూడి లంకలో ౧౭౫౧-వ సంవత్సరమున ఈస్టు ఇండియా కంపెనీవారు వర్తకము నిమిత్తము ఒకగిడ్డంగి (Factory) కట్టిరి ఫ్రెంచి వారు దానిని ౧౭౫౭ లో తమ స్వాధీనము చేసికొనిరి. కొంతకాలము యుద్ధానంతరమున మరల నది కంపెనీవారి స్వాధీన మయ్యెను. పిమ్మట నవ్యనదియొక్క క్రమముగ నచ్చటి వర్త కము తగ్గిపోయెను ఈ తాలూకాలోని అంబాజీపేట అను గ్రామమునందు పశువులసంత జరుగుచుండును ఈ ప్రాంతమును ఆంధ్రులు సాధారణముగ కోనసీమ యందురు ఇందలి పేరూరు అను గ్రామమున మిక్కిలి పూర్వకాలమునందు ద్రావిడ బ్రాహ్మణులు కొందఱు వచ్చి నివసించిరి వారిని పేరూరుద్రావిడు లందురు పేరూరు, ఆత్రేయపురము అను గ్రామములలో జైనులకు సంబంధించిన జీర్ణ శిలాశాసనాదులు కలవు

౩ బళ్లారిజిల్లా కుడ్లిగితాలూకా యంపలి గ్రామము. జనసంఖ్య ౫౫౩

౪ విశాఖపట్టణము జిల్లా గొలుగొండ తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౩౩౨ (౧౯౩౧).

**అమలుఁడు** — దుష్టబుద్ధి యనుమంత్రియొక్క కనిష్ఠపుత్త్రుఁడు (చూడుఁడు, చంద్రహాసుఁడు).

**అమల్ నామా** — హిందువులలోని చిత్రగుప్తుఁడు లోకులవారింబోలె ముసల్మానుదేవతలలోఁ గొందఱు సంసారములోని సకలకార్యములజాబితాలను వ్రాయువారు గలరు ఈలాగున వీరు వ్రాయువృత్తాంతమునకే అమల్ నామా యని పేరు

**అమల్ నేర్** — ౧ (గ్రామము) బొంబాయిరాజధాని, తూర్పుఖాందేశ్ జిల్లాలోని అమల్ నేర్ తాలూకాకు ముఖ్యస్థలము జనసంఖ్య ౧౦,౨౯౮ ఇచ్చట ఒకమునిసిపాల్టీ కలదు ఇక్కడ ధాన్యవర్తకము అధికముగా నుండును ఇక్కడ రెండు ప్రత్తిఫ్యాక్టరీలు గలవు సఖారాంబావా యను ఒకమహాత్ముఁడు ౧౭-వ శతాబ్దిలో నిచ్చట నుండెను ఆతనిపేర నొకదేవాలయ మున్నది మే నెలలో ప్రతిసంవత్సరమును ఉత్సవము జరుగుచుండును ఇచ్చట నొక సబ్ జడ్జికోర్టును, ఒక ఆసుపత్రియు, రెండు బాలురపాఠశాలలును, ఒక బాలికాపాఠశాలయుఁ గలవు

౨ (తాలూకా) బొంబాయిరాజధాని, తూర్పుఖాందేశ్ జిల్లాలోని ఒకతాలూకా విస్తీర్ణము ౫౨౭ చదరపుమైళ్లు గ్రామములసంఖ్య ౨౨౭ జనసంఖ్య ౧,౧౧,౭౯౩ భూమిశిస్తు రు ౩,౪౦,౦౦౦ సెస్సులు రు ౨౩,౦౦౦ తపతీనదియు, దానియుపనదులగు బోరి, పాంఝ్రానగులును ఈతాలూకాలోనిభూములకు జల మిచ్చును ఇచ్చటిశీతోష్ణస్థితి ఆరోగ్యకరమైనది. వర్షపాతము సంవత్సరమునకు ౨౩ అంగుళములు.

**అమవసువు** — పురూరవునికొడుకు వీనికి విజయుఁ డని నామాంతరము కలదు.

**అమానిగంజ్ హాట్** — బంగాళరాజధాని యశోహర్ జిల్లాలోని ముఖ్యమైన పట్టువర్తకస్థలము ఇచ్చట విశేషజనులు కాపుర ముండరు గాని చుట్టుపట్టులనున్న ముర్షిదాబాదు, రాజషాహి

జిల్లాలలోనుండి వర్తకులు పట్టుపురుగులనిమిత్తము పట్టుదారములనిమిత్తము వచ్చుచుండెదరు ఎక్కువగా వర్తకము జరుగుదినములలో ఒకసంతదినమున లక్షరూపాయలవర్తకము గూడ జరుగును.

అమానిగుడిపాడు — కర్నూలుజిల్లా మార్కాపురంతాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨,౪౦౦ (౧౯౩౧)

అమానిచిరువెళ్ల — నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౨౧౧

అమానిజమ్మలమడక — గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాయందలి ఈనాం గ్రామము జనసంఖ్య ౧,౩౩౬ (౧౯౩౧)

అమారదాసు — సుప్రసిద్ధ యగు దుర్గావతిరాణి మామగారు ఇతనికండ్రి యుగ్గునదాసు సమువాడు అర్జునదాసువకు కొడుకునో సరిపడలేగు అమారదాసు తండ్రిని జంపి రాజ్యమాక్రమింపకొనవలయు నని ప్రయత్నము చేసి యోడిపోయెను తరువాత మరల నెట్లో తప్పించుకొని తనతండ్రిపక్షమునే చేరియున్నవరపింగదేవు నాశ్రయించి రాజ్యమును సంపాదించుకొనెను ౧౫౭౬-వ సంవత్సరములో అమారదాసు ఢిల్లీచక్రవర్తియగు బహదూరుషాకు యుద్ధమున సాయపడి 'సంగ్రామషా' యనుబిరుదమును బొందెను

అమారెడ్డిపాలెం — నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౪౯౩ (౧౯౩౧)

అమార్గసంధుండు — ఒక బ్రాహ్మి (చూడుడు, శృగువు)

అమాల్ — బొంబాయిరాజధానిలోని ఒకచిన్నసంస్థానము దీనివైశాల్యము ౨౦౦ చ మైళ్లు ఆదాయముమాత్రము రు ౩ వేలే జనసంఖ్య ఇంచుమించుగ ౫ వే లుండును ఇందలిప్రజలలో చాలమంది భిల్లులు

అమాల — బొంబాయిరాజధానియందలి ఒక మిక్కిలి చిన్నసంస్థానము

అమావసువు — పితృదేవతలలో నొకఁడు ఇతఁడు మంచి ఇంద్రియనిగ్రహము గలవాఁడు ఇతనినిజూచి యొక్కిండికథ కలదు — అచ్ఛోద యనునామె యొకపితృదేవతమానసపుత్రిక, అమావసువును వలచి యతనిని లోఁబఱచుకొనవలయు నని ప్రయత్నించెను కాని యాప్రయత్నము వ్యర్థ మయ్యెను అమావసు నామెను నిరాకరించివైచెను ఈసంగతి తక్కినపితృదేవతలు విని యతని ప్రవర్తనలకునకు మెచ్చి యచ్ఛోద నతఁడు నిరాకరించినదినము

తమకు ముదిన మని నిర్ణయించుకొని అమావసువు పేర నానాఁటికి అమావాస్య యని పేరిడిరి

పితృదేవతలు అచ్ఛోదను మర్త్యలోకమున జన్మింపుమని శపించిరి ఆకారణమున నామె మత్స్యగంధియై (సత్యవతి) యీలోకమునఁ బుట్టినది

**అమావాస్య** — ఈ శబ్దమునకు అమావస్య అనియు రూపాంతరము గలదు సూర్యచంద్రులకు పూర్వ, పశ్చిమాంతర మేమియు లేక వారిద్దఱును ఒక్కకోట నుండుకాలము ఇదియే కృష్ణపక్షమందలి ౧౫-వ తిథి ఈదినమున చంద్రుఁడు కానరాఁడు చంద్రునికళలు బహుళపాడ్యమినుండి తగ్గుచు తగ్గుచు అమావాస్యనాఁటికి పూర్తిగ లోపించును శుద్ధపాడ్యమినుండి హెచ్చుచు పూర్ణిమనాఁటికి పూర్తియగును ఈవిధముగ చంద్రకళలు హెచ్చుటకును తగ్గుటకును కారణములు విచారింతము చంద్రునకు స్వతస్సిద్ధమైన తేజస్సు లేదు భూమివలెనే అతఁడును సూర్యునితేజస్సుచలననే ప్రకాశించును చంద్రునియొక్క యేభాగమునందు సూర్యకిరణములు పడునో యది ప్రకాశవంతముగను, మిగిలినభాగము చీకటిగను ఉండును గోళాకారముగ నున్న చంద్రుని అర్ధభాగముమీఁద సూర్యుఁ డెప్పుడు ప్రకాశించు చుండును, చంద్రుఁడు భూమి చుట్టును, తన చుట్టును తిరుగుచుండుటచే ప్రకాశవంతమైన ఆతని భాగ మంతయు మనకు అన్ని సమయములందును కానరాగు మనకు కనఁబడుచుండుకలభాగమును అనుసరించి చంద్రబింబము మన కొకప్పుడు చిన్నదిగను ఒకప్పుడు పెద్దదిగను కనఁబడుచుండుటయు, నొకప్పుడు




చంద్రకళల ఆకృతులు

కనఁబడకుండుటయు తటస్థించును. ఈ పైపటముయొక్క సాహాయ్యమున చంద్రునికళల వృద్ధిక్షయములు తెలిసికొనవచ్చును

ఈ పటమునందు చంద్రునియొక్క ఎనిమిది రూపములు చూపఁబడినవి ఈ యెనిమిదియు నెలలోని ఎనిమిదితిథులను సూచించును ౧ అమావాస్య, ౫ పూర్ణిమ, ౨ శుద్ధతదియ, ౬ బహుళతదియ, ౩ శుద్ధ అష్టమి, ౭ బహుళాష్టమి, ౪ శుద్ధ ద్వాదశి, ౮ బహుళద్వాదశి

ఈ పటము అర్థమగుటకు నడుమ నున్న దని అను కొనుఁడు కత్తిరింపబడి నిర్దేశింపుట కడుపు రమున సూర్యుఁ డున్నాఁ డనుకొనుఁడు. ౧-వ స్థానమందు చంద్రుఁడు భూమికిని అనఁగా మనకును, సూర్యునకును నడుమ నున్నాఁడు కావున వెలుగురుగల చంద్రార్ధభాగము మనకు మఱుఁగై చీకటిగల యర్ధభాగమే భూమి వైపు తిరిగియుండును ఇట్లు మనకు చంద్రుఁడు కనఁబడఁడు ఇగి అమావాస్యదినము అక్కడినుండి చంద్రుఁడు బయలుదేఱి వెళ్లిన కొలఁదియు వెలుఁగురుగల చంద్రార్ధభాగములోని కొంచెముకొంచెము భాగము దినదినము మనకు కానవచ్చుచుండును

౨-వ స్థానమునందు ౪ దినము లైనతరువాత చంద్రుఁ డుండుట తటస్థించి బింబములో సాలుగవవంతు మనకు ప్రకాశవంతముగాఁ గానవచ్చును ఇదియే శుద్ధతదియ విదియ చవితి జరుగుచున్నకాలము. ౩-వ స్థానమునందు చంద్రునియొక్క వెలుఁగురు భాగములో మనకు సగము కనఁబడుటవలన చంద్రబింబము సరిగ సగము కనఁబడును ఇది శుద్ధసప్తమి గాని అష్టమి జరుగుచున్న కాలము ౪-వ స్థానమందు చంద్రబింబము రమారమి మూఁడువంతులు కానవచ్చును. ౫-వ స్థానమునకు చంద్రుఁడు వచ్చినప్పుడు భూమి చంద్రునకును సూర్యునకును నడుమ నున్నందున వెలుఁగురుగల చంద్రార్ధభాగ మంతయు మనకుఁ గానవచ్చును ఇదియే పూర్ణిమతిథి ౫-వ స్థానమునుండి చంద్రుఁడు ౧ వ స్థానమునకుఁ బోవుకాలము కృష్ణపక్షమనిపించుకొనును ఈ పక్షమునందు చంద్రునికళలు తగ్గుచు అమావాస్యనాఁటికి పూర్తిగ పోవు నని పటములో ౬,౭,౮,౧ అంక ములయొద్ద నున్న చంద్రబింబాకారములవల్ల సూచింపఁబడినది

అమావాస్యశాండిల్యాయనుఁడు — వంశ బ్రాహ్మణమునందు అంశుధనంజయుని గురువుగఁ జెప్పఁబడినవాఁడు

అమానీస్ (లేక అమాసిస్, క్రీ. పూ. ౫౭౦-౫౨౬)— ఈజిప్టుదేశపురాజు ఇతని ప్రభుత్వకాలమున ఈజిప్టుదేశము మిక్కిలి వైభవము ననుభవించినది. గ్రీసుదేశముతో వర్తకము ప్రారంభించెను గ్రీసుదేశప్రభువులను వివాహమాడెను పోలిక్, క్రీసస్, పైతగోరస్ అనువారిలో ఇతనికి స్నేహ ముండెనట.

అమిత — ఈపేరు మహాసత్త్వవంశములోనివాఁడగు శిలా కాఁడు చక్రవర్తి సుప్రబుద్ధుని (శాక్యసుప్రబుద్ధుని) ధర్మపత్ని. భద్రశాక్యాన, దేవదత్తు అని యీమె కిరువురు కుమారులు గలరు.

అమితగతి — పేరందిన యొకదిగంబర జైనపండి తుఁడు, పశ్చిమోత్తర మాళవదేశమును పాలించినముంజరాజుకాలమువాఁడు ఈరాజు క్రీ శ ౯౭౪-వ సంవత్సరమున రాజ్యమేలినట్లు నిదర్శనములు కలవు. మఱియు నమితగతిరచించిన 'సుభాషితరత్నసందోహము' 'ధర్మపరీక్ష' యను రెండుగ్రంథములును వరుసగ క్రీ శ ౯౯౪, ౧౦౧౪ సంవత్సరములలో రచించినట్లు తెలియుచున్నది ఈకారణము లనుబట్టి యీపండితుఁడు ౧౦-వశతాబ్ది కడపటిదినములలోను, ౧౧-వశతాబ్ది మొదటిదినములలోను ఉండినవాఁ డని మనము నిశ్చయించుకొనవచ్చును

ముంజరాజు ఇతనిని తనయాస్థానమున నుంచుకొని, మిగుల సన్మా నించెను ఆయాస్థానములోని పండితులలో నితనిదే యగ్రస్థాన మన వచ్చును

ఇతనితలిదండ్రులపూర్వికాని, సితమునుగూర్చికాని తెలిసి కొనుటకుఁ దగుసాధారము లేవియు లేవు జైనమతమునకుఁ జెందిన 'మాథుర'శాఖను ఇతఁ డాచార్యుఁ డయ్యెను అమితగతిరచించిన గ్రంథము లెన్ని యున్నవోకూడ తెలియదు ఇప్పటికి లభించినవి మూఁడు (౧) శ్రావకాచారము, (౨) సుభాషితరత్నసందోహము, (౩) ధర్మపరీక్ష

అమితాభుఁడు — పంచధ్యానిబుద్ధులలో నితఁడు నాలుగవవాఁడు. ఇతఁడు సుఖావతి యనుపేరుగల పశ్చిమస్వర్గమున కధిపతియై శాంతముగ ధ్యానముచేయుచు నివసించుచుండు నని బౌద్ధుల విశ్వాసము భద్రకల్ప మను పేరఁబరఁగు వర్తమానకల్పమున కితఁ డధి దైవము సృష్టిచేయుట కాని, యితరకార్యకరణము కాని యీతని



అమితాభుఁడు

పనులు కావు అది యీతనితోఁబోధిసత్త్వుఁ డగుపద్మపాణిపనులు ఇతని రెండుహస్తములును ధ్యానముద్రాంకితము లయి తొడమీఁద నుండును. ఇతఁడు రక్తవర్ణుఁడు, మయూరద్వయవాహనుఁడు ; పద్మ లాంఛనుఁడు, ఋ, రక్తవర్ణ, రసనేంద్రియాకారకుఁడు.

**అమిలి** — విశాఖపట్టణముజిల్లా జయపురంతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౭౧౩.

**అమిలేపల్లి** — చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౮౪౧.

**అమీ** — భక్రాపాగరమునకు ౧౧ మైళ్లదూరమం దున్న యొక గ్రామము. ఇక్కడ భవానీదేవాలయ మున్నది. సతియొక్క శరీరావశేషములు గల ఏఁబదిరెండు పీఠస్థానములలో నిదియు నొకటి.

**అమీన్** — స్థానేశ్వరమున కాగ్నేయముగ ౫ మైళ్ళ దూరమునఁగల ఒకమిట్టప్రదేశము. దీనియెత్తు ౨౫-౩౦ అడుగు లుండును. పొడుగు (ఉత్తర-దక్షిణములుగ) ౨,౦౦౦ అడుగులు. ఇచ్చటనే అదితి తప మొనర్చి సూర్యుని కుమారునిగఁ బడసెనట! అచ్చోటికి చక్రవ్యూహ మని పేరు. ఇదియే యభిమన్యుఁడు మరణించినతావు. ఈమిట్టపైని అమీన్ అనుపేరుగల గ్రామ మొకటి యున్నది. ఇందు అదితిదేవియాలయము, అదితికుండమును గలవు. పుత్రసంతానము గావలసినవా రీయదితిదేవి నర్చించి సూర్యకుండమున స్నానమాడి పోవుచుందురు.

**అమీనా** — మహమ్మదీయమతస్థాపకుఁ డైన మహమ్మదు యొక్కతల్లి, అబ్దుల్లాభార్య, వాహాబ్ కూమార్తె. అప్పటిస్త్రీలలో మిక్కిలి చక్కని దనియు, బుద్ధిశాలిని అనియు, సద్గుణవతి యనియు పేరొందెను. మహమ్మదు పుట్టిన ౬-వ యేఁట, అనఁగా క్రీ. శ. ౫౭౭-వ ప్రాంతమున మృతి నొందెను.

**అమీనుపల్లి** — అనంతపురంజిల్లా గుత్తితాలూకా యందలి యీనాం గ్రామము. జనసంఖ్య ౨౪౩.

**అమీనుపురం** — కృష్ణజిల్లా గుడివాడతాలూకా యందలి యీనాం గ్రామము. జనసంఖ్య ౧,౧౫౨ (౧౯౩౧).

**అమీనుబాదా** — ౧ గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩,౨౫౧ (౧౯౩౧).

౨ తూర్పుగోదావరిజిల్లా పిఠాపురం తాలూకాయందలి జమీందారీ గ్రామము. జనసంఖ్య ౧,౧౨౭ (౧౯౩౧).

౩ తూర్పు గోదావరి యేజెన్సీ జిల్లా చోడవరంతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧౨౨.

**అమీన్ అహమ్మద్** — ఇతనికి అమీన్ అహమ్మద్ రాజీ అందురు. ఈతఁడు అక్బరుచక్రవర్తికాలమునందు హఫ్త్ ఇక్లీమ్, అనఁగా సప్తప్రదేశములు అను చరిత్రాత్మకమైన కోశమును వ్రాసెను. సమశీతోష్ణ కటిబంధము (Temperate Zone) నేడు ప్రదేశములుగా విభజించి అం దొక్కొక్కదాని వివరణమును, అందలి ముఖ్యపట్టణమును ఇచ్చుటయే కాక, ఆయాస్థలములందుఁ బుట్టిన ప్రసిద్ధపురుషులయొక్కయు, ప్రసిద్ధకవులయొక్కయు చరిత్రమును వ్రాసియున్నాఁడు.

**అమీనగడము** — బొంబాయిరాజధాని, విజాపురు జిల్లా, హుంగుందుతాలూకాలోని ఒక గ్రామము. హుంగుందునకు తూర్పున ౪ మైళ్లమీఁద నుండును. జనసంఖ్య ౪,౪౩౮. ఇచ్చట పశువులసంత యొకటి గొప్పగ జరుగుచుండును. సముద్రమునీటినుండి వచ్చు కెంపాయల యొక్కయు, బియ్యము యొక్కయు వర్తకమున కిది ముఖ్యస్థల మైయున్నది.

**అమీన్‌భావి** — బొంబాయిరాజధానిలోని ధార్వాడ జిల్లాలో నొక గ్రామము. ధార్వాడకు ౪ మైళ్లదూరమున నున్నది. జనసంఖ్య ౩,౫౦౦. చాళుక్యులకాలమున నిది ఒక అష్టగ్రామమునకు (అష్టగ్రామ మనఁగా ఎనిమిదిగ్రామములతోఁ గూడిన ఒకఫిర్కా) ముఖ్యస్థానముగ నుండెడిది. ఈయూరిలో నాలుగైదు దేవాలయములు గలవు. గ్రామమున కుత్తరమున నేమినాథునిజైనదేవాలయ మున్నది. ఈయూరిలో ౬ శిలాశాసనములు దొరకినవి.

**అమీన్‌సాహెబుపెంథో** — గంజాంజిల్లా బరంపురంతాలూకాయందలి యీనాం గ్రామము. జనసంఖ్య ౨౪౧.

**అమీన్‌సాహెబుపేఁట** — విశాఖపట్టణము జిల్లా అనకాపల్లి తాలూకాయందలి జమీందారీ గ్రామము. జనసంఖ్య ౬౪౨.

**అమీరసింగుటప్పా** — (చూడుఁడు అమరసింహుఁడు.)

**అమీరుకల్యాణి** — (చూడుఁడు హమీరుకల్యాణి).

**అమీర్ ఇస్మైల్** — గజనీమహమ్మదు తమ్ముఁడు. తండ్రి యగు సబుక్తజీను మరణసమయమున మహమ్మదు దూరదేశమున నుండెను. ఈయదను చూచి అమీరు ఇస్మైల్ తన ప్రభుత్వము స్థాపింపవలయు నని అంచనాలకు చాల ధనము వ్యయపఱచెను. కాని యంతలో మహమ్మదు వచ్చి తమ్ము నోడించి రాజ్యము వశపఱుచుకొనెను. అమీర్ ఇస్మైల్ మరణించువఱకు కోటకోటలలో బందీగ నుంచఁబడెను.

**అమీర్ ఖాన్ (నవాబ్)** — ఢిల్లీ చక్రవర్తి యగు మహమద్ షాహ కాలమునాఁటి ఒక సరదారు. ౧౭౩౯ లో అలహాబాద్ ప్రాంతమునకు గవర్నరుగ నియమింపఁబడెను. ఇతఁడు చక్రవర్తితో మిక్కిలి చనవుగా భయము విడిచి మాటాడుచుండెను. ఇతనిని ఒక సేవకుఁడు చక్రవర్తిసమ్మతితో ౧౭౪౭ లో పొడిచి చంపెను. ఇతఁడు కవిత్వముకూడ చెప్పుచుండెను.

**అమీర్ ఖాన్** (పిండారీ) — ఇతఁడు ప్రస్తుతపు టోంక్ నవాబులకు మూలపురుషుఁడు ఇతఁడు మొదట యశవంత రావుహోల్కరువద్ద సేనాపతిగ నుండెను తరువాత ౧౮౦౬ లో అచ్చటినుండి వెళ్లిపోయి పిండారీలకు సర్దారై దేశము కొల్ల కొల్ల గొట్టెను ఇతఁడు హోల్కరురాణీగారియొద్దనుండి సంపాదించినరాజ్య మంతయూ నితని కిచ్చివేసి ౧౮౧౭ లో నితనితో ఇంగ్లీషువారు సంధి చేసికొనిరి ఇతఁడు తనయొద్దనున్న ఫిరంగు లన్నియూ నింగ్లీషువారి కిచ్చివేసి తనసైనికులను పిండారీదోపుడు మానిపించి పంపివేసెను.

**అమీర్ జుమ్లా** — ౧ ఇతఁడు ఔరంగజేబునకు ప్రియ మిత్రుఁడు ఔరంగజేబునకు ఢిల్లీసింహాసనము లభించునిమిత్త మితఁ డమితపరిశ్రమము సలిపెను షుజాను బంగాళమునుండి తఱుమఁ గొట్టుటకై యితఁడు ఔరంగజేబుకుమారునివెంటఁ బోయి యుద్ధానంతరము తానే యాదేశమునకు సుబేదారుగ నిలిచిపోయెను బంగాళమునకు గవర్నరుగ నుండినకాలములో అస్సామును గూడ జయింపవలయు నని ప్రబలసేనాపరివృతుఁడై బయలుదేఱెను పర్వతారణ్యమయ మగు అస్సామును జయించుట సులభసాధ్యము కాలేదు బహుళప్రయాసముతో అస్సాము రాజధానివఱకును బోయెను ఇంతలో వర్షము లారంభమగుటచే నటనుండి వెంటనే మరలవలసి వచ్చెను. ఈయవసరమున నితఁ డాదేశమందలి ప్రతిష్ఠితులగు పురుషులగోరీలను త్రవ్వించి వానియందుండి యమితమైన ద్రవ్యమును హరించెను. ఈలాగున దౌర్జన్యము లొనరింప నస్సాముజనులు నాలుగు ప్రక్కల ముట్టడించి బాధింపసాగిరి ఇతఁడును మస్సొదున్న వారల నెదిరించుచు నతికష్టముమీఁద ఖాన్‌బిహారప్రాంతమందలి ఖిజాపుర మును జేరి యచ్చట క్రీ శ ౧౬౬౨-౩ సంవత్సరమున మరణించెను

౨ క్రీ శ ౧౭౧౩ మొదలుకొని ౧౭౧౯ వఱకును ఢిల్లీని పాలించిన ఫరుక్‌సియ్యారుయొక్క ప్రియ మిత్రుఁడు. ఇంతకుఁబూర్వము జహాందర్‌షాహా చక్రవర్తిగను, జుల్ ఫకీర్‌ఖాను వజీరుగను నుండిరి రాజనిర్మాత లని ప్రసిద్ధి గాంచిన సయ్యద్‌సోదరులు జహాందర్‌షాహాను దొలఁగించి ఫరుక్‌సియ్యారును సింహాసన మెక్కించిరి అంత నీనూతనసార్వభౌమునిమనసులోఁ బూర్వపువజీరును దొలఁగించి తనమిత్రుని మంత్రిగఁ జేర్చుకొనవలె నను బుద్ధి పుట్టినది అందులకితఁడు తనస్నేహితునే జుల్‌ఫకీర్‌ఖానుకడకు రాయబారిగఁ బంప నితఁడును వారిని సమీపించి యభయవచన మిచ్చి వచ్చెను కాని సయ్యదుసోదరులు కాలహరణమునకు సహింపక త్వరితముగనే జుల్‌ఫకీరును గడతేర్చి యతనిజనకుని అసద్ ఖానుని కారాగారమునఁ ద్రోయించిరి పిదప ఫరుక్‌సియ్యార్ అమీరుజుమ్లాను మంత్రిగఁ జేసికొనవలయు నను ప్రయత్నములో తనప్రాణములనే కోలుపోయెను

**అమీర్ తలిక్** — మొఘలిస్థానచరిత్రమును వ్రాసిన మిర్జాహైదరుయొక్క పితామహుఁడు. వీరలు బాబరుసంబంధులు మొఘలిస్థానపాలకుఁడగు తుగ్లక్ తైమూర్‌ఖాన్ మహమ్మదీయ మతము నవలంబించి మఱునాఁడు తనయమీరుల నందఱ రావించి యిస్లాముమతమును స్వీకరింపుఁ డని యడుగుటకును, నందులకు సమ్మతింపనివారిని జంపుటకును నిశ్చయించుకొనెను అమీర్‌తలిక్ కూడ తైమూరుయొక్క సామంతప్రభువే ఇతఁ డింతకు మూఁడుసంవత్సరములకుఁ బూర్వమే మహమ్మదీయమతము నవలంబించియుండెను కాని తైమూరువలని భయముచే నాసంగతిని బయలుపఱచియుండలేదు మఱు నాఁడు తైమూరు సభలోని కేతెంచి యమీరుల నందఱను బిలి పించెను వారిలో తలిక్కునకే మొదటివంతు రాఁగా నితఁ డున్న సమాచారము నంతయు వెల్లడించెను. దానిని విని తైమూరు పరమా నందమున నతని నాలింగనము చేసికొనెనఁట!

**అమీర్ బరీద్** — ౧ ఇతఁడు బీదర్‌లో రాజ్య మేలిన బరీద్ షాహీవంశజులలో రెండవవాఁడు కాశింబరీద్ కుమా రుఁడు తండ్రిమరణానంతరమున ౧౫౦౪ లో రాజ్యమునకు వచ్చెను ఆకాలమునందు బహమనీరాజైన సుల్తాన్ మహమూద్‌షాహా అను వాఁడు ౧౫౧౮ లో మరణింపఁగా నతనిస్థలమున ౩-వ అలా ఉద్దీను అనువానిని సింహాసనాసీనునిగాఁ జేసెను వాఁడు కొలఁదిదినములలో, మృతినొందఁగా వలీ ఉల్లా అనువానిని పేరునకు రాజ్యముమీఁద నుండఁబెట్టెను వాఁడు అమీర్‌బరీద్ పెట్టుచుండిన బాధ పడలేక అహమద్‌నగరమునకు పాఱిపోయి అచ్చటనే మరణించెను వానితో బహమనీవంశము పూర్తిగ నశించెను అమీర్‌బరీద్ అహమదాబాద్ - బీదరు రాజ్యమును సర్వస్వతంత్రముగ ౨౫ సంవత్సరములు పరిపా లించెను ఇతనిరాజ్యములోనుండి కొంతభాగము బిజాపురరాజు తీసి కొనినంగున ౪, ౫, లక్షలు వచ్చు రాజ్యముమాత్ర మీతనికి నిలిచి యుండెను. ఇతఁడు ౧౫౪౨ లో దౌలతాబాదులో మృతినొందెను.

౨ బరీద్‌షాహీరాజులలో చివరి వాఁడు ౩-వ బరీద్‌షాహా అనువానిని ౧౬౦౯ లో రాజ్యభ్రష్టుని చేసి ఇతఁడు రాజ్యమునకు వచ్చెను

**అమీర్ హసన్** — తుర్కీసార్వభౌముఁడైన ద్వితీయ బయాజిద్‌యొక్క జలసేనానాయకుఁడు పోర్చుగీసులు హిందూస్థాన ములోఁ బ్రవేశించినప్పుడు వారి నెదిరించునిమిత్తము తురుష్క దేశపుసుల్తాను తనసేనానాయకుని బంపెను. ఇతఁడు వచ్చి గుజరాతు తీరమున దిగి యచ్చటనుండి మహమ్మద్‌షాహా, అమీర్‌బరీద్ సుల్తానులఁ గలసికొని దక్షిణముగ నేతెంచి చౌలరేవునకు దూరమం దున్న పోర్చుగీసులం దాఁకఁగా వార లమితనష్టముతోఁ బాఱిపోయిరి.

**అమీర్ హుసేన్** — ఇతఁడు తైమూరుయొక్క బావ మఱఁది వీ రిద్దఱును గలసి జక్సార్టీసునదికి నుత్తరముగ నుండిన

అమృతబిందూపనిషత్తు — ఇది అష్టోత్తర శతసంఖ్య గల ఉపనిషత్తులలో నొకటి. యజుర్వేదాంతర్గతము.

**అమృతము** — దేవతలకు మరణము లేకుండ చేయు పట్టిరసవిశేషము. పృథురాజు శిక్షింపవలెనని భయముచే భూమి గోరూపమును ధరించెను. అప్పు డింద్రుని దూడగా చేసి దేవతలు సువర్ణపాత్రిలో నాధేనువు స్తనములనుండి ధారలను పితుకగా, అమృతము వచ్చెను. కాని దుర్వాసమహర్షియొక్క శాపముచే నాయమృతము సముద్రముపాలయ్యెను. అంత దేవదానవులు సముద్రమథనము చేసి యాయమృతమును పదునాల్గురత్నములలో నొకరత్నముగా బడసిరి. సముద్రములోనుండి ధన్వంతరి యమృతకుంభమును దీసికొని పైకి రాగా నసురులు వానిదగ్గఱనుండి యాకుంభమును నపహరించిరి. ఇట్లమృతమును పోగొట్టుకొనిన దేవతలు విష్ణుమూర్తిని వేడగా నాతడు మోహినీవేషము ధరించి, అసురులను మోహితులగా చేసి మీ యిరువురకును సమృతమును సమానముగా బంచిపెట్టెదనని చెప్పి, వారియొద్దనుండి యమృతకలశమును దీసికొని యసురులకు నొకచుక్కయైనను లేకుండ, అమృతము నంతయును దేవతలకు బంచిపెట్టెను.

అమృతయోగము — తిథివారములతోగాని, వారనక్షత్రములతోగాని కూడుకొనిన ఆయాయోగములకు అమృతయోగము లనిపేరు. ఆదిసోమవారములతో పూర్ణ, మంగళవారముతో భద్ర, బుధశనివారములతో నంద, గురువారముతో జయ, శుక్రవారముతో రిక్త - ఈవారములలో నీతిథులు కలసినప్పుడు అమృతయోగ మేర్పడును. దీనికి తిథ్యమృతయోగ మని పేరు. ఆదివారముతో హస్త, సోమవారముతో శ్రవణము, మంగళవారముతో రేవతి, బుధవారముతో అనూరాధ, గురువారముతో పుష్యమి, శుక్రవారముతో రేవతి, శనివారముతో రోహిణి - ఈవారములతో నీనక్షత్రములు కలసినప్పుడు అమృతయోగ మేర్పడును. దీనికి నక్షత్రామృతయోగ మని పేరు.

అమృతరజుడు — ౧. (చం. వం) విజయపురిలో కృష్ణుడైన మహీశరాజుయొక్క మనుమరుపుత్రులలో నొక్కడు.

౨. ఒక బ్రహ్మర్షి, ఇతని ముఖ్య నామము గయుడు (మూడుడు, గయుడు)

**అమృతరాయకవి** — మహారాష్ట్రకవి ఇతడు దేశస్థబ్రాహ్మణుడు. ఇతడు శా. శ. ౧౬౨౦ లో జన్మించెను. ఇతడు మొదట పోస్టుగాడు. మధ్యమునీశ్వరు డనుభక్తుని నొకసారి దర్శించగా నతడు కోపపడక 'నీకు భగవంతుడ మమృతమువంటి వాణి నిచ్చియున్నాడు. కలిచంద్ర అమృతరాయ' డని పేరు పెట్టియున్నారు. నీవిట్టి విషయకలుషములైన మాటల నేల ఉచ్చరించెదవు' అని మందలించగా నితనికి పశ్చాత్తాపము కలిగి ఓడస పోస్టువృత్తిని విడిచి యక్కడనే కవిత్వము చెప్పుచుండెను. ఇతడు దామాజీపంతులచరిత్రము, శుకచరిత్రము, ధ్రువచరిత్రము, ద్రౌపదీవస్త్రాపహరణము, మార్కండేయమాహాత్మ్య, దుర్వాసమాహాత్మ్య మొదలైన పెక్కుకావ్యముల రచించియున్నాడు. ఇతని కవిత్వము యమకప్రయోగమైు మిక్కిలి సొంపుగా నుండును. ఇతడు హిందీభాషయందును కవిత్వము చెప్పినాడు. ఇతడు మిక్కిలి వైరాగ్యశీలుడు. మొదట కొంతకాలము గుమాస్తాపని చేసి పెద్దతనమున దానిని వదలి, హరికథలు చేయుచుండెను. బాలాజీబాజీరావు పేష్వాకాలమున నితనివారికి రత్నపేష్వాలమందిరమునందు జరిగెను. శా. శ. ౧౬౬౫ లో నితడు మృతి చెందెను.

**అమృతరావు** — క్రీ. శ. ౧౭౯౬-వ సంవత్సరములో పునహాసింహాసన మెక్కిన బాజీరావుయొక్క దత్తసోదరుడు, రఘునాథరావు దత్తపుత్రుడు. పేష్వాస్థానమున నితడును కొన్ని పరిశ్రమలోనరించెను. ఒకసమయమున మహాదాజీసింధియాపరివారమున నితడు తనగు మొదలగు వారితో విరోధమూనియున్న సిరిరావు ఘాట్గే యితనిని ముట్టడింప నెంచెనుగాని సఫలుడు గాలేదు. క్రీ. శ. ౧౮౦౨-వ సంవత్సరములో హోల్కరు బాజీరావు నోడించి పారదోలి తక్కాలమందు జున్నారులో నుండిన అమృతరావును విలిపించి పేష్వాస్థానమున నియోగించెను. ఆసమయమున నితడు పేష్వాస్థానమున దనకుమారుని వినాయకరావును గూర్చుండబెట్టి తాను పునహానగరమును కొల్లగొట్ట బోయెను. క్రీ. శ. ౧౮౦౩-వ సంవత్సరములో నింగ్లీషువా రమృతరావుని దనయాధీనములో నిలుపగా నితరువాత నితడు కొన్నియుద్ధములలో నాంగ్లేయులకు దోడ్పడుటవలన వార లితని కేనిమిదిలక్షలరూప్యములవృత్తి నేర్పాటు చేసిరి. ఇతడు వాద్రక్షేత్రమువలన గాశిలో గూరుచుండి సుఖజీవనమును జేయుచుండెను.

అమృతలహరి — హేదక - హెదవరాగము నలువది యారవ మేళకర్తయగు షడ్విధమార్గిణీరాగజన్యము. ఆరోహణము సరిగమపధస; అవరోహణము - సధపమగరిస యగుని సంచారము.

అమృతలింగంపేట — పశ్చిమగోదావరి జిల్లా ఏలూరుతాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౬౩౯.

అమృతలింగనగరం — గంజాంజిల్లా శ్రీకాకుళంతాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౬౩

అమృతలూరు — గుంటూరుజిల్లా తెనాలి తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౫,౦౮౮ (౧౯౩౧).

అమృతవర్షము — ప్లక్షద్వీపమునందలి యొకవర్షము.

అమృతవర్షిణి — కౌమార - కౌమారరాగము, అరువదారవ మేళకర్తయగు చిత్రాంబరిరాగజన్యము. ఆరోహణము - సగ

వచ్చుట ఇచ్చటనుండి పెషావరువరకు, దానికావలనున్న పరదేశములకు పట్టుబట్టలవర్తకము జరుగుచుండును. ఇచ్చట మైలకుత్తము, కత్తుల మొదలగు చెక్కడపుపనులు, దంతపుపని, ఇత్తడిసామానులు చేయుదురు.

ఇచ్చట ఖాల్సాకాలేజి, మిషనుకాలేజి యను రెండువిద్యాలయములు కలవు. ఇవికాక ఇతరపాఠశాల లనేకములు కలవు. వృత్తులు నేర్పుపాఠశాల యొకటియు, వర్తకసంబంధ మగునవిద్య నేర్పుపాఠశాల యొకటియుం గలవు.

అమృతసరము సైన్యనివాసస్థానము. ౧౯౧౯-వ సంవత్సరము, ఏప్రిల్ నెల ౧౩-వ తేదీని ఈపట్టణమున జలియన్‌వాలాబాగునందు జరగినభయంకరమారణమున రాజకీయముగ ఈనగరముపేరు హిందూదేశమునం దంతట మారుమ్రోగినది. వందలకొలఁదిజనము డయరుచేతఁ గాల్చి వధింపఁబడిరి. ఈవధలు హిందూదేశమునం దంతటను రాజకీయముగ గొప్పయాందోళనమును గలిగించినవి (చూడుఁడు జలియన్‌వాలాబాగు)

**అమృతస్వరూపిణి** — ఔడవ - ఔడవరాగము. డెబ్బదిరెండవ మేళకర్తయగు రసికప్రియరాగజన్యము. ఆరోహణము - స రి గ మ ప ధ స; అవరోహణము - స ధ ప మ గ రి స యని సంచారముకలదు.

**అమృతాంజనము** — అమృతపదము అర్థభావమందు "చావు లేమి" అనుభావమున కర్థవాచకము. ఇంగ్లీషునందలి (Ambrosia) అంబ్రోజియాపదమును, అమృతపదమును సమానార్థకములు. అంజనపదము సామాన్యముగను కంటికివాడెడిమందున కుపయోగపడుచున్నది. అంజనము సామాన్యదృష్టి కతీతమైన దృష్టిని గలుగఁజేసెడి సిద్ధక్రియ యను ప్రతీతి కలదు. కాని అంజనము మలామునకును (Balm) పర్యాయపదముగను వాడఁబడుచున్నది. పాశ్చాత్యవైద్యవిధాన మారంభమైనతరువాతను తైలములు, ఘృతములతోపాటు (Balm, Ointment) అంజనములును వాడుకకు వచ్చినవి. ఓరియంటలుబామ, (Oriental Balm) దానియనుకరణములును దేశమునం దంతటను వెలసినవి. అమృతాంజనము అమృతపదార్థమును, అంజనపదార్థమును కలసి తెలుపుటకు కల్పింపఁబడిన మందు. అమృతాంజన మనఁగా అమృతతుల్యమైన (అంజనము) 'బాము'. శ్రీయుత కా. నాగేశ్వరరావుగారు ౧౮౯౩ నందు కల్పించిన అమృతాంజనమునకు ఆంధ్రదేశమునందును, హిందూస్థానమునందును తలనొప్పిబాము, నొప్పులకు మందు అని రూఢ్యర్థ మేర్పడినది.

**అమృతానుభవము** — ఇది తెలుఁగు తెలియని రోమనుకాథలిక్‌పాదిరీగా రెవరో వ్రాసియుండవలె నని సి. పి. బ్రౌన్‌దొరగారు అభిప్రాయపడియున్నారు. క్రైస్తవులవేదగ్రంథమగు బైబిలునందలి సువార్తలలోని కొన్నిభాగములే ఈ గ్రంథముయొక్క విషయము. రోమనుకాథలిక్ మతములోని సన్యాసులు కొన్ని ఈ గ్రంథమునఁ జొప్పింపఁబడియున్నవి.

**అమృతాపురం** — బళ్ళారిజిల్లా ఆలూరు తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧౭౩.

**అమృతుఁడు** — ప్రియవ్రతపుత్త్రుఁడగు ఇధ్మజిహ్వునియొక్క యేడ్గురుపుత్త్రులలో నాలవవాఁడు. అమృతవర్షమున కధిపతి.

**అమృతులు** — గంజాంజిల్లా అస్కాతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౨,౧౦౧ (౧౯౩౧)

**అమృతేశ్వరుఁడు** — ద్వారసముద్రపుహొయసల రాజులలో నొకఁడగు వీరబల్లాళునిమంత్రి. ఇతఁడు సమస్తభట్టారనియోగాధిపతి, దండనాయకత్వాదిబిరుదములను గలిగియుండెను. ఇతనివిషయమును దెల్లడిచేయునట్టి శిల్లమునిశాసన మొకటి ధార్వాడజిల్లాలో వణ్ణికేరిదగ్గఱ నున్న యమృతేశ్వరదేవాలయములో నున్నది.

**అమృతౌఘ** — క్రౌంచద్వీపమునందలి నది.

**అమెజాను** — ఇది ప్రపంచమునందు మిక్కిలి పొడుగైన నది. ఇది దక్షిణ-అమెరికాలో మిక్కిలి ఉత్తరపుభాగమునందు పశ్చిమతీరమందలి ఆండీస్ పర్వతములలో బుట్టి తూర్పు వైపున అట్లాంటిక్ మహాసముద్రములోఁ గలయును. ఇది నాల్గువేలమైళ్లు పొడుగుగ నున్నది. దీని జలములవలన దక్షిణ-అమెరికాలోని దాదాపు సగముభాగము పోషింపఁబడును. ఈనదిలో సుమారు ౨,౩౦౦ మైళ్లు సముద్రములోనుండి స్టీమర్లు వచ్చి పోవుచుండును.

**అమెజానులు** — గ్రీకుదేశపుపురాణగాథలలో వర్ణింపఁబడిన స్త్రీసంఘము. వీరు మిక్కిలి బలముగలవారు. యుద్ధప్రియులు. యుద్ధము చేయునపుడు శస్త్రములకు అడ్డము రాకుండ వీరు తమ కుడిస్తనములను కోసివేసికొందురు. వీరిదేశములో పురుషులు లేరు. వీరు సంతానోత్పత్తికొఱకుమాత్రము తమదేశమునకు ప్రక్కదేశములనుండు పురుషులతో కొంచెముకాలము సహవాసము చేయుదురు. ఒకవేళ పురుషసంతానము గలిగినచో దానిని జంపుచుండిరి, లేక తమదేశమునుండి వెడలఁగొట్టుచుండిరి. గొప్పగొప్ప యుద్ధములలో వీరు విడిపటాలముగఁ జేరి పోరాడుచుండిరి.

**అమెన్హోటెప్** — ఈజిప్టుదేశముపై రాజ్యము చేసిన ఫెరావో (Pharao) అనఁబడు రాజులయొక్క ౧౮-వ వంశమందలి నలుగురు రాజులపేరు. (౧) ఇతఁడు క్రీ. పూ. రమారమి ౧౫౪౦ ప్రాంతమున పదిసంవత్సరములవఱకును రాజ్యము చేసెను. ఇతనిశవము ఘీజె (Ghizeh) వస్తుసంగ్రహాలయములో నున్నది. (౨) మూఁడవ థోథ్మెస్‌కుమారుఁడు, క్రీ. పూ. ౧౪౪౦ మొదలు ౨౫ సంవత్సరములు రాజ్యము చేసెను. (౩) నాల్గవథోథ్మెస్‌కుమా-

కుఁడు. ఈతఁడు క్రీ. పూ. ౧౪౧౦ మొదలు ౩౭ సంవత్సరములు రాజ్యము చేసెను. ఈతఁడు గొప్పగొప్పమందిరములను నిర్మించెను ఇతఁడు థియన్ అను దేవునకు పెక్కుదేవాలయములు కట్టించెను (౮) మూఁడవ అమెక్‌టెక్ టెక్షకుమారుఁడు క్రీ. పూ. ౧౩౪౫ మొదలు ౧౫ సంవత్సరములు రాజ్యము చేసెను ఈతనితల్లి విరేశ రాజకన్య, ఈతనిభార్యయును నట్టిదే. ఆమె హింసాదేశపుస్త్రీయై యుండునని కొందఱి యభిప్రాయము

**అమెరికా** — ఆసియాతరువాత ప్రపంచమందలి ఖండము లన్నింటికంటె నిది పెద్దది ౭౨-వ ఉత్తరాక్షాంశము మొదలుకొని ౫౬-వ దక్షిణాక్షాంశమువఱకును, ౩౫-వ పశ్చిమరేఖాంశము మొదలు కొని ౧౬౮-వ పశ్చిమరేఖాంశమువఱకును గల భూభాగ మీపేరఁ బరఁగుచున్నది పశ్చిమమున పసిఫిక్ మహాసాగరమును, ఉత్తరము నందు ఆర్కిటిక్ మహాసాగరమును, తూర్పున అట్లాంటిక్ మహాసాగరమును, దక్షిణమున అంటార్కిటిక్ మహాసాగరమును దీనికి సరిహద్దులుగ నున్నవి త్రిభుజాకారమున గొప్ప నీయుత్తరదక్షిణ-అమెరికాలను పనామానామక భూసంధి గలుపుచున్నది ఉత్తరమునందుండి దక్షిణాగ్రమువఱకు నీఖండముయొక్క పొడవు ౧౦,౦౦౦ మైళ్ళు ఎక్కువ వెడల్పు ఉత్తర-అమెరికాయందు తూర్పుపడమరలకు ౩,౮౦౦ మైళ్లు దీనిచుట్టుకొలత ౮౮,౦౦౦ మైళ్ళు ఈ ఖండమునకు సంబంధించిన ద్వీపములన్నిటితోఁ గలసినమొత్తము వైశాల్యము ౧,౬౦,౦౦,౦౦౦ల చదరపుమైళ్ళు అందు ఉత్తర-అమెరికా వైశాల్యము ౯౩,౦౦,౦౦౦ల చదరపుమైళ్ళు దక్షిణమున కేఁగినకొలఁది ఈఖండము సన్నగిలుచుఁ బోయి తుదకు అగ్రముక్రింద నంత మగును పశ్చిమోత్తరకోణమున నీఖండమునకును ఆసియాకును మధ్య ౫౦ మైళ్ళసముద్రము మాత్రమే కలదు పూర్వోత్తరమున గ్రీన్‌లాండునుండి యూరోపునందలి ఐస్‌లాండునకును ౩౬౦ మైళ్ళ దూరము కాని అత్యంతదక్షిణమున పూర్వపశ్చిమార్ధగోళములకు వేల కొలఁదిమైళ్ళ అంతర మున్నది ఇందువలన నీరెండుగోళములందలి సమాక్షాంశములందు ఉత్పన్నములగు వనస్పతులు మున్నగువానిలో సమానతయు, వ్యత్యాసము రెండును గానవచ్చుచున్నవి యూరోపియాలోని యుత్తరాక్షాంశములందు ఏయేవనస్పతులు, పశుపక్ష్యాదులును గానవచ్చునో యట్టివే అమెరికాయందలి తత్సమాక్షాంశములందును గానవచ్చును కాని దక్షిణాక్షాంశములందు దీరెండుగోళములలోఁ జాల వ్యత్యాసము కలదు యూరోపునందువలె ఉత్తర-అమెరికా యందును ద్వీపము లెక్కువ కాని దక్షిణ-అమెరికాయం దన్ని లేవు. ఆయున్నవియు మిక్కిలి దక్షిణముగ నున్నవి. ఉత్తర, దక్షిణ-అమెరికాలకు మధ్యఁ దూర్పుప్రక్కగా విశాలమగు సింధుశాఖ కలదు. అందు మెక్సికోసింధుశాఖయు, కరిబ్బియనాసముద్రమును, పశ్చిమ హిందూద్వీపములును సంకోచియున్నవి.

ఈఖండమునందలి ముప్పాతికభాగము మంచిమైదానము ఈ మైదానములకుఁ బశ్చిమముగా ఉత్తరమునందుండి దక్షిణాగ్రమువఱకును పర్వతశ్రేణులు వ్యాపించియున్నవి ఉత్తర-అమెరికాయం దివి రాకీ లనుపేరఁ బరఁగుచున్నవి ఇవి కెనడాదేశమున ఉత్తరమునందుండి యారంభమై దక్షిణాభిముఖముగ వచ్చి మెక్సికోదేశపుపర్వతములతోఁ గలసి వెండియు దక్షిణమునకు పోగి దక్షిణ-అమెరికాయందలి శ్రేణులతోఁ గలయును రాకీపర్వతములనుండి వేఱుగ దీనికిఁ బశ్చిమదిశను సముద్రతీరమునకు సమానాంతరముగ సైర్రానెవేడా, కాస్కేడ్ నామకపర్వతములు మఱికొన్ని వ్యాపించియున్నవి. పూర్వసముద్ర తీరమునకు సమీపముగ అప్లాషియను పర్వతములు గలవు. ఇవి రాకీ లంత ఎత్తయినవి కావు ఉత్తర-అమెరికాయందలి పర్వతశిఖరము లలో మెకిన్లీ నామకకూటము తక్కినవానికంటె నెత్తయినది. దీనియెత్తు ౨౦,౪౬౦ అడుగులు దానితరువాత ౧౯,౫౧౮ అడుగుల యెత్తుగల లోగను, ౧౭,౦౦౦ అడుగుల యెత్తుగల పొపొకటపెటిల్ నామకశిఖరములు ముఖ్యమైనవి ఈరెండు అమెరికాలను గలుపు పనామాభూసంధి సముద్రతలమునుండి ౨౬౦ అడుగుల పల్లమున నున్నది దక్షిణ-అమెరికాయందు అండీస్ పర్వతపాళికలు ఉత్తరమున పనామాభూసంధినుండి దక్షిణమున హారను నామకాగ్రమువఱకు వ్యాపించియున్నవి ఎత్తునం దివి రాకీపర్వతములను మించినవి కాని వానియంత వెడల్పుగలవికావు అకొంకాగువా (౨౩,౦౮౦ అడుగులు), సొరటా లేక ఇల్లంప (౨౧,౪౯౦ అడుగులు), సహామా (౨౧,౦౫౪ అడుగులు) అను శిఖరము లీపర్వతములందు మిక్కిలి ఎత్తయినవి ఉత్తరప్రాంతములందు ఈపర్వతములు మూఁడు పాళికలుగఁ జీలి యున్నవి వీనిలో నొకశ్రేణి ఉత్తరపూర్వముగా వ్యాపించి వెను జులా ప్రాంతమున కేఁగును పశ్చిమముంలిశాఖ పనామాభూసంధివఱకును బోయినది ఈరెండింటికి నడుమునందు శ్రేణిలో టొలిమా నామ కాగ్నిపర్వతశిఖరము కలదు దీని యెత్తు ౧౮,౪౦౦ అడుగులు ఇది యొక్కటే కాక అండీస్ పర్వతములలో నింకను అనేకము లగ్నిపర్వతములు కలవు

మీఁద వచించిన యుత్తరదక్షిణ-అమెరికాలలోని మైదానములు భిన్నములగు ప్రాకృతికలక్షణములను, కాలమానములను గలిగియున్నవి మఱియు నీయుత్తరదక్షిణ-అమెరికాలయందు వైపరీత్యముగఁ గొన్ని సమానధర్మములును, కొన్ని విపరీతధర్మములునుగూడఁ గలవు పశ్చిమదిశయందు ఉత్తరదక్షిణముగా పర్వతములు వ్యాపించి యుండుటయు, వానికిఁ దూర్పున విశాలములగు మైదానములయునికి, ఉత్తర-దక్షిణపూర్వాభిముఖములై నదులు ప్రవహించుట మొదలగునవి ఈరెండుభాగములందును సమానధర్మములు ఉత్తర-అమెరికా శీతకటిబంధమున నుండ దక్షిణ-అమెరికా ఉష్ణకటిబంధమున నుండుటయు, ఈకారణమున నీరెండుదేశములలో వసించు పశుపక్ష్యాదిజీవజంతువు లందు భేదము గలుగుటయు ననునవి వీనియందలివిసదృశములు.

ఈరెండుభాగములలోని మైదానములను అనేకనదీప్రవాహములతోఁ గూడి సారవంత మైన నేలల గలిగి సకలసస్యసంవర్ధకములై యలరారుచున్నవి. మెకంజీ, కాపర్మయిన్, యూకాన్ మొదలగు

నదులు ఉత్తరప్రాంతమున ప్రవహించుచుండును. దర్బీల్, నెల్సన్, చర్చిల్, అల్బనీనదులు హడ్సన్ సింధుశాఖయందుఁ గలయును. సెంట్ లారెన్స్ అట్లాంటిక్ మహాసాగరమునందును, మిసిసిప్పి, రియో గ్రాండె డెల్ నార్టె, మెక్సికోసింధుశాఖయందును, కొలంబియా, ఫ్రాజర్, సాన్ జోక్విన్, సాక్రమెంటో, కొలరెడో మొదలగు నదులు పసిఫిక్ మహాసాగరమునందును గలయుచున్నవి. ఇదివరకుఁ బేర్కొన్న నదు లంత ప్రసిద్ధికెక్కినవి కావు.

మాగ్డలీనా, ఒరినోకో, కొలరెడో, రయోనిగ్రో, అమెజాన్, పరనహిబా మున్నగునదులు దక్షిణ-అమెరికా ఖండమందలివి. ఇవన్నియు అట్లాంటిక్ మహాసాగరమునఁ గలయును. కస్సిక్వియారినామకనది రయోనిగ్రోనదినుండి చీలి ఒరినోకోనదిలోఁ గలయుచున్నది. అమెజాన్ ప్రపంచమందలినదు లన్నింటిలోఁ బెద్దది. దీనిపొడవు ౩,౯౦౦ ల మైళ్ళు. దీనిపరీవాహభూమియొక్క విస్తారము ౨౩,౦౦,౦౦౦ ల చదరపుమైళ్ళు. పొడవులందు ఉత్తర-అమెరికాయందలి మిసిసిప్పి గొప్పది. మఱియు నీదేశమున సరోవరము లనేకములు గలవు. వానిలో సుపీరియర్, మిషిగన్, హ్యూరన్, ఎరీ, ఒంటారియోనామకతటాకములు ప్రధానములైనవి. వీనిద్వారా ఖండమధ్యభాగమునకుఁ గూడ నౌకాప్రయాణములఁ గావింపవచ్చును.

కాలస్థితి (Climate) యందు ఉత్తర, దక్షిణ-అమెరికాలలోఁ జాలభేదము గలదు. ఉత్తర-అమెరికాయందలి కాలస్థితి మొత్తముమీఁద యూరోపియాఖండమందలి కాలమును బోలియుండును. మఱియు నిచట పశ్చిమతీరమునకంటెను తూర్పుతీరమున శీత మెక్కువ. ఈకారణముననే అమెరికాలోని అట్లాంటిక్ తీరమందలి పట్టణములలోని చలి తన్నుగనున్న యక్షాంశముల నుండు యూరోపు అట్లాంటిక్ తీరనగరములలోనిచలికంటె పదిరెట్లెక్కువగ నుండును. మొత్తముమీఁద ఉత్తర-అమెరికాయందలి యుత్తరభాగమునఁ జలి అధికముగనే యుండును. కాని యొకవిధమగు ఉష్ణవాయువు ఆతరుణమున వీచుచుండుటవలనఁ జలి యంతగ నసహ్యమనిపించదు.

దక్షిణ-అమెరికాయందు మూఁడింట రెండువంతులు ఉష్ణకటిబంధమున నుండినప్పటికిని చల్లగ వాయువులు వీచుచుండుటవలన వేఁడిమి యనిపించదు. వేసవియం దిచటిశీతోష్ణపరిమాణము ౧౦౦ డిగ్రీలుండును. రయోడిజెనీరోనగరమున మధ్యమశీతోష్ణపరిమాణము ౭౮ డిగ్రీలు; లిమాపట్టణమున ౬౭ డిగ్రీలు. దక్షిణ-అమెరికాయందలి వాతావరణము ఒక్కవిధముగ నుండదు. అమెజాన్ యొక్క యుపరిభాగములందు ౧౦ నెలలపర్యంతము వర్షము పరిమితముగ గురియుచుండును. ఇందులకు ముఖ్యకారణము తూర్పునుండి వీచు ఆర్ద్రవాయువులు. అవి యటు లండీస్ కొండదేశములలోఁగూడ వానవృష్టిఁ గూర్చును. బొత్తిగ వాన కురియనిప్రదేశములును గలవు. మెక్సికోయందలి యుత్తరభాగము మొదలుకొని కాలిఫోర్నియా వఱకు నుత్తరభూభాగములందు బొత్తిగ వర్షములు కురియవు. దక్షిణ-అమెరికాలోని పెరూ, చిలీదేశములందును గావలసినంతవర్షము కురియదు.

అమెరికాఖండమునందు పలువిధములగు ఖనిజము లుత్పన్నమగును. వెండి బంగారము లిచటనుండి సమస్తప్రపంచమునకును రవాణా యగుచుండును. సంయుక్తరాష్ట్రములందు అత్యధికములగు బొగ్గుగనులు గలవు. మఱియు ఇనుము, రాగి, సీసము, తగరము, పాదరసము లోనగుధాతువుల కీదేశము [illegible]. పెట్రోలియమునకు ఇది జన్మభూమి. ఇచటి పెట్రోలియముబావులకారణమున నూతన నగరము లనేకము లావిర్భవించినవి. వజ్రములు, వివిధరత్నములు నిచట దొరకును.

దేశమం దంతట మహారణ్యములు వ్యాపించియుండుటచేతను, అరణ్యములు లేనిచోట్ల పచ్చికగడ్డితో నిండిన మైదానము లుండుట చేతను ఖండ మంతయు నాకుపచ్చవర్ణము గలిగి కడు మనోహరముగ నుండును. అరణ్యరహితములైన యీపచ్చనిమైదానములే ఉత్తర-అమెరికాయందు ప్రైరీలు, సవన్న లనియు, దక్షిణ-అమెరికాయందు లానోలు, పంపాలు, సెల్వా లనియుఁ బిలువఁబడుచున్నవి. ఉత్తర-అమెరికాయందలి అరణ్యము లన్నియు మనుష్యోపయుక్తము లగుచున్నవి కాని దక్షిణ-అమెరికాయందలి వింకను అనాగరికావస్థయందే యున్నవి. మిక్కిలి యుత్తరమున దేవదారు, ఫర్ (Fir) నామక వృక్షము లెక్కువ. ఈభాగములకు దిగువనుండు ప్రదేశములలో ఓక్ మున్నగు మూల్యమైన కలప దొరకును. అనేకప్రకారములగు తాళ్ళు, నాగజెముళ్లు, కలబందలు మొదలగు కంచెలును, నారకు పనికివచ్చు పలు వృక్షములును పుష్కలముగఁ గలవు. దక్షిణ-అమెరికాలోని యరణ్యములు మనుష్యులకుఁ బ్రవేశింప వలనుగాక వృక్షములతోఁ గ్రిక్కిరిసి యున్నవి. ఇచటియడవు లన్నియు, మూలమునుండి పైవఱకును గడ్డితోడను, పలురకములమొక్కలతోడను, తీగలతోడను పెనవైచుకొనిపోయి దుర్గమములై యుండును.

మొక్కజొన్నలు, బంగాళాదుంపలు, పొగాకు, సింకోనా మొదలగునవి మొదటినుండియు నమెరికాయం దుత్పన్నము లగుచుండెడివి. కాని వీనికిఁ దోడుగ గోధుమువరి మొదలగుధాన్యములును, చెఱకు, కాఫీ, ప్రత్తి, నానావిధఫలజాతులు, కాయలు పరదేశములనుండి తెప్పింపఁబడి సాగు చేయఁబడుచున్నవి. ద్రాక్ష లీఖండమునఁ బుట్టినవియు, బయటనుండి వచ్చినవియుఁగూడ ఫలించుచుండును.

దక్షిణ-అమెరికాఅరణ్యములు సింహశార్దూలాది వన్యమృగములకు నిలయములు. మఱియు ఎలుఁగులు, తోఁడేళ్లు, నక్కలు, కొండముచ్చులు, కణుఁజులు, దుప్పులు, అల్పాకామృగములు, ఒంటెలు, చించిల్లాలు లోనగు జంతుమండలము లను అనేకవిధవన్యమృగము లిచటఁ గలవు. పలుతెఱంగులసర్పములును నానావిధ పక్షులు

వంగా వలనికి ౬౦,౦౦౦ పౌన్లు లభించెను. అటువిస్తున్న క్రమాభివృద్ధి గాంచుచు నుండు దాస్యప్రతికూలుర సంఖ్యయే యెక్కుడయ్యెను.

౧౮౫౦ వ సంవత్సర ప్రాంతమున స్వేచ్ఛారాజ్యములజనసంఖ్య ౧,౪౦,౦౦,౦౦౦ లును, దాసరాజ్యములసంఖ్య ౧ కోటికంటె కొంచెము తక్కువగను నుండెను. అందు ౬౦,౦౦,౦౦౦ లకు మించిన తెల్లవారును, ౩౦,౦౦,౦౦౦ లకు కొంచెము తక్కువగ దాసులును, ౨,౫౦,౦౦౦ లకంటె స్వేచ్ఛగల నీగ్రోలును ఉండిరి. యజమాన లొకరిద్దఱు దాసులు మొదలుకొని వెయ్యికంటె యెక్కుడ కూడ నుంచికొనుచుండిరి. ప్రెసిడెంటు టెయిలర్ ఆధీనమున లహాయి యేూబాయుందు వెయ్యిమందికంటె యెక్కువదాసు లుండిరి. దేశమం దధికస్వాతంత్ర్యమును, ఐహికానందపరంపరల ననుభవించువారును కొలఁదిమంది యజమానులు. తక్కినవారిజీవనము సంకటమయి యుండెను. గజాఢ్యులు కాని తెల్లవారును సరిగ కూటికి నుడ్డకు లేక కష్టపడుచుండిరి. వీరికంటెఁ దక్కువస్థితియందు స్వేచ్ఛగల నీగ్రో లుండిరి. వర్ణవిభేదము లక తెల్లవారి కుండెడు స్వాతంత్ర్యములు కొన్ని ఈనీగ్రోల కుండెడివికావు. వీరికంటెఁ గూడ నీచమగు దశయందు దాసు లుండిరి. అప్పటిచట్టముల ప్రకారము దాసుఁ డొక విత్తముగఁ బరిగణింపబడెను. ఎవరైన వలసినచో యజమాని ఇతరుల కమ్మివేయవచ్చును, లేక అన్యపదార్థములతో వినిమయము చేసికొనవచ్చును, ఉదారకర్మలైనను దాసుల నితరుల కిచ్చివేయవచ్చును. దాసునిపై యజమానునకు వంశపారంపర్యమగు అధికార ముండెను. ఈ స్థితిగతు లన్నింటియందు అమ్ముట యనునది దాసులపాలిటికి గొప్ప అత్యాచార మైయుండెను. అమ్మఁబడినపుడెల్ల దాసులకు తన బంధుమిత్రపుత్రకళత్రాదుల నైన విడదిచిపెట్టవలసివచ్చుచుండెను. కొట్టగొనుట యజమాను లీదాసులను విదేశములవారికి నైతము విక్రయించుచుండిరి. కాని క్రమముగ శాసనము మాని స్వదేశమునందే విక్రయింపసాగిరి. నియమానుసారము దాసుల కట్టి యధికారము నుండెనేకాదు. సంతలకుఁ బశువులవలెఁ దోలుకొని సమయమున గుంపులుగుంపులుగఁ దీసికొనిపోయి యమ్ముచుండిరి. కొన్నిచోటులందు దాసులు తమకుఁ దామే యమ్ముకొనుచుండిరి. వీరికి స్వేచ్ఛ యనునది సున్న. దాసుఁడు గొప్పయాస్తిపరుఁడు కాఁగూడదు. కాని ఆలాగు సొంతయోగముగా నుండి స్వల్పమాత్రపు ఆస్తి కలిగియుండవచ్చును. ఇఁక వీరిప్రాణము లనిన నవియు యజమానుల హస్తగతములే. కనికారణము లేకుండ, అనఁగా స్వప్రాణరక్షణార్థము తప్పఁ దక్కినపరిస్థితులందు దాసుని జంపుటకు యజమాని కధికారము లేదు. కాని జ్ఞానమొందుట అనుటచే దాసులఁ జంపినప్పటికిని తెల్లవారు శిక్షింపఁబడకుండనే తప్పించుకొనుచుండిరి. సాధ్యమైనంతవరకు దాసవాత్యలు జరగుచుండెడివికావు. ఇందులకు ముఖ్యకారణ మానవుడయమున దౌర్భాగ్యులగు దాసులఖరీదు ౧,౦౦౦ మొదలు ౧,౫౦౦ ల డాలర్లవఱకు నుండెను. ఇంతటిలాభదాయకపదార్థములను చేతులారఁ జేతగొట్టుకొనుట కెవరును ఇచ్ఛగింపరుకదా! అదిగాక దానప్రథవిషయమున కట్టియభిప్రాయము లుండినను వారిని మితిమీఱి హింసించుట కిచ్చగింపక అట్లు బాధించుయజమానులయెడ లోకులు నిమ్మకత్వము వహించుచుండిరి. అందువలన దాసులను యెక్కువగ బాధింప యజమానులు జంకుచుండిరి. గృహకృత్యములందలి పనులను గావించు దాసులస్థితి చాలవఱకు బాగుగనే యుండెడిది. కాని ప్రత్తి, పంచదార, వరి మొదలగు పంటలు పండుక్షేత్రములందు పనిపాట్లు సలుపుదాసుల స్థితి కడుశోచనీయముగ నుండెను. దాసు లొనరించుకార్యములను సామాన్యముగ యజమానులు స్వయముగఁ బరీక్షించుచునుండిరి. కాని యజమానులు కార్యాంతరాసక్తు లయియున్న యెడ యమునవారిచే నియామకులగు నిరీక్షకులు దాసకృత్యములను బరీక్షించుచుండిరి. అట్టినియామకులు దీర్ఘకోపులు. యజమానులమెప్పు వడయుటకై దాసులచే మితిమీఱి పని చేయించుటయే గురిగ నుండెను. పనిపాటు యందు వాలస్యము గలిగియుండువారిని కొరడాదెబ్బలకు గుఱి యగుచుండిరి. ఇట్టి యాకాలమున సర్వజనాంగీకృత మైయుండెను. ముసలిమ పనిపోవుట, మాతృపితృభ్రాతృవిచ్ఛేదనము, మిక్కుటముగ దొంగిలించుట, సమయమునకు రాకుండుట, శరీరాంబరముల మలినము గావించుకొనుట, కర్తవ్యపాలనమున నిర్లక్ష్యము గానిచ్చుండుట, ఉపకరణములను పాడుచేయుట గోవు పశువులకై దానిలకు శిక్ష గఱుచుండెను. ఆహారవిషయమున గృహదాసులది బాగుగ నుండెను కాని కృషిదాసులస్థితి యావిషయమునను హీనముగనేయుండెను. లోభగ్రస్తులగు యజమానులు వీరి యాహారములపై నంత దిన్నగ గణింపక పోవుటచే రమునందే కాఁబున నట్టి పరిస్థితులు కలుగకుండునట్లుగ నియమములు గావింపఁబడి యుండెను. కాని స్వార్థమునకు వశులగు వారై న్యాయాన్యాయములు విచారింపని యజమానులయెడ నియమములు లేమి గావింపగలవు? ఉత్సవములందును, శీతకాలమునందును దాసులకుఁ గడుపునిండ నన్నము దొరకుచుండెడిది కాని తక్కిన సమయములందు శరీరధారణమాత్రమే యైయుండెను. కొలదిమాత్రపు పొగాకు లభించినను, దానికై దాస్యమే కాని వేఱొండు కానేరగుగదా! యజమానుల నివాసభవనములకుదగ్గఱ దాసులనిమిత్తము చిన్నయిండ్లు నిర్మింపఁబడియుండెడివి. ఇఁక మతవిషయమందు యజమానుని యిష్టానుసారముగా దాసుఁడు నడచుకొనవలెను. ఆత్మావసరము పని లేనిచో ఆదివారము నాఁడు వీరి కవకాశము దొరకుచుండెను. మాతృభాషగ నైబిలు యొక్క యుపదేశములను వీరు వినవచ్చును కాని పవిత్రగ్రంథమును స్వయముగ చదువుట కర్హులు కారు. పాదిరులకు (Churches) యందు వీరు ప్రత్యేక ముఖభాగమున తెల్లవారితో సంబంధము లేనిచోటఁ గూరుచుండవలయును. విద్య యనునది వీరికి సున్న. విద్యావంతు లైనచో కృషికార్యములకుఁ బనికిరారనియు, చదువు కాని తిరుగఁబడుదు రనియు, అందుచే వీరు స్వకార్యములందెల్ల పనంతుష్టులుఁ గానుండు రనియు సాధ్యమైనంతవఱకు వీరిని మూఢులుగనే యుంచుచునుండిరి. కాని స్వతంత్రజాతులు...

ప్రోత్సాహము కలుగుచునే యుండెను. ఇట్టి యీ దాస్యప్రశ్న నిర్ధారింపబడుటకై అంతఃకలహ ముత్పత్తిల్లెను. మీద లిఖించినపద్ధతిన కొలదికాలము గడచినకొలదియు నుత్తరమునందలివారివాదము దృఢమగుచుండెను. రెండుపక్షములవారికలహములను మరింత భయంకరము లయ్యెను. ఈ పోరాటములను శాంతింపజేయవలయు నని ౧౮౫౦-వ సంవత్సరప్రాంతమున నుత్తరదక్షిణములవారిమధ్య నొక సమాధానము కావింపబడెను కాని ౧౮౫౪-వ సంవత్సరమున ప్రవేశపెట్టబడిన యొకబిల్లువలనను సమాధానము భగ్నమైపోయె మరల సంక్షోభము లారంభమయ్యెను. అనంతరము ఈదాస్యప్రశ్న ధర్మాధర్మ యనువాదవివాదములు చెలరేగెను. అర్థికముగ నిది యావశ్యక మయ్యెను ధార్మికముగ పాపకార్యము గనుక సర్వథా పరిత్యాజ్య మను సిద్ధాంతము ప్రబలమయ్యెను. ఒకప్రక్క నిట్లు వాదవివాదములతో దేశ మంతయు నాందోళిత మగుచుండ జాన్ బ్రౌన్ అనువాడు కొందఱు అనుచరుల వెంట నిడుకొని వర్జీనియాయందలి హార్పర్స్ ఫెర్రీ యనుస్థానమును జేరి యచటియాయుధాగారమును ముట్టడించెను. ఆప్రాంతమందలిదాసుల నందఱను పురికొల్పి తిరుగబడునట్లు చేయుటకై యిట్టి దౌర్జన్యమును గావించెను కాని విద్యాహీనులై, యుక్తాయుక్తవిచక్షణాశూన్యులై, మూర్ఖులై పశువులకంటెను మహానీచస్థితియం దున్న యచటిదాసుల కీయుద్యమమునందు లేశమాత్రమైనను వివేకము కలుగనందున బ్రౌను నిర్బంధితుడై వర్జీనియానియమముల ననుసరించి ఉరితీయబడెను. తమ యాజన్మప్రయోజనము నైన గుర్తింపజాలని పరమమూర్ఖులగు దాసుల నిమిత్తమే హార్పర్స్ ఫెర్రీఘటనము కర్తవ్యపరాయణులు చేయజాలకపోయినప్పటికిని దేశమందలి దాస్యవిమోచనపక్షమువారి నందఱ నొక్కపెట్టున కార్యక్షేత్రములోనికి దుముకునట్లు గావించెను. ౧౮౬౦-వ సంవత్సరమున అధ్యక్షుని (President) ఎన్నికలసందర్భమునందే ఉత్తరదక్షిణములవారి కత్యంతతీవ్రములగు వాగ్వివాదములు జరిగినవి తుదకు రిపబ్లికను పక్షీయుడగు అబ్రహాం లింకను ఎన్నుకొనబడెను. ఇతఁడును, కాంగ్రెసునందలి రెండుసభలవారును, దొరతనమందలి యుత్తరదాయిత్వము గల గొప్పగొప్ప యధికారు లందఱును దాస్యప్రతిపక్షులే యైయుండిరి. ఆకారణమున దక్షిణమువా రిఁకఁ దమకోరిక నెఱవేఱ దనుసందేహముతో సంయుక్తరాజ్య సంయోజన ప్రభుత్వమున (Union)నుండి వేఱుపడుటకు నిశ్చయించుకొనిరి. ఈనిశ్చయమున నందఱకంటెను ముందడుగిడినది దక్షిణకెరొలీనారాజ్యము. ౧౮౬౦-వ సంవత్సరము డిసెంబరునందు ప్రతినిధులు కొందఱు సమావేశమై దక్షిణసంఘాతము (Southern Confederation) అను పేర క్రొత్తది యేర్పరచి జఫర్సన్ డేవిస్ అనువానిని అధ్యక్షునిగ నెన్నుకొని కలహమునకు సంసిద్ధులైరి. ౧౮౬౧-వ సంవత్సరమున తమయుత్తర్వులు గావించికొన్న రాజ్యం బులేడు వచ్చియుండి సంయోజనమున(Union)నుండి విడిపోయినట్లు ప్రకటించుటకు సందేహింపక సమాధానమునకు విక్రయించిపోవుటను ప్రకటించిరి. సంయోజనమునందు ...

ప్రకటించిరి. అనియమములను ఉత్తరరాజ్యములవారు భంగపఱుచుటచేతను, ప్రస్తుతప్రభుత్వవ్యవస్థయొక్క ప్రజాస్వాతంత్ర్యనియమములు దాసయజమానులకు ప్రతికూలము లగుటచేతను, స్వేచ్ఛారాజ్యము లన్నియు దాస్యపద్ధతికి ప్రతిపక్షి యగువాని నధ్యక్షునిగ నెన్నుకొనుటచేతను, ముందు కార్యరూపమునకు వచ్చుసంయోజనప్రభుత్వము దాస్యరాజ్యములకు విరుద్ధ మగునది యగుటచేతను, ఈయుక్తకారణములవలన రాజ్యముల కన్నింటికిని సమానస్వాతంత్ర్యము నిలువ దనుహేతువుచేతను తా మీసంయోజనమునుండి విడిపోవుచుంటి మని ప్రకటించిరి. అదిమొదలు దాస్యరాజ్యములవారందఱును కాన్ఫెడరేట్లనియు, స్వేచ్ఛారాజ్యములవారు యూనియనిస్టులు లేక ఫెడరేటులు అనియు పిలువబడసాగిరి. ఈ మొదటిపక్షమువారు సంయోజనమును భగ్నము గావింపవలెనని తలపెట్టను రెండవపక్షమువారు దానిని రక్షింపను కటిబద్ధులైరి. ఈతరుణమున దాస్యప్రశ్నము గౌణము కాఁగా యూనియనురక్షణమే ప్రాముఖ్యమును వహించెను. దక్షిణకెరొలీనావారు తమనిశ్చితాభిప్రాయములఁ దక్కిన దాసరాజ్యము లన్నింటికిని బంప ఫిబ్రవరినెల యగుసరికి మిసిసిప్పి, ఫ్లోరిడా, అలబామా, జార్జియా, లూయిసియానా, టెక్సాస్ రాజ్యములు యూనియనువదలి కాన్ఫెడరేటుపక్షమునఁ జేరెను. యుద్ధమారంభమైనతరువాత వర్జీనియా, ఉత్తరకెరొలీనా, టెన్నెస్సీ, అర్కాన్సస్ అను మఱినాలుగురాజ్యములు కాన్ఫెడరేట్లతోఁ గలిసెను. దక్షిణమువారందఱును రిచ్మాండ్ నగరమును కేంద్రస్థానముగ నేర్పఱచుకొనిరి. ఆసమయమున జనరల్ విన్ఫీల్డ్ స్కాట్ అనువాఁడు ఫెడరల్ సేనలకధిపతిగ నుండెను. సమ్టర్ నామకదుర్గ మప్పుడు ఫెడరల్ అధికారమందే యుండెను కాని దానియందలి కోటలన్నియు కాన్ఫెడరేట్లకుఁ జెందియుండెను. ప్రెసిడెంటు మున్నగువారి నెన్నుకొనిన పిమ్మట దాస్యరాజ్యములవా రా దుర్గమునొద్ద యూనియను పతాకమును దీసివేయ సంకల్పించిరి. ఇందునిమిత్తము వీర ప్రెసిడెంటు లింకను నడుగ నతఁడు దానమాచారమును స్కాటున కెఱింగించెను. శాంతముతో వ్యవహారములఁ జక్కఁజేసుకొనుట మంచి దని స్కాటు ప్రత్యుత్తర మొసంగెను. లింకనుయొక్క మంత్రులును (కాబినెట్) ఇక్కడనుండి సమ్టర్ దుర్గమును శాంతిపూర్వకముగ వదలుటయే మంచి దని సలహా నిచ్చిరి. కాని సమ్టర్ పోయినయెడల సమస్తము పోయినట్లే యని యెంచి లింకన్ ఆదుర్గమును బలపఱుచుటకై యుత్తరువుల నొసంగెను. ఈసమాచారము తెలిసినతోడనే కాన్ఫెడరేట్లు ఎక్కువజననష్టము లేకుండ నాదుర్గమును స్వాధీనపఱుచుకొనుటకుఁ దమసేనాని యగు బేర్ గార్డున కాజ్ఞ నొసంగిరి. దుర్గమును వదలిపోవుటకై యచట నున్న మేజర్ ఆండర్సనునకు వార్త పంప నతఁడందులకు సమ్మతింపఁడయ్యెను. అంత ౧౮౬౧-వ సంవత్సరము ఏప్రిల్ ౧౨-వ తారీఖున కాన్ఫెడరేటుసేనలు సమ్టర్దుర్గముమీద కాల్పులఁ గురిపింప నారంభించెను. దుర్గమందు సేనలు ౭౦ మంది మాత్రమే యుండినందున ఆండర్సన్ రెండవనాఁడే దానిని వదలిపోయెను.

సమ్టర్ దుర్గముపైన నిప్పుకొట్టినపిమ్మట, స్వేచ్ఛారాజ్యములవా రందఱు కొద్దికాలమునకే కలిసిపోయి యుండులకు ప్రతిజ్ఞ చేయవలె నని నిశ్చయించిరి. అనంతర మీ రెండు తెగలవారికిని బాల్టిమోరునందు సంగ్రామ మయ్యెను ఇం దనేక సైనికులు హతు లైరి. అటుపిమ్మట వర్జీనియాయందు యుద్ధ మారంభమయ్యెను ఇందు తూర్పునందలివారు దాస్యరాజ్యములపక్షమును, పడమటిదిక్కునందలివారు స్వేచ్ఛారాజ్యములపక్షమును అవలంబించుటచే వీ రిరువురకును పరస్పరము పోరాటము కలిగెను పూర్వవర్జీనియాము పడమటివారిమీఁద దండెత్తి పోయెను కాని యచట మెక్‌క్లెల్లాన్ అనువాఁడు వీరిని పరాజితులఁ గావించి పాఱఁద్రోలెను ఈసందర్భమందే పడమటివర్జీనియా యని భిన్నరాజ్య మేర్పడెను కెంటకీ, మిసోరీరాజ్యములందును ఇటులే పోరాటములు జరిగియుండెను మొత్తముమీఁద కాన్ఫిడరేట్లకే అపజయ మగుటచే ఈరాజ్యములు యూనియనునందే స్థిరపడెను వీని యన్నింటికంటె మనస్సస్‌నందు జరిగినయుద్ధ మత్యంతప్రచండమైనది ఇందు జనరల్ మెక్‌డోవెల్ అనువాఁడు ౩౦,౦౦౦ల సేనతో వాషింగ్టనునుండి బయలుదేఱి కాన్ఫిడరేట్లకేంద్రమగు రిచ్‌మాండ్ నగరమును ముట్టడింప వచ్చుచుండెను మెక్‌క్లెల్లానువలన నోటువడిన పిదప బేర్‌గార్డు ౨౩,౦౦౦ల సైనికులతో మనస్సస్‌సమీపమందలి బుల్‌రన్‌నామకప్రవాహముపొడుగునను వ్యాపించియుండెను కాలై మాసమున నిచట నీరెండుపక్షములవారికిని జరిగినయుద్ధమందు మెక్‌డోవెల్ క్రింద నున్న యూనియను సేనల కపారము నష్టము వాటిల్లె స్వేచ్ఛారాజ్యములవా రందఱును సిగ్గుచే అవనతవదను లైరి యూనియనుపక్షమువా రందఱును మొట్టమొదటి గొప్పయుద్ధమున నప జయము కలుగుట అపశకున మని చింతింపసాగిరి కాని, ప్రెసిడెంటు లింకన్‌మాత్ర మట్లు తలపోయక సైనికులకు గొప్ప శిక్షనిచ్చి సేనలను సరిగ తేవలె నని తలంచెను అందువలన మెక్‌క్లెల్లానును సేనానాయకుని గావించి సేనల నన్నింటిని శిక్షాయుక్తములుగఁ జేయుట కుత్తరువుల నొసంగెను తదనుసారము డిసెంబరునెల వచ్చువఱకు ౧,౮౫,౦౦౦ల మంది సుశిక్షితులగు సైనికులు సంసిద్ధు లైరి తరువాత నితఁడు కాన్ఫిడరేటురేవుపట్టణము లన్నిటి పూర్వతీరమంతటిని ముట్టడిచేసి విదేశములనుండి యెట్టిపదార్థములుగాని రాకుండునట్లుఁ జేయవలయు నని నిశ్చయించెను ఒకప్రక్క నిచట యుద్ధము సాగుచుండ నీయిరుపక్షములవారును వారివారిప్రతినిధుల యూరోపుఖండమునకుఁ బంపి వారిద్వారా తమసిద్ధాంతములను ప్రచారము చేయింప నెంచిరి ఈ కార్యమువలన ఉత్తరపక్షమువారికే యెక్కువలాభము కలిగెను. ఇవన్నియు నిటులుండ అసలుయుద్ధ మారంభ మగు సమయమునకు స్వేచ్ఛారాజ్యములు ౨౨ వఱకును పెరిగిపోఁగా దాస్యరాజ్యములు కేవలము ౧౧ మాత్రమే మిగిలెను ద్రవ్యము, యుద్ధసామగ్రులు వెండలగువానిని సమకూర్చుకొనుటయందేమి, రాకపోక లకు వీలగు సమమార్గములు లైనమార్గముల విషయములో నుండుకొనుటయందేమి కాన్ఫిడరేటులకంటె యూనియనిస్టులే యెక్కువసౌకర్యములను

కలిగియుండిరి. కాని తిరుగఁబడినరాజ్యముల నోడించి వారిని మరల యూనియనునకు బద్ధులై యుండునటులుఁ జేయుటయందు స్వేచ్ఛారాజ్యములవారికార్యమే యెక్కువ కఠినమై యుండెను. అధ్యక్షుని యాదేశానుసారము ౧౮౬౧-వ సంవత్సర మంతయు సైనికులను సుశిక్షితులఁ జేయుటయందే గడచిపోయెను ౧౮౬౨ ఆరంభమగునాటికి యూనియనిస్టులపక్షమున ౫,౦౦,౦౦౦ల సైనికులును, ౨౦౦౦ల యుద్ధనౌకలును తయా రయ్యెను అప్పటికి ౧౫,౦౦౦ల మన్రోదుర్గమందును, ౨,౦౦,౦౦౦ల వాషింగ్టన్‌చేరువ గుప్తప్రక్కలందును, ౨౦,౦౦౦ల పడమటివర్జీనియాయందును, ౧,౦౦,౦౦౦ల లూయివిల్లి యొద్దను, ౨౦,౦౦౦ల మంది అత్యంతపశ్చిమసీమలందును స్థాపితులై యుండిరి ఇదేతరుణమున కాన్ఫిడరేట్లయొద్ద ౨,౫౦,౦౦౦ల సైనికులు సంసిద్ధులై యుండిరి వారిలో ౧,౪౫,౦౦౦ల మంది తూర్పు వర్జీనియాయందును, ౩౦,౦౦౦ల మంది కెంటకీరాజ్యములోని కొలంబస్, డొనెల్‌సన్, హెన్రీనామకదుర్గములందును, ౨౦,౦౦౦ల మంది టెన్నెస్సీరాజ్యములోని నాష్‌విల్లీ, చట్టనూగాలయందును నిలిచియుండిరి మిగతా మిలిటరీ సేవలు, న్యూఆర్లియన్స్, గాల్‌వెస్, విక్స్‌బర్గ్, మెంఫిసులయందు గూడి మిసిసిప్పీలోయ నంతటిని గాచుచుండెను

మీఁద వచించినవిధమున సైనికుల నుత్తమరీతిని శిక్షితులను గావించుప్రయత్నములందే ౧౮౬౧-వ సంవత్సరము గడచిపోయెను అంత ౧౮౬౨-వ సంవత్సరము జనవరిమాసము ౨౭-వ తారీఖున యూనియను సేనలకన్నింటికిని సర్వాధిపత్యము వహించియున్న ప్రెసిడెంటు లింకన్ ఈక్రిందివిధమున నుత్తరవులఁ గావించెను

“ఈసంవత్సరము ఫిబ్రవరి ౨౨-వ తారీఖున సంయుక్తరాజ్యములసేనలు కాన్ఫిడరేటుసేనలపై దండెత్తి పోవలయును కావున ముఖ్యముగా మన్రోగుర్గమందలి బలములును, వాషింగ్టన్ ప్రాంతములందు మెక్‌క్లెల్లాన్ అధీనమున నున్న పొటోమాక్ సైన్యమును, పశ్చిమవర్జీనియాయందలి దళములును, కెంటకీరాజ్యమందలి లూయీవిల్లీయొద్ద నున్న సేనలును, కెయిరోదగ్గతి జలస్థలవాహినులును, మెక్సికోసింధుశాఖయందలి జలసేనలును పైని వచించినతారీఖున బయలుదేఱుటకు సర్వసన్నద్ధము లైయుండవలెను ఇవికాక తక్కినసేనానాయకులన్నియుఁగూడ నుత్తరవులకై వేచియుండవలెను ఈసేనావిభాగము లన్నింటికిని చెందిన యధికారులు, ఆఫీసరులు, ఏరాధిపతులు లోనగువారు తమతమకర్తవ్యములను బాగుగ నెఱిఁగి, ఈయుత్తరువుల నన్నింటిని అమలులోఁ బెట్టవలయును.”

అటుపిమ్మట నితఁడు యుద్ధ మెలాగున సాగింపఁదగునదియు దన మంత్రివర్గముతోఁ గలసి యాలోచించుకొని స్థిరపఱిచికొనెను.

కాన్ఫిడరేట్లకు ముఖ్యస్థానమగు రిచ్‌మాండ్‌నగరమును ముట్టడిచేయుటయు, ఉత్తరమందలి యూనియనుసేనలు నిరాటంకముగ దక్షిణమున కేగుటయును, కాన్ఫిడరేట్లను చెదఁదీయుటయును ఈ యు

regions) వ్యాపించియున్నవి. ఇందు ఉత్తరమున స్నేక్, కొలంబియా నదులును, దక్షిణమున సాక్రమెంటో, కొలరెడో నదులును ముఖ్యమైనవి.

ఈపైని వచించిన నదులుగాక సంయుక్తరాష్ట్రములందలి ప్రధానమైనవి మిసిసిప్పి, మిసోరీ, ఓహియో అనునదులు మూడు నదులు గలవు. అప్లాచియన్ పర్వతములకు పూర్వముగను, రాకీ యున్నతభూముల దక్షిణపశ్చిమములుగను గల మధ్యభూమియందలి మైదానము లన్నియు నీమూడునదులకును పరీవాహక్షేత్రము లని చెప్ప వచ్చును. మిసిసిప్పినదియందు వేయిమైళ్లవరకును నౌకలు రాకపోకలు జరుపుట కను వగును. ప్రతిసంవత్సరము దీనిద్వారా నీటిలోఁ దేలి యాడుచు ౩౪,౦౫,౦౦,౦౦౦ ల టన్నులను, ద్రవీభూతమై ౧౩,౬౪,౦౦,౦౦౦ ల టన్నులను ఘనపదార్థము సముద్రమునకు చేరు చుండునట్లు లెక్కచేయఁబడినది.

మెక్సికోసింధుశాఖయందు ప్రవేశించునదులలో ప్రధానమైనది రియో గ్రాండె డెల్ నార్టె. ఇది మెక్సికో సంయుక్తరాష్ట్రముల సరిహద్దులమీఁద నున్నది.

ఈరాష్ట్రములలో గొప్పసరస్సు లుత్తరమున నున్నవి. సుపీరియర్, మిషిగన్, హ్యూరన్, ఎరీ, ఒంటారియో సరస్సు లుత్తర సీమలందును, గ్రేట్ సాల్ట్ సరస్సు ఇడాహో యందును గలవు. కాలిఫోర్నియా, ఆరిగనులందును మరికొన్ని చిన్నసరస్సులు కలవు.

భూగర్భశాస్త్రానుసారము సంయుక్తరాష్ట్రఘటనము.— యూరోపువ భూఖండనిర్మాణమునం దగపడు పొర లన్నియు అమెరికాయందును గనబడుచున్నవి. కాని అట్లాంటిక్ ద్వారా వీనికిగల సన్నిహితసంబంధ మింకను తేటతెల్లము కాలేదు.

ప్రాణిచిహ్నము లేమియుం గన్పించనికాలము మొదలుకొని నేటివఱకును గల ఆర్కియోజోయిక్ (Archaeozoic), ప్రొటెరోజోయిక్ (Preterozoic), పేలియోజోయిక్ (Palaeozoic), మెసోజోయిక్ (Mesozoic), సెనోజోయిక్ (Cenozoic), సైకోజోయిక్ (Psychozoic) నామక యుగములకుఁ జెందిన పొర లన్నియు నీదేశమునఁ గలవు. అందు ప్రాణిచిహ్నరహితమైన ఆర్కియోజోయిక్ యుగపు రాళ్లపొరలు విస్కాన్సిన్, మిన్నెసోటా, న్యూ ఇంగ్లండ్, అప్లాచియన్, సియెర్రాలందుఁ గానవచ్చుచున్నవి. ఇట్టి పొరలు దిగువపట్టియు, గ్రానైటును కానఁగ దొరకుచున్నవి. వీనిలో సమ్మిశ్రితములై లేక ఈ పొరల ప్రక్కప్రక్కల ప్రొటెరోజోయిక్ శిలాపొరలును గానవచ్చు చున్నవి. ఇందు సుపీరియర్, హ్యూరోనియన్, అనిమికియన్, కీవనా అను అంతర్భేదములు కలవు. సుపీరియర్ సమీపమున లోహము దొరకు జిల్లాలలో హ్యూరోనియన్ శిలలు చాలఁ గన్పట్టుచున్నవి. అవి మిచిగన్‌రాష్ట్ర ఉత్తరమునగను, మిన్నెసోటాలయందలి లోహోష్ణ దములు (Iron oxides) గనులలోఁ గానఁబడుచున్నవి. మరికొన్ని చోట్ల నీ శిల లితరధాతువులతోఁ గలసి దొరకుచున్నవి. మరియు రాకీలయందును, మొంటానా, ఇడాహో రాష్ట్రములందును ప్రొటెరోజోయిక్ శిలాపొరలు కలవు. పేలియోజోయిక్ యుగమున సంయుక్త రాష్ట్రములు నీటియం దుండెను. ఈ యుగమునాటి పొరలనుండి సెంట్‌లారెన్సు, సరోవరములకు దక్షిణముగను, ఓహియోపరీవాహ క్షేత్రముల కుత్తరముగను, మిసిసిప్పి, పూర్వమిసోరిభాగములందును గానవచ్చుచున్నవి. ఈయుగము కేంబ్రియన్, ఆర్డోవిషియన్, సిలూరియన్ మున్నగు పేరుల పేసంతర్భాగములుగ విభాగింపఁబడి యున్నది. అందు ఆర్డోవిషియన్ కాలమునాఁటికే మత్స్యజాతులవఱకును ప్రాణి సంచయము లేర్పడియుండెను. ఈ ఆర్డోవిషియన్ శిలాపొరలనుండి ఓహియో, ఇండియానాలయందు సైసర్గికమగు గాస్ (Natural Gas), పెట్రోలియమును, అయోవాయందు సీసము, తుత్తినాగములు, టెన్నెస్సీయందు ఖటికస్ఫురితము (Calcium Phosphate)ను, వెర్మాంట్ టెన్నెస్సీలయందుగల ప్రదేశమున నున్నపురాయి, పాలరాయి, సిమెంటు లోనగు పదార్థములును లభించుచున్నవి. సిలూరియన్ పొరలవలన నాఁటి ప్రాణికోటి యెంత పరిపక్వదశ నందినట్లు తెలియుచున్నది. వీనినుండి ఎఱ్ఱ ఇనుపమట్టి (Red iron-ore), గాస్, మూస లవణములుగ లభించుచున్నవి. సిలూరియన్ కాలమునాటి యగు డివోనియన్ కాలపుపొర లేర్పడినపుడు ఉత్తర-అమెరికా యంతయు నీటిలోపల నుండెనని యూహింపఁబడినది. ఈ డివోనియన్ కాలపు పొరలనుండియే పెన్సిల్వనియా, పశ్చిమవర్జీనియా, ఓహియో, న్యూయార్కులందు పెట్రోలియం, సైసర్గికవాయువు అధికముగ లభించుచున్నవి. డివోనియన్‌కాలము తరువాత నిదేయుగమున మిసిసిప్పియన్, పెన్సిల్వనియన్, పెర్మియన్ నామకములైన మూడుకాలములు ఘటిల్లెను. అందు పెన్సిల్వనియన్ పొరలనుబట్టి యాకాలమున నుత్తర-అమెరికాపు మరల నీటిమునుఁగులు చాలఁ గలిగె ననియు, పెర్మియన్ కాలమునాఁటికి కొంచెము హెచ్చుతగ్గుగ ప్రస్తుత మున్నరీతి నిండు మంతయు నీటునుండి వెల్వడి నదియుఁ దెలియు చున్నది. పెన్సిల్వనియన్ పొర లన్నియు బొగ్గుతో నిండియున్నవి. అప్లాచియన్ పీఠభూములలోని బొగ్గుగనులును, మిషిగన్, ఇండియానా, ఇల్లినాయిస్ కెంటకీలందలి గనులును, అయోవా, మిసోరీ, టెక్సాస్‌గనులును ఆకాలపు పొరలనుండియే కలిగినవి. మరియు ఇల్లినాయిస్, కన్సాస్, ఓక్లహోమాలయందలి యాకాలమునాఁటి ఇసుకరాతిపొరలనుండి పెట్రోలియం, సైసర్గికవాయువులు లభించు చున్నవి.

అనంతరపు మెసోజోయిక్ యుగము ట్రియాసిక్, జూరాసిక్, కొమంచియన్, క్రెటేషియస్ అను నాలుగుకాలములక్రింద విభా గింపఁబడినది. ఈ యుగ మంతమగునప్పటికి భూభాగము లన్నియు నేర్పడినవి. అప్పుడు ఏర్పడిన ప్రాణులకు ఆధారము [illegible] మాతకాగ్రకులప్రాయు లేర్పడెను. సరీసృపములును, [illegible] ఉత్పన్నములుగా [illegible]. గర్భ, [illegible],

సంవత్సర మధ్యమతాపపరిమాణము (Mean temperature) ప్రతి-అక్షాంశమునకును తగ్గుచుపోవును. ఈపూర్వభాగములందు పంటలు కవసర మగునంత పర్యాప్తమగు వర్షము కురియుచుండును. సింధుశాఖా ప్రాంతమందలి కాలమానము సగము సాగరికము (Half Marine), సగము అంతరికము (Tropical) నై యున్నది. చక్రవాతము లంతగ నిచట పనిచేయవు. ఎండకాల మతిదీర్ఘము నత్యుష్ణము నై యుండును. చలికాలము మాత్ర మానందదాయకముగ నుండును కాని యప్పుడప్పుడు మంచుపడి గ్రామశిల్పములకు నష్టమును కలుగఁజేయుచుండును. కొన్ని సమయములందు వర్షమే లేక కఱవులు బుట్టించుచుండును. సమతలముల (Plains) యందలి కాలమానములోని ముఖ్యవిశేషము వర్షాభావము. సంవత్సరమునకు సగటున ఇరువది యంగుళముల వర్షముకంటె నెక్కువ కురియదు. కాలువలమూలమునను మఱికొన్ని యుపాయములచేతను వ్యవసాయము సాధింపఁబడుచున్నది. ఈ ప్రాంతమందలి యెక్కువభూభాగము పశువుల మేత నిమిత్త ముపయోగపడుచున్నది. ఇచటివాయువు శుష్కము. ఎండకాలమున గాడ్పులు గొట్టి పంటలకును, పశువులకును నష్టము కలుగుచుండును. ఉత్తరమున శీతకాలమునందు భయోత్పాదకములగు హిమానివర్షములు (Blizzards) పుట్టుచుండును.

రాకీ పర్వతములకును, సైరా నెవాడా, కాస్కేడ్ కొండలకును నడుమ పీఠభూములు కలవు. ఇందుఁ గొన్ని శిఖరములమీఁదఁ దక్కఁ దక్కినచోట్ల వర్షము కురియదు. దక్షిణకాలిఫోర్నియా, దక్షిణపశ్చిమ - ఆరిజోనా, పశ్చిమనెవాడా ప్రదేశము లెడారి నేలలు. ఇవి శుష్కవాతములకును, తీవ్రమగు నెండలకును వాసభూములు. సంవత్సరమునకు ౧౫ అంగుళముల వర్షము కురియును. చావులోయ (Death Valley) అనునది ఈ ప్రాంతములందే యున్నది. ఈయెడారులలో నీడను వేడిమి ౧౩౪ డిగ్రీలు.

సముద్రతీర మగుటచేతను, భూమి పర్వతమయ మగుటచేతను పసిఫిక్ ప్రాంతమున భిన్నభిన్నమగు కాలమానము గోచర మగుచుండును. సముద్రతీరభూమియందు శీతకాలమున శాంతముగను, ఎండకాలమున సమశీతోష్ణముగను నుండును. మధ్యమందలిలోయలలో అత్యుష్ణము. కాలిఫోర్నియాయందలి మధ్యములోయలలో నెండకాలమున ౧౧౦-౧౨౦ అంశములవఱకు నెండవేడిమి యుండును. పసిఫిక్ ప్రాంతముయొక్క ఉత్తరభాగమం దీదేశము నంతటిలో నెక్కువయగు వర్షము కురియును, అనఁగా నూఱంగుళముల కెక్కువగఁ గురియును. సైరానెవాడా, కాస్కేడ్ పర్వతముల యుపరిభాగములందును వర్ష మపరిమితముగఁ గురియును. కాలిఫోర్నియాయందు వర్షము బొత్తిగఁ గురియదు. ఎండకాలమున పసిఫిక్ తీర మంతయు పొగమంచుతో నిండియుండును.

ఈరాజ్యములందు తుపానులు సంవత్సరమునకు నూఱుపర్యాయములు కలుగుచుండును. సాధారణముగ నివి ఎండకాలములోఁ గలిగి స్వల్పమాత్ర మగునష్టము గావించి పోవుచుండును. ౧౦౦ యామ్యోత్తరము (Meridian)నకు పడమట నివి చాల అరుదు. ఒక్కొక్క పర్యాయము ఉష్ణమండలముల (Tropical Belt) నుండి చక్రవాతములు (సుడిగాలులు) దక్షిణ-అట్లాంటిక్ సింధుశాఖాతీరములందు నష్ట మెక్కువ చేయుచుండును. ఈదేశపు వాయవ్యోత్తర ప్రాంతములందు మంచుతుపానులు, చలిగాలివానతుపానులు చెలరేగి సమస్త పదార్థములను మంచుతోఁ గప్పి చెట్లకు తీగెలకు నెక్కువ నష్టము కలుగఁజేయుచుండును.

జంతువులు, వనస్పతులు — కాలమానమందలి తాపపరిమాణభేదములనుబట్టియు, వందందుఁ గల్పించు జంతు, వనస్పతుల సమానతనుబట్టియు నీదేశ మేడుమండలములుగ (Zones) విభజింపఁబడి యున్నది. ఎట్లనఁగా ఆర్క్టిక్ మండలము (Arctic Zone), హడ్సన్ మండలము (Hudson Zone), కెనడా మండలము (Canada Zone), దశాపరివర్తనమండలము (Transition Zone), దక్షిణోర్ధ్వమండలము (Upper Austral Zone), దక్షిణాధోమండలము (Lower Austral Zone), అయనమండలము (Tropical Zone). ఇందు మొదటిమూఁటికి నుత్తరమునుండియు, ఆఖరుదానికి దక్షిణమునుండియు నీదేశమునఁ బ్రవేశము కలుగుచు మధ్యమందలిభాగ మంతయుఁ జాలవఱకు దశాపరివర్తనమండలమునకే చెందియున్నది. ఆర్క్టిక్ మండల లక్షణములు పర్వతాగ్రములందుఁ గాననగును. శ్వేతపర్వతములలోని వాషింగ్టన్ శిఖరమునను, రాకీ, నెవాడా, కాస్కేడ్ పర్వతోన్నత శిఖరములందును ఆర్క్టిక్ మండల లక్షణములు గలవు. ఈపర్వతాగ్రములందు గొప్ప గొప్ప వృక్షములు లేవు. న్యూయార్క్, న్యూ ఇంగ్లండ్, ఉత్తర కెరొలినా రాజ్యములలోని ఉన్నతపర్వతపార్శ్వములందును, రాకీ కాస్కేడుల యుపరిపార్శ్వములందును, హడ్సన్ మండల లక్షణములు గలవు. ఇందు కొండగొఱ్ఱెలు, కొండమేకలుమాత్రము గానవచ్చును. మెయిన్, న్యూ హాంప్‌షైర్, మిషిగన్, మిన్నెసోటా, ఉత్తర డకోటారాజ్యములలోని యుపరిపీఠములందును, షాస్త్, కాట్‌స్కిల్, అడిరండక్ పర్వతములందును, పెన్సిల్వనియా, ఉత్తరకెరొలినా మధ్యస్థ మహీధరాగ్రములందును, ఉత్తరరాకీ, కాస్కేడుల అనుపార్శ్వములందును, దక్షిణరాకీ, నెవాడాకొండల ఉన్నత భాగములందును, పసిఫిక్ తీరస్థ మెండోసినో అగ్రపర్యంత పార్శ్వములందును కెనడామండలలక్షణములు గలవు. వీనిలో సింగములు, మండ్లపందులు, ఎఱ్ఱనిఉడుతలు, కుందేళ్లు, శ్వేతకంఠచటకములు, అడవికోళ్లు, పాలపిట్టలు మొదలగు జంతువులు నివసించుచున్నవి. దశాపరివర్తనమండలమున ఉత్తరభాగముల కెక్కువదక్షిణమునను, దక్షిణభాగముల కెక్కువ ఉత్తరమునను గనుపడు జంతువులు కలిసిమెలసి యుండుట గానవచ్చును. ఊర్ధ్వదక్షిణ, అధోదక్షిణమండలములం దనేకములగు జంతుజాలములు నివసించుచున్నవి. అధోదక్షిణమండలమున [illegible] మండలాంతర్గతజంతువులు [illegible] లు గలవు. [illegible] త్రైంశత్ప్రకారములగు [illegible], [illegible], [illegible]

శేల్లు, ఎలుఁగులు, అడవిపక్కులు, మింక్సూను లను జంతువులు, సట్లికూటులు, ఆకాశవిహంగములు, మకరాదిజలచరములు పెక్కురకముల ప్రాణులును కలవు.

అచరములగు ఉద్భిజ్జములును పైని వచించిన వస్తువిధములుగనే కనుపడుచున్నవి. కాని యామెర్యుత్తరభాగమున తూర్పుగనున్న సంయుక్త రాజ్యములభాగమున సహజారణ్యములు కలవు. రాకీ, కాస్కేడ్, సైరానెవాడా పర్వతములలోని చాలభాగ మరణ్యమయము. కాని సమతలమండలములు, రాకీపర్వతపశ్చిమపరీవాహక్షేత్రములు, ఎడారులు, రాకీపర్వతపూర్వసమతలములు మొదలగువానియందు వనవృక్షములు లేవు కాని ఒకవిధమగు గడ్డి మొదలగువాని సేజ్ బ్రష్, నాగజెముడు మున్నగువానితోడను గల పొదలు కలవు. పూర్వమండలారణ్యములయందు, శాంతమహాసాగర(Pacific Ocean)తీరదేశపరివర్తనమందలి అరణ్యములయందు జాల వృక్షోత్పాదనము కలదు. పసిఫిక్ వైపునందలి యడవులు మిగుల దట్టములు. మరియు పూర్వాటవులు ఆకురాలు సారదారువృక్షములతోడను, పశ్చిమాటవులు సూచ్యాకారవృక్షములతోడను నిండియున్నవి.

ఈరాజ్యములలో ననేకవిధములగు దేశీయవృక్షములు, అనఁగా నాదేశమందే పుట్టినవి కలవు. ౧౯౩౪-వ సంవత్సరమున జె బి సడ్‌వర్త్ నామక వృక్షశాస్త్రజ్ఞుఁడు ౧,౧౪౪ భిన్నజాతుల వనవృక్షములను పేర్కొనియుండెను. ఇందు ౧౮౨ జాతు లార్థికముగ లాభించునవి. ఇచటనే పుట్టి పెరుఁగు పూలమొక్కలు ౧౩ వేలు మొదలు ౧౫ వేల రకముల వరకును గలవు. వీనికిఁదోడుగ సంయుక్తరాజ్యనివాసులు యూరోప్, ఆసియా, అమన - అమెరికాలనుండి వందలకొలఁది జాతులచెట్లు తెచ్చి స్వదేశమున నాఁటి దేశీయములుగ మార్చుకొనిరి. కాలిఫోర్నియాపుష్పవృక్షప్రమాణ్యయాల్ నామకపుస్తకమున ౪,౦౧౯ జాతులు పేర్కొనఁబడియున్నవి. ఇందు ౩,౪౩౪ రకములు దేశీయములు, ౫౮౫ విదేశానీతములు. గ్రే రచించిన బాటనీమాన్యుయలు నందు ౪,౭౨౫ జాతులు వర్ణింపఁబడినవి. ఇందు ౪,౧౪౯ జాతులు దేశీయములు, ౫౭౬ విదేశానీతములు.

కృషి, శిల్పము, వ్యాపారము — ఈదేశము స్వాతంత్ర్య మందుటకుఁ బూర్వ మాహారపదార్థములుమాత్రమే నుత్పత్తి యగుచుండెడివి. పేర్కొనఁదగు యోగ్యములగు శిల్పము లేవియు లేకుండెను. అదిగాక బ్రిటిష్‌వారు తాము నిర్మించుపదార్థము లన్నియు వస్తువులపోవుట కీదేశము మార్కెట్టుగ నుండుటకొరకుండిరి కాని యచట శిల్పము లను ముందునకుఁ దేవలయు నని తలంపరైరి. వీరు అమెరికాయందలి పదార్థముల నుత్పత్తియైనవాని నట్లే తెప్పించుకొని వానిని తమదేశమున రూపము మార్చునట్లు చేసి వానిని మరల పెక్కుధరలకు సంయుక్తరాజ్యముల కంటఁగట్టుచుండిరి. కాని స్వాతంత్ర్యము కలిగినపిదప నిచటికృషిశిల్పవాణిజ్యములందు విప్లవము పరివర్తనము కలిగెను. ౧౭౯౦ మొదలు ౧౮౬౫ వరకును గల కాలమున మధ్య మధ్య యుద్ధములు కలుగుచువచ్చినను, మొత్తముమీద నిచటి శిల్ప వాణిజ్యాదులు వృద్ధినందుచుఁబోయెను. అనంతరము ౧౮౬౦-వ సంవత్సరము వరకును మరింత యభివృద్ధి గాంచఁగల్గెను. ఈ సమయమున స్టీము మున్నగువాని యావిష్కారములవలన రైల్వేలును, కర్మాగారములును స్థాపింపఁబడుటచేతను కృషి, శిల్ప వ్యాపారము లమితముగఁ బెరిగిపోయెను. ౧౮౬౦ మొదలు ౧౮౯౯ వరకును గల కాలమున శిల్ప క్రాంతి కలిగెనని చెప్పవచ్చును. ౧౮౯౯ యగునప్పటికి ప్రపంచమందలి యన్ని దేశములకంటె నమెరికా అగ్రస్థానమును వహింపఁగల్గెను. విదేశములనుండి దిగుమతియగు వస్తువులపైని భారమైన సుంకములు వేయఁగలిగినందున స్వదేశశిల్పము లమితముగ పెరిగిపోయెను. ౧౮౯౯ తరువాత శిల్పవాణిజ్యాదుల యభివృద్ధి [illegible]ముగ ముందునకుఁ బోయెననిన నతిశయోక్తి కాదు. ౧౮౯౯-వ సంవత్సరమున ౨౯౦ కోట్లపదార్థములు తయారుకాఁగా ౧౯౧౨-నాటికి ౯౯౦ కోట్లవి తయారయ్యెను. వస్త్రములు, ఇనుము, ఉక్కు, కలప, చర్మము, రబ్బరు, కాగితము, ముద్రణము, రసాయనములు, రాగి, గాజు, మట్టితోచేసినవస్తువులు, ధాతువులు, పొగాకు, యంత్రములు, గానసాధనములు, గ్రామఫోనులు, జల, భూ, వాయు యానములు మొదలగువానినుండి ౧౯౧౪ - వ సంవత్సరమున ౯౭౫ కోట్ల, ౩౦ లక్షల విలువగలవి తయారుకాఁగా ౧౯౨౫- నాటికి ౬౨౪ కోట్ల, ౬౦ లక్షలవి తయారయ్యెను. జర్మనీయుద్ధకాలమున నిచటి శిల్పపరిశ్రమ లపరిమితముగఁ బెరిగిపోయెను. ఈయభివృద్ధికి ముఖ్యకారణము సమస్తపదార్థముల నుత్పత్తిచేసి వినియోగించుట కావలసిన యుపాయము లతిశ్రద్ధతో పరిశీలనపూర్వకముగ విచారింపఁబడుచువచ్చినవి. దీనిఫలితముగ ఆవిష్కరణ, సాధన పరిశ్రమలందు పొదుపరితనము కలిగెను. నియతపరిష్కృతమార్గమున విస్తృతవిభేదము లందు పదార్థనిర్మాణము సాగెను. ఇందువలన ఆర్థికముగ పెక్కువగ లాభము కలిగెను. ౧౯౨౫- నాటికి ౧౦,౬౦౦ ల శిల్పసంస్థ (Manufacturing institutions) లేర్పడెను. జర్మనీయుద్ధకాలమున అమెరికనుల పరిశోధనము (Research) వలనఁగలుగు లాభమును బాగుగ గుర్తించిరి. తత్ఫలితముగ ౧౯౨౪- నాటికి పెద్దశిల్ప పరిశోధనశాల లేర్పడెను. పరిశోధనము లేనిశిల్ప మొకటియైన నిపుడు లేదు. ఇతరదేశము లన్నింటికంటె నమెరికాలో కార్మికులకు వేతన మెక్కువ. ఇది యుత్తమపదార్థనిర్మాణమునకు కారణ మయ్యెను.

నిర్మితానిర్మితములను రెండువిధములపదార్థములను ఈదేశమునుండి యెగుమతియు దిగుమతియు నగుచుండును. కాని నిర్మితపదార్థముల యెగుమతి క్రమముగఁ బెరిగిపోవుచున్నది. ౧౯౧౩-వ సంవత్సరమున ౩౧.౯% వంతున నెగుమతి యైయుండి ౧౯౨౫ నాటికి ౪౪.౯% వరకును పెరిఁగెను. దిగుమతులందు అనిర్మితపదార్థములే యెక్కువ కానఁబడుచున్నవి. స్వాతంత్ర్యము లేనిదినములలో పొగాకు, ఛర్, నీలి, వడ్లు, నాణోపకరణములు మున్నగువానిని యూరోపునకును, చేపలు, కలప, ధాన్యాదులు, వైనవస్తువుల పశ్చిమహిందూద్వీపములకును బంపుచువచ్చిరి. గ్రేటుబ్రిటనునుండి

నిర్మితవస్తువులను, పశ్చిమహిందూదీవులనుండి కావిపలు, పంచదార, బంగారము దిగుమతి యగుచుండెడివి. స్వాతంత్ర్యము కలిగినపిదప ౧౭౯౦ మొదలుకొని ౧౮౧౦ వఱకు యూరోపునందు యుద్ధములు జరుగుచుండుటవలన నావికాబలముగల అమెరికనులు స్వదేశమున వస్తువుల నుత్పత్తిచేసి వాని నెగుమతి చేయుటకు బదులు ఇతరదేశములనుండి ప్రోగుచేసి పంపుచుండిరి. ౧౮౧౨-వ సంవత్సరమున నిందువలనఁ గలుగుచోని చిక్కి బాగుగ అనగత మయ్యెను. అది మొదలు ఐరోపావస్తువులను దెప్పించి పంపుట మాని దేశీయోత్పత్తుల నభివృద్ధికొంపింపసాగిరి. అప్పటినుండి దేశీయవ్యాపారమునకు లాభము కలుగసాగెను. ఇందులకు మిసిసిప్పినదీమార్గమును, వ్యవసాయపుటుత్పత్తుల కాపాంక్షయును, ధూమశకటముల గమనాగమనములును, బంగారముయొక్క ఆవిష్కరణమును, యూరోపుల దిగుమతుల పైని పన్నులు దీసివేయుటయు, ఇతరదేశములతోఁ గుదిరిన పరస్పరవినిమయపు సంధియు బాగుగఁ దోడ్పడెను. దక్షిణరాజ్యములనుండి ప్రత్తి, పొగాకు ఎగుమతి యగుచుండ ఉత్తరమునుండి నిర్మితపదార్థముల నిర్యాత మెక్కువయయ్యెను. ౧౮౬౦-వ సంవత్సరమువఱకును వ్యాపారమును దానివలనిలాభమును దినదినాభివృద్ధి నందుచుండెను. కాని యంతఃకలహము (Civil war) వలన దీనికి చాల క్షతి కలిగెను. వదేండ్లు గడచినపిదప వాణిజ్యము లోపములేక మరల నభివృద్ధి కొందసాగెను, అనఁగా ౧౮౬౦ మొదలు ౧౯౦౦ ల వఱకును వ్యాపార మినుమడించుచుండెను. ౧౯౧౪ వ ఎగుమతులు ౨౩౦ కోట్ల డాలర్లనుండి ౧౯౧౯ నాటికి ౮౦౦ కోట్లకు పెరిఁగెను. ఇదే విధముగ దిగుమతులును అభివృద్ధి కొందినవి. జర్మనీయుద్ధాంతమున నీలెక్కలు కొంచెము తగ్గిపోయెను కాని ౧౯౨౦ నుంచి మరల వృద్ధి నందుచుండెను. ౧౯౨౦ లో ౨౪౦ కోట్ల డాలర్లనుండి ౧౯౨౯ లో ౫౦౦ కోట్లవఱకు నెగుమతులును, ౧౫౦ కోట్లనుండి ౪౫౦ కోట్లవఱకును దిగుమతులును వృద్ధికొందినవి. ప్రత్తి, పెట్రోలియము, యంత్రములు, స్వయంయానములు, గోధుమలు, మాంసము, క్రొవ్వు, మూగె, నూనెరతైలము, ఇనుము, ఉక్కుపనిముట్లు, రాగిపనిముట్లు, పొగాకు, వస్త్రములు, ఫలములు, కాయధాన్యములు, పలకలు, కలప, ఇనుముతోను ఉక్కుతోను చేసినపరిష్కృతసాధనములు, రసాయనములు, చర్మములు, రైధాన్యము, బార్లీ, కొయ్యసామానులు, ఫర్ సామానులు, తెలకపిండి, కాగితములు, గ్రంథములు, ముద్రితములు, రంగులు, వార్నిషులు, ఫోటోగ్రాఫ్ సామానులు, చర్మపుసామానులు, చేపలు, వ్యవసాయపుపనిముట్లు మొదలగునవి విదేశముల కెగుమతి యగుచుండును.

పట్టు, రబ్బరు, కాఫీ, జనుము, కాగితములు, ఫర్, పెట్రోలియము, చర్మములు, తగరము, రాగి, ఫలములు, కాయధాన్యములు, ఉన్ని, ఉన్నివస్త్రములు, కాయతైలములు, పొగాకు, ప్రత్తిగుడ్డలు, నూనెగింజలు, వారగింజలు, పలకలు, కొయ్యగడ్డలు, కలపవస్తువులు, ఎరువులు, రసాయనములు, ఓడలు (Coal tar), కోకో, వస్త్రములు, నారగుడ్డలు, పట్టుగుడ్డలు, కాగితములు, తేయాకు మొదలగునవి ఇతరదేశములనుండి ఇచటికి దిగుమతి యగుచుండును.

జర్మనీయుద్ధమునకుఁ బూర్వము దిదటితేయుమగుమతులు యూరోపునకే కొన్ని దేశములకుమాత్రమే పోవుచుండెడివి. కాని యుద్ధానంతర మెక్కువదేశముల కేఁగుచుండినట్లు తెలియుచున్నది. అదివఱకు యూరోపునకు ౬౫% వంతులమెగుమతులు పోవుచుండెను. యుద్ధానంతరము ౧౯౨౯ నాటికి ౪౫% వంతుకే పోవుచుండెను. మెక్సికో, దక్షిణ-అమెరికాలకుఁ బూర్వము ౧౪% లు ఇపుడు ౧౯% వంతులు; దూరప్రాక్సీమ (Far East) లకు ౯% లకు బదులు ఇపుడు ౧౬% లు పోవుచున్నవి. ఇదే ప్రకారము దిగుమతులందును మార్పు కలిగినది. యూరోపునుండి వచ్చు ౫౦% లు ఇప్పుడు ౩౦% లకే దిగినవి. దక్షిణ అమెరికానుండి దిగుమతులలెక్క యథాపూర్వముగనే యున్నది. కాని దూరప్రాక్సీమలనుండి దిగుమతు లధికముగఁ బెరిఁగినవి. విదేశవ్యాపార మింత మిక్కుటముగ నభివృద్ధి గాంచినప్పటికిని స్వదేశమున జరుగు వ్యాపారములో "ది చిన్నవవంతే" నని చెప్పవచ్చును. ఒక్కడాలరుసామాను పరదేశములకుఁ బోయిన ౧౦ డాలరుల సామాను స్వదేశమున ఖర్చగుచుండెడిది. సమస్తప్రపంచముతోఁ జేయు వ్యాపారమునకంటె దేశమునందు జరుగువ్యాపార మెక్కువగ నుండెను. రాకపోకల కనువగు మార్గములు, రోడ్లు, రైళ్లు, జలమార్గములు, యానములు, శీఘ్రముగ నుత్తరప్రత్యుత్తరముల నంపుకొనుట కనువగు సాధనములు, జాతీయాదాయము (National profit), అత్యుత్తమమగు ఆర్థికపద్ధతి మొదలగునవి దేశమందలివ్యాపారమును మితిమీఱునట్లు చేయుటకు సాయపడినవి. ౧౯౨౩-వ సంవత్సరమునాటికి సంయుక్తరాజ్యములందు ౨,౪౯,౦౦౦ ల మైళ్ల ఇనుపదారులును, ౨,౩౬౦ మైళ్ల పరోపరమార్గములను గాక ౨౩,౪౬౦ మైళ్ల నౌయానయోగ్యమార్గములును, ౨౯,౮౯,౦౦౦ ల మైళ్ల రోడ్లును, ౨౦ లక్షలకు మించిన వాహనములును, ౫౬౦ లక్షలకు మించిన టెలిఫోను తీగెలును, ౧౭౦ లక్షల టెలిఫోనులును వాడుకయం దుండినవి. ఆసంవత్సరమున జాతీయాదాయము ౯,౦౦౦ ల కోట్ల డాలరులై యుండెను.

మొట్టమొదట పరదేశవ్యాపారము విదేశనౌకలద్వారా కావించఁబడుచు వచ్చినది కాని తరువాత క్రమముగ సంయుక్తరాజ్యములకు సొంతనౌక లేర్పడెను. ౧,౫౪,౬౨,౯౬౩ టన్నుల భారము గల ౨౩,౩౫౮ నౌక లుండెను (౧౯౨౨). వానిలో ౧,౫౯,౭౨,౧౦౦ టన్నుల భారము గలవి ౧౭,౯౬౦ స్టీమరులు. అట్లాంటిక్ రేవులం దెక్కుడు నౌకలు రాకపోకలు సల్పుచుండును. న్యూయార్కు, బోస్టన్, ఫిలడెల్ఫియా, బాల్టిమోర్, న్యూఆర్లియన్స్, న్యూపోర్ట్, విల్మింగ్టన్, సవన్నా, పెన్సకోలా, మొబైల్, గల్వెస్టన్, శాన్‌ఫ్రాన్సిస్కో, పోర్ట్‌లాండ్, డెట్రాయిట్, డులుత్, టొలీడో, చికాగో, బఫెలో నామకనగరములు ముఖ్యమైన రేవుపట్టణములు. వీనిలో గల్వెస్టన్, న్యూఆర్లియన్స్, సవన్నా, న్యూయార్కు

రేవులనుండి ప్రత్తియు, గల్వెస్టను, న్యూ ఆర్లియన్సు, న్యూయార్కు, బాల్టిమోర్, సుపీరియరులనుండి గోదుమలును, న్యూయార్కు, బాల్టిమోరులనుండి గోదుమపిండియు, న్యూయార్కు, బోస్టనులనుండి నానావిధ యంత్రసామగ్రులును, న్యూయార్కు, ఫిలడల్ఫియాల నుండి పెట్రోలియమునూనె, న్యూయార్కు, బోస్టను, బాల్టిమోర్, ఫిల డల్ఫియాలనుండి పశువులును, న్యూఆర్లియన్సునుండి పొగాకును అపరిమితముగ విదేశములకుఁ బోవుచుండును

మీఁద వచించిన వస్తువుల శిల్ప, వాణిజ్యాభివృద్ధి కొంత వింతసంపత్తి ఈదేశమునకుఁ గలుగుటకు కారణ మిచటి ఖనిజ సామర్థ్య మని చెప్పవచ్చును శిల్పవ్యాపారాదులయభివృద్ధితో పాటు బొగ్గు, పెట్రోలియము, ఇనుము, రాగి మొదలగు ఖనిజములయుత్పత్తియు వమిత ముగఁ బెంపొందెను ఇనుము ముఖ్యముగ సుపీరియర్ సరఃప్రాంతముల నుండియు, అప్లాచియను పరిసరముల నుండియుఁ దీయఁబడుచున్నది పెన్సిల్వేనియా, పశ్చిమవర్జీనియా, ఇల్లినాయిస్, కెంటకీ, ఓహియో, ఇండియానా, అలబామారాజ్యములందు బొగ్గుగను లెక్కువగఁ గలవు ఇవిగాక మఱి యితరరాజ్యములలోఁగూడ బొగ్గు దొరకును అప్లాచియన్ పీఠములు, ఒంకిహోమా, ఇల్లినాయిస్, మధ్యరాజ్యములు, మెక్సికోసింధుశాఖాతీరము, రాకీపర్వతములు, కాలిఫోర్నియా మొద లగు ప్రదేశములందు పెట్రోలియము గలదు అరిజోనా, మోంటానా ఉటాహ్ రాజ్యములందు రాగిగను లున్నవి సీసము మిసౌరీ, ఇడా హోలం దెక్కువగను, మరికొన్ని రాజ్యములందు స్వల్పముగను దొరకు చుండును ౧౯౪౮-౯ సంవత్సరమున ప్రపంచ మంతటి ఉత్పత్తినాగ ములో సగముభాగము సంయుక్తరాజ్యములనుండి లభించెను అల్యూ మినము ధాతువునకు మూలపదార్థము బాక్సైటు నామక ఖనిజము అర్కాన్సస్, జార్జియా, టెన్నెస్సీ, అలబామారాజ్యములందు దొరకును గంధకము, పాదరసము, స్ఫురితపాషాణము (Phosphate rock) గాసొలినుకు మూల మగు నైసర్గికవుగాస్ (Natural Gas), నల్ల రాయి, పాలరాయి, ఉప్పు, అంజనము, ప్లాటినం, నికల్, కోబాల్టు, మాంగనీస్, జిప్సమ్, వలిగారము, అభ్రకము, ఫెల్‌స్పార్, గ్రాఫైట్, ఫ్లోర్‌స్పార్, ఆర్సెనిక్, క్వార్ట్‌జ్, బారైటెస్, బ్రోమిన్, బిస్మత్, సెలినియం, టెల్లూరియం, తగరము, వనదియం, టిటనియం, మొలిబ్డినం, యురేనియం, టంటలం, టంగ్‌స్టెన్, వెండి, బంగారము, ఇంకను పెక్కురకముల ఖనిజములు ఈదేశమునందుండి లభించుచున్నవి ఈరత్నగర్భ నవవిధములకే కాక ౧౨ ప్రకారము లగు రత్నముల నీయుచున్నది

ఎత్తులు, కొలతలు, నాణెములు — గ్రేటుబ్రిటనునందు ఉప యోగింపఁబడుచున్న ఎత్తులు, కొలతలే ఈదేశమునను వాడఁబడుచున్నవి కాని ఇంపీరియల్ గాలన్, ఇంపీరియల్ బుషెల్‌కు బదులుగ ప్రాంత విన్‌చెస్టర్ కొలత లిచట వాడుకలో నున్నవి నాణెములు డాలర్లనియు సెంటులనియుఁ బిలువఁబడుచున్నవి. బంగారము గృధ్రచిత్రముతో నాణెముల క్రింద మారుచున్నది వెండితో డాలర్లును సిద్ధమగు చుండును నూఱుసెంట్ల విలువగల డాలర్లు ౪శి ౩౨ పెన్నీలవిలువ కలిగియుండును ౫ సెంట్ల నికెలునాణెములును, ఒకసెంటు విలువ గల కంచునాణెములును గలవు కాలము (Time) తెలిసికొనుట కీదేశ మంతయుఁ దూర్పునుండి పడమటికిఁ గొన్ని మండలములు (Zones) గ విభాగింపఁబడియున్నది ఇందు తూర్పునందలి యొక మండలమునందలి కాలమునకంటె దానిపశ్చిమమండలమునందలి కాల మొక గంట ఆలస్యముగ నుండును ఈమండలములకు వానివాని ప్రత్యేక కాలములు గలవు, ఎట్లనఁగా పౌర్వకాలము (Eastern time) న్యూయార్కు, వాషింగ్టన్ నగరప్రాంతములందు వాడుకలో నున్నది ఇది గ్రీనిచ్చికాలమునకంటె ౫ గంటలు వెనుకగ నుండును చికాగో, సెంట్‌లూయీ పట్టణముల ప్రాంతమున మధ్యకాలమును (Central time), డెన్వర్ మండలమునందు పర్వతకాలమును (Mountain time), సాన్‌ఫ్రాన్సిస్కో ప్రాంతములందు పసిఫిక్ కాలమును (Pacific time) వాడుకయందున్న ।

జనులు, మతములు, వృత్తులు, విద్య, సంస్కృతి — అమెరికను లకు స్వాతంత్ర్యము లభించినసమయమున ఉత్తరమున సుపీరియ రాదిసరస్సులును, పడమట మిసిసిప్పీనదియు, దక్షిణమున సింధు శాఖయుఁ, దూర్పున అట్లాంటిక్ మహాసాగరమును గల ప్రదేశ మంతయు లభించినప్పటికిని ముఖ్యముగ వీరు తీరములోనే యాత్ర యింపుకొనియుండిరి వ్యవసాయము మొదలగు కార్యములకై తీరమునుండి పడమటగ సగటున ౨౫౦ మైళ్ల దూరమువఱకు నాక్ర మింపఁబడి యుండెను కాని ఇంకను పశ్చిమప్రదేశము నాక్రమిం చుట అప్పుడే యారంభమై యుండెను మోహాక్, పొటోమాక్, అప్లాచియను లోయలగుండ పర్వతములనుదాటి పడమటికిఁ బోయి అమెరికనులు నివాసములను ఏర్పఱచుకొనసాగిరి.

ఇట్లు ౧౭౯౦ నాటికి ౮,౬౭,౯౮౦ చదరపుమైళ్ల దేశమున ౩౯,౨౯,౨౧౪ మంది మాత్రము వాసము చేయుచుండిరి ౧౯౨౦-వ సంవత్సరము నాటికి ౨౯,౭౩,౭౭౬ చదరపుమైళ్ల దేశ మమెరికనుల యధీనమునకు రాఁగా జనసంఖ్య ౧౦,౫౭,౧౦,౬౨౦ మందికిఁ జేరి గినది ౧౯౫౦-వ సంవత్సరపు లెక్కల ననుసరించి యిచట ౧౫ కోట్ల, ౧౩ వేల జను లుండిరి ౧౮౦౦ల ప్రాంతమున యూరోపునందలి ముఖ్యదేశములలో ప్రతిదానియందును అమెరికాలోకంటె ఎక్కువ జను లుండిరి కాని ౧౯౨౫-వ సంవత్సర మునుపటికి జనసంఖ్యయందు యూరోపులో దీనిని మించినదేశము రష్యా ఒక్కటియే నిలిచెను. విదేశములనుండి వచ్చి యిచ్చట వసింపఁగడఁగినవారిలో నానాజాతుల వారు నుండిరి ౧౭౯౦ జనాభాలెక్కల ననుసరించి శ్వేతజనసంఖ్య యందు నూటికి ౯౦ మందికంటె ఎక్కువ బ్రిటిషుదీవులవారు అందు ౭౦ కంటె ఎక్కువ కేవల మాంగ్లేయులే యుండిరి నూటికి ౬ మంది చొప్పున జర్మను లుండిరి ౧౮౪౦ మొదలు ఐరిషువారు వచ్చి వసింపసాగిరి. క్రమముగ డచ్, ఫ్రెంచి, స్వీడ్, నార్వీజియను,

స్విస్ జాతులవా రధికులైరి ౧౮౯౦ మొదలు ఇటాలియన్, రషియన్, పోల్, ఆస్ట్రియన్, బొహీమియన్, హంగేరియన్ జాతులవా రపరిమితముగఁ బెరిగిపోయిరి ౧౯౨౦ నాటికి జర్మనీ, రష్యా, ఇటలీ, ఆస్ట్రియా, హంగేరీ, పోలెండ్, కెనడా, ఐర్లాండులు జనసంఖ్యయందు క్రమప్రాధాన్యము గలిగియుండెను ౧౯౧౦-౨౦ మధ్యకాలమున నిచట ఇంగ్లీష్, స్కాచ్, వెల్ష్, ఐరిష్, నార్వీజియన్, స్వీడ్, స్విస్, జర్మనుజాతుల తగ్గిపోగ డేన్, డచ్, బెల్జియన్, ఫ్రెంచ్, ఆస్ట్రియన్, హంగేరియన్, పోల్, రషియన్, ఫిన్, రుమేనియన్, బల్గేరియన్, గ్రీక్, ఇటాలియన్, స్పానిష్, పోర్చుగీస్ మొదలగు జాతులవారు పెరిగిపోయిరి కెనడియనులు తగ్గిపోగ మెక్సికన్, ఆసియాఖండ వాసులు పెరిగిపోయిరి మరియు ౧౯౨౦ నాటికి ౬౧,౬౩౯ చైనీయులును, ౧,౧౧,౦౧౦ జపానీయులును, ౧,౦౪,౬౩,౧౩౧ నీగ్రోలును, ౨,౪౪,౪౩౭ మంది అమెరికన్-ఇండియనులు నుండిరి

పసిఫిక్ మహాసాగరముపర్యంతము వ్యాపించిన యనంతరము వసించుటకు క్రొత్తచోటులు లేనందున విదేశీయాగమనము వర్ధిల్లుచుండుట కాందోళనము మొదలయ్యెను కుదురు యూరోపువంగు మహాసంగ్రామ మైనతరువాతను తదాఘాతపీడితులగు యూరోపువారందఱు నసంఖ్యాకులుగ వచ్చి చేరుదురని తోఁచుటచేతను ౧౯౨౪-వ సంవత్సరమున విదేశీయానిరోధచట్టము చేసి విదేశాగతుల సంఖ్యను పరిమితి కావింపఁబడెను అటుపిమ్మట విదేశీయాగమనము క్రమముగఁ దగ్గిపోయినది.

౧౯౨౮-వ సంవత్సరము జూలైమాసమునాటికి సంయుక్తరాజ్యములందు లక్షకంటె నెక్కువజనసంఖ్య గల పట్టణములు ౮౩ కలవు నర్యోక్తి పైని వచించిన జనసంఖ్యయందు నూటికి ౫౧ వంతులు పురుషులును, ౪౯ వంతులు స్త్రీలును నుండిరి కాని పూర్వోత్తర ప్రదేశములందు పురుషులకంటె స్త్రీలెక్కువ ౧౯౨౦ నాటికి ౧౫ సంవత్సరములు దాటినస్త్రీలలో నూటికి ౩౫.౧ అవివాహితలు, ౫౯.౨ వివాహితలు, ౪.౮ విధవలు ౦.౫ పరిత్యక్తలు, ౦.౪ అజ్ఞాతలు పురుషులలో ౨౭.౩ అవివాహితులు, ౬౦.౬ వివాహితులు, ౧౧.౧ విధురులు, ౦.౮ పరిత్యక్తులు

౧౯౨౦ లో పదేండ్లయీడున విద్యగానివారు నూటికి ౬.౦ చొప్పున నుండిరి ఈవిద్యాహీనతయు నీగ్రోలవలనను, విదేశాగతుల వలనను గలిగినదే కాని తెలుపువారు జాతినిబట్టి చూచినచో విద్యావిహీనులు నీగ్రోలు కెక్కువ స్త్రీలలో విద్యాహీనలు కేవలము నూటికి ౫.౯ వంతున మాత్ర ముండిరి

౧౯౨౬-వ సంవత్సరమున నిచట ౨౧౩ భిన్నములగు మతసంప్రదాయములును, వానికి సంబంధించి ౨,౩౧,౯౮౩ సంస్థలును నుండెను. వీనియందు ౫,౪౬,౨౪,౯౪౬ మంది సభ్యు లుండిరి, అనగా మొత్తపుజనసంఖ్యలో నూటికి ౫౧ మంది ఏదోయొక మతసంప్రదాయమునకుఁ జెందియుండిరి ౭,౫౦,౦౦,౦౦౦ అన్ సైగా ప్రొటెస్టెంట్ క్రైస్తవులు దేశము నంతటను వ్యాపించి యున్నారు తరువాతి ౧,౮౦,౦౦,౦౦౦ ల రోమనుకాథలిక్కులలో నధికసంఖ్యాకు లుత్తరపశ్చిమరాజ్యములందు వసించుచుందురు. వీరికిఁ దోడుగ ౧౬,౦౦,౦౦౦ల యూదులును, ౬,౦౦,౦౦౦ మార్మనులును, ౪,౦౦,౦౦౦ పౌర్వమత సంప్రదాయులును గలరు ౧౯౨౬-వ సంవత్సరమునకు నీసంస్థలన్నింటికిని వార్షికముగ ౮౧ కోట్ల, ౪౩ లక్షల ౭౧,౫౯౯ డాలర్ల వ్యయ మయ్యెను ఈ మతసంస్థల కన్నింటికిని ౩౮౪ కోట్ల ౨౫,౭౭,౩౧౩ డాలర్ల విలువగల ఆస్తి కలదు

వృత్తులు — పదియేండ్లకుమించినవారు మొత్తపుజనసంఖ్యలో ౪,౧౬,౧౪,౨౪౮ మంది లాభదాయకములగు వృత్తుల నవలంబించి యున్నారు శిల్పములు, యంత్రములు, కృషి, అరణ్యశాస్త్రము, పశుపాలనము, వ్యాపారము, గృహోద్యోగము, పాదిరిగుడి సంస్థలు, (Churches), ఎగుమతి-దిగుమతుల కార్యములు, గనులు, ప్రభుత్వోద్యోగములు మున్నగువానికిఁ జెందినవే ఇచటివృత్తులు స్త్రీలు ముఖ్యముగ అధ్యాపనము, అంగడులందు పదార్థవిక్రయము, ఔషధాలయాదులందు ధాత్రీత్వము మొదలగు కార్యములందును కొలదిగ శిల్పములందును బని చేయుచుందురు

౧౭౯౦ నాటి కీదేశపు సంపత్తి ౬౫ కోట్ల డాలర్లు మాత్ర ముండెను కాని ౧౯౨౨ నాటికి ౩౨౦౮౦,౪౦,౦౦,౦౦౦ కలుగుచు పెరిగిపోయెను

దేశరక్షణము - సేన — సంయుక్తరాజ్యముల బాహ్యాభ్యంతర సంరక్షణమునకై యేర్పడినసేన స్థలసేన (Army), నావికా(Navy), సాగరికదళము (Marine Crops) లని మూఁడు విధములు ఇందు స్థలసైన్యమున నిలుకడగను న్నెల్లప్పుడు నుండు క్రమశిక్షితులందు (Regular Forces) ఆఫీసరులును సైనికులు నందఱును గలసి ౧,౨౫,౦౦౦ మంది ౧౯౨౮ నాటి కుండిరి తక్కిన రెండు విభాగములందును ౧౯౨౯ నాటికి ౧,౧౨,౦౦౦ మంది యుండిరి జెనీవాసంధి ననుసరించి పరిమితములైన యుద్ధనౌకలు ౨౨ ను, పరిమితము గానివి ౪౬౫ ను గలవు. వీనిలో క్రూయిజర్లు మున్నగునవి కలసి యున్నవి ఇవికాక సహాయకనౌకలును కెక్కువ గలవు ఈమూఁడు విధములగు సేనలకును సాహాయ్యపడుటకు ప్రత్యేకముగ వాయుసేనలు గలవు స్థలసైన్యమునకుఁ జెందిన వాయుదళవిభాగము స్థలసేనానాయకుని యాజ్ఞానుసారము పనిసేయుచుండును ఇటులే తక్కిన రెండు విమానసేనలును వానియధికారుల యుత్తరువులప్రకార మాయాసేనల నంటిపెట్టుకొని యుండును.

వ్యవస్థ - ప్రభుత్వము — స్వాతంత్ర్యయుద్ధమునందు గెలుపొందినపిమ్మట ౧౭౮౧-వ సంవత్సరమున నీదేశము దనకుండవలసిన సంయోజననియమములు (Rules of Confederation) ప్రకారము

కేంద్రప్రభుత్వమునకు (Central Government) రాజ్యముల మీఁదనుగాని, తిన్నగ ప్రజలమీఁదనుగాని ఏవిధమైన యధికారమును లేకుండెను. ఇట్టివిధానమును మార్చి కేంద్రప్రభుత్వమును దృఢపఱచి దానికి రాజ్యముల మీఁదను, జనులమీఁదను కొన్నియధికారము లొసంగుటకు ౧౭౮౭ వ సం॥ దేశీయజాతీయవ్యవస్థ (National Constitution) ఏర్పడి ౧౭౮౯-వ సంవత్సరమున నమలులోనికి వచ్చెను. ఈనూతనవ్యవస్థానుసారము ౧౭౮౯ లో సమకూడిన మొదటి కాంగ్రెసునందు ౧౧ రాజ్యముల ప్రతినిధులు సమావేశమైరి. పిదప రోడ్‌దీవి, ఉత్తరకెరొలీనాలు కలసి ౧౩ రాజ్యము లయ్యెను. అవి యిప్పుడు పశ్చిమమున పసిఫిక్ మహాసాగరముపర్యంతము వ్యాపించి ౪౮ రాజ్యములుగఁ బరిణమించియున్నవి.

రాజ్యములలోని వానివానివ్యవస్థలును, శాసనవిధానములును పరస్పరసాదృశ్యము కలిగి ఇంచుమించుగ సమానముగనే యుండును. ప్రతిరాజ్యమును దాని కది స్వతంత్రము. ప్రతిరాజ్యమును స్వకీయ వ్యవస్థాపక, శాసనసభలమూలమున దానివ్యాపారముల నన్నింటిని జరపుకొనుచుండును. ప్రతిరాజ్యప్రశాసనాధికారము దానిగవర్నరునందుండును. ఈరాజ్యము లన్నింటిమీఁద నొక్కటే యున్నత వ్యవస్థాపకసభ కలదు. అదియే కాంగ్రెసు. ఇందు సెనేటుసభయు, ప్రతినిధిసభయు (House of Representatives) నుండును. సెనేటుసభయందు ప్రతిరాజ్యమందలి వ్యవస్థాపకసభద్వారా ఆఱు సంవత్సరములకాలమునకుఁగాను ఎన్నుకొనఁబడిన యిద్దఱు సభ్యులుందురు. సెనేటునందలి మొత్తపుసభ్యులలో మూఁడవవంతుసభ్యులు రెండుసంవత్సరముల కొకపర్యాయము మారి క్రొత్తవారు వచ్చుచుందురు. ప్రతినిధిసభయందలిసభ్యు లందఱును వేఱువేఱురాజ్యముల లోని ప్రజలచే రెండుసంవత్సరముల కాలమునకుఁగాను ఎన్నుకొనఁబడి వచ్చుచుందురు. ప్రతిపదియవయేటను జరుగు జనాభాప్రకారము ఆయారాజ్యముల ప్రజాసంఖ్య ననుసరించి ప్రతినిధిసభాసభ్యుల సంఖ్యయందును హెచ్చుతగ్గులు కలుగుచుండును. ప్రస్తుత మీ సభయందు ౪౩౫ గురు ప్రతినిధులు కలరు. ప్రతి సెనేటరుయొక్కయు, ప్రతినిధియొక్కయు సాంవత్సరికవేతనము ప్రయాణపు ఖర్చులతోఁ గలిసి ౭,౫౦౦ ల డాలర్లు. కాంగ్రెసు కనీసము సంవత్సరమున కొకపర్యాయము సమావేశమగుచుండును. పన్నుల విధించుట, సంయుక్త రాజ్యముల రక్షణము, సార్వజనిక సౌఖ్యమున కేర్పాట్లు చేయుట, వాణిజ్యాంతరవ్యాపారము నుచితరీతిని నడపుట, నాణెముల ముద్రించుట, యుద్ధప్రకటన మొనరించుట, జలస్థలసేనల నిర్మించుట మున్నగు సార్వభౌమాధికారము లన్నియు నీ కాంగ్రెసునకుఁ గలవు. ఈ యన్నింటి శాసనాధికారమును నాలుగుసంవత్సరముల కాలమునకుఁగాను ఎన్నుకొనఁబడు అధ్యక్షుని (President) యధీనము నుండును. అధ్యక్షుఁడు మరలమరల నెన్నుకొనఁబడవచ్చును గాని ప్రథమాధ్యక్షుఁడగు జార్జి వాషింగ్టన్ రెండుపర్యాయములే ఆ పదవిని స్వీకరించి యుండుటచే నదే యాచారముగా జరుగుచున్నది. అధ్యక్షుని నెన్నుకొను వర్గమువారు 'ఎలెక్టొరల్ కాలేజ్' అను పేరఁ బరఁగుచుండును. ఈకాలేజిసభ్యులు ప్రతిరాజ్యమునందలి వ్యవస్థాపకసభల ద్వారా జనులచే నేర్పఱుపఁబడియుందురు. ఎక్కువవోట్లు వచ్చినయతఁ డధ్యక్షుఁడుగను, ద్వితీయుఁడుగ వచ్చిన యతఁ డుపాధ్యక్షుఁడుగను నేర్పడుచుందురు. ఎన్నిక లిరువురు వ్యక్తులకును సరిసమానముగ వచ్చిన యెడల ప్రతినిధిసభాసభ్యు లధ్యక్షుని, సెనేటుసభ్యు లుపాధ్యక్షుని నెన్నుకొనుచుందురు. అధ్యక్షుఁడు సంయుక్తరాజ్యములందు జన్మించినవాఁడై యుండవలెను. ఇతనికి సంవత్సరమునకు ౭౫,౦౦౦ ల డాలర్లు జీతముగను, ౨౫,౦౦౦లు ప్రయాణపు ఖర్చుల కనియు ముట్టుచుండును. సెనేటునందలి మూఁడింట రెండువంతులసభ్యులయంగీకారము నపేక్షించి అధ్యక్షునకు సంధి గావించుటకును, లౌకిక (Civil), సైనిక (Military) అధికారుల నేర్పఱుచుటకును, యుద్ధము చేయుంచుటకును, ఆఁపుటకును అధికారము గలదు. కాంగ్రెసు చేయుచట్టముల నిషేధించుటకును నితని కధికార మున్నది కాని రెండుసభలలోని మూఁడింట రెండువంతులసభ్యు లాచట్టమును నిర్మించినయెడల నధ్యక్షునకు దానిని దీసివేయు నధికారము లేదు. ఉపాధ్యక్షుని వేతనము ౧౨,౦౦౦ ల డాలర్లు. ఉపాధ్యక్షుఁడు సెనేటుసభ కగ్రాసనాధిపతిగ నుండును. ఆకస్మికముగ అధ్యక్షుఁడు మరణించినఁగాని, లేక దీర్ఘకాలమువఱకును స్వకర్తవ్యపాలనాసమర్థుఁడైనఁగాని, అతనిస్థానమున నుపాధ్యక్షుఁడు పనిచేయుచుండును. అధ్యక్షుఁడు జాతీయ శాసనపరిపాలనమును దా నేర్పఱుచుకొనునట్టి శాసనాధికారులసాయమున నెఱవేర్చుచుండును. అనఁగా రాజ్యము, కోశము, యుద్ధము, న్యాయము, వార్తాహరణము, జలసేన, అంతర్యము, కృషి, వ్యాపారము, పరిశ్రమ మొదలగు శాఖలకు కార్యకర్తల నితఁ డేర్పఱిచి వారిసాయమున పరిపాలన మొనరించుచుండును. ఈవిభాగముల యధ్యక్షులే ఇతనికి మంత్రాంగసభా మంత్రులు (Cabinet). ఈపదిశాఖలును కాక ఇతనిక్రింద పనిచేయునవి ఇంకను అనేకములు కలవు. శాఖాధిపతులు స్వతంత్రమును కలిగియున్నంతవఱకే వారివారి పదవుల నుండుట కర్హులు. సంయుక్తరాజ్యములందు ముఖ్యస్థానము వాషింగ్టన్ పట్టణము. ప్రభుత్వమునకు కేంద్రస్థాన మిదియే. ఈదేశపు న్యాయాధికారము లన్నియు నిచ్చటి యుచ్చన్యాయాలయము (Supreme Court) నకుఁ గలవు. ఇం దొక ఛీఫ్‌జస్టిస్ మఱి యెనమండ్రు జడ్జీలసాయమున న్యాయపరిపాలన మొనరించుచుండును. ప్రతిరాజ్యమందును వారివారిజడ్జీల నారాజ్యమువారే నియోగించుకొని భరించుచుందురు.

చరిత్రము — గ్రేట్‌బ్రిటన్, హాలెండ్, స్వీడన్, ఫ్రాన్సు, స్పెయిన్ దేశవాసులు యూరోపునుండి అమెరికాకుఁ బోయి రెండువందల యేండ్లకాలములో వలసల (Colonies) నిర్మింపఁగలిగిరి. కాలాంతరమున డచ్, స్వీడుల ప్రాంతములు న్యూ నెదర్‌లాండ్సు, న్యూ స్వీడనులు బ్రిటిషువారియందు సంక్రమింప ఫ్రెంచ్, స్పానిష్ యొద్దదేశము సంయుక్తరాజ్యములందుఁ గలిసిపోయెను

ప్రభుత్వమువారు ౧,౫౦,౦౦,౦౦౦ల డాలర్లను మెక్సికోప్రభుత్వమున కొసంగిరి ఈప్రకారము ౧౮౬౦-వ సంవత్సరము సమీపించు వఱకు దేశ మంతయు మహోన్నతదశ నందుచుండెను స్త్రీయు ఇంజనులు, స్త్రీమునౌకలు మాత్రమే కాక ఈకాలమున దేశోప యోగకరములైన ఆవిష్కరణము లెన్నిగా వెడలుటవలన దేశాభి వృద్ధి యెంతయో తోడ్పడెను కాని దేశము నంతటిని కొక్కపర్యా యముగ గల్లోలమున ముంచివేయగల దాస్యవిమోచనప్రశ్న ము సంయుక్తరాజ్యము లేర్పడినకాలమునుండియు వచ్చుచుండెను మొట్టమొదట దాస్యప్రసక్తి కాదలయు వచువారే యపరిమితముగ నుండిరి కాని యొక ఆర్ధశతాబ్ది గడచునప్పటికి సమానాంశములు కాలముగా దాస్యవిమోచనపక్షమువారే సంఖ్యయందు హెచ్చి పోయిరి ౧౮౫౯-వ సంవత్సరమున హార్పర్స్ ఫెర్రీయొద్ద జరగిన తిరుగుబాటువలన ఈప్రశ్నము మిక్కిలి ప్రాధాన్యమునకు వచ్చెను ౧౮౬౦లో ప్రెసిడెంటు నెన్నుకొనుతరుణముందే ఈవిషయమున వాదవివాదములు మహాఘోరముగ జరగియుండెను కుదకు రిపబ్లికను పక్షీయుడగు అబ్రహాం లింకన్ అధ్యక్షుడైనవెంటనే దాస్యప్రకౌల దక్షిణ కరోలినా, మిసిసిప్పి, ఫ్లోరిడా, అలబమా, జార్జియా, లూయి సియానా, టెక్సస్ రాజ్యములవారు తా మపజయము నొందినట్లు తలపోసి సంయోజనమునుండి విడివడపోయిరి వీరు ౧౮౬౧లో దక్షిణసంయోజన మను పేర (Southern Confederation) ఏర్పడి జఫర్సన్ డేవిస్ అనువానిని అధ్యక్షునిగ నెన్నుకొనిరి కలహము లారంభ మైనతరువాత వర్జీనియా, ఉత్తరకరోలినా, టెన్నెస్సీ, అర్కన్సస్ రాజ్యములు దక్షిణులతోఁ గలసెను

సుంకగృహములు(Custom Houses) ఆయుధాగారములు, సంయుక్తరాజ్యముల భవనములు, వారివారిరాజ్యములం దున్నవానిని దాస్యరాజ్యములవా రాక్రమించుకొనిరి వీరు వేఱొకప్రభుత్వ మును సృష్టించి డేవిస్ అధ్యక్షుని ఉత్తరువుల ప్రకారము పరిపాల నము గావించుకొన నిశ్చయించిరి ౧౮౬౧-వ సంవత్సరమున వీరు సమ్టర్ దుర్గమును ముట్టడించి వశపఱచుకొనిరి అనంతరము నాలుగు సంవత్సరములపర్యంతము ఘోరమగు పోరాటము జరగెను దాస్య పక్షమువారు జనరల్ లీక్రిందను, సంయోజనపక్షమువారు జనరల్ గ్రాంటుక్రిందను పలుచోట్లఁ బోరాడిరి క్రమక్రమముగ దాస్య విమోచనపక్షమువారికే జయము గలుగుచువచ్చెను చివరకు దాస్యపక్షీ యుల కేంద్రస్థానమగు రిచ్‌మాండ్ పట్టణమును దృఢము గావించికొని నిలిచియున్న జనరల్ లీని జనరల్ గ్రాంటు ఓడించి పట్టుకొనుటతో నీయుద్ధము సమాప్తమయ్యెను యుద్ధము జరగుచుండిన కాలముందే దాస్యవిమోచనము యొక్క ఘోషణము గావింపఁబడినది. దీని కంత టను ముఖ్యకారకుఁడగు అబ్రహాం లింకను రెండవపర్యాయము మధ్యక్షుఁ డుగ నెన్నుకొనఁబడెను కాని వెంటనే హత్య గావింపఁబడెను (చూడుఁడు, అమెరికా-అంతఃకలహము) కాలక్రమమున నీయుద్ధము తిరిగిన రాజ్యము లన్నియు మరల యూనియనులోనికి వచ్చినందున

యథాపూర్వము వానికి జాతీయాధికారము లన్నియు నొసంగఁబడినవి. ౧౮౬౮-వ సంవత్సరమున జనరల్ గ్రాంటు అధ్యక్షపదవును వహించి, కాలముగా యున్న వ్యవహారముల నన్నింటిని చక్క దిద్దఁజేసి క్రమమార్గమునఁ బెట్టుటకై చాల ప్రయత్నములు సలిపి యుండెను. ౧౮౭౦ వ మార్చియందు జాతీయవ్యవస్థతోఁ జేయఁ బడినదిద్దుఁబాటు ననుసరించి జాతి, మత, వర్ణ, విద్యల విచక్ష లేకుండ నేరాజ్యమందైనఁగాని మనుజుఁడు వోటాధికారమును బొందుట కవకాశము కలిగెను కాని నీగ్రోలకును తెల్లవారికిని సమానాధికారము లుండవలయు ననువిషయ మిప్పటికిని వివాదా స్పదముగ జేయుచున్నది ౧౮౭౧-వ సంవత్సరమున జరిగిన వాషింగ్టన్ నగరపు-ఒడంబడికయందు గ్రేటుబ్రిటనుతోఁ గల మూఁడుకలహా స్పదములైన విషయములు పంచాయతీతీర్పుద్వారా పరిష్కృతము లయ్యెను అలబమా నామకనౌకను కొల్లగొట్టుటవలనఁ గలిగినపష్టమును బ్రిటిష్‌వారు కట్టియిచ్చుటనుగూర్చియు, వాంకోవర్ దీవులయొద్ద బ్రిటిష్-అమెరికనుఁ సరిహద్దులనుగూర్చియు, కెనడాదేశపు మత్స్య వ్యాపారమునుగూర్చియు నీవివాదములు వీనియందు మొదటి రెంటను నమెరికనులపక్షమునను మూఁడవది బ్రిటిష్‌వారి కనుకూల ముగను తీర్పు గావింపఁబడెను గ్రాంటుతరువాత ౧౮౭౭-వ సంవత్సరమున ఆర్. బి. హేస్ అనువాఁడు ప్రెసిడెంటుగ వచ్చెను ఇతఁడు ౧౮౭౭-వ సంవత్సరమున ఫెడరల్ సేనలను దక్షిణ రాజ్యములం దంతకుఁ గలహముతగువాత నిలిపినవానిని అచటినుండి వేఱొకు ప్రాంతములకుఁ బంపించి సంయుక్తరాజ్యముల పున ర్నిర్మాణమును సంపూర్ణము గావించెను. పిదప ౧౮౮౦-వ సంవత్సరపు ఎన్నికలలో రిపబ్లికనులు జేమ్స్ గార్‌ఫీల్డ్ అనువాని నెన్నుకొనిరి ౧౮౮౪ వంను మరల ప్రజాపక్షమువారు ప్రబ లులై గ్రోవర్ క్లీవ్‌లాండ్ అనువాని నధ్యక్షునిగ నేర్పఱచు కొనిరి ౧౮౮౮ యందు బెంజమిన్ హారిసన్ నామకరిపబ్లికనుపక్షీ అధ్యక్షుఁ డయ్యెను ౧౮౯౨ క్లీవ్‌లాండ్ మరల ప్రెసిడెంటయ్యెను విదేశములలోని రాజకీయములందుఁ బ్రవేశము కలిగించుకొనుటకు మన్రోసిద్ధాంతము ననుసరించి వెనెజులా, బ్రిటిష్‌గయానాదేశముల సరిహద్దుల నేర్పఱుచుకొనుటలో వాదములు పెరిఁగి బ్రిటనుతో మరల యుద్ధముసంభవించులాగున గనుపడెను కాని యీవిషయము పంచాయ తీకి ఒప్పగించులాగున స్థిరపడెను ౧౮౯౬ వ మెకిన్లే నామక రిపబ్లి కన్‌పక్షీ అధ్యక్షపదము నందెను. ఇతనికాలమున క్యూబా ధీవి స్పెయినులతో పోరాటముకలిగెను గ్రాంటు అధ్యక్షుఁడుగ నున్న కాలమున నుండియు క్యూబాదీవియందలి స్పెయినువారిప్రభుత్వము చాల హీనా వస్థయందుండెను దొరతనమువారు చేయుచుండిన దుష్పరిపాలనము వలన జనులు పలుమారు తిరుగఁబడిపోయిరి. సంయుక్తరాజ్యముల సమీపముగ నున్నందున ఇం దమెరికనులు నివసించుచుండిరి. క్యూబా నివాసులతోపాటు వారికిని దుష్ప్రభుత్వమువలనఁ గలుగు నిక్కట్లు తప్పకయుండెను చాలకాలమునుండి నివసించు స్పెయినులు తిరుగఁబడిరి

దొరతనమును జక్కపెట్టవలయు నని అమెరికను ప్రభుత్వమువారు ప్రయత్నించిరి కాని లాభము లేకపోయెను. అంత ౧౮౯౮ యందు సంయుక్తరాజ్యముల జాతీయప్రభుత్వము సహింపని క్యూబావారిపై లపనమును వదలుకొనవలసిన దని స్పెయినువారికిఁ దెలియఁజేయఁగ వా రందులకు జవాబుగ నీదేశముపై యుద్ధఘోషణము గావించిరి. అంత సంయుక్తరాజ్యములనుండియు యుద్ధకార్యము లారంభమయ్యెను. ఈ కారణమునఁ బ్రపంచమునం దంతట నచట నచట స్పెయినువా రుండిరో యచట నెల్ల నీరెండుజాతులవారికిని పోరాటములు కలుగ సాగినవి. యుద్ధఘోషణ మైనతోడనే అమెరికను దొరతనమువారు స్పెయినుక్రిందనున్న ఫిలిప్పైన్ దీవులను ముట్టడింపవలయు నని హాంకాంగునొద్దనున్న తమవలపేనాని యగు జార్జ్ డ్యూయి యనువాని కుత్తరువుల నంపిరి. తదనుసార మతఁ డాపట్టుననుండి బయలువెడలి కొలఁదిదినముల స్వల్పకాలమునందే ఫిలిప్పైన్ దీవులందలి మానిలానామక నగరమును ముట్టడించి తీసికొనెను. ఇదేసమయమున క్యూబాయందలి శాంటియాగోయుద్ధము, పోర్టొరికోదీవియందగు యుద్ధములు జరుగుచుండెను. యుద్ధము జరిగినచోట నంతయు నమెరికనులే జయమందుచువచ్చిరి. పోర్టొరికోయందును స్పెయినువారి కపజయము కలిగినతోడనే వీరు సంధి గావించికొనుటకు సమ్మతించిరి. అంత పారిస్ పట్టణమున సంధి జరిగెను. అందలినియమముల ననుసరించి క్యూబా, పోర్టొరికో, గ్వామ్, ఫిలిప్పైన్ మొదలగు దీవు లమెరికనులపర మయ్యెను. కాని ఫిలిప్పైన్ దీవులందు డాక్ ఎమిలో అగ్వినాల్డ్ అనువాఁ డమెరికను మానిలాపట్టణమును ముట్టడించి పట్టుకొనుటకుఁ బూర్వమే, అనఁగా ౧౮౯౮-వ సంవత్సరమున స్పెయినుదొరతనము విరోధముగ తిరుగఁబడి యచట ప్రజాప్రభుత్వమును (Repu lic) స్థాపించెను. కాని యాదేసంవత్సరాంతమున అమెరికనులు గావించిన ప్రకటనమువలనఁ దమప్రజాప్రభుత్వము స్వీకృతము కాదే యని విశ్వసింపకుండ, అగ్వినాల్డోపక్షమువా రంతయు నెదురుతిరిగి కలహింపసాగిరి. ఫిలిప్పినోలు మంచిధైర్యసాహసములతోఁ బోరాడిరి కాని సమస్తయుద్ధోపకరణసంపన్న మగునమెరికనుసేనను వారు కాలుకాలమునుండి నెదిరింపఁజాలకపోయిరి. అంగుళవన బహిరంగముగ యుద్ధము మాని చాటుమాటుననుండి సమయము దొరకినతోడనే అమెరికనులపైఁ బడి కొల్లగొట్టసాగిరి. ఇట్టివిధానము ౧౯౦౨ వఱకును సాగుచునేయుండెను. అమెరికను లోకసభ్యులు కేవలము త్వరలో ద్వీపవాసులకు స్వాతంత్ర్య మొసగఁబడు నని చాటించుచు విప్లవముల నడఁచుటకు మంచికట్టుదిట్టములను చేసిరి. ప్రకటనము ననుసరించి ౧౯౦౬-వ సంవత్సరమున ఫిలిప్పినోఅసెంబ్లీయొకటి నెలకొల్పఁబడెను. అధ్యక్షుఁ డగు టాఫ్టుయొక్క కోరికప్రకారము ౧౯౧౬-వ సంవత్సరమున కాంగ్రెసువా రాదీవులను సంయుక్తరాజ్యములందుఁ జేర్చుకొనిరి. అనంతరము విల్సన్ అధ్యక్షుఁడుగ నుండినకాలమున నీదీవులలో గవర్నరుజనరలుగ నున్న కామెరాన్‌ఫోర్బ్స్ అనునతనిని దొలఁగించి అమెరికను ప్రభుత్వమువారు హ్యారిసన్ అనునతని నియోగించిరి. మఱియు పౌరసభ్యులతోఁ బరిపాలనము చేయుచు ఫిలిప్పినోలు స్వాతంత్ర్యమున కర్హులగునట్లు చేయుట కీతఁ డుత్తరువు లొసంగఁబడియుండెను. కమిషన్ సభ్యులలో నెక్కువమంది ఫిలిప్పినోలుండులాగున విధించి పరిపాలనకార్యాలయములం దమెరికనులకు మాఱుగ స్వదేశీయులే యెక్కువగ నుండులాగునఁ గావింపఁబడెను. ౧౯౧౬ లోఁ జేయఁబడిన జోన్సుబిల్లుమూలమున నీదీవుల ప్రజలకు మఱికొన్ని యధికారములు లభించెను. యోగ్యత కలిగినతోడనే ఫిలిప్పినోలకు స్వాతంత్ర్య మొసంగుటయే అమెరికాయొక్క ముఖ్యోద్దేశము. ఇటీవల, అనఁగా ౧౯౩౪-వ సంవత్సరమున ఏసుసంవత్సరముల పరిమితకాలానంతరము వీరికి స్వరాజ్య మొసంగఁబడు నని ప్రకటింపఁబడినది.

సుమారు ౧౯౦౦ ల ప్రాంతమున చీనాదేశమున బాక్సర్ కలహ ముత్పత్తి యయ్యెను. ఈ బాక్సరు లనువారు చీనాదేశీయులు - జాతీయవాదులు. వ్యాపారాది శారీరకపరిశ్రమలను సలుపుచు స్వదేశమును నున్నతస్థితికిఁ దేవలయు నని పాటుపడుచుండిరి. తమ దేశముయొక్క తీరముల నాక్రమించికొని యున్న విదేశీయుల నందఱను దఱుమఁ గొట్టి చీనాను వారిజాలమునుండి తప్పింపవలయు నను అభిప్రాయముతో వీరు దేశీయక్రైస్తవులను, యూరోపియనులను కొందఱను హత్య గావించి యనేకులను కారాగారములందు బైచిరి. చీనా రాజధాని యగు పెకింగ్ పట్టణమున గొప్పదగ జరుగుటకు సిద్ధముగ నుండెను. అంత సత్వరముగ అమెరికా సంయుక్తరాజ్యములు, జపాను, బ్రిటన్, ఫ్రాన్స్, రష్యాదేశములవా రందఱును ప్రోగయి బాక్సరుల నోడించి పట్టుకొని తమతమ ఖైదీ లందఱను విడిపించిరి. బాక్సరుల అపజయమువలన చీనాదేశమును విజేతలందఱు నాఫ్రికావలెఁ బంచికొనియుందురు కాని సంయుక్తరాజ్యములే యట్టి విధానమును మాన్పించెను. వీరియొక్క సలహా ననుసరించి యుద్ధమునిమిత్తమైనఖర్చులకై ౩౩,౩౦,౦౦,౦౦౦ ల డాలర్లను మాత్రము దీసికొని మిత్రమండలివారు బాక్సరులను ముక్తులఁ గావించిరి. ఈ ద్రవ్యమును విజేతలగువారు పంచికొనఁ సంయుక్తరాజ్యములకు ౨,౪౦,౦౦,౦౦౦ లు దొరకెను. ఈ మొత్తమునుండియు కోటి పదిలక్షలడాలర్లను అమెరికనులు చీనావారి కిచ్చి వారి కృతజ్ఞతకుఁ బాత్రులైరి.

మెకిన్లే ఒకఘాతకునిచే మృతుఁడు కాఁగా నతనిస్థానమును థియొడోర్ రూజ్‌వెల్ట్ (ఉపాధ్యక్షుఁడు) చేకొనెను. ఇతని పాలనకాలమున వ్యాపారప్రతిబంధములవిషయమున ముఖ్యముగ ట్రస్టు (Trusts) లని పిలువఁబడు మహాకూటముల నిమిత్తము కొన్ని నియమములు కల్పింపఁబడెను. ఇందువలన వ్యాపారులకు నితనికిని గలహము లేర్పడెను కాని మొత్తముమీఁద నితని పరిపాలన మత్యుత్తమమైనవానిలో నొకటిగ గణింపఁబడినది. అట్లాంటిక్, పసిఫిక్ మహాసాగరములను గలుపు పనామాకాలువ యితనికాలమునందే త్రవ్వఁబడినది.

వెలువడిన సారస్వతము నిజమునకు ఇంగ్లీషుసారస్వతమునందలి యొక భాగముగనే గ్రహింపవచ్చును

న్యూ-ఇంగ్లండునందు తక్క మిగిలిన ప్రదేశములందు గ్రంథ రచన అరుదుగ నుండెడిది. ఉత్పత్తి యయిన గ్రంథములును చాల తక్కువ. వర్జీనియాయందు దేశశోధన, దేశవర్ణనములకు సంబంధించిన గ్రంథములు, సాగరిక యాత్రాచరిత్రములు మొదలయినవి పుట్టినవి. పదునెనిమిదవశతాబ్దిలకు వర్జీనియాయందలి పరిస్థితులు గ్రంథోత్పత్తి కంత యనుకూలముగ నుండినట్లు లేదు. అంతటినుండి గ్రంథములు చాల వచ్చినవి

ఒక్కొక్క వలస మనోరంజకమయినది కాని, ప్రాముఖ్యము గడించినది కాని యయినవెంటనే దానికి సంబంధించిన వర్ణనగ్రంథములును, వృత్తాంతములును బయలుదేరుచు వచ్చినవి. సముద్రతీర ప్రదేశములందు గ్రంథరచన చాల హెచ్చుగ నుండెను కాని క్రమాభివృద్ధినొందుచు ప్రాముఖ్యము గడించినవానియందు సహజముగ తక్కువగ నుండెను

మొదటినుండియు వర్జీనియాయందుకంటె న్యూ-ఇంగ్లండునందు గ్రంథరచనమునకును, గ్రంథముద్రణమునకును పరిస్థితు లెక్కువ యనుకూలముగ నుండెను. ప్యూరిటనులు చిన్నచిన్న గ్రామములయందు స్థిర నివాసము లేర్పరచుకొనిరి. ప్రతిగ్రామమును మతాచార్యునినాయకత్వమున చక్కనికట్టుబాటులతో నొప్పుచుండెను. ఈ మతాచార్యులు ఆస్తికవాద ప్రతివాదములను, ఆస్తికగ్రంథరచనను ప్రోత్సహించుచు వచ్చిరి. ఈరీతిని న్యూ-ఇంగ్లండునందు ఆస్తికమతవాఙ్మయము చాల బయలువెడలినది. ఆస్తికవాదమునకు సంబంధించిన పత్రికలు కూడ మొలకలెత్తినవి. రోగర్ విలియమ్సు ఈ కాలపు ఆస్తికవాదులలో ప్రముఖుడుగనున్నవాడు. ఇతనియభిప్రాయము లప్పటి ప్రభువులకు సరిపడక యతనిని దేశబహిష్కృతుని గావించిరి. అందువలన నితడు మస్సచుసెట్స్ అఖాతమునుండి వెడలిపోయి రోడ్ దీవి కరిగి యచట అమెరికాయందలి మొట్టమొదటి ప్రజాసత్తాక సమష్టిరాజ్యము స్థాపించెను. ఇతడు ప్రజాసత్తాకతత్త్వమును విపులముగ వ్యాఖ్యానముచేసి విశదీకరించుటవలన ఆకాలపు రాజకీయభావములలో ప్రముఖుడుగ పరిగణింపబడుచున్నాడు. ఈకాలమున పద్యకవులు కూడ కొందఱు వెలసిల్లిరి. వారిలో మైకేల్ విగ్గల్స్ కర్త ప్రథమగణ్యుడు. న్యూ-ఇంగ్లండునందలి ఆస్తికవాదగ్రంథకర్తలలో జోనాథన్ ఎడ్వర్డ్స్, సామ్యూయల్ హాప్కిన్సు, ఎజ్రా స్టైల్స్ అనువారు పేర్కొనదగినవారు.

న్యూ-ఇంగ్లండు మతాచార్యుల యుపన్యాసములకు చెవియొగ్గి వినుచుండినకాలమున ఫిలడెల్ఫియా బోస్టనుకంటెను సంస్కృతి సాహిత్యములకు ప్రధానకేంద్ర మగుచుండెను. ఇచ్చట శాస్త్ర గ్రంథములు ముద్రితము లగుచుండెను. నాటకరంగములును, పత్రికలను ప్రజ లాదరించుచుండిరి

అమెరికాసారస్వతమునకు ౧౭౬౫ మొదలు ౧౮౦౦ వఱకును ద్వితీయదశ యనవచ్చును. ఇది యమెరికాహృదయము పెక్కు విధములయిన రాజకీయసమస్యలతో దటదటం గొట్టుకొనుచుండినకాలము. అమెరికాయంతఃకలహము, సంఘాతరాజ్యప్రతిష్ఠాపనప్రయత్నము, ఫ్రెంచివిప్లవసంజనితనూతనభావములు అను నివి యమెరికనులను కలవరపెట్టుటవలన అమెరికాయం దొక నూతనజాతి తయారగుచుండినకాల మది. ఈకాలమున నుత్పత్తియయిన సారస్వతము రాజకీయములకు సంబంధించినట్లు సహజము. రాజకీయ సంబంధము గల కరపత్రములు, గ్రంథములు అనేకము లీకాలమున బుట్టినవి. ఈ రాజకీయ సారస్వత నిర్మాతలలో సామ్యూయల్ ఆడమ్సు, జాన్ డికిన్సన్, జోసెఫ్ గాల్లోవే, టామ్ పెయిన్ లు ప్రముఖులు. వీరి రచనలు కారణముగ దేశము యుద్ధాగ్నికుండమున దుముకినది. వీరిలో పెయిన్ కలము కడు శక్తిమంత మయినది. ప్రజాహృదయమునకు హత్తునట్లు స్వాతంత్ర్యమువలని లాభములనుగూర్చి తెలిపినవాఁ డితఁడు. 'మానవుని హక్కులు' అనునది ఆకాలమున ప్రజాహృదయమున భక్తిగౌరవము కలిగించిన గొప్ప గ్రంథము. పైని పేర్కొనినవారు కాక రాజకీయ నాయకులు జాన్ ఆడమ్సు, అలెగ్జాండరు హామిల్టన్, థామస్ జఫర్సన్ లవంటివారు పెక్కు రుండిరి

అమెరికా యువజనసంఘము ఈరీతిని రాజకీయ స్వాతంత్ర్యమును సంపాదించి, అపరీక్షితసూత్రములమీద నొక ప్రభుత్వము నేర్పాటుచేయుచుండిన కాల మగుటవలన అప్పుడు సర్వసారస్వతము ప్రజాక్షేమలాభముల కేంద్రముగ నుండుట, సహజము. ఈకారణమున కవిత్వ, వ్యాసములు పదునెనిమిదవశతాబ్ది కడపటిదశలం దిచ్చటచ్చట పెరుఁగుచు వచ్చినవి. ౧౭౮౦, ౧౭౯౦ లలో హార్టుఫోర్డు, కాన లందు యువజనులు కొందఱు సమకాలికాంగ్లసారస్వత దీక్షను గ్రహింపఁ బ్రయత్నించిరి. వీరిలోఁ గొందఱు ప్రజాసత్తాకస్ఫూర్తి లేకవాదులు. ఈకారణమున నీకాలమున అపహాస్య (Satirical) సారస్వతముకూడ తగినంత బయలుదేఱినది. దీనితోపాటు నాటక వాఙ్మయమును క్రమక్రమముగ మొలకెత్తి వర్ధిల్లినది

౧౮౧౨-౧౫ అమెరికాయుద్ధము పూర్తియైననాటనుండి అమెరికనుల జీవితమున మార్పు లనేకములు కలిగినవి. ప్రతివిషయమును పరివర్తనము సంభవించినకాల మిది. సంస్కరణోద్యమములు, దాస్యప్రథానిర్మూలనప్రయత్నములు, పారిశ్రామికారంభములు, ప్రజాసత్తాకప్రభుత్వభావవికాసము, యుద్ధములు—— ఇవి యన్నియు నింతటి ప్రాచీనభావములతో నిండి కాయువ్వాలేని అమెరికాహృదయమునకు పదునుపెట్టి మార్చి దానిని నూతనభావతరంగితము గావించినవి. నాటనుండి అమెరికాసారస్వతమునకు క్రొత్తశక్తి, క్రొత్త వికాసము, క్రొత్తజీవము వచ్చి యది వివిధవిధములగు చక్కనిమార్గములు త్రొక్కి పేరుప్రతిష్ఠలు గడించుకొన్నది. అందువలన పందొమ్మిదవ శతాబ్ది నుండి నేటివఱకు నమెరికాసారస్వతము వికసితాభివృద్ధి గాంచినది

ప్రపంచవాఙ్మయమునందుగూడ స్థానము గడించుకొన్నది. అమెరికా సారస్వతమున నీపందొమ్మిదవ, యిరువదవ శతాబ్దులందు పెక్కుచు ప్రతిభాశాలు బయలుదేరి, వేరువేరు శాఖలందు క్రొత్త క్రొత్త రీతులను, క్రొత్త క్రొత్త సంప్రదాయములను నెలకొల్పి తమ వాఙ్మయ సౌభాగ్యమును పెంపొందించినారు వాషింగ్టన్ ఇర్వింగ్, జేమ్సు ఫెనిమోర్ కూపర్, ఎడ్గర్ అల్లన్ పో, హెన్రీ డేవిడ్ థోరో, జాన్ గ్రీన్‌లీఫ్ విట్టియర్, హెన్రీ వాడ్స్‌వర్త్ లాంగ్ ఫెల్లో, నథేనియల్ హాథారన్, రాల్ఫ్ వాల్డో ఎమర్సన్, జేమ్సు రస్సెల్ లోవెల్, ఆలివర్ వెండెల్ హోమ్సు, ఎమిలీ డికిన్సన్, వాల్ట్ విట్‌మన్, హెర్మన్ మెల్విల్లి — ఈమొదలగువా రంవయుచు పందొమ్మిదవ శతాబ్దిని వర్ధిల్లిన సుప్రసిద్ధ అమెరికా గ్రంథకర్తలు

౧౮౫౦ మొదలు ౧౯౦౦ వరకును గ్రంథరచన తీవ్రముగ సాగినది. చిన్నకథ కళావిగ్రహమును గుర్తింపుదగ నొంది పేరుగాంచినది కవిత పరిమితముగ వర్ధిల్లినది చారిత్రకకథ సంప్రదాయము కట్టుగాని వర్ధిల్లినది

౧౯౦౦ మొదలు ౧౯౨౫ వరకు అమెరికా సారస్వత మింకను క్రొత్తమార్పులను తెంగుకు వర్ధిల్లుచున్నది ఈకాలమున ప్రపంచమునందలి యితరభాగములందుకంటెను అమెరికాసంయుక్తరాష్ట్రములందు ఆర్థికపరిస్థితులును, విజ్ఞానమును, సాంఘికపరిణామములును, రాజకీయములును, సారస్వతమునందును, కళలందును గూడ గొప్ప మార్పు సంభవించినది వ్యాపారము లేకయు పారిశ్రామికదేశముగ మార్పుచెందినది దీనితో దేశమున క్రొత్త ధనిక ప్రజానకముగ వికసించినది జాతీయభావము ప్రవర్ధమానమయినది ఇంతయేల, గడచిన యిరువదుపదులందును, మార్పుకలిగి యొక నూతనసాంఘిక, నైతిక, ఆర్థిక, విజ్ఞానసంప్రదాయములు రూపొందినవి ఒక క్రొత్తయుగ మారంభ మయినది

౧౯౧౦ లో అమెరికాదేశీయుల సారస్వతాభిరుచిలో మార్పు కలిగినది ఈమార్పు కలుగుటకు బెర్నార్డ్‌షా గ్రంథములును, రష్యా దేశపు నవలారచయితల గ్రంథములును, ఇబ్సెన్ గ్రంథములును కారణములు ఈరీతిని ఇరువదవశతాబ్దియం దమెరికాసారస్వతము నకు క్రొత్త క్రొత్త ప్రోత్సాహకత్తుల నొసంగినది యూరోపు

సారస్వతమునందే కాక యితరవిషయములందును నిట్టి ప్రోత్సాహము కలిగినది. ద్రవ్య మెుకకత్తిగ, కార్మికు లొకతరగతిగ, ప్రజాశక్తి యొక యార్థికవిషయముగ (Economic Factor) అతిశయము గ్రహించిరి. ఈభావములను వ్యాపింపజేసినవారు రూజువెల్టు, విల్సనులు. ఈభావములతోపాటు అమెరికనువాఙ్మయము ముక్తిమతము నొందినవిన గ్రంథకర్తలు మూలిగాండలు కలరు వారిలో అధునిక ప్రపంచము సంకీర్ణమయిన దని, దానిందు స్త్రీ ప్రయుక్తస్థితి తన స్వాతంత్ర్యముయందు పరిస్థితులవలన నిర్ణీత మగు నని నిర్వచించిన హెన్రీ జేమ్సు కాక గాల్సువర్దీ ప్రధానులు. ఈ నూతనభావ

పరంపరలకారణమున అమెరికావిశ్వవిద్యాలయములనుండి ౧౯౧౦లో వ్యక్తిచెప్పబడిన సాంఘికవాదము (Socialism) తిరుగ విమర్శనము, చర్చయు జేయబడినది ఈవిషయముగా సంఘమునందు గలిగిన యశాంతి సారస్వతమునగూడ ప్రాతియందును అశాంతి రేకెత్తినది కార్మికతరగతులవారిమీద క్రొత్తగ కలిగిన శ్రద్ధానక్తులవలన ఆ తరగతులయందలి వ్యక్తులయందును క్రొత్త శ్రద్ధానక్తులు కలిగినవి ఈ కారణమున సాధారణపరిస్థితులయం దుండు సామాన్యుడు సారస్వతమున అప్రధానపాత్రముగ గాక ప్రధానపాత్రముగ ప్రవేశము కలిగించుకొనెను

పందొమ్మిదవశతాబ్ది కడపటిదశలయందు అమెరికా పౌరశాలలయందును, కళాశాలలయందును పరివ్యాప్త మగుచుండిన శాస్త్రవిద్య (Scientific education) దీని నుద్దీపనము కలిగించినది ఈకాలమునందలి పారిశ్రామికాభివృద్ధి కాధారభూత మయిన ప్రయోగాత్మకమయిన శాస్త్రవిజ్ఞానము (Experimental Science) వలన సారస్వతమున వాస్తవికధోరణి (Realistic attitude) యొకటి కలిగినది అందువలన అమెరికనులకు వస్త్రు, నిరర్థక, అసద్విషయములందును శ్రద్ధ కలుగుట కిచ్చ జనించుచున్నది

సారస్వతయోగ్యతలందలి మార్పు కవిత్వమునం దెక్కువగ పొడకట్టుచున్నది. అమెరికాకవిత్వమునందలి ప్రవర్తనము ఒకవిధముగ పరివర్తన మనియే చెప్పవలెను క్రొత్తసంప్రదాయములు, క్రొత్త శిల్పము కవిత్వమున నావిర్భవించినవి సారస్వతమున కవిత్వము ప్రముఖవాఙ్మయశాఖగ పేరుగాంచినది. ఎమీలోవెల్, ఎడ్గర్ లీ మాస్టర్సు, రాబర్ట్ ఫ్రాస్ట్, ఎడ్విన్ ఆర్లింగ్టన్ రాబిన్సన్, వచేల్ లింద్సే మొదలగు గ్రంథకర్త లీనూతనయుగమునకు జెందినవా రనేకులు కలరు కవిత్వముతోపాటు విమర్శనమును, కథయు గూడ సారస్వతరంగమును నేడు ప్రధానముగ నాక్రమించుకొనుచున్నవి

## అమెరికా స్వాతంత్ర్యయుద్ధము

— స్వార్థరహితమైన న్యాయబుద్ధితో ఆలోచించి చూచినయెడల పాలితులగు జనులసంరక్షణార్థమే పాలకు లేర్పడి రనియు, అట్టి పాలకులు తమ విధ్యుక్తధర్మమును క్రమముగ నిర్వహింపనిచో వారిని తొలగించుటకు జనులకు హక్కు కల దనియు విశద మగును ఆదికాలమున రాజపద విట్టి యాశయములతో నేర్పడియుండినప్పటికిని ఎన్నం కాలేది సంవత్సరములు గడచిపోవ ఈ పరమ్యుక్తమునయువిస్మరణము కలుగుటచే రాజు ఎట్టివాడైనను దేవాంశసంభూతుడను విశ్వాసము కలుగసాగెను జను లందఱు నేకీభవించి తమ్ము శత్రువులనుండి కాపాడుటకును, తమకు శాంతిసౌఖ్యములను సమకూర్చుట కవసరమైన విధానముల నేర్పఱచుటకును తమ తమ యాదాయములనుండి వినరులు కాని వందారూపముగ పన్నులని యిచ్చిన ద్రవ్యముచేతనే ప్రబలుడై పాలకుడు తన విధ్యుక్తధర్మముల నెఱవేర్పకపోవుట యటు లుండ, వీడుమిక్కిలి తమ్ము నేర్పఱచుకొనిన జనులను బాధపెట్టినను

సాహాయ్యముతో హింసింపఁగడఁగినచో వారి కెదిరింపవలసిన దే యున్నదిఁ 'ప్రభుత్వ మనునది రాజు ప్రజలుకలసి చేసికొనిన యొక నియమబద్ధమైన సమయము. ఈయిద్దఱిలో నెవరైన నొక రీసమయము విఘాతము కలిగించినయెడల రెండవపక్షమువారిని వారిబాధ్యతనుండి తప్పించినట్లే యగును' అనునర్థ మిచ్చువాక్యములతో అమెరికాదేశపు రాజనీతిజ్ఞులైన పాట్రిక్ హెన్రీ, జేమ్సు ఓటిస్ అనువారు విస్మృతధర్మనిర్వహణా సమర్థుఁడైన బ్రిటిష్‌రాజుయొక్క దేవాంశసంభూతత్వమును, అతనికిఁ దోడ్పడు పార్లమెంటుయొక్క సర్వాధికారమును నిరసించి వానికి ఎదురుగ సర్వసాధారణన్యాయమును, మానవుల సహజ శాశ్వతాధికారములను ప్రతిపాదనము గావించిరి. ఈప్రతిపాదనమును స్థిరపఱచుటకే అమెరికా స్వాతంత్ర్యయుద్ధము జరిగినది. దీనివలన అమెరికాసంయుక్తరాజ్యములు ( United States of America ) బ్రిటిష్‌సామ్రాజ్యదాస్యమునుండి విముక్తిని బొంది సంపూర్ణ స్వాతంత్ర్యమును బడసెను. ఈసంగ్రామము క్రీ శ ౧౭౭౫ వ మసాచూసెట్సునందలి లెక్సింగ్టనునగరమువద్ద జరిగిన సంఘర్షణముతో ప్రారంభమై ౧౭౮౧-వ సంవత్సరమున అక్టోబరునెలలో యార్కుటౌనువద్ద కార్నువాలిస్ ప్రభువు అమెరికనులకు పట్టుపడుటతో సమాప్త మయ్యె నని చెప్పవచ్చును. సైనిక ( Military ), రాజకీయ ( Political ) దృష్టిపథము ననుసరించి ఈయుద్ధమునం దొక గొప్ప మహాత్త్వము కలదు. ఒక స్వల్పరాజ్యము తన జనకసామ్రాజ్యము నోడింపఁగల్గుటయే దీనికి కారణము. మఱియు అకాలమున సంభవించిన అనివార్యపరిస్థితులనుగుఱించియు, ఆపరిస్థితులలో గాఢమగు దేశభక్తిని విద్రోహముక్రిందఁ గట్టి దానిని జంపఁదలఁచిన ఉత్కటాభిలాషతో పాలకులు సలిపియుండిన లోపాలోపములఁ గూర్చియు యథార్థమగు జ్ఞానము కలుగుటం జేసి ఇది యొక శిక్షాదాయకమైన యుద్ధ మని చెప్పనగును.

కొలంబసు అమెరికాను కనుఁగొనిన తరువాత యూరోపుఖండమునందలి బ్రిటిష్, డచ్, స్వీడిష్, ఫ్రెంచ్, స్పానిష్‌జాతులవారు ఆ క్రొత్తదేశమునకుఁ బోయి నివాసములను నునుర్పుకొనసాగిరి. ఇట్లు రెండుశతాబ్దములసంవత్సరములు గడచునప్పటికి వలస ( Colonies ) లేర్పడెను (అమెరికా సంయుక్తరాజ్యములు అను వ్యాసమును చూడుఁడు) కావున అమెరికాజాతి వివిధజాత్యుత్పన్నమగు. ఆంగ్లేయుల సంఖ్యాధిక్యమువలన వారే ప్రాధాన్యము వహించిరి. క్రీ. శ ౧౬౦౭ మొదలుకొని ౧౭౬౦ వరకు నీ వలస లన్నియు బ్రిటిష్‌వారి అధినివేశ ప్రభుత్వము( Colonial Government ) క్రిందనే యుండెను. స్వాతంత్ర్యము నందినపిదప నీవలస లన్నియు రాజ్యములు ( States )గ మాఱిపోయెను.

ఈయుద్ధమునకు పూర్వము, అనఁగా క్రీ శ ౧౬౯౦ మొదలుకొని ౧౭౬౦ వరకును గల కాలమున బ్రిటిష్‌వారికిని ఫ్రెంచివారికిని కలహములు జరిగియుండెను. సంఖ్యాపరిమాణమున ఇంగ్లీషువారే యెక్కువ యగుటయు, వలసలవా రధికముగ భారమును వహించుటయు సంభవించినందున చివరి కాంగ్లేయులకే జయము కలిగెను. ఈవిజయమువలన అమెరికాయందలి విస్తారభూభాగము బ్రిటిషువారికి దొరకెను. ఫ్లోరిడా, కెనడా, లూయిసియానాలతోపాటు మిసిసిప్పీనదిపర్యంతము గల దేశ మంతయు వారియధీన మయ్యెను. అంతకుపూర్వము వీరు వ్యాపారాభివృద్ధి కవసరములైన దేశములను మాత్రమే తమయధికారమున నుంచికొనవలయు నభిలాషను గలిగియుండిరి. కాని బ్రిటిష్, ఫ్రెంచియుద్ధానంతరము పారిసునగరములో జరిగినసంధి ననుసరించి పూర్వోక్తరీతిని వీరికి విశాలభూభాగము లభించుటచేత నదివఱకు వలసలయెడల వీ రవలంబించియుండిననీతి పరివర్తితమైపోయెను. అది మొదలుకొని ఇంగ్లండునకు వ్యాపారాభివృద్ధికంటెను సామ్రాజ్యాభివృద్ధిచింతయే అధికమాయెను. బ్రిటనులో సరిపోఁగా మిగులుజనమును అమెరికాయందు వసింపఁజేయ వీరు తలపెట్టిరి. ఇట్టియుద్దేశము గలిగియే ఫ్రెంచివారితో సంధి గావించుకొనుసమయమున కెనడాదేశమును తమపద్దులో వేయించికొనిరి. ఎక్కువ రాష్ట్రములను వ్యాపారమునకును, కెనడాప్రాంతముల నధినివేశములకును ఉపయోగించుకొనవచ్చు నని యూహించిరి. ఆకాలమున ఇంగ్లండునందును, వలసలయందును బాధ్యతాయుతములైన పదవులందున్న యధికారు లందఱును అమెరికాలోని యాదిమనివాసుల నిమయమున మంచి కట్టుదిట్టముల నేర్పఱుచుటకును, క్రొత్తగ లభించినదేశముల పరిపాలనకొఱకు ప్రధానసేనానాయకత్వమున నొక గొప్పసేనను నెలకొల్పుటకును, ఫ్రెంచివారుగాని స్పెయినువారుగాని దేశమందలివ్యాపారము నపహరింప నెంచినయెడల వారిని నిరోధించునిమిత్తము వలసలవారి సాయముతో మఱి కొంతసేనను నిలువఁదీసి అంగు వ్యత్యయముకొఱకు నినియమించుటకు వలసలవారికి గొప్పగొప్పపదవులను గల్పించి వారిని ప్రోత్సహించుటకును ఎత్తుగడల నెత్తిరి. మంచి ఉత్తమమైన శాసనపద్ధతిని ఆదేశమునఁ బ్రవేశపెట్టవలయు నని వీరందఱు యోచనయు మఱియు పరిపాలనావిధానము ఫ్రెంచివారిపద్ధతి ననుసరింపవలయు నని కొందఱును, వెనుకటిరీతినే యుంచవలయు నని కొందఱును వాదించిరి. కాని ఈయభిలాష లన్నింటిని చక్కఁగ సాగింపఁదలఁచినచో అప్పటికి వచ్చుచుండిన యాదాయ మెంతమాత్రము చాలదు. అది యటులుండ నాసమయమున ఇంగ్లండు అప్పులలో మునిఁగియుండెను. వలసలవారును అంతకుమున్ను జరిగిన యుద్ధములకై అపరిమితముగ ధనమును వ్యయపఱచియుండిరి. కావున నూతనసంస్కరణములకు ధనము దొరకుట మహాకష్ట మయ్యెను.

ఫ్రాన్సుయుద్ధముయొక్క అంతిమభాగమునందు వలసలవారు బ్రిటిష్‌విరోధులతో దొంగతనముగ నపరిమితముగ వ్యాపారమును జరిపియుండిరి. దీని నాఁపవలయు నని ఆంగ్లేయులు చేసినప్రయత్నములు మిగుల దూష్యములైయుండెను. పన్నులు వసూలుచేయు నాకరులకు తాకీదు( Writs assistance ) లివ్వి దొంగసరకులకు వెదకుట కధికారము నొసఁగిరి. నౌకరు లీపత్రముల నాధారముగఁ గొని రాత్రియైనను, పగ లైనను ఇష్టము వచ్చినపుడెల్ల మాఱివేషముల నింటి లోనికి

వలసలవారి నహితవిధముల బాధింపఁగడఁగిరి. ఇదివఱ ప్రాగుక్త సంస్కరణముల కాదాయమును పెంపొందింప బ్రిటిష్‌వారు చాల కాలమునాఁటి పంచదారచట్టమును త్రవ్వి దీసికొనివచ్చిరి. మొదట నీచట్టము క్రీ. శ. ౧౭౩౩ న సృష్టింపఁబడినప్పటికి నిరర్థకముగ పడి యుండెను. దానినే యిప్పుడు బాగుగ అమలులోనికిఁ గొనిరావలెనని బ్రిటిష్‌వారు నిశ్చయించిరి. దీనివలన పడమటి ఇండీస్‌దీవుల (West Indies Islands) లోని బ్రిటిష్ ఇలాకాలనుండి తప్ప తక్కిన ఫ్రెంచి, స్పెయినువారి యిలాకాలనుండి వచ్చుబెల్లమునకై గాలనున కాఱుపెన్నులచొప్పున పన్ను వలసలవారి కియ్యవలసివచ్చెను. న్యూ-ఇంగ్లండులోని ప్రజ లందఱు నిందులకు విముఖత్వ మూనిరి. రమ్ (Rum) సారాయము నుత్పత్తి చేయుట కీబెల్లము దమ్మాలమున మిగుల నష్టము కలుగు నని వారు మొఱలిడసాగిరి. కారణ మేమన, ఆఫ్రికాతోడను, కోయహిందువులతోడను జరుగువ్యాపారమునందు రమ్ సారాయమే వినిమయపదార్థము. అది యెటు లుండ వలసలవారివలన సొమ్ము బిల్లులకు సొమ్ము నియ్యవలసివచ్చినయెడల నాణెములరూపమున కొనుంగవల దని పార్లమెంటువారొక యుత్తరువును జారీచేసిరి. వలస లలో క్రెడిటువిధానమును నాశన మొనరించుటకే ఇట్లు చేసి రని అధినివేశవాసులు చింతిల్లసాగిరి. పిదపఁ గోడు వర్జీనియాయందు పొగాకుపత్రకమునకు ఋతి చేయుఁనలాగున పెన్నిచట్టములు కొన్ని నిర్మింపఁబడినవి. వీనిహేతువున వాలుసువందల రూప్యములు దొరక వలసిన యొక వ్యాపారి కొకప్పుడు వందరూప్యములే దొరకుచుండెను, కేటలోకపఱయందున తక్కిన దొరకవలసినయతని కెక్కిన దొరకు టయుఁ గలుగుచుండెను. పొగాకుపంట బాగుగ పండినసంవత్సరమున పోరాటము లెక్కువ యగుచుండెడివి. మఱియు పైని వచించినరీతిని కోయహిందువుల ఉపద్రవములనుండియుఁ, దక్కిన యూరోపియన జాతులనుండియు అమెరికాను గాపాడుట కేర్పడు సైన్యమునకై యూఁదులకుఁలపోనులు వ్యయ మగు నని యెంచవారైరి. దీనికొని అందు ౮౫,౦౦౦ ల పౌనులు పంచదారచట్టముచే రావచ్చునను నూహతో ఒక లక్షపౌనులకై పను వలసలనుండి రాఁబట్టుకొనవలెనని క్రీ. ౧౭౬౫ వ సంవత్సరమున బ్రిటిష్‌వారు స్టాంపుచట్టము (Stamp Act) నొక దానిని తయారుచేసిరి. పంచదారచట్టమును పన్నుంటిరేయిది వచ్చి నందున దీనికి మఱింత ప్రతిఘటనము చెలరేఁగెను. కొన్ని వలసలలోని వ్యవస్థాపకసభలు (Legislative Assemblies) సైతము ఈ చట్ట మును తిరస్కరించెను. న్యూయార్కుపట్టణమునం దొకమహాసభ (Congress) సమావేశమయ్యెను. ౯ వలసల ప్రతినిధు లచ్చటికి వచ్చి యాచట్టమునకు వ్యతిరేకముగ తీర్మానములను సలిపిరి. పెద్దపెద్ద రేవు పట్టణములందును, దేశమందలి మఱికొన్ని నగరములందును 'స్వేచ్ఛా పుత్రులు' (Sons of Liberty) అని కొందఱు బయలుదేఱి యాచట్టమునకు ప్రతికూలముగ నాందోళనము సలుపసాగిరి. తుదకు దీని మఱింత వ్యర్థముగ నెదుర్కొనుటకై అమెరికనులు విదేశ వస్తుబహిష్కరణము నవలంబించిరి. ఒక్క యింగ్లండునుండియే కాదు, సమస్తవిదేశములనుండియు నెట్టిపదార్థములను దెప్పించుకొనఁ గూడ దనియు, మితవ్యయమును గలిగి సామాన్యజీవనముతో స్వదేశవు వస్తువులనే యుపయోగించుకొనవలయు ననియు వలసలవారు నిశ్చ యించుకొనిరి. దేశీయవార్తాపత్రిక లన్నియు నీయుద్యమమును బ్రోత్సా హించెను. దీనికి బ్రోద్బలముగ చిన్నిపుస్తకము లనేకములు వెలువడినవి. వర్జీనియాలోని ప్రముఖు లగు పాట్రిక్‌హెన్రీయును, మసాచూ సెట్స్‌ప్రతినిధులును ఈచట్టములకు ప్రతికూలముగ తీర్మానములను సలిపిరి. వర్జీనియావారు చేసిన యీమంతీర్మానములలో రెండింటియందు రాజపక్షపాతులు నడుమఁ ద్రోక్కి బాధింపవలెనని యుండినందున సర్వాంగీకారమును బొంద నప్పటికిని యీ దేశమం దంతటను ప్రచురింపఁబడెను. మసాచూసెట్స్‌ప్రజలు ప్రత్యేకమహాసభను జరప వలయు నని కోరిరి. జేమ్సుఓటిస్, సామ్యుయల్ ఆడమ్సు ప్రధాన కార్యకర్తలై కాంగ్రెసునీతిని బలపఱచుచుండిరి. క్రమముగా ఆడమ్సు నేతృత్వమును వహించి బోస్టనుపట్టణమునఁ గూడినసభనే మహాసభగ మార్చి ప్రభుత్వమును ధిక్కరించెడువారు నేర్చెను. న్యూ-ఇంగ్లం డులోని పట్టణము లన్నింటియందు నీస్వాతంత్ర్యోద్యమము బాగుగ వ్యాపించిపోయెను.

కాని ఈపైని వ్రాసినదానినిబట్టి దేశ మంతయు నీయుద్యమ మున కనుకూలముగ నుండె నని తలఁచుటకు వీలు లేదు. దీనికి ఘోర శత్రువులై దీని నెట్లయిన ధ్వంసము చేయవలె నని పాటుపడిన ప్రతి కూలురును లక్షలకు మించియుండిరి. దేశమధ్యమందలి వలసలలోను, దక్షిణసముద్రతీరమునను పట్టణములు మారుమూలముగ నుండినకారణ మున నీయుద్యమమునకుఁ దగినంత ప్రోత్సాహ మచట లేకుండెను. ప్యూరిటనుల (Puritans) ప్రభావము బాగుగ లేనిప్రదేశములం దును నిది పరిమితముగనే యుండెను. న్యూయార్కు ప్రాంతమునందలి కృషీవలులును, జర్మనీదేశపుభక్తులును (Pietists), దేశమం దంతట నున్న క్వేకర్లును (Quakers) — వీ రొకవిధ మగుశాంతి, సహన, నిరాడంబరముల నభిలషించువారు — ఈయుద్యమమును నుపేక్షించిరే యుండిరి. పెన్సిల్వేనియాయందు పశ్చిమభాగమున నివసించువారు తూర్పువారితో సమానప్రాతినిధ్యముకొఱకుఁ బోరాడుచు ఈసార్వ జనికోద్యమమునెడల విముఖులై యుండిరి. ఉత్తర కరోలీనా, దక్షిణ కరోలీనాపరిసరములలో నివసించువారును దీనియెడల సంపూర్ణసహాను భూతిని గలిగియుండలేదు. వీ రంతకంటెను మిన్నగ టోరీలు నం డలగు ఉపరుక్తవర్గమువారు న్యాయానుపూర్వకముగ అమెరికనులకు ప్రతిపక్షులై యుండిరి. కాని యుద్ధ మారంభమైనది మొదలుకొని అంత మగువఱకును న్యూ-ఇంగ్లండు వర్జీనియావాసు లుమాత్రము అసా మాన్యమైన పట్టుదలను, ధైర్యసాహసములను గలిగి నిలువఁబడి యుండిరి.

క్రీ. శ. ౧౭౭౪ వ సంవత్సరము దేశమందలి మహాసభ (Congress) పాలకులచేతను క్రాంతిసంఘము (Revolutionary) గ నెంచఁబడుచు వచ్చినది. అనఁగా అందలి సభ్యుల ప్రతిపాదనము

లన్నియు బ్రిటిష్ ప్రభువుల కవాదరణీయములు. కాని పత్యేలందఱు సమావేశమై అమెరికనుల కోరికలు న్యాయసంగతములైన వని తీర్మానించి తదనుసారము ఇంగ్లండునకు విన్నపముల నంపిరి. ఆవిన్నపము లలో అమెరికనులయధికారములను బయలుపుచేయుటకై పిదప బ్రిటిషు వారి పూర్వుల సిద్ధాంతములను ప్రమాణములుగాఁ జూపిరి. సామ్రాజ్యములోని ప్రజ లందఱును సమానాధికారములు గలిగియుండుటం జేసి అమెరికనులకును అట్టి హక్కు కల దని నిరూపించిరి. పంచాయతీ (Jury) ద్వారా న్యాయవిమర్శనము జరుగుటయు, స్వకీయ ప్రతినిధ్యములుగల సంఘములవలన పన్నులు విధింపఁబడుటయు మను నీ రెండు హక్కులను స్టాంపుచట్టము భగ్నము చేయు నని వీరి వాదము. వీరి మతానుసారము పార్లమెంటు ఇంగ్లండునకే ప్రతినిధి కాని సమస్త సామ్రాజ్యమునకును గాదు. తమ దేశములోని తమ ప్రాతినిధ్యముగల సంఘములే తమమీఁదను పన్నుల విధింప నధికారము గలిగియుండును. పార్లమెంటు అట్టిది కాకపోవుటచే దాని యుత్తరువుల నంగీకరింప వలసిన బాధ్యత తమకు లే దని ద్రువపఱిచిరి. దీనికిఁదోడు మానవులకుఁ గల జన్మస్వాతంత్ర్యములను బొందుపఱిచిరి. అమెరికనుల కింగ్లండు-పార్లమెంటును స్వీకరించునంతులకు దానిలో తమ ప్రతినిధ్యము లేదు సరిరేకదా, అట్టి సంబంధమును గల్పించుకొనుటకు తమ కెవిధమైన యభిమతమును లేదని స్పష్టీకరించిరి.

న్యూయార్కునందు కాంగ్రెసు సమావేశమగుటకుఁ బూర్వమే చట్టవిధి ప్రకారము మూఁడునెలలలో అమలులోనికి వచ్చు ననఁగా దీనికి ప్రతికూలకార్యములు పలుకడల జరగసాగెను. స్టాంపులను పంచవలసినవా రాపనులకు రాజీనామా లొసంగ బాధ్యులైరి. జార్జియాలోఁ దప్పఁ దక్కినవలసలలో స్టాంపులయుపయోగమే నిలిపి వేయఁబడెను. పలుచోట్ల స్టాంపులతో పనిపడువ్యవహారములే నిలిపి వేయఁబడినవి. కొన్నిచోట్ల స్టాంపులు లేకయే వ్యవహారములు జరగి పోవుచుండెను. ఇందువలన పాలకులీచట్టమును తగినంత దిటముగ అమలునందు పెట్టఁజాలకపోయిరి. అంగుచే నిది బలహీనము గాఁజొచ్చెను. అవల ఇంగ్లండులో నప్పటికి వలసలవారిదరఖాస్తు లన్నియు బ్రిటిషువారివలె పేక్షకే పొందినవి. కాని ఇట్టిపరిస్థితు లందే రాకింగ్‌హాం అనునతఁడు మంత్రిపదము నంది స్టాంపుచట్టమునకు ముఖ్యకారకుఁడైన గ్రెన్‌విల్లి పదభ్రష్టుఁడై పోయెను. మంత్రిమండలయును మాఱిపోయెను. క్రొత్తగ నేర్పడినమంత్రు లీచట్టము నెడల నుపేక్షాభావ మూనియుండిరి. అంత నీచట్టమును రద్దుపఱుచు ప్రయత్నములు జరగసాగెను. ఇందుమగూర్చి పార్లమెంటునం దభిప్రాయభేదము లేర్పడెను. వలసలదరఖాస్తులపైని వాదవివాదములు జరగసాగెను. హక్కులవిషయమున ప్రస్తావించుచు పార్లమెంటునకు సర్వాధికారము కల దనియు, స్వదేశమునకే గాక సామ్రాజ్యమంతటను పన్ను విధించుటకు దాని కధికారము గల దనియు లార్డ్ మాన్స్‌ఫీల్డు వాదించియుండెను. కామ్డెన్, పిట్ ప్రభృతు లట్టి హక్కు పార్లమెంటునకు లే దని వాదించిరి. రెండునెలల పర్యంతము వాదవివాదములు జరుగుచునే యుండెను. తుదకు కాలానికి కపరిస్థితులయం దవసర మని ౧౭౬౬ నందు స్టాంపుచట్టము రద్దుగావింపఁబడినది. కాని డిక్లరేటరీచట్టము ననే దొకదాని నమెరికనులపై విధించిరి. ఇందువలన వలసలమీఁద నింగ్లండుయొక్క అధిపత్యము నిలవమే యగుచుండెను. కాని యప్పటికి వలసలవారు దీని నెదిరింపక మం దిట్టిపన్నులను విధించినచో ప్రతిఘటింపవలె నని నిశ్చయించుకొనిరి. అట్టియవకాశము లభించుటకును ఎక్కువకాలము పట్టలేదు. ౧౭౬౭-వ సంవత్సరమున 'టౌన్‌షెండు చట్టములు' బయలుదేఱినవి. సైనికవిద్రోహాపుచట్టము (Mutiny Act) ఇందులోనిదే. పడమటి సరిహద్దులలో క్రొత్తగ నేర్పడిన రక్షకసేనలనిమిత్తము నీచట్ట మావిర్భవించినది. కాని యూరోపులం దెక్కడఁగాని సైనికులకు లేని యనవకోధములు కొన్ని అమెరికనుసైనికులకొఱకు నిర్మింపఁబడినందున న్యూయార్కునందలి అసెంబ్లీయే మొదట నిందుల కంగీకరింపదయ్యెను. కాని యచటిగవర్నరు తన పలుకుబడివలన దానిని పునర్విచారణలోనికిఁ దీయించి యందలి యంతిమభాగము నామోదించులాగునఁ జేసెను. ఇదే తరుణమున ఇంగ్లండులో పిట్ - గ్రాఫ్టన్ మంత్రివర్గ మధికారమునకు వచ్చెను. అప్పుడు చార్లస్ టౌన్‌షెండ నునతఁడు ట్రెజరర్ (కోశాధ్యక్షుఁడు) ఎక్స్‌ఛెకర్ ఛాన్సెలర్‌గ నుండెను. ఇతఁడు పిట్ అస్వస్థుఁడుగ నుండినందున మంత్రివర్గమును తనయధీనమం దుంచికొన సమర్థుఁడయ్యెను. అప్పుడితఁడు తనతోడివారిని, పార్లమెంటును ప్రోత్సహించి వలసలమీఁద పన్నుల విధింప మూఁడు బిల్లులఁ దయారుచేయించెను. వానిలో నొక దానిద్వారా సైనికవిద్రోహశాసనచట్టప్రకారము నియమములను లోకులచే నమలులోఁ బెట్టింపనంతవఱకు నీక మం దేవిధమైన కార్యములను వలుఁ గూడ దని న్యూయార్కునందలి అసెంబ్లీని రద్దుపఱిచెను. క్రమముగ నీబిల్లు లన్నియు చట్టములుగఁ బరిణమించెను. బోస్టనునగరమున కర గ్రహణసంఘము (Custom Board) నొకదాని నేర్పఱచుటవిషయమున నొకబిల్లు ఉండెను. అమెరికనులలో దాని నెవ్వరును అర్థగింపరైరి. కాని వ్యాపారనియంత్రణయుక్తమైన చట్టమునకు ముదోత్తర ప్రతివాదము లారంభమయ్యెను. గాజు, సీసము, బొమ్మలరంగులు, కాగితములు, తేయాకు లోనగువానిపైని పన్నులు విధించి వానివలన వచ్చుధనమునుండియు, కవిన్యాయమండియు వలసలలో పనిచేయు నాంగ్లేయగవర్నరులు, జడ్జీలు మొదలైనవారికి మాసవేతనము లొసఁగుట కేర్పాట్లు జరగెను. ఇట్లు వలసలయందు దిగుమతియధికారు లందఱును ప్రాంతిక-అసెంబ్లీలతో నెట్టిప్రమేయమును లేకయే ఇష్టము వచ్చినరీతిని పలుకుటకు స్వాతంత్ర్యమును బొందిరి. పన్నుల నియమ్మనివారిని పంచాయతీ (Jury) విచారణ అక్కఱలేకయే కోర్టుల సాయముతో అడ్మిరాల్టీకోర్టులందు విచారించి దండింపవలయు నని యుత్తరువు చేయఁబడెను. కావున వలసలలో వీని కన్నింటికిని విరుద్ధముగ నాందోళనము చెలరేగెను. [illegible] ముఖ్యముగ మసాచుసెట్సువారే తమయొక్క హైందవ [illegible] రక్ష

కారులు కొందఱు చల్పిన కృత్యములచే గాస్పీ యను బ్రిటిషునౌక ధ్వంస మయ్యెను. ఇంగ్లండునందు దీనిని గూర్చి యొక విచారణ జరగెను. దాని ఫలితముగ బ్రిటిషునౌకలు, నౌకానిర్మాణ స్థానములు, శస్త్రములు మున్నగువాని రక్షణముకొఱకు ప్రత్యేకమైన యేర్పాట్లు జరగెను. వలసలయందలి శాయకులు దోషవిమర్శనార్థము ఇంగ్లండునకు పంపఁబడులాగున గన్పట్టెను. మఱియు మసచూసెట్సు గవర్నరు, ఉన్నత న్యాయాలయపు (Superior Court) జడ్జీలు మొదలగువారిని నియమించుట రాజాధికారమున నుండు ననియు, వారికి వేతనములు బ్రిటిషు దొరతనమువలన ముట్టు ననియు ఒక నియమ మేర్పడెను. ఈ కారణము లన్నింటిచే వలసలలో మరల ప్రబలమైన యాందోళనము చెలరేఁగెను. ఈ పరిస్థితియం దెప్పటిసమాచారము అప్పుడు తెలిసికొనుటకును తమవార్తల నందఱకును పంపుటకును వీలగులాగున వలసలవారు వారి వారి రాష్ట్రములలో కొన్నివిధములగు సంఘముల నేర్పాటుచేసికొనిరి. ఇదే సమయమున ఇంగ్లండునందలి ఈస్టిండియా కంపెనీ డైరక్టర్లు అమెరికను వ్యాపార మంతయు డచ్చివారికిఁ బోవుటచే తమకు నష్టము కలిగె ననియు, దాని పరిహారము కొనఁగోరు దనియు పార్లమెంటు వారి కెరిగిరి. అందులకు వారు మంచి దని టీయాకుచట్టము నొక దానిని సృష్టించి టీయాకు నమెరికావలసలకు పంపుఁడనియు, దానిమీఁదగల దిగుమతిపన్నును రద్దు చేసినయెడల నష్టపరిహారము వేఱుగ నియ్యవలసిన యవసరము లేకయే పూర్తియగు ననియు తీర్మానము గావించిరి. ఈవిధానమున కంపెనీవారు డచ్చివారికంటె తక్కువ లాభము పొందఁగల రని వీరు తలంచియుండిరి. కాని దేశమందంతట నింగ్లండునకు వ్యతిరేకముగ నాందోళనములును, ఉపద్రవములును జరుగుచుండుటచే టీయాకును గొనువారే లేరైరి. రెండు దేశములకును గల విరోధము దినదినప్రవర్ధమాన మగుచుండెను. తుదకు ౧౭౭౩-వ సంవత్సరమున కంపెనీవారి టీయాకు న్యూయార్కు, ఫిలడెల్ఫియా, బోస్టను, అన్నపోలిస్ రేవులందు దిగుమతి చేయఁబడెను. కాని ఒక రేవునందైన లోపలి కేఁగనీయఁబడలేదు. బోస్టను నివాసులు ౩౪౨ పెట్టెల టీయాకును సముద్రమునఁ బాఱవైచిరి. ఈ కార్యము చేయునపుడు వీరు గుర్తింపఁబడకుండులాగున రెడ్ ఇండియనుల వేషములను దాల్చియుండిరి. అప్పు డింగ్లండురాజు యొక్కయు, నార్తు మంత్రివర్గము యొక్కయు నధికార మున్నతదశ నందియుండినందున టీయాకు లూటీ జరిగినవెంటనే అమెరికనులు ఘోరనిర్బంధముల పాల్పడఁజొచ్చిరి. నష్టమైన టీయాకు ఖరీదును గట్టి యిచ్చువఱకు బోస్టను రేవు కట్టివేయవలయు ననియు, మసచూసెట్సుయొక్క అధికారపత్రము (Charter) ను లాగుకొని రాజస్వామికమైన వలసగ చేయవలె ననియు, బ్రిటిష్ అధికారుల కర్తవ్యపాలనమున నడ్డగించువారిని బంధించి యింగ్లండునకు పంపవలయు ననియు, వలసలయం దవసరమైనచోట్ల బ్రిటిషుసేనల నిలుపవలయు ననియు, సైనికులకుఁ గావలసిన భవనములు లేనిచో ఖాళీగ నుండు వీగ్రుహస్థులకట్టడములుగాని ధాన్యాగారములుగాని యుపయోగించుకొని వాని యజమానులకు సుదితరీతిని ప్రతిఫలమియ్యవలె ననియు ఉత్తరువులను జారీచేయించి పార్లమెంటువారు వాని నన్నింటిని అమలులోఁ బెట్టింపుఁడని తమ యుద్యోగులకు ఆజ్ఞ నొసంగిరి. తదనుసారముగ వలసలయం దన్నింటను ముఖ్యముగ మసచూసెట్సు వర్జీనియాల యందు భయంకరనిర్బంధము లారంభము కాఁగా ఒక్కటె పెట్టిన కార్యజాలము లన్నియు దాఁటుమాఱైపోయెను.

సామ్రాజ్యము వృద్ధి పొందింపవలె ననుతృష్ణతో బ్రిటిష్వారు ప్రపంచమందలి వివిధభాగములతో సంబంధము గలుగఁజేసి కొనుచున్నందులకు ఫలితముగ ననవసరములైన విషయములలోనికిఁ దన్నుదగూడ దించుచున్నారని మేధావులగు వలసలవారలు చాలకాలముక్రిందటనే గ్రహించియుండిరి. ఇట్టిపరిస్థితులవలన నే అప్పుడు మరల క్విబెక్కుచట్టమొకటి జన్మించెను. తదనుసారము వలసలపడమటిభాగము నంతయు ప్రభుత్వమువారు క్విబెక్కు ప్రాంతమునందుఁ గలిపిరి. ఇందుచే వలసలవారికి పడమటఁ బ్రసరించుటకు ప్రతిబంధకము లేర్పడెను. అదిగాక క్విబెక్కు ఇలాకాయందు రోమనుకాథలిక్కుమత మెక్కువగుటంజేసి క్రొత్తగఁ గలుపఁబడిన దేశమందలి ఇతరమతస్థులకు బాధాకర మయ్యెను. అల్లరులకు, అసంతుష్టికి, విద్రోహములకును ప్రధానకేంద్రము మసచూసెట్సు ఉపద్యుక్తములైన చట్టములు, ఉత్తరువులు సరాసరి మసచూసెట్సును తగులునవియే యని చదువరులకే వ్రాయఁబడినది. ఒకదానివలన బోస్టను రేవు మూఁతపడెను. వేఱొకదానివలన ప్రజలందఱు కొన్నసభ అంతర్ధానమై రాజనియుక్త మగుసంఘము ఏర్పడెను. ఆ వలసవారికి వోటు నొసంగినట్టి యధికారము పోయెను. మఱియొకచట్టము ననుసరించి నేర మొనరించువారు స్వదేశముఁ గాక ఏయన్యదేశమందో లేక ఇంగ్లండునందో దోషవిచారణముకొఱకు పంపఁబడవలసియుండిరి. అమెరికాయందు ముఖ్యసేనానిగ నుండిన థామస్ గేజ్ అనువానిని మసచూసెట్సునకు గవర్నరుగ నియమించి క్రొత్తనియమముల నన్నింటిని సైనికబలముద్వారా అమలుపఱచుటకు బ్రిటిష్వా రధికార మిచ్చిరి.

బోస్టనురేవు మూఁడఁబడినప్పు డీవిపత్తి నినుకొంది తెలిసిన తోడనే తక్కినవలసలవా రందఱును స్థానిక, ప్రాంతీయసభలను గావించి మసచూసెట్సు, వర్జీనియాలు సూచించినవిధమున సార్వదేశికమైన కాంగ్రెసును సమావేశ మొనరింప నిశ్చయించిరి. అందు జార్జియావలసనుండి తప్పఁ దక్కినయన్నింటినుండి ప్రతినిధు లేతెంచిరి. వీరిలో దేశాభిమానులు ఆనాడెందరో లెక్కువగ నుండిరి. వీరందఱును బాహాటముగ ఇంగ్లండుతో యుద్ధ మొనరింపవలె ననియే కోరుచుండిరి. జోసఫ్ గాలోవేవంటి నేర్పరులు కొందఱు శాంతియుత మగుసంధికిఁ బ్రయత్నించిరి. తీవ్రవాదవివాదములనంతరము తమ కేర్పఱచు కొనిన అసెంబ్లీలకుఁ దప్ప నితరులు తమపై పన్నుల విధించుట కధికార ముండరాదని స్థిరపఱిచిరి. ౧౭౬౩-వ సంవత్సరము మొదలుకొని పార్లమెంటువారు తమమీఁదఁ

పేయుఁగవలెనచట్టములను, పన్నులను ఉదాహరించి కొకదాయకము లగుపట్టివిధానముల నమెరికను లెంతమాత్రము సమ్మతింపఁగూడ దని తీర్మానించిరి. పార్లమెంటు చేసిన క్రొత్తయుత్తరువులను నిరసించుచు మసచూసెట్సుతీర్మానముల నామోదించుటయే కాక వానిని కార్యము లోనికిఁ దెచ్చునప్పుడు బలము ప్రయోగింపవలసివచ్చినయెడలఁ ఎక్కడ వలసవా రందఱును సాహాయ్యము చేయవలయు ననియు నిశ్చయించిరి. వెండియు ప్రతివలసయందును సంఘముల నేర్పఱచుకొని వాని ద్వారా తమ ప్రచారకార్యములను నెఱవేర్చుకొనవలెనని రూఢిపఱచు కొనిరి. అంతమున నీతీర్మానముల నన్నింటిని కాంగ్రెసువా రింగ్లండు రాజునకును, వలసలనివాసులకును, క్యూబెక్కు ప్రాంతీయులకును, గ్రేటుబ్రిటను ప్రజలకును పంపించిరి. కాని పార్లమెంటునకుఁ బంపరైరి.

కాంగ్రెసుయొక్క సంఘనిర్మాణాదికార్యములు మిగుల సాహసోత్సుకము లైనవి. జాయమాన నూతనప్రభుత్వ సంఘటనమున కంకురభూతములైన విషయము లిం గుండెను. సంఘము (Association), అనాగామితము (Non-Importation), అనిర్యాతనము (Non-Exportation) లనునవి వీరలయీకార్యక్రమమునందు జనించినవే. వీనికిఁ దోడుగ కృషిని, దేశీయపరిశ్రమలను ప్రోత్సహించుటకును, క్రొత్తగ కల్పించుకొన్న కార్యవిధానము లన్నింటిని అమలులోఁ బెట్టించుకొనుటకును మఱికొన్ని సంఘములు (Committees) ఏర్పఱచుకొనిరి. బహిష్కరణసిద్ధాంతానుసార మమెరికను సంఘముల నియమములను స్వీకరించి తదనుకూలముగ వర్తింపనివారిమీఁద వలసలవారును, స్థానికసంస్థలును నిర్బంధముల ప్రయోగించుటకును నిష్కర్ష కావింపఁబడెను. స్టాంపుచట్టము పుట్టినది మొదలుకొని యిట్టి విధానము లప్పుడప్పు డవలంబింపఁబడుచునే వచ్చినది కావున నిపు డీసంఘము లన్నియు శీఘ్రముగ కాంగ్రెసుతీర్మానములను కార్యరూపమునఁ బెట్టుట యందే నిమగ్నము లయ్యెను. ఈసంఘములద్వారా రాజపక్షీయు లెవరైనదియు, జాతీయపక్షీయు లెవరైనదియు గుర్తింప నుచితావకాశము దొరకెను. కాంగ్రెసుతీర్మానములను రాజపక్షీయులు సమ్మతింపరైరి. అట్టివారిపై నిర్బంధము లెక్కుడయ్యెను. జాతీయులు వీరిని దోషులుగ గణించి విచారణపూర్వకముగఁ గొందఱకు కారాగారశిక్షయు, మఱికొందఱకు ప్రవాసశిక్షయు విధింపసాగిరి. కాంగ్రెసుయొక్క సాధారణనియమముల ననుసరించి పనిచేయఁగడఁగిన క్రాంతికారకము లగు స్థానికసంస్థ లన్నియు నిటులే కావింపుచుచ్చెను. ఈసంస్థలే తుదకు నూతనప్రభుత్వమునకు మూలాధారము లయ్యెను. మీఁదఁ బేర్కొనిన యీప్రధానకార్యములే మొదటి సార్వజనికమహాసభ (Continental Congress) వలనఁ గావింపఁబడినవి. కాఁగ గావించుకొనిన తీర్మానములు కేవలముగా నప్పటిరాజకీయపరిస్థితులం దేవిధమైన మార్పులనుగాని బ్రిటిష్‌ప్రభుత్వమువారు చేయనియెడల ౧౭౭౫-వ మే నెలలో మరల సమావేశ మగుట కేర్పాట్లను చేసి కాంగ్రెసువా రప్పటికి విరమించిరి.

వలసలవారి యీకార్యక్రమమువలన ఆంగ్లేయ దొరతనమువా రత్యంతము క్రోధపూరితు లైరి. అమెరికనులసంపూర్ణానదరఖాస్తులను విచారించి సమాధానపూర్వకముగ వారికిఁగల దుఃఖములను దొలఁగించుటకు మాఱు నియమనచట్టము (Restraining Act) కొకదానిని బ్రిటీషువారు వారిమీఁద వైచిరి. ఇందువలన వలసలవారి మత్స్యవ్యాపారమునకు ప్రతిబంధము కలిగెను. బ్రిటీషుదీవులతోఁ దప్ప నితరులతో వ్యాపారము సలుపుట కమెరికనుల కధికారము లేకపోయెను. బ్రిటీషువా రంగీకరించిన పద్ధతులద్వారా ఉచితమార్గమునఁగాక అమెరికనులు స్వయముగ నేర్పఱచుకొన్న క్రాంతిసమాజములు, కాంగ్రెసులు సలుపు పోరాటవిధానము లన్నియు రాజద్రోహకము లని పాలకులు నిరసింపసాగిరి. అమెరికను లేర్పఱచుకొన్న సంఘములును నిర్బంధమార్గముల నవలంబించి రాజపక్షీయుల జడిపించుచు, తమవిధానములను కార్యరూపమునకుఁ దెగడెఁగినందున, సామ్రాజ్య వ్యాపారమున కమితముగు నష్టము కలుగసాగెను. అందుచే ఆంగ్లేయులకు యుద్ధముచేసి ప్రతీకారము గావించుకొనుట తప్ప వేఱొండుమార్గము లేదయ్యెను. ఇటు వలసలవారలును యుద్ధ మవశ్యంభావి యని తలపోయుచుండిరి. న్యూ-ఇంగ్లండునం దన్నికడల నిట్టి ప్రవాదములే వ్యాపించియుండెను. మసచూసెట్సునందు ప్రాంతికసభ సమావేశమై రాజ్యభారమును హస్తగతము గావించుకొని స్వకీయరక్షణము (Defence) నందు మగ్నమయ్యెను. కాంగ్రెసు లేనికాలమున తత్స్థానమున వ్యవహారములను జరుపుటకై అమెరికనులు రక్షకసభ నొకదానిని స్థాపించుకొనిరి. అటు బోస్టనునగరమందలి యాంగ్లేయ గవర్నరు థామస్ గేజ్ అనునతఁడు దుర్గమును మరమ్మతు చేయింప మొదలిడె. వలసలవారు సంగ్రహించుచుండిన యుద్ధసామగ్రులను కొల్లగొట్టించుటకై యవకాశమును వెదకుచుండెను. ఇటు అమెరికనుల పక్షమున వర్జీనియాయందు వాలంటీరుదళములు ప్రోగగుచుండెను. బోస్టను, న్యూయార్కులందువలె దక్షిణకెరోలీనాయందును తేయాకు ధ్వంసము చేయఁబడెను. ఆదటిపాలనాధికారము నంతను అమెరికను సంఘము హస్తగతము చేసికొనెను. న్యూయార్కు, ఫిలడెల్ఫియా పట్టణములను ముఖ్యస్థానములుగఁ జేసికొని అమెరికనులు దేశ మెల్లడల విప్లవప్రచారమును సలుపఁదొడఁగిరి. అటు ఇంగ్లండులో ౧౭౭౪-వ సంవత్సరమున పార్లమెంటుసమావేశము కాఁగా నందు రాజును మంత్రివర్గమును అమెరికాయం దతిభయంకరమైన విప్లవము పెరుఁగుచున్న దని యుద్ఘోషించిరి. పార్లమెంటులోని రెండు సభలవారును దీనిని ధ్రువపఱిచిరి. అప్పు డీరెండుదేశములవారికిని సమాధానము కలిగింపవలె నను నాశతో చాథాం ప్రభువు (Pitt) కొన్ని షరతుల నాదించెను. తదనుసారము 'ఇంగ్లండుపార్లమెంటు వలసలమీఁద నేవిధమైన పన్నును విధింపఁగూడదు. కాంగ్రెసువారే వారియిష్టానుసారము విధించుకొనవచ్చును. కాని పార్లమెంటు నిష్కర్ష చేయు కప్పమును కాంగ్రెసు ఇంగ్లండునకు చెల్లించుచుండవలెను. వ్యాపారము, జలయానము మొదలగునియమములం దెట్టివి

వదలఁగూడదు. అని సైనికుల సంఘమును శాసించెను. వాషింగ్టనునకు మతిశంకావ్యాకులమును గలుగఁజేసినది సైనికుల నిరంకుశశీలవర్తనము. సేనానివేశములను గావలి గాచు పహారాదారులు (Sentries) అప్రమత్తులై యుండవలసిన గలిగియుండక పరాకుతో వర్తించుచు శత్రువులతో నైతము ప్రసంగములను సలుపుచువచ్చిరి. ఈదురభ్యాసము నితఁడు తీవ్రముగ ఖండించి అమెరికాదేశమున జనింపనివానికి, అచట భార్య, బిడ్డలు, కుటుంబము లేనియతనికి పట్టెడు స్థిరగౌరవము గల పదవు నెప్పటికి నీయఁగూడదని నుండిశముగ శాసించెను. మఱియు విదేశీయులను సేనయందు చేర్పవలదని యాజ్ఞాపించెను. ఇతనియీనియమము కొంతయు సంగత మైయుండెను, ఎందుచేత నన యుద్ధ మారంభమై రెండుసంవత్సరములు గడచినపిదప నితఁడు పోర్జ్ లోయయం దుండఁగా ౧,౧౩౪ గురు సైనికు లితనిని విడనాడి పఱచి పోయిరి. వారిలో ౨౦౦ మంది మాత్రమే అమెరికాదేశీయులు. తక్కినవా రందఱును విదేశీయులే. ఇ వన్నియు నిట్లుండ నితఁడు ముఖ్యులగు అఫీసరులను నియోగించి సైనికులకు క్రమమైన యుద్ధశిక్షణము నిప్పించెను. అనంతర మితఁడు బోస్టను నగరమును ముట్టడించి వాగించుచు ఒకదళముసేనను సిద్ధము చేయించి దానిద్వారా బ్రిటీషువారికిని దుర్గముల వరికట్టించెను. పిమ్మట నితనికిఁ దోహ్వత వచ్చిన ఫిరంగుల సాయముతో హార్చెస్టరుకొండల నాక్రమించుకొని యచట సేనారక్షకస్థానములను నిర్మింపఁజేసెను. ఇట్లు బోస్టను-ఆక్రమణము జాగ్రత్తతో తీవ్రముగుచుండుటమాది యింక నచట నుండుట క్షేమంకరము గాదని జనరల్ హో అప్రదేశమును వదలి నోవాస్కోషియాయందలి హాలిఫాక్సుపట్టణమునకుఁ బోయి చేరెను. కేవులందు బ్రిటీషువారి నాకల వరికట్టుటవలనఁ గూడ అమెరికనులకుఁ గొన్ని యుద్ధసామగ్రులు లభించెను.

టికండెరోగాదుర్గము స్వాధీన మైనపిదప ఆర్నాల్డు కొంత సేనతో మెయినురాజ్యములోని ఘనాటవులఁబడి ప్రయాణముల సలిపి క్వొబెక్కునగరమును ముట్టడింపఁబోయెను. అక్కడి నతఁడు తనకంటె ముందుగనే చేరియున్న జనరల్ రిచర్డు మాంటుగొమరీతోఁ గలసి పట్టణమును ముట్టడించెను కాని సఫలుఁడు కాలేదు. యుద్ధమున మాంటుగొమరీ హతుఁడయ్యెను. అంత ఆర్నాల్డ్ మిగిలిన సేనతో చాంప్లెయిన్ సరోవరముం జేరి దానిని దనవశముం దుంచికొనుటకై ఒక చిన్నజలసేనను నిర్మాణము సేయింపఁగడఁగెను.

ఇన్ని ఘటనములు జరిగినపిమ్మట నింగ్లండు ప్రధానమంత్రి యగు లార్డు నార్తు (Lord North) సమాధాన మనుపేరఁ గొన్ని షరతులను తెలిపెను గాని అమెరికాకాంగ్రెసు వీనిని పరాసరి తిరస్కరించెను. అది యెందుకొని పార్లమెంటువారు తెచ్చినషరతుల నన్నింటిని కాంగ్రెసు నిరాకరించుచువచ్చెను. అందువలన బ్రిటీషుపాలకులు మఱింత తీవ్రములైన నిర్బంధములకు దిగిరి. ౧౭౭౫-వ సంవత్సరము అక్టోబరుమాసమున పార్లమెంటునందు వ్యాఖ్యాన మొసంగుచు మూఁడవజార్జి రాజుగారు వలసలవారిని సంపూర్ణముగ నణఁగఁ

ద్రొక్కి లొంగఁదీయవలయును గాని వేఱుమార్గము లేదని వక్కాణించెను. పిమ్మట రెండుకాలలకు మీఁదివచించినవిధముగ వర్తకచట్టమునకుఁ దోడుగ నిషేధకచట్ట మొకటి (Prohibitory act) వలసలపై విధింపఁబడెను. తదనుసారము ఇతరదేశములవారెవ్వరును వలసలవారితో ఏవిధమైన వ్యాపారములను గాని వ్యవహారములను గాని సలుపఁగూడదు. అట్లు గావించినయెడల నట్టివారి నౌకలు యున్నయెడల జప్తు చేయఁబడును. ఈచట్టమువిషయమున ఆడమ్సు వక్కాణించిన విధమున నిది యొకప్రకారముగ యుద్ధప్రకటనమే. వీని కన్నింటికి వనుగుణముగ ఆంగ్లేయులు లింకను సేనల నభివృద్ధి చేయవలయు నని నిశ్చయించి అధికారుల కట్టియుత్తరువులనే పంపి అమెరికనులతోఁ బోరాడుటకు జర్మను సైనికుల సంగ్రహింపఁబూనిరి. విశాలమగు జల, స్థలసైన్యములను అమెరికాయందు సమకూర్చి యందునుండి కొంతభాగమును న్యూయార్కునకును, దక్షిణవలసలందును విప్లవకారుల మీఁదికిఁ బంపి తక్కినదానిని కెనడాదేశమునకును బంపవలయు నని నిశ్చయింపఁబడెను. మఱియు అల్లరు లెచట ముమ్మరముగనో, ఎచట కొంతకాలముపర్యంతము విద్రోహ మెదిరించి పోరాడుట సంభవమో యాప్రదేశముమీఁదనే ముందు దండెత్తి విప్లవము నడంచివేయవలయు నని తీర్మానింపఁబడెను. వలస లన్నింటిలో నెక్కువ జనసంఖ్యగల భాగము చెసపీక్ అఖాతమున కుత్తరముగ నుండెను. అమెరికనుల కాహారాదులు రావలసినది ఉత్తరమునుండియే. కావున నికముం దారంభింపఁబోవుయుద్ధమునకు కేంద్రస్థానముగ న్యూయార్కుపట్టణమును గావింపవలయు నని నిశ్చయింపఁబడెను. మఱియు కెనడానుండి దక్షిణమునకు నిరాటంకముగ రాకపోకల సలుపుటకు హడ్సను నదిలోయను తమవశముం గుంచుకొనవలె నని ఆంగ్లేయులు నిశ్చయించుకొనిరి. ఇందువలన దక్షిణవలసలవారిని ఉత్తరమునుండి విడఁదీసినయట్లగును. అమెరికనుల ఐక్యమును భగ్నము చేయుటకిది ఒక్కటియుపాయమే కాగు, తక్కువ ఎదురుబొట్లు గల కోట్ల ముందు యుద్ధము సలిపి యక్కడి కిజనుల నంఘమును హస్తగతులఁ గావించుకొనఁ దెంచిరి. ఒకవైపున యుద్ధకార్యముల కిట్లు అఖండప్రయత్నములను సలుపుచు మఱియొకప్రక్క వలసలు తమయాధిపత్యమును స్వీకరించునెడల కొన్ని షరతులమీఁద సంధి చేయుటకును బ్రయత్నింపుచుండిరి. ఇంగ్లండుదొరతనమువారు తమగవర్నరుల కాజ్ఞాపించిరి. బ్రిటిషువారికి లోఁబడినచో మరల కాంతి నెలకొల్పఁబడు ననియు, జనులందఱును క్షమింపఁబడుదు రనియు, అమెరికనులకు స్వాతిరేకములైన చట్టములు దీసివేయఁబడు ననియు, వలసలకార్యనిర్వాహణములకై కావలసినట్టిన కితిస్వల్పమగు సనముమాత్రము కప్పముగా మాత్రమే రాఁబట్టుకొనఁబడు ననియు ప్రజలకు బోధింపవలసినదిగ దొరతనము వారు తమగవర్నరుల కుత్తరువుల నొసంగిరి. వెనువెంటనే కేవులలో ప్రధానములైన న్యూయార్కు, ఫిలడల్ఫియా, చార్లెస్టను నగరములను లోఁబఱచి వశముం దుంచికొనవలసిన దనికూడ శాసకుల నంపిరి. ఈ సంగతుల నన్నింటిని ముందుగనే యూహించుకొనియుండిన వాషింగ్టను

# అమెరికాస్వాతంత్ర్యయుద్ధము

వారియుపాయములకుఁ బ్రతివిధానములను వన్నసాగెను. న్యూయా ర్కుపట్టణమునకు చుట్టుప్రక్కలందు రక్షణస్థానములను నిర్మింపఁజేసి ౫,౦౦౦ ల సేన నా ప్రాంతములందు నిలిపెను. బ్రిటిష్‌వ్యాపారమును నాశన మొనరించునిమిత్తము అమెరికనులు సైనికులను బ్రయోగించెను. చిన్నయోడలను గట్టించి సముద్రతీరప్రదేశములను గాపాడుటకును, అహారాదిపదార్థములను సమకూర్చుటకును వినియోగించెను. రాజపక్షీయు లను సంపూర్ణముగ నిరస్త్రులఁ జేయించెను. బ్రిటిష్‌వారికి లోఁబడియుం డని యితరదేశములకన్నింటికిని వ్యాపారమునిమిత్తము అమెరికనురేవు లను దెఱిపించెను. వాషింగ్టను చేయుచుండు కార్యకలాపము లిటు లుండ స్వాభావికముగనే ఒకసంవత్సరము క్రిందటి న్యూ ఇంగ్లండులో నుండిన పరిస్థితు లిప్పుడు వలసలయం దన్నింట నేర్పడెను. వలసలలోని కాంగ్రెసునకుఁ జెందినసభ్యు లిన్నాళ్లు సుస్థిరము లయ్యెను. ఇంగ్లం డుతో సంబంధము కలిగియుండుటనుగూర్చి యింతవఱకు కొందఱకి గ్రా యము లెటు లున్నను ఇఁక ముందుమాత్రము దానినుండి సర్వథా విడి పడుటకు బద్ధసంకల్పులై వలసలవా రందఱును స్వాతంత్ర్యఘోష ణము సలుపవలసినదిగా కాంగ్రెసునకు విన్నపములను బంపసాగిరి. తదనుసారము ౧౭౭౬వ సంవత్సరము మేనెలయందు 'సర్వసాధార ణముగా అమెరికాదేశ మంతటికిని, విశేషించి వారివారి జిల్లాల కును ఎట్టివిధానము గల ప్రభుత్వమువలన జనులకు సౌఖ్యము గలుగు నని ప్రతినిధులకుఁ దోఁచునో అట్టిదాని నేర్పఱుచుకొనవలసిన' దని వలసలలోని కార్యకర్తలకు కాంగ్రెసువారు సలహాల నిచ్చిరి. 'వల సలయందుఁ గలుగుబాధలను దొలఁగించుటకై విన్నవించుకొనినవిన్న పము లన్నియు బ్రిటిష్‌పాలకులచే నుపేక్షింపఁబడినవి. వలసలలోని సేనాబల మంతియు దేశీయుల నణఁగఁద్రొక్కు నిమిత్తమే వినియో గింపఁబడుచున్నది. కావున నిట్టి ప్రభుత్వముతో సహకార మొన రించు మని శపథములు చేయుట వలసలకు సహేతుకము గాదు, గౌరవ మును కాదు.' ఇట్టివే యంశములుగల లేఖలనేకములు దీర్ఘకాల ముగ కాంగ్రెసునకు వచ్చుచుండుటంజేసి అప్పటి ప్రభుత్వవిధాన మునందు మార్పుదల చేయవలసివచ్చె నని ప్రకటింపఁబడెను. వలస లన్నియు రాజ్యములు (States)గ పరిణమింపఁ బూనినవారు లంద ఱును స్వాతంత్ర్యఘోషణము సలుపవలసిన దని తమ ప్రతినిధు లను బలాత్కరింపసాగిరి. ఆ కారణమున నదే సంవత్సరము జూన్ నెలలో వర్జీనియానివాసి యగు ఆర్. హెచ్. లీ అను సభ్యుఁడు 'సంయుక్తములైన యీవలసలు న్యాయప్రకారము స్వేచ్ఛాస్వాతం త్ర్యములను గలిగియుండవలయును' అని కాంగ్రెసునందు ప్రతి పాదనము గావించెను. తదితరులు విదేశములతో సంబంధముల సంపాదించుకొనుటవసర మనియు, సంయుక్తరాజ్యవిధానము నొక దాని నేర్పాటు చేయవలయు ననియు నితఁడు వక్కాణించెను. మధ్యదేశపు వలసలకు ప్రతినిధిగ వచ్చిన డికిన్‌సన్ పైని వచించిన కార్యక్రమమునందు పరివర్తనము నభిలషించెను. ముందు సంయుక్త రాజ్య నిర్మాణ మొనరించి, విదేశములమైత్రి సంపాదించుకొని యనంత రము స్వాతంత్ర్యఘోషణము గావింపవలయు ననుట యితనివాదము వందలి సారాంశము. కాని ప్రతిపాదితమైన ఘోషణప్రకటనకే యన్నింటికిని అక్కఱ యెక్కువ గావున దానిని తలక్రిందులు చేయుట అన వసర మని జాన్ ఆడమ్సు మున్నగువారు ప్రతిఘటించిరి. ఈ వాద వివాదముల మూలమునను, దక్షిణకరొలీనావారు అసలు ఘోషణము నకు సమ్మతింపకపోవుటచేతను, ఘోషణప్రతిపాదనము పరిష్కరింపఁ బడవలయు నని మూఁడువారములు గడువొసంగఁబడినది. ఈ యవ కాశకాలములో సంయుక్తరాజ్యనిర్మాణమును గూర్చిన నియమములు, సమాధానములు కొన్ని గావింపబడినవి. [illegible] వేయుటకును, యుద్ధవిషయములందు విచారణపూర్వకముగ నేర్పాటులను జేయుట కును కాంగ్రెసు ఒకనూతనసంఘమును సృష్టించెను. ఇదియే కాలాంత రమున కార్యనిర్వాహకవిభాగము (Executive Department)గఁ బరిణ మించెను. మూఁడువారములు గడచినవెనుక జార్జియా, దక్షిణకరొ లీనా, న్యూయార్కు ప్రజలు దప్పఁ దక్కినవా రందఱును స్వాతంత్ర్యఘోషణమున కనుకూలముగ వోటు (Vote) నొసఁగు దని వారి ప్రతినిధులకు లేఖల నంపిరి. జార్జియా, కరొలీనా ప్రజ లీవిష యమును ప్రతినిధుల యిష్టానిష్టములమీఁద వదలిరి. చార్లెస్టన్ పట్ట ణముమీఁద ముట్టడి జరుగుటకు సంసిద్ధముగ నుండినందున ఆ ప్రతినిధు లిద్దఱును స్వాతంత్ర్యఘోషణమునకే సమ్మతించిరి. ఇంతలో జనరల్ హో అపరములు సేనతో వచ్చి సాండీహుక్కునందు దిగ నున్నవాఁ డను వార్త దేశ మంతటను వ్యాపించిపోయెను. సుశిక్షితులైన ౩౦,౦౦౦ల మంది యోధులుగల సేన యతనివెంట నుండెను. ఈసేనకు సాహాయ్య మొనరింప వెంట నౌకాబలసేనయు నుండెను. ఉద్రేకదాయకములైన ఈవార్త లన్నియుఁ జెవిని బడుటచేత డికిన్‌సన్ అతని యను యాయులతోపాటు ప్రతివాదము లన్నింటిని యుపసంహరించుకొనెను. అంత థామస్ జఫర్సన్ నిర్మించిన పద్ధతిన స్వాతంత్ర్యఘోష ణము ౧౭౭౬వ సంవత్సరము జూలై నాలుగవ తారీఖున ప్రకటింపఁ బడెను. న్యూయార్కునుండి వచ్చినప్రతినిధు లప్పటి ఘోషణ మునుగూర్చి జోక్యము కలుగఁజేసికొనరైరి, కాని కొన్నిదినములు గడచినవెనుక నారాజ్యమందలి సంఘము గూడ దీనిని స్వీకరించెను. ఈ ఘోషణపత్రము (Declaration Document) పైని కాలాంతర మున సభ్యు లందఱును సంతకములు గావించియుండిరి. మసాచూ సెట్స్ అఖాతము, జార్జియా, ఉత్తరకరొలీనా, దక్షిణకరొలీనా, మేరీలాండ్, వర్జీనియా, పెన్సిల్వేనియా, డెలావేర్, న్యూయార్కు, న్యూజెర్సీ, న్యూహాంప్‌షైర్, రోడ్‌దీవి, కన్నెక్టికట్ నామకము లయిన పదుమూఁడు రాజ్యములపక్షమున నీ ఘోషణము గావింపఁ బడెను. అనంతర మీపత్రమునొక్క నకళ్లను రాజ్యములలోని వేఱువేఱు సంఘములకును, సేనలను నడపుచుండిన సేనాధిపతులకును బంపిరి. యూరోపియను లమెరికావారిఁ జోరు [illegible] తరువాత వారివారి హృదయములందు నెలకొనియుండిన స్వాతం త్ర్యదృష్టి ప్రకారముగ కార్యపరిణామము [illegible] ప్రా

# అమెరికాస్వాతంత్ర్యయుద్ధము 

స్వామిక (Democratic) భావనములను, ఆంగ్లేయసామ్రాజ్యమునుండి విడిపడుటకుఁగల కారణములను ఈపత్రమునందు విస్పష్టముగ వివరింపఁబడినవి. అందలి ప్రధానాంశ మేమన —

‘ ప్రభుత్వములు వాని న్యాయాధికారమును పాలితులయొక్క సమ్మతిమీఁదఁ బడయుచుండును. ఏపద్ధతియైనను ఇందులకు విఘాతము కలిగించునది యగుచో నట్టిదానిని రూపుమాపి దానికి బదులుగ నట్టి సిద్ధాంతముల నట్టిపరిపాలనముల స్థాపించుటచేతఁ దమకు రక్షణమును, సౌఖ్యమును గలుగునో యట్టి పద్ధతిని స్థాపించుకొనుటకు ప్రజలకు హక్కు గలదు ’

రాజ్యక్రాంతివంటి యీ మహాకార్యము లన్నియు అమానుషికాత్యాచారముల సహించినమీఁద, నరకయాతనల ననుభవించినమీఁద నిరంతర ఘోరపరిశ్రమముల సలిపినమీఁద లక్షలకొలఁది ప్రాణము లర్పించినమీఁద ఫలముల నొసంగినవి కాని కేవలము మాటలవలనఁ గాదు అందుల కీస్వాతంత్ర్యయుద్ధము ప్రబలనిదర్శనము సర్వజనాంగీకారముతో నీపై ఘోషణము ప్రకటింపఁబడినది కాని రాజపక్షీయులు దీని నిర్మూలింప సర్వశక్తులఁ గాచుకొనుచుండిరి బ్రిటిష ప్రభుత్వము నెలల పైపోవుచుండ వలసలయం దొకవిధమగు సంక్షోభ మేర్పడెను ప్రాంతవిభాగము లన్నియు నాశనముగాఁగాఁ గ్రొత్త నిర్ణీతముగఁ బైకి రాఁజాలకుండెను స్థానిక ప్రభుత్వముల సంస్థలును, గ్రామ, నగరములలో ప్రజాశాసనము మార్పునొందియుండలేదు దీనినే యాధారములుగఁ గొని దీనిమీఁదనే నూతనపరిపాలనాపద్ధతుల నమెరికనులు రచించిరి మొట్టమొదట దేశాభిమానుల కందఱకును కాంగ్రెసు ముఖ్యముగ వర్తించుననిమాత్రము దలఁపఁబడెను అంతకు మించి యీ సంస్థ కట్టియధికారము లేకుండెను ఎలసలవారి కందఱకు మదిరాలోచనముల నొసంగుట నిది వారిమీఁదనే యాధారపడి యుండెను కాని కాలక్రమమున పైని వ్రాసిన పదుపున నీ మహోన్నత కర్తవ్యము లగణితము లైపోయెను కాంగ్రెసు-అధికారము లెక్కువగుచున్న కొలఁదియు, యుద్ధభార మెక్కువైనకొలఁదియు సహింపలేనికొందఱు వానిరాజ్యుల ద్వేషబుద్ధి జనించెను మరియు నొకపక్షమువారికి వేఱొండుపక్షమువారియెడలను, ఒకరాజ్యముతోడ వేఱొకరాజ్యము నకును విద్వేషము లారంభమయ్యెను. చాలమంది న్యూ-ఇంగ్లండు వారల శంకింపసాగిరి. రాజ్యములన్నియు కాంగ్రెసునకు వోట్లనిచ్చి యుండినందున ఆరాజ్యములకంటె భిన్నములైన పంచాయతీ సంస్థానములు (Common-wealths) కాంగ్రెసువారి ప్రతిపాదనములను నడఁగొట్టవలె నని ప్రయత్నింప సాగెను ముఖ్యముగ యుద్ధసంబంధ లక్రమములను, విదేశసంబంధములవలనను మిక్కిలి వైరములు జనించ నెక్కుపోరాటము లారంభమయ్యెను ఇందువలన నత్యవసరము లగు కార్యములకును ప్రతిబంధకములు గలుగుచుండెను ఒక యుద్ధరి సూత్ర వాషింగ్టను తొలఁగించుటకే తిరుగఁబడెను. బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఇట్టి విద్వేషములకే మూలమయ్యెను. కాని క్రమముగ శాసన విభాగములు, యుద్ధసంఘములు, పోస్టుప్రబంధములు లోనగునవి సృష్టింపఁబడుటచే కొంతవఱకు కట్టుదిట్టము లేర్పడెను వీనికి సహాయకముగఁ గాలాంతరమున విదేశకార్యదర్శి, ఆర్థికనిరీక్షకుఁడు, యుద్ధకార్యదర్శి, సముద్రసంబంధి కార్యదర్శి లోనగు పదములును సృష్టింపఁబడెను

హడ్సనునదిలోయను తమవశమునం దుండికొని ఉత్తర, దక్షిణ రాజ్యవాసులను విడదీయవలయు నని బ్రిటిష్‌వారు ప్రయత్నించుచుండిన ట్లిదివఱకు వ్రాయఁబడినది కాని తలఁచినప్రకారము వీరి కిందు కార్యసిద్ధి కలుగదయ్యెను ౧౭౭౬-వ సంవత్సరమున జనరల్ హౌ హాలిఫాక్సునుండి బయలుదేఱి న్యూయార్కు నగరమునకు దక్షిణముగనున్న లాంగ్ఐలండం దమెరికనుల నోడించి పాఱఁదోలెను అమెరికనుసేనాను లిరువురు ఖైదీలుగఁ బట్టుబడిరి పిదప నొకచోట బ్రిటిషువారి కించుక నష్టము కలిగినప్పటికిని మఱి రెండుచోట్ల నమెరికనులే యోడిపోయిరి వాషింగ్టన్ డిలావేర్ నదిని దాఁటి హతశేష మగుసేనతో నవలికిపోయెను అనంతరము 3,000 ల ఖైదీలతోపాటు వాషింగ్టన్ నామకదుర్గ మాంగ్లేయులచేతఁ జిక్కెను. ఈ దుర్గము పోవుటవలన నమెరికనుల కమితనష్టము కలిగెను. అటు పిమ్మట బ్రిటిషుసేనాని ఫిలడెల్ఫియాను జయింప నిశ్చయించుకొని యప్పటికి శీతకాలము సమాసన్నమైనందున తదావాసమునకు బయలుదేఱి పోయెను ఈసమాచారము తెలిసినతోడనే వాషింగ్టన్ మొదటఁ దిరిగి డిలావేరునదిని మరల దాఁటి ట్రెంటన్ వద్ద హెస్సియన్ కల్నల్ రాల్ సేనమీఁద ఆకస్మికముగఁ బడి దాని నోడించి వేయిమంది ఖైదీలను బట్టుకొనెను దీనికి తోడుగ నితఁడు మఱికొన్ని దినములకు, అనఁగా ౧౭౭౭-వ సంవత్సరమున జనవరినెలలో న్యూజెర్సీయందలి ప్రిన్స్టనుదగ్గఱ కార్న్‌వాలిస్ వెంట నుండిన మూఁడు పదాతిదళములను, మూఁడు అశ్వికదళములను ఓడించి యచటనుండి శీతకాలము గడుప మారిస్టౌనునకుఁ బోయెను

మొట్టమొదట నోడిపోయినప్పటికిని వాషింగ్టన్ శాంతిసహనములను కోల్పోక వీలయినచోట నెల్ల పోయినదానిని రాఁబట్టుకొనుచు తోడ్తోడ కాంగ్రెసును, రాజ్యవాసులను మఱింత ముమ్మరముగఁ బని సేయవలసిన దని హెచ్చరించుచుండెను దేశమందలి పౌరపాలనాధికారము (Civil Power) వానిని మెరుపరింప నితఁడు ప్రయత్నించియుండలేదు దేశ మంతయు నిస్సహాయముగ, అరణ్యమయముగ నైనందున రాకపోకలకు సరియగు మార్గములు లేకపోవుటచేఁ గలుగుకష్టములు బ్రిటిష్‌వారికి బాగుగ ననుభవమునకు వచ్చుచుండెను అమితమగు యుద్ధసామగ్రిభారమును, ఆడంబరమును గల బ్రిటిష్ సేనలకు మార్గములు లేని భయంకరారణ్యములగుండాను కొండమీఁదుగను లోయలను, నదులను దాఁటుచుఁ బోవలయును మనిసి నిక్కడికి కష్టము సుచుచున్నను ఎక్కువయుద్ధసామగ్రులం గాని, భారములను వాహనాదికములు గాని తీసికొనిపోవుటం జేసి అమెరికను లొకమార్గముగఁ జాలిపోయిన వేఱొకమార్గముగఁ బోవుచుండిరి. మొట్టమొదట వాషింగ్టన్ పరాజితుఁడై, డిలావేరు దాఁటిపోయి

# అమెరికాస్వాతంత్ర్యయుద్ధము

తోడనే జనరల్ హౌ ఫిలడెల్ఫియాను ముట్టడించి కాంగ్రెసును చెదరఁగొట్టి అమెరికనుసేనలను వెన్కకుత్రొక్కుటకుఁ బూనుచుండ వలసినవాఁడైయుండెను కాని యట్లు చేయక శీతకాలావాసమున విశ్రాంతి గైకొనుటకై వెడలిపోయెను. దానిని గమనించియే వాషింగ్టను హైరి సేకుండువిస్తరమున డెలావేరునదిని మరల దాఁటి వచ్చి జయమును గాంచఁగల్గెను ఇట్టి సమయోచితకార్యములమూలమున వాషింగ్టను పోయిన విశ్వాసమును రాఁబట్టుకొనుచుండెను ఇందువలన రాజభక్తియు లనేకులు వాషింగ్టను పక్షమునఁ జేరిరి

జనరల్ హౌ ముందు జరగవలసిన యుద్ధమునకై ఇంగ్లండునుండి గొప్పసేనను రప్పించుకొని గొరిల్లాయుద్ధమునకు కెనడానుండియు బలములు రావించుకొనెను వీనితోడ్పాటుతో నితఁడు ఫిలడెల్ఫియా నగరమును ముట్టడించి పట్టుకొని అమెరికాస్వాతంత్ర్యయుద్ధమును పెన్సిల్వేనియా, న్యూజెర్సీ, న్యూయార్కులందే అంతమొందింప వలయు ననియు, న్యూ ఇంగ్లండును, దక్షిణరాష్ట్రములను తరువాత తీరికగ జయింపవచ్చు ననియు నేర్పాటులను గావించుకొనెను కాని బ్రిటిషువారిపక్షమున వలసలన్నింటికిని కార్యదర్శిగ నున్న లార్డ్ జార్జి జర్మెయిన్ అనువాఁడు ఈ యుద్ధోద్దేశమును సాగనిచ్చినవాఁడు కాఁడు రాజభక్తియుతులైన ఆంగ్లేయులును ఇండియనులును గలసిన యొక గొప్పసేన కెనడానుండి బయలుదేరి హడ్సనునదివెంట దక్షిణమునకు రావలయు ననియు, జనరల్ హౌ దక్షిణమునుండి బయలు వెడలి ఆనదివెంటనే ఎగువకు ప్రయాణము సాగించుచు పోయి ఉత్తరమునుండి వచ్చుసేనను అల్బనీనగరముకొద్ద సంధింపవలయు ననియు, పడమటిదిక్కునుండి సెంట్లెజరు ప్రాంత్యాధిపతులమై వచ్చి అదే నగరముకొద్ద వారందరునేకలలోఁ గలయవలయు ననియు లార్డ్ జర్మెయిన్ ఏర్పాటు చేసెను ఈయుద్దేశము నెఱవేఱియుండినచో హడ్సన్ లోయ యంతయు బ్రిటిషువారిచేతఁ బడి న్యూ-ఇంగ్లండు తక్కిన వలసలనుండి వేఱైయుండెడిది. కాని, యట్లు జరిగియుండలేదు ఇందులకు కారణము జనరల్ హౌకు నిశ్చయాత్మకములైన యుత్తరువులు లేకుండుటచే నతఁడు సమయమునకు అల్బనీకడకు రాకుండుటయే. ౧౭౭౭-వ సంవత్సరమున వేసవికాలము సమీపించినతోడనే వాషింగ్టను మరల జాగరూకుఁడై జనరల్ హౌయొక్క సంచారమును గనిపట్టి వానికి ప్రతిబంధకములఁ గల్పింప సంసిద్ధుఁడైయుండెను పరిష్కృతమైనయుత్తరువులు లేనికారణమున జనరల్ హౌ న్యూయార్కునుండి బయలుదేరి న్యూజెర్సీగుండ ఫిలడెల్ఫియాకుఁ బోవలయు నని సంసిద్ధుఁ డయ్యెను భూమిమార్గమున వెళ్లినచో వాషింగ్టను అడ్డుపడును గని జలమార్గమున నోడలపైఁ బయనమయ్యెను అయినప్పటికిని వాషింగ్టనుతో పోరు తప్పదయ్యెను జనరల్ హౌ నానాప్రయాణము సలుపుచు వచ్చి చెసపీక్ అఖాతముయొక్క ఉత్తరపు చివరనున్న ఎల్కు అను ప్రదేశమున దిగెను. అచటి కవలిమార్గమునందే వాషింగ్టను ఉండినందున నతఁడు బ్రాండివైనునది చడ్స్ఫోర్డువద్ద ఆంగ్లేయుల నెదిరించెను కాని బాధింపఁదయ్యెను. అనంతరము అక్టోబరునెలలో జర్మనుటౌనువద్ద అమెరికనులు మరల ఆంగ్లేయులతోఁ దలపడిరి ఈపర్యాయమును ఆంగ్లేయులే గెలిచిరి కాని యపాయము నష్టము కలిగెను అందువలన చెన్నుద్రిప్పిన అమెరికనులను వీరు తఱుము గొట్టజాలరైరి అనంతరము మఱికొన్నిదినములవఱకును హౌను జట్టుముట్టియుండి విడిచి వాషింగ్టను శీతకాలము గడపుటకు ఫోర్జిలోయకు వెడలిపోయెను

ఇఁక నుత్తరప్రాంతములయందు ౧౭౭౬-వ సంవత్సరమున ఆర్నాల్డు చాంప్లెయిన్సరోవరమును చేరి యచట రక్షణోపాయములఁ జేయించుచున్న సమయమున ౩,౦౦౦ల యోధులుగల బ్రిటిషుసేన న్యూకెనడానుండి వచ్చెను కాని ఆర్నాల్డుయొక్క ప్రతిబంధకములవలన ఆసేన ముందునకు సాగఁజాలనయ్యెను ఆర్నాల్డువెంట నున్న బలమును జయించుటకై ఆంగ్లేయులకు జలసైన్య మావశ్యకమయ్యెను అందునిమిత్తము సెంటులారెన్సునదియందలి పడవ గ్రాంట్రు విప్పించి యచట పరిత్యక్తమై పడియున్న ఒక ప్రాంతకోటను మరమ్మతు చేయించుటవలన కొన్నికాలమునకుగాని జూనేన సంసిద్ధము గావదయ్యెను ఆటుపిమ్మట ఆంగ్లేయులు రీనూతనజలసైన్యపుతోడ్పాటున ఆర్నాల్డును నోడింప సమర్థులైరి కాని ముందునకు సాగిపోవ నప్పటికిని వీలు కలుగదయ్యెను ఈకారణమువలననే దక్షిణమందలి జనరల్ హౌకు నిశ్చితమైన యుత్తరువులు చేరకపోయినవి మఱుసటిసంవత్సరము బర్గొయిన్ నాయకుఁ బ్రిటిష్సేనాని విశాలసైన్యముతో బయలు వెడలి టికండెరోగాదుర్గమును ముట్టడించి యందలి అమెరికనులను వెడలఁగొట్టెను అనంతరము మహారణ్యములగుండా ప్రయాణములఁ జేయుచు వచ్చి ఎడ్వర్డుదుర్గమునొద్ద హడ్సన్నదిని జేరి యుండ నిశ్చయించెను వర్మాంటు-ఇలాకాయందలి బెన్నింగ్టను గ్రామమునొద్ద సైన్యోపయోగార్థము లగు వస్తుసామాను లపరిమితముగ నమెరికనులు సంగ్రహించియుండిరి గని విని వానిని కొల్లగొట్టునిమిత్తము ఫ్రెడరిక్ బాం అనునతనిసాయమున ౧,౦౦౦ సైనికుల నంపెను కాని యచటికిఁ జేరకపూర్వమే జనరల్ స్టార్కు అను అమెరికనుసేనాని వారిస్నేహితులగు (Green Mountain Boys) సాహాయ్యమున ఫ్రెడరిక్ బాంసేనను చెదరఁగొట్టుటయేకాక అతనికి సాయమున వచ్చిన కల్నల్ బ్రెమన్ దండునుసైతము నాశనము గావించెను. ఇందుచే బ్రిటిషువారికి ౧,౦౦౦ యోధులు నష్టమైరి బర్గొయినునకు సాహాయ్యము చేయుటకై మొహాక్లోయనుండి కల్నల్ బారీ సెంట్లెజరు నాయకత్వముగల వేఱొకసైన్యమునకును ఇట్టిగతియే పట్టినది జనరల్ నికోలస్ హెర్కిమర్ అను అమెరికనుసేనాధిపతి ఒరిస్కనీ వద్దను లీజరున కడ్డుగ నిలిచెను స్థితిగతు లింక ప్రతికూలముగ నుండినప్పటికిని ధైర్యసాహసములను వీడక బర్గొయిను క్రిందఁ ప్రయాణమునతో దక్షిణమునకై పునఃపు వచ్చెను. కాని నిర్దిష్టప్రాసిత విధమున జనరల్ హౌ రాకపోవుటచేతను, మఱి రెండువైపులయుండ తోడ్పాటు గాని దొరకకపోవుటచేతను బర్గొయినునకు మఱి రెండువైపుల నష్టములు కలిగెను. కడపట సర్టోగాయను ప్రదేశమునందు [illegible]

వారికిని మరల భయంకరమైన యుద్ధము జరగెను. అందు బర్గోయిన్ పరాజయమును పొంది ౫,౦౦౦ల సైనికులతోఁగూడ అమెరికనులచేతఁ జిక్కెను. చాంప్లెయిన్ సరోవరమున అర్నాల్డు ఓడిపోయినప్పటికిని జయించినటులే యయ్యెను. అతఁ డింగ్లీషువారి కొక సంవత్సరము పర్యంతము ఆఁపుదల చేయుటచేతనే బర్గోయినుకు ఇన్నిచోట్ల నపజయము కలుగఁగా చివరకు సర్టోగాయం దమెరికనులకు సంపూర్ణ జయము కలిగినది. అమెరికనుల భాగ్యచక్రమును త్రిప్పిన దీ సర్టోగా విజయమే. ఆటుపిమ్మట యుద్ధప్రవృత్తి సంపూర్ణముగ మారిపోయెను.

క్రీ. శ. ౧౭౬౩ మొదలుకొని, అనఁగా ఫ్రెంచివా రాంగ్లేయులచేఁ బరాజితులై అమెరికాయందలి తమ ప్రాంతముల నన్నింటిని పోఁగొట్టుకొనిననాఁటినుండియు అవకాశము దొరకినయెడల నింగ్లండు నెదిరిఁగల పగను దీర్చుకొనుటకు వారు తహతహపడుచుండిరి. వలసల తిరుగఁబాటువలన వీరికి శీఘ్రముగనే యట్టి యవకాశము లభించెను. ౧౭౭౫-వ సంవత్సరమునం దమెరికను కాంగ్రెసు రహస్య వ్యవహారములకై ఒకసంఘమును సృష్టించెను. ౧౭౭౭-వ సంవత్సరమున నిదియే విదేశవ్యవహారసంఘముగ మారి ౧౭౮౧-వరకు నటులే పనిచేయుచు వచ్చెను. అమెరికను కాంగ్రెసువారును, దానిరహస్యసంఘమువారును పట్టుదలతోను ఫ్రెంచివారి యాంతరంగికాభిప్రాయము మొదటనుండియు విదిత మయియేయుండెను. అమెరికనులు తమదేశముయొక్క యార్థిక సంపదలమీఁదను పూర్వవిశ్వాసము కలవారై అనుకూల మగు కాలము లభించినవెంటనే మరల నిచ్చివేయుదుమను తలంపుతో యూరోపునుండి ఆహారపదార్థములు, ఋణములు పుచ్చుకొనువానిని దప్పించుకొనుచువచ్చిరి. ౧౭౭౬-వ సంవత్సరమున సైలస్ డీన్ అనువాఁడు సైనికమంత్రము వ్యాపారపు-ఏజంటుగ పారిస్ నగరమునకుఁ బోయెను. ఫ్రెంచిప్రభుత్వమువారు మాటిమాటికి ... తటస్థభావము వహించియుండిరి. ఇతనిద్వారా భోజనాదిసామగ్రు లమెరికాకు రవాణా చేయఁబడెను. మఱియు నమెరికను నౌకలు ఫ్రెంచిరేవులలోనికి వచ్చుచుండెను. అమెరికను నావాసాధనులు బ్రిటిష్ నౌకలం బట్టుకొని ఫ్రెంచిరేవులలోఁ జేర్చుచుండిరి. అందుచే బ్రిటిష్ వ్యాపారమున కధికనష్టము గలుగుచువచ్చెను. మఱియు నదేసంవత్సరమునం దమెరికను కాంగ్రెసు మువ్వురుమనుష్యులను ఫ్రాన్సుదేశమున కంపెను. స్పెయిన్, ప్రష్యా, ఆస్ట్రియా మొదలగు యూరోపురాజ్యములను గలసి వారిని అమెరికారాజ్యమును స్వీకరించుటకును, దానికి సాయపడుటకును ప్రార్థింపవలసినదిగ వీరికి నియోజనమైయుండెను. అదేసంవత్సరమున ఆర్థర్ లీ, డీన్ అనువారితోఁ గలసి ఫ్రాంక్లిన్ వ్యాపారికసంధుల నుద్దేశించియు, పరస్పరము సహాయించుకొనవలెనని బంధనిబంధనల నుద్దేశించియు మాటలాడుటకై ఫ్రాన్సుదేశమున కేగియుండెను. కాని ఫ్రాన్సు అమెరికాల కేనలకాచారము అన్నియు సర్టోగాయుద్ధమువఱకును రహస్యముగ జరుగుచువచ్చెను. అనంతర మది బహిరంగమైనది. ఈ యుద్ధమునందుఁ గలిగిన విజయముచేతనే ప్రోత్సాహింపఁబడి ఫ్రెంచివా రమెరికనులతో పరస్పరసాహాయ్యములకై సంధి చేసికొనిరి. ఏతత్ఫలితముగ మఱుసటిసంవత్సరమునం దింగ్లండు ఫ్రాన్సులకు యుద్ధమారంభమయ్యెను. స్పెయినుకు బ్రిటిషువారికి మొదటనే వైరముండియుండెను. కాని వలసలవారి తిరుగఁబాటు - తమవలసలకెక్కడ తిరుగఁబడునో యను భయమున - స్పెయినునకు సమ్మతము కాదు. అందుచే స్పెయిను మానమున్న మౌనియుండెను. ఒకసంవత్సరము గడచినపిమ్మట స్పెయిను ఇంగ్లండునకు విరుద్ధముగ కలహము సాగించినది, కాని ఫ్రెంచివారికి తోడుపడుచుండినట్లు యగపడుచుండెను. అమెరికా - ఫ్రాన్సుల సంధి ౧౭౮౩ లో జరగెను. తరువాత డచ్చివారును ఇంగ్లండున కెదురు తిరుగ బాధ్యులైరి. సముద్రముమీఁదియధికారము తమదే యని ఎవరి యోడలనైనను సోదా మాడి తమకు ప్రతికూలములైన పత్రములు దొరకినచో దీసికొనుటకు హక్కు గల దని తలంచు బ్రిటిష్ వారు హోలెండునకు రాయబారిగ వచ్చుచుండిన హెన్రీ లారెన్సు అనెడి అమెరికాదేశీయుని మార్గమధ్యమున నడ్డగించి యతనియొద్ద దొరకిన పత్రముల నన్నింటిని లాగికొనిరి. డచ్చివారి కాంగ్లేయులతో పోరాడుట కిదియే కారణము. అంత నీయుద్ధము కేవలము అమెరికా బ్రిటనులకు కాక విస్తృతరూపమున సమస్తయూరోపురాజులకును సముద్రవ్యాపారికయుద్ధముగఁ బరిణమించెను. అంత ప్రపంచమునం దంతట నెక్కడెక్కడ నాంగ్లేయ, ఫ్రెంచి, డచ్చి, స్పెయిను లోనగు వారుండెనో అక్కడ నంతయు నీయుద్ధ మారంభమయ్యెను.

ఫ్రాన్సుతో సంధి జరగినవెంటనే, ౧౭౭౮-వ సంవత్సరము ఏప్రిల్ మాసమున కామ్టె డెస్టైయింగ్ నాయకత్వమున నొకగొప్ప ఫ్రెంచిజలసేన ఫ్రాన్సునందలి టౌలాన్ రేవునుండి అమెరికాకు బయలు వెడలెను. అమెరికాసంయుక్తరాజ్యములమంత్రియగు యం. కానరడ్ అలెగ్జాండ్రె జెరార్డ్ డి రేనేవల్ అనువాఁడును, అమెరికాకు మరలి వచ్చుచుండిన సైలస్ డీనును ఈ సైన్యముతో నుండిరి. అమెరికాలోని బ్రిటీషుసేవయం దప్పుడు జనరల్ హోవు బదులుగా వచ్చిన సర్ హెన్రీ క్లింటన్ ఫిలడల్ఫియానగరమునం దుండెను. ఫ్రెంచిజలసేన అమెరికాకు వచ్చుచుండినవార్త తెలిసినవెంటనే క్లింటన్ స్థలసేనకు రక్షకముగ నుండిన డిలావేర్ నదీముఖమునొద్దగల బ్రిటిష్ జలసేన ఆప్రదేశమును విడిచిపోయెను. అంత క్లింటన్ అచట నుండ సాహసింపక న్యూయార్కు పట్టణమునకు పోవుచుండ మార్గమధ్యమున మన్మౌతు నాయకస్థానమునొద్ద వాషింగ్టన్ అడ్డగించి పోరాటమునకు దించెను. ఇచట నమెరికను సేనలోని జనరల్ చార్లెస్ లీ నాయకమూర్ఖుఁడు చేసిన ద్రోహమువలనఁ గాకపోయిన బ్రిటిష్ సేన సమస్తము నచట నాశన మందియుండెడిది. ఇతఁడు చేసిన బుద్ధిహీనప్రకార్యములవలననే క్లింటన్ దప్పించుకొని పోయి న్యూయార్కును జేరఁగలిగెను. అదిమొదలు యుద్ధము సమాప్త మగునంతవరకును న్యూయార్కుపట్టణమే ఆంగ్లేయులకు ముఖ్యస్థానముగ నుండెను. బ్రిటిషువారు ఫిలడల్ఫియాను వీడిపోవ నచ్చోటిని వదలిపోయిన అమెరికను కాంగ్రెసు మరల నా స్థానము నాక్రమించుకొనెను. అచటనుండియే అమెరికనులు ఫ్రెంచిసేన

లతో వచ్చిన జనరాద్రవను స్వాగతము కొసంగిరి అతఁ డాప్రదేశము నందే నిలిచి వాషింగ్టనుయొక్కయు, జనరల్ హౌరాషియొగేట్సు యొక్కయు యుద్ధనీతిపద్ధతులకు సహాయ్యభూతములగ నుండులాగున ఉపాయములను పన్నుచుండెను అనంతరము వాషింగ్టనుసేనలు దుర్గ మంత్రి కోశదానిని జయించఁగల్గెను ఆసంత్రిలో హడ్సను తీరభూము లందలి వెస్టుపాయంటు నామకస్థానమును వాషింగ్టను తన సేనలకు కేంద్రస్థానముగ చేర్పఱచుకొనెను అందువలన నితనికి న్యూయార్కు నందున్న తనవారితో ఉత్తర ప్రత్యుత్తరములు నడుపుటకును బ్రిటీషుసేనలు దేశమధ్యమునకు రాకుండునట్లు నడ్డగించుటకును, దక్షిణమునందలి డిలావేరుతో సంబంధ ముంచుకొనుటకును, సకల విధ సౌకర్యములును దొరకుటకును ననుకూలముగ నుండెను డిలావేరునందు బ్రిటీష్ సేన లపరిమితముగ నుండినందున నరిమయు జయమును గానక ఫ్రెంచిదేశ్తైయింగు న్యూపోర్టునకు వెడలిపోయెను అచట ఫ్రెంచి వారు, అమెరికనులు గలసి ౬,౦౦౦ల బ్రిటీషుసేన నెదుర్కొనఁ బ్రయత్నింపసాగిరి కాని ఇంతలో ఇంగ్లండునుండి మఱికొంత జల సేన వచ్చుట తెలిసి డెస్తైయింగు స్థలప్రయత్నములను మాని క్రొత్తసేన నెదిరింపఁబోయెను యుద్ధము స్వల్పకాలమే జరగెను కాని ప్రచండ మగు తుపాను రేఁగుటవలన ఓడలు పాడుగాఁగా, వానిని మరమ్మతు చేయించుకొనుటకు డెస్తైయింగు బోస్టనుపట్టణమునకు వెడలిపోయెను అంత న్యూపోర్టునందలి స్థలసేనయు వెనుకకుఁ బోయెను ఇంతలో క్రొత్తగనందు మఱికొంత ఫ్రెంచిసేన సముద్రతీరములందలి అమెరికను జలసేనలకుఁ దోడ్పడ సంసిద్ధముగ్గానుండెను ఇదేతరుణమున ఉత్తరాంట దీవియొద్ద ఫ్రెంచి-బ్రిటీషువారలకు యుద్ధము జరగెను కాని పరిణామ మనిశ్చితముగ నుండెను ఆ ట్లరయుధ్ధ నీయుద్ధము లన్నింటివలనను మిగుల ప్రోత్సాహితులై కెప్టెను జానుపాల్ జోన్సు నాయకత్వమున అమెరి కనులు బ్రిటీషు నౌకలపైని దండెత్తియుండిరి

వలసలతూర్పుతీరములం దిట్లు పోరాటములు జరుగుచుండిన కాలమందే (౧౭౭౫ - ౧౭౮౩) పడమటను, ఉత్తరసీమలందును అమెరికనుల కనుమాలములకు విమయములు ఘటిల్లియుండెను వర్జీనియా రాజ్యముయొక్క ఆధారమున జార్జి రోగర్సు అనునతఁడు పశ్చిమోత్తరసీమలందున్న బ్రిటీష్‌వారిస్థానము లన్నింటిని తుట్టడించెను స్వయంసేవకులసాయముతో నితఁడు ఇల్లినాయిస్ ప్రాంతమునందలి బ్రిటీష్‌వారిప్రధానస్థానమగు కస్కాసియాను మట్టడించి యానంతరము విన్సెన్నుసునుపైకము లోఁబఱుచుకొనెను తరువాత డెట్రాయిటునందలి ఆంగ్లేయసేనాధిపతి అపట్టణమును జయించి తీసికొన ౧౭౮౧లో అమెరికనుసేనాని క్లార్కు అనునతఁడు మఱికొంతసేనను వెంట నిడికొని యానగరమును ముట్టడించి మరల వశపఱచికొనెను ఈ పశ్చిమోత్తరదండయాత్రవలన నమెరికనుల కమితమగు లాభము కలిగెను. ఇందువలన పడమటిసరిహద్దులనుండి కొంతహిందువులు కాలింపుచున్న క్రమముగాను ఫ్రాన్సిక తగ్గిపోయెను యుద్ధానంతరము సంధికాలమునను దమెరికను లీసరిహద్దులందు తమకుగల హక్కులు

బుజావుపఱచుకొనుటయందు సమర్థులైరి. మఱియు మిసిస్సిపినదియందు వలస మున్ముందు అమెరికనుఁ దమయధికారమును వ్యాపింపఁజేసికొనుట కత్యుత్తమమైన అవకాశము దొరకెను

ఇఁక నిటు పూర్వభాగమున న్యూయార్కుపట్టణముఁ జేరిన పిమ్మట క్లింటనుపైతము హౌకుంటె నెక్కువగ నేమియుఁ జేయఁ జాలఁడయ్యెను వెస్టుపాయింటువద్ద సేనానికిని చేర్పఱచుకొని యున్న వాషింగ్టనును ఎదిరింప ధైర్యము చాలక అతని సెటుకైన నాయున్నతస్థానములనుండి క్రిందికి మైదానములోనికి లాగవలయు నని ఇతఁ డనేకప్రయత్నము లొనరించుచు స్టోనిపాయింటువద్ద ౩౦౦౦ మంది యోధులకుపైతము పోఁగొట్టుకొనెను జనరల్ వేన్ అను అమెరికనుసేనాని అశ్వదళముతో స్టోనిపాయింటువద్దనున్న క్లింటను సేనను నాశనము చేసిపోయెను ఇంతవరకుఁగలము ఒకైదమునా, టస్కారోరసులలోని కొందఱును దక్కఁ దక్కిన ఇరోకోయిస్‌జాతుల ఇండి యనులందఱును బ్రిటీష్‌వారిపక్షమును వహించియుండిరి. బ్రిటీషుపరి పాలకుల ప్రోత్సాహముచేతనే ఈయిండియనులు పడమటివలసలనిహాడఁ బడి కొల్లగొట్టుచు, అచటఁ గాఁపురము నేయువారిని హింసించు చుండిరి ఇంతియే కాదు న్యూయార్కు రాజ్యపు పడమటిసరిహద్దుల లోని రాజపక్షీయులు లమెరికనులభూములపైఁ బడి దోపిడు లొనరింప సాగిరి అంత జాన్‌సల్లివన్ అనెడి అమెరికనుసేనాపతి గొప్పదండును వెంట నిడుకొనిపోయి ప్రస్తుతపు ఎల్మిరానామకస్థానమున నున్న న్యూటౌనుదగ్గఱ నీదోపిడికాండ్ర నందఱను సంపూర్ణముగ వోడించి చెదరఁగొట్టెను అనంతరము పశ్చిమన్యూయార్కులోని చరోకరసమీ పములందు నివసించునిండియనుల గ్రామముల నన్నింటిని తగులఁబెట్టించి వారిపంటలకు నాశనము చేయించెను వలసలలోనిస్థితిగతు లిట్లుండ నిదేసమయమున పశ్చిమహిందూద్వీపములంగుమ బ్రిటీష్-ఫ్రెంచివారి మధ్యను కలహములు చెలరేఁగుచుండెను మిక్కిలి సారవంతములైన నేలలు గలిగి, ఉత్పత్తి నపరిమితముగ నిచ్చుచుండుటవలన నీదీవు లాకాలమున ప్రపంచమందలి వ్యాపారికస్థానము లన్నింటిలోను ప్రధాన మైనవిగ నెంచఁబడుచుండెను అందుచే ఆదీవులపై నధికారము తమదే యని ఫ్రెంచివారును, బ్రిటిష్‌వారును పరస్పరము పోరాడసాగిరి

యుద్ధము లీప్రకారముగ జరగుచున్న సమయమందే వలసల వారు తమదేశమున కవసరమైన ప్రభుత్వవిధానముల నేర్పఱచుకొన నెందలికిని కాంగ్రెసుసభ్యులు రాజ్యసంయోజనము (Confederacy of States)న కేనియమము లనుకూలముగ నుండునో ఆలోచింపఁ గడఁగి విప్లవము (Revolution)వలనఁ గల్గిన ప్రత్యక్ష ఫలితము లను సుస్థిరములుగఁ జేయుటకు ప్రయత్నింపసాగిరి అప్పటి జనుల రాజప్రభుత్వ మనిన ద్వేషము కలుగుచుండెను సర్వాధికారములును ప్రజలయందే యుండెనని అది వారు తెచ్చిపెట్టికొనినవి కాకతప్ప ఖమా జములు ప్రభుత్వమునకు లోబడవలసినవారే కారు, అనగా ప్రజా రక్తి కార నియమ్మపడియుండుచుకొనుచడియు ప్రభుత్వము కాదు. ప్ర

# అమెరికాస్వాతంత్ర్యయుద్ధము



నములతో దక్షిణమునకు పంపెను. ఈ సైనికులు జనరల్ గేట్సు యొక్క ముఖ్యసేనానాయకత్వమున కామ్డెన్ పట్టణము మీఁది కేఁగి యచట నున్న కార్న్‌వాలిసును ముట్టడించిరి. కాని గేట్సునకు సంపూర్ణముగ పరాజయము కలిగెను. డికల్బ్ యుద్ధమునందే హతుఁ డయ్యెను. అటుపిమ్మట జనరల్ గ్రీన్ అమెరికను సేనాని యయ్యెను. కార్న్‌వాలిస్ అటనుండి ఉత్తరకెరోలీనాకు పోయెను. అతఁడు క్లింటనుతో చేసికొనిన యేర్పాటుప్రకారము ఉత్తరకెరోలీనా, వర్జీనియారాష్ట్రములందుండా బాల్టిమోర్, ఫిలడల్ఫియా పట్టణములకుఁ బోవలసియుండెను. కాని మార్గమందలి స్థితిగతు లతని నట్లు పోనీయ వయ్యెను. జనరల్ గ్రీనుతో నితనికి సంగ్రామము కలిగెను. ఆ సంగ్రామమునకు పూర్వమే కింగ్సుమౌంటెన్, కౌపెన్సు మొదలగు ప్రదేశములందు కార్న్‌వాలిస్ పక్షపుసేనలకు పరాజయము కలిగెను. కౌపెన్సు దగ్గఱ టార్లటనునకు సంపూర్ణముగ పరాజయము కలిగెను. ఈ యుద్ధముల వలన బ్రిటిష్‌సేన క్షీణించిపోవుచుండినను, ధైర్యసాహసములను గోల్పోక కార్న్‌వాలిస్ ఉత్తరకెరోలీనాగుండా పోయి వర్జీనియా సీమలంగు గ్రీనుతోఁ దలపడి యతనిసేనను కొంతవఱకు చెదరఁగొట్టి ముందునకు సాగిపోయెను. ౧౭౮౧ మార్చినెలలో గిల్‌ఫోర్డుకోర్టు హౌసునొద్ద నమెరికన్-బ్రిటిషుసేనలకు మరల కలహ మయ్యెను. ఇందును బ్రిటీషువారికి జయము కలిగినప్పటికిని ౬౦౦ల సైనికులు మరణించిరి. అప్పటికి కార్న్‌వాలిసు వెంట ౩,౦౦౦ల సైనికులు మాత్రము మిగిలిరి. ఆస్వల్పసేనతో గ్రీనును వెన్నంటి తఱుముటకు సాహసింపక హిల్స్‌బరోకు పోయి, యచట బ్రిటీషుపతాకము నిలిపెను. అక్కడ కొన్నివారములు గడపి క్రొత్తసైనికులను బ్రోవుచేసికొనవలెనని ప్రయత్నముతో నితఁడు తరువాత సముద్రతీరమందలి విల్మింగ్టనునకు వెడలిపోయెను. అంత గ్రీను ఇతఁడు పోయినదికనుఁ బోక దక్షిణకెరోలీనాయందలి కామ్డెన్, చార్లెస్టన్ నగరములపైకి నడుచుఁ దిరిగెను. అక్కడ నితఁడు బ్రిటీషుసేనాని యగు రాడనును తఱుముఁగొట్టి కార్న్‌వాలిసు నచటికి రప్పింపవలె నని ప్రయత్నించెను. సైండేసిస్వరయొద్దనున్న బ్రిటీషుస్థానమును ముట్టడించెను కాని యందు దితనికి జయము గలుగదయ్యెను. సెప్టెంబరునెలలో యూటాస్ప్రింగ్సునొద్ద తుదియుద్ధము జరగెను కాని అందును ఇరుపక్షములవారికి నవితము నష్టము కలిగెను. కాని గ్రీనుయొక్క అజ్ఞాను పారము చిల్లరపోరాటములను సలుపుఁగడఁగిన మారియన్, సమ్టర్, ఆండ్రూ పికెన్సు, హెన్రీలీ, విలియం వాషింగ్టన్ అనువారలు మాత్రము పోయినచోట నంతయు జయమునే కాంచిరి. బ్రిటీషు పక్షపాతులంబు సైన్యవారి రక్షణార్థము నిటునిటు నక్కడక్కడ స్థాపింపఁబడియుండిన ఇంగ్లీషువారిస్థానముల (Posts) మీఁదను కొన్నింటి నాక్రమించికొనియు, కొన్నింటిని చెదరఁగొట్టి నాశనము గావించియు నుండిరి. బ్రిటీషువారలకుఁ దోడ్పడ వచ్చిన జనరల్ రాడన్ తనక్షీణసేనతో చార్లెస్టన్ దాఁటిపోవుటకు సాహసింపక దక్షిణప్రాంతములను వదలి యాకరములకు పోయెను. ఇట్లు దక్షిణము నుద్ధరించి సుకీర్తి గ్రీనునకుఁ జేకూరినది. కాని దక్షిణమం దీపరిస్థితులు కలుగుటకు ముఖ్యకారణము కార్న్‌వాలిసు తాచోటు వదలి వర్జీనియాకుఁ బోవుటయే. వర్జీనియాను గెలువకుండిన దక్షిణప్రాంతములను వశమునం దుంచికొనుట అసాధ్యమని యితఁడు తలపోసియుండెను. మఱియు వర్జీనియాకుఁ బోయిన యెడల జలసేనాసాహాయ్యమున నెక్కువలాభము పొందవచ్చు నని యితనియుద్దేశమైయుండెను. కాని యిందువలన నమెరికనులకే లాభము కలిగెను. విల్మింగ్టనునుండి కార్న్‌వాలిసు పీటర్సుబర్గు అనుపట్టణమున కేఁగెను. అచట క్లింటన్ పంపినసేన ౨,౦౦౦ల మంది యుండెను. అమెరికా కాంగ్రెసు చేసినతీర్మానములవలన క్రుద్ధుఁడై స్వపక్షమును వీడి శత్రుపక్షమునఁ జేరిన బెనెడిక్ట్ ఆర్నాల్డును, విలియం ఫిలిప్సు అను వేఱొకవ్యక్తియు పీటర్సుబర్గుసేనకు నాయకులుగ నుండిరి. కెరోలీనాయందు కార్న్‌వాలిసు చేయుచున్న కార్యములకు సాహాయ్యభూతములుగ నుండులాగున చెసపీక్-అఖాతమునం దొక సేనాస్థానము నేర్పాటుచేయుటకు వీరిరువురికిఁ బంపఁబడియుండిరి. వర్జీనియారాష్ట్రమున నెదురఁగా నెవ్వరును లేదని ఉత్తరమున ఫ్రెడరిక్సుబర్గువఱకును, పడమట చార్లెట్స్‌విల్లీ వఱకును గల ప్రదేశము నంతను బ్రిటీషువారు కొల్లగొట్టిరి. కాని ఇంతలో లఫయెట్టె నాయకత్వమున నొక యమెరికనుసేన వీరి నడ్డగించెను. ఈ పరిస్థితిని గనిపట్టి భూమిమీఁద నింకను యుద్ధము సాగించుటకుఁ దగినంత సేనాబలము లేనందున జలసేనకు సమీపమునలో నుండులాగున నొక యనుకూలప్రదేశమును సేనానివేశముగ నేర్పఱచుకొనవలసిన దని న్యూయార్కునందలి క్లింటన్ కార్న్‌వాలిసునకు ఉత్తరువు గావించెను. మొదట కెరోలీనాను వదలవలసిన దని క్లింటనుయొక్క అభిమతము కాదు, కాని ఎట్లును వదలి వచ్చినందున చేయునది లేక క్లింటను అట్టి యుత్తరువును గావించెను. ఈయాజ్ఞల ననుసరించి కార్న్‌వాలిస్ యార్కుటౌనునొద్ద విడిసెను.

అప్పటిపరిస్థితులయందు సముద్రముమీఁద నందును ముఖ్యముగ చెసపీక్-అఖాతముమీఁద నధికారము గలిగి దానిని వశమం దుంచికొనుట పరమావశ్యకమైయుండెను; ఎందుచేత ననఁగా, కార్న్‌వాలిసున కాహారసామగ్రులు మున్నగునవి రావలసినను, వాషింగ్టనునకు న్యూయార్కు ప్రాంతములనుండి త్వరితముగ సేనలు రావలసినను, అదియే అనుకూలమైన ముందిమార్గము. ఆకారణమున కార్న్‌వాలిస్ యార్కుటౌనునందు దిగెనను సంగతి తెలిసిన వెంటనే ఒక్కపర్యాయముగ భూమియందుండియు, జలమునందుండియు నతనిని ముట్టడింపవలయు నని వాషింగ్టను కృతనిశ్చయుఁ డయ్యెను. తదనుసారముగ నాతఁడును, అతనికి సాయపడ వచ్చిన రోచాంబో నాయకఫ్రెంచిసేనానియు నిరువురును గలిసి పశ్చిమహిందూద్వీపములందు బ్రిటీషువారితో పోరాడుచుండిన ఫ్రెంచివారల నౌకాసేనలను చెసపీకు-అఖాతమును వశపఱచుకొనవలసినదిగ నుత్తరువులు గావించిరి. ఫ్రెంచి ఎడ్మిరల్ డి. గ్రాస్ అందులకు సమ్మతించి

**అమొలకుడియా** — గంజాంజిల్లా కొక్కిలికోలాకా యందలి జమీందారీ గ్రామము జనసంఖ్య ౩౩౮

**అమోఘవర్షుఁడు** — ౧. ఈ పేరుగలరాజులు ముగ్గురు రాష్ట్రకూటవంశమునందు కానవచ్చుచున్నారు

మొదటి అమోఘవర్షుఁడు రమారమి ౬౩ సంవత్సరముల వఱకు క్రీ. శ. (౮౧౫–౭౭) రాజ్యమేలెను. ఇతనికి నృపతుంగుఁడు అనుబిరుదుగలదు ఈతఁడు వేంగీరాజులైన చాళుక్యులతోఁ పెక్కుయుద్ధములు చేసెను ఈతఁడు తనరాజధానిని నాసికపట్టణమునుండి మాన్యఖేటపట్టణమునకు మార్చెను దీని నిప్పుడు మాల్ఖేదందురు ఇది నైజామ్ రాజ్యములో నున్నది. అమోఘవర్షుఁడు ముసలివాఁడు కాఁగా తన కుమారుఁడైన కృష్ణునకు రాజ్యమొసగి తాను యతి యయ్యెను ఈతనికి దిగంబరజైనమతమునందు మిక్కిలి అభిమానము ఇతనికాలమునందును, తరువాతికాలపురాజుల యాశ్రయము వలనను జైనమతము మిక్కిలి అభివృద్ధిఁ జెంది బౌద్ధమతము క్షీణించెను. కాంచీనగరమువఱకు నీతని రాజ్య ముండె ననియు, ఈతఁడు జైనాచార్యుఁ డగు జినసేనపండితుని భక్తుఁ డనియుఁ జెప్పెదరు జినసేనాచార్యుఁడు జైనమతమును గురించిన పెక్కు గ్రంథములను వ్రాసినాఁడు ఇతనికాలమున పెక్కు మతగ్రంథములును, శాస్త్రగ్రంథములును పుట్టినవి ప్రశ్నోత్తరరత్నమాలిక యను నీతివిషయక గ్రంథమును రచియించిన దీ యమోఘవర్షుఁడే యని దిగంబరజైనులు చెప్పుదురు.

౨ (ద్వితీయుఁడు) — తృతీయ ఇంద్రుని పుత్త్రుఁడు తండ్రిగతించినతోడనే సింహాసన మెక్కెను కాని స్వల్పకాలములోపలనే మరణించెను తండ్రిమీఁదిగల ప్రేమాధిక్యమున నితఁ డిట్లు కాలమున గతించె నని జనులు చెప్పుకొందురు అమోఘవర్షునకు గోవిందుఁడను తమ్ముఁడు గలఁడు రాజ్యలోభమున వాఁ డన్నను గడమట్టించె నని కొందఱ యనుమానము

౩ (చతుర్థుఁడు) — ఇతనికి కక్క, కరక, కక్కర, కక్కల యని పేరులు కలవు. రాష్ట్రకూటరాజులలోఁ జివరవాఁడు. ఇతని తండ్రిపేరు నిరుపముఁడు. చాళుక్యవంశీయుఁ డగు తైలపుఁ డితని నోడించి దక్షిణమున రాష్ట్రకూటులరాజ్యము నంతము గావించెను.

**అమోఘసిద్ధుఁడు** — బౌద్ధులదేవతలలో నొక్కఁడు అతనినిగూర్చి ప్రార్థన హవనము చేయుసంప్రదాయము గలదు

**అమోఘుఁడు** — బృహస్పతికి తారయందుఁ బుట్టిన స్వాహా యనుకన్యకయొక్క ముగ్గురు పుత్త్రులలోఁ గడగొట్టువాఁడు.

**అమోద్** — ౧. బొంబాయి రాజధానిలోని భరోచ్ (Broach) జిల్లాయందలి యొకతాలూకా విస్తీర్ణము ౧౭౬ చదరపుమైళ్లు జనసంఖ్య ౩౧,౯౧౧ ఇందు ఒకపట్టణమును, ౫౧ గ్రామములును కలవు. ఆదాయము రు ౩,౫౧,౦౦౦

౨ ఈ పేరుగల తాలూకాకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౮,౩౪౫ ఇచ్చట ఠాకూరు అనునొక భూస్వామి యుండును వానికి ౨౧,౫౦౦ల ఎకరముల భూమియును, రు ౪౨,౦౦౦ల ఆదాయమును ఉండును ఇక్కడ పుంగలికత్తులు, డాలులు చేయఁబడును.

**అమ్నేర్** — ౧ బీరారు రాష్ట్రమునందలి అమరావతిజిల్లాలో నొకపట్టణము ఇది మోర్సీతాలూకాలో వార్ధా జాంవదులసంగమ స్థానమున నున్నది ఇందు నివసించువారిలో పెక్కుమంది కురకులు. ఇచ్చట జాగీరుదారులవలనను, నిజామునకును ఒకకాలమున భయంకరముగ యుద్ధము జరిగెను పేఁదుగూడ నిచ్చట జేసుకొలమంది పిసాయాలగోరీలు కానవచ్చుచుండును నదీతీరమునఁ బురాతనమగు నొక యాశ్వరాలయము కలదు దానిక్రింద నద్భుతమగు [illegible] యేర్పడియున్నది

౨ ఎల్లిచ్పూర్జిల్లాలోఁ గల మెల్ఘాట్ దుర్గము గర్గా తపతీనదులసంగమమున నేర్పడిన త్రికోణాకారముగల చోట నిది నిర్మింపఁబడియున్నది వాయవ్యభాగాలనుండి తప్ప మఱియెందుండియు శత్రువులు దీనిని ముట్టడింపఁజాలరు అంతేకాక తపతీనదిరెండవగట్టు పేటవాలుగ నెత్తయియుండును కోట ఒకయెకరము భూమి నాక్రమించినది చదరమై నాలుగు బురుజులుగలిగి యిటికతోఁ గట్టఁబడియున్నది క్రీ. శ. ౧౮౫౮-వ సంవత్సరమున నిందుండి ఆయుధసామగ్రి యంతయుఁ దొలగింపఁబడినది

**అమ్మంగదేవి** — చోళ రాజేంద్రుని కూఁతురు పూర్వ చాళుక్యరాజగు విమలాదిత్యునకును, రాజరాజకుమారి యను కుందవ్వకును జనించిన పుత్త్రు నీమె పెండ్లియాడినది కులోత్తుంగ చోడరాజ కుమారుఁ డీమెపుత్త్రుఁడు

**అమ్మగారిపల్లి** — ౧ చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకా యందలి యినాంగ్రామము జనసంఖ్య ౨౩౪

౨ చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకా యందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧,౩౫౩ (౧౯౩౧)

**అమ్మచెఱువు** — చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకా యందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧౨౩

**అమ్మనఁబ్రోలు** — గుంటూరుజిల్లా ఒంగోలు తాలూకా యందలి గ్రామము జనసంఖ్య ౪,౩౧౬ (౧౯౩౧).

**అమ్మనాయకనూరు** — మధుర జిల్లాలోని యొక జమీందారీ. ఈ జమీందారుని మూలపురుషుఁడు [illegible]

# అమ్మరాజవిష్ణువర్ధనుఁడు

సమస్తభువనాశ్రయాదిబిరుదములను ధరించి గజారోహిణీయునరాజ బిడ్డాల శిలాభట్టారయొక్కయు, సువర్ణభాండాగారక్రీకరణముబట్టుఁ డగు శోరమయంకర్తయొక్కయు, మహాసామంతాధిపతి దుప్పనామ మ్మునియొక్కయు, కటకాధీశుఁడగు మహాకుండశేశ్వర దుర్గరాజసేనాని యొక్కయు తోడ్పాటుతో వేంగీసామ్రాజ్యమును పాలించెను ఇతఁడు కవితాప్రియుఁడు, రసికచక్రవర్తి, నటులను గాయకులను కవులను నానాదేశాగంతుకులను పోషించి, కవిగాయకకల్పతరు వని ప్రసిద్ధి నొందెను రాజమహేంద్రవరవాసుఁ డయిన యీతని కొలువుకూటమునఁ బ్రసిద్ధిఁగన్న కవిశతంములలో మాధవభట్టు, మహా కాలభట్టు, పోతనభట్టు, సుండియభట్టు మొదలగువారు సుప్రసిద్ధులు అమహాకవు లందఱును సంస్కృతభాషయందే తమపాండిత్యగరిమను కవితాచమత్కృతిని జూపిరి.

అమ్మరాజవిజయాదిత్యుఁడు కాలాముఖశైవాచారమును బోషించి, బ్రాహ్మణమతమును గాపాడెను కాలాముఖశైవాచార్యుఁ డును, అమరా వతీసింహాపరివత్తీర్థమున కధిపతియు, తత్త్వజ్ఞానఖనియు నగు ప్రధా తరాశి విద్యేశ్వరపండితుఁ డీరాజచంద్రునికి మాహేశ్వరదీక్ష నిచ్చిన రాజగురువు ఈతనిప్రేరణ మన అమ్మరాజు శైవాలయములను బ్రతి ష్ఠించెను విజయాదిత్యుఁ డెంతటిపరమమాహేశ్వరుఁ డయినను అన్య మతములపట్ల సహనముతోపాటుగ నాదరణమునుగూడఁ జూపి వానిని విశాలహృదయముతోఁ బోషించెను ఇతనికాలమున జైనమతము కూడ బాగుగ వర్ధిల్లినది ఇతఁడు జినాలయములకుఁ జేసినయగ్రహార దానములుకూడఁ గలవు.

అమ్మరాజు దేవబ్రాహ్మణకులసంఘములను సమానముగ భక్తితో గౌరవించి పోషించెను. చాళుక్యనృపాలురలో నీతఁ డిచ్చినన్ని యగ్ర హారములు, దేవభోగములు, వన్నెవక్షేత్రములు నొసఁగినవా రింకొ కరు లేరు

అమ్మరాజవిజయాదిత్యుఁని తనపరిపాలనముయొక్క చివరకాల మున ఆపదలపాలయ్యెను అమ్మర నామ వదిమ్మడుని గావింప వలెనని యాదులును, శత్రువులును ఒకసంఘముగాఁ జేరి రాష్ట్రకూటవల్లభుఁ డగు మూఁడవ కృష్ణభూపతిసాహాయ్యము వర్థించిరి కృష్ణవల్లభుఁడు సైన్యసమేతుఁ డయి అమ్మరాజుదాయాదు లగు బాదప, తాళపులతోఁ గూడి కళింగదేశమున కేతెంచి వేంగీశ్వరునిపైని కయ్యమునకు కాలు దువ్వెను అట్టి సందిగ్ధసమయమున అమ్మరాజు రాజ్యభారము నంతయు దానార్ణవునిపైని బెట్టి తనసేవలకుఁ దాన నేవాని యయి కృష్ణవల్ల భునిపైఁగల కోపమున, శత్రువుల నెదుర్కొన కళింగమున కరిగెను అప్పటి కాతని కిరువదిరెండు సంవత్సరములు నిండీనిండనియేగ వయసు. అవాఁడు కళింగమున జరిగినసంగ్రామమునందు తనశత్రువుల నమ్మరాజు సంపూర్ణముగ నోడించి విజయలక్ష్మిసమాలింగితుఁ డయ్యెను. కృష్ణవల్లభ, బాదప, తాళప, దానార్ణవులు పూర్తిగ పరాజయము నొంది పాఱిపోయిరి

ఈమహాయుద్ధమున నోడిపోయినను అమ్మరాజుశత్రువు లాత నిపైని ఖగ విడువక్కైఁ బాదపుఁ డిపుడు పరరాజుల నాశ్రయించుట తో తృప్తి నొందక, వేంగీదేశమునందే విజయాదిత్యునిరోధము ద్రోహచింతగల సుస్థ్రార్థుల నాగని వారిని సంతుష్టులఁగాఁ జేసి తనవశ మునకుఁ ద్రిప్పుకొనెను ఇట్టివారిలో ముఖ్యులు ముఖ్యులు అందు మొదటివాఁడు అమ్మరాజునకు మఱఁది యైన గండనారాయణాంకుఁ డగు భాస్కరుఁడు ఈతఁ డేమికారణమునకో అమ్మరాజుపైని పగఁ బూని ప్రత్యర్థియై ద్రోహము తలపెట్టి అతనిని గూల్చుటకు కారణ భూతుఁ డయ్యెను ఇఁక రెండవవాఁడు వల్లభుమల్లభులాఁడుము, పాటుంకుఁడును, కలివర్తు పాత్రుఁడును, మకరియరాజపుత్రుఁడు నగు దుప్పనయ్య మూఁడవవాఁడు కణాటదేశమును బాలించుచుండిన చోళ త్రిశేత్రాధిభాఁ డగు బుజాహోళఖీమఁ డను తెలుఁగుచోడ సామంత నృపాలుఁడు ఇట్లెంకెందఱో రాజద్రోహు లయి బాదపాభ్యుని పక్షమునఁ జేరిరి ఈ రాజద్రోహుల నదిమి పట్టుటకై అమ్మరాజెంచు మించుగా రెండుమూఁడుసంవత్సరములు ప్రయత్నించెను కాని కార్యము లేకపోయెను ఆటుపిదప అమ్మరాజు ధైర్యమును విడక దాయపరాజాదులతో ఘోరముగఁ బోరెను కాని చోళత్రిశేత్రుని సాహాయ్యమున బాదపరాజునకు కృష్ణుకు దక్షిణమునఁగల రాజ్య మంతయు మూఁట వశమయ్యెను పిమ్మట బాదపుఁడు బలవంతుఁ డయి అమ్మరాజును ఎదుర్కొనెను ఆమహాసంగ్రామమున అమ్మరాజ విజయాదిత్యుఁ డాకస్మికముగ శకవర్షములు ౮౯౨ అను ఫాల్గున మాసమున (క్రీ. శ. ౯౭౦, మార్చినెల) ద్రోహులవాతఁ బడి వీర స్వర్గమును పొందెను

[ భా. వేం. కృ. ]

**అమ్మరాజ విష్ణువర్ధనుఁడు** (క్రీ. శ. ౯౨౧-౯౨౭) — ఆంధ్రదేశము నేలిన వేంగీచాళుక్యులలో పదునాలవ వాఁడు, కొల్లభిగండ బిరుదాంచితుఁ డయిన నాలుగవవిజయాదిత్యుని జ్యేష్ఠతనయుఁడు రెండవచాళుక్యభీముఁ డీతనికి సవతితల్లి కుమారుఁడు. ఇతనిపేరు సంస్కృతమున అంబరాజనియు వ్యవహరింపఁబడు చుండెను

అమ్మరాజు పట్టభద్రుఁ డయినపిమ్మట కులక్రమాగతమయిన విష్ణు వర్ధననామముతోఁ బరఁగెను అందువలన చరిత్రకారు లీమొదటి అమ్మరాజును అమ్మరాజవిష్ణువర్ధనుఁ డని వ్యవహరింతురు ఇతనికి సర్వ లోకాశ్రయుఁ డనియు, రాజమహేంద్రుఁ డనియు బిరుదములు కలవు రాజమహేంద్రబిరుదమును స్వీకరించిన చాళుక్యులలో నీతఁడు మొదటివాఁడు

అమ్మరాజవిష్ణువర్ధనునితండ్రి కొల్లభిగండవిజయాదిత్యుఁ డాఱు నెలలమాత్రమే పరిపాలన మొనర్చి యాకస్మికముగ మరణించుటచే రణరంగమున విజయము యొసంగు ఖ్యాతిని గాంచెను. అతనికి

ముమ్మడివాని యువరా జను అమ్మరాజవిష్ణువర్ధనుఁడు తండ్రి చెంతనే యుండుట తటస్థించెను. మహారాజును, యువరాజునుగూడ రాజధానియందును, దేశమునందును లేనికాలము చూచి విజయుఁ డను దాయాదులును, కులశత్రువులునుగూడ అమ్మరాజురాజ్యాభిషేకమును విరోధించిరి. అతని ప్రతిపక్షులలో పినతండ్రియైన విక్రమాదిత్యుఁడును, దాయాదియైన మొదటి మల్లపరాజును, అతనికుమారుఁడు తాళరాజును ముఖ్యులు. వీరు చాళుక్యకుల వైరులగు రాష్ట్రకూట వల్లభులను, కళింగగాంగులను ఆశ్రయించి వేంగీదేశమును కరగతము చేసికొనఁదలఁచిరి.

అమ్మరాజునకు ఉత్తరమున కళింగదేశమునందు మొదటి వజ్రహస్తుఁడును (క్రీ. శ. ౯౨౩ - ౯౩౦), పశ్చిమమున కుంతలదేశమున రాష్ట్రకూటవంశజుఁ డగు ప్రభూతవర్షచతుర్థ గోవిందరాజును (క్రీ. శ. ౯౧౮ - ౯౩౪), దక్షిణమున నొలంబరాష్ట్రాధీశుఁడయిన అయ్యపరాజును (క్రీ. శ. ౯౧౮ - ౯౩౮) సమకాలికులు. కొల్లభిగండఁడు మరణించినపిదప మొదటి యుద్ధమల్లుని కుమారుఁడగు తాళపుఁడు రాష్ట్రకూటగోవిందరాజాదుల నాశ్రయించి వేంగీదేశము నాక్రమించెను కాని అమ్మరాజు తనప్రజ్ఞాచక్రముచేత దేశము నాక్రమించుకొన్న శత్రుతిమిరము నుదయభానునివలె పటాపంచలుచేసి సుస్థిరముగ వేంగీభూతలము నాక్రమించుకొనెను. ఈవిధమున అమ్మరాజురాజ్యకాల మంతయును దాయాదశత్రుకలహములతో నిండిపోయినను, దక్షుఁ డగుటచేత నతఁడు శత్రువుల కజేయుఁ డయి పరిపాలించెను. తుద కితఁడు తాళపరాజు ప్రేరణముచేత కాంచోలు వేంగీదేశముపయి దండెత్తివచ్చిన నొలంబ-అయ్యపరాజుతోడి యుద్ధమునందు మరణించెను.

అమ్మరాజసేనాపతులలో ఖండనాదిత్య కంఠాదిత్యుఁడు, మహాకాలుఁడు అనువారలు ముఖ్యులు. ఖండనాదిత్యుఁడు పట్టవర్ధనీవంశసంజాతుఁడు. మహాకాలుఁడు కుమారస్వామివంటి బలపరాక్రమతేజములు గల మహాయోధుఁడు.

అమ్మరాజు రాజ్యతంత్రదక్షుఁ డయి, రాష్ట్రకూటవంశమునందలివారలను గొందఱను విడదీసి, వారలకుఁ దనరాజ్యమున గ్రామములను మాన్యములుగా నిచ్చి, వారిని రాజనిష్ఠాయోగ్యులుగను, మాండలికులుగను నియమించెను. ఇట్టివారిలో మనకుఁ దెలియవచ్చినవాఁడు రాష్ట్రకూటవంశజుఁ డయిన ఇందపరా జొకఁడు.

ఈమహారాజు తనపేరనమ్మపేరట గోదావరీనదీతీరమున రాజమహేంద్రనగరమును గట్టించినాఁ డని లోకప్రసిద్ధి. ఈ నగరము చాళుక్యరాజవంశమునకుఁ గొంతకాల మంతవరకు రాజధానియై గణన కెక్కినది. [భా. వేం. కృ.]

అమ్మలాచార్యుఁడు — ఒక వైష్ణవకవి. ఘటికశత మదర్య్యునాచార్యుల కుమారుఁడు. ఇతఁడు ౧౭-వ శతాబ్ది తుదిభాగమునో, ౧౮-వ శతాబ్ది మొదటిభాగమునో చెందినవాఁడై యుండవచ్చును. ఇతఁడు రచించిన గ్రంథములు యతిరాజవిజయము (దీనికే వేదాంతవిలాస మనియుఁ బేరు), చోళభాణము, వసంతతిలకభాణము. యతిరాజవిజయనాటకమున వైష్ణవమతస్థాపకుఁడగు రామానుజుని దిగ్విజయము, వైష్ణవమతతత్త్వము సహేతుకముగ వర్ణింపఁబడినవి.

అమ్మల్లదిన్నె — అనంతపురంజిల్లా తాడిపత్రి తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౪౨౮ (౧౯౩౧).

అమ్మల్లబందకోట — చిత్తూరుజిల్లా మదనపల్లె తాలూకాయందలి యీనాంగ్రామము. జనసంఖ్య ౧౨౫.

అమ్మవారికుప్పం — చిత్తూరుజిల్లా తిరుత్తని తాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౩౦,౨౫ (౧౯౩౧).

అమ్మవారిపల్లె — చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౬౯.

అమ్మవారిపాళెం — నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకాయందలి యీనాంగ్రామము. జనసంఖ్య ౯౯౪.

అమ్మవారిపేఁట — నెల్లూరుజిల్లా వేంకటగిరితాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౨౧౬.

అమ్మినకెరె — బళ్ళారిజిల్లా కుడ్లిగితాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౬౦౬.

అమ్మివల్లి — పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరుతాలూకాయందలి యీనాంగ్రామము. జనసంఖ్య ౧౪౯.

అమ్రాపూర్ — ౧. బొంబాయియందలి కాఠేవాడ్‌లోని ఒక చిక్కి చిన్న సంస్థానము.

౨. బొంబాయియందలి రేవాకాంఠలోని ఒక చిక్కి చిన్న సంస్థానము.

అమ్రాబాద్ — హైద్రాబాద్ సంస్థానములోని మహబూబ్‌నగరుమందలి యొక తాలూకా. దీని విస్తీర్ణము ౯౨౯ చదరపు మైళ్లు. జనసంఖ్య ౨౦,౪౪౦. ఈ తాలూకాలో ౭౬ గ్రామములు కలవు. అందు తొమ్మిది జాగీరుగ్రామములు. అమ్రాబాద్ అను గ్రామము ముఖ్యస్థలము. ఆదాయము ౨౫,౦౦౦ రూపాయలు. ఇటీవల నిందు క్రొత్తగ్రామములు కొన్ని చేర్చిరి. ఇప్పుడిందు జాగీరు గ్రామములు గాక ౬౯ గ్రామము లున్నవి.

అమ్రా — ఒక మహమ్మదీయ యోధుఁడు. మొదట నితఁడు మహమ్మదునకు శత్రువుగ నుండెను. కాని, తరువాత, అతని ప్రధానానుచరులలో ఒకఁ డయ్యెను. అతఁడు క్రీ. శ. ౬౩౯-వ సంవత్సరములో ఈజిప్టుదేశమును జయించి ౬౬౩-వ సంవత్సరము

ములకును పాలించెను అలెగ్జాండ్రియాలో గ్రంథాలయమును తగులఁబెట్టించినవాఁ డితఁడే యని చెప్పుదురు కాని యిది నిజము కాదు

**అమ్రేలి** — ౧ (తాలూకా) బరోడా సంస్థానమున, అమ్రేలి ప్రాంతమందలి ఒక తాలూకా. దీని విస్తీర్ణము ౭౭౦ చదరపు మైళ్లు. జనసంఖ్య ౫౫,౧౫౩ ఇందు ౫౮ పల్లెలును, ఒక పట్టణము కలవు. భూమిశిస్తు రు. ౪౦,౦౦౦ లు

౨ (పట్టణము) అమ్రేలి ప్రాంతమునకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౧౭,౪౪౪ ఇది తేబీ అనునదియొడ్డున నున్నది దీనిచుట్టును పూర్వము మంచి ప్రాకారముండెను దీనిని పూర్వము అమరవల్లి అనుచుండిరి ఇది కాఠేవాడ్ ప్రాంతమునఁగల ముఖ్యమైన ప్రతిసంతలలో నొకటి ఇంగ్లీషువారితరపున నిచ్చట ఒక పొలిటికల్ అసిస్టెంటు ఉండును అతఁడు బరోడాలో నుండు రెసిడెంటు చేతి క్రిందివాఁడు

౩ (ప్రాంతము) బరోడా సంస్థానములోని ఒకజిల్లా ఇది గుజరాత్‌లో కాఠేవాడ్ దేశమునం దున్నది దీని విస్తీర్ణము ౧,౨౭౫ చదరపు మైళ్లు పదునేడు విడివిడి భూఖండములు కలసి యీప్రాంత మైనది. వానిలో ఒఖామండల్ తాలూకా యనుదానికి ఉత్తరమున కచ్ జలసంధియు, పశ్చిమమున అరబ్బీసముద్రమును గలవు జనసంఖ్య ౧,౭౩,౭౩౬. వీరిలో నూటికి ౯౯ మంది గుజరాతీభాష మాటాడుదురు ఇందలిభూమిలో విస్తారముభాగము నల్లనిదియు, సారవంత మైనదియు నగును.

ఇందలి గీర్ అనుపట్టణములోని ఆవులు మిక్కిలి ప్రఖ్యాతి కెక్కినవి నూలుబట్టలు, చౌకపట్టుమీఁద జరీపనిచేయుట, వెండిపని, కాంస్యపాత్రలు మొదలగు వస్తువులు తయారుచేయుట ఇక్కడి కళాకౌశలములు ఈ ప్రాంతములో ౪ ప్రత్తి ఏకువట్టి ఫ్యాక్టరీలు కలవు ఇందు కోడినార్, ద్వారక, బేట్ అను మూఁడు సముద్రపురేవులు గలవు. పశ్చిమతీరమందలి మహాక్షేత్రమైన ద్వారక ఇందులోనిదియే

మొట్టమొదట మహారాష్ట్రులు కాఠేవాడ్ దేశముమీఁదికి ఖండేరావు దాభాడే, ప్రథమదామాజీగాయక్వాడ్ కాలమున వెళ్లిరి కాని రెండవదామాజీ గాయక్వాడ్ ౧౭౩౨ - ౧౭౬౮ కాలమువఱకును ఈ ప్రాంతము వారికి స్వాధీనమైనదికాదు స్వాధీన మైనతర్వాత పూనా పేష్వాయును గాయక్వారును కలసి ప్రభుత్వము చేయుచుండిరి ౧౮౧౮ లో పేష్వాప్రభుత్వ మంతరించినతరువాత కాఠేవాడ్‌పై నాతనికిఁగల హక్కు ఇంగ్లీషువారికి సంక్రమించెను గాయక్వాడు నకుఁగల హక్కు వారికే యుండిపోయెను

ఈ ప్రాంతము రమారమి ౬,౫౦,౦౦౦ రూపాయలు చెల్లును ఈజిల్లాలో ఆఱు మున్సిపాలిటీలును, ఒక హైస్కూలును, ఒక ఆంగ్లో వర్నాక్యులరుస్కూలును, ౧౭౦ వర్నాక్యులరుస్కూళ్లును, ౨ సివిల్ ఆసుపత్రులును కలవు

అమ్లజని — (చూడుడు ఆక్సిజెన్).

**అమ్లపిత్తము** — రోగోత్పత్తి కారణము (ఆయుర్వేదము ననుసరించి).— విరుద్ధక్షీర మత్స్యాదిద్వ్యాహారములు, పులుసు, విదాహకరద్రవ్యములు, పైత్యకరద్రవ్యములు, పులిసినయన్నము, పిత్తమును ప్రకోపింపఁజేసెడియన్నము, పానము అనువానిసేవనము వలనను, వర్షాదిఋతువులవలనను పిత్తము ప్రకోపించి భుజించిన యన్నాదులు జీర్ణము గాక పులిత్రేఁపులు వచ్చుటయే అమ్లపిత్తమని తెలియవలయు

సామాన్యలక్షణములు — అందు అజీర్ణము, ఆయాసము, ఓకారములు, దురద, పులిత్రేఁపులు, శరీరభారము, హృదయ కంఠములయందు తాపము, దప్పి, భ్రమ, మూర్ఛ, అగ్నిమాంద్యము, గగుర్పాటు, ఒకానొకప్పుడు చేఁదుగ పుల్లగ వమనము చేయుట, కడుపులో కాలించుట – యీ లక్షణములు కల్గినది అమ్లపిత్తం అని యెఱుంగునది.

గతిభేదముచే ద్వివిధము.— ఇయ్యది అధోగతామ్లపిత్తము, ఊర్ధ్వగతామ్లపిత్తము అని గతిభేదముచే ద్వివిధం బగుచున్నది అందు శరీరము నందలి అధోభాగమున నానావిధంబులుగ నొప్పుడుము లాడును. వెడలుటచేత అధోగత - అమ్లపిత్త మనియు, చేఁదుగ నయినను పుల్లగ నయినను పలువిధములయిన రంగులతోఁగూడిన పసరు నోటఁ గ్రక్కుచుండుట ఊర్ధ్వగతామ్లపిత్త మనియు నెఱుంగఁదగును

సాధ్యాసాధ్యత — అమ్లపిత్తము నూతనముగ జనించినరోగము యత్నముచే సాధింపనగును చిరకాలజ మయినచో యాప్య మైయుండును పథ్యనియమము గలవానికి నొకప్పుడు కష్టసాధ్యం బైయుండును (మాధవనిదానము)

పిప్పలీఘృతం — పిప్పలీకషాయములో పిప్పలీకల్కమును వేసి ఘృతమును చేర్చి ఘృతపాకవిధి ననుసరించి పాకము గావించి అట్టి ఘృతములో తేనె గలిపి ఉదయమున సేవించినచో అమ్లపిత్తము శాంతించును (చక్రదత్తుఁడు).

ఖండకూష్మాండము.— బూడిదగుమ్మడికాయరసము నూఱు పలములు, ఆవుపాలు నూఱుపలములు ఈ రెంటిని కలిపి ఉసిరికపప్పు చూర్ణమును ఎనిమిదిపలములును వేసి ప్రాయిమీఁద నుంచి చన్న సెగచే ముద్ద యగువఱకును వండి ఉసిరికపప్పునకు సమముగ చక్కెరను చేర్చుకొని లేహ్యపాకముగ దించుకొని జాగ్రత్తపెట్టి యుంచవలెను దీనిని పూటకు అరపలముచొప్పున సేవించినచో అమ్లపిత్తము శాంతించును (యోగరత్నాకరము).

దశాంగకషాయము — అడ్డసరము, తిప్పతీగ, పర్పాటకము, వేపబెరడు, ఏలకి, నేలవేము, త్రిఫలములు, పటోలము — వీనిని కషా

యము కాచి, తేనె కలిపి సేవించినచో అమ్లపిత్తము నిశ్చయముగా శాంతి నొందును (చక్రదత్తుడు).

పథ్యాపథ్యములు — యవలు, గోధుమలు, పెసలు, ప్రాతశాలి ధాన్యము, కాచి చల్లార్చిననీరము, కాకరకాయ, అరటిపువ్వు, లేత పొదుగుబెండ్లు, బాగుగ ముదిరిన బూడిదగుమ్మడికాయ, దానిమ్మకాయ, కఫపిత్తహరములయిన సర్వాన్నపానములు అమ్లపిత్తరోగులకు హితకర ముగ నుండును. నువ్వులు, మినుములు, ఉలవలు, గొఱ్ఱెపాలు, ధాన్యామ్లము, లవణామ్లకటుపదార్థములు, గుర్వన్నము, పెరుగు, మద్యము- మొదలగునవి అమ్లపిత్తరోగులు వర్జింపవలెను (యోగరత్నాకరము)

[గం దూ]

**అమ్లము** — ౯ వద్రవ్యములలో నొకటి

ఇ అమ్లజనితో కొన్ని ఉపధాతువులు కలిసినప్పుడు ఏర్పడుపదార్థము దీని నింగ్లీషులో ఆసిడ్ అందురు వీటిలో గలివివరములకు అమ్లము లవణ (చూడుడు ఆసిడ్)

**అగ్లియార** — 'అగ్నివార' యను మిక్కిలి చిన్న సంస్థానముయొక్క ముఖ్యగ్రామము. ఈ సంస్థానము బొంబాయి రాజధానియందు మాహీకాంతయేజన్సీలో నున్నది అహమదాబాదు పట్టణమున కీశాన్యమున ౩౪ మైళ్లమీద నీగ్రామమున్నది జనసంఖ్య ౧౯౦౧ లో ౧,౪౩౪ ఇం దొకశివాలయమును, కురకలగోరీయును, పురాతనపట్టణముయొక్క శిథిలావశేషములును గలవు

**అమ్లోహ** — పంజాబునందలి నాభాసంస్థానములో నొక నిజామత్, అనగా జిల్లా దీనివైశాల్యము ౨౧ చదరపుమైళ్లు జనసంఖ్య ౧,౧౫,౦౪౯ ఇందు ౨౪౯ పల్లెలును, నాభాగ్రామమును ఉన్నవి అంటోహా అనునది రాజధాని భూమిసిస్తు, పన్నులు కలసి రు ౩,౩౦,౦౦౦ లు భూమి కేగడ, మిక్కిలి సారవంతము, నీరు పైకే పడును. సర్‌హింద్ కాలువవలన భూములకు నీరు పాఱును పరిష్కారము ఇతరమయిన జబ్బులు కలవు

**అమ్‌స్టర్‌డం** — ఐరోపా ఖండములోని ప్రధాన వ్యాపారస్థానములలో నొకటి హాలండుదేశపు రాజధాని రాజు గారు మాత్ర మిందు నివసింపరు దీని జనసంఖ్య ౬,౪౩,౧౨౦

అమ్‌స్టర్‌డంనగరము మిక్కిలి పల్లమునం దుండుటచేత, నిండలోకట్టడము లన్నియు చాలభాగము ఎత్తయిన కొయ్యలపై గట్టబడి నవి. కాలువలచే నీనగర మనేకద్వీపములుగ విభజింపబడినది ఈ చిన్నచిన్న లంకలను కలుపుటకు ౫౦౦ వంతెనలు కలవు. చాల వీధులలో నీటికాలువలు ప్రవహించుచుండును. కాలువల రెండువైపుల వెడల్పయిన యిసుకతిన్నెలపై వృక్షపంక్తు లుండును. రాజమందిరము, విశ్వవిద్యాలయభవనములు, వస్త్రప్రదర్శనశాల మున్నగునవి కొన్ని యందలి గొప్పకట్టడములు వజ్రములను కోయుటయందును

యందలి ప్రధానపరిశ్రమలలో నొకటి దీని సముద్రవ్యాపారము మంచి యభివృద్ధిలో నున్నది. ౧౩-వ శతాబ్దిలో అమ్‌స్టర్‌డం ఒక చేపలపల్లెగ నుండినది ౧౭, ౧౮ శతాబ్దులలో నది ప్రపంచములో నెల్ల పెక్కువ ధనవంతములగు నగరములలో నొకటి యయ్యెను.

**అమ్హర్‌స్టు** (క్రీ శ ౧౭౭౩ - ౧౮౫౭) — విల్లియమ్ పిట్ అమ్హర్‌స్టు అనువాడు లెఫ్టినెంటు జనరల్ విలియమ్ అమ్హర్‌స్టు కుమారుడు ఇతనితల్లి ఎలిజబెత్తు ఇతడు ౧౭౭౩-వ సంవత్సరమున జనవరి ౧౪-వ తేదీని బాత్ నగరమున జన్మించెను ఇతడు పిన్నబిడ్డయైయుండగనే యితనితండ్రి కాల ధర్మము నొందెను నాటినుండి యితడు పినతండ్రియయిన జనరల్ జెఫరీ అమ్హర్‌స్టుయొద్దనే పెరిగెను వారన్‌హేస్టింగ్సు మొదలయిన వారలు చదివిన వెస్ట్‌మినిస్టరు పబ్లిక్‌స్కూలునందే యితడును చదివి, పిదప ౧౭౯౩ న ఆక్స్‌ఫోర్డునందు పట్టపరీక్షయం దుత్తీర్ణుడయ్యెను కళాశాలవిద్య ముగించినపిదప నాటియాచారము ననుసరించి యూరోపుఖండమున పర్యటనము గావించి, యేయేదేశములగుండా ప్రయాణము గావించెనో యాయాదేశములభావములనుగూర్చి, యాచార ములనుగూర్చి యధ్యయనము గావించెను పిదప రాజకీయోద్యోగము నందు నియుక్తుడయి ౧౮౦౯ లో సిసిలీకి రాయబారిగను, పిదప నంత పెక్కువయధికారములను వహించి చీనాకు రాయబారిగను వెళ్లెను ౧౮౦౦ లలో నితడు ప్లిమత్ కౌంటెస్సును వివాహము గావించుకొనెను ౧౮౧౫ లో అమ్హర్‌స్టు ప్రభువు శ్రీమన్నవాల రయ్యెను ఆ మఱుసటిసంవత్సరమే యితడు చీనాదేశమునకు ప్రత్యేక దౌత్యమును వహించి వెడలెను. ౧౮౧౭ న చీనాదేశమునుండి తిరిగి వచ్చినపిదప కొంతకాల మింగ్లండునందే యుండి రాజకీయములందు పాల్గొనుచు వచ్చెను

ఇటు లుండ హేస్టింగ్సుప్రభువు హిందూదేశమున గవర్నరు జనరలుగా బనిచేయవలసినకాలము పూర్తియయ్యెను అపుడదిని మహా వక్తయు, రాజ్యతంత్రనిపుణుడును అయిన కాన్నింగును కొసంగగా నతడు దానిని నిరాకరించెను పిదప దానిని అమ్హర్‌స్టుప్రభువున కొసంగ నత డంగీకరించెను నూతనాధికారని యుక్తుడయి యితడు ౧౮౨౩-వ మార్చినెలలో బయలుదేఱి ౧౮౨౩-వ అగస్టు ౧-వ తేదీని కలకత్తా చేరెను

అమ్హర్‌స్టుప్రభువు నూతనాధికారమును స్వీకరించిన కాలమే కాలమునకు హిందూదేశప్రభుత్వమువారికిని, బర్మారాజానకును వైరము సంఘటిల్లినది ౧౭౬౦ ప్రాంతమున అలోంప్ర (అలౌంగ్‌పయా) అనునతడు డొక నూతనవంశమును స్థాపించెను ఈ వంశమువారు కడు పరాక్రమవంతులై కొద్దికాలముననే ఉత్తరబర్మాయందలి షాన్ నాయకులను, ఐరావతీనదీప్రాంతపు పల్లపుప్రదేశములందును, పెక్కు సారిదమునను పాలించుచుండిన తలైంగ్ ప్రభువులను జయించి బర్మాయం దంతటను దమ యధికారమును వ్యాపింపజేసిరి, బంగా

దేశము వంటిదయుండిన అస్సాము, ఆరకాను దేశములనుగూడ వారు జయించిరి ఆరకాను రాజ్యమును జయించినపిదప చిట్టగాంగును, బంగాళమునందలి కొన్ని యుత్తరభాగములను దమకొసంగవలసిన దని బర్మావారు ఇంగ్లీషు ప్రభుత్వమును కోరిరి ౧౮౨౨ ౨౩ లో అస్సాము దేశమును జయించినపిదప వారు చిట్టగాంగు దగ్గఱనుండు బ్రిటీషు బహిష్కారాధికారులను దఱిమివైచి బంగాళదేశమునకు దండెత్తుదు మని బెదరించిరి ఈ కారణమున బ్రిటీషు ప్రభుత్వమువారికిని, బర్మావారికిని యుద్ధము సంభవించినది ఇది చరిత్రమున మొదటి బర్మాయుద్ధ (౧౮౨౪ ౨౬) మని వ్యవహరింప బడుచున్నది



అమ్హర్స్టు ప్రభువు

శీఘ్రకాలముననే కొంత సైన్యము అస్సాము దేశమునకు వెళ్లి యచటినుండి బర్మావారిని దఱిమివైచినది కాని బర్మావారు చిట్టగాంగు సరిహద్దులందు జరిగినయుద్ధమున విజయము బొందిరి అటుపిదప బర్మావారిని లొంగదీయుటకు శీఘ్రకాలముననే మదరాసు ప్రధానసేనాధిపతియైన సర్ ఆర్చిబాల్డ్ కాంబెల్ నాయకత్వమున కొన్ని సేనలు బంగాళాఖాతము మీదుగ రంగూనునగరమునకు బంపబడెను ౧౮౨౪ వ మే ౧౧ వ తేదీని రంగము సులభముగా ఇంగ్లీషువారికి వశమాయెనది కాని వర్షము లప్పుడధికముగ గురియుచుండుటచేతను, వరదలును, రోగపోకల కానుకూల్యములును లేకపోవుటచేతను ఇంగ్లీషువారు చాలకష్టములపాలైరి బర్మావారు రంగూను మరల వశపఱచుకొనవలెనని ప్రయత్నించియు విఫలమనోరథులై మరలి పోయిరి వారి సేనానాయకులలో కడుపరాక్రమవంతుడును, గొప్పవాడును అగు మహాబందుల దొనాబి యుద్ధరంగమున హతుడాయెను విజయులైన ఇంగ్లీషువారు [illegible] ఉత్తరదిశకు పోగ

పోయిరి ప్రతిస్థలమునను దూలములతోను, దుంగలతోను అవరోధ నిర్మాణములను గట్టికొని బర్మావారు వానివెనుకనుండి తమ్ము దాము సంరక్షించుకొనుచుండిరి కాని తుదకు వారు ఇంగ్లీషువారికి లోబడి పోయిరి యాండబు నగరముకొద్ద నుభయపక్షములవారికి సంధి జరిగినది ఈసంధి ననుసరించి ఇంగ్లీషువారికి అస్సాము, ఆరకాను, టెనస్సెరిమ్ రాజ్యములు లభించినవి యుద్ధనష్టపరిహారముక్రింద పది లక్షలపౌనులను నాలుగుతడవలలో నింగ్లీషువారికి చెల్లించుట కేర్పాటు జరిగెను బర్మారాజధానియైన ఆవానగరమున రాజాస్థానమున బ్రిటీషు రెసిడెంటు ఉండుటకు నియామకము జరిగినది

అమ్హర్స్టుప్రభువు గవర్నరు జనరలుగ నుండినకాలమున జరిగిన మఱియొక ముఖ్యవిషయము భరతపురభంగము బర్మాయుద్ధమువలన హిందూదేశమునందు కొంత కలవరము జనించినది ఈయుద్ధము ప్రారంభదశలో ఇంగ్లీషువారికి గలిగిన యపజయములు గొప్ప యుపద్రవములుగ నతిశయోక్తిగ వర్ణితము లయినవి పటాలములనుండి వెడల నడపబడిన సిపాయీలలోను, స్వతంత్రులుగను సామంతులుగను పాలించుచుండిన కొందఱు సంస్థానాధిపతులలోను అశాంతి కొంత వర్ధిల్లుచుండెను ఈ యశాంతికి ఫలముగ చాలకోటల నింగ్లీషువారి మీద తిరుగుబాటులు పెక్కులు జరగినవి వీనిలో ప్రసిద్ధమయినది భరతపురకలహము

భరతపురసంస్థానము జాట్ కుటుంబమువారి పరిపాలనముక్రింద నుండెను ఏడేండ్లయీడుగలబాలుడొకడు ౧౮౨౫ వ సంవత్సరమున సింహాసనమెక్కెను తండ్రి యనంతరము ఆ సంస్థానమునకు రాజు కావలసినవాడు బాలుండే యని హిందూదేశప్రభుత్వమువారును గూడ నంగీకరించిరి ఈ క్రొత్తరాజు చిన్నవాడయినందున అతని మేనమామ సంరక్షకుడుగ నుండి రాజ్యకార్యములను నిర్వహించుచుండెను ఇంతలో నతని బంధువు దుర్జనసాలను వాడు ఆ బాలుని కారాగృహమున బంధించి, యాతని మేనమామను గడద్రోసి సంస్థానాధిపత్యమును స్వీకరించెను బాలుని పక్షమును వహించి హిందూదేశప్రభుత్వమువారు దుర్జనసాలుపై యుద్ధము ప్రకటించిరి అప్పటికాలముననే నూతనప్రధానసేనాధిపతి కంబర్మియరు ప్రభువు నాయకత్వమున బ్రిటీషుసైన్యములు భరతపురదుర్గమును ౧౮౨౫ వ డిసెంబరు ౧౦ వ తేదీని ముట్టడించినవి దుర్గమున సైనికులు కొలదిమందియైనను [illegible] యుండినను ఇంగ్లీషు ప్రభుత్వము వెడల నసంతృప్తి వహించిన మహారాష్ట్రులును, రాజపుత్రులును దుర్జనసాలుసైన్యమునందు జేరిరి అయినను విధి ప్రతికూలముగ నుండుటచేత నాదుర్గము ఇంగ్లీషువారికి ౧౮౨౬ వ జనవరి ౧౮ వ తేదీని వశమాయెనది యుద్ధరంగమునుండి తప్పించుకొనిపోవుచుండగా దుర్జనసాలు పట్టుబడెను అతనిని మొదట అలహాబాదు నందును, పిదప కాశియందును నిర్బంధించిరి అంతమున కారాగారనిర్బంధమున నుండిన బాలరాజు మరల సింహాసనమున కధిష్ఠించెను [illegible] బ్రిటీషుప్రభుత్వమువారి కీర్తిప్రతిష్ఠలు [illegible] భరతపురదుర్గవిజయమువలన మరల ప్రతిష్ఠితము లాయెను

కలదు. ఇట్లే కాలవశమున పెరుఁగుచు, తఱుఁగుచు నుండును. ఇందులకు కారణములు ధ్రువ కదంబములు రెండుగాని, ఏదో ఒకటిగాని చలించుట యను విషయములో ప్రాచీన,నవీనమత భేదము లనేకములు గలవు. ఎట్లయినను కదంబద్వయమునకు మధ్య క్రాంతివృత్తము గలదు. అందుచే విషువద్వృత్తమునకు తిరశ్చీనముగ క్రాంతివృత్త మున్నది. మహావృత్తములకు సంపాత ముండునప్పుడు రెండు ప్రదేశములందు మాత్రమే యుండునను క్షేత్రమితి 3-వ అధ్యా, ౧౦-వ ప్రతిజ్ఞానుసారముగ (Euclid, III, 10) ఈ రెంటికిని రెండు ప్రదేశములందు కలయిక గల్గును. వీనికే మేషాది (Aeris), తులాది (Libra) యని పేర్లు. ప్రస్తుతకాలము దీకలయిక ఉత్తరభాద్రానక్షత్ర ద్వితీయపాద ప్రాంతమందును, ఉత్తరఫల్గునీనక్షత్ర చతుర్థపాద ప్రాంతమందును ఉన్నవి. ఇది సృష్ట్యాదిలోను, ప్రతియుగాదిలోను, ప్రతియుగాంతమందును అశ్వినీప్రారంభమం దుండునని ఆర్షాశయము.




౨-వ పరిలేఖనము

౨-వ పరిలేఖనము చూడుఁడు. మేషము (Aeris), కటకము (Cancer), తులాది (Libra), మకరము (Capricorn). నక్షత్రము లన్నియు నెండటియూర్ధ్వరముచే ప్రదర్శింపఁబడినవి. ఈపరిలేఖనమున మేషము మొదలు కటకమువఱకును విషువద్వృత్తమునుండి ఉత్తరముగ క్రాంతివృత్తమునకుఁగల దూరము క్రమముగ పెరుఁగును. కటకమునొద్ద నీదూరము పరమము. అటనుండి దక్షిణమువైపునకు (Direction) మార్గము తిరుగును. అటనుండి తులాదివఱకు నీదూరము క్రమముగ తగ్గి వృత్తములు రెండును కలియును. అటనుండి మకరాదివఱకును విషువద్వృత్తమునకు దక్షిణముగ క్రాంతివృత్తమునకుఁగల దూరము క్రమముగ పెరుఁగును. మకరమం దీదక్షిణాంతరము పరమము (Maximum). అటనుండి ఉత్తరమువైపునకు (Direction) మార్గము తిరుగును. అనగా మకరమునుండి మేషమువఱకు నీదక్షిణదూరము క్రమముగ తగ్గుచు మేషాదియందు రెండువృత్తములు కలియును. ఇందు క్రాంతివృత్తమే సూర్యమార్గము. ఇది కటకాదినుండి మకరాదివఱకును దక్షిణముగాను, మకరాదినుండి కటకాదివఱకు నుత్తరముగాను ఉండును. అందుచే దక్షిణముగా నున్నమార్గము దక్షిణాయన మనియు, ఉత్తరముగా నున్నమార్గము ఉత్తరాయణ మనియు వ్యవహరింపఁబడుచున్నవి. ఈ యంతయు ౨-వ పరిలేఖనమందు స్పష్టమగుచున్నది. ఉత్తరాయణమందు దేవస్థాన మగు ఉత్తరధ్రువ ప్రాంతభాగము దృశ్య మగుటచే ఆకాలము దేవప్రీతికర మనియు, దక్షిణాయనమందు దక్షిణధ్రువప్రాంతమందలి పితృలోకము దృశ్య మగుటచే ఆకాలము పితృప్రీతికర మనియు మనవారు వ్యవహరించుట సమంజసముగనే కన్పడుచున్నది. ప్రస్తుతకాలమందు ౨౧-వ జూను మొదలు ౨౨-వ డిసెంబరువఱకును సూర్యుఁడు దక్షిణమార్గమం దుండుటచే దక్షిణాయనమును, ౨౨-వ డిసెంబరు మొదలు ౨౧-వ జూనువఱకును సూర్యుఁ డుత్తరమార్గమం దుండుటచే ఉత్తరాయణమును గల్గుచున్నవి. [చి. వేం. శా.]

**అయనుఁడు** — దేవవిశేషము. ధర్మఋషికి సాధ్య యను స్త్రీయందుఁ బుట్టిన సాధ్యదేవత లనువారిలో నొకఁడు (మత్స్య. అ. ౨౦౨)

**అయలూరివారిపల్లి** — నెల్లూరు జిల్లా కనిగిరి తాలూకా యందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౫౫౨

**అయవాహము** — భారతవర్షీయదేశము

**అయశ్శిరుఁడు** — కశ్యపునివలన దనువునకుఁ గలిగిన దానవులలో నొకఁడు

**అయసాపరగణా** — సంయుక్తప్రాంతములందలి ఫతేపూరుజిల్లా, ఖాజీపూరుతాలూకాలో నొకపరగణా. దీనివైశాల్యము ౪౦౫ చ. మైళ్లు. జిల్లా మొత్తముమీఁద తక్కిన పరగణాలన్నిటిలో కన్న దీనిలో భూములు మిక్కిలి సారవంతములయినవి. జనసంఖ్య యించుమించుగ ౧౫,౦౦౦ ఉండును. వ్యవసాయమున కిచట మంచి సదుపాయములు కలవు. ౧౮౦౪-వ సంవత్సరపు కఱువుదెబ్బ యీపరగణాకు ఎక్కువగఁ దగిలినది. మొదట నిది అలహాబాదుజిల్లాకుఁ జెందియుండెడిది. ౧౮౨౬-వ సంవత్సరమున ఫతేపూరుజిల్లాకుఁ జేర్పఁబడినది.

ప్రుండును. అడవులలోనుండియే యిది యెక్కువగా ప్రవహించుచున్నది ఈనది చిన్న చిన్న పడవలు ప్రయాణముచేయుటకుమాత్రము అనుకూలముగ నుండును

**అయిజల్** — ఇది లుశాయీ జిల్లాకు ముఖ్యపట్టణము జిల్లాకు ముఖ్యపట్టణ మయినను ఊరు చిన్నదే దీనిజనసంఖ్య ౨,౫౦౦ అయిజల్ పట్టణము ౩,౫౦౦ అడుగులయెత్తున నున్న యొకకొండమీద నున్నది ఇందుచే నీటిసౌకర్య మిచ్చట తక్కువయైనది దానికై ఎక్కువధనము ఖర్చుచేసి తగిన యేర్పాట్లు చేయబడినవి ఎప్పుడును నిడుదకొ యిచ్చట నొక సైనికదళ ముండును

**అయితెంపాడు** — నెల్లూరుజిల్లా కావలి తాలూకాయందలి యీనాంగ్రామము జనసంఖ్య ౧౮౯

**అయితంపూడి** — పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాయందలి యీనాంగ్రామము జనసంఖ్య ౯౪౭

**అయితేపల్లి** — చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలో నిది యొకపల్లె జనసంఖ్య ౧,౧౮౨ ఇనుము సున్నపురాయి యిచ్చట దొరకును ఆ యినుముతో నాగళ్లు చేయుదురు

**అయినంపూడి** — కృష్ణాజిల్లా దివితాలూకాయందలి యీనాంగ్రామము జనసంఖ్య ౧,౧౮౧ (౧౯౩౧)

**అయినముక్కల** — కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨,౧౫౩ (౧౯౩)

**అయినవల్లి** — గోదావరిజిల్లా అమలాపురము తాలూకాలో ఒకపల్లె జనసంఖ్య ౩,౩౬౩ ఇచ్చట సుప్రసిద్ధమయిన సిద్ధివినాయకదేవాలయ మొకటి కలదు బులుసు అచ్చయ్య పాపయ్యశాస్త్రులనబరగిన ప్రఖ్యాతసంస్కృతవిద్వాంసుల కిది జన్మస్థలము కుణముక్త్యేశ్వర మనుక్షేత్ర మొకటి దీనికి మజరా

**అయినవీడు** — చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకాయందలి జమీందారీగ్రామము జనసంఖ్య ౧౨౪

**అయినహాల్లి** — బళ్లారిజిల్లా కుడ్లిగితాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౨,౦౨౨ (౧౯౩౧)

**అయినాపురం** — తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౮,౦౫౫ (౧౯౩౧).

**అయిశాల** — చిత్తూరుజిల్లా చిత్తూరుతాలూకాయందలి గ్రామము జనసంఖ్య ౧,౭౬౭ (౧౯౩౧).

**అయిలాపుల్ ఝరి** — వంగదేశములోని అంగారి తాలూకాలోని యొక ప్రదేశము. రెండుగ్రామములు కలసి యీపేరను పిలువబడుచున్నది ౧౮౦౫వ సంవత్సరమున నీప్రదేశము అడవులతో నిండియుండెడిది అప్పటి దీనివైశాల్యము ౮౮,౦౦౦ ఎకరములు దీనిపై వచ్చు ప్రభుత్వాదాయము అప్పటికి రు ౩౪౨ లు. ప్రస్తుతమున నిది ఫక్కా నవాబునకు చెందియున్నది. దీనివలన నవాబునకు ఇప్పుడు ఇంచుమించుగ నొక లక్షరూపాయల యాదాయము వచ్చును

**అయీన్ ఉద్దీన్ (షేక్)** — ఇతడు బిజాపుర వాసియగు నొక మహమ్మదీయకవి బహమనీసుల్తానగు అల్లా ఉద్దీన్ బాహనీ కాలమువాడు. 'మల్హకత్', 'తెకాట్ ఉల్ అన్వార్' అను గ్రంథములను వ్రాసెను ఇందు హిందూస్థానమునందలి మహమ్మదీయసాధువులచరిత్రము వర్ణింపబడినది

**అయుడు** — రెండవ స్వారోచిష మన్వంతరమునందలి ప్రజాపతి వసిష్ఠునిపుత్త్రుడు

**అయుతజిత్తు** — యాదవుడు క్రోష్టాఖ్యమహక్రథవంశీయుడైన సాత్వతరాజుయొక్క మనుమడు. భజమానునకు బాహ్యక యను రెండవభార్యయందు బుట్టిన ముగ్గురు కుమారులలో నొక్కడు

**అయుతాయువు** — ౧ (సూ వం.) ఇక్ష్వాకు కులోత్పన్నుడైన సింధుద్వీపుని కొడుకు ఋతుపర్ణు డితని కుమారుడు

౨ (చం వం) ఉపరిచరవసు రాజుయొక్క వంశజుడగు శ్రుతశ్రవరాజుయొక్క పుత్త్రుడు. ఇతనికొడుకు నిరమిత్త్రుడు

**అయుతుడు** — (చం వం) పురువంశోత్పన్నుడై, అజమీఢునిశాఖలోనివాడగు జయత్సేనుడను రాజుయొక్క సంతతివాడైన రాధికరాజపుత్త్రుడు ఇతని కయుతాయు వనియు నామాంతరము గలదు

**అయుధియా** — సయామురేశమునందలి ఒక పురాతన నగరము బ్యాంకాక్ నగరమున కిది ౮౫ మైళ్లదూరమున నున్నది వర్తక మిచ్చట మంచియభివృద్ధిలో నున్నది. వ్యవసాయమునకు సంబంధించినపనిముట్లవ్యాపారమే యిచ్చట ఎక్కువగ నుండును. ౮౦౦ ల సంవత్సరములకన్న యెక్కువకాలము దీని సయామురేశమునకు రాజధానిగ నుండెను ఇచ్చటి ప్రాచీనాలయములు పురాతనవస్తుసంశోధనమున కెక్కువగ నుపయోగించునవిగ నుండుటచే వాని నన్నిటిని దీని యందలి వస్తుప్రదర్శనాలయమున (Museum) జాగ్రత్తపరచియున్నారు ఇప్పుడు దీనిపేరు 'క్రుంగ్ కావో'. సయామునందలి ఎక్కువ ఐశ్వర్యవంతములగు భాగములలో, అందముగల ప్రదేశములలో నిది యొకటి ఇది [illegible] నున్నది.

లోహిత్ ఖండ్ రయిల్వేయొక్క ముఖశాఖ పోవును. జనసంఖ్య ౧౧,౫౫౮

ఈయది హిందూదేశమందలి మహాక్షేత్రములలో నొక్కటి సూర్యవంశపురాజులకు రాజధాని వాల్మీకిరామాయణమును బట్టి చూడఁగా నియ్యది మనువుచే నిర్మింపఁబడె ననియు, దశరథునికాలమున ౧౨ యోజనముల పొడవును, ౧౦ యోజనముల వెడల్పును ఉండె ననియు, పంక్తులు తీర్చినట్లు పట్టణమున వీథు లుండె ననియు, వానిపై నీళ్లు చల్లుచుండి రనియు, నానాదేశములనుండి పెక్కు వర్తకు లిక్కడకు వచ్చుచుండి రనియుఁ దెలియుచున్నది (బాలకాం, స ౫). ఇది ఉత్తరకోసలదేశమునకు రాజధాని అప్పటికాలమున కోసలదేశములు రెండుండినట్లు కానవచ్చుచున్నది శ్రీరాముఁడు నిజధామమునకు వెళ్లినప్పు డీనగరమందలి జనుల నందఱను తనవెంటఁ దీసికొని వెళ్లినందున నిది పాడుపడెనఁట

తరువాత సూర్యవంశజుఁడైన ఋషభరాజు మరల నీపట్టణమును జనాకీర్ణముగఁ జేసెను నలునికాలమున నిచ్చోట ఋతుపర్ణుఁ డను రాజు రాజ్య మేలుచుండెను (మహాభారత వన) పాండవులకాలమున నిచ్చట మహాబలుఁడైన దీర్ఘయజ్ఞుఁ డను రాజు రాజ్య మేలుచుండెను

బౌద్ధయుగమునందుఁగూడ నీపట్టణము వాసికెక్కియుండెను అప్పుడు దీనికి సాకేతము అనునామము విశేషముగ వాడుకలో నుండెను మన హిందూమతగ్రంథములలో అయోధ్యా, సాకేత నామములు పర్యాయపదములుగ వాడినను, బౌద్ధగ్రంథములలో రెండును వేఱువేఱుగఁ జెప్పఁబడినందున నవి మొదట ఒకదానికొకటి సమీపమున్న పెద్దపట్టణము లైయుండవచ్చు ననియుఁ, గ్రమముగ నొక్కపట్టణముగఁ గలసిపోయియుండవచ్చు ననియూహింపఁబడుచున్నది బుద్ధుఁడు సాకేతపట్టణమునందు ౧౬ సంవత్సరము లుండి తనమతమును బోధించెను జైనులకు పూజ్యులైన తీర్థంకరులలో మొదటివాఁడైన ఆదినాథుఁడును, రెండవవాఁడైన అజితనాథుఁడును, నాల్గవవాఁడైన అభినందననాథుఁడును, ఐదవవాఁడైన సుమంతనాథుఁడును ఈపట్టణమునందు జన్మించిరి అందుచే నీపట్టణము హిందువులకువలెనే జైనులకుఁగూడ పుణ్యక్షేత్రము బౌద్ధకాలానంతరము కొంతకాలమువఱకును మరల నీపట్టణము పాడుపడినట్లు కానవచ్చుచున్నది తరువాత విక్రమాదిత్యుఁ డనువాఁడు మరల దానిని గట్టించెనఁట అతఁ డిచ్చట నాగేశ్వరుఁ డను శివుని మందిరమును గట్టించుటయేకాక మొత్తముమీఁద ౩౬౦ మందిరములను గూడ నిర్మించెనఁట కాని యతఁ డేకాలమువాఁడో, యేవంశమువాఁడో తెలియరాకున్నయది ౫-వ శతాబ్దియందు గుప్తరాజులు కొంతకాలమువఱకును దీనిని తమరాజధానిగఁ జేసికొన్నట్లు కానవచ్చుచున్నది. సముద్రగుప్తుఁడును (క్రీ శ ౩౦౦-౩౮౮), అతని కుమారుఁడును ఈపట్టణమునందే రాజ్య మేలినట్లు మన మూహింపవచ్చును[1] ౮-వ శతాబ్దియందు భారూ అను అవర్ణజాతులవాండ్రు హిమాలయపర్వతప్రాంతమునుండి వచ్చి అయోధ్యాప్రాంతము నాక్రమించుకొనిరఁట వీరినిగురించియుఁగూడ నిశ్చయమైన చరిత్ర తెలియదు వీరు నూఱుసంవత్సరముల రాజ్యము చేసినతర్వాత వాయవ్య దిక్కునుండి సోమవంశపురాజులు వచ్చి రాజ్యము నాక్రమించుకొనిరి ఇది పిదప కన్యాకుబ్జరాజులయధీన మయ్యెను. వీరు జైన మతస్థులు వీరితరువాత జయచంద్రునికాలమున నొకటి కాప్పించెను 'ధన' అను అసవర్ణజాతివారుగూడ నిచ్చటఁ గొన్నిసంవత్సరములు రాజ్యము చేసిరఁట. వీరును జైనులే కాని వీరి కన్నిటికిని దంతకథలు తప్ప చరిత్రాధారములు లేవు క్రీ శ ౧౧౯౪ లో మహమ్మదీయ్ గోరీ కన్యాకుబ్జపట్టణమును గెల్చినతరువాత నయోధ్యాపట్టణమును కొల్లగొట్టుకొనిపోయెను. తరువాత తురకలప్రభుత్వమును, తదుపరి ఇంగ్లీషువారిప్రభుత్వమును (౧౮౫౬) వచ్చెను ఆచరిత్ర వివరము 'ఔధ్' అను శబ్దముక్రింద సవిస్తరముగ వ్రాయఁబడును

అయోధ్యాపట్టణమును, దానికి ౮ మైళ్లదూరమునం దున్న ఫైజాబాద్ పట్టణమును గలసి యొకమ్యునిసిపాలిటీగా నేర్పఱుపఁబడినది ఇప్పటి అయోధ్యయును, దానిచుట్టుపట్టుల నున్న శిథిలమందిరాదులస్థలమును కొలది చూడ పశ్చిమమున నుత్తరమూలను మొదలుకొని తూర్పున రామఘాటువఱకును ౬ మైళ్లపొడు వుండును ఇచ్చట ౯౬ హిందూదేవాలయములును, ౩౬ మసీదులును, ౬ జైనమందిరములును, ౪ వైష్ణవమందిరములును గలవు హిందూదేవాలయములలో ౬౩ వైష్ణవమందిరములు, ౩౩ శైవమందిరములు ఈ గ్రామమునం దిచ్చటఁ జూచినను శ్రీరామునిచరిత్రసంబంధమైన వేఱువేఱు ప్రసంగములం జూపుమందిరములు పెక్కు గలవు ఇచ్చటిమందిరములలో రామ్‌కోట్ అనునది యొక్కప్రాముఖ్యముగ నెంచఁబడును అది రామునిజన్మస్థల మని చెప్పెదరు అదియుంగాక రాముఁ డిచ్చట పెద్దకోట కట్టించి దానికి ౨౦ బురుజు లేర్పఱిచి ఒకదానిమీఁదను హనుమంతుని, మఱియొకదానిమీఁదను సుగ్రీవుని, వేఱొకదానిమీఁద జాంబవంతుని ఇట్లు వేఱువేఱు సైన్యాధిపతులను వానిమీఁద నుంచెనఁట ఈమందిరమునకు దగ్గిర ఒకపెద్దమసీదు గలదు ఈయది క్రీ శ ౧౫౨౮ లో బాబరుచక్రవర్తిచే నప్పటి కక్కడ నున్నగుడి పడఁగొట్టించి కట్టింపఁబడెను అప్పటినుండియు నిందలి కొంతస్థలము తమదేవాలయస్థలమే యని హిందువులును, తమమసీదులోని స్థలమే యని మహమ్మదీయులును ఎడతెగక పోరాడుచుండిరి కాని కొంతకాలముక్రిందట ప్రభుత్వమువారు మసీదునకును, మందిరమునకును నడ్డుగోడ యేర్పఱిచి తగవును గంచి వేసిరి అప్పటిముఖ్యమందిరములలో స్వర్గద్వార మనునది యొకటి ఇచ్చటనుండి రాముఁడు స్వర్గమునకు వెళ్లెనఁట. దానియొద్దనే ఔరంగజేబుచేఁ గట్టింపఁబడి శిథిలమైన మసీదొకటి గలదు. ఇప్పు డిచ్చట కానవచ్చు దేవాలయములు అన్నియు ౧౮-వ శతాబ్దిలోను, ౧౯-వ శతాబ్దిలోను కట్టింపఁబడినవి.

1 V A Smith's Early History of India

జహాంగీరం అను పేరుగల గోరీ ఈపట్టణమునందలి చూడదగినస్థలములలో కెల్లను వారన్ హేస్టింగ్సువలన చెఱపెట్టఁబడి బాధపడినయా బేగమ్ యామె. ఈగోరీ కట్టుటకు నామె సొత్తులోనుండి మూఁడులక్షలరూపాయ లింగ్లీషు గవర్నమెంటువారి యధీనము చేయఁబడెను. ఆమె క్రీ. శ. ౧౮౧౬ లో మృతి నొందెను. అప్పటినుండియు గోరీ కట్టుట ప్రారంభింపఁబడి క్రీ. శ. ౧౮౨౮ లో పూర్తి చేయఁబడెను.

ఇచ్చట రామనవమికి గొప్పయుత్సవము జరుగును. అప్పుడు యాత్రికు లయిదులక్షలకుం బై నెక్కువ వచ్చెదరట.

**అయోధ్యాపురం** — గంజాంజిల్లా టెక్కలితాలూకాయందలి యొకగ్రామము. జనసంఖ్య ౨౪౦.

**అయోధ్యాప్రాంతము** — ఇప్పుడు దీనిని ఔధ్ లేక అవధ్ అనిరి. ఇది అయోధ్యాశబ్దభవము. అయోధ్యాప్రాంతమును గురించి 'ఔధ్' అనుశబ్దము చూడవలయును.

**అయోధ్యాసంస్థానము** — యునైటెడ్ ప్రావిన్సెస్ (ప్రయాగప్రాంతము)లోని యొకజమీందారీ. దీని విస్తీర్ణము ౨౬౩ చదరపు మైళ్లు. ఇది ఫైజాబాద్, గోండా, సుల్తానపూర్, బారాబంకి, లక్నో అను నయిదుజిల్లాలలో వ్యాపించియున్నది. ఇది తాలూకుదారీపద్ధతిమీఁద నమరచము చేయఁబడిన జమీందారీ. గవర్నమెంటువారికి చెల్లింపవలసిన పేష్కష్ రు ౨,౮౦,౦౦౦ లు, జమీందారునకు ఆదాయము రు ౧౧,౦౦,౦౦౦. వీరు బ్రాహ్మణులు. వీరి మూలపురుషుఁడు దర్శనసింగ్. ఇతఁడు ఔధ్ నవాబైన సాదత్ అలీఖాను (క్రీ. శ. ౧౭౯౮-౧౮౧౪) వద్ద సైన్యములో సుబ్బురాతుగా ప్రవేశించి ఈ జమీందారీని సంపాదించెను. క్రీ. శ. ౧౮౪౪ లో దర్శనసింగ్ చనిపోయినందున నతనితమ్ముని కుమారుఁడైన మానసింగ్ అతనిసొత్తునకు వారసుఁ డయ్యెను. కాని ఔధ్ ప్రాంత మింగ్లీషువారు స్వాధీనము చేసికొన్న తరువాత నీతనిజమీందారీ యంతయు వారు తీసికొనిరి. క్రీ. శ. ౧౮౫౭ లో సిపాయీల విప్లవము ప్రారంభ మైనప్పు డీతఁడు ఫైజాబాదులో ఖైదీగ నుండెను. కాని అతనిని విడుదలచేసి ఇంగ్లీషువారు తమభార్యాపుత్రాదులను రక్షింపవలసిన దని కోరినందున నీతఁడు యూరోపియన్ స్త్రీలను, బాలురను తనకోటలో నుంచుకొని రక్షించి సురక్షితముగ గోగ్రానది దాఁటించెను. తరువాత నతఁడు లక్నో పట్టణములో విప్లవకారులతోఁ జేరెను. కాని మరల నింగ్లీషువారికి సహాయుఁడై యసంఖ్యయూరోపియను స్త్రీపురుషుల ప్రాణములను రక్షించెను. ఆ ప్రాంతమునం దంతటను కల్లోలములు శమించి శాంతి నెలకొనుటకు మిగుల సాయము జేసెను. అందుచే నింగ్లీషువారు క్రీ. శ. ౧౮౫౮ లో ఈతనికి జమీందారీ నిచ్చివేయుటయేగాక విప్లవకారులలోఁ జేరిన తాలూకుదారులయొక్క సంస్థానములను గూడ నిచ్చివేసిరి. మహారాజా యన్న బిరుదము నొసంగిరి. తరువాత కె. సి. యస్. ఐ. అను బిరుదము నియ్యఁబడెను. క్రీ. శ. ౧౮౭౦ లో నీతఁడు కాంధర్తము కొంద మహారాజా సర్ ప్రతాపనారాయణసింగ్, కె. సి. ఐ. ఇ., జమీందారయ్యెను. ఆతఁడు క్రీ. శ. ౧౯౦౬ లో మృతుఁడయ్యెను.

**అయోనియా** — ఆసియామైనరు పశ్చిమతీరమునందు ఏజియన్ సముద్రము నంటియున్నట్టియు, తూర్పున లిడియా సరిహద్దుగాఁ గలిగినట్టియు భాగమునకుఁ బేరు. ఇది పర్వతమయమయిన దేశము. ఉత్తరమునుండి దక్షిణమునకు దీనిపొడుగు ౯౦ మైళ్లు; వెడల్పు ౨౦ నుండి ౩౦ మైళ్లవరకు భేదించుచుండును. ఇది అందమయి సారవంతమయిన ప్రాంతము. ప్రాచీనగాథల ననుసరించి చూచినచో క్రీస్తుపూర్వము పదునొకండవశతాబ్దిని 'అట్టికా' నుండి గ్రీకు లిచ్చటికి వలస వచ్చి రనియు, పండ్రెండు పట్టణములను గట్టి రనియు, వీనియన్నిటికిని సంబంధించిన కార్యములను ఈ పట్టణములవారు కలిసి చేయుచువచ్చినను ఏపట్టణమున కాపట్టణమే స్వతంత్రముగ నుండెడి దనియుఁ దెలియవచ్చుచున్నది. కత్తర వ్యాపారములవలనను, ఓడల నడుపుటవలనను, చేద్యములవలనను ఈ పట్టణములు ధనసమృద్ధము లయి వృద్ధిలోనికి వచ్చెను. కాని యీదేశము లిడియారాజయిన క్రోయిసస్ నకును, తరువాత పెర్షియారాజయిన సైరస్ నకును (క్రీ. పూ. ౫౪౬) సామంతరాజ్య మయినది. నడుమ నిది మరల కొంతకాలము స్వతంత్రముగ నుండినను, పెర్షియాసామ్రాజ్యమును అలెగ్జాండరు మాసిడోనియనుఁడు జయించినపుడు (క్రీ. పూ. ౩౩౪-౩౩౧) ఇది పెర్షియారాజ్యమునందే యుండెను. ఆటుపిదప నిది మాసిడోనియాసామ్రాజ్యమునం దంతర్భాగ మయినది. ఆటుతరువాతను గొంతకాలమునకు అయోనియా ఆసియాయందలి రోమనురాజ్యమునందుఁ జేరిపోయెను. ఆటుపిదప పారసీకులు దీనిని పూర్తిగ విధ్వంసము కావించిరి. ఈ కారణమున, మాత మన్నను ఈ ప్రాంతమందు ప్రాచీనసభ్యతాచిహ్నము లేవియుఁ గానరావు.

తత్త్వశాస్త్రమున అయోనియనుసంప్రదాయ మని పేరొందిన యొకవాదమున కిది మాతృభూమి. అయిదవశతాబ్దియందలి ఏథెన్సు యొక్క చక్కనికళలకు కావలసిన కిది మార్గము తీసినది. అయోనియాకళ ఎనిమిదవ, ఏడవ, ఆఱవశతాబ్దులందు వర్ధిల్లినది.

ప్రాచీనకాలమున హిందూదేశమునకు మొట్టమొదట పరిచయ మయిన గ్రీకులు అయోనియానివాసులు. ఈ కారణమునచే భారతీయ హిందువులు గ్రీకులను యవను లను పేర వ్యవహరించుచువచ్చిరి. యవనపదము అయోనియను శబ్దభవ మని కొందఱనెదరు.

**అయోనియాదీవులు** — గ్రీసుదేశమునకు పశ్చిమ, దక్షిణతీరముల పొడుగున వ్యాపించిన అయోనియనుసముద్రమునందలి సప్తగ్రీకుద్వీపము లీపేరఁ బరఁగుచున్నవి. వీనిలో కార్ఫూ, సెఫలోనియా, జాంటి, సెరిగో లు చాల పెద్దవి. ఈ దీవులయొక్క మొత్తము వైశాల్యము ౧,౧౦౦ ల చ. మైళ్లు. ఈదీవు లన్నియు కొండమయము

మునకు ప్రవృత్తిమార్గమునఁ బరమేశ్వరుని శరణువొచ్చి త్రికరణశుద్ధితో సంపూర్ణాభీప్సతో యోగసాధన మొనర్చుటవలన పరమేశ్వరానుగ్రహప్రాప్తియు, తుదకు సాధన సాధ్యము సాధకుఁడు సర్వము పరమేశ్వరుఁడుగా పరివర్తనమగుచుంది. సచ్చిదానంద త్రికమున కత్యంత సామీప్య సంబంధముగల యీపరమవిజ్ఞానసిద్ధియేఁ గలుగు ననియు, ఈ యభీప్సానుగ్రహములవలనే అవిజ్ఞానము భౌతికలోకమున కవతీర్ణమై తన్మూలమునసే ప్రపంచమున దివ్యజీవనము సాధ్యమై సత్యలోక మేర్పడు ననియు శ్రీ అరవిందు లభయపూర్వకముగా విల్లడించుచున్నారు. వేదముల పూర్వము భగీరథుఁడు మహాతప మొనరించి గంగావతరణమును సాధించి పితృదేవతలను పునీతులనొనర్చి భరత భూతలము కామధేనువుగాఁ జేసినట్లు నేఁడు శ్రీ అరవిందులు భూలోకమును మానవకోటిని భాగవతమయముగా దేవమయముగా నొనర్ప సంకల్పించియున్నారు.

## శ్రీ అరవిందుల యుపదేశము — కంటికగ

పడు జడద్రూపముల కావల శాశ్వతచైతన్యముల సత్యము ఏకము నిత్యమునగు సర్వభూతాత్మ కలదను ఆర్యఋషుల పూర్వఋషుల సిద్ధాంతమునను సరించియే శ్రీ అరవిందుల యుపదేశము ప్రారంభ మగుచున్నది. ఆ యద్వితీయ బ్రహ్మమునందు, ఆదిత్యరూపమునందు సర్వభూతములును కూడియున్నవి. కాని చైతన్యముయొక్క యొకానొక పృథక్తత్త్వమువలన, మనఃప్రాణశరీరములందున్న తమ నిజాత్మ నిజతత్త్వముల గుఱించిన యజ్ఞానమువలన నవి విభజింపఁబడి యున్నవి. ఈ పృథగ్భావకల్పితమగు నాచ్ఛాదనమును తొలఁగించుటకు, తనయందు నిఖిలభూతములయందును గల దైవమును - తన నిజాత్మను - సాక్షాత్కరింపఁ జేసికొనుటకును ఒకానొక యాంతఃకరణిక శిక్షణము వలన సాధ్యమగుచున్నది.

ఈ యద్వితీయాత్మయే ఈచైతన్యమే జడమగు భౌతికపదార్థములందు నిక్షిప్తమైయున్నదని శ్రీఅరవిందులబోధ వచించుచున్నది. అది తనయంతటఁ దాను విముక్తి నొందువట్టివిధానమే పరిణామము. ఏది జడముగా నున్నట్లు గాన్పించునో దానియందు చైతన్యము సాదమాత్రమున్నది. ఒకపరి గోచరమైన ఈచైతన్య బింకము ఉన్నతతర మగునట్టును, తక్కాలమందే యంతకంతకు మహత్తర మగు పరిపూర్ణత్వము పరిణామము నందునట్లును, అది స్వతఃప్రేరిత మగును. ఈచైతన్యవిముక్తియొక్క ప్రథమసోపానమే ప్రాణము, మనస్సు రెండవదిక కాని పరిణామము మనస్సుతోడనే సంపూర్తి కాజాలదు. అది యొకానొక మహోత్తరస్థితిగా, ఆధ్యాత్మికము విజ్ఞానమయము నగు నొక చైతన్యముగా బహిర్గత మగుటకు నిరీక్షించుచున్నది. చైతన్యపురుషుని యొక్క ప్రబలశక్తిగా, విజ్ఞానాత్మల వికసనము పరిణామమందలి తదనంతరసోపాన మై యుండవలెను. అప్పుడే యీ దివ్యపదార్థములందు నిక్షిప్తమైయుండు ఈశ్వరతత్త్వము సంపూర్ణముగా వ్యక్తమొనర దగును. అప్పుడే ప్రాణశక్తి తన పూర్ణత్వమును ప్రదర్శింప సాధ్య మగుచున్నది.

వృక్ష జంతు జన్మములయందు స్మృతిసహితేచ్ఛ లేకుండగనే ప్రకృతి తనపరిణామసోపానముల నధిరోహించుచున్నది. మానవుని విషయములో మహాదియందలి స్మృతిసహిత సంకల్పమూలముననే ప్రకృతి పరిణామమవ్యక్త మగుచున్నది. అయినను మానవుని మానసిక సంకల్పశక్తిమాత్రమునచే యిది పూర్తి కాజాలదు. ఏలయన, మనస్సొకానొక స్థితికే పోఁగలదు, తదనంతరము ముందునకుఁ బోఁజాలక యుండే చక్రాకారముగామాత్రమే పరిభ్రమించుచుండును. దేనివలన నున్నతతరతత్త్వముగా మనస్సు మారవలసియున్నదో యట్టి మార్పును చైతన్యపు పరివర్తనము గావింపవలసి యున్నది. ఈ విధానమును బట్టియే, అంతఃకరణిక శిక్షణ యోగసాధనమూలమునఁ గఱఁగొనవలసి యున్నది. పూర్వకాలమున నధ్యాది వెలిగా ప్రపంచమునుండి సంకోచించుకొనుటవలనను అత్మ లేక పరతత్త్వముయొక్క సముచ్చస్థితిలో సంతర్ధాన మగుటవలనను ప్రయత్నింపఁబడినది. ఏవిజ్ఞాన శక్తి చైతన్య మంతఃస్థితాత్మకుఁ దగిన యుపకరణమై మానవుని యంతర్ముఖమునకే కాక సర్వప్రవృత్తులయందును దన్నుఁ దా తెలుపుకొనునట్లు చేసి యింకను మృగప్రాయముగా నున్న మానవత్వమునుండి దివ్యజాతిగా నభివృద్ధి నందింపఁగలదో యట్టి విజ్ఞానమయ సత్య చైతన్యమును మనస్సుయొక్క యజ్ఞానమునకు మిక్కిలి పరిమితజ్ఞానమునకుఁ బ్రత్యామ్నాయముగా స్థాపించి, పరమాత్మను ప్రపంచమునకు పరముగాఁ గేవలము ముక్తునిగాఁ జేయుటయే కాక ప్రపంచస్థితిలోనే విముక్తిని బొందించుట యున్నతతర తత్త్వావతరణము సాధ్యమని శ్రీఅరవిందులు బోధించుచున్నారు. అత్యున్నతమై, ఇంకను నిగూఢమై యున్న విజ్ఞాన తత్త్వావతరణవ్యాపారములమూలమున పురుషుని సకలకోశములను మార్పు లేక పరిణామము గావించుటవలన తద్దివ్యత్వసిద్ధికై యోగముయొక్క యాంతఃకరణిక శిక్షణము నుపయోగింప వచ్చును.

అయిన నిది తత్క్షణమే కాని, స్వల్పకాలములోఁ గాని, లేక యేత్వరితమైన లేక అద్భుతమైన పరివర్తనమువలనఁ గాని చేయు వీలు లేదు. విజ్ఞానతత్త్వావతరణము సాధ్యమగుటకు పూర్వము తదపేక్షితముఁ దెక్కి సోపానములఁ గడచిపోవలసియున్నది. మానవుడు ముఖ్యముగా మనఃప్రాణశరీరముల యుపరితలమునందే నివసించుచుండును కాని మహాత్తరావకాశసహితమగు నంతఃస్థితాత్మ అతనిలో నున్నది. తదుపలబ్ధికై అతఁడు ప్రబుద్ధుఁడు కావలెను. ఏలయనఁగా, నా యంతఃస్థితాత్మనుండి ప్రస్తుత మాతఁడు పొందుచున్నది యత్యంతనిరోధితప్రభావమునుమాత్రమే. అదియును కేవ సౌందర్యమునకు సామరస్యమునకు శక్తిజ్ఞానములకు నిరంతరప్రయత్న మొనర్చునట్లతనిని ముందునకుఁ ద్రోయుచున్నది కాఁబట్టి యీయంతరాత్మయందలి విస్తృతుల కావాట మొనర్చుటయు నంతఃస్థితశక్తులవలన తన బాహ్యజీవితమును నిర్వహించుటయు నచ్చుటనుండియే బాహ్యజీవితమును గడపుటయు యోగముయొక్క ప్రథమవిధానము. ఇట్లు చేయుటలో మనోమయ ప్రాణమయ అన్నమయ భూతముల బాహ్యవిక్రమముగాక విలక్షణముగా వీనికి పరోక్షమున సత్యసంబంధమైన ఒకానొకదానిని, అద్వితీయ దివ్యపరంజ్యోతి

మయినకూడ నిట్టివి లేనివారిని దరిద్రు లనియు, అవసరమునకు మించి ఇట్టివి గలవారిని ధనికు లనియు మనము చెప్పుచుందుము. దారిద్ర్య బాధ నొందువారలకు స్వేచ్ఛతోకూడిన జీవన మసాధ్యము. వారి కాల మంతయు ఆహారాదుల సంపాదనమునకుమాత్రమే వినియోగ మగుచుండుటచేత ఉత్కృష్టమగు మానవజీవితమునకు పరమావధి యగు శాస్త్రవిజ్ఞానమున కెట్టియవకాశమును లేకున్నది.

దరిద్రులదారిద్ర్యమునకు వారు కష్టపడి పనిచేయకుండుట కారణము కాదు. ధనికుల ఐశ్వర్యమునకు వారు కష్టపడి పని చేయుట కారణము కాదు. ప్రతిదేశమందును ధనికులకంటె దరిద్రులే ఎక్కువగ పనిచేయుచుందురు. ఆహారాదిపదార్థముల నుత్పత్తి చేయుటకు మనుష్యునిపరిశ్రమమాత్రము చాలదు. పరిశ్రమముతోపాటు భూమియు, మూలధనమును (Capital) ఆవశ్యకము. కాని, ఈరెండుసాధనములును కష్టపడి పనిచేయఁజాలు ప్రతిమనుష్యునికిని లభించుటలేదు. ఇవి యొకరో కొందఱో భూస్వాముల యొక్కయు, సాహుకార్లయొక్కయు నధీనమం దున్నవి. వీరియనుమతి లేక పని చేయువాండ్రు వీని నుపయోగించుట దుస్సాధము. భూస్వాములకు అత్యధికములగు సిస్తులను, సాహుకార్లకు అపరిమితములగు వడ్డీలు నిచ్చిననే గాని ఇట్టియనుమతి పనివాండ్రకు లభింపదు. కష్టపడి పనిచేసి, అధికముగ అర్థమును వా రుత్పత్తిచేయుచున్నను అందులో చాలభాగము సిస్తులక్రిందను, వడ్డీలక్రిందను ఖర్చగుచుండుటవలన పనిచేయువాండ్రభాగమునకు మిగులునది చాల స్వల్పముగ నున్నది. కర్షకులును, కర్మకరులును ఉత్పత్తిచేయు అర్థ మల్పమగుట యట్టి కాక, ఆయర్థవిభాగమందు అధికభాగము భూస్వాములకును, సాహుకార్లకును చెందుట ఇట్టిదే. దరిద్రులు దారిద్ర్యబాధ ననుభవింపవలసి యున్నారు. భూమియు, మూలధనమును కొందఱి యధీనమం దుండక పనిచేయ నిష్టపడువా రందఱకును లభ్యమగుచుండు నెడల ఉత్పత్తియగు ధన మంతయు పనిచేయువారికే చెందుచుండును. పని చేయక, ఆస్తిమూలముననే సుఖముగ జీవించు భూస్వాములును, సాహుకార్లును కొంద ఱుండుటంబట్టి 'ధనికులు', 'దరిద్రులు' అను భేదము కలుగుచున్నది. ఇట్టిభేదము లదృశ్యములగుటకు భూమిమీఁదను, మూలధనముమీఁదను వ్యక్తు లెవ్వరికిఁగాని ఆస్తి (Property) హక్కు లేకుండుటయే తగినమార్గము.

అరాజకవాదులు పైవిధముగ వాదించుటకు పాశ్చాత్యదేశములలో కొన్నిటియం దున్న విపరీతపరిస్థితులు కారణము. రష్యా, జర్మనీ, ఇంగ్లండు మొదలగు దేశములందు విశేషలిహితులును, ఫ్రాన్సు దేశమున పందొమ్మిదవశతాబ్ది యారంభమువఱకును 'భూమి' అంతయు ఎకరో కొందఱు జమీందారుల యధీనమం దుండెను. ఒక్కొక భూస్వామియు వేలకొలఁదియెకరములభూమికిని, అనేక గ్రామములకును యజమానిగ నుండెను. ఆభూములను దున్నురైతు లతనియాజ్ఞకు బద్ధులై, అతఁడు పెట్టుకష్టము లన్నిటి ననుభవించుచు, పండినపంటలో నధిక భాగము నతని కిచ్చుచుండిరి. అట్టిజమీందారులు కష్టమన నెఱుఁగక, విస్తృతభవనములందు పరిచారకులమధ్యను నివసించుచు, కాల మంతయు వేట, గుఱ్ఱపుస్వారి, ఆటలు మొదలగువానియందుఁ గడపుచుండుట మామూలు. రాత్రి పగ లనక, ఎండ గాలి వర్షము లనక, కష్టపడి పని చేయురైతులకు కడుపునిండ అన్నముకూడ లభించుట యసాధ్యముగ నుండెను. జమీందారులను ధిక్కరించిన యెడల భూమినుంచి వెడలఁగొట్టబడుట తప్ప మఱియొకమార్గము వారికి లేకుండెను. భూమి తమది కాకపోవుటచేతను, జమీందారులది యగుటచేతను తా మిట్టిస్థితియం దుండవలసివచ్చె నని కర్షకులలో కొందఱు గ్రహించిరి. ఇట్టిపరిస్థితుల నాధారము చేసికొనియే అరాజకతావేత్తలు తమసిద్ధాంతములను బలపఱుచుకొనిరి.

భూస్వాములు 'భూమి తమది' అని చెప్పుటలో న్యాయ మున్నదా? ఏవస్తువునైనను యెవఁడు 'తనది' అని చెప్పుటకు ముఖ్యములగు కారణము లేవి యుండవలెను? అతని ప్రాణధారణమునకును, ఆరోగ్యమునకును, నిజమైన సౌఖ్యమునకును ఆవస్తువు ఆవశ్యకమై యుండవలెను. అట్లు కానిచోఁ 'అది' 'తనది' ఎట్లగుచున్నది? ధనికులకైనను దరిద్రులకైనను ఆవశ్యకముగ కావలసిన ఆహారాదులు సమముగ నుండును. ధనికుఁ డనువాని యాఁకలి ఎక్కువ కాదు. అతనికి ఎక్కువ ఆహారము కావలసినది లేదు. మానము కాపాడుటకు వస్త్రము లధికముగ కావలసియుండవు. ఇట్టిసందర్భములో వేలకొలఁది యెకరములభూమి తనది యని చెప్పుకొనుటలో అర్థముగాని, ధర్మముగాని కనిపించదు. అందులో పండుపంట అతని సౌఖ్యమున కెంతవఱకు ఆవశ్యకమో అంతవఱకే అతనిది, ఎక్కువదంతయు ఆఁకలి గొన్నవారిదే. తా ననుభవింపలేనట్టిదియు, ఇతరుల యనుభవమున కత్యంతావశ్యకమైనట్టిదియు నగు వస్తువుపైని ఒకనికి 'స్వామ్యము' (Ownership, Proprietorship) ఉండుటకంటె ధర్మవిరుద్ధమగు పద్ధతి మఱియొకటి లేదు. ఇట్టి స్వామ్యము భూస్వాముల కుండుటవలననే రైతులు కష్టపడినను కడుపునిండ వారి కన్నము దొరకకున్నది.

స్వయంకృషిచేత తాను సంపాదించిన వస్తువును గుఱించి 'తనది' యని యెవఁడు చెప్పినను చెప్పుకొనవచ్చును. కాని పాశ్చాత్యదేశమందలి జమీందారు లీభూములను గుఱించి తమవనిగ చెప్పుటకు వీలు లేకుండెను. సాధారణముగ 'భూమి' విషయమున నీయర్థము ప్రపంచమం దంతట వర్తించుచున్నది. సౌగంధికాపహరణమున చెప్పిన భీమసేనునివాక్యము లీసందర్భమున నెంత యుక్తియుక్తములుగ నున్నవి!

క. ఓరి నిర్ఝరములఁ బుట్టిన,
సరోవరం బిదియు సర్వసామాన్యము గా
గరువముగ గ్రొక్కనియేలా,
[illegible]

భూమిని సృష్టించినవారు జమీందారులు కారు; [illegible]

లన్నియు ధనము యొక్కనమాత్రమే సంభవించునని కాదు. ధనికులు దరిద్రులు అను భేద మంతరించినప్పటికిని గూడ సహజములగు మతభేదము లెల్లప్పుడు నుండఁగలవు. అట్టి సందర్భమున పరులను హింసించుటయు, కలహించుకొనుటయు నుద్యుక్తు లగువారిని నిర్బంధించుట ఆవశ్యకము. అట్టివారిని నిర్బంధించినయెడల 'స్వేచ్ఛ' యనునది వారికిమాత్రమే యుండునుగాక కడకువారు గారికి దాసులు కావలసి యుండురు. అందఱును స్వేచ్ఛ యుండవలయుననిన అందఱును కొన్ని నిర్బంధముల నంగీకరింపవలెను. అట్టి నిర్బంధములను విధించునధికారమునకే ప్రభుత్వాధికారమని పేరు. ఈ యధికారము లేనియెడల సాంఘిక జీవనము దుస్సాధమగును. కావున అరాజకతయనునది కోరఁదగినది కాదు.

అధికారమందుండువారు ఎంతటి వేదాంతజ్ఞానము కలవారైనను తమయధికారమును స్వలాభముకొఱకై దుర్వినియోగము చేయుచు ప్రజలను అధికారమందిట్టిలోప ముండుటచేతనే అరాజకతావాదులు దాని నడుగంట నాశము చేయ ప్రయత్నించుచున్నారు. కాని ఇది సరియగుమార్గము కాదు. ఎందుచేత నిండకుండ నుండుటకు ప్రభుత్వ మావశ్యకము. అట్టియధికారము దుర్వినియోగము కాకుండు నట్లుపాయములను కనుఁగొని, ఆయుపాయము నాచరణయందుఁ బెట్టుటకు మనుష్యుఁడు ప్రయత్నము చేయవలెను. మనుష్యుని ప్రజ్ఞయంతయు నీప్రయత్నమందే యున్నది. రాజకీయాభివృద్ధి యనిన నిదియే. రాజ్యాంగశాస్త్రపరిశోధన చేయువారట్టి యుపాయములను కనుఁగొనుటయందే తమబుద్ధిబలము నుపయోగించుచున్నారు. రాజ్యాంగ సంస్కర్తలీమార్గమునే నడచుచుందురు. దీనినిబట్టి అరాజకతావాదుల సిద్ధాంతము లన్నియు నిష్ఫలము లని మన మనుకొనఁగూడదు. నాడీ పరీక్ష చేసి రోగముయొక్క స్వరూపమును కనుఁగొను వైద్యునివంటి వారు అరాజకతావాదులు. రోగము కుదురుటకు కావలసిన ఔషధమును నిర్ణయించుటకు పూర్వము దానిస్వరూప మెట్టిదో తెలిసికొనుట యావశ్యకము. అట్లే ప్రభుత్వాధికారమును సంస్కరించుటకు పూర్వము ఆయధికారముయొక్క స్వరూపమును, దానిలక్షణములను తెలిసికొనుట ఆవశ్యకము. ఈ లక్షణనిర్ణయమందు వారత్యధికముగ తెలివితేటల చూపిరి. కాని లోపములను పోఁగొట్టుటకు వారు సూచించినమార్గము తగినమార్గము కాదు. రోగము కుదుర్చుటకు రోగిని చంపుటయే మార్గమని తలంచు వైద్యునివలె వారు ప్రవర్తించుచున్నారు. ఇదియే అరాజకతావాదమందలి లోపము.

ప్రభుత్వలక్షణనిర్ణయమందు వారు చెప్పినమాటలు సత్యము లని గ్రహించినవారు ప్రభుత్వాధికారము నిరంకుశము గాకయు, దుర్వినియోగము కాకయు నుండుట కుపాయము లెన్నిటినో సూచించి యున్నారు. వీని కన్నిటికిని ప్రధానసూత్ర మొక్కటి కలదు. అధికార మెన్నఁడును ఒక్కసంస్థయందు కేంద్రీకరింపఁగూడదు. సర్వాధికారము లొక్కసంస్థయందే సంక్రమించియున్నయెడల దుర్వినియోగమునకెక్కువయవకాశము కలుగును. కావున సాధ్యమైనంతవఱకు ప్రభుత్వాధికారము భిన్నభిన్నములగు సంస్థలకు చెందియుండవలెను. ఫెడరల్ విధానములోని ముఖ్య మిదియే. స్థానికస్వపరిపాలనోద్దేశ మిట్టిదే. ప్రజాప్రభుత్వముకూడ నిట్టిలాభముకే నమునార్చుచున్నది. ధూమిద్రవాలకసనము పొందలుకు అర్థోత్పత్తిసాధనములపైని ప్రభుత్వము వారికే స్వామ్య ముండవలయు ననుపద్ధతిమార్గము గూడ ప్రస్తుతకాల ప్రరాజ్యాంగవిధానమందలి లోపములు కొన్ని అంతరింపఁగలవు. కావున అరాజకతావాదమును విడనాడి, ప్రభుత్వాధికారము దుర్వినియోగమగుటకు కావలసినసాధనములను కనుఁగొనుటయే శ్రేయోదాయకము.

(మా. వేం. ౪౦)

**అరాపట్టణము** — బంగాళదేశమున షహాబాద్ జిల్లా యొక్క ముఖ్యపట్టణము. ఇది కలకత్తాకు ౩౬౫ మైళ్లమీఁద నుండును. జనసంఖ్య ౪౬,౧౬౦. ౧౮౫౭ లోని సిపాయీల తిరుగుబాటుకాలమున కుమర్ సింగ్ అనువాఁడు ౩,౦౦౦ల మంది సిపాయీలతోను, ౭,౦౦౦ల మంది ఇతరజనులతోను ఈ గ్రామమునకు ౧౪-౫ తేది జూలయిరోజున వచ్చి చెఱసాలలోని ఖైదీలను విడుదలచేసి ఖజానా కొల్లగొట్టెను. ఈ గ్రామము ౧౮౬౫ లో మ్యునిసిపాలిటీగ మార్పఁబడెను.

**అరాఫత్** — అరేబియాదేశములో మక్కానగరమునకు ౧౨ మైళ్లదూరమందున్న యొకపర్వతము. 'గుర్తించుకొన్నకొండ' యని యీశబ్దార్థము. ఆదిమదంపతు లగు ఆదాము, హవ్వయను వారు భగవంతునిచే నిషేధింపఁబడిన జ్ఞానఫలమును సైతాను ప్రోత్సాహమువలనఁ దినుటచేతఁ బరిశ్రమతోపాటు స్వర్గమును గూడ గోల్పోయి భూమిమీఁదను బడిరి. ఈ దంపతులదుర్గతికిఁ గారణభూతులైన సర్ప, మయూర, సైతానులు క్రమముగ ఇస్పహాను, కాబూల్, బిల్ చేసు అను ప్రదేశములందును, హవ్వ అరాఫత్ మీఁదను, ఆదాము లంకలోని సెరాండిబుపర్వతముమీఁదను గూలిరి. స్త్రీయగుటచే నున్న స్థలమును కాయకనుండి యక్కడనుండియే హవ్వ తనమగనిని పేరుపెట్టి పిలువసాగెను. ఆదాము భార్యను వెదకు నిమిత్తము బయలుదేఱి యనేక సంవత్సరములపర్యంతముఁ బర్యటన మొనరించుచుఁ దుద కరాఫత్ పర్వతమును జేరి నిరంతరముగఁ దన నామముం గొని పిలుచుచున్న హవ్వను జూచి యామెనవ్వలుకఁ జేసి నిరువురును బరస్పరము గుర్తించుకొనిరి. ఇందుచేతనే యీకొండ కరాఫత్ అని పేరు వచ్చినది. దీనిని 'అరాఫాహా' యనియుఁ బిలుచుచుందురు.

**అరారత్** — ఆర్మీనియాదేశములోని ఒక అగ్నిపర్వతము. దీనికి రెండు శిఖరము లున్నవి. మొదటిదానిని పెద్ద అరారత్ అనియు, రెండవదానిని చిన్న అరారత్ అనియు పిలుతురు. మొదటిదానియెత్తు ౧౬,౯౧౬ అడుగులు. రెండవదానియెత్తు ౧౨,౮౪౦ అడుగులు.

**అరారియా** (సబ్ డివిజను) — బీహార్ ప్రాంతమందలి పూర్ణియాజిల్లాలోని యొకసబ్ డివిజను. ఇది నేపాళ్ సరిహద్దు

ముల కొంతవరకుఁ గలిగియుండవచ్చునని యూహింపఁబడినది. పదులకొలఁది మైళ్ళ విస్తీర్ణముగల ఇసుకమైదానములు, చాలదూరము వఱకును ప్రసరించియుండు రాతికొండలు, పెద్దపెద్దబండలు, బావులు, చిన్నతోటలు గల తరుస్థానములు, కాని వంటికొని యుండు తాటితోఁపులు, పాసుబడి లేనిభూములు మొదలగునవి నానారాహదారియం దిట్లో యుటచే ఈదేశమందున గలవు. అరేబియాపెట్రియా, అరేబియాడెజర్టా, అరేబియాఫెలిక్సు అని ప్రాచీన గ్రీకులు మూఁడుభాగములు గావించియుండిరి. పెట్రియానగరమునకుఁ జుట్టుప్రక్కల నుండు ఇలాకా అరేబియాపెట్రియా. ప్రస్తుత మీ ప్రాంత మరేబియానుండి విడిపడియున్నది. ఎడారులుగలదేశ మరేబియాడెజర్టా. అరేబియాఫెలిక్సు అనఁగా భాగ్యదాయకమగు ప్రదేశమని యర్థము. ఇది ముఖ్యముగ నైరృతకోణమం దున్న యమను ప్రాంతమున కొసఁగఁబడిన పేరు

కాని ప్రస్తుతదేశవిభజనము రాజకీయమునూల్యముల ననుసరించి కాని ధాతికలక్షణములనుబట్టి కాదు. కొలసముద్రపు తూర్పుతీరమున నిన యుద్ధీపకల్పమునకు పశ్చిమముగ హెజాజ్ ప్రాంతమును, దానికి దక్షిణమున అసీర్ యమను భాగములును, దక్షిణమున పడమటనుండి తూర్పుకోణమువఱకును వ్యాపించి హద్రామాట్ ఇలాకాయును, ఆగ్నేయభాగమున ఉమ్మాన్ ప్రాంతమును, పర్షియా సింధుశాఖమీఁద అల్ హాసా, కువైట్ ఇలాకాలును, మధ్యభాగమున అల్ నెజ్డ్ పీఠభూమియును, ఉత్తరమున జబల్ షమ్మార్, నఫూద్ దేశములును ఇప్పటివిభాగములు. ఇవిగాక, అల్ నెజ్డ్ కు దక్షిణముగను, హద్రామాట్ కు ఉత్తరముగను దహానా లేక రబ్ అల్ ఖలీ యను అనన్వేష్టమగు ప్రదేశము గలదు. ఇవంతయు బట్టి రమారమి ౧౯౦౬ మొదలుకొని ౧౯౧౪ వఱకుగల కాలమున బ్రిటిష్ తురుష్క అధీనరుల సమ్మేళనములు కొన్ని జరిగియుండెను. వానియందు అరేబియాలోని స్వతంత్రరాజ్యములకును, తురుష్క, బ్రిటిష్ రాజ్యములకును పరిహద్దులవిషయమున కొన్ని పరిష్కారములు జరగియుండెను. కాని జర్మనీయుద్ధముకారణముగ నానమయము లన్నియుఁ దాఱుమాఱైపోయినవి

కొలసముద్రతీరమందలి ప్రాంతములలో విలయున మైనుండి గ్రిందివఱకును పర్వతమాలికలు వ్యాపించియున్నవి. వీని మొదట్ల మిసిరియాదేశమునఁ గలవు. జబల్ దూర్ కామక అన్నిపర్వతముల దక్షిణభాగము లనఁదగిన హద్రాత్ అచేరిష్, హద్రామౌబియు లనుకొండలు ఈ శ్రేణికి దూర్పుగ నుండును. మిదియాయం దారంభమైన ఈ పర్వతమాలికలు దక్షిణాభిముఖములై క్రమముగ మన్నత మగుచు మెకాఫ్ పట్టణముదగ్గఱగ అసీరునందలి పీఠభూములలో చేరబడి యమనునందలి కొండలలోఁ గలయును. హద్రామౌనమందలి జబల్ ఫూకా కామక శిఖరమునొక్కటియె యెత్తు ౮,౦౦౦ల అడుగులు. యమనులోని పర్వతములలో ౧౦,౦౦౦ల యడుగుల యెత్తుగల అగ్రము

లను గలవు. హెజాజ్ దక్షిణమున దీర్ఘశ్రేణి సారవంతమై సస్యసంపర్ణ మైయున్నది. మదీనా, యంబో, అల్ నఖల్ కామకతరుస్థానములును, మక్కా కామకపట్టణమును ఈ శ్రేణియందే గలవు. అసీరు యమనునందలి పర్వతములు మిక్కిలి ఫలవంతమైనవి. ఇచట కాఫీ మిగుల తయారగుచుండును. హద్రామాట్ నందలి లోయ లన్నియుఁ దాటితోఁపులతో నిండియున్నవి. పొగాకును ఇచట విస్తారముగ పైరగుచుండును. మిసిరియాయందలి పర్వతములలో పూర్వము బంగారము దొరకుచుండెను. అసీరునందు కిరసనాయిల్ బావులు గలవు. పెక్కుచోట్ల రాతియుప్పు దొరకును. ఇటులే తూర్పునందలి ఉమ్మాన్ ప్రాంతమును మిక్కిలి సస్యవంతమైనది. ఇచట జబల్ అఖదర్ కామక శిఖరము గలదు. అల్ హాసాలోని సమ్మాన్ దిదీకా లనుచోట్ల మున్న ఫ్రరాతిగనులు గలవు. మఱియు నీప్రాంతము శీతోష్ణ జలకుండములకును, పంటకాల్వలకును, చెట్లుచేమలకును ప్రసిద్ధికెక్కినది. ప్రపంచ మంతటిలో మేలైన ఖర్జూరము లిచట దొరకును. హమోఫూఫ్, ముబారిక్ లనునవి ఇందలి ముఖ్యపట్టణములు. ఇవిగాక కటిఫ్, ఉకేర్, కువైట్, కటర్, బహ్రైన్ కామక నగరములును గలవు

సిరియా ఎడారి లేక హమ్మాద్ (రాతియెడారి) అను ప్రదేశ మరేబియా ఉత్తరభాగమున వ్యాపించియున్నది. ప్రకృతిసిద్ధముగ నిది అరేబియాకుఁ జెందినప్పటికిని రాజకీయముగ నిందలిచాలభాగము ఇరాక్, పాలెస్టయిన్, సిరియాలయందు కలుపఁబడినది. ఈ ప్రదేశమునకు పడమరగ ఫ్లింటురాలతో నిండిన నల్లనిలయెడారి గలదు. ఈ యెడారినుండి ఈశాన్యమువఱకును భూమి యేటవాలుగ నుండును. ఇందు వాడీ హౌరాన్ అను నది గలదు. ఇది జబల్ డ్రూజ్ ప్రాంతమున అజ్రాక్ దగ్గరి జలస్రోతములందుఁ బుట్టి దక్షిణపూర్వాభిముఖమై కాఫ్, ఇత్రి లను ఉప్పుపందు నగరములమీదుగా కౌఫ్, సాకల్లన్ అను తరుస్థానములవర్యంతమును బోవును. కాఫ్, ఇత్రిలయొద్ద కాటితోఁపు లనేకములు గలవు. ఇచటఁ దయారగు ఉప్పు సిరియాదేశమునకుఁ బోవుచుండును

అరెబియా ఈశాన్యమునందు నఫూద్ పీఠభూమి వ్యాపించియున్నది. ఇది తూర్పునుండి పడమటికి ౪౦౦ల మైళ్లు ఉత్తరమున నుండి దక్షిణముగ ౨౦౦ల మైళ్లుండును. సముద్రతటమునుండి దీని యెత్తు 3,000ల యడుగులు. ఇచట నీటికి కఱవు. కాని చలికాలమున వర్షము కురియుటచే దేశమం దంతటను పసరులు మేయుట కనుకూలమగు పచ్చిగడ్డి మొలచును. దేశమందలి జనులు పశువుల మందలతో గుడారములతో వచ్చి యచ్చట మేపుకొనుచుందురు. మఱియు నీదేశమునందు ప్రచండవాయువులు వీచుచుండును. వీని వలన పెద్దపెద్ద యిసుకదిబ్బ లేర్పడుచుండును. ఒక్కొక్కదిబ్బ పొడుగు మయిళ్ళ కొలఁదివఱకు నడువఁగలిగినంతదూర ముండును. ఈ దిబ్బలమధ్య యేర్పడు లోయవంటిభాగములు దాఁటుటకు మూఁడు నాలుగుగంటలకాలము పట్టును. మఱికొన్నిచోట్ల నూతనసంప్రాకృతి యేర్పడుతిప్పలును గలవు.

కాలమానము, శీతోష్ణస్థితి — అరేబియా దేశమునందలి యుష్ణ మహాధిక్యము. ఎడారులందు శీతలప్రదేశము లఁబడఁగువానియందును ఉష్ణము రాత్రికాలములందు ౧౦౦° కాని లేక అంత కెక్కువ కాని యుండును. పగటిపూట ప్రాతఃకాలమున ౧౦౪ అంశములతో నారంభమై క్రమముగ ౧౧౦° ను మించిపోవును. అల్ హెజ్ నందలి సముద్రమాశోష్ణము ౧౧౩ అంశములను సాధారణముగ మించదు. ఉత్తరప్రాంతమున మంచువానలు కురియుట కలదు. అందుచే నచటి యుష్ణము ఒక్కొక్కసమయమున ౧౯° ల వఱకును దిగును. పశ్చిమ అరేబియా పీఠభూములందును, పర్వతములమీఁదను, ఉమ్మాన్ ఇలాకా యందును కాల మతిమనోహరముగను, సౌఖ్యదాయకముగను ఉండును. కోనసముద్రతీరప్రదేశము మిడియా దేశమునఁ జలికాలమునఁ జలి యపరిమితముగ నుండును. యమన్, ఉమ్మాన్ ప్రాంతములందుఁ దక్క తక్కిన చోట్ల వానలు సరిగ కురియవు. ఒకవేళ కురిసినప్పటికిని పైరులు మున్నగువానికి సరిపోవు. కాని వసంతమాసమునందు తరుస్థానములను మాత్రము వికసింపఁజేయఁ జాలువర్షము కురియుచునే యుండును. హెజాజ్ పర్వతములందు వర్షము మిక్కుటము. అరేబియా యుత్తర ప్రాంతమున తూర్పునుండియు, పడమటనుండియు వాయువులు వీచుచుండును. ఇందు పశ్చిమవాయువులు మధ్యధరాసముద్రమునుండి పాలస్తీనముమీఁదుగ వచ్చు వర్షమును సూచించును. తక్కినదేశమంతట వీచు ఉత్తర, దక్షిణవాయువులలో దక్షిణపుగాలి శీతకాలము నందైనచో వర్షమును, అన్యకాలములందు వేడిమిని సూచించును.

ఇదికాక సైమూన్ లేక సామియేల్ అనఁబడు విషవాయువు ఉత్తరప్రాంతములం దప్పుడప్పుడు వీచుచుండును. ఈ వాయువేగము వలన నెడారులందలి యిసుక పైకిలేచి మేఘములవలె క్రమ్ముకొని పోవును. ఆసమయమున ప్రయాణము సలుపుచుండు ప్రాణులకు శ్వాసములు నిలుచుట దుష్కరము. దీని దుష్పరిణామములనుండి తప్పించుకొనుటకు బాటసారులు గాలి యారంభమైన వెంటనే నేలమీఁదను బోరగిలఁబడుండెదరు. పశువులు ముఖముల నిసుకలోఁ బెట్టుకొని గాలి యాడలేనంతవఱకు నటులే పడియుండును. వాయువు నిలిచిన పిదప పెల్లగ లేచి ప్రయాణముల సాగించుకొనవలసియుండును.

జంతువులు, వనస్పతులు — ఆఫ్రికాఖండమునందలి జంతువులే యిచటను గానవచ్చును. ఇవి యెడారులందు నివసించుటకలవాటు పడినవి. ఆఫ్రికాకైపున శోణసాగరతీరమున మిక్కిలిఁ గన్పించు దుష్టజంతువులం దొకటి యిచటను గలదు. అరబ్బులు దీనిని ఒకప్రకారము అవిధేయాత్మునిఁగఁ దలఁపోయుదురు. యమన్, హెజాజ్ పర్వతములం దొకవిధమగు అడవిగొఱ్ఱె కలదు. కోఁతు లిచట నపరిమితము. వానియందు దేశీయజాతులును గలవు. తోఁడేళ్లు, సింహములు, చిఱుతపులులు చాలఁ గలవు.* పర్వతమయప్రదేశములందు జంగుబిల్లి లెక్కువ. మృగములు దున్నపోతులకంటె పెద్దవి నిర్భయకోతి. అడవిగొఱ్ఱెలు, పావురాలు, కోళ్లు, గద్దలు, ఉడ్లుపిట్టలు విస్తారముగఁ గలవు. ఎడారులందు మఱికొన్ని విశేషపక్షులు గన్పడుచున్నవి. తేళ్లు, పాములు, రోగటి దండులు వర్తకంతము పైరుల ధ్వంసముచేయు మిడుతదండము లగపడిన మిడుతలను బదుపీలు వీనిని ఆహారపదార్థముగ నుపయోగించుకొనుటకుఁ బట్టుకొని ధాన్యపుకొట్టములను నింపుకొనుచుందురు. హెజాజునందు తేనెటీగలు పాలింపఁబడుచున్నవి. ఒంటెలు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేఁకలు ముఖ్యములైన గృహ్యజంతువులు. కొలఁదిమాత్రముగ గోవులును గలవు. ఒంటెలవ్యాపార మిచట నెక్కువగ జరుగుచుండును. దీని నిచట నెడారియోడ యని పిలుచుచుందురు. ఇది దినమునకు నూఱుమైళ్లచొప్పునఁ బ్రయాణముసలుపుచు నూఱుదినములపర్యంతము నీరు త్రాగకుండ నుండగలదు. చలికాలమైనచో ఒక్కొకనెల యైనను నీరు త్రాగదని చెప్పుదురు. ప్రాచీనకాలమున గుఱ్ఱముల నిచట మంచివే యుండెను. కాని ప్రస్తుతము వీనివ్యాపారము చాలవఱకు క్షీణించిపోయినది. కొలఁదిమాత్రముగ నిప్పటికిని అనైజా, కాసిం ప్రాంతములనుండి ఇండియాతో గుఱ్ఱములవ్యాపారము జరుగుచున్నది. హాసాప్రాంతమున తెల్లనిగాడిదలు కలవు. ఇవియు ఒంటెలవలె దాహము నోర్చుకొని యెడారులందు ప్రయాణము సలుపఁగలుగును. ఇచటి మేఁకలు, గొఱ్ఱెలు ఉన్నికొఱకు పనికిరావు. వీనివలన లభించు చర్మములను సేయుయా పరదేశములకుఁ బోవుచుండును. బదులిల గుడారములకు ఉపయోగపడు ఒకవిధమగు మోటువస్త్రములు గొఱ్ఱెవెంట్రుకలతోడను, టోపీలు మున్నగునవి ఒంటెవెంట్రుకల తోడను నిర్మింపఁబడుచుండును.

అరేబియాయందలి వృక్షజాతు లాఫ్రికాఖండమునందలి వానిం బోలియుండును కాని పశ్చిమాసియాఖండపువానిం గాదు. పీఠభూములందు చింత, అంజూరచెట్లు గలవు. అగరుచెట్లు చాలచోట్లఁ గానవచ్చును. మిడియా దేశమునం దనేకములగు ఫలవృక్షములజాతులు గలవు. ఈఁతచెట్లకు లెక్కలేదు. వీనిని పాలముల కంచెలుగ నుపయోగపడులాగునఁగూడఁ బెంచుచుందురు. ద్రాక్షలు, ఖర్జూరములు, అక్రోటులు, పనసలు బాగుగ ఫలించును. సారవంతము లగు భూములందు జొన్నలు, గోధుమలు, యవలు, నీలి, ప్రత్తి, చెఱకు మున్నగునవి పండును. మల్లంగి, దోస, గుమ్మడి మొదలుగాఁగల కాయకూరలును పైరగును. బెయిత్ సమీపమునను, కొండలమీఁదను గులాబీలును మఱికొన్ని సుగంధద్రవ్యములును ఉత్పత్తి యగును. కాఫీ పువ్వులకు చెక్రీలను చిన్నపండ్లు పెండించి విదేశముల కంపుటయు కాక వానితొక్కల నూఁడ్చి వానితో మధుద్రవము చేయుచుందురు. ఈ ఫలములే కాదు, పానీయములకు తయారు చేయు మఱికొన్ని మూలికలు, వనస్పతులును గలవు. హద్రామాత్ నందు పొగాకు విస్తారముగఁ బెరుఁగును. మారేళ్లు మొదలగు వృక్షములు కొన్ని జిగురులకు దయారు చేయుట కుపయోగింపఁబడుచున్నవి. ఈ దేశమందు పెద్దపెద్దయడవులు లేవు.

ఖనులు, జాతులు, మతములు — ఈ దేశమునఁ బ్రధానమైనది అరబ్బిజాతి. వీ రంత పొడుగునుఁ గాని పొట్టిగఁగాని యుండక మధ్యమ

దశయం దుందురు మంచి పుష్టియు కండబలమును గలవారు మొగము గోదుమరంగు కలిగియుండును మంచి చురుకుదనము, స్వతంత్రస్వభావము కలవారు ధైర్యము, మితవ్యయము, విశ్వాసము, అతిథిసత్కారము వీరియందలి సుగుణములు కాని వీరిపగమాత్రము పామువగ పగవానిని బాధింప నట్టిదుష్కార్యము నైన జేయుటకు వెనుకరు స్త్రీలు గృహకార్యనిర్వహణమున సామర్థ్యము కలిగియుందురు

ప్రస్తుత మీదేశమందలి జనసంఖ్య ౬౦,౦౦,౦౦౦లు వీరిలో ౩౦ లక్షలు అసీరు, యమను ప్రాంతములందును, ౧౦ లక్షలు హెజాజు నందును, ౧౦ లక్షలు ఉమ్మాను, హద్రామాతులందును, ౨౦ లక్షలు అల్ నెజ్డ్, హాసా, డెజర్టా లను ఇలాకాలయందును గలరు ప్రాచీన కాలమున సెమాయిలం దెవరు నివసించుచుండినదియు, వారెచ్చటనుండి వచ్చినదియు నెవరికిని దెలియదు ప్రస్తుత ముత్తరప్రాంతములందు అనైజా అని పిలువబడువారు యమనునుండి వచ్చియుందు రని యూహింపబడినది అరబీగాథల ననుసరించి వీరు కహటానులనియు, ఇస్మాయేలు లనియు రెండు తెగలు ఇందు కహటాను లనువారు షెం సంతతివా రనియు, సాంకర్యములేని యుత్తమజాతివా రనియు అరబ్బుల యభిప్రాయము షామ్‌వంశీయుడగు కహటానువలన నుత్పత్తియైనందున కహటాను లనుపేరు వీరికి గలిగెను ఇస్మాయేలువలన వచ్చినవారు ముస్తర్బ లని పిలువబడుచుండిరి ఈ రెండుతెగలును సెమిటిక్ జాతికి జెందినవియే వీరుగాక ఆఫ్రికానుండి క్రమముగా వచ్చి అరబ్బులలో లీనమైపోయిన నీగ్రోలు కలరు వీరిపుడు జబల్ షమ్మార్, ఖైబర్ హర్రా ప్రాంతములు మొదలుకొని వాడీ దవాసిర్ వఱకుగల ఇలాకాయందు కానవచ్చుచుందురు. వీరు ఖానీ ఖదీరు లని పిలువబడుచుందురు. పూర్వభాగములందు సులాబా లను జేబోకజాతివారు కలరు వీరు క్రైస్తవు లని వాడుక తక్కిన తెగలవా రందఱును వీరి నింపుక నీచముగ జూచుచుందురు కాని వీరు మంచిపనివాండ్రు వేటాడుటయందు వీరి కెక్కువ నేర్పరితనము కలదు స్వదేశమున వీరు చేయుపనుల నన్నింటిని పశ్చిమప్రాంతమున యూదులు సలుపుచుందురు ఇస్లాందీక్షను గైకొనని యుత్తరజాతివారే ఈయూదు లని ప్రసిద్ధి కలదు. వీరు సానానగరసమీపమునం దెక్కువగ నుందురు ఈసమస్తఅరబ్బువారు లందఱిలో హాదేసీ (స్థిరవాసు) లనియు, బదువీ (సంచారు) లనియు రెండు భేదములు కలవు అరేబియారాజకుటుంబములకు జెందినవా రందఱును అషాష్ వంశీయులు ఇప్పు డరేబియాను పాలించు ఇబ్నసౌదును ఈ వంశజుడే మహమ్మద్ ప్రవక్తయొక్క దేహసంబంధు లందఱును పశ్చిమ అరేబియాయందు నివసించుచుందురు. అందు అష్రాఫులనాలు ప్రముఖులు యమను, హద్రామాత్, ఉమ్మాన్ ప్రాంతములం దీమహమ్మదు బంధువు లిమాము లనుపేర నధికారముల సలుపుచువచ్చిరి కాని వహాబీ లిపుడు వీరి యధికారమును నాశనము గావించిరి.

పరిశ్రమ, వ్యాపారములు, రాకపోకలమార్గములు:—ఈదేశము పరిశ్రమాభివృద్ధి కనుకూల మైనదికాదు. ప్రాచీనకాలమున అరబ్బులు నౌకావ్యాపారములందును ఆరితేరియుండిరి కాని ప్రస్తుతము వీరును గాఢమగు అజ్ఞానాంధకారమునకే మునిగియున్నారు తూర్పున హిందూదేశమును, పడమట ఈజిప్టు లోనగుదేశములును ఔన్నత్యము నందియుండ మధ్యభాగమం దుండుటచే అరేబియాదేశమును మంచి దశ నందగలిగెను బంగారము, సుగంధద్రవ్యములు ఇండియానుండి యీదేశముగుండా ఈజిప్టునకు బోవుచుండెడివి క్రీ పూ ౨,౮౦౦ల ప్రాంతమున నిర్మింపబడిన లగ్గాన్ మందిరమునకు కలపయున్నగునవి ఈదేశమునుండియే పోయినవి, కాని ఇండియానుండి మిశ్రదేశమునకు నౌకామార్గ మత్తరమున గనిపట్టబడుటచే అరేబియాప్రతిభ తగ్గిపోయెను ఇందువలన వ్యాపారము మొదలంట నడుగంటుటచే ఆర్థికదశ చాలక క్షీణించిపోయెను

ఇచట ప్రాచీనకాలపువ్యాపారమార్గములు తప్ప ఈకాలమున రాకపోకల కనుకూలములగు గట్టిరోడ్లు ఏవియు లేవు ఇటీవల దమాస్కస్ పట్టణమునుండి మదీనావఱకు నొకరైలుమార్గ మేర్పడినది మక్కావఱకును దీనిని బెంపొందింప నాలోచనలు జరుగుచున్నవి. జర్మనీయుద్ధకాలమున ఏడెనునుండి లహేజ్ వఱకును రైలుమార్గ మొకటి నిర్మింపబడినది మక్కా, జిడ్డానగరములమధ్య టెలిగ్రాఫ్, టెలిఫోనులు గలవు వీనికిని మదీనానగరమునకును క్రమముగు మోటారు రాకపోకలు కలవు మదీనా యంబోపట్టణములమధ్యను రోడ్డు వేయబడుచున్నది హెజాజ్ నుండి అల్ నెజ్డ్ ప్రాంతపు రాజధానియగు రియాద్ పట్టణమువఱకును మోటారులు నడచుట కనుకూలమగుమార్గము కలదు. మూయక్ నగరమునుండి ఏడెనుపట్టణమువఱకును క్రమము తప్పక నౌకలు నడచుచుండును మక్కాయాత్రకాలమున చుట్టుప్రక్కలదేశములనుండి యాత్రికులు వేనవేలుగ వచ్చుచుందురు

అరబీభాష — అరబీ క్లాసికల్ భాషలలో నొకటి హిందువులకు సంస్కృతమువలె మునల్మానుల కిది పవిత్రమైనది తక్కిన క్లాసికల్ భాషలందువలె నిందును కావ్య, వ్యాకరణ, గణిత, దర్శన గ్రంథములు కొంతవఱకు పరిపక్వదశను బొందినవి ప్రస్తుతపుచరిత్రకారులయభిప్రాయము ననుసరించి ఈ వాఙ్మయాభివృద్ధి యంతయు మహమ్మదీయమత మున్నతదశయం దుండినసమయమునందే కలిగినది. మహమ్మద్ జన్మించుటకు పూర్వమందును విఖ్యాతులగు కవు లుండినట్లు ఇటీవల వెలువడిన యనేకనిదర్శనములవలన స్పష్టమగుచున్నది. ప్రాచీనులకవిత్వము హృదయంగమమై మార్గదర్శక మైయుండెను. ఖలీల్ ఇబ్న్ అహమద్ అనువాడు ప్రాచీనులం దొకడు. ఇతడు బదువీలభాషలో కావ్యాలంకారశాస్త్ర మను గ్రంథము నొకదానిని రచించెను కాలాంతరమున ఖురానుషరీఫ్ నందును ఈ భాషయే యుపయోగింపబడినందున నిది ప్రాధాన్యము వహించి అనంతరము వారికి ప్రమాణ మగు భాషగ పరిణమించెను

మహమ్మదునకు పూర్వ మందలిగ్రంథకారులు సాధారణముగా దేశమందలి భిన్నభిన్నజాతులవారిలో సంభవించు తీరస్పర

దరేబియా-చరిత్రరచనయందు శక్తియుతులు కాని శ్రద్ధ వహించిరి. ఇబ్న్ ముకఫ్ఫా యనునతఁడు పర్షియా రాజుల గ్రంథమును అరబీలోనికి మార్చెను. మూఁడవశతాబ్దియందు యకూబీ, ఇబ్న్ కుతైబా లనువారు చరిత్రలేఖనమునఁ బ్రసిద్ధి గాంచిరి. తరువాత బలాధురీ యనునతఁడు అరబ్ విజయమును రచించెను. వీరందఱికన్నను తబారీ యనునతఁడు వ్రాసిన యితిహాసము పేటికలతో ప్రమాణగ్రంథమై యొప్పుచున్నది. ఇతనియనంతరము వెండఱో చరిత్రల వ్రాసిరి కాని వారిలో మసూదీ, బిరూనీ, ఇబ్న్ అథీర్, అబుల్ ఫరజ్, ఇబ్న్ ఖల్-ఖాన్, మక్రిజే, సయూతీ, మక్కరీ, హాజీ ఖలీఫా లనువారు ముఖ్యులు. హిలార్ అస్కాబీ శాకుకలేఖకుఁడు నజీరు లను పేరను చరిత్రాత్మకమైన గ్రంథమును వ్రాసెను. దీనినుండి ౯, ౧౦-వ శతాబ్దములలోని యరబ్బుల సాంఘికవిషయములు తెలియును. ఉత్ఫీ యనునతఁడు మహమ్మదుచరిత్రమును వ్రాసెను. ఇది యొకకావ్యమును బోలియుండును.

అరబ్బీభాషయందు జీవనచరిత్రాత్మకము లైన కోశగ్రంథములు కొన్ని గలవు. వీనివలన విద్వాంసులయొక్కయు, వైద్యులయొక్కయు, వైయాకరణులయొక్కయు జీవితములు లోకమునకు వెల్లడి యగుటయేకాక అరేబియాదేశ మహాశకపర్యాయములు శాకతో స్తుళము కాఁగా, నీ మహోపకారము లందలి నాయాసమయములం దేవిధముగ వానిని రక్షించినదియు విశద మగును.

మహమ్మదుపైగంబరు వెడలఁ గల భక్తివిశ్వాసముల కారణమున అలీద్ ఇబ్న్ మర్వాన్ వ్రాసినగాథ లన్నియు నితిహాసములలోని చెక్కు సత్యవృత్తాంతములుగఁ బరిగణించెను. ఆలీ విషయమునను ఇటులే జరిగినది. వీని యాధారమున కట్టుకథ లెన్నియో బయలువెడలినవి. ఈ వ్రాఁతల నన్నింటిని ప్రమాణములుగఁ గైకొని రచించిన దగుటచే ఇబ్న్ అబ్దుల్ హకీంయొక్క 'ఈజిప్టు-పశ్చిమువిజయము' అను గ్రంథమున సత్యాసత్యము లన్నియుఁ గలసిపోయినవి. వాసేకామరణము, సిరియావిజయము లను గ్రంథము లిట్టివే. వీనిలో కొన్ని కేవలము క్రైస్తవులనాదరించుట నిమిత్తము ముసల్మానులను ప్రోత్సహించుటకై వ్రాయఁబడినవి కలవు. అంతార్ కథ, బనీహిలార్ కథలు మొదలగునవి యిట్టివే.

అరబ్బుల భూగోళశాస్త్రమునకు మూలాధారము గ్రీకుల గణిత భూగోళము. అది యటులుండఁగ మొదలమొదలు అరేబియాయందలి తీర్థయాత్ర ప్రాంతములకుఁ బోవురాజమార్గముల వివరించు గ్రంథ మొకటి వ్రాయఁబడినది. దీని యాధారమున క్రమముగ భూగోళశాస్త్రము విస్తరిల్లుచుఁ బోయెను. అనంతరము యాత్రికుల ప్రయాణముల నెంపుడు వారియనుభవములను గ్రంథస్థము చేయుచుండిరి. ఈ యాత్రావృత్తాంతములను మఱికొన్ని నాస్తావిక కథలను ఆధారముగఁ జేసికొని అల్ ఇద్రిసీ, ఇర్క్, యాకూత్ మొదలగు లేఖకులు విస్తృతరూపమున యాత్రాచరిత్రము లిఖించిరి. ౧౪-వ శతాబ్దియందు ఇబ్న్ బతూతా ప్రసిద్ధిగాంచిన యాత్రికుఁడు. కాలక్రమమున ఖగోళశాస్త్రము విశ్వవివరణగ్రంథము(Cosmography)గఁ బరిగణించెను. కజ్వినీ, దిమిష్కి మొదలగువారు వ్రాసిన విశ్వవివరణములు పఠనయోగ్యములు. అటుపిమ్మట నీదేశముయొక్క ఆర్థికస్థితి పాడగుటచేతను క్రమముగ భూగోళశాస్త్రవిచారమే యడుగంటిపోయినది.

అరబీవ్యాకరణము పుట్టుటకుముందు కురానువలన దరబీభాష వృద్ధి గాంచెనని చెప్పవచ్చును. ఇరాక్ బస్రా, కూఫా యను రెండుపట్టణములలో రెండుసంప్రదాయము లేర్పడెను. మూఁడవదగు సంప్రదాయమునకు బాగ్దాద్ పట్టణము జన్మస్థానము. మొదటి లిపివిషయమున నియమబద్ధమగు గ్రంథమును రచించినయతఁడు సీబవైహి యనుశాస్త్రజ్ఞుఁడు. అబూ ఉబైదా, అస్మాయీ, ముబర్రిద్ లోనగువారు దీనిని సంప్రదాయములు. బస్రా సంప్రదాయస్థాపకుఁడు ఇబ్న్ కుతైబా. అనంతరము కాలక్రమమున నశించు లిపివిషయమున వ్రాసిరి.

గణితశాస్త్రమునం దరబ్బులు హిందువులయొద్ద అంకలేఖనము, వర్గము, త్రికోణమితి, బీజగణితము మొదలగువానిని నేర్చికొని యుండిరి. 'హిందువుల గణితశాస్త్రము', 'హిందువుల లెక్కించు పద్ధతి' యను పేరులుగల అరబీగ్రంథములు పైవిషయములను రూఢి పఱచుచున్నవి. రసాయన, జ్యోతిశ్శాస్త్రములను వీ రభివృద్ధిపఱచి యుండిరి. టాలెమీకృత మగు జ్యోతిశ్శాస్త్రము ౮౨౭-వ సంవత్సరమునం దరబీలోని కనువదింపఁబడినది.

అరబ్బులధర్మశాస్త్రవేదాంతశాస్త్రములకు కురానులోని వాక్యములే యాధారములు. కాని అరిస్టాటిలుని తత్త్వశాస్త్రపరిజ్ఞానంతరము కురానులోని సూత్రముల నన్వయించుటయందు పండితులు భిన్నాభిప్రాయు లగుటచే ఇస్లామునందు హనఫీ, షాఫయీ, మాలికీ, హంబలీ యను నాలుగుసంప్రదాయము లేర్పడినవి. ఆరంభకాలమునఁ బూర్వదేశములందు అల్ ఫరాబే, ఇబ్న్ సీనా, అల్ ఘజాలీ మొదలగువారు తత్త్వవిద్యను వైశేషిక దీక్షానిచ్చిరి. స్పెయినునందును, పశ్చిమమహమ్మదీయదేశములందును, ఇబ్న్ బాజ్జా, ఇబ్న్ తూఫైల్, ఇబ్న్ రష్ద్ లను తత్త్వవేత్తలు తత్త్వవిద్యను మహోన్నతస్థితికిఁ గొనిపోయిరి. ఇస్లాంధర్మము దినదినాభివృద్ధి నందుచుండ వైద్యవిద్యలు దారితేరిన సిరియా నెస్టోరియకా తత్త్వజ్ఞులు బాగ్దాద్ ప్రాంతమున గ్రీకుదార్శనికవిద్యలఁ బ్రచారము చేయుచుండిరి. ౯,౧౦-వ శతాబ్దులందు అరిస్టాటిల్ యొక్క ప్రధానగ్రంథములసారాంశము సిరియాభాషలోనికి, దానినుండి అరబీలోనికిని దీక్షాపరాఁబడినవి. మీఁద వచించిన అల్ మామూన్ యొక్క రాజ్యకాలమున అరిస్టాటిల్ యొక్క అనల గ్రంథమంతయు నరబీలోనికి మార్చఁబడెను. మఱియు అల్ కిందియస్, అల్ ఫరబియస్, అవిసెన్నా, అల్ గజేల్ అనువా రీవిద్య నభివృద్ధిపఱచిన తత్త్వవేత్తలు. వీరు పూర్వదేశీయులు. ఇటులే పశ్చిమదేశములందు అవెంపస్, అబూబాసెర్, అవెర్రోస్ అనువారు దార్శనికవిద్యల నభివృద్ధిపఱచి ప్రకటింపఁజేసిరి.

అరబీ తత్త్వవేత్తలు వైద్యులుగఁగూడ నుండిరి. అందువలననే ఈశాస్త్రమునందు వారికి అనుకల్పము వైద్యులనుటకు, తత్త్వవేత్తలని గూడ వర్తించుచుండును. అతిప్రాచీనకాలమున హిందువులు కనిపెట్టిన వైద్య రహస్యములను వారివలన గ్రహించినవారిలో ప్రథము లరబ్బులే. మహమ్మదీయరాజ్యములోని ముఖ్యనగరములందు వైద్యవిద్యాలయ ములు, శాస్త్రీయకపారశాలలు నెలకొల్పఁబడియుండెను. ౯ మొదలు ౧౧-వ శతాబ్దివఱకు నరబ్బు లీవైద్యము నభివృద్ధి పఱచుటకై పాటు పడుచుండిరి. చనిపోయినవాని ప్రాణము పూర్తిగ శరీరమును వదలక ఎదురుచూచుచుండు ననియు, మున్కిర్ నకీర్ అను దేవదూతల కా ప్రాణములవలననే చచ్చినయాతఁడు జవాబు నొసంగఁగలఁడని యుండు ననియు, ఆకారణమున శరీరములఁ గోయరాదనియు మహమ్మద్ ప్రవక్త శాసించియుండుటవలన వీరు అస్థిపంజరశాస్త్రమును మాత్రము వదలు కొనవలసినవారైరి.

౧౪, ౧౫-వ శతాబ్దములందు ఈజిప్టు, సిరియా మున్నగు కొన్ని దేశములందు అరబీగ్రంథములు లిఖింపఁబడినవి కాని వానియందు మౌలికత కానరాదు. ౧౯-వ శతాబ్దిమధ్యమున యూరోపుతో సంబం ధము కలుగుటవలన అరబ్బుల రాజకీయ, సాంఘిక, ఆర్థిక, మానసిక విషయములందుఁ బరివర్తనము కలిగెను. ఇందువలన భాషారచనయం దంగు నైతము మార్పుకలుగుట అవశ్యంభావి యయ్యెను. ఈనవీన లేఖ కులందు రెండుతెగలు బయలుదేఱినవి. ఒకరు ప్రాక్-అరబీసాంప్ర- పద్ధతిని, వేఱొకరు పాశ్చాత్యపద్ధతిని అవలంబించిరి. మొదటి పద్ధతి వారికంటె రెండవపద్ధతి నవలంబించినవారి కెక్కుడు ప్రోత్సాహము కలిగెను. దీనిని ప్రోత్సహించువారు కేవలము స్వదేశముననే కాక యునైటెడ్ స్టేట్సు, బ్రెజిల్ మొదలగు అమెరికాఖండాంతర్గతదేశము లందును ఉండిరి. ఈరెండుసంప్రదాయములను కలుపుటకై ఈజిప్టు నందొకప్రయత్నము జరిగియుండెను కాని ఫలిత మేమియుఁ దేలి యుండలేదు. ప్రస్తుతము వ్రాయుగ్రంథములందు విషయగ్రహణ మైతే పాశ్చాత్యశైలికులను పోలియున్నను భాషాశైలి మాత్రము ప్రాచీన అరబీపద్ధతిని పోలియున్నది. లెబనన్, ఈజిప్టులందు ముఖ్య ముగఁ బ్రచారములో నున్న ఈనవీనపద్ధతి ముమ్ముందు బాగుగ నభివృద్ధి నొందఁగల దని తోఁచుచున్నది.

ఇతిహాసము — మహమ్మదునకుఁ బూర్వము అరేబియా యొక్క చరిత్రము దెలిసికొనవలయు ననినఁ దగినయాధారములు లేవు. సాధ్యమగునంతవఱకు మహమ్మదీయు లట్టి యాధారములను సర్వనాశ నము గావించిరి. ౧౯-వ శతాబ్ది మొదలుకొని జరుగుచున్న యన్వేష ణములకు ఫలితముగ ప్రాచీనకాలపు శాసనములను, నాణెములను అనేకములు లభించినవి. వీనిద్వారా ఇతిహాసికయుగారంభము చిరకా లమునకే యుండినట్లు విదిత మయ్యెను. మహమ్మదు జనించుటకు వెయ్యిసంవత్సరములు పూర్వము అరేబియాయందు హిందూ- [illegible] యుండినట్లు కొన్ని నిదర్శనములు కానవచ్చు చున్నవి. ఈ విషయము ముమ్ముందు నిశ్చయము కావచ్చును. నాణెములు, శాసనములు మున్నగువానియాధారమున క్రీస్తుజనన మునకు వెయ్యిసంవత్సరములు పూర్వము ఇచట మాయిన్, సాబా, హద్రామాత్, కాటబానియా అను నాలుగురాజ్యము లుండె నని విదిత మగుచున్నది. వీనిలో చివరిరెండురాజ్యము లవిషయమై యెక్కువ తెలియదు. సాబియనులు క్రీ. పూ. ౮-వ శతాబ్దిమొదలు క్రీస్తు పూర్వము ౧౧౫ వఱకును రాజ్యము చేసియుండిరి. వీరికిఁ గొంత కాలము మారిబ్ పట్టణమును, మఱికొంతకాలము సరవాహా నగరమును రాజధానులుగ నుండెను. వీరికిని, హద్రామాత్ కాటబానులకును పోరాటములు కలుగుచుండెడివి. ఈ కాలమున దక్షిణ-పశ్చిమ-అరే బియాభాగములు ధనధాన్యపూర్ణమై సంపదలఁతోఁ దులతూఁగుచుం డెను. ఇందులకు కారణము 'ఇండో-మిశ్రవాణిజ్యము'. ఈ వ్యాపా రము హిందూదేశమునుండి పర్షియాసింధుశాఖగుండా ఈజిప్టుతో జరుగుచుండెను. ఇందువలన దక్షిణ - పశ్చిమ - అరేబియాభాగములు మార్గమం దుండుటచే మంచిలాభమును బొందుచుండెను. కాలాంతర మున టాలెమీ యనునతఁ డిండియా, ఈజిప్టుల ఉత్తరమార్గమును వేఱొకదానిని గనిపెట్టుటచే దక్షిణమార్గపుప్రతిష్ఠ తగ్గిపోయెను. అనం తరము నజ్రానియనులతో జరిగినయుద్ధమున సాబియనులు పూర్తిగ ఓడిపోయిరి. దానితో నీజాతియే నాశన మైపోయెను.

మాయిన్ రాజ్యము అరేబియాదక్షిణమందలి జోఫ్ ప్రాంతమున వ్యాపించియుండిన ట్లగపడుచున్నది. ఈ జాతివారు ౨౬ గురరాజు లీయులాకాను పాలించినట్లు శాసనములవలనఁ దెలియును కాని వీ రేకాలమున నుండిరనియు నిశ్చయముగ తెలియదు. వీరుసాబియనుల కంటెను పూర్వ ముండి రని కొందఱియభిప్రాయము కాని సాబియను శాసనములందు వీరిపేరైనను గానరాదు. క్రీ. పూ. ౧౧౫-వ ప్రాంత మున ఈదేశ మంతయు హిమ్యరైటులవశ మయ్యెను. ఇదేసమయ మున కాటబానులరాజ్యముకూడ నాశనమై పోయెను.

హిమ్యరైటులు సాబారెయిద్దాన్‌రాజా లను పేరఁబరఁగుచు వచ్చిరి. రోమను లీకాలమున వీరిని జయింప నెంచిరి గాని కృతా ర్థులు కారైరి. తరువాత అబిసీనియనులకును, హిమ్యరైటులకును పోరాటములు కలిగెను. ఇందు మొదటివారు క్రైస్తవులు. చివరి వారు యూదులు. ఈకారణమున వీరికలహములు సంప్రదాయ యుద్ధములుగఁ బరిణమించెను. క్రైస్తవమతరక్షణమున బిజాంటైన్ సామ్రాజ్యమువారు అబిసీనియనులకుఁ దోడ్పడుటచే హిమ్యరైటులకు పరాజయము కలిగెను. అంత హిమ్యరైటులు ద్వేషమూని పర్షి యనులసాయమును నభిలషింప వారును సమయమును గనిపెట్టి అబిసీని యనులను బరాభూతులను గావించుటయే కాక తుదకు హిమ్యరైటులఁ గూడ నశింపఁజేసికొని వారిభూభాగము పర్షియారాజ్యమునఁ గలుపు కొనిరి.

విదేశములు తెన్ని జయింపఁబడుచువచ్చినప్పటికిని ఆరంభకాలమున సాధ్యమగునంతవఱకు అరేబియాయందలి రాజకీయసత్యము భగ్నము గాకుండులాగున ప్రయత్నములు సలుపఁబడినవి. సేనలును, సైనికులును దప్పనితరులను అరబ్బు లెవరును విదేశములందు నివసించుటకు వీలు లేకుండులాగున నియమములు గావింపఁబడెను. కూఫా, ఫోస్టాట్ నగరములు రెండును కేవలము సేనాస్థానములుగ నుండెను. కాలక్రమమున దక్షిణమున కూఫాపట్టణమును, ఉత్తరమున బస్రా పట్టణమును విఖ్యాతస్థానములుగఁ బరిగణింపఁబడెను. ఆదిమఖలీఫాల కాలమున మదీనాపట్టణమే మహమ్మదీయప్రపంచమునకు రాజధానిగ నుండెను. ఖలీఫా లానగరమునందే ఎన్నుకొనఁబడుచుండిరి. మహమ్మదీయలోకమునకుఁ గావలసిన నీతినియమములు చట్టములు నచటనే నిర్ణయింపఁబడుచువచ్చినవి. ప్రాంతాధికారు లచటనుండియే పంపఁబడుచువచ్చిరి. కాని ఓమరుమరణానంతరము అరేబియామదీనాల ప్రాధాన్యము క్రమముగ క్షీణింపసాగెను. ఈసంగతి ఒత్తోమాను కాలమున విస్పష్టమయ్యెను. ఈ ఖలీఫాయొక్క పక్షపాతపూర్ణమైన పాలనమే ఇందులకు ముఖ్యకారణము. గవర్నరుల నియమించుటయందును, యుద్ధవిజయమున దొరకినధనమును బంచుకొనుటయందును ఈఖలీఫా తన ఖురైష్ తెగవారియెడలను అందునఁగూడ ఒమయ్యాద్ వంశమువారియెడలను మిక్కిలి పక్షపాతము చూపుచువచ్చెను. అందువలన అరేబియాయందలి ఇతరజాతులవా రందఱును ఖురైష్ జాతివారిని, ఖురైషులలోనే హాషిమైటులు ఒమయ్యాదులను గర్హింపసాగిరి. ఒమయ్యాదులు తక్కినయందఱికంటెను చిట్టచివర ముసల్మాను దీక్షను గ్రహించినవారు. ధార్మికనియమపాలనమున వీరి కంతగ పట్టుదలయును లేకుండెను. ఖలీఫా వధింపఁబడుటకు కిదియే కారణములు. కాని ఈవిరోధకారణముల ప్రచారము బస్రా, కూఫా, ఫోస్టాట్ నగరములందు జరిగినంత తీవ్రముగ అరేబియాయందు జరిగియుండలేదు. ఈహత్యవిషయమున అరేబియా తూష్ణీంభావ మూనెను. సిరియా ప్రాంతాధికారి ఒకఁడు తప్ప తక్కిన జవాబుదారీగల వారెవరును దీనిని గమనించియైన నుండలేదు. అనంతరము అలీనిమిత్తము ఎన్నికలు జరిగినకాలమున జనించినకలహములందుమాత్రమే అరేబియా కాస్త ప్రాముఖ్యము కలుగజేసికొనెను. ఇతఁడు దావదము నంది చేరింది యున్నంతవఱకును మదీనానగరమే ముస్లింలోకమునకు రాజధానిగ నుండెను. కాని తరువాత సిరియాఖలీఫాకుఁ గలిగినవిజయము చేత డమాస్కస్ రాజధానిగ మాఱెను. ఇందుచే మదీనాప్రభావము తగ్గిపోయెను. అనంతరము సిరియా తనకుమారుఁడగు యజీదును యువరాజుగ నియమించుటచే మదీనాకుఁగల రాజనిర్వాచకపు హక్కు సైతము పోయెను. ఈవిధముగ మక్కా మదీనాలకుఁ గల రాజకీయపు హక్కు తగ్గిపోయినప్పటికిని ధార్మికాధికారము మాత్రము యథాపూర్వముగనే యుండెను.

అలీఖలీఫావధానంతర విశనిరోధకులు హాసన్, హుసేను లనువారిద్దఱు డమాస్కస్ ఖలీఫాకు విరుద్ధముగ కలహములాడ బయలుదేఱిరి. కాని వీరిలో హాసన్ సిరియాతో సంధి గావించుకొనెను. సిరియాతరువాత మహమ్మదీయరాజ్యమును ఏలినది అతని కొమారుఁడు యజీద్. ఇతఁడు రాజ్యమునకు వచ్చినపుడు హుసేను యీరాజ్యము నోడించుటకు సైనికులను గూర్చసాగెను. కాని ౬౮౦-వ సంవత్సరమున నితఁడు కర్బాలానగరముకడ్డ వధింపఁబడెను. అటుపిమ్మట అబ్దుల్లా ఇబ్న్ జోబైర్ అనువాఁడు అలీకుటుంబమునకు సంభవించిన దుర్గతికి ప్రతిగా పగ దీర్చుకొనవలెనను తలంపుతో మక్కానుండి డమాస్కస్ మీఁదికి దండువెడలెను. మక్కా మదీనావాసు లితనిపక్షమునే యవలంబించిరి. కాని అబ్దుల్లా ప్రతిన నెఱవేఱినట్లగపడదు. ౬౮౩ లో యజీద్ సేనలు మదీనాను జయించి కొల్లగొట్టి మఱుసటిసంవత్సరము మక్కామీఁది కెత్తివచ్చినవి. కాబా ధ్వంసము గావింపఁబడెను. ఇంతలో యజీద్ మరణింపఁగా, ముట్టడి యెత్తివేయఁబడెను. అబ్దుల్లా మక్కానగరమందే యుండెను. అరేబియా, ఈజిప్టు, ఇరాకుయందలి కొంతభాగమునకుఁ జెందిన ప్రజ అబ్దుల్లాను ఖలీఫాగా స్వీకరించిరి. ఇతఁడు దొరపర్యాయము మెర్వాన్ అనునతని యధీనమం దుండిన శత్రుసేనలను పరాజయము నొందించెను. కాని ఖారిజైతు తెగవారియంత ఇతనికి దొరకదయ్యెను. అటు డమాస్కసునం దబ్దుల్ మలిక్ అనువాఁడు యజీదుస్థానమున సైకొని ౬౯౧ లో అరేబియాయందలి అబ్దుల్లా నడఁగఁద్రొక్కుటకై తన సేనాధ్యక్షుని మక్కామీఁదికిఁ బంపెను. ఈయుద్ధమునం దబ్దుల్లా ప్రాణములను గోల్పోయెను. మక్కానగరము సంపూర్ణముగ డమాస్కసుకకే వశమయ్యెను. మరియు నీయుద్ధవిజయమువలన అబ్దుల్ మలిక్ అరేబియా, డమాస్కసులకే కాదు, సమస్తమహమ్మదీయప్రపంచమునకును ప్రభువయ్యెను. ఖలీఫాయు ఎవ్వఁడు అది మొదలుకొని ఒమయ్యాదుల ప్రభుత్వమున్నంతకాలము అరేబియా యూరు పేరు లేక పడియుండెను. దేశదేశాంతరములందలి ముసల్మానులు తూర్పున అఫ్గానిస్తానంతమువఱకును, పశ్చిమమున స్పెయినువఱకును జయించిరి కాని యందువలన అరేబియాకేమియు ప్రత్యేకమైన లాభము కలుగదయ్యెను. అనంతరము అబుల్ అబ్బాస్ రాజ్యసింహాసన మెక్కి రాజధానిని కూఫానగరమునకు మార్చెను. పిదప కొంతకాలమునకు బాగ్దాదు రాజధానిగ మాఱెను. అందువలన అరేబియాగౌరవము మఱింత తగ్గిపోయెను. మొట్టమొదటనుండి అబ్బాసీదులు పర్షియనుల మీఁదను తురుష్కులమీఁదను ఆధారపడియుండిరి. రాజ్యమందలి ముఖ్యపదవు లన్నియు విదేశీయులచేత నింపఁబడుచువచ్చినవి. రాజకీయములం దిట్టి పరివర్తనములు కలిగినప్పటికిని భాషావిషయమునమాత్రము అరేబియా గౌరవము యథాపూర్వముగనే యుండెను. కోశకారులు, వైయాకరణులు, కవులు అరబీభాషనే స్వీకరించి యభివృద్ధిపఱచిరి. కాని అరబ్బు లందఱు శిథిలించి [illegible], [illegible] ప్రాణముల [illegible] రణ మొనర్చ్యత్వభావము వీరియందు [illegible] పోయెను. ఈ [illegible] వీరు ఒమయ్యాదులయెడల పక్షపాతము గలిగియు అబ్బాసీదుల ద్వేషించఁజాలరైరి. క్రమముగా [illegible]

# అరోరా పోలారిస్



పటము ౧. రెండురకముల ధ్రువజ్యోతిశ్చాపములు



పటము ౨ రెండురకముల ధ్రువజ్యోతికిరణములు

వాయవ్యదిక్కునకును బంపెను. అం దర్జునుం డుత్తరదిక్కునకుఁ బోయి క్రమముగా కుళిందము, ఉత్తరానర్తము, కాలకూటము, అపరోత్తర కుళిందము, సుమండలము, శాకలద్వీపము, ప్రాగ్జ్యోతిషపురి, అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరి, ఉలూకము, అపరోత్తరోలూకము, పంచగణ దేశము, దేవప్రస్థము, పౌరవేశ్వరుఁడు, పర్వతవాసు లనెడు దస్యు రాజులు, కాశ్మీరము, లోహితము, త్రిగర్తము, దారువము, కోకన దము, అభిసారదేశము, ఉరగాపురి, సింహపురము, ఉత్తరసుహ్మము, ఉత్తరచోళము, బాహ్లీకము, కాంభోజము, దరదము, ఈశాన్యదిక్కు నందలి దస్యురాజులు, లోహదేశము, పరమకాంభోజము, ఋషిక దేశము[1], హిమవత్పర్వతమువిూఁదిదేశములు మొదలగు దేశములను, రాజులను జయించి అపరిమితమైన ధనరూపకరభారముం గొనియెను. అచ్చటనుండి శ్వేతపర్వతమును దాఁటి కింపురుషవర్షమునం జొరఁబడి ద్రుమపుత్త్రు జయించి కరభారముం గొనెను. గుహ్యకర క్షిత మగునట్టి హాటకదేశమునకుం బోయి సామోపాయముచే వారివలనఁ బన్ను రాఁబట్టుకొని మానససరోవరమును ఋషికుల్యానదిని దర్శించి, గంధర్వరక్షితమైన దేశమును జయించి వారియొద్దనుండి తిత్తిరికల్మాష మండూకవర్ణములుగల మండూకములను గుఱ్ఱములను కరముగఁ దీసికొని హరివర్షమునకుం బోయెను. అచ్చట మహోత్సాహులును, మహాబల వంతులును అయిన ద్వారపాలకులం గనుఁగొనిరి. వా రర్జునునిఁ జూచి మానవు లీదేశమునకు రాఁగూడ దని చెప్పఁగా నట్లయిన యుధిష్ఠిరునకు మీరు కరభార మిచ్చినయెడల నే నిచ్చటనుండియే పోఁగలవాఁడ నని చెప్పి వారివలన దివ్యాభరణాదిభూషణంబులం గైకొని యుత్తరదిగ్విజయంబు సమాప్తము గావించి తిరిగి యింద్రప్రస్థ మునకు వచ్చెను (సభా. ౨౭, ౨౮ అ.). రాజసూయయజ్ఞము పూర్తి యయినతరువాత, పాండవులు ద్యూతమునం గోడిపోయి వన వాసమునకు వెడలిపోయిరి. వారు ద్వైతవనమునుండి కామ్యకవనము నకుఁ బోయినతరువాత నర్జునుఁడు దివ్యాస్త్రముల సంపాదింపవలె యు నని హిమాలయపర్వతమునకుఁ బోయి ఇంద్రకీల శిఖరముపై దపస్సు చేసి శివుని మెప్పించి, కిరాతరూపధారియైన శివునితోఁ బోరాడి యతనికృపకుఁ బాత్రుఁ డయి, అతనివలన పాశుపతాస్త్ర మును సంపాదించెను. అచ్చటనుండి యింద్రలోకమునకుఁ బోయి యైదుసంవత్సరము లుండి, నివాతకవచులు కాలకేయులు అనురాక్షసులం జంపి, యింద్రునివలన నెక్కుడస్త్రశస్త్రములను బడసెను. అచ్చట నున్నకాలమున నతఁడు చిత్రసేనగంధర్వునియొద్ద నృత్యగానవిద్యలను నేర్చుకొనెను. ఒక్కనాఁటి యూర్వశి యింద్రుసభను నితనియొద్దకు రాఁగా అప్సరస లందఱును తనకు తల్లు లన్నభావముగల యర్జునుఁడు దానిని నిరాకరించెను. అంత నది 'నీవు నపుంసకుఁడ వగు' మని శాపం బిచ్చెను. తరువాత నజ్ఞాతవాసకాలమైన యొక్క సంవత్సరమునకే చెల్లు నని యింద్రుఁడు వరం బిచ్చెను. పాండవులు తీర్థయాత్రఁ జేయుచు గంధమాదనపర్వతమునకుఁ బోఁగా నర్జునుఁ డచ్చటికి వచ్చి వారిని గలసికొనెను. పాండవులు విరాటునిగృహమున నొకసంవత్సర మజ్ఞాతవాసము సల్పుచున్నప్పుడు పేడిరూపమును దాల్చి బృహన్నల యను నామముతో రాజకుమారి యైన యుత్తరకు సంగీతంబును నాట్యం బును నేర్పుచుండెను. సంవత్సరాంతమున దుర్యోధనుఁడు తన సైన్యంబులతో వచ్చి విరాటరాజుయొక్క యుత్తరగోగ్రహణము సేయ, రాజపుత్త్రుఁ డైన యుత్తరునకు సారథియై యర్జునుఁడు యుద్ధ మునకుఁ బోయెను. శత్రుసైన్యముం జూచి ఉత్తరుఁడు రథంబు దిగ్గి పాఱిపోవ వానిని బట్టుకొనివచ్చి ధైర్యము చెప్పి తాను రథియై యాతని సారథిం జేసి కౌరవులతోఁ బోరాడి వారి నందఱను గెల్చి గోవుల మళ్లఁజేసెను. అజ్ఞాతవాసానంతరమున కౌరవపాండవులకు కురుక్షేత్రమున యుద్ధము సంప్రాప్తమయినప్పుడు, కృష్ణుఁడు తనకు సారథికాఁగా, యుద్ధసన్నద్ధుఁడై, ప్రథమదినమున ఉభయసైన్యముల నడుమ నిల్చి వైరాగ్యము కల్గినవాఁడై మోహముచే యుద్ధము చేయనొల్లకయుండ శ్రీకృష్ణుండు భగవద్గీతాబోధవలన వానిమోహ మును దొలఁగించెను. ఇతఁడు భారతయుద్ధమునందు శిఖండిని చేర నరుమాత్రుఁడు తనకు ముం గుండుకొని భీష్మునిఁ బడవైచెను. అభి మన్యునకు సాయము పోకయుండ పాండవుల కడ్డపడినందున సైంధ వునివిూఁదను కోపగించి వానిని మఱునాఁడు సూర్యాస్తమయమునకు పూర్వము సంహరించెద నని ప్రతిజ్ఞ చేసి అట్లే వానితల దునిమెను. పదు నేడవనాఁడు యుద్ధమున తన యద్భుతపరాక్రమమునకుఁ గర్ణుని వధించెను. అశ్వత్థామయొక్క శిరోరత్నమును హరించెను. యుధిష్ఠిరుఁ డశ్వమేధము చేయఁ దలంచి యాగాశ్వము విడిచి దానిసంరక్షణమున కర్జునుని నియమించెను. ఇతనివెంట సాత్యకి ప్రద్యుమ్నానిరుద్ధాది వీరు లుండిరి. ఆ యశ్వము హస్తినాపురమున నుండి దక్షిణదిక్కుగా వెళ్లి మాహిష్మతీనగరమునకుఁ బోఁగా అచ్చట నీలరాజు దానిని బట్టుకొనెను. అర్జునుఁడు వానిని గెల్చి వానిని వెంటఁ దీసికొనెను (జైమిని, అశ్వ, అ ౧౫). అచ్చటనుండి ఉద్దాలకమునియొక్క యాశ్రమమువిూఁదుగా చంపా నగరమునకుఁ బోయి అచ్చటిరాజైన హంసధ్వజుని గెలువ, నతఁ డర్జునునివెంట వచ్చెను. అంత నశ్వము స్త్రీరాజ్యమునకుఁ బ్రవే శింప నచ్చటిరాణి యైన ప్రమీల దానిం బట్టెను. అర్జునుఁ డామెను గెలిచి వివాహమాడి హస్తినాపురమునకుఁ బంపెను. కర్ణప్రావర్ణ మను జనుల దేశముల నుల్లంఘించి భీషణరాక్షసునినగరమువిూఁదుగా నశ్వము మణిపూరముఁ జేరెను. అచ్చట కుమారుఁడైన బభ్రువాహను నితోఁ బోరాడి అర్జునుఁడు మడిసి మరల బ్రతికెను. అచ్చటనుండి మయూరధ్వజుఁడు, వీరవర్మ, చంద్రహాసుఁడు మొదలైన రాజుల దేశములవిూఁదుగా నశ్వ ముత్తరదిక్కునకుఁ దిరిగెను. అచ్చట నర్జునుఁడు బకదాల్భ్యఋషి యను మునిని సందర్శించెను. సంవత్సరము గావచ్చినందున నర్జునుఁడు నశ్వమును సింధుదేశమువిూఁదుగాఁ దీసికొని

1 ఈ ఋషికదేశమునే రష్యా యని కొందఱూహించుచున్నారు.

గానుట కెల్లప్పుడును ఎవరో యొకరు సిద్ధపడి యుందురు. వీనిలో కొన్నైన కొరదానిని పుచ్చుకొని దానికి బదులుగ మఱియొక దాని నిచ్చువా రుందురు. ఇట్టిమారకమునకు వినిమయము అని పేరు. కావున అర్థమునకు మూల్యము — వినిమయార్హత, క్రయవిక్రయార్హత — అను గుణము లున్నవి (౪) అర్థవర్గములో చేరిన పదార్థములకై సర్వస్వామ్య మెవరికో యొకరి కుండును వీనివినిమయమున 'తనది', 'పరునిది' అనుభేదము మేల్పడుచుండును. ఇట్టి పదార్థములనుమాయామే ఒకని ఆస్తి (౫) అర్థములో చేరియు క్రమపడక లభింపదు. దీనిని ఉత్పత్తి చేయుటకు మనుష్యునిపరిశ్రమ ఆవశ్యక మైయున్నది. కొన్నిటియుత్పత్తికి పరిశ్రమ మావశ్యకము కాకున్నను వానిని స్వాధీనపఱచుకొనుటకైనను అది ఆవశ్యక మగుచున్నది. అర్థవర్గమున చేరిన సాధనములకు పైని పేర్కొనిన పంచలక్షణములు నున్నవని దీనిచే స్పష్ట మగుచున్నది

అర్థములో చేరినవానిని పదార్థము లని వాడుటకన్న సాధనము లని వాడుట యుక్తతరము. మనకోరికలను నెఱవేర్చుసామర్థ్యము, రూపముగల పదార్థములకేకాక రూపము లేనికర్మములకును పరిశ్రమములకును కలదు. గాయకుని గానము, నటుని నాట్యము, బోధకుని శిక్ష, న్యాయాధిపతియొక్క తీర్పు, విద్యావంతుని తీర్పు మొద లగువానికి రూపము లేకున్నను పని మనకోరికలను నెఱవేర్చుచున్నవి. అర్థమున కుండవలసిన లక్షణము లన్నియు వాని కున్నవి. అవి మితలభ్యములు, వినిమయార్హములు, మూల్యము గలవి, కష్టార్జితములు. పదార్థము లనుటకు బదులు సాధనము లని చెప్పినయెడల వీని నన్నిటిని అర్థవర్గములో చేర్చుటకు వీలగును. ఇదియే సంప్రదాయము. కావున నొకదేశములో నేఁటేట నుత్పత్తి యగు అర్థముయొక్క మొత్తమును లెక్కవేసి కనుఁగొనవలసివచ్చునప్పుడు అందులో రూపసహితము లగు ధాన్యాదిపదార్థములకేకాక రూపరహితము లగు పైని పేర్కొనిన గానము లోనగుకర్మములను చేర్చుచుందురు. (వివరములకు 'ఆదాయము' అనువ్యాసమును చదువునది)

అర్థమునుగూర్చినశాస్త్రము అర్థశాస్త్ర మని చెప్పక, అర్థవిషయమున మనుష్యుని ప్రవర్తన యెట్టిదో తెలుపునది అర్థశాస్త్ర మని చెప్పుటకును హేతువు కలదు. ఈశాస్త్రములో విమర్శనీయమగు విషయము మనుష్యునికి బాహ్యములుగ నుండు వస్తువుల స్వభావము కాదు. అట్టివస్తువులయెడ మనుష్యుఁ డెట్లు ప్రవర్తించుచున్నాఁడో, అతనిప్రవర్తనమున ఎట్టిమార్పులు కలుగుచున్నవో, ఎట్టి మార్పులు కలిగిన బాగుగ నుండునో అనువిషయములే ఇందు వివరింపఁబడుచున్నవి. ధాన్యము అర్థవర్గములో చేరియున్నంతమాత్రమున దానియొక్క రూపముగాని, అది యేశాకపదార్థ మగుటకు కారణము గాని, అది పండుటకు కావలసిన పరిస్థితులు గాని అర్థశాస్త్రమునం దుండఁ జేరవు. ఈవివరములు వృక్షశాస్త్రమునందును, రసాయనశాస్త్రమునందును, ఆరోగ్యశాస్త్రమునందును నుండును. ధాన్యమునకు వినిమయ లక్షణము నుండుటచే దానిని సంపాదించుటయందును, వినిమయము చేయుటయందును, అనుభవించుటయందును మనుష్యప్రవర్తన యెట్టిది అనునదియే అర్థశాస్త్రమున వివరింపఁబడు విషయము. వర్ణనీయాంశము మనుష్యప్రవర్తనము గాని అర్థజాలము కాదు. అర్థశాస్త్రమునందలి మనుష్యప్రవర్తనము ప్రధానవిషయముగ చేసికొనినశాస్త్రములు మఱికొన్ని యున్నవి. అధికారము వహించినవారు అనధికారు లగు ప్రజలయెడల నెట్లు ప్రవర్తించుచున్నారో, అట్లే ప్రజలు అధికారులయెడల నెట్లు ప్రవర్తించుచున్నారో వివరించుశాస్త్రము రాజ్యాంగశాస్త్రము. నీతిశాస్త్రము, ధర్మశాస్త్రము, సాంఘికశాస్త్రము లోనగునవి యీవర్గములో చేరినశాస్త్రములు. వీనిలో నొక్కొకదానియందు నొక్కొకసందర్భమున మనుష్యుఁ డెట్లు ప్రవర్తించునో వివరింపఁబడును. ఈసందర్భభేదమునుబట్టియే ఈశాస్త్రములకు ప్రత్యేకత్వము కలుగుచున్నది

## ౧. అర్థశాస్త్రము శాస్త్రమా?

శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము సిద్ధాంతములను కొన్నిటిని ఏర్పఱచుటయే. పూర్వాపరసంబంధముగాని కార్యకారణసంబంధముగాని తెలుపు సూత్రమునకు సిద్ధాంత మని పేరు. ఇట్టి సందర్భమునం దిట్టికార్యము సంభవించు ననియు, ఇట్టి పరిస్థితులయం దిట్టి ఫలితము కలుగు ననియు సిద్ధాంతములసాహాయ్యమున మనము తెలిసికొనఁగలిగియుందుము. ఈజ్ఞానము భావికాలమున జరగఁగల కార్యముల స్వభావము నూహించుటయందు మన కుపకరించును. శాస్త్రము లన్నిటికిని గల యీసామాన్యధర్మము అర్థశాస్త్రమున నుండుటచేత శాస్త్ర మను పేరు దీనికి తగియున్నది. ఇందులో సమర్థింపఁబడు సిద్ధాంతము లెన్నియో యున్నవి. 'పదార్థములయొక్క మితత్వమందు కలుగు తరతమభావములనుబట్టి వానిమూల్యమందు కలుగు భేదము లేర్పడుచున్నవి' అనునది యొకసిద్ధాంతము. 'మితముగ నుండు ద్రవ్యముతో ననేకపదార్థములను కొనవలసివచ్చినప్పుడు అధికతమ ప్రయోజన మేవిధ మగు వినియోగమువలన కలుగునో అవిధమున నా ద్రవ్యము పదార్థములను కొనుటకై వినియోగింపఁబడును' అనునది మఱియొకసిద్ధాంతము. ఇట్టిసిద్ధాంతములయొక్కయు, వీని నుపపాదించుటకై కల్పింపఁబడిన వాదప్రతివాదములయొక్కయు సముదాయము అర్థశాస్త్రము.

కాని అర్థశాస్త్రసిద్ధాంతములవిషయమున ననేకు లాక్షేపణ చేయుచుందురు. 'మనుష్యుని ప్రవర్తన యిట్టి సందర్భములో నిట్టివిధముగ నుండు నని నిర్ధారణము చేయుటకు వీలు కలదా? ఒకఁడు ప్రవర్తించునట్లు మఱియొకఁడు ప్రవర్తించునా? దేశమును బట్టియు కాలమునుబట్టియు మనుష్యుని ప్రవర్తనము మాఱు చుండదా? మనుష్య స్వభావము ఒకటేనా? ఒకరి స్వభావమువలె మఱియొకరిస్వభావ ముండదు. ఇంగ్లీషువారు ప్రవర్తించునట్లు భారతీయులు ప్రవర్తింపరు; దరిద్రులవలె ధనికులును, పల్లెటూరివారి వలె పట్టణవాసులును, పూర్వాచారపరాయణులవలె నవనాగరికులును ప్రవర్తింపరు. కావున మనుష్య [illegible]

వెల్లసిద్ధాంతములు చేర్పఱుపఁబడలేదనుట సామాన్యము. అందువలననే ఇంగ్లండు లాంగ్లదేశపరిస్థితులను మనసున నుంచుకొని వ్రాసిన అర్థశాస్త్రములోని సిద్ధాంతములు మనదేశమునకు సరిపడుటలేదు. ఈయాక్షేపణములోని సత్యాసత్యములను మనము పరిశీలింపవలసి యున్నది.

(౧) ఈయాక్షేపణను సమంజసమైనదనుటకు నిది యొక్క అర్థశాస్త్రమునకే కాక మానవునిగుఱించి విమర్శించు రాజ్యాంగశాస్త్రాది మానవశాస్త్రము లన్నిటికిని తాఁకవలసియుండును. ఇది అర్థశాస్త్రముయొక్క ప్రత్యేకలోపము కాఁజాలదు. ఆలోచనయు స్వేచ్ఛాప్రవర్తనమును గల మనుష్యునిగుఱించి చెప్పుశాస్త్రములకును, నిర్జీవము లగువానినిగుఱించి విమర్శించు ప్రకృతిశాస్త్రములకును, జీవముగ్నను ఆలోచన లేని తక్కువజీవవర్గములనుగుఱించి వివరించు జీవశాస్త్రములకును గలభేదమును సూచించుటమాత్రమే ఈయాక్షేపణ ముపయోగించుచున్నది.

(౨) మనుష్యులనుగుఱించి మనము విమర్శించునప్పుడు మనకు గోచరించు నెక్కువ మెట్టిది? ఒకనికిని, మఱియొకనికిని భేద మున్నదని తెలియుటమాత్రమే కాదు, కొన్ని విషయములందు భేద మున్నను మఱికొన్నిటియందు ఒకనికిని మఱియొకనికిని విస్తార మగుసామ్య మున్నదనియు మనకు తెలియఁగలదు. కనుపడుభేదము సామ్యముతోఁ గూడినభేదము గాని సామ్యవిరహిత మగుభేదము కాదు. మనుష్యు లందఱకును వాంఛ లున్నవి, వాంఛలను నెఱవేర్చుకొనుట కందఱకును అర్థము కావలసియున్నది. ఒకటేవస్తువును గాక పలువస్తువుల నపేక్షించుట అందఱకును సహజము, దేనినిగాని కొంతకాలము కనుభవించినతర్వాత దానిపై విరాగము కలుగుటయు, మఱియొకదానిపై రాగము కలుగుటయు మనుష్యు లందఱకును స్వభావము. కావలసినదానిని సంపాదించుటకై కష్టపడుట, కష్టమునకు తగిన ఫలమును సంపాదింపఁగోరుట, ఫలములేనప్పుడు కష్ట పడుట కిష్టపడకపోవుట, చేర మూడుట, కొనఁదలఁచినప్పుడు చౌక ధరకు, అమ్మఁదలఁచినప్పుడు అధికమగుధరకు కోరుట లోనగు విషయములందు ఒకనికిని, మఱియొకనికిని భేదము కనిపింపదు. ఇట్టి సామాన్యధర్మముల ననుసరించియే అర్థశాస్త్రకర్తలు తమసిద్ధాంతము లను నిర్మించుచున్నారు.

(౩) ఇంగ్లీషుజాతి పరిస్థితుల కన్వయించెడి అర్థశాస్త్రసిద్ధాంతములు మనపరిస్థితుల కన్వయింపకపోవచ్చును. కాని పైని చెప్పినట్లు అన్ని విషయములందును మనము ఇంగ్లీషువారికంటెను పాశ్చాత్యులకంటెను భిన్నులము కాము. వారును మనమును మానవజాతిలో చేరిన వార మగుటచే వారికిని మనకును సాదృశ్యముకూడ నున్నది. ఇట్టి సాదృశ్యము సాధారణముగాఁ జేసికొని ఏర్పఱుపఁబడిన సిద్ధాంతము లన్నియు అనేకదేశములకును మనదేశమునకును వర్తించును. ఏసిద్ధాంత ము విషయమున ఇట్టి సాదృశ్యము లేదని మనము ఋజువు చేయఁగలమో, అట్టిదానిని మనము మనదేశీయ మనపరిస్థితుల కన్వయించు

వానిని మన మేర్పఱుచుకొనవచ్చును. కావున పైని చెప్పినయాక్షేపణములోని లోపాలోపములను నిర్ణయించునప్పుడు అర్థశాస్త్ర ములోని సిద్ధాంతము లన్నియు నొక్కజాతిలో చేరినవి కావనియు, వానిలో సత్యములు మానవు లందఱిలోఁగల సాదృశ్యములమూలమున నేర్పడిన వనియు మనము తెలిసికొనవలయును.

(౪) ఇట్టి వివేచన చేసినయెడల మన భరతఖండమున కంత కును వర్తించు అర్థశాస్త్ర మొకటి యున్న దని నిరూపించుటయు శక్యముకాదుగదా? భరతఖండమున ముప్పదికోట్లకుపైగా మనుష్యు లున్నారు. వీరందఱును మాత్రము ఒక్కటే స్వభావము గలవారా? వీరిలో వర్ణము, జాతి, ఆచారము, నీతి లోనగు విషయములనుబట్టి పరస్పరభేదములు లేవా? ఒకరాష్ట్రములోని పరిస్థితులకును, మఱి యొకరాష్ట్రములోని పరిస్థితులకును వ్యత్యాస ముండుట లేదా? ఇట్టి యెడల మన భారతదేశమున కంతకును వర్తించు అర్థశాస్త్రము సాధ్యమా? కావున మనుష్యులలో భేదములతోపాటు సాదృశ్యము లును ఉన్నవి గనుక అందఱకును వర్తించు అర్థశాస్త్రసిద్ధాంతముల నేర్పఱుచుటకు వీలు కల దనుటలో విప్రతిపత్తి లేదు.

(౫) అర్థవిషయమున మనుష్యుని చర్యలయందు సామాన్య ధర్మము లనేకము లున్న వని ఋజువుపఱుచుటకు సాధనము లనేక ములు కలవు. మనుష్యునిస్వభావమును పరిశీలించు మానసిక శాస్త్రము, అభిప్రాయభేదము లున్నప్పుడు సంగతి సిద్ధాంతమును గ్రహింపఁజేయు తర్కశాస్త్రము, మన అందఱియొక్క యనుభవము లోనగు సాధనములు చెక్కు గలవు. ఇదిగాక ఇట్టివిషయములను నిర్ణయించుటకై ప్రత్యేకముగ లెక్కలశాస్త్రము (Statistics) తయారుచేయఁబడుచున్నది. ఎగుమతులు దిగుమతులు, పదార్థముల ధరలు, ధరల ననుసరించి విక్రయముచేయఁబడు మొత్తములు, కూలివాండ్ర వేతనములు, వేతనములు మాఱినప్పుడు కూలివాండ్రసంఖ్యలో గలుగు చుండు మార్పులు, కుటుంబముల ఆదాయము, ఆదాయవినియోగము, గృహస్థుల ఖర్చులు — లోనగు లెక్కలను ప్రతిదేశమందును నీకాలమున ననుమార్చుచున్నారు. మనదేశమందుకూడ నిట్టిప్రయత్న ములు జరుగుచున్నవి. వీనిని తగురీతిని విమర్శించినయెడల ఏయే ప్రదేశములందలిమనుష్యు లెట్లెట్లు ప్రవర్తించుచున్నారో తెలిసికొను టకు సాధ్య మగుచుండును. కావున అర్థశాస్త్రసిద్ధాంతములు నిరా ధారములు కావనియు, ఖచితముగ నిట్టి లెక్కించుటకు అనువైన విషయముల సాహాయ్యమున నేర్పడిన వనియు చెప్పవచ్చును.

(౬) దీనినిబట్టి అర్థశాస్త్రము సంపూర్ణతను చెందిన దనియు, అందులో లోపములు లే వనియు చెప్పుట కెవ్వరును సాహసింపరు. ఏశాస్త్రమునుగుఱించియు నిట్లు చెప్పుటకు వీలు లేదు. మానవుని అనుభవమును ప్రజ్ఞయు పెరిగినకొలఁదియు ఒకప్పుడు గోచరింపని సత్యములు మఱియొకప్పు డతనికి గోచరించును. సాంఘికపరిస్థితుల యందు మార్పులు గలుగుటచే నూతనసిద్ధాంతముల నేర్పఱుపవలసి

మూల్యములబట్టి తరతమభేదములు నిర్ణయించుట అర్థశాస్త్ర లక్షణము. మందిపెద్దలకుఁ గల భేదములు మూల్యములబట్టి నిర్ణయింపఁజాలము. వెలగలపదార్థములు మంచి వనియు, తక్కువవెలగలవి మంచివికా వనియు చెప్పరాదు. ఒకబిందెడు శుభ్రమగునీళ్లు కానీకి లభించుచుండ ఒకబిందెడు కల్లునకు రెండుమూడురూపాయలు వియ్యవలెనుగదా?

పరమార్థములు గ్రహితము లైనపిమ్మటనే అర్థశాస్త్రకారులపని ప్రారంభ మగుచున్నది. 'పరమార్థము లిట్టివిగ నున్నప్పుడు అర్థవర్గములలోని సాధనములలో నెట్టిమార్పులు కలుగును? ఎట్టివాని నధికముగ నుత్పత్తి చేయుదురు? ఎట్టివానికి మూల్యము హెచ్చగును? దేనికి తగ్గును? ఎవరి ఆదాయములు పెంపొందును? ఎవరికి క్షయ మొందును? ఎట్టిపదార్థములకై ప్రజలు ఖర్చుపెట్టుచుందురు? దేనికై ప్రభుత్వము వారు ఖర్చుపెట్టెదరు?' అను విషయములను అర్థశాస్త్రకర్తలు విమర్శింతురు. ప్రజలయందు పౌరుషమును, కార్యోత్సాహమును, స్వార్థత్యాగమును, దేశాభిమానమును వృద్ధి యగుటకు యుద్ధము లుండవలయు ననునమ్మకము దేశమందు వాడుకలో నున్నప్పుడు ఇది ప్రశంసనీయమా గర్హణీయమా? అను వివాదముతో అర్థశాస్త్రమునకు సంబంధము లేదు. యుద్ధరంగమందలి విజయము మన పరమార్థమును సాధించుటకు ఫిరంగులు, మందు, గుండ్లు, విమానయానములు, శస్త్రములు, నౌకలు, ఆకాశయానములు, జలాంతర్గాములు లోనగు సాధనములు అధికములు కావలసియున్నవి. ఇవి అధికముగ లభించు అర్థవర్గములో చేరినవి. వీనిని తయారుచేయుటకు అధికముగ మూలధనము (Capital), మానవపరిశ్రమము (Labour) ఆవశ్యకములు. కాని ప్రజ లందరకును కావలసిన ఆహారపదార్థములు, వస్త్రములు, ఇండ్లు, విద్యాలయములు, చిత్రకళలు లోనగునవి యుత్పత్తి యగుటకైనను ఈయవలసిన మానవపరిశ్రమము ఆవశ్యకమై యున్నది. అధికములగు మూలధనాదులచేత యుద్ధమునకు కావలసిన సామగ్రులను, సాధారణప్రజలకు కావలసిన సామగ్రులను ఉత్పత్తి కావలసియున్నది. మొదటితరగతిలోని సామగ్రి యుత్పత్తి కావలసియుండుటచేత సామాన్యజనులకు కావలసినవాని నుత్పత్తి చేయుటకై కలయునట్టి మూలధనము మానవపరిశ్రమము తగ్గి వీని మూలమున నుత్పత్తి యగుసామగ్రుల పరిమాణముకూడ తగ్గును. ఆహారపదార్థములు వస్త్రములు ఇండ్లు లోనగునవి విరివిగ దొరకఁజాలక వానిఖరీదులు హెచ్చగును. దరిద్రులగువారు వానిని కొనలేక బాధపడుచుందురు. విద్యాలయములకు ద్రవ్యసహాయము తగ్గుటచే జీతము దక్కువ యగుటచే ఉపాధ్యాయులకుఁ గల గిరాకీ తగ్గి వారికి దొరకుజీతములు హీన మగును. చిత్రకారులను పోషింప ధనము చాలకపోవుటచేతను వారిజీవనమునంతయు దుర్భర మగును. అర్థోత్పత్తియందును, సాధనవినియోగమందును ఇట్టిమార్పులను సిద్ధపరచి యుద్ధములో విజయము గాంచుట పరమార్థమని తీర్మానించుకొనవలెను. యుద్ధమందలి యుత్సాహము మంచి యని కాని తప్పని కాని అర్థశాస్త్రము చెప్పఁజాలదు. సాధనవినియోగమందు యుద్ధములవలన నిట్టిమార్పులు కలుగు ననియు, ఇట్టిమార్పులు కలుగ ననియు చెప్పుటయే దానిపని. అది చేయవలసినపని మరి యొకటి కలదు. యుద్ధరంగమందలి విజయము మన పరమార్థముగ సాధింపఁదగిన తక్కిన అర్థములను సాధించుటలో సాధనములు (మూలధనము, పరిశ్రమము, ప్రకృతిసంపదలు) వ్యర్థము కాకుండ వినియోగింపఁదగినపద్ధతిని అది సూచింపగలదు. ఇట్లే మన మాశించు తక్కినపరమార్థములవిషయమునందును పరిశీలింపవలెను.

## అర్థశాస్త్ర విభజనము

అర్థశాస్త్రమును (అ) అనుభవకాండము, (ఆ) ఉత్పత్తికాండము, (ఇ) మూల్యనిర్ణయకాండము, (ఈ) ఆదాయవిభజనకాండము, (ఉ) వెలామణీద్రవ్యకాండము అని అయిదు భాగములుగ శాస్త్రకర్తలు విభజించియున్నారు. కాని ఆ యైదింటిలో మూల్యనిర్ణయకాండ మొక్కటియే ప్రధాన మనియు, తక్కిన వన్నియు గౌణాంగములవంటి వనియు చెప్పఁబడుచున్నది. "వస్తువులయొక్క మూల్యములందలి తారతమ్యమును బట్టియే ఆర్థికప్రపంచమునందు వానికిఁగల ప్రాధాన్యాప్రాధాన్యములు నిర్ణయింపఁబడుచున్నవి. అనుభవకాండమున విమర్శింపఁబడు 'ఉపయుక్తత'ను గురించిన సిద్ధాంతములును, ఉత్పత్తికాండమున విమర్శింపఁబడు 'వ్యయము'నకు సంబంధించిన సిద్ధాంతములును మూల్యనిర్ణయము చేయుటకై యుపకరించునవే కాని ప్రత్యేక మగు మఱియొక ప్రయోజనము కలవి కావు. ఆదాయవిభజనకాండమున పరిశ్రమములకు బదులుగ లభించునట్టి జీతములు అద్దెలువడ్డీలాభములను వచ్చు ఆదాయములను విమర్శింపఁబడుచున్నను, ఈజీతనములును, ఆదాయములును మూల్యనిర్ణయ సిద్ధాంతముల ననుసరించి యేర్పడునట్టివే, అందుచే నీకాండము మూల్యనిర్ణయకాండమందలి యంతర్భాగమే కాని ప్రత్యేకకాండము కాదు. ఇట్లే వెలామణీకాండమున వివరింపఁబడు 'ధరలు' వెలామణీ ద్రవ్యముయొక్క మూల్యమును నిర్ణయించునవే కాని వేఱొకటి కాదు. వెలామణీ ద్రవ్యముయొక్క మూల్యము హెచ్చుటయే ధరలు తగ్గుట, ఆమూల్యము తగ్గుటయే ధరలు హెచ్చుట. కనుక మూల్యనిర్ణయము నొక్కదానినే ప్రధానభాగముగ సంగ్రహించుట యుక్తము' ఇదియే ఆధునికుల వాదము. ఈవాదము సహేతుకముగ నున్నను పైని పేర్కొనఁబడిన కాండములకు ప్రత్యేకత్వము లేదనుట సమంజసము కాదు. వానిలో నొక్కొకదానియందును మూల్యనిర్ణయముతో దగ్గఱసంబంధము లేనివిషయములు చర్చింపఁబడుచున్నవి. కావున కాండము లైదని భావించుటయే మంచిది.

(ఈకాండములలో నొక్కొకదానినిగురించి ప్రత్యేకవ్యాసము లున్నవి. అందుచేత నొక్కొకదానియందు చర్చింపఁబడు ప్రధానవిషయములను మాత్రము ఇచ్చట సంగ్రహించి యున్నాము. అర్థశాస్త్రమందలి సిద్ధాంతము లెట్లుండునో తెలుపుటకు కొన్ని యుదాహరణములు ఇచ్చట వివరింపఁబడినవి.)

## (ఆ) అర్థానుభవకాండము

అర్థోత్పాదనకు అంతిమము ‘అనుభవము’ పరమావధి. విపరీతబుద్ధిగల లోభితప్ప తక్కినవా రందఱును అనుభవించుటకై అర్థము నుత్పత్తి చేయుచున్నారు. ఇందుకై మనుష్యుడు కోరుపదార్థముల సంఖ్యకు మితి లేదు. నాగరకత వృద్ధియైనకొలదియు కోర్కెల సంఖ్య వృద్ధియగుచుండును.

కాని మనము కోరెడి ఒక్కొకవస్తువునకును మితి యున్నది. మామిడిపండ్లపై ఒకనికుండు కోరిక ఒకటిరెండు తినినతర్వాత కొంత తగ్గును, మఱియొకటి తినినతర్వాత మఱికొంత తగ్గును, నాలుగైదు తినినతర్వాత కోరిక లేకపోవుటయేకాక విసుగుకూడ కలుగును. కోరికలను తీర్చుశక్తికే ఉపయోగ మని పేరు. ఎక్కువ తీక్ష్ణతగల కోరికను తీర్చుపదార్థము ఎక్కువ ఉపయోగము గలదనియు, తక్కువ తీక్ష్ణతగల కోరికను తీర్చుపదార్థము తక్కువ ఉపయోగము గలదనియు చెప్పవచ్చును. దీనినిబట్టి మొదటి మామిడిపండు ఎక్కువ ఉపయోగము గలదనియు, రెండవదాని యుపయోగ మంతకంటె తక్కువ యనియు, మూడవదాని యుపయోగము మఱింత తక్కువ యనియు, ఇట్లు పూర్వపూర్వఫలములకంటె ఉత్తరోత్తరఫలముల యుపయోగము తక్కువ యనియు స్పష్టమగుచున్నది. మామిడిపండు విషయమున చెల్లినట్టి ఈ న్యాయము మన మనుభవించు ప్రతిపదార్థము విషయమునను చెల్లుచున్నది. ఈ న్యాయమునకు క్షీణోపయోగ న్యాయము (సిద్ధాంతము — Law of Diminishing Utility) అని పేరు.

ఈసందర్భమున కొన్ని ముఖ్యములగు విషయములను మనము గమనింపవలసి యున్నది—

(౧) మనము ‘ఈపదార్థము కావలెను, ఆపదార్థము కావలెను’ అని చెప్పునప్పుడు నిజముగ మనకు కావలసియుండునది ఆపదార్థ మంతయు కాదు. ఆ పదార్థములోని కొన్ని మాత్రలు (Units = అంశములు, భాగములు) మాత్రమే మనము కోరుచున్నాము. నెయ్యి కావలసియున్న దనినప్పుడు కొన్ని వీసెలో కొన్ని మణుగులో కొన్ని పలములో కావలసియున్న దనియే అర్థము, బియ్యము కావలసియున్న దనినప్పుడు కొన్ని సేర్లో, కొన్ని కుంచములో కొన్ని బస్తాలో కావలసియున్న దనియే అర్థము. పదార్థముయొక్క స్వభావమును బట్టి మన మందులోని కొన్ని మాత్రలను (వీసెలు, కుంచములు, డజన్లు, గజములు) మాత్రమే కోరుచుందుము. మన మొక పదార్థమును వాడునప్పుడును, అనుభవించునప్పుడును, కొనునప్పుడును ఆ పదార్థమందలి కొన్ని మాత్రలను వాడుచున్నామనియు అనుభవించుచున్నామనియు కొనుచున్నామనియు గ్రహింపవలెను.

(౨) పదార్థములవలన మనకు గలుగు నుపయోగము రెండు విధములుగ పరిగణింపబడవలసియున్నది. మొదటిది వానియొక్క మొత్తపు ఉపయోగము; రెండవది దాని ‘కడపటి’ యుపయోగము. మన మనుభవించు పదార్థమందలి మాత్రలన్నిటిమూలమునను మనకు లభించు ఉపయోగము మొత్తపు ఉపయోగము; అందులో ‘కడపటి మాత్ర’ మూలమున మనకు లభించు ఉపయోగము ‘కడపటి యుపయోగము’. రెండు మామిడిపండ్లలో రెండవది ‘కడపటి’ది, దానినుండి లభించు ఉపయోగము ‘కడపటి యుపయోగము’. మూడుపండ్లలో మూడవదానినుండి లభించు ఉపయోగము ‘కడపటియుపయోగము’. నాలుగుపండ్లు తినునప్పుడు నాల్గవపండువలన లభించు ఉపయోగము ‘కడపటి యుపయోగము’. రెండుపండ్లు తిన్నప్పుడు మొదటిపండువలన లభించు ఉపయోగమును, రెండవపండువలన లభించు ఉపయోగమును కలుపుటచేత వచ్చుఫలితము రెండుపండ్లవలన లభించు ‘మొత్తపు ఉపయోగము’. అట్లే మూడుపండ్లు తినునప్పుడు మొదటిపండువలని ఉపయోగము, రెండవదానివలని ఉపయోగము, మూడవదానివలని ఉపయోగము — ఈమూటిని కలుపుటవలన లభించునదియే మూడుపండ్ల ‘మొత్తపు ఉపయోగము’. ఇట్లే తక్కినపదార్థములవిషయమునగూడ గ్రహించునది.

(౩) ‘క్షీణోపయోగన్యాయము’ నందు క్షీణించుచున్న దని చెప్పబడిన ‘ఉపయోగము’ ‘కడపటియుపయోగము’ గాని ‘మొత్తపు ఉపయోగము’ కాదు. ఒకనియొద్ద నుండు పదార్థపుమాత్రలు (పదార్థపుమొత్తము) అధికముకాను కాను దానియొక్క కడపటియుపయోగము క్షీణించుచువచ్చు ననియే ఈ న్యాయముయొక్క అర్థము, కాని మొత్తపు ఉపయోగము క్షీణించు నని కాదు. మొత్తపు ఉపయోగము వృద్ధి యగుచునే యుండును. ఈక్రింది యుదాహరణము దీనిని స్పష్టపఱచుచున్నది.

| పండ్లమొత్తము (మాత్రలమొత్తము) | కడపటిఉపయోగము | మొత్తపు ఉపయోగము |
|---|---|---|
| ౧ | ౨౦ అంశములు | ౨౦ అంశములు |
| ౨ | ౧౮ ,, | ౩౮ ,, |
| ౩ | ౧౫ ,, | ౫౩ ,, |
| ౪ | ౧౦ ,, | ౬౩ ,, |
| ౫ | ౫ ,, | ౬౮ ,, |
| ౬ | ౧ ,, | ౬౯ ,, |

(౪) ‘కడపటియుపయోగము’ నకు మఱియొకవిధమున నిర్వచనము చేయవచ్చును. ఒకపదార్థముయొక్క మాత్రలు కొన్ని ఒకనియొద్ద నున్నప్పుడు వానిలోనుండి యొకమాత్ర లోపించినయెడల వానికి నష్టమగు నుపయోగమునకు ‘కడపటియుపయోగము’ అని పేరు. రెండుపండ్లనుండి యొకపండు లోపించినయెడల నష్టమగు నుపయోగము ౧౮ అంశములు (రెండవపండు = కడపటిపండువలన కలుగు ఉపయోగము). మూడుపండ్లనుండి యొకపండు లోపించినయెడల నష్టమగు నుపయోగము ౧౫ అంశములు. ‘కడపటిమాత్ర వలన లభించు ఉపయోగము కడపటియుపయోగము’ అనుటయు ‘మొత్తపు మాత్రలలోనుండి యొకమాత్ర లోపించినప్పుడు నష్టమగు ఉపయోగము కడపటియుపయోగము’ అనుటయు ఒక్కటే.

# అర్థశాస్త్రము

మను అర్థమును చేకూర్చలేకపోయెను. పాశ్చాత్య దేశములందు ఈకాలమున ఈ విషయములో మనుష్యప్రవర్తనము విపరీతముగ నున్నదని అనేకులు తలంచుచున్నారు. అప్పటివారిలో పలువుల ఆదాయము మిక్కిలి అధికముగ నుండుటచేత ధనమును కూడబెట్టుట చాల సులభముగ నున్నది కాని కూడబెట్టినదాని నంతయు భావికాలమందు వినియోగించు నవసరము వారికి లేదు. కూడబెట్టినధనమును ఖర్చుపెట్టుటకు కావలసిన ఉపాయములను వారు వెదకుచున్నారు.

మితసాధనములనుండి అధికతమ మగు ఉపయోగము(Maximum utility) లభించునట్లు వినియోగవిధానము నేర్పరచుటకే 'అనుభవకాండము' గాని ప్రధానవిషయ మని చదువరులు గ్రహింతురుగాక.

## ఆ ఉత్పత్తికాండము

ఉత్పత్తికాండమందలి విషయము లీవిధముగ నుండును (౧) అర్థోత్పత్తి యనిన క్రొత్తయుపయోగముల నుత్పత్తి గావించుటయే కాని క్రొత్తపదార్థముల నుత్పత్తి చేయుట కాదు. కొయ్యను మంచముగాఁ జేసినపుడు వడ్రంగి దానియొక్క రూపమును మార్చి అదివఱకు దానికి లేని ఉపయోగము నిప్పుడు కల్పించుచున్నాఁడు. వస్తువున కదివఱకు లేని యుపయోగమును క్రొత్తగ కల్పించుటయు, అదివఱ కుండిన అల్పోపయోగమును అధికోపయోగముగాఁ జేయుటయు అర్థోత్పత్తి. వస్తువుల రూపమును మార్చియే కాక అవి దొరకు ప్రదేశములను కాలములను సైతము మార్చి వానికిఁగల యుపయోగములను వృద్ధి చేయవచ్చును. వర్తకులు చేయుపని ఇట్టిది. కావున రూపములను మార్చు వడ్రంగులు, సాలెవాండ్రు, కుమ్మరులు, కంసాలులు లోనగువారే కాక వర్తకులునూడ అర్థోత్పత్తి చేయువారే (౨) అర్థోత్పత్తిచేయువాఁడు మనుష్యుఁడు. అందరికి ప్రకృతిసంపదయు మూలధనమును సాహాయ్యము చేయుసాధనములు. భూమి, గనులు, అడవులు లోనగునవి ప్రకృతిసంపదలు, ఇవి మనుష్యుని పరిశ్రమమువలనఁగాక స్వతస్సిద్ధముగ నుండునవి. కర్షకులు ఉపయోగించు నాఁగలి, గొడ్డలి, రాట్నము, మగ్గము, బండ్లు, యంత్రములు లోనగు పరికరములు మూలధనములోనివి. ఇవి స్వయముగ మనుష్యుని కోరికలను నెఱవేర్పక కోరికలను నెఱవేర్పు ధాన్యాదుల నుత్పత్తిచేయుటయందు సాహాయ్యపడునవి యగుటచేత మూలధన మని యనిపించుకొనుచున్నవి. పురుషకారము(మనుష్యుఁడు), ప్రకృతిసంపద, మూలధనము ననునీమూఁడును అర్థోత్పత్తికి మూలసాధనములు కావున వీనికి సాధనత్రయమను పేరు చెల్లుచున్నది (౩) దేశమునం దుత్పత్తి యగు మొత్తపు అర్థము (Total Wealth) నిర్ణయించు అంశములు ఈసాధనత్రయమునకు సంబంధించి యున్నవి. దేశములోని మొత్తపు జనసంఖ్య, వారిలో అర్థోత్పత్తియందు పాటుపడువారి సంఖ్య, పాటుపడువారి శక్తిసామర్థ్యములు తెలివితేటలు, వారివారి వృత్తులయందు నేర్పు గలవో అప్పటిలో పని చేయుచుండుట — ఇవన్నియు కలసి ఒక అంశముగ చేర్పబడుచున్నవి. ఇవి పురుషకారమునకు సంబంధించినవి. ప్రకృతిసంపదలు, వానియొక్క సారత రెండవ అంశములో చేరినవి. దేశములో అర్థోత్పత్తికై యుపయోగించు మూలధనముయొక్క పరిమాణము, అందులో చేరిన పరికరముల ప్రాశస్త్యము — ఇవి మూఁడవ అంశముగ చేర్పబడుచున్నవి. ఈ మూఁడు అంశములును గాక నాల్గవ అంశము మఱియొకటి యున్నది. సాధనత్రయసంయోగముమూలమున అర్థోత్పత్తి యగుటచేత సంయోగవిధానముయొక్క రీతినిబట్టి అర్థోత్పత్తియందలి అల్పానల్పములు నిర్ణీతము లగుచున్నవి. కొన్నివిధము లగు సంయోగములవలన అర్థోత్పత్తి అధికమగును, మఱికొన్నిటివలన అల్పమగును. (౪) జననమరణములవలఁగల భేదములను బట్టి దేశములోని జనసంఖ్య నిర్ణయింపఁబడుచున్నది. జననముల సంఖ్య అధికముగ నుండుదేశములలో మరణములసంఖ్యయు అధికముగ నుండును. ఈసంఖ్యలలో దేశదేశములయందలి భేదములకుఁగల కారణములు ఉత్పత్తికాండమున విమర్శింపఁబడును. జనసంఖ్యలో పాటుపడువారిసంఖ్య కొన్నిదేశములయం దధికముగను కొన్నిదేశములయం దల్పముగను ఉండును. అట్లే వారిశక్తిసామర్థ్యములందుఁగూడ భేదము లగపడుచున్నవి. కొన్నిదేశములవారు వారార్జించినధనములో చాలభాగమును కూడబెట్టుచుందురు, మఱికొన్నిదేశములం దట్లు జరుగుట లేదు. ఈభేదములకుఁగల కారణములుగూడ ఉత్పత్తికాండమందు విమర్శింపఁబడును. (౫) అర్థోత్పత్తియం దొకదేశముకంటె మఱియొకదేశము ఉచ్చస్థితియం దున్నదో లేదో నిర్ణయించుటయందు పరిశీలింపవలసినవిషయము ఏదేశము నుత్పత్తియగు మొత్తపు అర్థము కాదు, సరాసరిని దేశమందలి యొక్కొకవ్యక్తియు నుత్పత్తిచేయు అర్థమే. ఈసందర్భమున ముఖ్యమైనది. ఇట్లు లెక్క చేసినచో ఇంగ్లండు అమెరికాదేశములు ఉన్నతస్థితియం దున్నట్లును, మనదేశము హీనస్థితియం దున్నట్లును స్పష్టమగుచున్నది. దేశమందలి జనసంఖ్య హెచ్చుగ నున్నది యని కొందఱును, హెచ్చుగ లేదనియు మఱియెంత హెచ్చినప్పటికిని ప్రమాదము లేదనియు కొందఱును వాదించుచుందురు. ఈవాదములలో మనము గమనింపవలసినవిషయము మొత్తపు అర్థము కాదు, సరాసరిని ఒక్కొకవ్యక్తియు నుత్పత్తి చేయుచుండు అర్థము. ప్రస్తుతపు పరిస్థితులలో జనసంఖ్య కొంచెము తగ్గుటవలన ఈసరాసరి ఆదాయము (Average income) హెచ్చునట్లుండునెడల ఇప్పు డుండుజనసంఖ్య హెచ్చనియే చెప్పవలెను, అట్లుగాక జనసంఖ్య కొంచెము తగ్గుటవలన సరాసరి ఆదాయము తగ్గునెడల ఇప్పు డుండుజనసంఖ్య హెచ్చు కాదనియే చెప్పవలెను (౬) సంయోగవిధానములందు ఒకదేశమునకును మఱియొకదేశమునకును ఎన్నియో భేదము లుండవచ్చును. వీనిలో వ్యవహారభాగాంశ్యము, వ్యవహారమున పని చేయుచుండువారిలోఁగల పరస్పరసంబంధములు, వ్యవహారమును నడుపుటకు కావలసిన స్వాతంత్ర్యములు ననునీమూఁడును ముఖ్యములు. కొందఱు రైతులు రెండు మూఁడెకరములభూమిని సాగు చేయుచుందురు; మఱికొందఱు

ఖండములోఁ గలది దేశకరములను, కొందఱు వేలకొలది దిగుమతులను సాగు
చేయుచుందురు. కావున కొందఱు వర్తకుల వ్యవహారము స్వల్పముగను,
మఱికొందఱియొక్క వ్యవహారము బాహుళ్యముగను ఉన్నది. వ్యవ
హారము బాహుళ్యముగ నుండుటకు దోహదమగు నిమిత్తములు ఉండు
మూలధనము, ప్రకృతిసంపద, పనివాండ్రసంఖ్యయు, అతఁ డుత్పత్తి
చేయుపదార్థముల సముదాయమును అధికముగ నుండుట మొదలగు
నీతిగాండ్రకును, మిల్లులఁ బెట్టి బట్టల నేయించుచు జమానులకును ఇట్టి
భేదము కలదు. వ్యవహార బాహుళ్యము సాహాయ్యకారియా కాదా?
ఎట్టి యర్థోత్పత్తికి బాహుళ్య మావశ్యకము? బాహుళ్య మధికము
కాఁగా కాఁగా కొన్ని పదార్థములవిషయమున నుత్పత్తి చేయుట కగు
పరాపరిశ్రమ తగ్గి పదార్థము చౌక యగును. కొన్నిటియం
దట్లుండదు. ఒక పదార్థమువిషయమునఁగూడ ఒకహద్దు దాఁటువఱ
కును బాహుళ్య మధికమగు చౌకతనమునకు హేతు వగుచును,
అది దాఁటినతర్వాత బాహుళ్యము హెచ్చుగ చౌకతనము లేకుండు
టయు సంభవించుచున్నది. సామాన్యముగ మనదేశమందలి వ్యవహార
ములు అల్పములుగ నున్నవి, పాశ్చాత్యదేశములోని వ్యవహారములు
బాహుళ్యములుగ నున్నవి. (౬) ఉత్పత్తికాంశములలో సిద్ధాంతము
లలో ముఖ్యము లైనవి వ్యవహార బాహుళ్యమునకు సంబంధించినవి.
వ్యవహారము బాహుళ్యము కాఁగా కాఁగా ఉత్పత్తి యగు పదార్థము
చౌకగ నుండినయెడల నట్టి వ్యవహారము అధికవృద్ధిన్యాయము ననుస
రించి యుండునని (Law of increasing returns), బాహు
ళ్యము అధికము కాఁగా కాఁగా ఉత్పత్తియగు పదార్థము గారాబ మగు
చుండినయెడల నట్టి వ్యవహారము క్షీణవృద్ధిన్యాయము (Law of
Diminishing Returns) ననుసరించి యుండు ననియు, బాహు
ళ్యము కాఁగా కాఁగా ఉత్పత్తియగు పదార్థము చౌక యగుగాక గారాబ
మగుగాక యథాప్రకారముగ నుండునెడల నట్టి వ్యవహారము సమ
వృద్ధి న్యాయము (Law of Constant returns) ననుసరించి
యుండు ననియు చెప్పుచుందురు. ఈ న్యాయములకును, అనుభవకాండ
మందలి క్షీణోపయోగన్యాయమునకును కొంత సామ్యము కలదు.
(౭) ప్రతివ్యవహారమందును పాలుగొనువారు కొన్ని పనులు చేయవలసి
యున్నది. వ్యవహారమునం దుత్పత్తియగు పదార్థమును ఎంత అధిక
ముగ నుత్పత్తిచేయవలసినదియు, దాని నెచట పెట్టి క్రయమునకు
విక్రయింపవలసినదియు, అందులకు కావలసిన సాధనముల నేరీతిగ
సమకూర్చవలసినదియు నిర్ణయించుట మొదటి పని. ఈ నిర్ణయములఁ
బట్టియే వ్యవహారమూలమున వచ్చు లాభనష్టములు నిర్ణయమగును.
లాభనష్టములను భరించువారెవరిదియో వారే వ్యవహారమునకు
యజమాని యని చెప్పఁబడుదురు. యజమాని ఒకఁడుగ నుండ
వచ్చును, లేదా ఇద్దఱుముగ్గురు భాగస్వాములు కలసి లాభనష్టములను
భరించవచ్చును; లేక వందలకొలది మనుష్యు లందఱు కలసి
వచ్చును. ప్రస్తుతకాలమున కంపెనీవ్యవహారములలో (Joint-
stock Companies) అనేకులు లట్టి లాభనష్టములను భరించు

ష్టాచీ వహించుటయేగాక, వ్యవహారమందలి వివరములు సన్నిహిత
ముగ్గా నడపువారు కొంద ఱుండవలెను. అట్టివారికి నియంత లని
పేరు (Directors). వారి యుత్తరువుల ననుసరించి సెలవీయములను
పుచ్చుకొని పని చేయువారు రకరకము లుందురు. విచారణదార్లు, గుమా
స్తాలు, కూలివాండ్రు ఇందులోఁ జేరినవారు. వీరుగాక, వ్యవహార
మునకుఁ గావలసిన ప్రకృతిసంపదలను సప్లైచేయు భూస్వా
ములు కొందఱును, మూలధనమును ఋణముగ నిచ్చువారు కొందఱును
ఉందురు. ఒకవ్యవహారము జయప్రదముగ జరగవలయు ననిన (౧)
లాభనష్టముల ననుభవింప సిద్ధపడియుండుట, (౨) వివరముల నేర్ప
ఱుచుట, (౩) వాని ననుసరించి నిర్ణీతములగు పనులను చేయుట,
(౪) కావలసిన భూమి మొదలగు ప్రకృతిసంపదలను సరఫరా
చేయుట, (౫) ఋణము లిచ్చుట — అను వివిధములగు పనులను
చేయవలసియున్నది. ఈపనుల నన్నిఁటిని ఒకఁడే చేయుచుండ
వచ్చును, లేక కొన్ని పనులను ఒకఁడును, మఱికొన్నిఁటిని మఱియొకఁ
డును చేయుచుండవచ్చును, అట్లుగాక ఒక్కొకవిధమగు పనిని
ఒక్కొకఁడు చేయుచుండవచ్చును. సొంతభూమిని సొంతముగ (కూలి
వాండ్రను పెట్టుకొనక) సొంతపరికరములతో (ఒకరియొద్ద ఋణము
తీయక, తాను కూడఁబెట్టినమూలధనముతో) సాగు చేయు రైతు
లనేకు లున్నారు, ఇతరులభూమిని సొంతముగ సొంతపరికరములతో
సాగుచేయు రైతులు మఱికొంద ఱున్నారు, భూమియు పరిశ్రమ
మును సొంతములుగ నుండి, మూలధనముమాత్రము సాహుకార్ల
యొద్ద ఋణము తీసి సాగు చేయు రైతులు కొంద ఱున్నారు.
సొంతముగ నేదియు లేక, ఇతరులభూమిని కూలివాండ్రసాయము
చేతను, ఇతరులయొద్ద ఋణముగ తీసికొనిన మూలధనముచేతను
సాగుచేయువారు కొందఱు కలరు. ఇట్లే వ్యవసాయము కాక తక్కిన
పరిశ్రమములందు రకరకములగు సంయోగవిధానము లున్నవి. గొప్ప
గొప్ప మిల్లులను పెట్టి వేలకొలఁది పనివాండ్రచే పని చేయించు యజ
మాను లున్నారు. కావున యజమానులకును నియంతలకును వేతనము
లను పుచ్చుకొని పనిచేయువారికిని, భూస్వాములకును, మూలధనము
నిచ్చువారికిని ఎట్టిపరస్పరసంబంధ ముండినయెడల ఉత్పత్తియగుసరుకు
అధికతమముగ నుండును? ఈకాలమున విస్తారముగ మూలధన ముండినఁ
గాని ఏపరిశ్రమను స్థాపించుటకును వీలు కలుగుట లేదు. ధనోత్పత్తికి
పురుషకారము కావలసియున్నను మూలధనము లేని పురుషకారము
వ్యర్థ మగుచున్నది. మూలధన మున్నవాఁడు ఎట్టివ్యవహారము నైనను
చేయఁగలిగియున్నాఁడు. అట్టివారే వ్యవహారముల కంతకును యజ
మానులుగ నుండి కూలివాండ్రచేత ఇష్టమువచ్చినపనిని ఇష్టము వచ్చి
నట్లు చేయింపఁగలిగియున్నారు. అందుచేతను ప్రస్తుతకాలమునకు
'మూలధనప్రయుగము' (Age of Capitalism) అను పేరు సార్థక
మగుచున్నది. వ్యవహారములో చేరి యుండువారికిఁ గల పరస్పర
సంబంధము తృప్తికరముగ లేకపోవుటచేతనే పాశ్చాత్యదేశములం
దప్పుడప్పుడు కూలివాండ్రు సమ్మెకట్టి పనిచేయుట మానుటయు, యజ

మానులు పనివాండ్ర వందలకు ఒకొక్కండు పనిఉండి తొలగించు టయు సంభవించుచున్నది. ఇవిగాక దారులకును రైతులకును అభి ప్రాయభేదము లీకారణముచేతనే కలుగుచున్నవి. సొంతదారే భూమిని సాగుచేయుట మంచి దనియు, సాగుచేయువాండే భూస్వామిగ నుండ వలెననియు కొందఱు వాదించుట కిదియే కారణము (౯) వృత్తిస్వా తంత్ర్యము ప్రస్తుతకాలమునకు అనుగుణముని ఇదివఱలో నూదించఁ బడెను కాని అధికముగ నుండుటచేయుచున్న అమెరికా, జర్మని, ఇంగ్లండుదేశములందు వృత్తిస్వాతంత్ర్యమును నిరోధించుటకై అనే కములగు ఏర్పాటులు కావింపఁబడుచున్నవి. వీనిలో కొన్ని ప్రభు త్వమువారి శాసనసమ్మతములు, కొన్ని ప్రభుత్వమువారితో సంబంధము లేనివి. ఏదైనపదార్థము కొకదాని నుత్పత్తి చేయువారిలో ననేకులు ఒకవిధముగ తమలో తాము కట్టుగట్టి పైనుండువారెవరైన నావృత్తిలో ప్రవేశింపఁదలఁచినప్పుడు వారికి అడ్డు తగిలి, వారిని ప్రవేశింపకుండఁ జేయుట సాధారణ మగుచున్నది. ఇందుమూలమున అనేకపదార్థ ములయుత్పత్తి 'బహుముఖము' గాక, 'ఏకముఖ' మగుచున్నది. 'బహుముఖము' అనఁగా ఒకపదార్థమును అనేకు లుత్పత్తి చేయుట 'ఏకముఖము' (Monopoly), అనఁగా దానిని ఒకరే యుత్పత్తి చేయుట. అనేకులు ఉత్పత్తి చేయునప్పుడు వారిలో వారు పోటీపడు టయు, వారికిఁగల నైపుణ్యము చూపి పదార్థము చౌకగ దొరకు నట్లు గావించుటయు సహజము. 'ఏకముఖము'గ నుత్పత్తి యగు నప్పుడు వృత్తినిరోధము కలుగుటచేతగాక పదార్థము గాయకముగ నుండుటయు కలదు. అయినను కొన్ని పదార్థములను 'ఏకముఖము'గ నుత్పత్తి చేయుటయే లాభకరముగ నుండును. ఎట్టిపదార్థములవిషయ మున నట్టిలాభము కలుగునో పరిశీలింపవలసియున్నది. మనదేశమున ఉప్పు, నల్లమందు, కల్లు, సారాయి మొదలగునవి ప్రభుత్వమువారే యుత్పత్తి గావించుటయో, లేక వారిశాసనములకు బద్ధులైనవా రుత్పత్తి గావించుటయో జరుగుచున్నది. 'ఏకముఖోత్పత్తి' లాభ కర మని స్పష్టమైనయెడల అట్టిపని ప్రభుత్వమువారే చేసిన బాగుగ నుండునా? లేక వ్యక్తులకు వదలిపెట్టుట మంచిదా? అనువిషయము ఆలోచింపవలసియున్నది. (౧౦) ప్రస్తుతకాలమందు అర్థోత్పత్తి కింకొకలక్షణము కలదు. అనేకులు వా రుత్పత్తి చేయువస్తువులను స్వానుభవమునకుఁ గాక పరులకు విక్రయించు నుద్దేశముతో నుత్పత్తి చేయుచున్నారు. ఇది క్రొత్తలక్షణము కాదుగాని పూర్వము కంటె నిప్పు డిది యెక్కువగ వ్యాపించియున్నది. వేరుసెనగ, జనుము, నీలి, ప్రత్తి, మిరపకాయలు, నువ్వులు లోనగువానిని పండించురైతు లిట్టివారు, తక్కిన ధాన్యమును పండించు రైతు లలో ననేకులు పండినదాని నంతయు స్వానుభవమునకుఁ బెట్టుకొనక, కొంతభాగమునైనను విక్రయించుచుందురు. వ్యవసాయేతర వృత్తులు గాక పాటకవృత్తుల (Manufactures) నవలంబించిన సాలె వాండ్రు, వడ్రంగులు లోనగువారు వారు తయారుగావించిన పదార్థముల నన్నింటిని విక్రయింపవలసి యున్నది. కావున క్రయవిక్రయములకు కావలసిన సదుపాయము లీకాలమున పూర్వము కంటె నెక్కువ ప్రాధాన్యమును గాంచియున్నవి. మన రైతులలో ననేకులు వ్యవసాయము చేయుటయందు నెక్కువ శ్రద్ధను చూపిందువా రైనను తా ముత్పత్తి గావించునవరుకులను విక్రయించు విషయమున వెనుకఁబడియున్నారు. తాము తయారుచేసిన సామానులను వివిధ విక్రయించుటకై కొట్లకొలఁదిద్రవ్యము నీకాలమున ప్రకటనలకు (Advertisements) గాను అనేకులు ఖర్చుపెట్టవలసి యున్నది. సామానుల సుగుణములను లోకమునకు ప్రకటించుట ముఖ్యమగు కళలలో నొకటిగ నీకాలమునం దున్నది. ఉత్పత్తి చేయువారికంటె వ్యాపారముచేయు వర్తకులసంఖ్య హెచ్చుగుటకుకూడ నిదియే కార ణము. రోడ్లు, కాలువలు, ఇనుపదారులు, స్టీమర్లు, ఆకాశయాన ములు, తపాలాతంతియేర్పాటులు — ఇవి యన్నియు నత్యావశ్యకము లగుచున్నవి (౧౧) మనకు కావలసిన పదార్థము లన్నియు మన దేశమం దుత్పత్తి యగుట లేదు, మన ముత్పత్తిచేయు పదార్థము లన్ని టికి మనదేశమున గిరాకి యుండుటలేదు కావున, విదేశములం దుత్పత్తి యగు వస్తువులను కొనవలసిన అవసరమును, మన వస్తువులను విదేశములందు అమ్మవలసిన అవసరమును కలుగుచున్నవి. ఇట్టి క్రయ విక్రయము లెప్పుడు లాభకరములో, ఎప్పుడు నష్టదాయకములో నిర్ణయింపవలెను. మనము విదేశవస్తువులను కొనుట మానినయెడల, విదేశములవారు మనవస్తువులను కొనుట మానెదరు (౧౨) మనదేశ మం దిప్పు డుత్పత్తి యగు ధన సముదాయము చాల తక్కువగ నున్నది. దారిద్ర్యబాధ హెచ్చుచున్నది. జనసంఖ్యయందును, పాటుపడువారిసంఖ్యయందును, పాటుపడువారి శక్తిసామర్థ్యము లందును, మూలధనమును వృద్ధిచేసికొనుటకు కావలసిన యవకాశము లందును, ప్రాచీనకాలపు పరికరములను మాని లాభకరములగు యంత్ర ముల నుపయోగించుటయందును, సాధనత్రయ సంయోగ విధానము లందును మనము చేసికొనవలసిన మార్పు లనేకము లున్నవి. వీనిలో నెట్టివి వ్యక్తుల (Individuals) యుక్తాయుక్త పరిజ్ఞానమువలన జరుగఁగలవో, ఎట్టివి జరుగుటకు ప్రభుత్వమువారి సాహాయ్యము అవ శ్యకమో నిర్ణయింపవలెను. మనకంటె నెంతయో వెనుకఁబడియున్న రష్యాదేశము గడచిన పదిసంవత్సరములలో నెంతయో ముందునకు వచ్చుటకు ప్రభుత్వమువారి సాహాయ్యమే కారణము (పైని చేర్కొనిన పంద్రెండు విషయములను గూర్చి వివరములు తెలిసి కొనఁగోరువారు 'ఉత్పత్తి', 'జనసంఖ్య', 'మూలధనము', 'ప్రకృతి సంపద', 'విదేశవ్యాపారము' లోనగు విషయములను గూర్చిన ప్రత్యేకవ్యాసములను చదువునది)

## ఇ. మూల్యనిర్ణయకాండము

మూల్యనిర్ణయకాండమునందలి విషయము లీక్రిందివిధముగ నుండును (౧) ఈకాలమున పదార్థములలో ననేకములు స్వాను భవమునకుఁగాక వినిమయమునకై యుత్పత్తి గావింపఁబడుచున్న వని తెలిసియున్నది. ప్రతిమనుష్యుఁడును తనకు కావలసినవస్తువుల

మన్నటిని తానే యుత్పత్తి చేసికొనుట లేదు. ఏపదార్థ ముత్పత్తి చేయుటయందు తన కెక్కువగ నేర్పును, అభిరుచియును, వసతులును గలవో ఆపదార్థము నుత్పత్తి చేసి, దాని నితరుల కిచ్చి వారియొద్ద నుండి తనయవసరమునకు కావలసినవస్తువులను సంపాదించుట ప్రస్తుత కాలపులక్షణ మని లోగడ చెప్పఁబడియున్నది. 'తా నిచ్చుపదార్థమునకు బదులుగ నితరవస్తువులు ఎంత పాళముగ లభించును' అనునది ప్రతిమనుష్యునికిని చాల ముఖ్య మైనవిషయము. ఈ పాళముక్కు మధిక మైనకొలది అతనిస్థితి బాగుగ నుండును; లేనియెడల నది చాల విచారకరముగ నుండును. వినిమయము గావించినపుడు ఒక పదార్థమునకు బదులుగ లభించు మఱియొకపదార్థముయొక్క పాళముక్కే మొదటిదానిమూల్యము. ఒకసేరు బియ్యమునకు బదులు రెండుసేర్ల ఉప్పు దొరకినయెడల సేరుబియ్యపుమూల్యము రెండుసేర్ల ఉప్పు అని చెప్పుదుము. (౨) ఒకసేరు బియ్యముయొక్క మూల్యము రెండుసేర్ల ఉప్పుగను, ఒకసేరునెయ్యియొక్క మూల్యము ఇరువదిసేర్ల ఉప్పుగను, ఒకసేరు మాసెయొక్కమూల్యము పదిసేర్ల ఉప్పుగను ఉండును. అట్టిసందర్భములో బియ్యముయొక్క మూల్యము తక్కువ యనియు, మాసెయొక్కమూల్యము అంతకంటె నెక్కువ యనియు, నెయ్యియొక్కమూల్యము మఱింత యెక్కువ యనియు చెప్పుదుము. కొన్నివస్తువులమూల్యము ఎక్కువగ నుండుటకును, కొన్నిటియొక్కమూల్యము తక్కువగ నుండుటకును గలకారణములను వివరించుటయే మూల్యనిర్ణయకాండమం దర్థశాస్త్రకారులు చేయు పని. (౩) వినిమయముయొక్క యుద్దేశము మనదగ్గఱ నుండుపదార్థము నిచ్చి మనకు కావలసిన పదార్థములను సంపాదించుట యైనను ఈకాలమందు పదార్థములను పదార్థాంతరములతోఁగాక చెలామణి ద్రవ్యము (Money)నకై మనము వినిమయము చేయుచున్నాము. ధాన్యమును పండించురైతునకు కావలసినది ఉప్పు, మిరపకాయలు, చింతపండు, నెయ్యి, మాసె, బట్టలు లోనగునవి; కాని, సాధారణముగ వీనిలో దేనికిని కూడ ధాన్యము నిచ్చి సంపాదించుట లేదు. తన దగ్గఱ నుండుధాన్యమును రూపాయలలోనికి మార్చుకొని, ఆరూపాయలతో తనకు కావలసిన వస్తువులను కొనుట సర్వసాధారణము. వినిమయముయొక్క యుద్దేశమునకు కరముగ నెఱవేరుటకై మనుష్యుఁడు కనుఁగొనినసాధనమే ఈచెలామణిద్రవ్యము. మనరూపాయ వస్తువుయొక్క మూల్య మనఁగా దానికి బదులుగ లభించురూపాయ లనియే మనము సామాన్యముగ చెప్పుదుము. బదులుగలభించురూపాయలే కాక, అట్లు లభించు ప్రతివస్తువుయొక్క మొత్తమునకును 'మూల్యము' అనుపేరు సార్థక మగుచున్న దని పైని చెప్పఁబడియున్నది. కావున నొకవస్తువునకు బదులుగ వచ్చురూపాయలమొత్తమునకు వేఱొకపేరు నుండిన బాగుండు నని యెంచి, దానికి అర్థశాస్త్రకారులు 'క్రయము' అని నామకరణము చేసియున్నారు. 'క్రయము'కూడ 'మూల్యమే'; కాని చెలామణిద్రవ్యముమూలమున వ్యక్తమగుమూల్యము క్రయ మని చెప్పఁబడుచున్నది. మూల్యమునకును క్రయమునకును మఱియొక్క విధమగు భేదము లేకపోవుటచేత 'మూల్యనిర్ణయము' అన్నను 'క్రయనిర్ణయము' అన్నను ఒక్కటి యనియే మనము గ్రహింప వచ్చును. ఒకవస్తువుయొక్క క్రయము అధికముగను, మఱియొక దానియొక్క క్రయము అల్పముగను ఉండుటకుఁగల కారణములను కనుఁగొనుటయే మనము చేయవలసినపని. పదిరూపాయ లిచ్చిన యెడల బస్తాబియ్యము దొరకుచున్నది. బియ్యము లభింపనియెడల మన ప్రాణములు నిలువఁజాలవు. కాని వందలకొలఁదిరూపాయల నిచ్చినఁగాని వజ్ర మొకటి లభింపదు. ప్రాణము నిలుపుట కావశ్యక మైన బియ్యముయొక్క క్రయ మింత తక్కువగ నుండుటకును, అంతటి గొప్ప యుపయోగము లేనట్టి వజ్రముయొక్క క్రయ మంత అధికముగ నుండుటకును కారణ మేమి? (౪) ప్రతి వినిమయమునకును రెండుపక్షములవా రుండవలెను. ఒకపక్షములోనివారు కొనువారు (క్రేతలు), రెండవ పక్షములోనివారు అమ్మువారు (విక్రేతలు). కొనువారు అమ్మువారును కలసి బేర మాడి తర్వాత నిరుపక్షములవారును అంగీకరించిన మొత్తమే 'క్రయము'. కొనువాఁ డంతటి క్రయము నియ్య సిద్ధపడుటకు కారణములను, అమ్మువాఁ డంతటిక్రయమును తీసికొన సిద్ధపడుటకు కారణములను కనుఁగొనవలెను. బస్తాబియ్యమునకు పదిరూపాయలకంటె నెక్కువ యిచ్చుటకు కొనువాఁ డెందుల కంగీకరించుట లేదు? వజ్రమునకై నాలుగైదువందలరూపాయలనుకూడ నిచ్చుట కతఁ డేల అంగీకరించుచున్నాఁడు? అనుభవకాండమున ఈప్రశ్నకు సమాధాన మిదివఱకే చెప్పఁబడియున్నది. క్షీణోపయోగశాస్త్రము ప్రకారము వస్తువుయొక్క మితత్వమునుబట్టి దాని కడదియుపయోగము నిర్ణయింపఁబడు ననియు, కడదియుపయోగమునుబట్టి దానిక్రయము నిర్ణయ మగుచున్న దనియును స్పష్ట మగుచున్నది. బియ్యపుబస్తాలు లక్షలకొలఁదిగ నుండుట వలన దానియొక్క కడదియుపయోగము చాల తక్కువ; అందుచే దాని క్రయముకూడ చాల తక్కువగ నున్నది. వజ్రములసంఖ్య — వజ్రములమొత్తము — మిక్కిలి మితతరముగ నుండుటచేత దాని 'కడదియుపయోగము' మిక్కిలి అధికముగ నున్నది, అందుచే దానిక్రయముకూడ హెచ్చుగ నుండుట సంభవించుచున్నది. బియ్యముయొక్కక్రయము పదిరూపాయలనుండి యెనిమిదిరూపాయ లైనయెడల దానికి కారణము బియ్యముయొక్క 'కడదియుపయోగము' తగ్గుటయే. ఇట్లు తగ్గుటకు ముఖ్యములగు కారణములు రెండు గలవు. అమ్మకమునకు సిద్ధముగ నుండు బియ్యము హెచ్చు కావచ్చును, లేక బియ్యమునందు క్రేతలకుఁ గల యిష్టము తగ్గవచ్చును. బియ్యమునకు బదులుగ గోదుమలనో, రాగులనో, జొన్నలనో వాడుటకు ప్రజలు ప్రారంభించినయెడల బస్తాలసంఖ్య అధికము కాకున్నను ఉన్న బస్తాలయొక్క కడదియుపయోగము తగ్గును. బియ్యముయొక్క క్రయము పదిరూపాయలనుండి పండ్రెండురూపాయ లగునప్పుడు బస్తాలసంఖ్య తగ్గుటయో, క్రేతలకు బియ్యమునందుఁగల యిష్టము హెచ్చుటయో కారణము లగును. హెచ్చుటకును తగ్గుటకును గల కారణములను పట్టి

కలవరపడుచుకొని, క్రీ. శ. ౧౭౪౬ వ సంవత్సరమున మిరాడియాక్ సామ్రాజ్యమును స్థాపించెను

**అర్బుదపర్వతము** — ఇది అబూ పర్వతమునకు ప్రాచీన నామము. ఇది రాజపుత్రస్థానములోని సిరోహీరాజ్యములో నున్నది. జైనులకు చెందిన పంచపవిత్రస్థానములలో నిది యొకటి. ఈపర్వతము మీఁదను జైనుల ప్రథమతీర్థంకరుఁడగు ఋషభనాథునియొక్కయు, యిరువదిరెండవ తీర్థంకరుఁడైన నేమినాథునియొక్కయు మందిరము లున్నవి (చూడుఁడు 'అబూ').

**అర్బుదుఁడు** — ౧. ఒక యాదవుఁడు. అతనివంశ మర్బుదవంశ మనఁబడును.

౨. ఒక ఆచార్యుఁడు (పంచవింశ బ్రాహ్మణము).

**అర్మూరుతాలూకా** — నైజాం హైదరాబాదు సంస్థానమునందు నిజామాబాదు జిల్లాలోని యొక తాలూకా. దీని వైశాల్యము ౧,౦౩౭ చదరపుమైళ్లు. జనసంఖ్య జాగీర్లతోఁ గలిపి ౧,౨౨,౪౯౯. ఇందు అర్మూర్, బాల్కొండా అను రెండు పట్టణములును, ౧౬౦ పల్లెలును కలవు. దీని కుత్తరముగ గోదావరీనది ప్రవహించును. అర్మూర్‌పట్టణములో పట్టుబట్టలు, చీరలు విస్తారముగ చేయుదురు.

**అర్యమ** — ౧. ద్వాదశాదిత్యులలో నొకఁడు. వైశాఖమాసమందలి సూర్యుఁడు. ఒకప్పుడితఁడు యమునియధికారమును నిర్వహించుచుండును.

౨. పితృసముదాయములో నొకప్రముఖుఁడు. కల్పారంభమునందు, యముఁడు పుట్టక పూర్వ మితఁడే దక్షిణదిక్పాలకుఁడుగా నుండెను.

**అర్యముఁడు** — వైశాఖమాసమునందు సూర్యునిరథము వెంట నుండు ఆదిత్యవిశేషుఁడు. పితృదేవతావిశేషుఁడు.

**అర్రియను** (క్రీ. శ. ౧౦౦-౧౮౦) — ఇతనిని అర్రియన్ అనియుఁ బిలుతురు. గ్రీకుచరిత్రకారుఁడు. ఎపిక్‌టేటస్ యొక్క శిష్యుఁడు, మిత్రుఁడు. ౧౩౪ లో నితఁడు కపడోషియా యనుపట్టణమున కధికారిగ (Prefect) నుండెను. అప్పుడు ఏలానీ అనుసంఘములు ఆపట్టణముపై దండెత్తిరాఁగా వారితోఁ బోరాడి వారి నోడించెను. ఇతఁడు కాన్సల్ అన్న గొప్పయధికారమును బడసెను. ఇతఁడు స్టోయిక్ తత్త్వమునకు సంబంధించిన యొకగ్రంథమును, వేఁటనుగురించిన యొకగ్రంథమును, అలెగ్జాండరు దండయాత్రను గురించిన యొకయుద్గ్రంథము వ్రాసెను.

**అర్లి** — (స. సెం. ౨౦౪) గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకాలోని జమీందారీగ్రామము. జనసంఖ్య ౩౪౩ (౧౯౩౧).

**అర్లి** — (స. సెం. ౬౪౭) గంజాంజిల్లా పర్లాకిమిడి తాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౫౦ (౧౯౩౧)

**అర్లిశేరి** — గంజాంజిల్లా పర్లాకిమిడితాలూకాకు చెందిన జమీందారీగ్రామము. ఇచటి జనసంఖ్య ౧౧౬ (౧౯౩౧)

**అర్వావసువు** — రైభ్యమహాముని యిద్దఱు పుత్త్రులలో పెద్దవాఁడు. ఇతఁడు తపస్సుచేసి తమ్ముఁడైన పరావసువుయొక్క పితృహత్యను బాపి దేవతలను సంతసింపఁజేసి తనతండ్రిని, భరద్వాజుని, యవక్రీతుని మరల బ్రదికించుకొనియెను.

**అర్వీతహస్సీలు** — మధ్యపరగణాలలోని వార్ధాజిల్లాయందలి యొకతాలూకా. దీని వైశాల్యము ౪౯౦ల చదరపుమైళ్లు. జనసంఖ్య ౧,౩౪,౪౩౩ లు. శిస్తు రు ౧,౯౭,౦౦౦లు. సెస్సులు రు ౧౯,౦౦౦లు. ఇందు అర్వీ, అష్టి అనుపట్టణములును, ౨౯౯ పల్లెలును కలవు. ఇందు ప్రత్తిపంట విశేషముగ పండును. ఇచ్చటి పశువులు మంచివని ప్రఖ్యాతి గలదు. గవర్నమెంటువారియరణ్యముచే వ్యాపింపఁబడిన ౧౫౦ చదరపుమైళ్లు తప్ప మిగిలినభూమిలో నూటికి డెబ్బదియొప్పున సాగు యున్నది.

**అర్వేజలపాతము** — మైసూరురాజ్యములోని అర్వే గ్రామమునకడ నున్న జలపాతము. ఈచోట శరావతీనది ౧,౧౦౦ అడుగులయెత్తునుండి క్రిందికి పడుచుండుటచే నీజలపాత మేర్పడినది. మైసూరురాజ్యములోని దర్శనీయములగు స్థలములలో నిది యొకటి. ఈచోట ప్రకృతిసౌందర్యము మిగుల దర్శనీయము.

**అర్సికెరె** — మైసూరు సంస్థానమునందు హాసన్‌జిల్లాలోని ఉత్తరపువైపుతాలూకా. వైశాల్యము ౪౭౬ చదరపుమైళ్లు. జనసంఖ్య ౬౯,౫౭౭లు. ఇందు ౩ గ్రామములును, ౩౫౪ పల్లెలును కలవు. శిస్తు రు ౧,౬౧,౦౦౦. ఇచ్చటి భూములు హెచ్చుతగ్గుగ నుండును. పడమటివైపున పెద్దగుట్టలు కలవు. దక్షిణమువైపున అమృతమహల్ పశువులకుఁ బీళ్లు కలవు. ఇచ్చటిపశువులు పేరువడ్డవి. కొబ్బరికుడుకలు ఇక్కడనుండి బెంగుళూరు, బళ్లారిపట్టణముల కెగుమతి యగును.

**అర్సీలాఖాఁ** — ఇతఁడు గజనీసుల్తాను అగుమసూదను మాహమ్మద్ అనువానికుమారుఁడు. ఇతఁడు ౧౧౧౫ లో తన సోదరుఁడైన షేరిజాద్ అనువానిని జంపి రాజ్యము నాక్రమించుకొని తన సోదరుల నందఱను చెఱసాలలోఁ బెట్టెను. బహరాంషా అనువాఁడు మాత్రము తప్పించుకొని ఖురాసానునకు పోయి అచ్చటిసుల్తానైన సంజార్ అను వానిని సహాయముగఁ దెచ్చుకొని ౧౧౧౮ లో అర్సీలాఖాను నోడించెను. అతఁడు లాహోరునకు పారిపోయెను గాని వానిని తరువాత చెఱబట్టి చంపిరి. బహరాంషా సింహాసన మెక్కెను.

సిద్ధించినా యది 'అలంకార'కోటిలోఁ జేరును, అనఁగా నది 'అలంకారధ్వని' కాదు, అలంకారమే, వ్యంగ్యార్థమైన అలంకారము సిద్ధించినా అది 'ధ్వని' గాని అలంకారము కాదు వలయునెడ దానిని 'అలంకారధ్వని' అనుఁడు, గాని అలంకార మనకుఁడు! ఉపమాద్యలంకారము లన్నియు వాచ్యార్థములుగను సిద్ధింపవచ్చును, వ్యంగ్యార్థములుగను సిద్ధింపవచ్చును. కాని ధ్వనివాదుల మతమున మొదటిదానినిమాత్ర మలంకార మనవలెను, రెండవదానిని 'ధ్వని'[1] అనవలెను ధ్వనివిషయించి యధికము తెలిసికొనఁగోరు వారు 'ధ్వని' శబ్దముఁ జూడుఁడు

అలంకారములచరిత్రము — భాషతోఁగూడ నలంకారము పుట్టిన దనవచ్చును. విను వారికి రమ్యముగ నుండు నిమిత్తమును, చక్కఁగ బోధపడు నిమిత్తమును అలంకారయుక్తమైన భాష మాటలాడుట మానవస్వభావము నిండువెన్నెల కాయుచున్న దని చెప్పుటకు మాఱుగ 'పిండి యారఁబోసినట్లు వెన్నెల కాయుచున్నది' యనియు, ఆమె మిక్కిలి చక్కనిది యనుటకు 'ఆమె రంభ' యనియు, వాఁడు శూరుఁ డనుటకు 'వాఁడు సింహపుఁబిల్ల' యనియు, కార్యము సకాలమునందుఁ జేయక ప్రయోజనము పోయినతరువాతఁ జేసి నటులకు 'దొంగలు పడిన ఆఱుమాసములకుఁ గుక్కలు మొఱిగెను' అనియు నిత్యవ్యవహారమునందును చెప్పెదము. మనస్సులోనిభావ ముత్కృష్ట మైనప్పుడును ఆలంకారికభాష వెలువడును. ఇందుకు మన భాషలోని కొన్ని తిట్లు నిదర్శనములు 'నీ కడుపు కాల', 'నీదుంప తెగ' ఇత్యాదులు వక్తయొక్క కోపోద్రేకమును చూపును కావున వ్యాకరణశాస్త్రము పుట్టకపూర్వ మెట్లు భాషాప్రపంచ మభివృద్ధి చెందెనో, యట్లే అలంకారశాస్త్రము పుట్టుటకుఁ బూర్వమే - చాల కాలమునకు పూర్వమే — భాషలో పామరజనవ్యవహారమందును అలంకారము లేర్పడెను

ఇఁక సంస్కృతవాఙ్మయమున కాదివమైన ఋగ్వేదమునందుఁ జక్కలంకారములు గల వర్ణనములు కలవు[2] మహాభారతరామాయణములు కావ్యములే కనుక వానియందుఁ జెక్కు శబ్దార్థాలంకారములు కల వని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. పాణినీయమునందు 'ఉపమేయ', 'ఉపమాన', 'సామాన్య' పదములు ప్రయోగింపఁబడుట చేతను[3], వ్యాసరచితబ్రహ్మసూత్రములలో ఉపమారూపకాలంకారముల పేళ్లు స్పష్టముగఁ గానవచ్చుటచేతను[4] ఆకాలములకుఁ బూర్వమే నలంకారశాస్త్రము బీజరూపమునఁ బ్రారంభ మైన ట్లూహింపవచ్చును. నిరుక్తమునందు యాస్కాచార్యుఁడు ఉపమాలంకారముయొక్క లక్షణముకూడఁ జెప్పినాఁడు[5] అగ్నివేశకాదులను దొంగలతోఁ బోల్చినందులకు నీచోపమ యని కొంచెము నిందించెను అగ్నిపురాణమందలి ౩౪౩-౩౪౫-వ అధ్యాయములందు శబ్దార్థాలంకారములు ఉదాహరణపూర్వకముగ వివరింపఁబడెను సాహిత్యచ్ఛందశ్శాస్త్రములకు సంబంధించినవిషయములుకూడ నీ పురాణమునఁ గలవు కాని దీనిరచనాకాలము నిశ్చయముగఁ దెలిసికొనుటకు వీలు లేదు. అందు ధ్వనివిషయమున నేమియు లేనందున నది ధ్వనికారునకు (౧౦ - వ శతాబ్ది) పూర్వము వ్రాయఁబడె నని యూహింపఁబడుచున్నది భరతుని నాట్యశాస్త్రము క్రీ. శ. ౧-వ శతాబ్దిలోనిది యని కొందఱు మతము అందు (౧౬ - ౪౧) నాలు గలంకారములు చెప్పఁబడినవి తరువాతివారు భామహాదులు వారివిషయమున 'అలంకారికులు' అను వ్యాసమునందు వివరింపఁబడును

అలంకారములసంఖ్య — అలంకారముల సంఖ్య క్రమముగ హెచ్చుచువచ్చెను శబ్దాలంకారముల సంఖ్యమాత్రము విశేషముగ పెరుఁగలేదు భరతుఁడు (౫-వ శతాబ్ది) నాట్యశాస్త్రమునందు (౧౬ - ౪౧) 'యమక' మను ఒక్కశబ్దాలంకారమునే చెప్పెను వామనుఁడు (౯-వ శతాబ్ది) రెండు శబ్దాలంకారములను, మమ్మటుఁడు (౧౨-వ శతాబ్ది) ఆఱు శబ్దాలంకారములను చెప్పినారు

అర్థాలంకారములవృద్ధి యత్యద్భుతము భరతునిచే(౫-వశతాబ్ది) ఉపమా రూపక దీపకము లను మూఁడు అర్థాలంకారములుమాత్రము చెప్పఁబడినవి (౧౬ - ౪౧) ఆచార్యదండి 'సంకీర్ణము' గాక ౩౪ అర్థాలంకారములను చెప్పెను కావ్యప్రకాశకారుఁ డైన మమ్మటుఁడు సంకరసంసృష్టులు గాక ౬౧ [illegible]

1 'ధ్వని' శబ్దము 'ధ్వన్యాలోకము' నందును ఏతన్మతప్రవర్తకగ్రంథములలోను రెండర్థములందు వాడఁబడియున్నది. ఒకటి సామాన్యము, రెండవది విశేషము 'ధ్వని' అనఁగా 'వ్యంగ్య' మని సామాన్యార్థము 'ధ్వని' అనఁగా 'వాచ్యము' కంటె 'వ్యంగ్యము' ప్రధాన మైన కావ్య మని విశేషార్థము.

2 ఋగ్వే, ౧-౧౨౪-౪ ఇందు నాల్గు ఉపమలు కలవు ౧-౧౬౪-౨౦ - ఇందు రూపకము కలదు. ౪-౫౮-౩ లో నతిశయోక్తి కలదు

3 ఉపమానాని సామాన్యవచనైః (౨-౧-౫౫), ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే (౨-౧-౫౬).

4 ఆనుమానిక మప్యేకేషా మితి చేన్న శరీరరూపకవిన్యస్తగృహీతే ర్దర్శయతి చ (౧. ౪ ౧)

5. అథైవ నీచోపమా సూర్యకాదివత్ (౩. ౨ ౧౫) — ౨ ౩ ౩

6 ఇప్పుడు ప్రకటింపఁబడిన భరతకృతనాట్యశాస్త్రము (కావ్యమాలాగ్రంథమాలలోనిది) క్రీ. శ. ౧-వ శతాబ్దినాఁటిది యని కొందఱును, ౫-వ శతాబ్దినాఁటిది యని మఱికొందఱును చెప్పెదరు.

పెంచెను. ప్రతాపరుద్రీయకారుఁడైన విద్యానాథుఁడు ౬౫ అనియు, చంద్రాలోకకర్తయైన జయదేవుఁడు (౧౫-వ శతాబ్ది) ౧౦౦ అనియు, కువలయానందకారుఁడైన అప్పయదీక్షితులు ౧౧౫ అనియు నర్థాలంకారములసంఖ్యను పెంచిరి. ఇట్లే సంఖ్య పెంపు మితిమీఱఁ బెరుఁగుచుఁ బోయినను నవీనులు కొందఱు వానిసంఖ్య తగ్గించుటకు యత్నించిరి. ౯-వ శతాబ్దివాఁడగు వామనుఁడును, ౧౨-వ శతాబ్దివాఁడైన హేమచంద్రుఁడును అర్థాలంకారములు ౨౯ అనియే చెప్పిరి.

ఇట్లు అలంకారములసంఖ్య పెరుఁగుచుఁ బోయినందున, వాస్తవముగ నంతఁ గవులచేఁ బూర్వకవిప్రయుక్తము లయినయలంకారములకంటె భిన్నములు ప్రయోగింపఁబడెనని తలఁపఁగూడదు. పూర్వకవు లుపయోగించినవానినే ఉత్తరకవు లుపయోగించిరి. ఇంక నలంకారములసంఖ్య యెట్లు పెరిఁగెనని చదువరు లడుగవచ్చును. పూర్వలాక్షణికు లొక్కయలంకారముయొక్క శాఖలుగ పెంచినవానిని ఉత్తరలాక్షణికులు స్వతంత్రాలంకారములుగ నెన్నుటవలన నీసంఖ్య పెరుఁగుచుఁ బోయెను. దండి చెప్పినట్టియుపమాలంకారభేదములలోఁ బ్రతీపము, ఉపమేయోపమ, అతిశయోక్తి, భ్రాంతిమంతము, సందేహము, అనన్వయము, ఉత్ప్రేక్ష, ప్రతివస్తూపమ అని యనేకులవారిచేఁ బేర్కొనఁబడినయలంకారము లన్నియు నిమిడియున్నవి. ఇవన్నియు నిప్పుడు ఉపమకంటె భిన్నములును, స్వతంత్రములును అగునలంకారములై యున్నవి.[1]

అలంకారవిభజన — అలంకారములసంఖ్యవలెనే, అలంకారములను ఏతత్త్వముపై విభజింపవలెనన్న విషయమునఁ గూడఁ జెప్పఁదగిన భేదములు కలవు. ఒక యలంకారమునకును మఱియొక యలంకారమునకును గల భేదము వానిచమత్కారబీజము లయిన ధర్మములకుఁ గల భేదములను బట్టియే తెలిసికొన్నచో బోధపడఁగలదే కాని, అలంకారములజాబితాలును, ఉదాహరణములును ఇచ్చినందునఁ గాదు. చమత్కారబీజనిర్ణయమువలన లక్షణసిద్ధియుఁ జక్కఁగ చేర్పడును.

మొట్టమొదట స్ఫురించువిభజన శబ్దాలంకారములు, అర్థాలంకారములు అనునది. ఈభేద మందఱును ఒప్పుకొనినదే. అయినను, భోజుఁడు తనసరస్వతీకంఠాభరణమునందు శబ్ద, అర్థ, ఉభయాలంకారము లని విభాగము కల్పించి, యొక్కొక్కతెగలో ౨౪ అలంకారములను చెప్పినాఁడు.[2] ఉభయాలంకారములలో నుపమాదు లిముడఁబడినవి! కాని యీ విభాగమును మఱి యేలాక్షణికులును ఒప్పుకొనలేదు. అన్నియలంకారములను ఉభయాలంకారము లని చెప్పవచ్చును. శబ్దార్థములు రెండును లేనిది యేయలంకారమగును? కావున విభాగము చేయునప్పుడు చూడవలసినది, యొకానొకవాక్యమునకుఁ జక్కఁదనము

1 ఒక్కయుపమాలంకారమే నటునివలె వేఱువేఱు వేషముల ధరించి భిన్నాలంకారములవలెఁ గానవచ్చును అని చెప్పి యప్పయ్యదీక్షితులు చిత్రమీమాంసలో నీ క్రింది యుదాహరణముల నిచ్చెను:—

౧. ఉపమ - చంద్రునివంటిముఖము. ౨ ఉపమేయోపమ - చంద్రునివంటిముఖము, ముఖమువంటి చంద్రుఁడు ౩ అనన్వయము - ముఖమువంటిముఖము ౪ ప్రతీపము - ముఖమువంటిచంద్రుఁడు ౫ స్మరణము - చంద్రునిఁ జూచి ముఖము జ్ఞప్తికి వచ్చెను. ౬ రూపకము - ముఖమను చంద్రుఁడు ౭ పరిణామము - ముఖచంద్రునిచేఁ దాపము శమించును ౮ సందేహము - ముఖమా? చంద్రుఁడా? ౯ భ్రాంతిమంతము - చంద్రుఁ డని చకోరములు నీముఖమునకుఁ బోవుచున్నవి ౧౦ ఉల్లేఖము - చంద్రుఁ డని చకోరములు, కమల మని భృంగములు నీముఖము నాశించుచున్నవి ౧౧ అపహ్నుతి - చంద్రుఁడే! ఇది ముఖము గాదు ౧౨ ఉత్ప్రేక్ష - తప్పక చంద్రుఁడే. ౧౩ అతిశయోక్తి - ఇతఁడు చంద్రుఁడే ౧౪ తుల్యయోగిత - ముఖముచే చంద్రకమలములు నిర్జింపఁబడెను ౧౫ దీపకము - రాత్రి చంద్రుఁడును, నీముఖమును ప్రకాశించును ౧౬ ప్రతివస్తూపమ - నీముఖమునందు శ్రీ రమించెను, చంద్రునియందు చకోరము రమించును. ౧౭ దృష్టాంతము - ఆకాశమునందు చంద్రుఁడు, భూమిమీఁద నీముఖము ౧౮ నిదర్శనము - ముఖము చంద్రకాంతి వహించును ౧౯ వ్యతిరేకము - నిష్కళంకముఖము చంద్రుని మించెను ౨౦ సహోక్తి - నీముఖముతోఁ గూడఁ గలసి చంద్రుఁడు రాత్రి వికసించును ౨౧ సమాసోక్తి - ముఖము శీతాంశుదరము, స్మితజ్యోత్స్నాశోభితము ౨౨ శ్లేష - హరితాపహరశక్తి యనుకను ఇదితో ముఖము సమానము. ౨౩ అప్రస్తుతప్రశంస - ముఖముయెదుట చంద్రుఁడు వెలవెలఁబాఱుచున్నాఁడు.

2. భోజరాజకృత 'సరస్వతీకంఠాభరణ' మందలి యలంకారవిభాగము శబ్దాలంకారములు ౨౪ — జాతి, గతి, రీతి, వృత్తి, ఛాయ, ముద్ర, ఉక్తి, యుక్తి, భణితి, గుమ్ఫన, శయ్య, పఠితి, యమకము, శ్లేష, అనుప్రాస, చిత్రము, వాకోవాక్యము, ప్రహేళిక, గూఢము, ప్రశ్నోత్తరము, అధ్యేయము, శ్రవ్యము, ప్రేక్ష్యము, అభినీతి. అర్థాలంకారములు ౨౪ — జాతి, విభావన, హేతువు, అహేతువు, సూక్ష్మము, ఉత్తరము, విరోధము, సంభవము, అన్యోన్యము, పరివృత్తి, నిదర్శనము, భేదము, సమాహితము, భ్రాంతి, వితర్కము, మీలితము, స్మృతి, భావము, ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, ఉపమానము, అర్థాపత్తి, అభావము. ఉభయాలంకారములు ౨౪ — ఉపమ, రూపకము, సామ్యము, సంశయోక్తి, అపహ్నుతి, సమాధ్యుక్తి, సమాసోక్తి, ఉత్ప్రేక్ష, అప్రస్తుతస్తుతి, తుల్యయోగిత, లేశము, సహోక్తి, సముచ్చయము, ఆక్షేపము, అర్థాంతరన్యాసము, విశేషము, పరిష్కృతి, దీపకము, క్రమము, పర్యాయము, అతిశయము, శ్లేష, భావికము, సంసృష్టి.

కాని గుణప్రాధాన్యమునుబట్టి యట్టిగాను వ్యవహరించి తగినకవులచేఁ జేర్పఁబడెను. శబ్దార్థములు రెండును సమప్రాధాన్యము కలవి యైన యెడల నది యున్నతమగు కావ్యమే" అర్థచమత్కారము లేని కేవల శబ్దచమత్కారమును గురించి యిట్లు వ్రాసెను "ఎందు ప్రాముఖ్యముగా నర్థచమత్కారము శూన్యమై కేవలము శబ్దచమత్కృతి యుండునో, దాని నధమాధమకావ్యమని చెప్పుట యుచితము. ఏకాక్షరపద్యములు, అర్థావృత్తియమకము, పద్మబంధాదికములు నిట్టివి. కాని ప్రాచీనపరంపర ననుసరించి కొందరు మహాకవులు వీనిని తమ కావ్యములలో నచ్చటచ్చటఁ బ్రయోగించినను కావ్యలక్షణమైన 'రమణీయార్థప్రతిపాదకత్వ'ము వీనియందు లేనందున, వీనిని మేము కావ్యముగ నెంచలేము.[1]" కావున శబ్దార్థాలంకారములలో అర్థాలంకారములే శ్రేష్ఠములు, అర్థచమత్కారము లేని కేవలశబ్దాలంకారములు కావ్యమన్న పేరునకుఁగూడఁ దగ వని యీ యాలంకారికసంప్రదాయము వారియభిప్రాయము. ఇది సరియైన యభిప్రాయము కా దని యెవరు చెప్పఁగలరు?

ఇక నర్థాలంకారములను గురించి విచారింతము. ఒక్క యుపమాలంకారమే యన్నియలంకారములకును మూల మనియు, మిగిలిన వన్నియు దాని భేదములే యనియుఁ గొంద రందురు. కావ్యాలంకారసూత్రకారుఁడైన వామనుఁడు మొదట నుపమాలంకారమును చర్చించి యంతట నా అలంకారములను 'ఉపమాప్రపంచాధికార' మను విభాగమునం దిడ్చి యిట్లనెను —

'ఏభిర్నిదర్శనైః స్వీయైః పరకీయైశ్చ పుష్కలైః,
శబ్దవైచిత్ర్యగర్భేయ ముపమైవ ప్రపంచితా[2]'

భామహుఁడును (౬ వ శతాబ్ది), వక్రోక్తి జీవితకారుఁడును[3] (౧౧ వ శతాబ్ది) అలంకారములన్నిటికిని వక్రోక్తియే మూల మనియు, నది లేనిది అలంకారమే లే దనియుఁ జెప్పియున్నారు. భామహోలంకారము నిట్లున్నది —

'వాచాం వక్రార్థశబ్దోక్తి రలంకారాయ కల్పతే ౧ ౩౬
సైషా సర్వత్ర వక్రోక్తి రనయార్థో విభావ్యతే,
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా'
— ౨ ౮౫

అర్థము వక్రోక్తి వాక్యము నలంకారత్వమును కల్పించును. ఈ వక్రోక్తి వలననే అంతటను అర్థము శోభావంత మగును. కవులు యత్నించి దీనిని సాధింపవలెను. ఇది లేనిది యే యలంకారము సిద్ధించును?

ఇతరులచే నలంకారములుగా స్వీకరింపఁబడిన హేతు, సూక్ష్మ, లేశము లన్న అలంకారములలో వక్రోక్తి లేనందున నవి యలంకారములు కా వని భామహుఁడు చెప్పెను (౨ ౮౬).

వక్రోక్తియు, నతిశయోక్తియు నీరెంటిని ఏకార్థకములు ఇచ్చట నొకటేవిధముగ లక్షణము చెప్పఁబడిన 'అతిశయోక్తి' 'వక్రోక్తి' యను రూఢిశబ్దార్థముల గ్రహింప గూడదు. యౌగికార్థములు గ్రహింపవలెను. ఉన్నదానికంటె నెక్కువగఁ జెప్పుట యతిశయోక్తి, ఉన్నది యున్నట్లు చెప్పక మఱొకవిధముగ వంకర టింకరగా చెప్పుట వక్రోక్తి. ఇట్లతిశయోక్తియే సర్వాలంకారములకు మూలమని హేమచంద్రుఁడును[4] మమ్మటుఁడును[5] ఒప్పుకొని యున్నారు. ఈ సంప్రదాయమువారిమతమున నుపమాలంకారమునందుఁ గూడ అతిశయోక్తి గలదు. వస్తుస్థితిని మించునదే యతిశయోక్తి. ముఖము చంద్రునివలె నున్నది యన్న వస్తుస్థితియా? కాదు. కావున నందు అతిశయోక్తియు (వక్రోక్తియు) నున్నది.

రుద్రటుఁ డను మహాలంకారికుఁడు (౯-వ శతాబ్ది) అర్థాలంకారములు వాస్తవము (వస్తువివరణము), ఔపమ్యము, అతిశయము, శ్లేషము అనునవి నాలుగ యనియు, నలంకారములన్నియు నీనాల్గింటి భేదములే యనియుఁ జెప్పినాఁడు. ఆ నాల్గింటిలక్షణము లిట్లు చెప్పెను.

ఏయర్థము ననుసరించి వస్తుస్వరూపము నున్నది యున్నట్లు చెప్పునో యది వాస్తవము (స్వభావోక్తి). ఇందు విపరీతవర్ణనము గాని, పోలిక గాని, అతిశయవర్ణనము గాని, శ్లేష గాని యుండదు.

---

1 రసగంగాధరము కావ్యమాలప్రతి, ౨౦-వ పుట

2 అర్థము నాచే రచింపఁబడినట్టియు, నితరుల దైనట్టియు నగు పెక్కు ఉదాహరణములచే శబ్దచమత్కారముతో నిండియున్న యుపమాలంకారమే విస్తరముగఁ జెప్పఁబడినది

3 లాక్షణికు లందఱును ఈతని పేరు చెప్పక ఈ పేరనే వాడెదరు. ఈతని పేరు కుంతకుఁడైనట్లు కానవచ్చుచున్నది (వ్యక్తివివేక విచారము, పుటలు ౯౬; ౩౨)

4 ఏవంవిధేషు సర్వత్ర విషయేఽతిశయోక్తిరేవ ప్రాణత్వేనావతిష్ఠతే, తాం వినా ప్రాయేణాలంకరణత్వాయోగా దితి న సామాన్యాతిశయోక్తేరలంకారత్వేనాభిధానం శ్రేయః-(కావ్యానుశాసనము, ౬ ౬)

5. సర్వత్ర ఏవంవిధవిషయేఽతిశయోక్తిరేవ ప్రాణత్వేనావతిష్ఠతే, తాం వినా ప్రాయేణాలంకారత్వాయోగాత్-(కావ్యప్రకాశము, ౧౦-వ ఉల్లాసము).

3. శృంఖలాబంధాలంకారములు
  - ౪౦ కారణమాల
  - ౪౧ ఏకావలి
  - ౪౨ మాలాదీపకము
  - ౪౩ ఉదారము(సారము)

4. తర్కన్యాయమూలాలంకారములు
  - ౪౪ కావ్యలింగము
  - ౪౫ అనుమానము

5 వాక్య(కావ్య)న్యాయమూలాలంకారములు
  - ౪౬ యథాసంఖ్యము
  - ౪౭ పర్యాయము
  - ౪౮ పరివృత్తి
  - ౪౯ పరిసంఖ్య
  - ౫౦ అర్థాపత్తి
  - ౫౧ వికల్పము
  - ౫౨ సముచ్చయము
  - ౫౩ సమాధి

6 లోకన్యాయమూలాలంకారములు
  - ౫౪ ప్రత్యనీకము
  - ౫౫ ప్రతీపము
  - ౫౬ మీలితము
  - ౫౭ సామాన్యము
  - ౫౮ తద్గుణము
  - ౫౯ అతద్గుణము
  - ౬౦ ఉత్తరము

7. గూఢార్థప్రతీతిమూలాలంకారములు
  - ౬౧ సూక్ష్మము
  - ౬౨ వ్యాజోక్తి
  - ౬౩ వక్రోక్తి
  - ౬౪ స్వభావోక్తి
  - ౬౫ భావికము
  - ౬౬ ఉదాత్తము

8 రసవదాద్యలంకారములు
  - ౬౭ రసవత్
  - ౬౮ ప్రేయస్
  - ౬౯ ఊర్జస్వి
  - ౭౦ సమాహితం

9 పృథగలంకారములు
  - ౭౧ భావోదయము
  - ౭౨ భావసంధి
  - ౭౩ భావశబలత

10 సంకరాలంకారములు
  - ౭౪ సంసృష్టి
  - ౭౫ సంకరము

తెలుఁగులో మొదట సాహిత్యశాస్త్రమును వ్రాసినవాఁడు విన్నకోట పెద్దన. ఇతఁడు ౧౪-వ శతాబ్దివాఁడు. ఇతనిచే రచింపఁబడిన గ్రంథము 'కావ్యాలంకారచూడామణి' ఇది దండి కృత మైన 'కావ్యాదర్శము'నకుఁ దెలుఁగుసేఁతవలెఁ గానవచ్చుచున్నది. ఇందలి ౫-వ, ౬-వ ఉల్లాసములలో అర్థాలంకారములును, శబ్దాలంకారములును చెప్పఁబడియున్నవి. ఈపుస్తకమును గూర్చి యధికము తెలిసికొనఁగోరువారు 'కావ్యాలంకారచూడామణి' శబ్దముక్రిందఁ జూడవలయును. తెలుఁగునందలి రెండవసాహిత్య గ్రంథము 'నరసభూపాలీయము' ఇది ౧౬-వ శతాబ్దివాఁడైన భట్టుమూర్తిచే రచితము. ఇది ప్రతాపరుద్రీయమును అనుసరించియు, ఏకావళి ననుసరించియు వ్రాయఁబడినట్లు కానవచ్చుచున్నది. ఇందు ౪-వ ఆశ్వాసాంతమున శబ్దాలంకారములును, ౫-వ ఆశ్వాసమునందు అర్థాలంకారములును వివరింపఁబడినవి. ౧౭-వ శతాబ్దివాఁడగు అహోబిల సూరకవి 'ఆంధ్రచంద్రాలోకము' అను గ్రంథమును రచించెను. సంస్కృతమునందు జయదేవునిచే రచింపఁబడిన 'చంద్రాలోక' మను గ్రంథములోని ౫-వ మయూఖమును మాత్ర మిందు తెనిఁగించియున్నాఁడు. ఇందు ౧౦౦ అర్థాలంకారముల లక్షణములును, ఉదాహరణములును కలవు. 'కువలయానంద ప్రకాశ' యను గ్రంథ మొకటి కటికనేని రామకవిచే రచింపఁబడినది కలదు. ఇతఁడు పద్మనాయకకులజుఁడు. కాలము తెలియదు. ఇది కువలయానందమునకు భాషాంతరము. ఇందు కారికోదాహరణములు పద్యరూపములుగను, కారికావృత్తి వచనరూపముగను కలవు. మూఁడాశ్వాసముల గ్రంథము. ఇంకను అచ్చుపడలేదు. దీనిప్రతి యొకటి చెన్నపట్టణమున ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందుఁ గలదు. మనకుఁ దెలిసినంతవఱకు తెలుఁగులో నలంకారములనుగుఱించి యున్న పూర్వగ్రంథము లివాల్గుమాత్రమే.

ఇటీవల శ్రీ వీరేశలింగముగారు 'అలంకారసంగ్రహము' అన్న గ్రంథము వ్రాసిరి. ఇది చంద్రాలోకమునకు నాంధ్రముగఁ గాన వచ్చుచున్నది. టి. ఇ. శ్రీనివాసాచారియార్ అనువారు 'సాహిత్య చింతామణి' అను నామాంతరము గల 'అలంకారశాస్త్రసంగ్రహము' అను గ్రంథమును రచించిరి. పెక్కు లక్ష్యలక్షణ గ్రంథములను శోధించి యలంకారలక్షణములును, ఉదాహరణములును ఇందుఁ జెప్పఁబడినవి. చక్కని యుపోద్ఘాతమును కలదు. శ్రీయుత అక్కిరాజు ఉమాకాన్తముగారు చంద్రాలోకమున కాంధ్రంబున గద్యమున నర్థము వ్రాసి అదిదము మూసన యాంధ్రచంద్రాలోకమునకు సంబంధముగఁ బ్రకటించియున్నారు. రామలింగారెడ్డిగారి కవిత్వ తత్త్వవిచారమును, వనుకంటి సీతారామయ్యగారి యలంకారతత్త్వ విచారమును తప్పక చదువఁదగినవి.

ఇఁక క్రిందియలంకారములలక్షణములును, ఉదాహరణము లును తెలుపుదుము. మొదట శబ్దాలంకారములు ౫ను, తరువాత అర్థాలంకారములు ౧౧౭ను చెప్పఁబడినవి. శబ్దాలంకారముల క్రమము అలంకారసర్వస్వకారుని ననుసరించి యీయఁబడినది. అర్థాలంకారములు కువలయానందమునందుఁ జూపఁబడిన వన్నియు నీయఁ బడినవి. ౧ మొదలు ౯౫ వఱకును క్రమముమాత్రము అలంకారసర్వ స్వమునందలిది గ్రహింపఁబడినది. ౯౬-వ అలంకారమునొద్దనుండి పిఱుసంతవఱకుఁ గువలయానందమునందలిక్రమము నంగీకరింపఁబడినది. లక్షణములు చాలవఱకు రసగంగాధర, కావ్యప్రకాశ, ప్రతాపరుద్రీయ ములనుండి గ్రహింపఁబడినవి. ఉదాహరణము లేయేగ్రంథములనుండి తీసికొనినది కుండలీకరణమునందుఁ జూపితిమి. చివర నీయలంకారముల కన్నింటికిని అకారాదిసూచి యొకటి యీయఁబడినది.

అలంకారలక్షణములనుగుఱించి యొకవిశేషము జ్ఞాపక ముంచుకొనవలెను. ప్రతియలంకారమంగును సౌందర్య ముండవలయును. సౌందర్య మనఁగా చమత్కృతిశాలిత్వయోగిత్వము, చమత్కృతిని కలుఁగఁజేయుసామర్థ్యము. చమత్కృతి యనఁగా నానందవిశేషము. సహృదయహృదయప్రమాణకము [౪ ౫౦]. దీనినే అప్పయదీక్షితులవారు 'హృద్యత' యనిరి. ఇది సర్వాలంకారములకును సామాన్యము గనుకఁ బ్రతియలంకారమునొక్క లక్షణమంగును చెప్పఁబడదు. అయినను బ్రతియలంకారలక్షణమునంగును 'సౌందర్యము' అనునది యున్న ట్లెంచుకొనవలెను. ఈ 'సౌందర్యము' అనుదానిని ఉపమాదికముల లక్షణములలోఁ జేర్పనియెడల నీక్రిందియుదాహరణములను గూడ నాయా యలంకారము లనియే చెప్పవలసియుండును.

'కంచరగాడిద గాడిదవంటిది' అనుదానిని 'ఉపమ' యనియు, 'పశువాహనము' అనుదానిని 'రూపక' మనియు, 'స్థాణువా పురుషుఁడా' అనుదానిని 'సందేహ' మనియు, 'ఇది వెండి' యని ముత్యపుఁజిప్పను జూచి భ్రమపడి చెప్పినదానిని 'భ్రాంతిమంత' మనియు, 'బలిసినదేవదత్తుఁడు పగలు భోజనము చేయుఁడు' అనునది 'పర్యాయోక్త' మనియు, 'వీఁడు ఆదేవదత్తుఁడు' అనునది 'స్మరణ' మనియు, 'వారువారు వారివారి యిండ్లకుఁ బోయిరి' యనునది 'యథాసంఖ్య' మనియు, 'కొడుకుతోఁ గలసి తండ్రి వచ్చెను' అనునది 'సహోక్తి' యనియు, 'వాఁడు లేకుండ వీఁడు వచ్చెను' అనునది 'వినోక్తి' యనియు భ్రమ కలుఁగవచ్చును. కాని ఈవాక్యములను అలంకారము లని ఎవ్వఁడును అనఁడు. ఎందువలన? వీనిలోఁ జమత్కారము లేదు గనుక.

## శబ్దాలంకారములు ౫.

సాధారణముగ శబ్దాలంకారము లైదు: పునరుక్తవదాభాసము, ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము, లాటానుప్రాసము, యమకము. మమ్మటుఁడు 'వక్రోక్తి', 'శ్లేష'లను గూడ శబ్దాలంకారములలోఁ జేర్చెను. కాని యలంకారసర్వస్వకారునిమతము ననుసరించి మే మీరెం డలంకారములను అర్థాలంకారములందుఁ జేర్చితిమి.

౧. పునరుక్తవదాభాసాలంకారము — ఒక సమానార్థము గల వేఱువేఱుశబ్దములు వేఱువేఱు అర్థములందుఁ జెప్పఁబడినను,

ఓజఃప్రకాశకము లైన వర్ణములచేత వృత్త్యనుప్రాసమునకు ‘పరుష’ యని పేరు. దీనికే ‘గౌడీరీతి’ యందురు.

ఇతరవర్ణములచేత వృత్త్యనుప్రాసము ‘కోమల’ యనఁ బడును. దీనికే ‘పాంచాలీరీతి’ యనియు, దీనికే కొందఱు ‘గ్రామ్య’ యందురు.

అలంకారసర్వస్వకారునిమతమున, ఒక్కొక యక్షరము రెంటి కంటె అధికపర్యాయములు, పెక్కక్షరములు రెండుపర్యాయములును ఉచ్చరింపఁబడినయెడల వృత్త్యనుప్రాసము, అనఁగా ఏకాక్షరమును గుఱించి అసకృత్ సామ్యమును, అనేకాక్షరములను గుఱించి సకృత్ సామ్యమును ఉండవలెను.

వామనమతమున, సకృద్ద్వ్యావృత్తి ఛేకము, అసకృద్ద్వ్యావృత్తి వృత్త్యనుప్రాసము [1].

అనుప్రాసముయొక్క యన్యభేదములు — పైని తెలుపఁబడిన యనుప్రాసభేదము అలంకారసర్వస్వ కావ్యప్రకాశముల ననుసరించి యీయఁబడినవి. సాహిత్యదర్పణకారుని మతమున నీ యలంకారము ఛేక, వృత్తి, శ్రుతి, అంత్య, లాటభేదములచే నైదువిధములు, సరస్వతీకంఠాభరణకారునిమతమున శ్రుతి, వృత్తి, వర్ణ, పద, నామ, లాటభేదములచే నాఱువిధములు. ఈభేదములను పెక్కు ఉపభేదములు భోజుఁడు చెప్పియున్నాఁడు (చూడుఁడు, సర కం, ౨-వ పరి).

తెలుఁగునందు ఛందోవిషయముగ నెంచఁబడు ప్రాస అనుప్రాసాంతర్గతమే. ప్రాస పాద్యాద్యక్షరగణములందును ఉండును. కావున నది వృత్త్యనుప్రాసమే కాని రెంటికిని గొంచెము భేదము కలదు. వృత్త్యనుప్రాసమునందు వర్ణములయావృత్తి కొలఁదియంతరమునకే వచ్చును. ప్రాసమునందుఁ బరిగణితదూరాంతరమున వచ్చును. శార్దూలాది దీర్ఘవృత్తములలో ౧౯, ౨౦ అక్షరముల తరువాత వచ్చును.

మన కవులచే విశేషముగ గౌరవింపఁబడు నంత్యనియమమును అనుప్రాసమే. దానిని పదాంతానుప్రాస మనవచ్చును. బమ్మెర పోతనామాత్యకృతమగు ఆంధ్రభాగవతమందు శబ్దాలంకారము విశేషముగఁ గానవచ్చును.

ఉదా.

౩. అనుదినసంతోషణములు
జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
తనయులసంభాషణములు
జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్ (భాగ, ౭ ౧౪౦)

౪. లాటానుప్రాసాలంకారము — లక్ష. ఒక్క యర్థము గల పదములను తాత్పర్యభేదము కలుగునట్లు మరల మరలఁ జెప్పినచో ‘లాటానుప్రాస’ మగును.

ఉదా.

‘కమలాక్షు నర్చించుకరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ’ (భాగ, ౭ ౧౬౯).

ఇచ్చట మొదటి ‘కరము’నకు జాతివాచకమైన చేయి యని అర్థము. రెండవ ‘కరము’నకు యోగ్యమైన చేయి యని యర్థము. ఇదియే తాత్పర్యభేదము. ఇట్లే రెండవపాదమును గుఱించి చెప్పఁగునది.

ఛేకవృత్త్యనుప్రాసములు వర్ణానుప్రాసము లనియు, నిది పదానుప్రాసము లేక శబ్దానుప్రాస మనియుఁ జెప్పెదరు.

అనన్వయాలంకారమునందును ఉపమేయము రెండుసారులు వచ్చును. రాముఁడు రాముఁడే. దీనికిని లాటానుప్రాసమునకును భేద మేమి? అనన్వయమునం దొకపదమే మరలఁ జెప్పుట యుద్దేశము కాదు. ఆ పదముచే సూచింపఁబడిన పదార్థముతోఁ బోల్పఁదగిన పదార్థము మఱియొకటి లేదని చెప్పుట కాపదమే మరలఁ జెప్పఁబడును. అచ్చట సమానార్థకపద మున్నను అంత చింత లేదు. ‘రాముఁడు రాముఁడే’ అనుటకు బదులు ‘రాముఁడు దాశరథియే’ యన్నను అలంకారమునకు భంగము రాదు. కాని లాటానుప్రాసములో సమానార్థకపదము చెప్పుటయే యుద్దేశము గాక సమానోచ్చారణపదములను చెప్పుటయు నుద్దేశమే.

ఈయలంకారమును మమ్మటాదులు ౧ పదముల పునరావృత్తి కలది, ౨ నామముల పునరావృత్తి కలది యని రెండుగ చేసి, ౧ లో (అ) ఏకపదపునరావృత్తి కలది, (ఆ) అనేకపదపునరావృత్తి కలది అనియు, ౨ లో (అ) ఏకసమాసములోనిది, (ఆ) భిన్నసమాసములోనిది, (ఇ) ఒకటి సమాసములోనిది, మఱియొకటి సమాసములో లేనిది అని యైదువిభాగములు కల్పించిరి.

ఈ యలంకారమునందు శబ్దార్థములు రెండును ముఖ్యములు, కావున నిది ఉభయాలంకార మని కొందఱిమతము.

౫. యమకాలంకారము — లక్ష. ౧ స్వరవ్యంజన (అచ్చుల హల్లుల) సముదాయపౌనరుక్త్యము ‘యమకము’ — (అ స).

లక్ష. ౨ అభిన్నార్థకము లయిన సమానవర్ణముల యొక్క క్రమముగ నావృత్తి ‘యమకము’ — (కా ప్ర).

ఉదా. ఆ సైనికనికాయంబు కాయంబు మఱచి పోరుచున్నది.

ఇందు ‘కాయంబు’ అనువర్ణంబులు స్వరవ్యంజనసహితంబుగ నేకక్రమముగ రెండుసారు లుచ్చరింపఁబడినవి. మొదటి ‘కాయంబు’ ‘నికాయంబు’లోని యొకభాగము. దానికి స్వతంత్రముగ నర్థంబు లేదు.

ఛేకవృత్త్యనుప్రాసములందు హల్లులసామ్య ముండినఁ జాలును, అచ్చులసామ్య మానుషంగికము. ఉండిన నుండవచ్చును, లేకున్నను చింత లేదు. ఇచ్చట నచ్చుల హల్లుల రెంటిసామ్యము నావశ్యకము.

1. సకృద్ద్వ్యావృత్తిశ్ఛేకానుప్రాసః, అసకృద్ద్వ్యావృత్తి వృత్త్యనుప్రాసః (కావ్యాలంకారసూత్ర, ౪. ౮).

మురారిభృత్తము —

సారసాక్షిచే వదధ్వదారి భూరి ధీరసా
ధీరసాహసోరుదారతిప్పురక్షకారసా
కారసాముముక్తజీసురాపగా సుధారసా
ధారసాధుకీర్తిహంసధారి సూరిపారసా (వసు, ౬-౧౦౩)

ఇట్లు యమకప్రకారము లనేకములు గలవు. సంస్కృతంబున వీనికి వేలువేలు గావుండుటయూహకుఁ గలవు మన యాంధ్రంబున ప్రాస మున్నట్లు, ఉత్తరహిందూదేశమందలి హిందీ, మరాటీ, బంగాలీ మొదలయినభాషలలో నికావ్యముల సంతర్గతముగ నత్యంతావశ్యకము పద్యమందలి మొదటి రెండుచరణములకును, చివర రెండుచరణములకును అంతమున నొక్కొక్కయక్షర మొండును పెక్కు అక్షరములం కూడ సమానముగ నుండవచ్చును కాని యొక్కటైనను సమానముగ నుండితీరవలెను దీనికే యింగ్లీషులో రైమ్ (Rhyme) అందురు

'ప్రాయశో యమకే చిత్రే రసపుష్టి ర్న దృశ్యతే' (సాధారణముగ యమకమందును, చిత్రకావ్యమునందును రసపుష్టి కానరాదు) అని వీకావళీకారుఁడైన విద్యానాథుఁడు స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు

చిత్రాలంకారములు — 'చిత్ర'ములు శబ్దాలంకారాంతర్గతము లైనను, పూర్వలాక్షణికులు చిత్రమును ఒక కావ్యభేదముగ నెంచినందున తరువాయను 'చిత్రకావ్యము' అను శీర్షిక క్రింద సవిస్తరముగ వివరింపఁబడును

## అర్థాలంకారములు ౧౧౮

కువలయానందమునందు ౧౧౫ అలంకారము లీయఁబడినవి రసగంగాధరములోనివి యగు 'ఉదాహరణము', 'అసమము', 'తిరస్కారము' అను నలంకారములు వీనిలోఁ గలుపఁగా ౧౧౮ సంఖ్య యేర్పడినది వానివివరము —

౧ ఉపమాలంకారము — లక్ష. ఒకపదార్థమును మఱియొక పదార్థముతోఁ బోల్చి చెప్పుట 'ఉపమ'

ఉదా ఆమెముఖము చంద్రునివలె నందముగ నున్నది

ఏపదార్థము వర్ణింపఁబడుచున్నదో, అనఁగా దేనిని మనము వర్ణించుచున్నామో దానికి ఉపమేయము (లేక వర్ణ్యము, ప్రస్తుతము, ప్రకృతము, విషయము) అని పేరు దేనితో నుపమేయమును బోల్చుచున్నామో దానికి ఉపమానము (అవర్ణ్యము, అప్రస్తుతము, అప్రకృతము, విషయి) అని పేరు. రెంటియందును గల యేగుణమునుబట్టి ఉపమేయోపమానములను బోల్చుచున్నామో ఆగుణమునకు 'సమానధర్మము' (సాధారణ) అని పేరు. ఏశబ్దమువలన ఈ సమానధర్మమును సూచించుచున్నామో యది 'ఉపమావాచక'శబ్దము పైయుదాహరణమందు 'ముఖము' ఉపమేయము, 'చంద్రుఁడు' ఉపమానము, 'అందము' సమానధర్మము, 'వలె' అనునది ఉపమావాచకము.

ఉపమాప్రయోజనములు (౧) స్తుతి, (౨) నింద, (౩) తత్త్వబోధ ఇందుకుఁ గ్రమముగ నుదాహరణములు (౧) శ్రీమతోఁగూడినభార్య లక్ష్మివంటిది (౨) సంపద మద్యమువంటిది. (౩) ఆకాశమునందు బండివలెఁ గానఁబడుచున్న చుక్కలగుంపు రోహిణీనక్షత్రము

ఉపమాలంకారలక్షణము లనేకలాక్షణికు లనేకవిధములఁ జెప్పియున్నారు కొన్ని యిందు నుదాహరించుచున్నాము —

భామహుఁడు — దేశకాలక్రియాదులచే విరుద్ధమైన ఉపమానముతో నుపమేయమునకు గుణలేశముచేతనైనను సామ్యము చెప్పఁబడినయెడల నుపమ యగును

ఉద్భటుఁడు — కాలాదికములచే భిన్నము లగు ఉపమానోపమేయము లను రెండుశబ్దములకుఁ గల మనోహరమైన సాదృశ్యమే యుపమ

దండి — ఏదోవిధమైనను సాదృశ్యము కానఁబడిన నది యుపమ

వామనుఁడు — గుణలేశములవలనను ఉపమానముతో నుపమేయమునకు సామ్యము చెప్పుట ఉపమ

రుద్రటుఁడు — భేదముగల పదార్థములకు సాదృశ్యము చెప్పఁబడినయెడల నుపమ

రుయ్యకుఁడు — ఉపమానోపమేయముల సాదృశ్యమునందు భేదాభేదములు సమానముగ నున్న నుపమ

జగన్నాథుఁడు — వాక్యార్థమునకు నుపస్కారకమును సుందరమును అయినసాదృశ్యము ఉపమ

విద్యానాథుఁడు — వర్ణింపఁబడిన యొక పదార్థమునకు స్వతఃసిద్ధమైనట్టిదియు భిన్నమైనట్టిదియు రసికసమ్మత మైనట్టిదియు నగు మఱియొకపదార్థముతో ధర్మసంబంధమైన సామ్యమును వాచ్యముగ నొక్కసారి చెప్పుట యుపమ

చిన్నకోట పెద్దన —

క. గుణసద్ధర్మకర్మముల ను
ల్బణ మఱియొకవస్తువునకుఁ బరువడిఁ దుల్య
ప్రగుణతనముఁ జేయు టెయ్యది
గణుతింతురు దాని నుపమగా బహువిధులన్

భట్టుమూర్తి —

సీ. ఉత్ప్రేక్షవలె నభిద్యోతమై కాకన
న్యయమగుటైన దభిన్నంబు గాక
హీనోపమయుఁ బోలె నిల మాన్యదృశ్యము గాక
యుపమాన మధికమై యుండదేని
శ్లేషంబువలెఁ బరస్పరమాత్రము గాక
సార్థమై యల రూపకాదులక్రియ

౬. వాచకలుప్తలు — సమాసగత, కర్మక్విబ్గత, ఆధారక్విబ్గత, క్విబ్గత, కర్మణముల్గత, కర్తృణముల్గత

౭. ధర్మవాచకలుప్తలు — క్విబ్గత, సమాసగత

౮. ధర్మోపమానలుప్తలు — వాక్యగ, సమాసగ

౯. వాచకోపమేయలుప్త — క్విబ్గత

౧౦. ధర్మోపమానవాచకలుప్త — సమాసగ

వీనికి వేఱువేఱు ఉదాహరణముల నూహించుకొనవలెను.

కావ్యప్రకాశకారుని మతమున పూర్ణాభేదములు ౬ ను, లుప్తాభేదములు ౧౯ యుం గలసి 'ఉపమ'కు ౨౫ భేదములు ఇతరులు ౩౨ భేదము లని చెప్పిరి

ఇంకొకవిధముగ విభజన — పైని చెప్పఁబడిన ౨౫ లేక ౩౨ భేదములలో ఒక్కొక్కదానిని మరల ౫ విధముల విభజించి విభాగప్రియులు మొత్తముగ, ౧౨౫ లేక ౧౬౦ భేదములు ఉపమకుఁ గల్పించిరి!!! ఈ ౫ భేదము లేవి యన — ౧ వస్తు, ౨ అలంకార, ౩ రసరూపము లైన ప్రధానవ్యంగ్యములకు నుపస్కారకముగను, ౪ వస్తు, ౫ అలంకారరూపము లైన వాచ్యమున కుపస్కారకముగను ఉండుటవి

ఉదా (౧). వ్యంగ్యవస్తూపస్కారిక —

ఎల్లప్పుడును పరోపకారచింతయే కలిగి పరిశుద్ధమైన అంతఃకరణములుగల మహాత్ములవచనములు ఔషధములవలె మొదటఁ జేఁదుగఁ గానవచ్చును — (ర గం)

ఇందలి 'ఔషధములవలె' నన్న యుపమవలన, మహాత్ముల వచనములు మొదటఁ జేదుగ నుండినను, వానిని విని అట్లాచరించిన పిదపఁ బరిణామమున నవి పరమసుఖప్రదము లగు నని రమ్యమైన వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది.

ఉదా (౨) వ్యంగ్యాలంకారోపస్కారిక

మచ్చవలె నున్న కస్తూరిబొట్టుగల నీ ముఖమును జూచి అక్కడ పిల్ల లల్లాడుచే వికాసమును పొందిన చెక్కిలలోనుండి చంచూపుటములు కదలించుచున్నవి — (ర. గం)

ఇందు, ప్రధానవ్యంగ్య మైనది ముఖమునందుఁ జంద్రారోపణముగల భ్రాంతిమదలంకారము. దానికి ముఖమందలి కస్తూరిబొట్టును చంద్రునిలోఁ బోల్చిన ఉపమ ఉపస్కారకము.

ఉదా (౩). వ్యంగ్యరసోపస్కారిక —

నీకు వక్షస్థలము పెద్ద అచ్చట నున్నందున బిడ్డచే నన్నుఁ జక్కగాఁ జూచుటకు వీలు లేక యూచెలి యెరగంటిచూపుతోఁ జూచెను. ఇప్పుడిప్పుడు వికసించుచున్న చక్కదనమును బోలియున్న యా కన్నులతో నీకు మేలగుఁగాక ! — (ర గం).

ఇందు వ్యంగ్యముగ నున్న రసము విప్రలంభశృంగారము. 'ఇప్పుడిప్పుడు వికసించుచున్న చక్కదనమును బోలియున్న యా కన్నులు' అన్న యుపమ రసమునకు నుపస్కారకము

ఉదా (౪) వాచ్యవస్తూపస్కారిక

శరత్కాలచంద్రునివంటి నీ ముఖము వాకిలలను శీతలములుగఁ జేయుఁగాక! — (ర గం)

ఇందలి కములను శీతలములుగఁ జేయుచున్నట్టి వాచ్యరూపమగు వస్తువునకు శరచ్చంద్రోపమ ఉపస్కారిక

ఉదా (౫) వాచ్యాలంకారోపస్కారిక

శీతముచే సరోరుహమును, పగటిచేఁ జంద్రమండలమునువలె చక్కని దైన నీ ముఖము రోషముచే శోభించుటలేదు — (ర గం).

ఇందు 'దీపకాలంకారము' వాచ్యము దానికి 'ఉపమాలంకారము' ఉపస్కారకము.

వాచ్యమునందు రస ముండదు, కావున వాచ్యరసోపస్కారిక యను ఉపమ యుండనేర దని ధ్వనిపక్షమువారి యభిప్రాయము

౨ అనన్వయాలంకారము — ఒక వస్తువునకు సాటి లే దని చెప్పుటకై దానిని దానితోనే పోల్చుట 'అనన్వయము'

ఉదా రామునివంటివాఁడు రాముఁడే

దండిమతమున నిది యుపమాభేదము

౩ ఉపమేయోపమాలంకారము — లక్ష. రెండు వస్తువులను (వానిని బోలిన మూఁడవవస్తువు లే దని చెప్పుటకై) ఒకదానితో నొకదానిని (పరస్పరము) పోల్చుట 'ఉపమేయోపమ'

ఉదా సజ్జనులమనసు మేఘోదకమువంటిది, మేఘోదకము సజ్జనులమనసువంటిది

దండిమతమున నిది యుపమాభేదము

౪ స్మరణాలంకారము — లక్ష. ఒక పదార్థమును చూచినప్పుడు సాదృశ్యము( పోలిక )చేత మఱియొకటి స్మరణకు వచ్చినచో 'స్మరణము'

ఉదా ఈరాజు చేయుదానములను జూచినచో భారతమునందలి కర్ణుఁడు తలంపునకు వచ్చుచున్నాఁడు

'స్మరణము' సాదృశ్యమూలకము కాదేని యీ యలంకారము కాదు 'మిత్రునిఁ జూడఁగనే మేము చిన్ననాఁట నాడినయాటలు స్మరణమునకు వచ్చుచున్నవి' యన్న వాక్యమందలి స్మరణము సాదృశ్యోద్బోధకము కాదు కావున నిది స్మరణాలంకారము కాదు.

౫. రూపకాలంకారము — లక్ష. ఉపమేయమునందు [illegible] అభేదమందు ఉపమానము నారోపించినయెడల 'రూపకము'.

ఇచ్చట మొదటిదానిలోపము రెండవ దానిలోపమునకుఁ గారణము. అవశ్యము సముద్ర మునంటిమి గాన పైరర్థములు సాధ్య యగు జనియించెను

'శ్లిష్ట' మనియు, 'అశ్లిష్ట'మనియు నిందు రెండుభేదములు కలవు. 'శ్లిష్ట'మనఁగ శ్లేషచే సాధింపఁబడినది యనియు, 'అశ్లిష్ట' మనఁగ శ్లేష లేకుండ సాధింపఁబడిన దనియు నర్థము. 'అశ్లిష్ట'మును 'శుద్ధ' మనియెదరు. ఇం దొక్కొక్కటి మరల 'కేవలము', 'మాలారూపము' అని ద్వివిధము. ఇంకను క్రమముగ నుదాహరణములు

ఉదా (౧). ప్రతాపరుద్రనిఖడ్గ మహారాహువు శత్రురాజ మండలమును మ్రింగును — (ప్ర. రు).

ఇచ్చట 'రాజమండల'శబ్దము శ్లిష్టము. దానికి రాజుల సమూహ మనియు, చంద్రమండల మనియు రెండర్థములు

ఉదా (౨) కమలావాసకాసారుఁడును, కుమార్గపురిభవదీశ్వరుఁడును, కువలయేంద్రుఁడును అగునీరాజు మానవులకు సానందము గలుగఁజేయును —(ర గం)

ఇది 'శ్లిష్టమాలాపరంపరితరూపకము'. ఒక్కని పతించిరయే చెప్పఁబడిన యెడల శ్లిష్టకేవలపరంపరిత రూపకము యిందుఁ గలదు.

ఉదా (౩). ప్రతాపరుద్రుఁడు కాకతీయదుగ్ధసముద్రమునందుఁ బుట్టినచంద్రుఁడు — (ప్ర రు)

ఇది అశ్లిష్టకేవలపరంపరితరూపకమునకు నుదాహరణము

ఉదా వాస్త మహానర్పమునకుఁ గోలయు, శత్రువనశ్రేణికి సుడిగాలియు, కీర్తి మహాపేన మంటపముకుఁ బోగయు, జయలక్ష్మి యొక్క విలాస మైనకనుబొమయు, ఎంతయు శ్రీయవధూటి యను శ్రీదానోత్సవధారి యొండుపట్టిబానసమస్తియు, ప్రపంచ మహాప్రాసాదమునకు గడెయయు నగు కృపాణలతతోడి ప్రతాపరుద్రుఁడు విహరించుచున్నాఁడు — (ప్ర రు).

ఇది అశ్లిష్టమాలాపరంపరితోదాహరణము.

చంద్రాలోకమతంబున రూపకము రెండువిధములు — (అ) అభేదము, (ఆ) తాద్రూప్యము. ఇం దొక్కొక్కటి అధికము, న్యూనము, అనుభయము అను మూఁడుభేదములను చెందును. ఇట్లు రూపక మారువిధములు.

(అ) అభేదరూపకము.— ఉపమానోపమేయములకుఁ బూర్తిగ నభేదము చెప్పిన 'అభేదరూపక' మగును. అందును ఉపమానము కంటె నుపమేయమునందు నధికత చెప్పినచో నయ్యది 'అధికాభేదరూపకము' అగును.

ఉదా: (౧). ఈరాజు నిండుపొడుపుమగల శివుఁడు.

శివుఁ డర్ధనారీశ్వరుఁడు గనుక సగము పొడుమతిము గలవాఁడు. గాని నిండుపొడుపుము గలవాఁడు కావున శివునికంటె నధికుఁ డన్న భావము గన్పట్టుచుటచే 'నధికాభేదరూపకము'

ఉపమానముకంటె నుపమేయమునందు న్యూనత చెప్పినచో నది 'న్యూనాభేదరూపకము'

ఉదా (౨) ఈయోగి మూఁడుకన్నులు లేని శివుఁడు.

ఉపమానముకంటె నుపమేయమునందు నధికముగాని న్యూనముగాని చెప్పక రెంటికిని సమత్వము చెప్పినచో నది 'అనుభయాభేదరూపకము'

ఉదా (౩). ఈరాజు పురసంహారకుఁడగు మహేశ్వరుఁడు.

(ఆ) తాద్రూప్యరూపకము — ఉపమానోపమేయములకు భేదముగపడుచున్నను ఉపమానరూపముచేత నుపమేయమునకు రంజనము (రంగు) కలిగించినచో 'తాద్రూప్యరూపక' మగును.

ఉదా ఈతఁడు రెండవయీశ్వరుఁడు

ఇందు నీతనికిని, ఈశ్వరునకును 'రెండవ' పదముచేత భేదము కానవచ్చినను, ఈశ్వరునితో నతనికి తాద్రూప్యము చెప్పఁబడినది

అభేదమునకువలె దీనికిని అధిక న్యూనానుభయభేదంబులు కలవు. క్రమముగ నుదాహరణములు

ఉదా (౧). ఈముఖము కళంకరహిత మైనయపర చంద్రుఁడు.

ఉదా (౨) ఈమె పాలసముద్రమునం గుఁ బుట్టనియపరలక్ష్మి.

ఉదా (౩) ఈతఁడు రెండవయింద్రుఁడు

౬. పరిణామాలంకారము — లక్ష. ఎందు విషయి(ఉపమానము)స్వతంత్రముగాఁ గాక విషయ(ఉపమేయ)స్వరూపమును బొందియే ప్రకృతోపయోగి యగునో యది 'పరిణామాలంకారము'

ఉదా ప్రసన్నమైన నేత్రకమలములతో నీతఁడు నన్నుఁ జూచుఁగాక!

ఇందుఁ జూచునది కమలము కాని దానికిఁ జూచుసామర్థ్యము లేదు కావున నది చూచుసామర్థ్యముగల నేత్రముగాఁ బరిణమించె నని యర్థము. ఉపమానమైన కమలమునకుఁ బ్రస్తుతప్రయోజకర్తృత్వము (దూచుక్రియ) స్వతంత్రముగా లేదు; ఉపమేయ (నేత్ర) రూపముగనే యున్నది

'రూపకము'నందు ఉపమానాభేదము ఉపమేయమునందుఁ జెప్పఁబడును; 'పరిణామము'నందు ఉపమేయాభేదము ఉపమానమునందుఁ జెప్పఁబడును. ఇదియే రెంటికిని భేదము. ఎచ్చట నుపమానము ఉదాసీనముగ నుండునో, లేక దానికి స్వతంత్రముగ ప్రకృతకార్యోపయోగిత్వ ముండదో యది రూపకమే యని యెఱుంగునది.

ఉదా (౩) దేవాశ్వత్థముఁడయ్యు, మదనుఁడు వాఁడయ్యు అగు బ్రహ్మదేవుఁ డిట్టిదొక్కఁ డనఁదగు నిర్మింపలేఁడు — (విక్రమోర్వ)

అందఱు బ్రహ్మారే వృఃంభుము. కావున నిచ్చట సంబంధ మున్నను అసంబంధము చెప్పఁబడినది. ఇదియే 'అసంబంధాతిశయోక్తి'

ఉదా (౪) కస్తూరి మేడలు మిన్నంటి యుండుటచే, సురాంగనలు వచ్చి పురాంగనలవారి వనములఁ గొందురు—(శివతత్త్వసుధానిధి)

లేనిసంబంధ మిచ్చటఁ గల్పింపఁబడినది కావున 'సంబంధాతిశయోక్తి'

ఉదా (౫). మొదటనే శత్రువుల ప్రాణములు శరీరమునుండి వెడలెను, తరువాతనే యీరాజుయొక్క యమ్ములపొదినుండి బాణములు వెడలెను.

ఇందుఁ గార్యమైన ప్రాణవిబోదనము, దాని కారణమైన బాణవిబోదనమునకంటెఁ బూర్వము జరిగినట్లు వర్ణింపఁబడినది. కార్యకారణము లేక కాలమందు జరిగినట్లు వర్ణింపబడినను ఈ యలంకార మగును

ఉదా (౬) రాకాచంద్రుఁడు కళంకమును వదలెనేని ఈ కామినీముఖమునకు సాటి యగును —(చంద్రా)

'ఏని' మొదలగుపదములచేత లోకయర్థము ఆరోపించి అతిశయోక్తియర్థమున కల్పించుటకు నిది యుదాహరణము

౧౩ తుల్యయోగితాలంకారము — ప్రకృతములకు మాత్రము గాని, అప్రకృతములకుమాత్రము గాని గుణక్రియారూపమైన యేకధర్మాన్వయము 'తుల్యయోగిత' యను ఔపమ్యము గమ్యము

ఉదా (౧) చంద్రోదయమువలనఁ జోరల ముఖములును తామరపువ్వులును ముకుళితము లాయెను —(కువల)

ఇందలి 'చోరులముఖములు', 'తామరపువ్వులు' ఈ రెండును ప్రకృతములు, వర్ణింపఁదలంచినవి యగుటచే వీనికి ముకుళక్రియచే నేకాన్వయము సంభవించెను

ఉదా (౨) అమృతమును, చంద్రబింబమును, పద్మమును నీ ముఖమునకు నెదుట నిలువలేక ప్రతిహతము లయ్యెను.

౧౪ దీపకాలంకారము — లక్ష. ప్రకృతములకును, అప్రకృతములకును ఒక్కసాధారణధర్మముచే నన్వయము కలిగిన నది 'దీపకము'. ఇందును ఔపమ్యము గమ్యమే.

ఉదా : (౧) సుజనులు పరోపకారమును, క్రూరులు కృత్రిమమును, కృపణులు ధనమును, కులసతులు వినయమును ప్రాణాంతమువఱకు విడరు — (ర గం).

ఇందు రాజుయొక్క పరోపకారవర్ణనము ప్రస్తుతము. దీనిని, ఇతరవాక్యములు తక్కిటిని ఒక్కటే క్రియ కలదు. ఇక్కడ కర్త యొక్కఁడును క్రియ లనేకములును ఉన్నయెడల కారకదీపక మనిపించుకొనును

కారకదీపకము — ఉదా (౨) రాజా! ధన మొసంగుటకును, యశస్సును సంపాదించుటకును నీవు మిక్కిలి నిపుణుఁడవు — (ర గం)

ఇందు ధన మొసంగుట, యశస్సు రక్షించుట ప్రకృతవిషయములు, మిగిలినక్రియ లప్రకృతములు

౧౫ ప్రతివస్తూపమాలంకారము — లక్ష. ఉపమానోపమేయములకుఁ గల యొక్క సమానధర్మముచే (ఉపమానోపమేయరూపము లయిన) వేఱువేఱువాక్యములయందు వేఱువేఱుశబ్దములచేఁ జెప్పిన 'ప్రతివస్తూపమ' యగును

ఇం దౌపమ్యము (పోలిక) గమ్యము, అర్థి తాత్పర్యము వలనఁ దెలిసికొనఁదగినది, కాని యుపమలోవలె 'వలె' మొదలయిన పదములవలన స్పష్టము కాదు

ఉదా గొప్పయుద్దేశములు గలసజ్జనులకు వారిశక్తి సంధించినను వారి పూర్వము మాపని యౌదార్యమునే వ్యాపింపఁ జేయుదురు తన్ను నిప్పంటుకొనినను కృష్ణచందనము గోత్తరమైనపరిమళమును చుట్టును ప్రకటించును — (ర గం)

ఇందు 'వ్యాపింపఁజేయుట', 'ప్రకటించుట' యను భిన్నపదములచే వస్తుప్రతివస్తుభావమును జెందిన యొకసమానధర్మమే చెప్పఁబడినది

దీనిని వైధర్మ్యరూపముగఁ గూడఁ జెప్పవచ్చును

ఉదా పండితులకష్టము పండితులకే తెలియును ప్రసవవేదనను గొడ్రా లే మెఱుంగును?

౧౬ దృష్టాంతాలంకారము — లక్ష. ఉపమానోపమేయ వాక్యములందు భిన్నధర్మములు బింబప్రతిబింబభావమున సమానధర్మత్వమును జెందియున్నయెడల 'దృష్టాంతాలంకారము'.

ఉదా సత్పురుషుఁ డెవ్వరును కోరకయే తనంతట తాను లోకమునకు మేలు చేసి యందఱును సంతోషింపఁజేయును. కల్వగలవలగుంపును వికసింపఁజేయు మని చంద్రుని యెవ్వరు కోరిరి?— (ర గం)

ఈ యుదాహరణమునందు 'సంతోషింపఁజేయుట', 'వికసింపఁజేయుట' యనునవి ధర్మములు వీనియందు బింబప్రతిబింబభావము కలదు

దీనికిని ప్రతివస్తూపమకును భేద మేమన, ప్రతివస్తూపమయందు సాధారణధర్మము వస్తుప్రతివస్తుభావమును జెందియుండును. ఇందు బింబప్రతిబింబభావమును జెందియుండును ఒకయర్థమును రెండు భిన్నశబ్దములచేఁ జెప్పుట వస్తుప్రతివస్తుభావము. సమానముగ భిన్నము

ఉదా॥ అతనిశత్రువులలోఁగూడ నతనికీర్తి దిగంతములయందు వ్యాపించెను — (౮౦)

ఇది కార్యకారణభావవైపరీత్య మగుటచే యతిశయోక్తియనియే కొందఱందురు

౨౦ వినోక్త్యలంకారము — లక్ష॥ ఒక వస్తువు లేమిచే మఱియొకవస్తువునకు రమ్యత్వము గాని, అరమ్యత్వము గాని కలిగిన దని చెప్పుట 'వినోక్తి'

ఉదా॥ చంద్రుఁడు లేనిరాత్రి, వినయములేనిలక్ష్మి, రసము లేనికావ్యము వ్యర్థములు

౨౧ సమాసోక్త్యలంకారము — లక్ష॥ ఎచ్చటఁ బ్రకృతము విశేషణయుక్తముగఁ జెప్పఁబడఁగా, చెప్పఁబడినట్టి యప్రకృతము కూడ విశేషణసామ్యమువలననే స్ఫురించునో యది 'సమాసోక్తి'

ఉదా॥ ఓగంగ! నీయొడిలోఁ గూర్చుండి అతిమనోహరతరమైన పయస్సు త్రావి త్రావి, అఖిలశ్రమభారమును మఱచి నే నెప్పుడు సౌఖ్యముగ నిద్రపోదును! — (ర గం)

ఇది గంగాదేవియొక్క స్తుతి కాని 'ఒడిలోఁ గూర్చుండుట' 'పయస్సును త్రావుట' అనుపదములవలన గంగ తల్లి యైనట్లును, తాను కుమారుఁ డైనట్లును స్ఫురించుచున్నది

ఈ యలంకారమునందు 'విశేషణసామ్యము' అలంకారకారణము అది మూఁడువిధములు ౧. సాధారణము, ౨ ఔపమ్యగర్భము, ౩ శ్లిష్టము మఱియు వ్యవహారసమారోపమే సమాసోక్తిజీవితము అది నాల్గువిధములు ౧ లౌకికవస్తువునందు లౌకికవ్యవహారసమారోపము, ౨ లౌకికవస్తువునందు శాస్త్రీయవస్తువ్యవహారసమారోపము, ౩ శాస్త్రీయవస్తువునందు శాస్త్రీయవ్యవహారసమారోపము, ౪ శాస్త్రీయవస్తువునందు లౌకికవస్తువ్యవహారసమారోపము

ఉదా॥ కాకతీశ్వరునియందు సాలంకారయు, లసద్వర్ణయు, సగుణయు, రసనిర్భరయు నగుభారతీదేవి భావానుబంధినిగా నున్నది — (ప్ర రు)

ఇందు నలంకారశాస్త్రసంబంధమైన వస్తు వగు భారతికిఁ జెప్పఁబడిన శ్లిష్టవిశేషణములచే లౌకికనాయికావ్యవహారము స్ఫురింపఁ జేయఁబడినది

ఇట్లే యితరభేదములకు నుదాహరణములను ఊహించుకొనునది

౨౨ పరికరాలంకారము — లక్ష॥ విశేషణములు సాభిప్రాయముగఁ జెప్పఁబడినచోఁ 'పరికరము'

ఉదా॥ అంగరాజ! సేనాపతీ! రాజవల్లభ! ద్రోణాపహాసీ! కర్ణ! దుశ్శాసనుని భీమసేనునివలననుండి కాపాడుము — (వేణీసం).

కర్ణుని హేళనముచేయుటకు నశ్వత్థామ చెప్పినమాట ఇది. దుశ్శాసనునిఁ గాపాడలేనినీకు నీ విశేషణము లన్నియు వ్యర్థము లని యిచ్చట భావము

ఈ యలంకారమునందుఁ బ్రకృతార్థోపపాదకంబును, చమత్కారియునగు వ్యంగ్యార్థ ముండును (మాధుర్య, పరికరాంకురాలంకారము)

౨౩ శ్లేషాలంకారము — లక్ష॥ ఒక్కమాటచే (శ్రుతిచే) ననేకార్థంబులఁ బ్రతిపాదించుట 'శ్లేష'.

ఉదా॥ రాజా కువలయానందకరుఁడు

'రాజు' అనఁగా ఱేఁడు, చంద్రుఁడు 'కువలయ' మనఁగా భూమి, నల్లగలువ కావునఁ నీ యొక్కవాక్యమునకు ఱేఁడు భూమికి నానందము కలిగించువాఁ డనియు, చంద్రుఁడు నల్లగలువలకానందము కలిగించు ననియు రెండర్థములు కలుగుచున్నవి

ఇత్యాది ౧ కేవలప్రకృతవిషయము, ౨ కేవలాప్రకృతవిషయము ౩ ప్రకృతాప్రకృత విషయము అని మూఁడువిధములు ౧-వ భేదమునందు శ్లేషచేఁ జెప్పఁబడిన రెండర్థములును ప్రకృతవిషయములే, అనఁగాఁ జెప్పఁదలఁచుకొన్న విషయములే, ఉపమేయములే ౨-వ భేదమునందు రెండర్థములును అప్రకృతములే ౩-వ భేదమునందు నొక్కటి ప్రకృతముగను, ఇంకొక్కటి యప్రకృతముగను ఉండును మొదటి రెండుభేదములందును విశేషణవిశేష్యములకుఁగూడ రెండర్థము లుండును మూఁడవభేదమునందు విశేషణములకుమాత్రము రెండర్థము లుండును విశేష్యములకు నొక్కయర్థమే యుండును

అట్లు గాక విశేష్యవిశేషణములు రెంటికిని శ్లేష యున్న యెడల నది 'శబ్దశక్తిమూలధ్వని'

ఉదా॥ (౧). శ్రీసతీమనోహరుఁ, డసమానబాణవైరి, యంధకక్షయకరుఁడ, శశిమచ్ఛిరోహరుఁడు, దివ్యగోత్రుఁ, డచ్ఛవిభూతిభూషణుఁడు మాధవుఁడు మిమ్ము రక్షించుఁగాత[1]

ఇచ్చట శివకేశవుల నిద్దఱను స్తుతించుట యుద్దేశము ఇట్లు ఆంధ్రభారతమునందు హరిహరనాథునకు సంబంధించిన ఆశ్వాసాది

1 శివపరము శ్రీ సతీదేవి భర్త, మదనవైరి, అంధకాసురుని చంపినవాఁడు, చంద్రుఁడు శిరస్సునందుఁగల వాఁడు, దేవత లను పశువులకుఁ బతి, తెల్లనిబూదిచే శోభించువాఁడు, ఉమాధవుఁడు విష్ణుపరము లక్ష్మి యను పతివ్రతకుభర్త, సాటిలేని బాణాసురునకు వైరి, అంధకు లను యాదవులకు క్షయము (పురము - ద్వారక) కల్పించియిచ్చినవాఁడు, కేతువు (చంద్రునివైరియైన రాహువు) శిరస్సును త్రుంచినవాఁడు, శ్రేష్ఠమైన గొల్లవాఁడు, నిర్మలమైన వైభవముచే శోభించువాఁడు, మాధవుఁడు. ఇందు మొదటి చివరశబ్దములు సమానార్థకములు కాక 'మాధవ', 'ఉమాధవ' పదములు విశేష్యములుగాఁ దీసికొనవలెను.

ఇది ఉక్తవిషయము, వక్ష్యమాణవిషయము అని రెండువిధములు. ఒకసంగతి చెప్పి తరువాత దానిని నిషేధించుట ఉక్తవిషయము. మొదట నిషేధించి పిమ్మట సంగతి చెప్పుట వక్ష్యమాణము.

ఈయలంకారమునకుఁ బలువురు పలువిధములుగ లక్షణములు చెప్పియున్నారు. వామనునిలక్షణమును జూడ నది 'ప్రదీపము'తో సరిపోవును.

౨౯ విరోధాలంకారము — లక్ష. విరోధము లేకయే విరోధ మున్నట్లు చెప్పుట విరోధాలంకారము. దీనికే 'విరోధాభాస' మందురు.

ఉదా. దుర్జనులమాటలు కోమలములును శీతలములును అయినను సత్పురుషుల హృదయములను కోయును, కాల్చును — (ర. గం.).

ఇందలివిరోధ మాభాసము గాని నిజము గాదు. నిజమైన పగ రొకదోషము, ఆభాస మైన నది యలంకారము.

జాతిగుణక్రియాద్రవ్యము లనఁబడు నాలుగింటికిని దమలోఁ దమకును ఒకదానితో మఱియొకదానికిని గలుగు వైరముల వలన నీయలంకారము పదివిధము లయ్యెను.

ఉదా. ప్రియవియోగమువలన నామెకుఁ గమలంబు లగ్ని యయ్యెను.

ఇందు 'కమల'జాతికిని 'అగ్ని' జాతికిని వైరము చెప్పఁబడినది. కమల మగ్ని యగు టెట్లు? అసంభవము. కావున విరహిణీదుఃఖాతిశయమునే నీవిరోధ మాభాసము. ఇట్లే వేఱుదాహరణంబుల నూహించుకొనునది.

౩౦ విభావనాలంకారము — లక్ష. కారణము లేకయే కార్యోత్పత్తిని చెప్పుట 'విభావన'.

ఉదా. వనితా! లాక్షారసముచే రాయఁబడకపోయినను నీచరణము లెఱ్ఱగ నున్నవి.

లాక్షారసము రాయుట కారణము, కా ళ్లెఱ్ఱఁబడుట కార్యము. ఇచ్చట స్త్రీయొక్క చరణములు స్వాభావికముగ నెఱ్ఱనివి. ఆకారణముచేఁ గవి కారణము లేకయే పుట్టినకార్యముగ వాని వర్ణించి యలంకారము సాధించెను.

అప్పయదీక్షితులవారు దీనికి నైదుభేదములు చెప్పిరి. కాని జగన్నాథుఁ డది యనావశ్యకము అని సిద్ధాంతీకరించెను.

౩౧ విశేషోక్త్యలంకారము — లక్ష. ప్రసిద్ధకారణకలాపము సిద్ధముగ నున్నను కార్యోత్పత్తి కాకపోవుట 'విశేషోక్తి'.

ఉదా. ఉపనిషత్తులయర్థమును దెలిసికొంటిని, భగవద్గీత పారాయణము చేసితిని, బ్రహ్మసూత్రభాష్యమును వల్లించితిని, కాని విషయములనుండి మనస్సును త్రిప్పలేనైతిని! — (ర. గం.).

౩౨ అసంగత్యలంకారము — లక్ష. కార్యకారణములు వేఱువేఱుస్థలములందుఁ గాని విరుద్ధస్థలములందుఁ గాని కానఁబడుట 'అసంగతి'.

ఉదా. ఎవ్వనికి వ్రణము కలదో వానికే వేదన యున్న మాట కల్ల. ఈచిన్నదానిచెక్కిలియందలి దంతక్షతము, సవతులకు వేదన కలిగించినది — (చంద్రా).

౩౩ విషమాలంకారము — లక్ష. అననురూప మైన సంసర్గమునకు 'విషమము' అని పేరు. ౧ విరూపకార్యోత్పత్తి, ౨ అనర్థోత్పత్తి, ౩ విరూపఘటన యని యివి మూఁడువిధములు.

కారణమునకు విరూపమైన కార్యము పుట్టుట విరూపకార్యోత్పత్తి.

ఉదా. (౧) నల్లగా నున్న యీకత్తి యీరాజు చేతఁ బట్టఁగానే తెల్లనికీర్తిని గనుచున్నది — (కువల).

ఒక కార్యమును చేయఁబూనినప్పు డది లభింపకపోఁగా మఱి యొక యనర్థము కలుగుట అనర్థోత్పత్తి.

ఉదా. (౨) రావణుఁడు హనుమంతునితోఁకను కాల్పఁదలఁచి దానికి నిప్పు ముట్టించెను, కాని తోఁకచే తనపట్టణము దగ్ధ మగుట అనుభవించెను — (కువల).

అనురూపములు కాని రెంటికి చేరిక చెప్పుట విరూపఘటన.

ఉదా. (౩) నక్క యెక్కడ దేవలోక మెక్కడ!

౩౪ సమాలంకారము — లక్ష. అనురూప సంసర్గము 'సమము'. అనురూపములైన రెండువస్తువులకు (ఉత్పత్తిలక్షణము, సంయోగాదిలక్షణము లన్న) సంబంధము వర్ణింపఁబడినయెడల నీయలంకార మగును.

ఇది అభిరూపసంఘటన, అనభిరూపసంఘటన అని ద్వివిధము.

ఉదా. (౧) రాజా! చంద్రిక చంద్రునితోఁ జేరినట్లును, గంగ చంద్రశేఖరునిఁ బొందినట్లును, కీర్తి తనకు సమరూపుఁడవైన నిన్ను ఆశ్రయించెను — (కువల).

ఉదా. (౨) పిశాచములవివాహములందు గర్దభములే గాయకులు.

౩౫ విచిత్రాలంకారము — లక్ష. కోరుఫలమునకు విరుద్ధమయిన ప్రయత్నముఁ జేయుట 'విచిత్రము'.

ఉదా. సత్పురుషులు సల్లోకములకంటెను ఔన్నత్యమును బొందుటకై నమ్రు లయ్యెదరు — (చంద్రా).

౩౬ అధికాలంకారము — లక్ష. ఆధారాధేయములలో నొక్కటి మిక్కిలి పెద్దదిగను మఱియొక్కటి మిక్కిలి చిన్నదిగను ఉన్నట్లు చెప్పుట 'అధికము'.

ఉదా॥ విశ్వమునకు నాశ్రయుఁడైన హరి యెుందు లోపలఁ బరుండియున్నాఁడో యట్టి నీ హృదయముయొక్క విస్తారము చెప్పుటకు వీలు లేదు — (ర గం)

ప్రపంచమున కంతకును ఆధారమైన హరికంటె ఆధేయమైన హృదయము పెద్దది యని వర్ణింపఁబడినది.

౩౭. అన్యోన్యాలంకారము — లక్ష. రెండువస్తువులలో దానిచేత నిదియు, దీనిచేత నదియు నుపకారమును జెందుచున్నట్లు చెప్పినచో 'అన్యోన్యము'

ఉదా॥ రాత్రిచేఁ జంద్రుఁడు శోభించుచున్నాఁడు చంద్రునిచే రాత్రి శోభించుచున్నది — (చంద్రా).

౩౮. విశేషాలంకారము — లక్ష. ప్రసిద్ధమైన యాధారము లేక యాధేయ ముండుటయు, అనేకములయిన యాధారములందు నాధేయ మొక్కటియే యేకకాలమందు నొక్కతీరుగా నుండుటయు, ఒకకార్యము ప్రారంభము గాఁగా దానిచేత నశక్యమయిన (గాఁదగని) మఱియొకకార్యముకూడ నగుటయు అని 'విశేషము' మూఁడు విధములు

ఉదా॥ (౧) కవు లేల వంద్యులు గారు? వారు దివి కేఁగినను వారియనల్పగుణగణములుగల వాక్కు త్రిలోకములను ఆకల్పాంతము గూడ రంజింపఁజేయును — (కా ప్ర)

ఉదా॥ (౨) ఆహా నీహృదయమునందును, కన్నులందును, వాక్కులందును నివసించియున్నందున, మావంటి పుణ్యహీనులకు తా నెక్కడ? — (కా ప్ర)

ఇది ఒకపత్నియం దక్కుడాదరముగల పతితో నితరసపత్ని యన్నవాక్యము

ఉదా॥ (౩) ఇల్లాలవు, మంత్రివి, ఏకాంతమునందు సఖివి, లలితకళలలో శిష్యురాలవు నిన్ను నెత్తుకొనిపోయిన కరుణారహితుఁడైన మృత్యువు, నాదియైన యే (కలగల) ద్రవ్యముల నెత్తుకొనిపోలేదు? (అన్నియు నెత్తుకొనిపోయె నని భావము) — (రఘు)

ఇది భార్యమరణమునకు దుఃఖించుచున్న అజునివాక్యము మృత్యువు ఇందుమతి నొక్కదానినే యెత్తుకొనిపోవ యత్నించెను గాని యందువలన విపరీతమైన సచివాది సర్వహరణరూపకార్యము సిద్ధించెను.

౩౯. వ్యాఘాతాలంకారము — లక్ష. ఒకకర్త యొుక కార్యమును ఒకయుపాయముచే సాధింపఁగ (లేక సాధింపఁబోవ) మఱియొకకర్తచే నాయుపాయముచేతనే తద్విరుద్ధకార్యము సాధింప నాకార్యము వ్యర్థ మగుట 'వ్యాఘాతము'.

ఉదా॥ దృష్టిచేతఁ గాల్పఁబడిన మన్మథుని దృష్టిచేతనే బ్రతికించి శివుని జయించినవారలగు స్త్రీలను గొనియాడెదను — (రాజశేఖరకవి).

ఒక్కకార్యసాధకమే విపరీతసాధకముగఁ బరిణమించుటయు వ్యాఘాతమే

ఉదా॥ బాల్యమని యుద్ధమునకు రావల దని యనియెద వేల? బాల్యమునకే కదా విద్యల నభ్యసించుట?

నీకు బాల్యము, యుద్ధమునకు రావల దని రాజు చెప్పఁగా యువరాజు చెప్పినజవాబిది రాజాభిమతమున బాల్యము యుద్ధమునకు రాకుండుటకుఁ గారణము యువరాజాభిమతమున నదియే యుద్ధమునకుఁ దాను పోవుటకుఁ గారణము

శృంఖలాలంకారములు — లక్ష. పంక్తిరూపముచే (వరుసగ) నిబద్ధము లయిన యర్థములలోఁ బూర్వపూర్వముల కుత్తరోత్తరములతోను, లేక యుత్తరోత్తరములకుఁ బూర్వపూర్వములతోను లంకె వేసి చెప్పినయెడల నది 'శృంఖల' యగును ఇయ్యది మూఁడు విధములు కారణమాల, ఏకావలి, సారము

౪౦. కారణమాలాలంకారము — అనుగుణములయిన కార్యకారణములకుఁ గల శృంఖల 'కారణమాల' యనఁబడును

ఇది, మొదటఁ గారణమును జెప్పి తరువాతను గార్యములను జెప్పునది యొకటియు, మొదటను గార్యమును జెప్పి పిదపఁ గారణమును జెప్పునది రెండవదియు నని రెండువిధములు

ఉదా॥ జితేంద్రియత్వము వినయమునకుఁ గారణము, వినయము గుణప్రకర్షమునకుఁ గారణము, గుణప్రకర్షము జనానురంజకత్వమునకుఁ గారణము, జనానురంజకత్వము సంపదలకుఁ గారణము — (కా ప్ర)

ఉదా॥ (౨) నరకము పాపమువలనను, పాపము దారిద్ర్యము వలనను, దారిద్ర్యము దానము చేయమిచేతను ప్రాప్తించును గావున దానము చేయవలయును — (కువల)

౪౧. ఏకావల్యలంకారము — లక్ష. విశేష్యవిశేషణభావములకు లంకె (సంసర్గము) గల శృంఖల 'ఏకావలి' యగును,

ఇది రెండువిధములు విధిరూపము, నిషేధరూపము అని

ఉదా॥ (౧) దేవా! ధర్మముచే నీబుద్ధి పరిశుద్ధమయినది బుద్ధిచే లక్ష్మి ఆరికట్టఁబడినది లక్ష్మిచే లోకమందలి సకలజనులును సంతుష్టిని జెందిరి జనులచే నీకీర్తి సకలభువనములకును గొనిపోఁబడియెను — (ర గం)

ఉదా॥ (౨) పెద్దలు లేనిది సభ కాదు, ధర్మము చెప్పనివారు పెద్దలు గారు, సత్యము లేనిది ధర్మము కాదు, కపటముతోఁ గూడినది సత్యము గాదు — (చాటు).

పైని తెలుపఁబడిన రెం డుదాహరణములను పూర్వపూర్వము ఉత్తరోత్తరమునకు విశేషణభావముగా నుండునట్టివి.

ఉ॥ 'పంట' నని యుత్తరము — (ఆంధ్ర చంద్రా)

చివర రెండుభేదములను 'చిత్రోత్తర' మనియెదరు ఇవి శబ్ద శ్లేషమూలకములు

౬౧ సూక్ష్మాలంకారము — లక్ష॥ సూక్ష్మార్థమును, ఇంగితముచేఁ గాని, ఆకారముచేఁగాని, తాను దెలుపఁగోరినవారికి నితరులకుఁ దెలియకుండఁ దెలియఁజేయుట 'సూక్ష్మము'

ఉదా॥ (సంకేతకాల మెప్పు డని తెలిసికొనఁ గోరుచున్న) జేను చూచుచుండఁగ నా వనిత తననీలుంతమునిని దనకెం ద్రుకలలోఁ గప్పికొనెను (సూర్యుఁ డస్తమించినతరువాత నని తెల్పెను) - (కువల)

సూక్ష్మార్థ మనఁగా తెలివిగలవారికి, (లేక సహృదయులకు) మాత్రము తెలియునట్టిసంగతి 'ఇంగిత' మనఁగా చేష్టావిశేషము 'ఆకార' మనఁగా నభిప్రాయము సూచింపఁదగినవ్యాపారము

౬౨ వ్యాజోక్త్యలంకారము — లక్ష॥ స్ఫుటమైన వస్తు స్వరూపమును కపటముచేఁ గప్పిపుచ్చుట 'వ్యాజోక్తి'

ఉదా॥ హిమవంతుఁడు పార్వతిని తనచేతులలోఁ బెట్టఁగా నామె కరస్పర్శముచే శరీరమునందు కంపరోమాంచాదికములు పుట్ట 'అబ్బా! హిమవంతునిచేతు లెంత చల్లఁగ నున్నవి' యని శివుఁ డనెను — (కా ప్ర)

తనకుఁ గల్గిన వాత్త్విస్వేదరోమాంచాదులు పార్వతీస్పర్శము వల్లఁ గాక తనచేతిలో నామెను పెట్టుచున్న హిమవంతునిచేతుల చల్లఁదనమువలన నని శివుఁడు కప్పిపుచ్చుటకు యత్నించెను

'అపహ్నుతి' యందుఁ బ్రకృతాప్రకృతములయందు సామ్య ముండును, ఇచ్చట నుండదు ఇదియే వీనికి భేదము

౬౩ వక్రోక్త్యలంకారము — లక్ష॥ శ్లేషచేఁగాని కాకు స్వరముచేఁగాని వాక్యమునకు నర్థాంతరము కల్పింపఁబడినచో 'వక్రోక్తి'

ఉదా॥ (౧) ఆమె యేమి చేయుచున్నది? నీళ్లాడుచున్నది ప్రతిదినమును నీళ్లాడినను ఒక్కకుమారుని నైనను కనదే? యిది యేమి వింత?

ఇందు మొదటి 'నీళ్లాటకు' స్నాన మని యర్థము దానిని శ్లేషచే 'ప్రసవించు' నన్న యర్థాంతరముగ మార్చి రెండవ 'నీళ్లాట' ప్రయోగింపఁబడినది

ఉదా॥ (౨) కోర్టులో సాక్ష్యము చెప్పువారు 'దేవునియెదుట నంతయు నిజము చెప్పెదను' అన్నమాటలను ప్రశ్నార్థకస్వరముతోఁ జెప్పినయెడల వానికి విపరీతార్థము కలుగును.

ఇది శబ్దాలంకార మని మమ్మటమతము. ఇతర లాక్షణికులు (అలంకారసర్వస్వకారుఁడు, విద్యాధరుఁడు, విద్యానాథుఁడు, దీక్షితులు మొదలగువారు) అర్థాలంకార మనిరి.

౬౪. స్వభావోక్త్యలంకారము — లక్ష॥ ఉన్నది యున్నట్టు స్వాభావికముగ వర్ణించుట 'స్వభావోక్తి' దీనికే కొందఱు 'జాతి' యందురు

ఉదా॥ 'ఇత్తెఱంగున మత్తగజంబులు వచ్చి సరోవరంబునఁ జొచ్చి మదిచ్చకలు పెచ్చుమీఱం గరంబుల జలంబులు పూరించి కరులం గరేణువులమీఁదను కరేణువులు కరులమీఁదను జల్లుచు కుండాదండంబులం బుండరీకంబులు వెఱికి విండిన కుతూహలంబున గండు మిగిలి త్రొక్కాడుచు వనోద్ధతిగ్రహదనచొరభంబు లాస్వాదించి మోదంబున బృంహితంబులు సేయుచు భ్రమత్కరాగ్రంబుల జలంబులు పూరించి దిమ్మనఁగ్రోవులంబోలె కొండొంటిపయిం జిమ్ముచు ననేక ప్రకారంబులఁ గ్రీడించి మాతంగులుబలవంతంబున జలవిహారం బుజ్జగించి పురంబునకు మగుడునంత' — (ఆంధ్రమైమినిభారతము)

అలంకారసామాన్యమైన చమత్కృతిజనకత్వ మిందును ఉండవలయును లేనియెడల గుఱ్ఱము గడ్డి తినెను, సకిలించెను, లద్దివేసెను, వెనుకకాలితోఁ దన్నెను అనువర్ణనమును 'స్వభావోక్తి' యనుకొని మనము దినమున మాటలాడునది యంతయు, వ్రాయునది యంతయు (కొద్ది తప్ప) 'స్వభావోక్తి' యనియే చెప్పవలసి యుండును. కావున సందఱకును గోచర మగువస్తుస్థితి గాక, సూక్ష్మ వీక్షణము గల కవికిమాత్రము గానవచ్చునట్టి సూక్ష్మస్వభావములు వర్ణింపఁబడినచో నది 'స్వభావోక్తి' యనుకోవలె యన్యథా కా దని అలంకారసర్వస్వకారునిమతము తాత్పర్య మేమన వస్తువులయొక్క సాధారణధర్మము గాక అసాధారణధర్మము ఉన్నది యున్నట్టు వర్ణింపఁబడెనేని అది 'స్వభావోక్తి' యనిపించుకొనును

పాశ్చాత్త్యసాహిత్యమునందు 'స్వభావోక్తి' కి మిక్కిలి గౌరవము కలదు అత్యుక్త్యాదులు లేకుండ, నున్నది యున్నయట్లు స్వాభావికముగను, సహృదయ హృదయాహ్లాదకరముగను వర్ణింపఁగల్గిన కవియొక్క ప్రతిభాశక్తి యితర యలంకారములతో సాధింపఁజాలనిదే యనుట సమంజసము కాకపోదు. తేటతెల్లముగా నుండునట్లుఁ జెప్పినచో, తెలియుటకుఁ సు లభము గాని వారి యభిప్రాయము

౬౫. భావికాలంకారము — లక్ష॥ జరగినది గాని జరగఁబోవునది గాని అత్యద్భుతార్థకథనమువలన నిప్పుడు జరుగుచున్నట్లు వర్ణింపఁబడెనేని 'భావికము'

ఉదా॥ తనపుత్రికిట దివ్యములయిన మన్నన కన్నులకుఁ గాంచి నమునికులపతి యగు నగస్త్యమునికి జయము అగుఁగాక — (అ. స.).

ఇయ్యది యీయలంకారమునకు నుదాహరణ మని పూర్వమునుండి పరంపరగా వచ్చుచున్న శ్లోకము ఇచ్చట సముద్రపానముఁ జెప్పుట యుద్దేశము సముద్రమునందుండు అతిమత్స్యకచ్ఛపాదులను తనయంజలిలో నగస్త్యుఁడు చూచుచున్నాఁ డని చెప్పుటవలన సముద్రపానము ప్రత్యక్ష మగుచున్న దని యీ యుదాహరణము చెప్పువారితాత్పర్యము

కాని భామహోదులు దీనిని కావ్యగుణముగ కొందిరి వారి మతమునఁ గావ్యములో నేకాంత భాగము దీనికి నుదాహరణముగా నుండ వచ్చుఁగాని ఒకటి రెండుపద్యములలో నిది గాఁబడదు కవి తన మనసులోని భావమును దీనిమూలకముగఁ జదువరులకుఁ బ్రత్యక్షముగఁ జూపును కావున నిది భావికము ఇందుకు నాంధ్ర మహాభారతమందలి యుద్ధప్రకరణము లుదాహరణముగఁ జెప్పవచ్చును అందును భీష్ముఁడు కృష్ణునిచేఁ జక్రము పట్టించిన ప్రకరణమును, అభిమన్యునిదిక్కర యుద్ధమును, సైంధవవధనాఁటియుద్ధంబును, దుశ్శాసన వధయు నీభావికాలంకారమున కుదాహరణంబులు సంస్కృత వాఙ్మయంబునఁ గాదంబరిలోని మహాశ్వేత వర్ణనంబు, హర్షచరితారంభమున నున్న దేవస్వరూపవర్ణనము, మునిక్రోధవర్ణనము, పులింద వర్ణనము మొదలయినవి ఇందు కుదాహరణము లని తెలిసికొనవలెను

దీనికిని స్వభావోక్తికిని భేదము కలదు రెండింటిలోను వర్ణింపఁ బడినవిషయము ప్రత్యక్షముగఁ గానవచ్చుట కలదు కాని, వస్తు స్వభావవర్ణనము స్వభావోక్తికిఁ గారణము ఇందు నద్భుతవర్ణనమందులకుఁ గారణము ఇది రసవదలంకారము కాదు అందు విభావానుభావముల ననుసరించి రసాదికములు భాసించును అద్భుత వర్ణనములవఁ గాదు ఇది భ్రాంతిమంతము గాదు ఈభావనయందు భ్రాంతి లేదు

౬౬ ఉదాత్తాలంకారము — లక్ష వస్తుసమృద్ధిని (సంపత్తును) గాని, ప్రకృతవిషయమునకు మహాపురుషచరితమును అంగముగాఁ (ఉపలక్షణముగా) గాని వర్ణించుట 'ఉదాత్తము'

ఉదా (౧) రత్నస్తంభములకాంగుఁ గానఁబడుచున్న ప్రతిబింబసమూహములచే నావరింపఁబడియున్న రావణుని హనుమంతుఁడు కన్నులమీఁదఁ దెలిసికొనను — (ఆంధ్ర చంద్రా)

ఇది వస్తుసమృద్ధికి (సంపదకు) నుదాహరణము

ఉదా' (౨) శ్రీరామచంద్రుఁడు పితృవాక్యపరిపాలనమునందాసక్తుఁడై భార్యామాత్రసహాయుఁ డగుచు వాసముచేయుచుండి రాక్షసులను నిర్మూలముచేయుస్థానము ఈ దండకారణ్యము (సాధిం)

ఇది మహాపురుషచరితము అంగముగ వర్ణింపఁబడిన 'ఉదాత్తము'.

౬౭ రసవదలంకారము — లక్ష శృంగారాది నవరసములలో నెయ్యదియైన మతియొకరసమునకు నంగముగఁ బ్రతిపాదింపఁ బడెనేని యది 'రసవదలంకార' మగును

ఉదా ఓ రాజా! నీ శత్రుస్త్రీలు స్వప్నములయందుఁ గన్న ప్రియతముల కంఠాశ్లేషమును నిజ మనుకొని, 'ప్రియుఁడా! పరిశోధ మేల? నాకంటెఁ గఠఁబడి మరల దేశాంతరమునకుఁ బోవుదువే? ప్రియా దయమాలినాఁడా! నీవుఁ బ్రవాసరుచి యేమిటికి? నీ చెవ్వాని చేత దూరీకృతుఁడ వైతివి?' అని పలుకుచు మేల్కాంచి ప్రియుఁడు తమ బాహుబంధనమున లేకుండుటను జూచి యెలుంగెత్తి యేడ్చెదరు — (అ స)

ఇచ్చట వాక్యార్థభూతమును అంగియు ముఖ్యమైనదియు నగు రసము 'కరుణము', అంగభూతరసము విప్రలంభశృంగారము

పైని తెలుపఁబడినలక్షణము ధ్వని నొప్పుకొనువారు చెప్పనది. వీరిమతమున అంగిగా నున్న రసము ధ్వని యనియు, అంగరసము అలంకార మనియు కాని ధ్వని లే దనువారు రసము 'అంగ' రూపమున నున్నను 'అంగి' రూపమున నున్నను అలంకారమే యని యందురు

౬౮ ప్రేయోలంకారము — లక్ష ఒకభావ మన్యభావమునకుఁ గాని, రసమునకుఁగాని అంగముగఁ జెప్పఁబడెనేని యది 'ప్రేయస్సు' దీనికే 'భావాలంకార' మనియు ననిరెందరు

ఉదా (౧) అంత్యకాలమందు యముఁడు నాగపాశము నా మెడకు వేయునపు డో గజేంద్రవరద! నాకప్పుడు ప్రాణాలపైనను నీ పొలిక కలుగుఁగావున నేను మరణమునందుఁ గూడ సంతోషముఁ జెందుదును

ఇందు భగవద్విషయమైన 'రతి' భావము 'అంగి', దానికి మరణవిషయమైన 'రతి' అంగము

ఉదా (౨) కాశిలో దేవనదీతీరమునఁ గూర్చుండి గోచి పెట్టుకొని రెండుచేతుల జోడించి 'ఓ గౌరీపతీ! త్రిపురహర! శంభూ! త్రినేత్ర! నన్ను రక్షింపు' మని యఱచుచు నే నెప్పుడు గినములను నిమిషములవలెఁ గడపుదును? (కువల).

ఇందు శాంతరసము అంగి, దానికి 'ఎప్పుడు గడపుదును?' అనుపదములచే సూచితమైన 'చింత' యను 'వ్యభిచారిభావము' అంగముగఁ జెప్పఁబడినది కావున 'ప్రేయస్సు'

౬౯ ఊర్జస్వి అలంకారము — లక్ష రసాభాసము గాని భావాభాసము గాని గుణీభూతత్వముఁ బొందెనేని (మతియొకదానికి నంగముగఁ జెప్పఁబడెనేని) 'ఊర్జస్వి' యగును

ఉదా భయముచే నరణ్యములో దాఁగియున్న నీశత్రువుల చక్కనిస్త్రీల యంగసౌందర్యమును సాభిలాషముగఁ దిలకింపని యొక చెంచువాఁడైనను అడవిలోఁ గలఁడా?

ఇచ్చటఁ జెంచువాండ్రయొక్క పరదారవిషయకాభ్యర్థము అనౌచిత్యమైనది కావున నిది 'శృంగారాభాసము' ఇది రాజవిషయకరతికి అంగము కావున 'ఊర్జస్వి'

౭౦ సమాహితాలంకారము — లక్ష భావశాంతి మతియొకదానికి నంగముగఁ జెప్పఁబడినచో 'సమాహితము'

ఉదా ఇది యేమి చేయుచో చూచెద మని నే నేమియు మాటలాడకుండ నుంటిని; వీఁడు నాతో మాటలాడకయున్నాఁడు

# అలంకారములు

కలఁ డని తలఁచి యతని కోపము శాన్తయించెను, ఇట్టి శౌర్యశాలి యైనవాఁడు నిలకడదృష్టితోఁ జూచుచుండినఁగా నొకానొక దానికి తరువాత నీరు సాక్షిప్రాయముగ నవ్వితిని అది స్థైర్యమును కరఁగించు నట్టికావ్యమును విడిచెను'

ఇచ్చట శృంగారరసము 'అంగి', 'కోపశాంతి' దాని కంగము (భావ)

౩౧ భావోదయాలంకారము — లక్ష. భావోదయము మఱి యొకదాని కంగముగ నుండెనేని అది 'భావోదయ' మనఁబడును

ఉదా. సఖ్యాదులతోఁ గలసి మధుపానముఁ జేయుచున్న నీ శత్రుయులు, ఎట్లో నీపేరు విని విషాదమును బొందిరి

ఇందు రాజవిషయ రతిభావము అంగి, దానికి త్రాసాదిభావోదయము అంగముగఁ జెప్పఁబడినది

౩౨ భావసంధ్యలంకారము — లక్ష. భావసంధి మఱియొకదాని కంగమైనచో 'భావసంధి' యను అలంకారము.

ఉదా. రాజా! నీ యుద్ధసన్నాహము విని బయలుదేరుచున్న నీ వీరుల తమ భుజములచేతులతోఁ దమ ప్రియురాండ్ర కౌగిలిఁ ధారలను, కుడిచేతులతోఁ దమశస్త్రధారలను తుడుచుచుఁ జేయవలసిన కార్యమునందుఁ గొంతతడవు సందిగ్ధులైరి — (అ. స.)

ఇచ్చట ప్రియాస్నేహము, రణోత్సాహము అనెడి రెండుభావములకు 'సంధి' (ఒకవిధమైనపోటీ) చెప్పఁబడినది అంగిభూతమైన ప్రభువిషయభావమునకు నీ 'భావసంధి' యంగము కావున అలంకారము

౩౩ భావశబలతాలంకారము — లక్ష. 'భావశబలత' అంగముగ వర్ణింపఁబడినచో 'భావశబలత' యనునలంకారం బగును

ఉదా. అకార్యమెక్కడ! చంద్రవంశమెక్కడ? అది మరలఁ గనఁబడునా! మన శాస్త్రజ్ఞానము దోషములను తొలఁగించుటకే గదా! దానిమోము కోపమునఁగూడ నెంత చక్కఁగ నుండెను! ధర్మజ్ఞులయిన పెద్దలేమందురు? అది కలలోనైన దొరకునది కాదు చిత్తమా! శాంతింపుము గమ్యుఁడగు నీ యువతి దానియధరము గ్రోలునో! — (అ. స.)

ఇచట మొదట కార్యాకార్యములను విచారించుట 'వితర్కభావము', రెండవవాక్యమున 'ఔత్సుక్యభావము', మూఁడవవాక్యమున 'మతి', నాల్గవవాక్యమున 'స్మరణము', అయిదవవాక్యమున అపవాదభయము, ఆఱవవాక్యమున 'శంక', 'దైన్యము', ఏడవవాక్యమున 'ధృతి', ఎనిమిదవవాక్యమున 'చింత' అనుభావము లన్నియు నిందుఁ గూడినవి ఇది విప్రలంభశృంగారమున కంగము

ఇది దేవయానినిగూర్చి యయాతి చెప్పినది కొందఱును, ఊర్వశినిగూర్చి విక్రముఁడు చెప్పినది యితరులును చెప్పియున్నారు

౩౪ సంసృష్టి, ౩౫ సంకరము ను అలంకారములు — లక్ష. రెండు గాని, ఎక్కువ గాని అలంకారము లొకవాక్యమునందుఁ గలసియుండుటకూడ లాక్షణికులచే వేఱు అలంకారముగఁ జెప్పఁబడెను

ఇట్టికలిమిడి రెండువిధముల సంభవమ్మును ఒకటి తిలతండులములవలె (నువ్వులు బియ్యము వలెను), మఱియొకటి క్షీరనీరన్యాయమును (పాలునీరువలెను)

రెండు అలంకారములు తిలతండులములవలెఁ గలసియుండినచో, నవఁగా నొకదానితో మఱియొకదానికి సంబంధము లేకుండెనేని, యాకలిమిడి 'సంసృష్టి' అనంబడును

ఉదా. చీకటి తన యంగములను పూయుచున్నట్లున్నది, ఆకాశము కాటుకను కురియుచున్నది, అసత్పురుషసేవవలె చూపు నిష్ఫలమగుచున్నది — (మృచ్ఛకటికము)

ఇందు రెండుత్ప్రేక్షలకును, ఒక ఉపమకును 'సంసృష్టి'

శబ్దాలంకారసంసృష్టి, అర్థాలంకారసంసృష్టి, ఉభయాలంకారసంసృష్టి అని మూఁడువిధములుగ నీయలంకార మేర్పడవచ్చును

క్షీరనీరములవలె, నవఁగా నొకదానిని మఱియొకటి యాశ్రయించి అనేకాలంకారములు కలసియుండుట 'సంకరము'

అంగాంగిభావసంకరము, సందేహసంకరము, ఏకవాచకానుప్రవేశసంకరము అని 'సంకరము' మూఁడువిధములు.

ఒకయలంకారము ముఖ్యమై దానికాశ్రితమైన యితరాలంకారములు దానికి నవయవములుగాఁ జేరియుండుట 'అంగాంగిభావసంకరము'

ఉదా. ఓరాజా! నీశత్రుస్త్రీలరణ్యమునందుఁ బరుగెత్తుచుండఁగాఁ గిరాతులు వారిమరకతమణులకొఱకు భూషణములను, బంగారు కర్ణభూషణములను, రత్నఘటితములైన నూపురద్వయమును తీసికొని, బింబోష్ఠకాంతిచే గురివెందలదండ యని హారింపరైరి! — (కా. ప్ర.)

ఇచ్చట 'బింబోష్ఠకాంతి' (దొండపండు వంటి పెదవుల కాంతి) వలన ఆ హారమునకు సెలువురంగు వచ్చె నని చెప్పుటచే 'తద్గుణ' మను అలంకార మాయెను గురివెందలదండ యని తలఁచి కిరాతులు హారమును హరింపరైరి అని చెప్పుటచే 'భ్రాంతిమంత' మను అలంకారమాయెను ఇందుఁ దద్గుణము వలననే భ్రాంతిమంతము పుట్టినది కావున నీరెండు అలంకారములకును అంగాంగిభావము కలిగెను

ఈ యంగాంగిభావరూపసంకరము శబ్దాలంకారములకు సంభవింప దని 'అలంకారసర్వస్వ'కారుని మతము కాని కావ్యప్రకాశకారునకు నీమతము సమ్మతము

ఒకవాక్యమునందు సంభవించిన అలంకారములలో నేదానిని చెప్పినను సాధకబాధకములు లేకుండుట 'సందేహసంకరము',

ఉదా. బ్రహ్మదేవుఁ డీసముద్రమును గంభీరముగను రత్న పూర్ణముగను స్వచ్ఛకాంతిగలదిగను జేసి సరసపాసీయముగఁ జేయక పోయెను గదా! — (కా. ప్ర.)

సముద్రము ప్రస్తుతవిషయ మనుకొన్నయెడల, నిందలిది కేవ. గుణముల సాముగ్రిమువలన, సన్నిహితము సద్గుణములు గలిగి యొక్కసుగ్గ ణము గలపురుషాదులమనుతెంచిన అప్రస్తుతార్థప్రతీతి కలుగుచున్నది కావున దీనిని 'సమాసోక్తి' అనవచ్చును. సముద్ర మప్రస్తుత మని యనుకొన్నయెడల దానిసమునుణకవలన నేదియొ ప్రస్తుతము స్ఫురిం చును గావున నిది 'యప్రస్తుతప్రశంస' ఇచ్చట నిదియా యదియా యన్న సంశయము కలదు కావున నిది 'సంశయసంకరము'

ఒక్కవాచకశబ్దమునందు అలంకారములు స్ఫుటముగ నున్న యెడల 'ఏకవాచకానుప్రవేశసంకరము' అగును

ఉదా. మురారివలన నిర్గతము లయి నరకనిరోధముచేయు చుండెడిచక్రధార గంగవలెనే నీకలయుంగుఁ బరుగు — (ఆంధ్ర చంద్రా.)

ఇచ్చట 'మురారివలన నిర్గతము' అనునది చక్రధారకును, గంగకును సాధారణము

కావున 'వలె' అనుపదమునందు 'ఉపమ' కలదు 'నరక నిరోధము చేయు' అనుపదమునందు చక్రధారాపక్షమున నరకాసు రునివధయు, గంగపక్షమున నరకలోకనివృత్తియు అని శ్లేషవలన రెం డర్థము లేర్పడుచున్నవి కావున 'వలె' అనుపదమువలన ప్రకృతా ప్రకృతశ్లేషము స్ఫురించుచున్నవి ఇట్లు ఈ 'వలె' అనుఒకపదము నందు 'ఉపమ', 'శ్లేష' అను రెండలంకారములు నిమిడియున్నం దున ఇది 'ఏకవాచకానుప్రవేశసంకరము'

దీనికే కొందఱు ఏకప్రతిపాద్యసంకర మనియు, ఏకవ్యంజ కానుప్రవేశసంకర మనియుఁ జెప్పెదరు

౩౨. అనన్వయము — లక్ష. సర్వథా ఉపమానము నిషే ధించుట 'అనన్వయము'

ఉదా. సత్యసంధతయందు హరిశ్చంద్రునిఁ బోలినవాఁడు లేనే లేఁడు.

ఈ యలంకారము వ్యంగ్యముగ అనన్వయమునందు నుండును గాని రూపకదీపకాదులందు వ్యంగ్యముగ నున్న యుపమవలె నచ్చట జేయుచేరు వదయము గాని వాచ్యమునందు నిది స్వతంత్రచమత్కా రము గలది గాన భిన్నాలంకారముగఁ జెప్పఁబడును దీనినిగూడ పూర్వులంక్షి సందలయునకభాగముగ నీ లయనంతములు విభజింప వచ్చును.

ఉద్ద్యోతాదికర్తలు రెన్వరును దీనిని స్వతంత్రాలంకారముగ గొప్పకొనలేదు. కువలయానందమునందును గాక రాదు రసగంగాధర మున యున్నది.

౩౩ ఉదాహరణాలంకారము — లక్ష. సామాన్యముగఁ జెప్పఁబడినయర్థమును దృష్టవబుచుటకు ఏకదేశమును నిరూపించి సామాన్యమునకును, ఏకదేశమునకును గల అవయవావయవిభావమును జెప్పినయెడల నది 'ఉదాహరణము'

ఉదా. సద్గుణశాలి విపత్తులో నున్నను ఉపకారమే చేయును ఊర్ధ్వ చెందినదియుఁ, జచ్చినదియు నగు పాదరసమే యిందుకు నిదర్శనము (ర. గం.)

ఇందు అవయవావయవిభావబోధకము లగు 'వలె', 'నిదర్శ నము', 'దృష్టాంతము' — ఇత్యాదిపదము లుండును, అర్థాంతర న్యాసమునం దుండవు ఇది వీనికి భేదము

ఇది స్వతంత్రాలంకారము కా దనియు, ఉపమాలంకారమే యనియుఁ బురాతనాలంకారికులమతము — (ర. గం.).

దీనిని అలంకారసర్వస్వకారుఁడు గాని, కావ్యప్రకాశకారుఁ డుగాని, ప్రతాపరుద్రీయకారుఁడు గాని, కువలయానందకారుఁడు గాని స్వతంత్రాలంకారముగ నుదాహరించియుండలేదు రసగంగాధర కారుఁడుమాత్ర మిచ్చియున్నాఁడు

౩౫ ప్రౌఢోక్త్యలంకారము — లక్ష. ఒకవస్తువుయొక్క యొకధర్మమును అతిశయముగఁ బ్రతిపాదించుటనిమిత్తము ఆవస్తువుతో సంబంధము లేనిదియు ఆధర్మము ప్రసిద్ధముగాఁ గలదియు నగు మఱి యొకవస్తువుతో దానికి సంబంధము గలుగఁజేయుట 'ప్రౌఢోక్తి'

ఉదా. నీవు కుంకుమనీళ్లు బోసి నీదొడ్డిలో పెంచిన లవలీ లత యొకప్పుడు నీ శరీరచ్ఛాయను బోలుచున్నది — (ర. గం.)

లవలీలత స్వభావముగ తెల్లనిది అది యెట్టి ఎసుటకు కుంకుమ నీళ్లు కానికిఁ బోయనక్కఱలేదు కాని లతయొక్క రక్తిమను అధిక ముగఁ జెప్పి దానిని ఆస్త్రీయొక్క మేనిచాయతోఁ బోల్చుట కవి యుద్దేశము

౩౬ లలితాలంకారము — లక్ష. ప్రకృతధర్మియందుఁ బ్రకృతవ్యవహారముఁ జెప్పక యప్రకృతవ్యవహారసంబంధముఁ జెప్పిన యెడల 'లలితము'

ఉదా. ప్రపంచమునందు నిం కొక చక్రవర్తి లేదా? సీతయే నా నీకుఁ దగినది? రావణా! చందనవృక్షశాఖ లాగి నీవు ఫణీంద్రుని లేపితివి! — (ర. గం.)

ఇచ్చట, నీవు సీతను దెచ్చి రామునికోపమునకుఁ బాత్రుఁడ వైతి వని చెప్పుటకు మాఱుగా చందనవృక్షశాఖను లాగి ఫణీంద్రుని లేపితివి అని చెప్పఁబడినది.

పైలక్షణములో 'ప్రకృతధర్మియందు' అనుపదముచే నీయలం కారమునకును 'అప్రస్తుతప్రశంస'కును గలభేదమును, 'ప్రకృత వ్యవహారముఁ జెప్పక' యనుటచే దీనికి 'నిదర్శన'నకుఁ గలభేదమును

చెప్పఁబడినది. ఇది 'శ్లేషమూలక భేద'మును 'అతిశయోక్తి' కంటెను భిన్నము. అందు పదార్థముచే పదార్థముయొక్క అన్యథాభానముండును, ఇందు శ్లేషమహిమచే స్వవచనార్థాన్యథాభానము గలదు.

'లలితము' వేఱలంకారము కాదనియు, నిది 'నిదర్శన'యే యనియుఁ బెక్కురాలంకారికుల యభిప్రాయము.

౭౦ ప్రహర్షణాలంకారము — లక్ష. సాక్షాదుద్దేశకప్రయత్నము లేకయే యభీష్టార్థము లభించుట 'ప్రహర్షణము'.

ఇది మూఁడువిధములు. (౧) ఏప్రయత్నము లేకయే కవిచ్ఛగ నభీష్టము లభించుట (౨) ప్రయత్నము చేయఁగా నభీష్టముకంటె నెక్కుడు లభించుట (౩) ఫలసాధనమునకు ప్రయత్నము చేయుచుండఁగఁ బ్రయత్నముతో సంబంధము లేకయే ఫలమే లభించుట.

ఉదా. (౧) తాను వెదకెడు తీగ కాళ్లకే చుట్టుకొనెను.

(౨) చాతకము నాలుగైదు జలకణములు కోరఁగా మేఘము లోకము నంతయు నీళ్లతో నింపెను.

(౩) ధనము నిచ్చునౌషధములకై త్రవ్వుచుండ నిధియే దొరకెను.

౭౧ విషాదాలంకారము — లక్ష. అభీష్టార్థవిరుద్ధలాభము 'విషాదము'.

ఉదా. జను లందఱును తమతమపనులలో నిమగ్నులై దూరముగ నున్నపుడు 'నాముక్కుతో నీశృంఖలము విరిచి యీపంజరమునుండి వెడలిపోయెదను' అని చిలుక మనోరథము సలుపుచుండఁగా, ఏనుఁగుతొండమువంటి పెనుబాము ఒకటి దాని పంజరములోనికి దూరెను — (ర. గం.)

ప్రయత్నము చేయక వచ్చినది, మంచిప్రయత్నము చేయఁగా దానికి వ్యతిరేకముగ నకస్మాత్తు వచ్చినది, ఏప్రయత్నము మంచి కని చేయఁబడెనో యదియే విరుద్ధఫలము నిచ్చునది యని దీనికి నిన్ని భేదములు చెప్పవచ్చును.

'ఇది విషమాలంకారభేద' మని కొందఱమతము.

౭౨ ఉల్లాసాలంకారము — లక్ష. ఒకవస్తువుయొక్క గుణదోషములచేత వస్త్వంతరమునకు గుణదోషములు కలిగినట్లు వర్ణించుట 'ఉల్లాసము'.

ఇయ్యది ౧ గుణముచే గుణము, ౨ గుణముచే దోషము, ౩ దోషముచే దోషము, ౪ దోషముచే గుణము కలుగుట యని నాల్గు విధములు.

ఉదా. హింసాప్రధానులయిన రాక్షసులచే నెల్లప్పుడును అపవిత్రములుగఁ జేయఁబడిన వింధ్యాటవులు రామాంఘ్రిసంయోగముచే మునిభార్యవలె, ధన్యములుగఁ జేయఁబడెను — (ర. గం.)

ఇందుఁ బూర్వార్ధమున దోషముచే దోషము, ఉత్తరార్ధమున గుణముచే గుణము కల్గుట చెప్పఁబడినది.

ఉదా. సజ్జనులను ఆక్రమింపకుండుట ధనముయొక్క యభాగ్యము — (ఆంధ్రచంద్రా.)

ఇందు సజ్జనులగుణముచేత, వారి నాక్రమింపనిధనమునకు అభాగ్యదోషము పట్టినది.

ఉదా. రాజసేవ కత్తిమీఁదిసాముపంటిది. రాజసేవకులకు వధము లేకుండెనా యదియే వారికి లాభము.

రాజుయొక్క క్రౌర్యదోషముచేత వానిసేవకులకు ప్రాణములు దక్కుటయే వారికి లాభ మని గుణముగ వర్ణింపఁబడినది.

ఇయ్యది 'కావ్యలింగాలంకారము'చే గతార్థ మగుటచే స్వతంత్రాలంకారము కాదని కొందఱును, లౌకికార్థమయ మగుటచే అలంకారమే కా దని మఱికొందఱును చెప్పుదురు.

౭౩ అవజ్ఞాలంకారము — లక్ష. ఒకవస్తువుయొక్క గుణదోషములచేత నితరవస్తువులకు గుణదోషములు కలుగకుండుట 'అవజ్ఞ'.

ఉదా. మానికము సముద్రములో ముంచినను స్వల్పజలమునే గ్రహించును.

ఇయ్యది 'విశేషోక్తి'యే కాని వేఱు అలంకారము కా దని కొందఱ యభిప్రాయము.

౭౪ అనుజ్ఞాలంకారము — లక్ష. చెడు వస్తువునందు ఒకగుణముఁ జూచి యందుకై చెడువస్తువునే కోరుట 'అనుజ్ఞ'.

ఉదా. బ్రహ్మదేవుఁడా! చేతులు జోడించి నిన్నొకటి వేఁడెదను. ఏను గుర్తుగాని బ్రతుకువారికులములో జన్మ మిచ్చినను ఎటై కాని వారు విష్ణుభక్తిపరాయణులుగ నుండవలెను — (ర. గం.)

౭౫ తిరస్కారాలంకారము — లక్ష. గుణము గల వస్తువునుగూడ దోషవిశేషభయముచేతఁ దిరస్కరించుట 'తిరస్కారము'.

ఉదా. హరిచరణాభిజనచ్యుతిభయముచే రాజ్యసుఖము నొల్ల.

౭౬ లేశాలంకారము — లక్ష. గుణమును అనిష్టసాధన మగుదోషముగను, దోషమును ఇష్టసాధన మగుగుణముగను వర్ణించుట 'లేశము'.

ఉదా. శుకమా! ఎల్లపక్షులును విచ్చలవిడిగఁ దిరుగుచుండఁగా నీ తియ్యనిపలుకులకు ఫలము నీవు పంజరమునఁ గట్టువడుట — (కువ.)

౭౭ పరికరాంకురము — లక్ష. విశేష్యములను సాభిప్రాయముగ నుపయోగించినచో నది 'పరికరాంకుర' మగును.

ఉదా. నీ గుణములను వర్ణించుటకు ఫణీంద్రుఁడును, వ్రాయుటకు హైహయార్జునుఁడును, చూచుటకు నింద్రుఁడును కావలయును — (కువ.)

ఇందు 'ఫణీంద్రుఁడు', 'హైహయార్జునుఁడు', 'ఇంద్రుఁడు' అను విశేష్యములు సాభిప్రాయములు. ఫణీంద్రునకు వేయిశాలలుగ లును, హైహయార్జునునకు వేయిచేతులును, ఇంద్రునకు వేయికన్నులును కలవు.

ఈ యలంకారము 'పరికరాలంకారము'లోనిదే కాని స్వతంత్రము కా దని కొందఱియభిప్రాయము విశేషణసాభిప్రాయత్వముకూడ విశేష్యాంశముయొక్క సాభిప్రాయత్వమే నిర్ధుష్టమైన విశేష్యములకు సాభిప్రాయత్వము స్పష్టముండైనను కలుగనేరదు — (ఉద్ద్యోతము, సుధాసాగరము)

౭౭ ప్రస్తుతాంకురము — లక్ష. ఒక ప్రస్తుతమువలన మఱియొక ప్రస్తుతము ద్యోతింపఁజేసిన 'ప్రస్తుతాంకురము'

ఉదా. ఓతుమ్మెదా! మాలతి యుండఁగా ముండ్లతో నిండియున్న కేతకిని (మొగిలిపువ్వును) ఏల కాంక్షించెదవు? — (కువల)

మాలతిని విడిచి కేతకిమీఁద వ్రాలుచున్నతుమ్మెదను జూచి ప్రియునితోఁగూడ నుద్యానవనములోఁ దిరుగుచున్న యొక స్త్రీ యీమాట చెప్పెను. నావంటిచక్కని స్త్రీని విడిచి అసౌఖ్యకరమైన పరవనితాసంగతి నీ కేల యని పతితోఁ జెప్పుట యామెయుద్దేశము ప్రత్యక్షముగాఁ జూచుచున్నతుమ్మెదవృత్తాంతమును ప్రస్తుతమే, పెనిమిటి యుండఁగ నాతనికి వర్తము కావలె నని చెప్పెను కావున దియు ప్రకృతమే యని భావము

ఇది అప్రస్తుతప్రశంసాలంకారమే కాని స్వతంత్రము కా దని ప్రాచీనలాక్షణికులమతము — (ఉద్ద్యోతము)

౭౮ వ్యాజనిందాలంకారము — లక్ష. అప్రస్తుతవిషయనిందవలన ప్రస్తుతవిషయనింద స్ఫురింపఁజేసిన 'వ్యాజనింద'

ఉదా. ఒక్కతల ద్రుంచిన శివుని నమస్కరించుము గాని బ్రహ్మ వలన యేమి ప్రయోజనము? — (కువల).

ఇచ్చట లోకమునంగు దుఃఖమును సృజించిన బ్రహ్మదేవుని నిందించుట ప్రస్తుతము కాని ఆతనియన్నితలలును తెగఁగొట్టక ఒక్కతలనే తెగఁగొట్టినందుకు నప్రస్తుతుఁడైన శివుని నిందించి యిది సాధింపఁబడినది.

౮౦ అసంభవాలంకారము — లక్ష. అర్థనిష్పత్తికి నసంభావ్యము చెప్పుట 'అసంభవము'

ఉదా. గొల్లపిల్లవాఁడు కొండ నెత్తు నని యెవరెఱుఁగుదురు?

ఇది స్వతంత్రాలంకారము కాదనియు, 'విరోధాలంకా'రాంతర్గత మనియుఁ బూర్వలాక్షణికులమతము (చూడుఁడు, ప్రదీపోద్ద్యోతములు)

౮౧ అల్పాలంకారము — లక్ష. ఎందు సూక్ష్మమైన యాధేయముకంటె నధికమైనసూక్ష్మత యాధారమునకుఁ జెప్పఁబడునో యది 'అల్పము'

ఉదా. కృశాంగి! ఉంగరము నీచేతియందు జపమాలవలె నున్నది — (కువల).

చేయి యాధారము ఉంగర మాధేయము విరహముచేఁ జిక్కినందున, సూక్ష్మమైన యుంగరముకంటె నామెచేయి కడుసన్నముగా నున్న దని భావము ఇది స్వతంత్రాలంకారము కాదు; అధికాలంకారవిభేదమే యని ఉద్ద్యోతకారుఁడు

౮౨ వికస్వరాలంకారము — లక్ష. ఒక విశేషమును చెప్పి, సామాన్యముతో దానిని సమర్థించి, అంతఁ దృప్తి బొందక మఱియొక విశేషమును, ఉపమానముగాఁ గాని యర్థాంతరన్యాసముగాఁ గాని చెప్పుట 'వికస్వరము'

ఉదా. అనంతరత్నములకుఁ బుట్టినిల్లయిన హిమాలయమునకు మంచు చక్కఁదనమును బోఁగొట్టునది కాలేదు పెక్కుగుణములసమూహములో నొక్కదోషము, చంద్రునికిరణములలో మచ్చవలెఁ గప్పఁబడును — (కువల)

ఇది యర్థాంతరన్యాసాలంకారమే కాని వేఱు కాదు — (ఉద్ద్యోతము)

౮౩ సంభావనాలంకారము — లక్ష. ఒకయర్థము సిద్ధించుట 'ఇది యిట్లయినయెడ' నని వితర్కించినచో 'సంభావన'

ఉదా. ఓ రాజా! శేషుఁడు వక్తయైనయెడల నీగుణము లెన్నఁబడును.

ఇది అతిశయోక్తిలోనిదే కాని స్వతంత్రాలంకారము కా దని కొందఱియభిప్రాయము

౮౪ మిథ్యాధ్యవసత్యలంకారము — లక్ష. ఒకదానియొక్క మిథ్యాత్వమును నిరూపించుటకై మఱియొక మిథ్యార్థమును కల్పించుట 'మిథ్యాధ్యవసతి'

ఉదా. ఆకాశపుష్పమాలను ధరించి వేశ్యను వశీకరింపుము

ఇది స్వతంత్రాలంకారము కా దనియు, అతిశయోక్తిలోనిదే యనియుఁ గొందఱిమతము — (ఝళకీకరు1)

౮౫. ముద్రాలంకారము — లక్ష. ప్రకృతార్థపరములగుపదములచే ప్రకృతమునకు సంబంధము లేని మఱియొకసూచ్యార్థమును సూచించుట 'ముద్ర'

---

1 భట్టనాథుఁడాచార్యులుఝళకీకరు అనుపండితుఁడు కావ్యప్రకాశముపై నుంది టీక వ్రాసినాఁడు దాని రెండవకూర్పు బొంబాయి విద్యాసాగరప్రెస్సులో అచ్చుపడినది. దానినిఁ జూడవలయును.

ఉదా॥ తే॥ మిత్రుఁ డొక్కఁడు వీణియ మీటుచుండి
విబుధవరు లిద్ద ఱర్థంబు విప్పిచెప్ప
వికలు విద్దఱు వినుచుండి కేగతిని
కేటగీతంబు మూఁటను వాట మయ్యె    (అప్ప)

ఇందు కేటగీతము (కేటపాట) ప్రకృతము. దానిని వర్ణించు పదములతోడనే కేటగీతిలక్షణము, పేరును సూచింపఁబడినవి. ఇది 'శ్లేష' కాదు ఎందుకన 'వీణియ మీటుట' మొదలయిన క్రియలు గీతిలక్షణమున నన్వయింపవు

ఇట్లే 'నవరత్నమాల' యను పేరుతోఁబద్యములను వ్రాయుచు మాయర్థమందు తెలుపుటరత్నముల పేళ్లు చెప్పుటయు, సంగీతకృతు లందు రాగముల పేళ్లు సూచించుచుఁ గృతులలో రెండవయర్థమునందు 'శంకరాభరణము' మొదలయినపదములను వాడుటయు నీయలంకారమే యగును

ఇది యలంకారమే కాదు ఇందుఁ బ్రస్తుతోపస్కారక మేమియు లేదు అని కొందఱియభిప్రాయము — (రుఖశేకరు)

౯౬ రత్నావళ్యలంకారము — లక్ష. ప్రకృతార్థములను వరుసగఁ జెప్పినచో 'రత్నావళి' అనునలంకార మగును

ఉదా॥ రాజా! నీవు చతురాస్యుఁడవు, లక్ష్మీపతివి, సర్వజ్ఞుఁడవు

నీవు 'బ్రహ్మవు విష్ణువవు మహేశ్వరుఁడవు' నని భావము ఇచ్చట వాడుకలో నున్న బ్రహ్మ విష్ణు రుద్రు లన్న క్రమముఁ దప్పక చెప్పఁబడినందున నీయలంకారము

ఇది యలంకారమే కాదు ఇచ్చట రూపకమే చమత్కారమును గలుగఁజేయుచున్నది గాని, క్రమముచేఁ గాదు (ఉద్ద్యోతము)

౯౭ భార్యరూపాలంకారము — లక్ష. స్వగుణమును విడిచి యితర స్వగుణమును గ్రహించినట్లు వర్ణించినచోఁ 'భార్యరూపము'

ఉదా॥ ఓరాజా! శివునికంఠమును చుట్టుకొన్న వాఁడయ్యును శేషుఁడు నీకీర్తిచేఁ దెల్లనివాఁ డయ్యెను

మొదట శేషుఁడు తెల్లనివాఁడు, శివునినల్లనికంఠముయొక్క స్పర్శచే నల్లపడెను మరల రాజుయొక్క కీర్తిచేఁ దెల్లపడెను!

ఇది 'సమాధి' లోనిది గాని స్వతంత్రాలంకారము కాదు — (ఉద్ద్యోతము)

౯౮ అనుగుణాలంకారము — లక్ష. ఒక్క వస్తువు పూర్వము తనకు సిద్ధముగా నున్నగుణముచే పరసన్నిధివలన నిక్కువగాఁ బొందినట్లు చెప్పుట 'అనుగుణము'

ఉదా॥ నీలోత్పలములు కామినియొక్క కటాక్షములచే నధికనీలిమను బొందెను

ఇది 'తద్గుణమే; స్వతంత్రాలంకారము కాదు'- (ఉద్ద్యోతము).

౯౯ ఉన్మీలితాలంకారము — లక్ష. భేదస్ఫూర్తి చెప్పఁబడెనేని 'ఉన్మీలితము'

ఉదా॥ ఓరాజా! మరలు నీయొక్క యశస్సున మునిఁగిన హిమవత్పర్వతమును చలిచేఁ దెలిసికొందురు.

ఇది మీలితమునకు వ్యతిరేకము. ఇది స్వతంత్రాలంకారము కా దనియు, మీలితాంతర్గత మనియు నుద్ద్యోతకారునిమతము

౧౦౦ విశేషకాలంకారము — లక్ష. విశేషము గన్పట్టు చుండెనేని 'విశేషకము'

ఉదా॥ చంద్రుఁ డుదయింపఁగాఁ గమలములను, ముఖము లను గనుఁగొనఁబడెను (తెలుతెలుగ గుర్తింపఁబడెను)

ఇది 'సామాన్యము'నకు వ్యతిరేకము ఇగి స్వతంత్రము కాదు 'సామాన్య' ములోనిదే — (ఉద్ద్యోతము)

౧౦౧ పిహితాలంకారము — లక్ష. పరవృత్తాంత మెఱిఁగినవానియొక్క సాభిప్రాయచేష్టయను 'పిహితము'

ఉదా॥ ప్రియుఁడు ప్రాతఃకాలమున నిల్లు చేరఁగానే భార్య పక్కవేసెను

రాత్రి యంతయు సపత్నితోఁ గూడి జాగరణము చేసితివి గాన నిక విశ్రింపుము అని భావము

ఇది 'సూక్ష్మ' లంకారాంతర్గతము — (ఉద్ద్యోతము)

౧౦౨ గూఢోక్త్యలంకారము — లక్ష. ఒక విషయ మొకరికిఁ జెప్పఁదలఁచి యది దగ్గఱఁ గాని, చుట్టుపట్టునఁగాని యుండు వారికిఁ దెలియ కుండునట్లుగ నమ్మరి సంబోధించి గూఢముగాఁ జెప్పుట 'గూఢోక్తి'

ఉదా॥ చక్రవాకకాంతా! రాత్రి సమీపించుచున్నది ప్రియుని వీడ్కొలుపుము — (అభి)

శకుంతలయు, దుష్యంతుఁడును లతాకుంజమునఁ గలిసియుండ శకుంతలను గాద గౌతమి యనుదాని వచ్చెను కాని యీసమాచారము శకుంతలను, గౌతమికిఁ దెలియకుండఁ దెల్పి యామె దుష్యంతుని దాఁచునట్లు చేయవలె నని, సఖి యిట్లాపెను హెచ్చరించెను.

ఇది యొకప్పుడు ధ్వనిరూపముగను, ఒకప్పుడు గుణీభూత వ్యంగ్యముగను నుండును — (రుఖశేకరు)

౧౦౩ వివృతోక్త్యలంకారము — లక్ష: కవి యాగూఢోక్తి యని తెల్పుపదముల నుపయోగించి గూఢోక్తి చెప్పినయెడల నది 'వివృతోక్తి'

ఉదా॥ పైగూఢోక్తి యుదాహరణమునందు 'కవి 'ఇట్లు ప్రియంవద శకుంతలను హెచ్చరించెను' అని చెప్పియున్నయెడల నది వివృతోక్తి కుదాహరణ మగును.

ఇది అలంకారము కాదు— (రుఖశేకరు).

౧౦౪ లోకోక్త్యలంకారము — లక్ష. లోకవ్యవహారమందలి సామెతలను జక్కఁగఁ జెప్పినచో 'లోకోక్తి'

ఉదా॥ కొన్నిదినములు కన్నులు మూసికొని యుండుము

ఇది అలంకారము కాదు — (ఝుళకీకరు)

౧౦౫. ఛేకోక్త్యలంకారము — లక్ష. లోకోక్తి యర్థాంతరగర్భితమేని 'ఛేకోక్తి' యనఁబడును

ఉదా॥ పాముకాళ్లు పాముకే యెఱుఁగును

ఇదియు నలంకారము కాదు — (ఝుళకీకరు).

౧౦౬. యుక్త్యలంకారము — లక్ష. రహస్యమును గాఁచుటకై యేదో యొకయుక్తిచే నితరులను వంచించుట 'యుక్తి'

ఉదా॥ ఒకస్త్రీ తన ప్రియునిపటము చిత్రించుచుండఁగ నన్యస్త్రీ వచ్చుటచే నాప్రతిమయొక్క హస్తమున ధనువింటిని చిత్రించెను

తను వ్రాయుచున్నది మన్మథునిపటమని యన్యస్త్రీ భావింపవలెనని తాత్పర్యము

ఇది స్వతంత్రాలంకారము కాదు 'వ్యాజోక్తి'లోనిదియే — (ఝుళకీకరు)

౧౦౭ అత్యుక్త్యలంకారము — లక్ష. ఆశ్చర్యకరములును, అసత్యములును అయిన శౌర్యాదులను వర్ణించుట 'అత్యుక్తి'

ఉదా॥ రాజా! నీప్రతాపాగ్నిచేత నెండిపోయిన సప్తసాగరములును నీశత్రుస్త్రీల కన్నీళ్లచేత నిండినవి — (కువల).

సంపదసంబంధియైన అత్యుక్తిని 'ఉదాత్త' మందురు శౌర్యాదిసంబంధియైన అత్యుక్తిని 'అత్యుక్తి' యందురు ఇది వీనికిఁ గలభేదము 'అతిశయోక్తి'యందు సదుక్తి (నిజము) ఉండును 'అత్యుక్తి'యందు అసదుక్తి (అసత్యము) ఉండును ఇదియే వీనికి భేదమని అప్పయదీక్షితులవారిమతము

ఇది 'ఉదాత్త'ములోనిదే యని కొందఱును, 'అతిశయోక్తి'లోనిదే యని మఱికొందఱును చెప్పెదరు — (ఉద్ద్యోతము)

౧౦౮ నిరుక్త్యలంకారము — లక్ష. వ్యుత్పత్తివలన నామములకు నర్థాంతరము కల్పించినచో 'నిరుక్తి'

ఉదా॥ పూర్వము కవులను లెక్కపెట్ట నారంభించి, కనిష్ఠిక (చిటికెన) వ్రేలిమీఁద ఒకఁడు అని కాళిదాసుని పేరు చెప్పి పొటినవ్రేలు వంచఁబడెను కాని యిప్పటివఱకును కాళిదాసునితో సమానుఁడైన కవి పుట్టనందున రెండవవ్రేలయిన 'అనామిక'కు అనామిక (పేరులేనిది) యన్న నామము సార్థకమాయెను.

ఇచ్చట 'అనామిక' యను వ్రేలికి కాళిదాసునితో సమానుఁడైనవాఁడు పుట్టనందునఁ బేరు లేనిది యన్న మాఅర్థము చెప్పఁబడినది

ఇది 'శ్లేష' లోనిది, వేఱు కాదు — (ఉద్ద్యోతము).

౧౦౯ ప్రతిషేధాలంకారము — లక్ష. ప్రసిద్ధమైన నిషేధమునే క్రొత్తగాఁ జెప్పుట 'ప్రతిషేధము'

ఉదా॥ ఓ జూదరీ! ఇది జూదము కాదు, ఘోరమైన యుద్ధము

యుద్ధము జూదము కాదన్నసంగతి సుప్రసిద్ధమే కాని నీవు జూదమాత్రము చేత నగుదు, యుద్ధము చేతఁగాదని జూదరిని అధిక్షేపించుటకై మరలఁ జెప్పఁబడినది

ఇది యలంకారమే కాదు 'విధి'వలెనే ధ్వన్యంతర్గతము — (ఉద్ద్యోతము)

౧౧౦ విధ్యలంకారము — లక్ష. సిద్ధమైనదానినే క్రొత్తగా విధించుట 'విధి'

ఉదా॥ ఓ హస్తమా! బ్రాహ్మణశిశువును బ్రతికించుటకై యీశూద్రమునిమీఁదఁ గత్తి వేయుము, నిండుచూలాలై వనవాసమున బాధపడుచున్న సీతను వెడలఁగొట్టినరాముని అవయవమైన నీకు దయ యెక్కడిది? — (ఉత్తరరామచరితము)

రామునిచేయి రామునియవయవ మన్నమాట యిదివఱకే సిద్ధము ఇప్పుడు మరల నామాటఁ జెప్పుటవలన 'విధి' యాయెను

ఇది అలంకారము కాదు ఇట్టిచోట నొకప్పుడు ధ్వనివలనను, ఒకప్పుడు గుణీభూతవ్యంగ్యమువలనను గతార్థమగుటచే దీనిని స్వతంత్రాలంకారము లనుటకు వీలు లేదు గోపాలమంతటి యలంకారమనఁగు గుణీభూతవ్యంగ్యప్రపంచ మంతయు నిముడ్చుట ప్రశస్తమైనది కాదు — (ఉద్ద్యోతము)

౧౧౧ హేత్వలంకారము — లక్ష. హేతుమంతముతో (కార్యముతో) పాటు హేతువును (కారణమును) వర్ణించుటయు, హేతుహేతుమంతములకు నైక్యము వర్ణించుటయు 'హేతు' వనంబడును

హేతుమంత మనఁగా హేతువువలన నగునది

ఉదా॥ (౧) చంద్రుఁడు స్త్రీలమానమును భేదించుటకై ఉదయించుచున్నాఁడు

ఉదా॥ (౨) ఈ ప్రభువుకటాక్షములు విద్వాంసులకు లక్ష్మీవిలాసములు

ఇది అతిశయోక్త్యంతర్గతము, భిన్నాలంకారము కాదు — (ఉద్ద్యోతము)

ప్రమాణాలంకారములు — లక్ష. నైయాయికులకు నాల్గుప్రమాణములు, వేదాంతులకు నాఱు, మీమాంసకులకు నెనిమిది. మీమాంసకులయొక్క యెనిమిదిప్రమాణములను దీసికొని అవి యే

# అలంకారములు



* ఈగుర్తుచేయఁబడిన యలంకారములు దండి యొక్క 'కావ్యాదర్శము'నందుఁ గలవు.

౹ ఈగుర్తుచేయఁబడిన యలంకారములు మమ్మటుని 'కావ్యప్రకాశము'నందుఁ గలవు

§ ఈగుర్తుచేయఁబడిన యలంకారములు విద్యానాథుని 'ప్రతాపరుద్రీయము'నందుఁ గలవు

♦ ఈగుర్తుగల అలంకారములు 'రసగంగాధరము'నందు తెలుపఁబడినవి. రసగంగాధరము అసంపూర్ణమైన గ్రంథము గనుక ఇతరాలంకారములు జగన్నాథునకు సమ్మతము లని చెప్పుటకు వీలులేదు.

నుండి జపాను వైపునకు గొనిపోవలయును నదిని మంచుచే గప్పఁబడి యుండును యీనదిపై రెయిన్‌డీరులవలె సాధుపశుజంతువులు జీవించ వీలగునని లేవు కాని యీదేశముయొక్క ఐశ్వర్యమునకు ముఖ్యకారణము చేపలు, ఉన్ని నుత్పాదనము చేయుజంతువులును. దక్షిణపూర్వతీరమునందునుండి బ్రిస్టల్ సింధుశాఖవరకుంతయు (వ్యాపించియున్న) సముద్రతీర మంతయు, చేపలతో నిండియున్నది హెర్రింగ్, కాడ్, సాల్మన్ అను పేరుల జొప్పుచేప లత్యంతముగఁ గలవు తిమింగిలములు, దంతములకుఁ బనికివచ్చు వాల్రస్ లను జలచరములు, ఒత్తరులు, సీలులును అపరిమితములుగ నున్నవి

సీలుజంతువులు దాయిదినములందు తెలుపెలుజాతులు కాన వచ్చును సముద్రసింహములు పర్యాప్తమగుసంఖ్యయందుఁ గలవు ఫర్ (Fur) అనుకేశోత్పాదకజంతువులందు ౮ భిన్నజాతు లున్నవి ధ్రువముగుపిల్లులు నేవిలులు అని యివి వేరువేరు పేరులఁ బిలువఁబడుచుండును మరియు నైదుప్రకారములగు ఎలుఁగులు, బూడిదవర్ణపుతోడేళ్లు, అయిదురంగుల (నలుపు, ఎఱుపు, తెలుపు నీలము, రెండురంగులకొప్పు) నక్కలు ప్రత్యేకఁ జాలమవారికి మిగుల లాభందయము గూర్చుచుండును

దక్షిణపూర్వపుప్రాంతములందు నానావిధములగువృక్షజాతులు పెంపొందును దేవదారు, సాంబ్రాణి, భూర్జ, తెల్లపాదులు గాక యితరకారణ్యవృక్షము లింకను లెక్కకు మిక్కిలిగఁ గలవు ఎచ్చటఁ జూచినను గడ్డి పెరుఁగును కాని మంచు పడుటతోడనే మాఁడిపోవును అనుకూలములగు వాయువులు లేనికారణమున అల్యూషియను ద్వీపము లందు బొత్తిగ వృక్షములు పెరుఁగవు పచ్చికతో మాత్రము నిండి యుండును ఇచటినేల మంచి సారవంతమైనది దక్షిణపూర్వమందలి ప్రాంతములలో ఒకలక్షచదరపుమైళ్ల వైశాల్యము గల భూమిమీఁద ముఖ్యమైనపంట లన్నియుఁ బండును చేరిఁగు సముద్రతీరములందుఁ దక్క ఆర్కిటిక్ రేఖకు దక్షిణముగ నున్న నేల లన్నియు వ్యవసాయ యోగ్యములే పచ్చికగడ్డి పుష్కలముగ లభించుటవలన పసుపాలనము నిచ్చట బాగుగ జరుగఁగలదు

ఫర్ (Fur) అనుకేశముల నుత్పాదనము చేయుమృగముల కొఱకును, సీలుమత్స్యములవేటలవలనను నిచట విస్తారముగ వ్యాపారము జరుగుచుండెను కాని కొన్ని సంవత్సరముల క్రిందట ఆ ప్రాణులయొక్క అనావశ్యకమారణమువలన వానినాశనము తోపాటు దేశవాసుల నాశనముగూడ ప్రాప్తించు నమ్మకముండెను అంత దొరతనమువా రీజంతువుల వేటాడుటయందున మంచి కట్టఁ బాట్లను గావించుటయేగాక బొత్తిగ జాతి నాశన మగు నని తోఁచిన జంతువులను సైబీరియా మొదలగు విదేశములనుండి తెప్పించి పాలిం చుచున్నారు. ఇట్లు గావించినవానిలో రెయిన్‌డీరు ఒకటి

ఈదేశమునందు ఖనిజములకును దక్కువలేదు బంగారము, రాగి, వెండి, ప్లాటినము, పల్లాడియము, అంటిమనము, టంగస్టన్, పెట్రోలియం, సీసము, తగరము, గ్రాఫైట్, బారైట్, గంధకము, జిప్సము పాలరాయి మున్నగునవి భూగర్భమునుండి లభించును బొగ్గు పుష్కలముగఁ గలదు కాని ఈపదార్థముల నన్నింటిని అవసరములగు స్థానములందుఁ జేర్చుటకుఁ దగిన వాహనాదిసౌకర్యములు లేవు. ఆకారణమున వీనిపరిశ్రమయు వెనుకఁబడియున్నది

౧౯౨౭-వ సంవత్సరము మొదలుకొని పరదేశములతో వార్తా హరసౌకర్యము లీదేశమునకుఁ గొన్ని కలిగినవి యునైటెడ్ స్టేట్సు నుండి నియమపూర్వకముగఁ బ్రతిదినము అలాస్కాకు టపాలు రవాణా యగుచుండును ఆర్కిటిక్ రేఖ కుత్తరముగ నున్న ప్రదేశములకును నిచటనుండి క్రమము తప్పక వార్త లేగుచుండును దేశమందలి ముఖ్యపట్టణముల కన్నిటికిని మున్న తంతిసంబంధము కలదు అలాస్కాసింధుశాఖమీఁది సీవార్డ్ పట్టణము మొదలుకొని ఫెయిర్‌బాంక్స్ నగరమువఱకును రైలుమార్గము నిర్మింపఁబడి యున్నది శాఖలతోపాటు ఈరైలుమార్గముపొడవు ౫౩౦ మైళ్లు ౧౯౨౬-వ సంవత్సరమున విమానముల రాకపోకలకై ప్రయత్నములు జరగెను అంత నొక సంవత్సరము గడచునప్పటికి ౨౩ చోట్ల విమాన విశ్రమస్థానము లేర్పడినవి సముద్రతీరమునందలి పట్టణము లన్నింటికిని స్టీమరులు ప్రతిదినము వచ్చి పోవుచుండును

ప్రస్తుత మిచటిజనసంఖ్య ౬౪,౩౫౬ మాత్రమే ఇందు నూటికి ౪౫ మంది తెల్లవారు, ౪౬ మంది దేశీయులు, అర్ధరు చీనాజపానుదేశములకుఁ జెందినవారు ఆసియాఖండవాసులు సాధారణముగ సాలమన్ చేపలను పట్టుకొనుటయందును, వానిని డబ్బాలలో నింపి పంపుకార్యములందును నెక్కువగ నియోగింపఁబడి యున్నారు ఇచటి అసలుదేశీయులలో నాలుగుభేదములు గలవు: (౧) ఎస్కిమోలు లేక ఇన్యూయిటులు, అల్యూషియనులును వీరికిఁ జెందినవారే, (౨) హైడాదాసులు లేక గయిగనీలు, వీరు ముఖ్యముగ ప్రిన్స్ ఆఫ్ వేల్సుద్వీపమున వాసము చేయుచుందురు, (౩) త్లింకితులు వీరు అలెగ్జాండర్ ద్వీపసమూహమం దంతటను అక్కడక్కడ వ్యాపించియున్నారు, (౪) తెన్నెహులు లేక అథపస్కనులు వీరందఱిలో ఎస్కిమోలు తప్పఁ దక్కినజాతులవా రుత్తర-అమెరికాయందలి ఇండియనుల సంతతివా రని తెలియవచ్చినది ఈసమస్త జాతులవారును తెల్లవారి యాచారవ్యవహారముల నవలంబించి క్రైస్తవమతమును స్వీకరించియున్నారు

అలాస్కాయందలి కొన్ని పట్టణముల పేర్లను నావికరుల పెట్టుకుదిట దీనిని గనిపట్టినవారు స్పెయినుదేశీయు లని స్పష్ట మగును కాని ఏకారణముచేతనో వా రిచట నిలుకడగ నివాసములఁ గుదుర్చుకొనినట్టు లేదు. రష్యనులు సమీపమున నుండుటచేతను, అచటివారితో వ్యాపారములకు సహజముగ నలవాటుపడియున్నవా రగుటచేతను, నీదేశమునందు వాసము కుదుర్చుకొనిరి ౧౭౪౧ లో విటస్ బేరింగ్ అనునతఁడు కొంతమారమువఱకు నీ దేశము నన్వేషించి

విద్వాంసుల సందులను ఆదరించి, మ్యూసియమ్ అను విద్యాపీఠమును నిర్మించిరి. ఇచ్చట వేయుతొంబదేండ్లవరకును (క్రీ. పూ. ౩౨౩-క్రీ. శ. ౬౪౦) విద్వాంసులసహవాసమునను సరస్వతీదేవి యథేచ్ఛముగా విహరించుచుండెను. ఈవేయిసంవత్సరములకాలమును రెండు విభాగములుగ (యుగములుగ) పెంచవచ్చును ౧ క్రీ. పూ. ౩౨౩ మొదలు క్రీ. పూ. ౩౦ వఱకు; ౨ క్రీ. పూ. ౩౦ మొదలు క్రీ. శ. ౬౪౦ వఱకు. మొదటియుగమందు వాఙ్మయము (సాహిత్యము)ను, భౌతికశాస్త్రములును అభివృద్ధిఁ జెందెను. రెండవయుగము నందుఁ దత్త్వజ్ఞానము (వేదాంతము) ఎక్కువగ నభ్యసింపఁబడెను.

పూర్వయుగమునందు సాహిత్యచర్చ, విమర్శనము, వ్యాకరణము, ఛందస్సు, పురాణములు, జ్యోతిషము, గణితము, వైద్యము అనువిషయములపై నలెగ్జాండ్రియావిద్యాలయమునందలిపండితులనేకు లనేకగ్రంథములను నిర్మించిరి ముఖ్యముగ వారు చేసినపని గ్రీకు మహాకవులకావ్యములపైని దర్పాత్మక మైనటీకలు వ్రాయుట కొందఱు కొన్ని కావ్యములుకూడ వ్రాసిరి కాని గ్రీకుదేశపుకవుల కావ్యములందుఁ గానవచ్చు స్వతంత్రకల్పనావిశేష మిందుఁ గానరాదు శాస్త్రముల నభివృద్ధిపఱిచినవారిలో, రేఖాగణితకర్తయైన యూక్లిడ్, పదార్థశాస్త్రసంబంధమైన పెక్కుసిద్ధాంతములఁ గనుఁగొనిన ఆర్కిమిడిస్, కోనరేఖాగణిత మను శాస్త్రమును వ్రాసిన పెర్గావాఁ డగు అపాలోనియస్, విఖ్యాతజ్యోతిష్కుఁడు హిప్పార్కస్, గణితము, జ్యోతిషము, భూగోళము, తత్త్వజ్ఞానము, చరిత్రవిషయములనుగూర్చి గ్రంథములను వ్రాసిన ఎరటాస్థనీస్ అనునతఁడును ముఖ్యులు వీరందఱు యూక్లిడ్ శిష్యులే

అలెగ్జాండ్రియాలో యూదులును, గ్రీకులును కలయుటచేఁ బాశ్చాత్యపౌరస్త్యతత్త్వశాస్త్రములసమ్మేళన మిచ్చట జరగను నియోప్లేటోనిజమ్ అను నూతనప్లేటోసంప్రదాయ మిచ్చటనే పుట్టెను ఇచ్చటఁ గ్రైస్తవమతము బాగుగ వ్యాపించెను ఇప్పటికి నిచ్చట క్రైస్తవమతాచార్యనికరము గలదు ప్లేటోతత్త్వములను, క్రైస్తవమతతత్త్వములను జంట పెట్టి కొందఱు క్రొత్తసంప్రదాయములను సృష్టించిరి గ్నాస్టిక్ లను క్రైస్తవభేదాంతులసంప్రదాయ మిచ్చటనే యభివృద్ధి చెందెను

**అలెప్పో** — సిరియాదేశములో నుత్తరభాగమున నుండు పురాతనపట్టణములలో నొకటి ఆఫ్రికాఖండప్రదక్షిణమార్గము కనిపెట్టఁబడకమున్ను పర్షియా, ఆసియాఖండములవ్యాపారమున కీపట్టణమే పట్టు. ఇటలీదేశములోని వెనిసునగరమునకును ఈపట్టణమునకును సంబంధము గట్టిగ నుండెను. [illegible] ఈపట్టణపు ప్రాముఖ్యము తగ్గెను. ఇప్పటికిని ఇచ్చట తుర్కులు, అర్మీనియనులు, గ్రీకులు, యూదులు [illegible]

ఈపట్టణము చరిత్రమున పెక్కుతోగలం బొందినది. క్రీ. శ. ౬౩౮ పారసీకులు దీని గొనిరి. క్రీ. శ. ౧౪౦౨లో తైమూరు దీని గొల్లగొట్టెను క్రీ. శ. ౧౫౧౬లో నిది తుర్కీవారి యధీన మాయెను క్రీ. శ. ౧౧౭౦లోను, ౧౮౨౨లోను భూకంపము వలన నీనగరమును హాని యొనర్చెను. క్రీ. శ. ౧౮౨౭లో కొఱ్ఱల జ్వరమును, ౧౮౩౨లో కలరాయును దీని గలంచెను జనసంఖ్య ౨,౦౦,౦౦౦ ఇప్పటికిని వ్యాపారము బాగుగ జరుగుచున్నది.

**అలెసాన్డ్రియా** — ఇటలీదేశములో నదేపేరుగల మండలమునకు రాజధాని ఇచ్చట నొక గొప్పదుర్గమును గలదు ఇప్పటికి నిది బలవంతముగ నున్నదియే. ఇందు సైన్యములును గలవు ఈపట్టణము రైలుమార్గములకు చక్కనిపట్టున నుండి ప్రముఖతఁ గాంచియుండుటచేత వ్యాపారము నానాఁటికి వృద్ధి యగుచున్నది జనసంఖ్య ౭౧,౦౨౧.

**అలేఖియా** — శైవులయిన వైరాగుల సంప్రదాయము గిర్నార్ పర్వతము, పూనా వీరి ముఖ్యస్థలములు వీరు బిచ్చమెత్తికొని జీవయాత్ర గడపెదరు గణేశభక్తులు, భైరవభక్తులు, కాళీభక్తులు నని వీరిలో మూఁడుతెగలు గలవు. మొదటివా రుదయమునను, రెండవవారు సాయంకాలమునను, మూఁడవవా రర్ధరాత్రమందును బిచ్చ మడిగికొందురు. మొదటితెగవారుమాత్రము బిచ్చమున కిండ్లలోనికిఁ బోయెదరు మిగిలిన రెండుతెగలవారు నిండ్లలోనికిఁ బోక వీథులలో నుండియే బిచ్చ మడుగుకొందురు. వీరి 'అలఖ్ నామా' యన్న మాటవేరుగాఁడఁ గలదు వీరు తిరుగుచున్నపుడు 'అలఖ్', 'అలఖ్' అని అనుచు తిరుగుచుందురు కాన వీరి కీపేరు వచ్చెను.

**అలేటిపాడుచిట్టమూరు** — నెల్లూరు జిల్లా గూడూరుతాలూకాలోని గ్రామము జనసంఖ్య ౧౨౫ (౧౯౩౧)

**అలోపుఁడు** — ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొకఁడు.

**అలోలుఁడు** — దుర్యోధనునితమ్ములలో నొకఁడు.

**అలాంగ్‌పయ** — బర్మాదేశమునందలి పెగూజిల్లాలోఁ గల 'మాన్‌సో' యను గ్రామమున కధిపతి క్రీ. శ. ౧౭౫౩-వ సంవత్సరమున తలైంగులు తిరుగఁబాటు గావించినప్పుడు వారి నోడించి 'ఆవా' నగరమునఁ దనరాజ్యమును నెలకొల్పెను ౧౭౫౭-వ సంవత్సరములో పెగూను వశపఱుచుకొని తలైంగులకధిపతి యగు 'ప్యాగూమైంగతీరజా' యను నతనిని చెఱయం దుంచెను. అలాంగ్‌పయ తనపరాక్రమముచేత నెక్కువ ప్రఖ్యాతిఁ గాంచెను.

**అల్‌కిండిఅబూయూసుఫ్** — తత్త్వవేత్త, గణితశాస్త్రజ్ఞుఁడు. ౯-వ శతాబ్దివాఁడు. అరబ్బీవారిలో నందఱకంటె

నివసించువారికుపయోగపడు, సున్నము, గంధకము, ఖనిజములు మొదలగునవి గృహోపయోగములు అల్జీరియాయందు విలువగల ఖనిజములు కలవు. అందు ఇనుము, రాగి, సీసము, గంధకము, పాదరసము, అంజనము, తెలుపు ఎఱుపు రంగుల పాలరాయి, భాస్వరితములు (Phosphates), రాతి పలకలు (Lethographic stone) ముఖ్యమైనవి.

ఫ్రెంచి ప్రభుత్వము స్థిరమైనది మొదలుకొని ఇచటి వ్యాపార మధికముగా పెరిగిపోయినది. ఫ్రాన్సు, ఇంగ్లండు, స్పెయినులతో ముఖ్యవ్యాపారము జరుగుచున్నది. అందు నాలుగింట మూడువంతులు ఫ్రాన్సుతో జరుగును. మీద వచించినపదార్థములు గాక మరియు ఆలివునూనె (Olive Oil), పదును చేయని తోళ్లు, కలప, ఉన్ని, పొగాకు, నారింజలు గుడ్లు మొదలగునవి యెగుమతి యగుచుండును. యంత్రనిర్మిత పాత్రలు, నూలువస్త్రములు, ద్రవ్యములు, కాఫీ ముఖ్యమైన దిగుమతులు. ఇచటి చేతిపని చేయుట అంత గణింపదగినది కాదు. కాని మొరాకో చర్మము, రత్నకంబళములు, ముఖమలు, పట్టులు కొంచెముగ తయారగుచుండును. ఫ్రాన్సుదేశమందలి నావలు, రోడ్లు, ఎత్తులు ఇచట రేవులలో నున్నవి. అల్జియర్సు, ఒరాను, కాన్‌స్టెంటైను, బోనా, ఫిలిప్‌విల్లె అనునవి ప్రసిద్ధపట్టణములు. ౨,౮౦౦ల మైళ్ల రైల్వేమార్గములును, అంతకు మించిన పక్కా రోడ్లును గలవు. టెలిగ్రాఫు తీగెలు జాలములవలె వ్యాపించియున్నవి. ప్రస్తుతము మోటారుబస్సుల యానముల వలన వందలకొలది మైళ్లు సహారాయందుగూడ ప్రయాణములు సాగుచున్నవి.

ఇచ్చటి మూలనివాసులు బర్బరు లనువారు. వీరు బహుపత్నీకత్వము లేని మహమ్మదీయులు. ఈదేశమందు పెక్కు వందలయేండ్ల నుండి యున్న అరబ్బులును, యూదులును పెక్కురు కలరు. అరబ్బులును, బర్బరులును గుడారములలో వసించుచు, ఊరూరు దిరుగుచు ప్రయాణముల సలుపు దేశాటులు (Nomads). కాని ఇప్పు డిప్పుడు వీరిలో పెక్కుమంది టెల్ నామక ప్రదేశమున వసతులు గల్పించుకొని వ్యవసాయము చేయుచు గ్రామముల నభివృద్ధిపఱచుచున్నారు. కబైలు (Kabyles) లని పిలువబడు బర్బరు లిచటి ఆదిమనివాసులు. ఇప్పటి జనులలో వీర లెక్కువ. వీరు మాటాడునది బర్బరుభాష, వ్రాయునదిమాత్రము అరబ్బీభాషలిపి. యూదులు సంఖ్యయందు తక్కువైనను మంచిస్థితియందున్నారు. ఈపైని వచించినవారు గాక ఇంకను అనేకజాతులవారు ఈదేశమున గలరు. యూరోపియనులు తప్ప తక్కినవా రందఱును మహమ్మదీయులు. ఇప్పుడు చాలమంది ఫ్రెంచిదేశీయులును, అన్యదేశీయులును వచ్చి ఇచట వాసము సలుపుచున్నారు. ౨,౫౦,౦౦౦లకంటె నెక్కువగ ఫ్రెంచివారును, ౨,౦౦,౦౦౦లకు మించిన యూరోపియనులును (వీరిలో ఇటాలియనులు, స్పెయినుదేశీయులును ఎక్కువ) కలరు. ఫ్రెంచి ప్రభుత్వముచేత నియమింపబడు గవర్నరు జనరలు ఈదేశమును పరిపాలించుచున్నాడు. ఇతనికి తోడ్పడుటకు కౌన్సిలులు కలవు. అల్జియర్సు, ఒరాను, కాన్‌స్టెంటైను - అను మూడు విభాగములు - ఫ్రాన్సులోని భాగములుగనే గణింపబడుచున్నవి. ఇందలి ప్రతిభాగమునుండియు ఇద్దరు డెప్యూటీలును, ఒక సెనేటరును, ఫ్రెంచిచేంబరునకు పంపబడుచుందురు. తక్కినదేశమునంతట సైనికపరిపాలనము. ఇందుమూలముననే ప్రతిసంవత్సరము ఫ్రాన్సు కమితవ్యయమును భరింపవలసి వచ్చుచున్నది.

పూర్వకాలమున రోమనులు దీనిని న్యూమిడియా అనుచుండిరి. ఇది వారియధీనమున మంచియభివృద్ధిని గాంచి చాలకాలమునకు ముందే క్రైస్తవమతమును స్వీకరించియుండెను. క్రీ. శ. ౪౩౦ లో వండలు లనువా రీదేశమును జయించిరి. క్రీ. శ. ౫౩౩ లో బెలిసారియస్ (Belisarius) అనువాడు దీనిని బైజాంటైను సామ్రాజ్యమునకు జేర్చెను. ఏడవశతాబ్ది మధ్యకాలమున సారసెనులు దీనిని గెల్చుకొనిరి. క్రీ. శ. ౯౩౫లో అరబ్బీరాజపుత్రుడైన యూసెఫ్ ఇబ్న్ జేరి యనువాడు అల్జియర్స్ పట్టణమును గట్టెను. అతనివంశమువారు ౧౧౪౮ వఱకు రాజ్యము చేసిరి. ౧౧౪౮ లో నిది చిన్న చిన్న సంస్థానము లయ్యెను. క్రీ. శ. ౧౫ వ శతాబ్దియందు స్పెయినుదేశమునుండి వెడలగొట్టబడిన మూరులు, యూదులు నీరాజ్యమునందు గాపుర మేర్పఱచుకొనిరి. వారు దొంగతనములు బ్రారంభించి, యూరోపియన వర్తకమునకు అపరిమితమైన నష్టమును కలిగించుచుండిరి. స్పెయినురాజు ఫెర్డినెండు ౧౫౦౯ లో నీదేశమున జాలభాగము నాక్రమించుకొని వీరిని శిక్షించెను. తరువాత టర్కీ సరదారగు హోరుకు దల్జీరియావారిసాయమునకు వచ్చి యీదేశము నాక్రమించుకొనెను, స్పెయినువారిని వెడలగొట్టెను. కాని స్వల్పకాలములోనే స్పానియార్డు లతనిని బట్టుకొని ఉరిదీసిరి. అతని యనంతరమున వచ్చిన యతనితమ్ముడు ౧౫౨౦ లో నీదేశమును టర్కీరాజ్యమున జేర్చి దొంగతనములను బాగుగ నభివృద్ధిపఱచెను. చాలకాలము వఱకు యూరోపియనుల వ్యాపారమున కీదొంగతనము లపాయకరములై యుండెను. ఫ్రెంచివారు దీనిని లోబఱచుకొని ౧౬౧౦ వఱకు నామమాత్రపాలకులుగ నుండిరి గాని దేశీయుల దొంగతనముల నరికట్టజాలకపోయిరి. ౧౮౧౫ లో అమెరికనులు వీరి నాయకుని నోడించి తమవ్యాపారపు నౌకల కెట్టి నష్టమును గలుగజేయకుండునట్లు నతనిచే యొప్పందము జేయించుకొనిరి. ౧౮౧౬ లో 'లార్డ్ ఎక్స్‌మౌత్' అనువాడు ఇంగ్లీషునౌకాసేనతో అల్జియర్సును ముట్టడించి గెలిచి యచటి క్రైస్తవఖైదీల నందఱను విముక్తుల జేయించెను. అది మొదలుకొని యుద్ధఖైదీల నందఱను యూరోపియనుజాతుల నియమముల ననుసరించి యాదరించుచుండుట కేర్పాటులను గావించుకొనిరి. కాని అల్జీరియనుల దొంగ దోపుల్ల మాంపించక కొన్నాళ్లు యథాపూర్వకమే జరగసాగెను. అవమానమై చిట్టచివరకు ఫ్రెంచివారు కఠినపద్ధతులను దొరకొనిరి. క్రీ. శ. ౧౮౩౦ లో ఫ్రెంచివారు ౪౦,౦౦౦ ల మందిగలసేన నీదేశమునకు బంపిరి. అల్జియర్స్‌పట్టణము శీఘ్రముగ వీరివశ మయ్యెను. అల్జీరియనునాయకుడగు 'డే' రాజ్యమును విడిపోవ జేసి

మరాకో మర్యాదను అనుయాయియైన 'అబ్దుల్ కాదిర్' అను అరబ్బు ప్రముఖుడు పైకి వచ్చి దేశీయుల సహకారంతో ఫ్రెంచివారి నెదుర్కొనెను. ఇతడు ౧౮౩౭ లో ఒరానులలాకాను ముట్టడింప ఫ్రాన్సువారితో ఘోరయుద్ధము జరిగెను. చివరకు ౧౮౩౮ లో ఫ్రెంచివారితనితో సంధిచేసికొని 'ముస్కారా అమీర్' అనుపేరుతో పిలువబడుచున్న అరబ్ జాతుల సమ్మేళనము పాలించుట కొప్పుకొనిరి కాని వెంటనే మరల యుద్ధము లారంభము కాగా ఆ యుద్ధముల యందు విజయపరంపర గలుగుచు వచ్చెను. అందువలనను, ౧౮౩౯ లో కాన్‌స్టాంటైనుతో పోరాడవలసివచ్చుటచేతను, తీరమందలి కొన్ని పట్టణములకు దక్కిన తక్కిన పడమటి అల్జీరియాకంతకు ఫ్రెంచివా రతనినే పాలకునిగ స్వీకరించిరి. ఫ్రెంచివారు కాన్‌స్టాంటైనును జయించి తక్కిన ఇలాకా వంతములోనికి బోవుచుండు ప్రయత్నములందుండ అబ్దుల్ కాదిరు యుద్ధసన్నాహములు చేయుచు ౧౮౩౯ లో అకస్మికముగ ఫ్రెంచియిలాకాలో ప్రవేశించి దానిని తనవశము చేసికొన మొదలిడెను. కొంతకాలము ఫ్రెంచిప్రభుత్వము నష్టమైపోయినట్లే కన్పించెను. కాని ౧౮౪౧ లో జనరల్ బ్యూగేడ్ (General Bugeaud) అనునతడు ఫ్రెంచివారిపక్షమున గవర్నరు-జనరలుగ ఆదేశమునకు వచ్చినది మొదలుకొని వ్యవహారములు ఫ్రెంచివారిపక్షమునకు తిరుగసాగెను. కొన్ని నెలలు పోరాటములు జరిగినపిమ్మట ఆసంవత్సరాంతమునకే అబ్దుల్ కాదిరుయొక్క అంతిమదుర్గముగూడ ఫ్రెంచివారివశమయ్యెను. తరువాత నితడు మొరాకోకు వంటియున్న ప్రాంతమునుండి ఫ్రెంచివారి నెదిరించెను. కాని మఱునటిసంవత్సరము దానినిగూడ గోల్పోయి మొరాకోలోనికి పారిపోయెను. అక్కడనుండి ఇతడు రెండుపర్యాయములు అల్జీరియామీద దండెత్తి రెండవమాఱు ఫ్రెంచివారిని రెండుచోట్ల నోడించి పోయి ౧౮౪౪ - నాటికి మొరాకోలో నొకసేనను ప్రోగుచేసెను. బ్యూగేడు సరిహద్దును దాటి అతనిసేనల నాశనము చేయుచుండ నదేసమయమున ఫ్రెంచివారి నౌకాదళములు మొరాకోతీరపట్టణములమీద బాంబులను గురియించినవి. అకారణమున మొరాకోచక్రవర్తి సంధి కొప్పుకొనవలసినవాడై అబ్దుల్ కాదిరునకు సాయము చేయకుండుటయే కాక అతని నెదిరింప ఫ్రెంచివారికి సాయపడుటకు సమ్మతించెను. ఈ ప్రకారము సర్వవిధముల నిస్సహాయుడై తుదకు అబ్దుల్ కాదిరు ౧౮౪౭ లో ఫ్రెంచివారికి లోబడిపోవ వారతనిని ఫ్రాన్సునకు తీసికొనిపోయి ౫ సం. సంవత్సరములపాటు ఉంచి తరువాత అల్జీరియాకు మరలిపోవనియతనిచేత ఒప్పందము చేయించుకొని వదలిపెట్టిరి. కాని దేశమందింకను అల్లరులు జరుగుచునేయుండెను. దక్షిణమందలి కబైలులును, అరబ్బులును విదేశీయులు తమమీద చేయుపరిపాలనవిధానభారమును సహించుటకు ఇష్టపడక పెక్కుమారు తిరుగబడుచుండిరి. ఇందువలన పెలిస్సియర్, కన్‌రోబర్ట్, సెంట్ ఆర్‌నాడ్, మెక్‌మాహాన్ మున్నగు ఫ్రెంచిసేనానాయకులకు చక్కని యుద్ధశిక్షణము కలుగు అవకాశము లభించెను. ౧౮౬౪ నందు పెలిస్సియర్ తరువాత గవర్నరుజనరల్ పదవి నధిష్ఠించిన మెక్‌మాహాన్ ఒకగొప్పరాజ్యతంత్రము నడుపుటకు ప్రొక్కెను. ఇదేసమయమున నెపోలియన్ చక్రవర్తి అల్జీరియాకు వచ్చి సందర్శించి దేశీయులకు నిజమైన సుఖకారణములు కలవనియు, ఫ్రెంచిపరిపాలకులు వాని మన్నించి రనియు గుర్తించి పరిపాలనవిధానము దానికి పరివర్తనములను గావించెను. కాని ౧౮౭౧ నుండి క్రొత్తక్రొత్తపోరాటములు కలుగుచునేయుండెను. ఆసంవత్సరము ఫ్రాంకో-ప్రష్యను యుద్ధము సంభవించుటచేత, అల్జీరియాలో ఫ్రెంచిసైనికులయుపభారము కాగా తత్పరిపాలనమును ప్రోత్సహించుటకు ప్రబలప్రయత్నములు జరిగెను. కాని యవి సంపూర్ణముగ నడచి చేయబడినవి. మఱియు నిన్నికలనాయకులకు కారణభూతమైన మిలిటరీరాజ్యవిధానమునకు బదులుగ ఉత్తరభాగమున సివిల్ ప్రభుత్వమేర్పాటు కావింపబడినది. దేశాటులతో నిండియున్న దక్షిణభాగమందిప్పటికిని సైనికప్రభుత్వమే కలదు. ౧౮౮౧ లో ఫ్రెంచివారు ట్యూనిస్ నగరమును ముట్టడించి అల్జీరియాపడమటిభాగమున నిర్బాధముత్పన్న మయ్యెను. దీనివలన ఫ్రెంచివారికి గాని, వలస వచ్చి నివసించినవిదేశీయులకు గాని అధిక మనుష్య నష్టమేమియు కలుగలేదు. అదిమొదలుకొని నేటివఱకు అచట శాంతియే విరాజిల్లుచున్నది. కాని ఫ్రెంచివారి కచట ఒక పెద్దసేనను నిలిపి దానిని పోషింపవలసిన భారముమాత్రము తప్పలేదు. జర్మనీతో జరిగినయుద్ధమునందు అల్జీరియనులు చాలసాయము గావించినందున ప్రభుత్వమునందు క్రొత్తమార్పు లనేకములు కలిగెను. ౧౯౧౯ లో కావింపబడిన చట్టము ననుసరించి అల్జీరియనుదేశీయుల కందఱకును కొన్ని హక్కులమీఁద ఫ్రెంచిపౌరులహక్కులు లభించినవి.

**అల్లా** — బొంబాయి, కొల్హాపూర్ సంస్థానమందలి యొక గ్రామము వరుణానదిమీద నున్నది. జనసంఖ్య ౪,౯౮౨. ఇచ్చట రహిమాన్‌దర్గా అను మహమ్మదీయులపీఠమును, సిద్ధోబా, ధులాబా, అల్లమప్రభు, రామలింగదేవాలయములును కలవు. అల్లమప్రభువు దేవాలయమునకు ఔరంగజేబు మెట్లు కట్టించెనట! దీనియెదుట ౧౫౦ ఏండ్ల భక్తులు కొందఱు ప్రాణముతోనే సమాధి నొందుచుండిరట. రామలింగదేవాలయము కొండలో తొలువబడినది.

**అల్వైస్, సర్ చార్లెస్** (౧౮౬౪ - ౧౯౪౦) — ప్రష్యదేశపు రాజనీతిజ్ఞుడు. ఇతడు మొదట రాజ్యమందలి ఆర్థిక శాఖకు మంత్రిగను, తరువాత మతవిద్యాశాఖలకు మంత్రిగను ఉండెను. విద్యావిషయములకు గొప్పయుపకార మొనరించెను. ఇతడు ౧౮౭౨ లో లోకవిద్యావిధానము నేర్పఱిచెను. దాని ననుసరించియే ప్రష్యలో నిప్పటికిని విద్య చెప్పబడుచున్నది. యూరప్పుదేశములందలి పెక్కుదేశములు దాని ననుకరించెను.

**అల్లుక్రి** — బళ్లారిజిల్లా రాయదుర్గ తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩,౫౧ (౧౯౩౧).

**అల్లూరుపాడు** — నెల్లూరుజిల్లా వెంకటగిరి తాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౮౪౭ (౧౯౩౧).

**అల్పగ్రహములు** — అంగారక గ్రహమునకును బృహస్పతిగ్రహమునకును నడుమ చిన్న చిన్న గ్రహము లసంఖ్యములు కలవు. వానికి నల్పగ్రహము లని పేరు. వీనిని ఇంగ్లీషులో మైనర్ ప్లానెట్స్ (Minor Planets) అనియెదరు. నేటి వఱకు శాస్త్రజ్ఞులు రమారమి ౮౦౦ ల అల్పగ్రహములు కనుగొనిరి. మన నవగ్రహములతోఁ బోల్చిచూచినయెడల వీని మిక్కిలి చిన్నవి. గ్రహము లన్నింటిలోను బుధుఁడు చిన్న వాఁడు. ఈగ్రహముయొక్క వ్యాసము (Diameter) ౪,౨౧౬ మైళ్లు పొడుగు. అల్పగ్రహము లలోఁ బెద్దదానివ్యాసము ౪౮౫ మైళ్లు. ౨౪ మైళ్లు వ్యాసముగలవి పెక్కులు కలవు. ౧౯౦౦ ల సంవత్సరమున డాక్టరు ఉల్ఫ్ అను జ్యోతిషికునిచేఁ గనిపట్టఁబడిన యల్పగ్రహముయొక్క వ్యాసము ౫౫౦ గజములు మాత్రము! ఇదివఱకుఁ గానిపించిన యీయల్పగ్రహముల నన్నింటినిఁ గలిపి యొకముద్ద చేసినయెడల నాముద్ద మనభూగోళమునకన్న నిరువదిరెట్లు చిన్నదిగ నుండును!

కనుఁగొనినవిధము — పదునెనిమిదవశతాబ్ది యారంభమునందునుండి యల్పగ్రహములున్నవనుమాట శాస్త్రజ్ఞులకుఁ దెలియఁగ నేరదుఁ గాని అంగారకునకును బృహస్పతికిని నడుమ ముప్పదినాల్గుకోట్ల నలుబదిలక్షలమైళ్ల యంతర మున్నందున, నీగొప్పయంతరములో నొక గ్రహము తప్పక యుండవచ్చు నని జ్యోతిషికు లాశించుచు వెదకఁ జొచ్చిరి. ఇటలీదేశవాఁ డయిన పియాజ్జీ యను జ్యోతిషికునకు ౧౯-వ శతాబ్ది ప్రారంభదినమున (౧-వ జనవరి, ౧౮౦౧) ఒక యల్ప గ్రహము కానవచ్చెను. దీనికి సెరిస్ (Ceres) అని నామకరణము చేసిరి. ఇట్లు నేఁటివఱకును రమారమి ౮౦౦ ల అల్పగ్రహములు కాన వచ్చినవి. ఇవి యన్నియు పెద్దగ్రహములవలెనే సూర్యునిచుట్టును తిరుగు చుండును. అన్నియు నంగారకబృహస్పతులకు నడుమనుండు నాకాశ మునం దున్నవి. ప్రతిసంవత్సరమును క్రొత్తవి కానవచ్చుచున్నవి.

వీని యుత్పత్తి — ఇట్లు వందలకొలఁది యీయల్పగ్రహములు కుజబృహస్పతుల మధ్య నెట్లు పుట్టినవి? అను ప్రశ్నకుఁ బలువురు పలువిధముల జవాబు చెప్పెదరు. పూర్వ మొకప్పు డీచి యున్నియుఁ గలిసి యొక పెద్దగ్రహముగ నుండె ననియు, దానిపై మఱియొక గోళము వచ్చుటవలనో మఱియేకారణముచేతనో యది పగిలి తునక లగుటచే నన్ని యల్పగ్రహము లైయుండు ననియుఁ గొందఱు శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

వీనినే అల్పగ్రహములనియు, లఘుగ్రహములనియు, ఉప గ్రహములనియు నంటురు. పేర్లు భేదముగ నున్నను అసలు గ్రహములలో మనకుఁ గనుపడువాని లఘుగ్రహము లనియు, ఇతర గ్రహములకు నుపగ్రహము లనియుఁ జెప్పుదురు. ఆకారమునందుఁ గొంచెము చిన్నవి, కొంచెము పెద్దవి యని యర్థము. ఒక గ్రహము చుట్టును తిరుగు మఱియొకగ్రహమున కుపగ్రహ మని పేరు.

**అల్ప అర్ స్లన్** (౧౦౬౩ - ౧౦౭౨) — సెల్జుకు దేశపు సుల్తాను. మహమ్మదీయమతము నవలంబించి మహమ్మదు నామమును ధరించెను. సిరియా, ఆర్మీనియా, జార్జియా రాజ్యములను జయించెను. రోమకచక్రవర్తి రోమనస్ డయోజినస్ ను జయించెను. తన భార్యల నివాసస్థలమయిన తుర్కిస్తానమును జయింపఁబోయినప్పుడు చెఱపట్టఁబడిన యొక దుర్గాధ్యక్షునిచేత వధింపఁబడెను.

**అల్ఫరాబీ** (క్రీ. శ. ౯౦౦ - ౯౫౦) — అరబ్బీ తత్త్వవేత్త. తనకాలమందలి శాస్త్రము లన్నిటిని చేర్చి యొక విజ్ఞానసర్వస్వమును రచించెను. ఇతఁడు బాగ్దాద్, డెమాస్కస్ పట్టణములందు నివసించుచుండెను. ఇతఁడు అరిస్టాటిల్ గ్రంథముల నరబ్బీ వారికి నేర్పెను.

**అల్ఫోన్సో** (౧౮౫౭ - ౧౮౮౫) — ఇతనిని ౧౨-వ అల్ఫోన్సో అందురు. ఇతఁడు స్పెయిన్ దేశపురాజు. ఇతఁడు ౧౮౫౭ లో జన్మించెను. తల్లి ఇసాబెల్లా ఆమెను దేశమునుండి వెడలఁగొట్టిరి. అప్పుడు చిన్నవాఁడైన అల్ఫోన్సోగూడ ఆమెవెంట వెళ్లెను. ౧౮౭౪ లో ఇతనిని రాజుగ నెన్నుకొనిరి. ఇతఁడు మిక్కిలి తెలివిగలిగి రాజ్యపాలనము చేసెను.

**అల్ఫోన్సో** (అరగాన్) — స్పెయిన్ దేశమునందు పూర్వము విశిష్టప్రభుత్వముగా నుండిన అరగాన్ అను రాజ్యమును అల్ఫోన్సో అను పేరుగల అయిదుగురురాజులు పాలించిరి. వారిలో సిద్ధులు ముఖ్యులు —

౧. ఈ పేరుగలవారిలో నొండవవానికి (క్రీ. శ. ౧౧౦౪ - ౧౧౩౪) విజయుఁ (The Victorious) డను బిరుదు నుండెను. ఇతఁడు స్పెయిన్ దేశవాసు లైన మూరులు అనుపేరుగల మహమ్మదీయులతోఁ బోరాడి వారిని పెక్కు పర్యాయములు పరాభవించి సారగోసా, టెరాగోనా అనువానిని స్వాధీనపఱుచుకొనెను. ఇతఁడు ౨౯ యుద్ధములలో విజయ మందెను.

౨. ఇతఁడు (౧౪౧౬ - ౧౪౫౮) ఈ పేరుగల ౫-వ యతఁడు. క్రీ. శ. ౧౩౯౬ లో జన్మించెను. ఇతనికి 'ఉదారుఁడు' అను బిరుదు గలదు. ఇతనితండ్రి ఫర్డినెండు. ౧౪౧౬ లో రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు అరగాన్, సిసిలీ, నేపిల్సు అను మూఁడురాజ్యములపై ప్రభుత్వము చేసెను. ఇతఁడు విజ్ఞానసంపన్నుఁడు, విద్యా ప్రియుఁడు, విద్వత్పోషకుఁడు. విజ్ఞానపునరుజ్జీవనమని (Renaissance) యూరోపుదేశచరిత్రలో ప్రఖ్యాతిఁ జెందినయుగమునందు విద్యా భివృద్ధిఁ జేసిన రాజులలో నితఁ డొకఁడు. కాన్ స్టాంటినోపిల్ పట్టణము తురుష్కులు పట్టుకొనినతరువాత నచ్చటనుండి పాఱిపోయిన పండితవర్యులకు నితఁడు ఆశ్రయ మిచ్చెను.

**అల్ఫోన్సో** (పోర్చుగల్) — పోర్చుగల్ దేశమున నీ పేరుగలరాజు లారుగురు రాజ్య మేలిరి.

౧ ఇతఁడు (౧౦౯౪ - ౧౧౮౫) అంతవఱకు లియోన్ రాజ్యమునకు లోఁబడియున్న పోర్చుగల్ ను స్వతంత్రముగఁ జేసెను. గొప్ప యోద్ధ ఆజానుబాహుశరీరము గలవాఁడు పెక్కు యుద్ధములలో మూరులతోఁ బోరాడి ఖ్యాతి వడసెను

౨. ఇతఁడు (౧౧౮౫ - ౧౨౨౩) మతగురువులయధికారమును తగ్గించుటకు ప్రయత్నించెను. అందుచే నితనిని వెలివేసిరి

౩ ఇతఁడు (౧౨౧౦ - ౧౨౭౯) తనకాలమును చాలవఱకు మూరులతో యుద్ధముచేయుటలోఁ గడపెను

౪ ఇతఁడు (౧౨౯౦ - ౧౩౫౭) కేస్టిలే రాజులతోను, మూరులతోను పోరాడుటయందు తనకాలమును చాలవఱకుఁ గడపెను ఇతనికుమారుఁడైన పీటరునకును, ఇతనికిని గృహకలహము సంభవించెను

౫. ఇతఁడు (౧౪౩౨ - ౧౪౮౧) ఆఫ్రికాలోని మూరుల రాజ్యముమీఁదికి దండెత్తి వెడలినందున నితనికి 'ఆఫ్రికన్' అను బిరుదు వచ్చెను

౬ ఇతఁడు (౧౬౪౩ - ౧౬౮౩) దుర్మార్గుఁ డగుటచే ౧౬౬౭ లో రాజ్యభ్రష్టుఁడు కావలసివచ్చెను తరువాత టెర్సీరా పట్టణములో కాలము గడపి ౧౬౮౩ లో మరణించెను

**అల్ఫోన్సో (లియోన్)** — స్పెయిన్ దేశమునందు పూర్వము స్వతంత్రములుగ నుండిన లియోన్, కేస్టిలే అను రాజ్యములపై అల్ఫోన్సో అను పేరుగల రాజులు ౧౧ గురు రాజ్యము చేసిరి

౧, ౨ మొదటియిద్దఱను గూర్చి విశేష మేమియు తెలియదు వారి ప్రభుత్వకాలము క్రీ. శ. ౭౩౯ - ౮౪౨ వఱకును జరిగిన శతాబ్దియం దుండె ననిమాత్రము తెలియుచున్నది

౩, ౪, ౫ తరువాతి ముగ్గురు అల్ఫోన్సోలు ౮౬౬ - ౧౦౨౭ కాలమునందు పాలనముఁ జేసిరి దేశముమీఁది కెత్తివచ్చిన మూరు లను మహమ్మదీయులతో వీరికాలమునఁ బోరాట మారంభమయ్యెను

౬ ఇతఁడు (౧౦౬౫ - ౧౧౦౯) మూరుల నెదిరించుటలో నాయకుఁడుగ నుండెను స్పెయిన్ దేశజాలను పోపునకు ఫ్రాన్సు లోఁబడునటుల చేసెను స్పెయిన్‌వారికి ఫ్రాన్సువారి నాగరకత నేర్పెను.

౭ ఇతని (౧౧౦౬ - ౧౧౫౭) ఉభయమతములప్రజల రా జన్న బిరు దుండెను క్రైస్తవులతో పాటు మూరు లను మహమ్మదీయు లనుకూడ న్యాయముగఁ బరిపాలించెను మూరులతిరుగఁబాటు ఫలముగఁ గొట్టఁ బ్రయత్నించుచుండఁగఁ జంపఁబడియెను

౮ ఈతఁ (౧౧౫౮ - ౧౨౧౪) ఇంగ్లాండురాజైన ౨-వ హెన్రీకూమార్తెను వివాహమాడెను. మూరులపై దండెత్తుటకు కేస్టైన క్రైస్తవరాజులకూటము (Coalition) నకు నాయకుఁడుగ నుండి మూరులఁ బూర్తిగఁ బరాభవించెను.

౯ ఈతని (౧౧౭౧ - ౧౨౩౦) వివాహముగురించి పోపునకు ఇతనికిని వివాదము కలిగెను.

౧౦ ఇతఁడు (౧౨౨౧ - ౧౨౮౪) విద్యావంతుఁడు. బృహస్పతి (The wise) అను బిరుదు గాంచెను. జ్యోతిశ్శాస్త్రమందలి గణితస్కంధము నభివృద్ధిచేయుటకు సాయము చేసెను. తనసరదారులతో పెక్కు తగాదాలు పెట్టుకొనెను. జర్మనుసామ్రాజ్యము సంపాదింపవలయునని యత్నించుటకు ధనముగావలసివచ్చి ప్రజలపై పెక్కు పన్నులు విధించెను అందుచే లోకద్వేషమును సంపాదించెను.

౧౧ ఇతఁడు (౧౩౧౧ - ౧౩౫౦) తిరుగఁబాటు చేసిన సరదారులను కఠినముగ శిక్షించెను ఆఫ్రికాదేశమునుండి వచ్చిన మూరుల చివరదాడి నోడించెను.

**అల్బటేనియస్** (౮౫౦ - ౯౨౯) — ఇతని పూర్ణ మైన నామము మహమ్మద్ బిన్ జెబిర్ అల్ బటాని అరేబియా దేశజుఁడు జ్యోతిశ్శాస్త్రవేత్త మెసపొటేమియా దేశమునందలి అరక్కా యనుస్థలమున నితఁడు నక్షత్రాదులకేగాక గ్రహంగాని జ్యోతి శ్శాస్త్రమునందు క్రొత్తపరిశోధనలు చేసెను టాలెమీచే రచింపఁ బడిన గ్రహపథకములు దృక్ప్రత్యయమునకు వచ్చుట లే దని యితఁడు తనశోధన ననుసరించి క్రొత్తపథకము లేర్పఱిచెను. ఇతని మతమున అయనమునకు ౬౬ సంవత్సరములలో ఒక్క అంశము గతి కలదు, పరమక్రాంతి ౨౩° ౩౫', సాయనసూర్యోచ్చము ౮౨° ౧౭'. ఇతఁడు సాయనసంవత్సరప్రమితి ౩౬౫ దినములు ౫ గంటలు ౪౬ నిమిషములు ౨౪ సెకనులు అని నిశ్చయించెను. ఇది నిక్కమైనదాని కంటె ౨ నిమిషములు ౨౬ సెకనులుమాత్రము తక్కువగ నున్నది. ఇతఁడు గొప్ప గణితజ్ఞుఁడు త్రికోణమితి (Trigonometry)లో నూతనాంశములను గనుఁగొనెను జ్యోతిషవిషయమై పెక్కు గ్రంథములను వ్రాసెను వానిని ౧౨-వ శతాబ్దివాఁడైన ప్లేటో టిబర్టినస్ అనువాఁడు లాటిన్‌భాషలోనికి భాషాంతరీకరించెను.

**అల్బిరూని** (క్రీ. శ. ౯౭౩ - ౧౦౪౮) — ఇతని సంపూర్ణనామము అబూరైహాన్ మహమ్మద్ బిన్ అహమ్మద్ అల్ బిరూని. గజ్ని మహమ్మదునాస్థానవిద్వాంసుఁడు. నానాశాస్త్రములందును మిక్కిలి ప్రజ్ఞ కలవాఁడట. రేఖాగణితము, తర్కము అనుశాస్త్రములందును మిక్కిలి ఖ్యాతి గాంచెను. ఇతఁడు పెక్కుదేశములు చూచుటయేగాక హిందూదేశమునకు వచ్చి ఎన్మిదిసంవత్సరములవఱకు నిచ్చట నుండి యనేకశాస్త్రములను పఠించెను. 'తారిఖ్-ఉల్-హింద్' అను హిందూదేశచరిత్రగ్రంథము వ్రాసెను. పెక్కు గ్రీకు గ్రంథములను భాషాంతరీకరించెను. అఫ్ఘానిస్థానమున ౧౦౪౮ లో చనిపోయెను.

**అల్బుమజార్** (౮౦౫ - ౮౮౫) — విఖ్యాతి చెందిన అరబ్బీజ్యోతిర్విదుఁడు. ఇతని గ్రంథములు లాటినులోనికి భాషాంతరీకరింపఁబడెను (౧౪౮౯).

దారిద్ర్య భయావహాలమునను, వాతావరణము చవిపడక పోవుటచేతను అప్పటి ప్రజలు మరణించిరి. క్రీ. శ. ౧౮౫౭-వ సంవత్సరమున జరిగినస్వాతంత్ర్యయుద్ధములో గూడ నీనగరము ప్రాముఖ్యము వహించెను. కుదకు ఏప్రిలు ౨౬-వ తేదీనాఁడు గొప్పయుద్ధము జరిగినతరువాత అల్లాహాబాదు యాంగ్లేయుల యధీన మైనది. అల్లాహాబాదుజిల్లా వైశాల్యము ౨,౮౦౫ చ. మైళ్లు. జనసంఖ్య ౭,౫౦,౫౫౫ (౧౯౫౧).

**అల్యాబాదో** — గంజాంజిల్లా ఛత్రపురంతాలూకా లోని గ్రామము. జనసంఖ్య ౧,౩౪౪ (౧౯౫౧)

**అల్యూమినా** — ఇది యొక్కటే అల్యూమిని యము ధాతువుయొక్క అమ్లజనిదము (Oxide). ప్రాకృతికావస్థయం దిది కురువింద (Corundum) మనియు, స్ఫాటిక దశయందు (Crystal form) కెంపు (Ruby) లేక నీల (Saphire) మనియు, అష్టవిధస్ఫటికాకృతులకంటె భిన్నమైనస్థితియందు కురువింద వికార (Emery) మనియు పిలువఁబడుచుండును. కఠినత్వమందు వజ్రము నకుఁ దరువాత దీనిని మించినది లేదు. కావున అద్దములను గోయుట కిది సాధనముగ నుపయోగపడుచుండును. సైలికము (Silica) తోఁ గలసి ప్రపంచమునం దంతట విస్తారముగ వ్యాపించియుండు పదార్థములలో నిదియు నొకటి. నల్లరాయి (Granite), నాపరాయి (Trapstone), పలకరాయి (Slate stone) లోనుగాఁగల శిలలలో నిది అధికముగ వ్యాపించియుండును. పింగాణీరేగడయందు సగముకంటె నెక్కువభాగము ఈ అల్యూమినాయే చెందియుండుట చేత అరేగడ యంతటి ప్రశస్తగుణధర్మములు కలుగుటకుఁ గారణమైనది.

అల్యూమినాయు, ఉజ్జనజలామ్లజనిదము (Hydroxide) ను వనస్పతివర్ణములతోఁ (Vegetable colours) గలసి 'లేకులు' (Lakes) అని పిలువఁబడునీళ్లలో కరఁగని సమ్మేళనములు (Insoluble Compounds) గ ఏర్పడు గుణధర్మములు కలిగియుండు టంచేసి అద్దకమునందును కాలికోముద్రణమందును వర్ణోపాధులుగ (Mordants) వాడఁబడుచుండును. వీని యుపాధుల సాయముతో వేయఁబడు రంగులు వెలిసిపోక స్థిరముగ నిలచియుండును. పటికపు ద్రావణమునందు (Alum solution) ఎమ్మోనియాను కలుపుటవలన ఉజ్జనజలామ్లజనిదము (Hydroxide) తెలుపురంగుతో నదుగునకు దిగును. అడుగునదానిని వండఁబెట్టుటచేతఁగాని వేఁడిచేయుటచేతఁగాని యందలి ఉజ్జనము (Hydrogen) వేఱుచేయవచ్చును.

అల్యూమినాను శుష్కవిధానమున (Dry Process) తయారుచేయుటకుఁగాను నూటింట మూఁడుపాళ్లకంటె తక్కువ సైలికమును గలిగియుండు బాక్సైటును (Bauxite) సోడాసహితముగ బట్టీలో కాల్చి అనంతరము నీటిద్వారా పిండుటవలన (Leaching) సోడియముస్ఫటికము వచ్చును. కాస్టిక్ సోడా ద్రావణముతో బాక్సైటు శుద్ధిచేసి అల్యూమినాను తీయుటకు తడి అగ్రపద్ధతి (Wet Process) యొకటి కలదు. ఈరెండువిధములు ఏర్పడు ద్రావణము నుండి రెండుభిన్నమార్గముల అల్యూమినాను గ్రహించవచ్చును. అందొక విధ మెట్లన, కర్బనద్వ్యమ్లజనిదవాయువును (Carbon dioxide gas) ద్రావణమునందు ప్రవేశించుటవలన ఉజ్జనజలామ్లజనిదము (Hydroxide) అడుగునఁ జేరుకొనును. రెండవపద్ధతి ననుసరించి ఆ ద్రావణము నించుక జలమిళితము (Dilute) గావించి ఉజ్జనయుతఅల్యూమినాను కొంతను గలిపి కలయఁబెట్టినయెడల ద్రావణమునందలి చాలభాగ మల్యూమినా అడుగునఁ జేరుకొన మీఁద కొంత ద్రవము నిలిచిపోవును. ఆద్రవము నిక్షిప్తమై (Concentrated) మరల బాక్సైటును గ్రహింపఁగలుగును. వేఱొండువిధానమున బాక్సైటు, కర్బనము (బొగ్గు) నత్రజనములు ౧౩-౧౮ వందల డిగ్రీలవేఁడిమిలో అంతఃప్రతిక్రియలు (Inter-reactions) జరిపినచో తమ్ములమున నుత్పన్నమగు స్ఫటనత్రజనిదము (Aluminium Nitride) నందు సోడియం ఉజ్జనజలామ్లజనిదము (Sodium Hydroxide) ను కలిపినయెడల సోడియము స్ఫటికము (Sodium Aluminate) ఏర్పడును. ఈసందర్భమున ఎమ్మోనియా అప్రయత్నముగ ఉపఫలము (By product) గ లభించును. ఈ సోడియము స్ఫటికమునుండి అల్యూమినా తక్కువ మూల్యమునకై అల్యూమినియము ధాతూత్పత్తినిమిత్తము విద్యుద్విశ్లేషణ చేయుటకు సర్వథా యోగ్యమై యుండును.

బాక్సైటునుండి అల్యూమినాను విడఁదీయుటకుఁగాను వేఱొక విధమగుపద్ధతి నార్వేదేశమున వాడుకలో నున్నది. నూటింట ౩౦ పాళ్ల నత్రికామ్ల ద్రావణము (Nitric Acid Solution) ద్వారా బాక్సైటును నిష్కర్షణ మొనరించుట (Leaching) చే ఆ ద్రావణము అందలి స్ఫటనమును ఖటికము (Calcium) ను లోహములోని కొంత భాగమును కరఁగించుకొని మిగత లోహమును సైలికమును వదలి వేయును. కరఁగనిపదార్థములను వేఱుచేసి ద్రావణమునందలి లోహమును స్ఫటికము విడఁదీసి వండఁబెట్టఁగాఁ దేలినదానిని అందుఁగల స్ఫటనకారము (Aluminium Salt) విడిపడుట కంతవేఁడి కావలయునో అంతయు వేఁడిగావించి ఆసందర్భమున వెలువడునత్రజని, అమ్లజనముల (Nitrogen, Oxides) తో నత్రికామ్లమును దింపుకొని అల్యూమినాను ధాతూత్పత్తినిమిత్తము సంగ్రహించుకొందురు.

శుద్ధమైన స్ఫటామ్లజనిదమును తీయుటకు 'హాగ్‌లాండ్' (Hagland) విద్యుదుష్ణవిధాన (Electro-thermic process) మను వేఱొకపద్ధతి కలదు. లోహామ్లజనిదము (Iron Oxide) సైలికము లోనగు బాక్సైటునందలి మలినములను వేఱుచేయుటమీఁదనే ఇది యాధారపడియున్నది. అందునిమిత్తము బాక్సైటును విద్యుత్ బట్టీలో కర్బనముద్వారా సంస్కరించి ౧౫, లేక ౨౦ పాళ్ల గంధకిదమును కలిగియుండునట్లు ద్రవమైన ధాతువు సుత్పత్తిచేయుదురు. ఈగంధకిద, అమ్లజనిదధాతుమాలిన్యము ప్రవహించునట్లు చేయుదురు. దానిని జల్లార్చఁగాఁ గట్టిన గడ్డను చూర్ణముచేసి నీటిలోఁ గలిపి

Aluminium Salt స్ఫటక్షారము
Aluminium Sodium Fluoride స్ఫటసోడింప్లవిదము
Aluminium sulphate స్ఫటగంధకితము
Alunite అలూనాయిటము
Ammonia Carbonate ఎమ్మోనియాకర్బనితము
Ammonia gas ఎమ్మోనియాగాసు
Ammonia Hydrate ఎమ్మోనియా ఉజ్జితము
Ammonia Sulphide ఎమ్మోనియాగంధకిదము
Ammonium sulphate ఎమ్మోనియముగంధకితము
Anodes అనోడులు
Aqueous Solution జలీయ ద్రావణము
Arsenic తాలము
Atomic number అణువిక సంఖ్య
Atomic weight అణువిక భారము
Barium Fluoride భారింప్లవిదము
Base భస్మము
Bauxite బాక్సైటు
Bromine బ్రమము
By product ఉపఫలము
Calcium ఖటికము
Carbon కర్బనము
Carbon dioxide gas కర్బనద్వ్యమ్లజనిదవాయువు
Caustic soda solution దాహకసోడా ద్రావణము
Caustic solutions దాహక ద్రావణములు
Centigrade degrees శతాంశాంశములు
Chlorine హరితము
Chromic Acid క్రోమికామ్లము
Claus Process క్లాస్ విధానము
Clay రేగడ, బంకమట్టి
Colloidal solution కొల్లోడియఘద్రావణము
Combination సంయోగము
Concentrated నిష్టమైన
Conductor of Electricity విద్యుద్వాహకము
Copper తామ్రము
Corundum కురువిందము
Crude Iron ముడికాకినుము
Cryolite క్రయోలైట్
Crystal form స్ఫాటికదశ
Dihydrate ద్వ్యుజ్జితము
Dilute అసాంద్రితము
Dilute Organic Acids అసాంద్రిత సేంద్రియామ్లములు
Double Fluoride of Aluminium స్ఫటద్విప్లవిదము
Dry process శుష్కవిధానము
Ductile తాంతవతాయుక్తము
Dyke బంధనము
Earth's Crust భూపటలము
Electrolysis వైద్యుతవిశ్లేషణము
Electro thermic process విద్యుదుష్ణవిధానము
Emery కురువిందవికారము
Explosives ఉత్స్ఫోటనములు
Fixed salts స్థిరక్షారములు
Granite నల్లరాయి
Halides హరిదములు
Halogen Acids హైలాదిఉపధాత్వమ్లములు
High Ductility ఉద్బతాంతవత
High Temperature ఉచ్చతాపపరిమాణము
Hydrochloric Acid ఉజ్జహరికామ్లము
Hydrogen ఉజ్జనము
Hydrogen sulphide ఉజ్జనగంధకిదము
Hydroxide ఉజ్జనయామ్లజిదము
Ice stone హిమశిల
Indissoluble Compounds నీటకరగనిసమ్మేళనములు
Inter reactions అంతః ప్రతిక్రియలు
Iodine నైలము లేక, అయోడిను
Iron ore ముడిఇనుము
Iron oxide లోహామ్లజిదము
Lactic Acid solution దుగ్ధామ్ల ద్రావణము
Leaching నిష్కాసనము లేక పిండుట
Low Pressure నీచభారము
Malleable ఘనవర్ధనీయము
Melting point ద్రవణాంకము
Metallic Element ధాతువర్గాలతత్త్వము
Mixed salts మిశ్రితక్షారములు
Mixed Sulphates of iron & Aluminium లోహము, స్ఫటము కలిసిన గంధకితములు
Molten copper Aluminium Mixture ద్రవీభూతతామ్రస్ఫటమేళనము
Monohydrate ఏకోజ్జితము
Mordants వర్ణోపాధులు
Natural waters నిసర్గజలములు
Nitric Acid నత్రికామ్లము
Nitric Acid Solution నత్రికామ్ల ద్రావణము
Organic Chemistry సేంద్రియరసాయనశాస్త్రము
Oxide అమ్లజిదము

Oxygen ఆమ్లజనము
Phosphates స్ఫురితములు
Porcelain Clay పింగాణీరేగడి
Porphyritic granite చలువరాయిగలసిన కల్లురాయి
Potassium Carbonates పొటాసియం కర్బనితములు
Ruby కెంపు
Salts క్షారములు
Saphire నీలము
Shock corrosions ఆఘాతక్షయములు
Silica శిల
Silicate శైలితము
Silicon శైలము
Slate Stone పలకరాయి
Soda silicate solutions సోడా శైలిత ద్రావణములు
Sodium Aluminate సోడియం స్ఫటికితము
Sodium Hydroxide సోడియం ఉదజనౌషామ్లదము
Solder టంకము
Solvent action ద్రావణకారక కార్యము
Specific gravity విశిష్టగురుత్వము
Sulphate గంధకితము
Sulphuretted Hydrogen గంధక ఉదజనము
Sulphur Dioxide గంధకద్వ్యామ్లజనిదము
Sulphuric acid గంధకామ్లము
Structure ఘటనము
Therapy రోగప్రతిక్రియ
Tin వంగము
Trap stone నాపరాయి
Tri hydrate త్ర్యుదకితము
Turquoise పీరోజామణి
Vegetable Colours కూరగాయరంగులు, వనస్పతివర్ణములు
Washing soda ఉతుకుసోడా
Water glass నీటిగాజు
Weak acid నీరామ్లము
Wet process ఆర్ద్రపద్ధతి
Zinc యశదము

**అల్యూషియనుదీవులు** — అమెరికా ఖండపు వాయవ్యభాగమునందు అలాస్కాకును ఆసియాఖండమున నీశాన్యమున నుండు కామస్కాట్కాకును మధ్యగల సముద్రమున ౧,౫౦౦ల మైళ్లు విస్తీర్ణమున వ్యాపించియుండు చిన్నదీవుల గుంపు. ఇవి సంఖ్యకు రమారమి ౧౫౦ కలవు. వీనిలో కొన్ని పెద్దవైనను సారవంతమైనవి కాదు. అన్నియు గుట్టలతోను తిప్పలతోను నిండియున్నవి. వీనిలో కొన్ని అగ్నిపర్వతములముఖములు. ఈదీవులలో శైత్యము విపరీతము. ఎస్కిమోజాతికి చేరిన అల్యూటు లనబడు ఈదీవుల ప్రజలు నారిప్పుడు క్రైస్తవమతము పుచ్చుకొనినారు. జనసంఖ్య ౨,౦౦౦. తిమింగలములను చేపలను పట్టుట ఈదీవులలో ముఖ్యవృత్తి.

**అల్ - రజీ** (క్రీ శ ౮౬౫ - ౯౨౫) అరబ్బీ వైద్యుడు. పెరిషియాలో టెహరాను దగ్గరనున్న రాయి గ్రామమున జననమొందె, బాగ్దాదు పట్టణమున విద్య గఱచెను. అక్కడ నున్నకాలమున నతడు గ్రీకు, పెరిషియను, హిందూ వైద్యశాస్త్రజ్ఞానమును బాగుగ సంపాదించెను. అచ్చటనే అతడు వైద్యము చేసికొనుచు జీవనము గడపెను. కొద్దికాలమునకే అతడు సమర్థుడును, కడు నేర్పరియునైన వైద్యుడని ప్రఖ్యాతిగాంచెను. ఇతడు వైద్యమునకు, ఇతర శాస్త్రములకును సంబంధించినవి రెండువందల గ్రంథములు రచించెను. పొంగు, మశూచికములనుగురించి యితడు వ్రాసిన గ్రంథము ఈవిషయమును గురించి వ్రాయబడిన గ్రంథములలోనికెల్ల నుత్తమ మయినదని చాలకాలము వాడుకయందుండెను. ఇతని గ్రంథములలో నింతకంటెను ముఖ్యముగా నెన్నదగినది 'అల్ - హావీ' యను నిరువది సంపుటముల వైద్యగ్రంథము. అల్ రజీ తనకాలమువఱకు అరబ్బులకుఁ దెలిసిన వైద్యవిషయములనేకాక గ్రీకులయొక్క, సిరియాదేశస్థులయొక్క వైద్యవిజ్ఞానమునుగూడ ప్రాగ్వ్యక్త గ్రంథమున పొందుపఱచెను. ఈ గ్రంథ మిరువది సంపుటములలోను నిప్పుడు లభ్యమగునవి పదిసంపుటములు మాత్రమే. ఒక్క వైద్యమునందేకాక యితడు తత్త్వశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రములంగూడ గొప్పజ్ఞానము సంపాదించి, వీనియందుఁగూడ గొన్ని గ్రంథములు వ్రాసెను. ఇస్లాము మతప్రపంచమున నితఁడు అద్వితీయుఁడయిన వైద్యశిరోభూషణమని పేరుగాంచెను.

**అల్లంచెర్లరాజుపాలెము** — పశ్చిమగోదావరి జిల్లా చింతలపూడితాలూకాలోని జమీందారీగ్రామము. జనసంఖ్య ౩౫౪ (౧౯౩౧).

**అల్లంపాడు** — ౧ నెల్లూరుజిల్లా గూడూరుతాలూకా యందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౨౯౧ (౧౯౩౧).

౨ నెల్లూరుజిల్లా ఉదయగిరితాలూకాలోని గ్రామము. జనసంఖ్య ౨,౦౮౦ (౧౯౩౧).

**అల్లన్, డేవిడ్** (౧౭౪౪ - ౧౭౯౬) — స్కాటిష్ చిత్రకారుడు. అల్లోవాయందు జన్మించెను. యితడు చిత్రకళను మొదట గ్లాస్గోయందును, పిదప ఇటలీయందు నభ్యసించెను. ౧౭౭౩ లో రోమునగరమునందు నివసించుచుండిన కాలములో ఒక చారిత్రకరచనమునకు బంగారు పతకము పారితోషికముగ లభించెను.

**అల్లము** — ఇది అరఁటికుటుంబములోనిది. భూమిలోపల దుంపవలె పెరుఁగుభాగమే దీని ప్రకాండము. నిజమైన వేళ్లు ఆ ప్రకాండమునుండి క్రిందికి దిగును. అరఁటిచెట్టునందువలెనే దాని యాకుల తొడిమలు అన్నియు దట్టముగ చేరి కాండముగా ఏర్పడుచున్నది.

దీనిని హిందూదేశమునం దంతటను సాగు చేయుచున్నారు. ఎఱ్ఱమట్టినేలలో బాగుగా పెరుఁగును. వర్షాకాలమునందు దున్నిన పొలములో చిన్నచిన్న గోతులు త్రవ్వి ఎరువు వేసి అల్లముముక్కలను పాఁతెదరు. ముక్కలు పెద్దవి కాకపూర్వమే విస్తారముగ వర్షము కురిసి నీళ్లు నిలిచినయెడల అల్లము కుళ్లిపోవును. ఏడెనిమిదినెలల కాలమునకు దుంపలు త్రవ్వుటకు వీలగును. అల్లమునుండియే సొంటిని చేయుదురు. అల్లముముక్కలను నీళ్లలో నానఁబెట్టి పైపొట్టును కడిగివేసి గోనెసంచిమీఁద పెట్టి పొట్టును రాచివైచి ఎండలో పెండనిచ్చిన సొంటి యగును.

ఉపయోగములు — సువాసననిమిత్తము కూరలలో వేయుదురు. మందుల కనుపానముగను సువాసన యిచ్చుటకును ఉపయోగింతురు. ఒకవిధమైన సారాయియు, వర్ణద్రవము దీనినుండి చేయుదురు. ఇది 'అగ్నిదీపనము చేయును శుక్లవృద్ధికారి మలమును బంధించును హృదయమునకు హితకరమైనది కడుపునొప్పి తగ్గించును రుచిగా, లఘువుగా, మధురపాకము కలదిగా, స్నిగ్ధముగ, ఉష్ణముగా నుండును కఫవాతములను హరించును' (వాగ్భట సూత్ర, అ ౬, ౧౬౧-౧౬౨) కడుపునొప్పి తగ్గించుటకై విరేచనకరము లగుమందులతోఁగూడను, మలమును బంధించుశక్తిగల దగుటచేత అతిసారమునందును దీనిని ఉపయోగింతురు.

మనదేశమునుండి అల్లము సొంటి ఇతరదేశములకు పోవుచున్నది. మన మెగుమతిచేసిన అల్లము పంచదారపాకముతోను తేనెతోను కలసి అల్లముమురబ్బాగా మనదేశమునకు దిగుమతి యగుచున్నది.

అల్లవరము — తూర్పుగోదావరిజిల్లా అమలాపురము తాలూకాకు చెందిన గ్రామము. జనసంఖ్య ౫,౪౯౯ (౧౯౩౧).

**అల్లా** — మహమ్మదీయులదేవునికిఁ బేరు. ఇది అరబ్బీ మాట. దీనికిఁ బూజింపఁదగినవాఁ డని యర్థము. మహమ్మదీపదము నిజమైన ఐశ్వర్యము సాధించు నని నిర్ణయించినందున మహమ్మదీయులు దీనినే ఈశ్వరపరముగ నెక్కుడు భక్తితో వాడెదరు. వీరి ముఖ్యమంత్రములలో 'లా ఇలాహ్ ఇల్లల్లాహ్' అనునది యొకటి. దీనికి 'అల్లా తప్ప మఱి దేవుఁడైనను లేఁడు' అని యర్థము. 'నారాయణునికన్న దేవుఁడైనను లేఁడు' అని మనవైష్ణవులు చెప్పుదురు గదా! అట్లే యిది. సంస్కృతమునందు 'అల్లా' శబ్ద మొకటి, అకారాంతస్త్రీలింగము కలదు. దానికి తల్లి యనియు, సర్వజ్ఞసర్వశక్తమైన పరమాత్మదేవత యనియు రెం డర్థము లిచ్చి, అదె 'అల్లైక్య శాక్త్యథర్వసూక్తమునందుఁ బ్రసిద్ధ' యని వాచస్పత్యమునందు చెప్పఁబడినది. ఈసూక్తము బహుశః 'అల్లోపనిషత్తు' అనునదియే యై యుండును (చూడుఁడు అల్లోపనిషత్తు).

అల్లా ఉద్దీన్ — బహమనీసుల్తా నయిన అహమదుషా వ్యక్తమగు మొగుఁడు తండ్రిమరణానంతరమున క్రీ శ ౧౪౩౫ లో నితఁడు రాజ్యమునకు వచ్చెను. రాజ్యమునకు వచ్చినప్పటినుండియు నితఁడు తన సోదరుఁ డయిన మహమ్మదుఖాను నెంతయో ప్రేమతో నాదరించెను కాని యతఁడు దుష్టుల దుర్బోధనలకుఁ జెవియొగ్గి తన యన్నను మారుకొని సైన్యములను సమకూర్చుకొని రాయచూరు అంతర్వేది బిజాపురము మొదలగుమండలములను ఆక్రమించుకొనెను. ఈరీతి పతిక్రాంతమగు రాజ్యగుఁ డయిన తనసోదరుని శిక్షింప సైన్యములను దీసికొని అల్లాయుద్దీను బయలుదేరెను. ఉభయుల బలములకును జరిగినమహాసంగ్రామమున పెక్కురు యోధు లుభయపక్షములందును మడిసిపడిరి. విజయలక్ష్మి అల్లాయుద్దీనును వరించెను. తన సోదరుఁడు తన్నంతగ ప్రేమతో నాదరించుచుండినను తాను ద్రోహియై తిరిగినందులకుఁ జాల పశ్చాత్తాపముఁ జెంది మహమ్మదుఖాను అల్లాయుద్దీనును శరణుచొచ్చి తన్ను క్షమింపవలసిన దని వేఁడుకొనెను. సుల్తాను తన కాంతరంగుఁ డయి సోదరుని క్షమించుటయే కాక యతనికి గొప్ప యౌదార్యముతో రాయచూరుమండలమును జాగీరుగ నొసంగెను.

అల్లాయుద్దీను తనసోదరునితోఁ బోరాడుచుండినకాలమునందు విజయనగరాధిపతి సైన్యములను గూర్చుకొని బహమనీరాజ్యముపయి దండెత్తి వచ్చెను కాని విశేషనష్టముతో నోడి తుద కేఁటేట బహమనీరాజ్యమునకుఁ గప్పము చెల్లించుట కొప్పుకొని సంధి గావించుకొనెనని మహమ్మదీయచరిత్రకారులు వ్రాసియున్నారు. ఇందలి యాథార్థ్య మింకను పరిశోధింపవలసియున్నది.

సంగ్రామములందు అల్లాయుద్దీనున కీర్తిని విజయములు సంప్రాప్తించుచు వచ్చినను అతనిరాజ్యపరిపాలనము దక్కనీమహమ్మదీయుల పరస్పరకలహములవలనఁ జాల సంక్షోభముఁ జెందినది. దక్కనీమహమ్మదీయులలోఁ జాలమంది సున్నీమతావలంబులు. విదేశీయులగు అరబ్బులు, తుర్కీవారు, పెరిషియనులు, మొగలాయీలు షియామతస్థులు. ఈ యుభయపక్షములవారికిని గల విరోధము అల్లాయుద్దీను సుల్తాను కాలమున మఱింత ప్రబలినది. ఈవిషమస్థితియందు మద్యపానప్రమత్తుఁడయియున్న సుల్తా నొసంగిన యనుమతివలన నొక మహోదారుణకార్యము జరిగినది. క్రీ శ ౧౪౫౪ లో విదేశీయమహమ్మదీయపక్షమునకుఁ జెందిన ఖాఫ్ మలిక్ ఉత్ తుజార్ గొప్పసైన్యమును దీసికొని సముద్రతీరస్థమయిన సంగమేశ్వరదుర్గమును సాధింప నరిగెను. అతఁడు మొదట సిర్కా యనుహిందూప్రభువుచే పరిపాలితమయినదుర్గమును వశపఱచుకొనియా ప్రభువునకు బలవంతముగ మహమ్మదీయమత మొసంగెను. పిదప తుజార్ సంగమేశ్వరముపై దండువిడలెను. సంగమేశ్వరము పర్వతారణ్యమధ్యస్థితము దుష్ప్రాప మని పేరొందినదుర్గము. తుజార్

లోని (౪-వ అధ్యాయమందలి) యీ క్రిందివాక్యములు ప్రమాణముగ నెంచఁబడుచున్నవి —

(౧) అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా

(౨) యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్

(౩) పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

(౧) అర్థము: పుట్టనివాఁడను, తఱుఁగనివాఁడను, సర్వభూతములకు నధిపతిని అయినను నా ప్రకృతిని (స్వభావమును) వశపఱుచుకొని నామాయచేతనే పుట్టెదను [1]

(౨) ఓ భరతకులమునఁ బుట్టినవాఁడా! ఎప్పుడెప్పుడు ధర్మము నకు హానియు, అధర్మమునకు వృద్ధియుఁ గల్గునో అప్పుడప్పుడు నేను నన్నుఁ బుట్టించెదను

(౩) సజ్జనులను రక్షించుటకును, చెడుపనులు చేయువారిని నాశముచేయుటకును, ధర్మమును చక్కఁగ నిల్పుటకును ప్రతియుగమందును పుట్టుదును

అసురాదుల యవతారములు. — ఇట్లు అవతారము లెత్తువాఁడు సర్వశక్తిమంతుఁడైన సర్వేశ్వరుఁడే యన్నకల్పన కల్గినను మానవుల శరీరము వేఱు ఆత్మ వేఱు, ఆత్మ మరలమరల వేఱువేఱుజన్మముల నెత్తుచుండు నన్న నమ్మకతో నీయవతారకల్పనను కల్పఁగా, నవతారము లెత్తువాఁ డొక్క సర్వేశ్వరుఁడే కాక, దేవతలు, రాక్షసులు, యక్షులు, అప్సరసలు, చివరకు మానవులుగూడ నవతార మెత్తుదు రన్న నమ్మకము కల్గినది. మహాభారతమున ఆదిపర్వమునందు 'ఆదివంశావతరణపర్వ' మను ఒక ఉపపర్వము కలదు. దానిని 'అంశావతరణపర్వ' మనియు నందురు. అది ౫౯ మొదలు ౬౪-వ అధ్యాయములవఱకు నుండును. అందు కౌరవ పాండవ పాంచాలాదులలోని కొందఱెవ రందఱును ఎవరెవరి యంశమునఁ బుట్టినదియు వివరముగఁ జెప్పఁబడియున్నది. భీష్ముఁడు వసువు నంశమున, ద్రోణుఁడు బృహస్పతియంశమున, ధర్మరాజు యమునియంశమున, దుర్యోధనుఁడు కలియంశమున, శిశుపాలుఁడు రావణాంశమున, అశ్వత్థామ రామక్రోధాంశమున, కృష్ణుని పదియాఱువేల స్త్రీలు అప్సరసల యంశములచేఁ బుట్టిరి ఇట్లే యితరులనుగుఱించి సవిస్తరముగఁ జెప్పఁబడియున్నది[2]. రామాయణమునందును శ్రీరామునితోఁ బుట్టిన వానరాదులయవతారములును ఇట్లే చెప్పఁబడియున్నవి (బాలకాండ, అధ్యా, ౧౭). ఇంతియకాదు మానవులలో మానవులే యవతార మెత్తెద రని చెప్పఁదొడఁగిరి తులసీదాసు వాల్మీకియొక్క యవతారము; కబీరుదాసు శుకర్షి యవతారము; ఉద్ధవుఁడే మొదట నామదేవుఁగఁ బుట్టి తరువాత తుకారాముఁగఁ బుట్టెను! ఇట్లు పోనుపోను 'అవతారము' అనఁగా కొంచెము హెచ్చుతక్కువగఁ 'బునర్జన్మము' అన్న భావ మేర్పడినది. ఈ రెంటికిని మిగిలిన స్వల్పభేద మేది యన, మానవేతరదేవదానవ యక్షాదియోనులవారు మానవజన్మ మెత్తినను 'అవతార' మందురు. సామాన్యజనులు మరలఁ బుట్టినచో 'పునర్జన్మ' మందురు.

ఇట్లు 'అవతార' శబ్దముయొక్క యభివృద్ధి చెందిన యర్థము న టుండనిచ్చి, లోకోపకారమునకై అయాకాలములవారిచే సర్వేశ్వరునిగ భావింపఁబడిన, దేవతాశక్తిని అవతారములనుగుఱించి విచారింతము. ఈశ్వరుఁడు సగుణుఁడు, ఒకానొకవ్యక్తి, లేక శ్రీవ్యక్తి యనియు, తనరూపమును ఇచ్చవచ్చినట్లు మార్చు శక్తికలవాఁడనియు నమ్మినతరువాత వాఁ డవతారము లెత్తు నన్నమాట సహజముగనే సిద్ధించును. వేదమునందు సంహితాభాగములందును, బ్రాహ్మణభాగములందును కొన్ని యవతారములవర్ణనములు కానవచ్చుచున్నవి. ఇవి వేదమునందు ప్రజాపతియవతారములుగ నున్నను, తరువాతఁ బురాణములలో విష్ణువుయొక్క యవతారములుగఁ బరిగణింపఁబడినవి. అందుఁ గొన్ని యిట దిక్ప్రదర్శనముగఁ జూపెదము.

## వేదములందలి యవతారములు

మత్స్యావతారము. ప్రజాపతి మత్స్యరూపమును గ్రహించినట్లు శతపథబ్రాహ్మణమునఁ జెప్పఁబడినది (౧ ౮ ౧ ౧ ౬). ఒకదినమున మనువు చేయి కడుగుకొనుచుండఁ జేతిలో నీరు పోసికొనఁగాఁ జేతిలోనికి వొకచిన్న చేప వచ్చెను. దాని నేమిచేయవలయునని యాతఁ డాలోచించుచుండఁగా నాచేప యిట్లనెను 'నన్ను నీవు పోషించిన యెడల నేను నిన్ను పోషింతును' అందుపై నాశ్చర్యపడి 'నీవు నన్నెట్లు పోషించెదవు?' అని యాతఁ డడుగఁగా 'జలప్రళయములో మనుష్యులందఱును జచ్చెదరు. అప్పుడు నేను నిన్ను రక్షించెదను' అని చెప్పెను. అంత నాతఁడు దానిని పెంచ నది క్రమముగా పెద్దదియై అతనిచే సముద్రమునం దుంచఁబడెను. అంత ప్రళయము వచ్చి ప్రపంచము నంతయు ముంచఁగా మనువు తనపడవను ఈ చేపకొమ్మునఁ గట్టెను. అది యాతని ఓడను లాగికొనిపోయి కొండమీఁదఁ జేర్చెను. ఇచ్చట వేదముల రక్షించుటనుగూర్చి యేమియు లేదు

1 ఈ శ్లోకమునకు అర్థము చేయునప్పుడు శంకరాచార్యులవారు 'మాయా' శబ్దమునకు 'జగత్తును మోహింపఁజేయునట్టి యవిద్యాశక్తి' యనియు, 'సంభవామి' యనఁగా పుట్టినట్లుగ నగపడుదును 'పరమార్థతః కాదు' అనియు నర్థము చేసిరి. రామానుజాచార్యులవారు 'మాయా' శబ్దమునకు 'జ్ఞానము' అనియు, 'ఆత్మమాయయా' అనఁగా 'తనజ్ఞానముచే ఆత్మసంకల్పముచే' అనియు నర్థముచేసి, అవతారములు వాస్తవములనియు భావార్థము చెప్పఁబడె నని తెల్పిరి

2. చూడుఁడు, ఆంధ్రమహాభారతము., ఆది, అశ్వా. ౩.

# అవతారములు

కూర్మావతారము: ప్రజాపతి సృష్టిచేయువలె నన్న కోర్కి పుట్టి, తపస్సు చేసి యాతఁడు శరీరమును కదలించెను. అతని మాంసమునుండి అరుణాదిఋషులును, నఖములనుండి వైఖానసులును, రోమములనుండి వాలఖిల్యులును పుట్టిరి. అతనిరసము నీటిలోఁబడెను. అది నీళ్లలోఁ గూర్మాకారమై తిరుగుచుండెను. ప్రజాపతి దానితో 'నీవు నా చర్మ మాంసములనుండి పుట్టితివి' అనెను. అందుకై 'లేదు. నేను పూర్వమునుండియు నిచ్చట నున్నాను' అని అది అనెను. 'పూర్వం ఆస' అన్నది గనుక వది పురుషుఁ డయ్యెను. అది సహస్రశీర్షుఁడును, సహస్రాక్షుఁడును, సహస్రపదములు గలవాఁడును అయి పుట్టెను. అప్పుడు ప్రజాపతి విరాట్పురుషునిఁ జూచి 'నీవే పూర్వము పుట్టితివి. పూర్వుఁడ వగునీవు ఈ సృష్టి చేయుము' అనెను. అతఁడు సర్వసృష్టినిఁ జేసెను (తైత్తిరీయ ఆరణ్యకము, ౧ ౨౩ ౩)[1]. ఈ వైదికకథను పురాణములలో సముద్రమథనము కథతోఁ గల్పి విష్ణువుయొక్క కూర్మావతారముగ కల్పింపబడెను.

వరాహావతారము: సృష్టికి పూర్వ మంతయు జలమే యుండెను. అందుచే ప్రజాపతి అది యెట్లు చేయుదు నని యాలోచించెను. అతనికి పద్మ మొకటి నిలిచియుండఁగాఁ గాన్పించెను. 'ఏదో ఈపద్మము దేనిమీఁద నాధారపడియున్నదో అట్టిది యొకటి యున్నది' అని అతఁ డనుకొనెను. అతఁడు వరాహరూపము దాల్చి మునిఁగెను. ఆ పద్మముక్రింద నున్న మృత్తికను దీసికొని యాపద్మపత్రము పర్ణముగఁ బ్రసరింపఁజేసెను. అందువలన నది పృథ్వి యయ్యెను. ఇది అయ్యెను (అభూత్) అని యనఁగా అందుచే భూమి యయ్యెను. తడిగా నున్న యాభూమిని ఆరునట్లు చేయుటకు గాలి వీచసాగెను. ఇట్లు దానిని చిన్నరాళ్లతో (శర్కరతో) గట్టిపఱచెను (కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయబ్రాహ్మణము, ౧ ౩ ౫ ౪)[2].

వామనావతారము: 'విష్ణువు ఇదంతయు (ఈ ప్రపంచ మంతయు) దాఁటెను. మూఁడువిధముల వాఁడు అడుగు పెట్టెను. ఈతఁడు పాదము పెట్టినస్థలమందలి పాంసుకాశియందు జగత్తంతయు నంతర్భూత మాయెను. పరులచేఁ గీడుసేయనివాఁడును గోప్తయు (ధారకుఁడును) అగు విష్ణువు ధర్మముల ధరించి మూఁడు అడుగులు పెట్టెను' (ఋగ్వేద ౧ ౨౨ ౧౭ ౧౮) ఇట్లు ఋగ్వేదమందున్నది.

ఇచ్చట విష్ణు వనఁగా సూర్యుఁ డనియు, అతఁడు ఉదయమున ఉదయగిరిమీఁదను, మధ్యాహ్నమున అంతరిక్షమందును, సాయంకాలమున అస్తగిరియందును పాదము పెట్టు నని ఔర్ణవాభుని యభిప్రాయమును, పృథివిలో అగ్నిరూపమున, అంతరిక్షమందు విద్యుద్రూపమునను, స్వర్గమందు సూర్యరూపమునను ఉండునని శాకపూణి మునియొక్క తాత్పర్యమనియు నిరుక్తకారుఁడు వ్రాసియున్నాఁడు (౧౨ ౧౯). ఇట్లేకాదు బ్రాహ్మణము శతపథమునందు మూఁడు పాదములకథ యిట్లు వ్రాయఁబడినది.

ప్రజాపతిసంతానమైన దేవతలు, అసురులును పోరాడిరి. దేవతలోడిపోయిరి. అసురులు ప్రపంచమంతయు తమదే యని తలంచిరి. అప్పు డసురులు మనము భూమిని పంచుకొని జీవనము చేయుదమని తలంచి యెద్దుచర్మములతోఁ బశ్చిమమునుండి తూర్పుతట్టునకు పంచుకొనసాగిరి. ఈసమాచారము దేవతలు వినిరి. 'మనము మా వాటా పంచుకొనుచున్న చోటికిఁ బోదము. మనకు యొకని భాగము పోవును' అని తలంచి దేవతలు యజ్ఞరూపియైనవిష్ణువును ముందుంచుకొని వెళ్లిరి. ఇందు మాకును కొంతభాగ మిండని వారితో ననిరి. 'ఈవిష్ణువు పరుండుటకు ఎంతస్థలము కావలయునో అంత యిచ్చెదము, అధిక మీయము' మని అసురులు చెప్పిరి. విష్ణువు 'వామనుఁ' డుగ నుండెను. అందువలన దేవతలు ఒప్పుకొనిరి. వారు తమలోఁ దాము 'మనకు యజ్ఞ మంతస్థలము నిచ్చిరి. అదియే యొక్కువ' అను కొనిరి. తరువాత వారు విష్ణువును పూర్వదిక్కున స్థాపించి ఛందములచేఁ బరివృతునిఁ జేసిరి. 'నిన్ను దక్షిణదిక్కున గాయత్రీఛందస్సుచేతను, పశ్చిమదిక్కున త్రిష్టుప్ ఛందస్సుచేతను, ఉత్తరదిక్కున జగతీఛందస్సుచేతను పరివృతునిఁ జేయుదుము' అని యనిరి. ఇట్లు నాలుగుదిక్కులందును ఛందములతోఁ గప్పి అగ్నిని పూర్వదిక్కునఁ బ్రతిష్ఠించి అర్చించిరి. ఇట్లు పృథ్వి నంతను స్వాధీనపఱచుకొనిరి (శతపథ బ్రా, ౧ ౨ ౫ ౧ ౪) ఈపైని యుదాహరించిన ఋగ్వేదవాక్యములనుండి త్రిపాదక్రమయు, శతపథమునందలి దేవదానవుల పోరాటమును తీసికొని తరువాతివారు పౌరాణికవామనకథ వ్రాసిరి.

## పురాణావతారములు

విష్ణ్వవతారములు: ఇఁకఁ బురాణావతారముల విచారింతము. పురాణాదులలో నితరదేవతల యవతారములకంటె విష్ణువుయొక్క యవతారములు విశేషముగఁ జెప్పఁబడియున్నవి. సాధారణముగఁ బది యవతారములు సుప్రసిద్ధములు. దశావతారములను తెలుపునట్టి యీశ్లోక మందఱకును దెలిసినట్టిదియే.

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః,
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కి రేవచ

ఇందు ముగ్గురు రాములు చెప్పఁబడియున్నారు. పరశురాముఁడు, దాశరథిరాముఁడు, బలరాముఁడు అని యర్థము.

విష్ణువుయొక్క ముఖ్యావతారములు పది యన్నమాట పెద్దవాళ్లనుండి వచ్చుచున్నను, ఈపదియవతారములే గాక యన్య

---

1 శతపథబ్రాహ్మణమందుఁ (౭ ౫ ౧ ౫) గూడ ప్రజాపతి కూర్మరూపము ధరించి సచేతనసృష్టిని పుట్టించె నని యున్నది.

2 శతపథబ్రాహ్మణమందు (౧౪ ౧ ౨) ప్రజాపతియే ఏమూష యనుపందియై భూమిని పైకెత్తెననియు, భూమి ప్రజాపతి భార్య యనియుఁ జెప్పఁబడినది.

యెందుకొనుట కధికారము గలిగియుండును. యాజ్ఞవల్క్యస్మృతి యీసందర్భమున నిట్లు నిర్ణయించుచున్నది 'అజ్ఞానముచే చేసిన దోషమునకు ప్రాయశ్చిత్తము జరిగినతరువాత నది నశించిపోవును అట్లు కాక యెఱిఁగియుండి చేసినదోషమే యయిన నాదోషి యితరుల వ్యవహారమున సాంఘికముగ తనపూర్వస్థితిని బడయుట కధికారము బొందినను, వానిపాపమాత్రము నశింపదు'

**అవ్వయార్** — ౧ అత్యంతయుత్కృష్ట లోకప్రఖ్యాతి నొందిన 'కురళ్' అను ద్రావిడకావ్యమునకుఁ గర్తయైన తిరువళ్లువర్ అనునతని అక్క. ఈమె కావ్యమునకు ద్రావిడవాఙ్మయమునం దధికాదరము కలదు ఈమెయు, నీమెసోదరులును భగవన్ అనునొక బ్రాహ్మణునకును, ఆది యనుచండాలస్త్రీకిని బుట్టినవా రని చెప్పుదురు. చోళరాజ్యమునకు రాజధాని యైన ఉరయూరిలో నొకసత్రమునం దీమె జన్మించెను ఈమెతలిదండ్రు లీమె నచ్చటనే విడిచి వెళ్లఁగా 'పాణరులు' అను నొకజాతివా రీమెను తీసికొనిపోయి పెంచిరి. ఈమె చిరకాలము నవివాహితగనే యుండెను ఈమెను పెంచినతలిదండ్రు లీమెకు వయసురాఁగానే, వివాహప్రయత్నములఁ జేసిరట. కాని యీమె వివాహమునకుఁ బూర్వము పెండ్లికుమారుని కను ముదుసలిగఁ గానవచ్చెనట అంత వాఁ డీమెను వివాహమాడ నని పారిపోయెనట అందుచే యీమెకు 'అవ్వ' యన్న పేరు వచ్చెనట ఈమెయద్భుతకృత్యములనుగూర్చి పెక్కు కథలను చెప్పెదరు

ఈమె మధురలోని చివర (మూఁడవ) 'సంఘము'నాఁటిది ఈ 'సంఘము'యొక్క కాలమునుగూర్చి అభిప్రాయభేదములు పెక్కులు కలవు కాని క్రీ. శ. ౨-వ శతాబ్దిలోనిది యైయుండు నని పెక్కుమంది పండితుల యభిప్రాయము ఈమెచే రచింపఁబడిన కావ్యములు

(౧) ఆత్తిచూడి' చిన్నచిన్న నీతివాక్యములు మన సుమతి శతకమునవలెఁ జక్కనినీతులతో నిండియుండును ఇందలివాక్యముల క్రమ మకారాదిగ నున్నది. పూర్వకాలమునుండియుఁ బాఠశాలలోని పిల్లలు దీనిని పాఠముచేయుదురు.

(౨) నాల్ వళి : నాలుగుచరణముల పద్యములు గలకావ్యము

(౩) జ్ఞానకురళ్ : యోగమునుగుఱించిన తత్త్వగ్రంథము

(౪) కొన్ఱైవేందన్ ఇందుఁ బద్యములలో నీతి బోధింపఁబడినది.

ఈమె చిరాయువునిశ్చితురాలు. ఈమెసర్వసత్యవ్రతురాలనియు, చిరకాలము బ్రతికి ౯౦ లాసమునకుఁ బోయె ననియుఁ జెప్పుదురు

౨ ఒక్క 'యవ్వయార్' వందలకొలఁది సంవత్సరములు బ్రతికియున్న దని కొందఱు చెప్పినను, ఈ పేరుగల కవయిత్రు లిద్దఱుండి రనియు, రెండవ అవ్వయార్ కులోత్తుంగచోళరాజు పట్టాభిషేకకాలమున క్రీ. శ. ౧౦౭౦ న నుండె ననియు నందురు. అంతయున రామాయణమును వ్రాసి ప్రఖ్యాతి నొందిన 'కంబన్' అనునతనితో నీమె సమకాలిక. ఈమెయే ఆత్తిచూడి వ్వఁ, అకదికోవై, నన్నూల్కోవై, నాల్కోవై, అరుంతమిళ్ మాలై, దర్శనపత్తు, ఏకతనందాది, పదగనిఘంటు అను గ్రంథముల రచించెను. ఈకావ్యములలో నేవి మొదటియవ్వవి, ఏవి రెండవ యవ్వవి యన్న విషయమున అభిప్రాయభేదము కలదు.

అశన — బలిచక్రవర్తి భార్య ఈమె కుమారుఁడు బాణుఁడు

అశని — ౧. పిడుగు ఇంద్రునివజ్రాయుధమునకుఁ బేరు. గ్రామములకు పడుమఁగాని, ఇంటిమీఁదఁగాని పిడుగు పడినయెడల శాంతి చేయవలయును.

౨ మంత్రశాస్త్రమందు మంత్రవిశేషము 'టట్ట టట్టేతి, టిట్టి టిట్టేతి హాహాహాహేతి లలలేతి' అని స్మరించి, ముష్టిప్రహారము చేసినచో నది 'అశనిముద్ర' యగును. ఇందుచే శత్రువశీకరణాదుల సాధింపవచ్చునట

౩ విషచికిత్సయందు నొకయోషధివిశేషము.

అశరీరము — పరబ్రహ్మము అలంకారశాస్త్రమందు వాక్యదోషము అనన్వయము, క్రియాపదరహితము అగువాక్యమున కీపేరు గలదు

అశిర — ఒకరాక్షసి.

అశిరుఁడు — ఒక రాక్షసుఁడు

**అశూన్యశయనవ్రతము** — ఇది హిందువుల యొకవ్రతము శ్రావణకృష్ణవిదియనాఁడు చేయవలయును దీని ననుష్ఠింపవలసినవారు దంపతులు పురుషుఁ డాచరించినచో స్త్రీతోడను, స్త్రీ యాచరించినచోఁ బురుషునితోడను వియోగ మెన్నఁటికిని కలుగదు సీత వాదిత్రనిర్ఘోషపూర్వకముగ, నందులకు శక్తిలేనిచో ఘంటికానిక్వాణముతో విష్ణుసంపూజనము చేయవలయును తదనంతరమునఁ బఠింపవలసిన మంత్రములు

"శ్రీవత్సధారిన్! శ్రీకాంత! శ్రీధామన్! శ్రీపతే! ఽవ్యయ!
గార్హస్థ్యం మా ప్రణాశం మే యాతు ధర్మార్థకామద!
అగ్నయో మా ప్రణశ్యంతు దేవతాః పురుషోత్తమ!
పితరో మా ప్రణశ్యంతు మత్తో దాంపత్యభేదతః,
లక్ష్మ్యా వియుజ్యతే దేవో న కదాచిద్యథా భవాన్,
తథా కళత్రసంబంధో దేవ! మా మే వియుజ్యతామ్
లక్ష్మ్యా న శూన్యం వరద! యథా తే శయనం సదా,
శయ్యా మమాప్యశూన్యాస్తు తథైవ మధుసూదన!"

హైదరాబాదురాజ్యమునందు రాయచూరుజిల్లాలో మాస్కి యనుచోట కొండబండపైని, చెక్కఁబడిన అశోకశాసన మొకటి కానవచ్చినది[1] ఇది లఘుశిలాశాసనములలో ౧ వ దానికి నకలు ఇతరశాసనములలో లేనివిశేష మిం దొకటి కలదు ఇతరశాసనము లన్నింటిలోను 'దేవానాంపియ' (దేవానాంప్రియ), 'పియదసి' (ప్రియదర్శి) అన్న నామములు తప్ప 'అశోక' నామము లేదు కాని యీశాసనమునందు 'అశోక'ని పేరుకూడఁ గలదు ఇఁక మీఁద 'అశోక', 'ప్రియదర్శి' లొకఁడేనా యన్నసంశయ మక్కఱలేదు

మాస్కి శాసన మటుండ, కర్నూలుజిల్లా గుత్తితాలూకాయందున్న ఎఱ్ఱగుడిగ్రామముదగ్గర కొండరాలమీఁదఁ జెక్కిన అశోక శాసనములు కొన్ని ఇటీవల కానవచ్చినవి ఇవి యింకను ప్రకటింపఁబడకపోవుటచేత వానియందలి విశేషము లింకను దెలియరాలేదు

ఈశాసనములలో ధర్మముయొక్క స్వరూపమును, ధర్మప్రచారమునకుఁ జేసినయేర్పాటులను వర్ణింపఁబడినవి తర్కవితర్కములుగాని, యుక్తివాదములుగాని చేయక ధర్మస్వరూపము స్పష్టముగా వర్ణింపఁబడినది సత్ప్రవర్తనము, భూతదయయు ముఖ్యముగా ధర్మస్వరూప మని చెప్పఁబడినది ఈశాసనమందలి కొన్నివిశేషాంశము లీక్రింద నిచ్చెదము

భూతదయ — పిపీలికాది సకలభూతములను దయతోఁ జూడవలయు ననియు, జీవహింసను జంపఁగూడ దనియు నష్టిక కలవాఁడు గావునఁ దనవంటశాలలో నంతకుఁ బూర్వము భోజనమునకై జరుగుచున్న పశువధ మాఁపివేసెను[2] అశోకుని తాతయైన చంద్రగుప్తుని కాలమునందియు మృగయావినోదము రాజుల కత్యంతప్రియమై యుండెను కాని యసహాయములుగా నిరపరాధములగు వన్యమృగముల జంపుట తగదని యశోకుఁడు వేటాడుట చాలించెను వేటకు బదులుగా రాజ్యములోని ప్రజల కష్టములను గనుఁగొనుటకును, పవిత్రమైన స్థలములను, జనులను చూచుటకును, ధర్మబోధచేయుటకును దేశయాత్ర చేయుచుండవలెనని శాసించెను[3] రాజమందిరమునఁ బాకశాలలో మెండుగాఁ బ్రతిదినమును, సువారములకై వేలకొలఁది మృగములు, పక్షులును జంపుచుండెను కొంతకాలము తరువాత రాజ ప్రాసాదమున అది, దినము రెండునెమళ్లు, ఒకజింకయుంటే చంపఁబడు ప్రాణుల జంపఁగూడ దని యాజ్ఞాపించెను "ఇకమీఁదట నీమూఁడు ప్రాణులనుగూడఁ జంపఁగూడదు" అని శాసించి యీధర్మమూర్తి తాను రాజ్యమునకు వచ్చిన ౧౩ వ యేఁట (క్రీ పూ ౨౫౭) యార్తిగ మాంసాహారమును మానివేసెను తనరాజ్యములోని ప్రాణుల కొన్నిమృగములను ఎన్నఁడును జంపఁగూడ దనియు, మాంసాహారులయిన వారుకూడ సంవత్సరములో నిషిద్ధ దినములందు కొన్నిప్రాణులను జంపఁగూడ దనియు శాసించెను (క్రీ పూ ౨౪౩) దయామయుఁడగు నీరాజు పశువులకొఱకు చికిత్సకై పశువైద్యశాలల నిర్మించెను భూతదయ యింతకు మించ నేరదుగదా ?

తల్లిదండ్రుల గౌరవించుట — అశోకుఁడు చేసిన రెండవ బోధ మిదియే తమ తల్లిదండ్రులను గురువులను పెద్దలను మిక్కిలి గౌరవముతోఁ జూడవలసిన దని అట్లే పెద్దవారును తమకుమారులను, సేవకులను దయతోను వారికిఁ దగిన మర్యాదతోను జూడవలె నని యాజ్ఞాపించెను బంధువులను, భిక్షువులను (సన్యాసులను), బ్రాహ్మణులను గౌరవముతోఁ జూచి వారియెడ నమితమైన యౌదార్యముఁ గనపఱచెను

సత్యప్రియత్వము — అశోకుఁడు బోధించిన మూఁడవ ధర్మము సత్యము ఈమూఁడుతత్త్వములను నీక్రింది ౨ వ శిలాశాసనమునందు సంగ్రహముగాఁ జెప్పఁబడినవి ఆశాసనముయొక్క భాషాంతర మిందు నిచ్చుచున్నారము —

"పియదసిరా యిట్లని శాసించె తల్లిదండ్రులమాట వినవలెను అట్లే భూతదయను పాటింపవలయును, సత్యము మాటాడవలయును ఇది యనుష్ఠింపవలసిన ధర్మముయొక్క లక్షణములు గురువును గౌరవింపవలెను బంధువుల మన్నింపవలెను ఇది దీర్ఘాయుః ప్రదమగు పురాతనధర్మమర్యాద మానవులు దీని ననుష్ఠింపవలయును"

పరమతసహిష్ణుత — తాను బౌద్ధధర్మాభిమాని యయినను అశోకుఁడు పరమతములయెడ ద్వేషము లేనివాఁడయి యన్నింటిని సమభావముతోఁ జూచుచుండెను బౌద్ధభిక్షువులకు వాసస్థానముల కట్టించినట్లే అజీవకు లనఁబడు జైనులకును గట్టించెను బౌద్ధాచార్యులను గౌరవించినట్లే బ్రాహ్మణులను గౌరవించుచుండెను ఇది యీమహనీయునియం దుండిన గొప్పగుణములలోని గొప్పగుణము తాను నమ్మిన ధర్మము నాదరింపవలసినదే కాని యితరుల మతములను నిందచేయఁగూడ దనియు, నన్నిధర్మములలోను నింద్రియనిగ్రహము, పవిత్రాచరణము ముఖ్యము అని చెప్పఁబడినందున నన్నిధర్మముల ముఖ్యసిద్ధాంతము లొకటియే యనియు, భేద మముఖ్యమైన విషయ

1 Hyderabad Archaeological Series, No 1 The new Asokan edict of Maski

2 ౧౪ శిలాశాసనములలో ౧ వ శాసనము

3 ౮-వ శిలాశాసనము

4 ౫-వ స్తంభశాసనము

5 ౨ వ శిలాశాసనము

6 పియదసి (ప్రియదర్శి) యనఁబడు నశోకుని బిరుదునామము

చరిత్రను చదివినయెడల ప్రజాహితకరకృత్యములను మానవలెగాక. 'మన రెంటకయసకారము చేసినను విడువదవి శాంతముగా సహించు' అని చెప్పెడిరాజులయొక్క సత్త్వహీనము మనము వినియున్న సామ్రాజ్య, తుకారాము, మొదలగు సాధుపుంగవులను బోలిన యని చెప్పుట చేయనందేమా! అశోకుని ప్రభుత్వములో నున్న రాజ్యములయొక్క సుభద్రస్థితియు యాతనిరాజ్యధురంధరత్వమును తెల్లోక్కగోచరమగుచున్నది. అతడు తన ప్రజలకష్టములను వినుటకు యెప్పుడును సిద్ధముగా నుండెను. వేయేండ్ల క్రిందట ప్రజాసుఖమునకై పాటుపడుచు నంతటితో సంతుష్టి చెందక తాను పోవరి వని నిందించు కొనుచు ఇట్లు తనరాజ్యమును రక్షించుకొనుచు దూరదూరదేశముల నుండు విదేశీయరాజులతో స్నేహము చేయుచు వారిరాజ్యముల లోనికి ధర్మమహామాత్రులను బంపుట చూడగా నశోకుడు ప్రస్తుతము ఇంగ్లండ్, జర్మనీ, అమెరికాదేశములలోని ప్రభుత్వము వారికి గలసామర్థ్యంబును, దూరదృష్టియు, రాజకార్యధురంధరత్వమును గలిగియుండె నని చెప్పుటకు సందేహము లేదు

ఇట్టియద్వితీయచక్రవర్తి యగునశోకమహారాజు క్రీ. పూ. ౨౩౧ లో నిర్యాణము చెందినట్లు గానవచ్చుచున్నది.[1]

[పైని వ్రాయఁబడిన అశోకచరిత్ర మంతయు నశోకుని శాసనములు, సింహళ, టిబెత్తుదేశమందలి గ్రంథములు, మనపురాణములు అనుబాధారములనుబట్టి వ్రాయఁబడినది. కాని మహారాష్ట్రమునందు 'భరతఖండాచా అర్వాచీనకోశ' అను గ్రంథము కలదు. ఆ గ్రంథకారుడు జైనగ్రంథముల ననుసరించి అశోకచరిత్ర వ్రాయుచున్నా నని చెప్పి, ఈక్రిందివిషయములను వ్రాసినాఁడు. కాని జైనగ్రంథము పేరు వ్రాసినవాఁడు కాఁడు. కావున దీనిని నమ్ముటకు వీలు లేదు. అయిన నవి పండితులచే విమర్శింపఁబడుటకుఁ దగిన విషయము గాన నిందు నిచ్చుచున్నాము. 'అశోకుఁడు నారిపాదునికుమారుఁడు, చంద్రగుప్తుని మనుమఁడు. ఇతని రాజ్యాభిషేకము యుధిష్ఠిరశకము పదునేడువందల నలుబదియైదు (క్రీ. పూ. ౧౩౫౩) ప్రజాపతినామ సంవత్సరములో జరిగెను. ఇతఁడు ౪౫ ఏండ్లు రాజ్యముచేసి యుధిష్ఠిరశకము ౧౭౯౧ (క్రీ. పూ. ౧౩౧౧) పింగళనామ సంవత్సర ఫాల్గునబహుళ ౧౦ దశమి మంగళవారమునాఁడు బహార్ప్రాంతములోని మంగేరిపట్టణమునఁ గీర్తిశేషుఁ డయ్యెను. ఇతఁడు జైనుఁడు ధనముగలవాఁడు. జైనమతము నీక్రిందివిధముగ నభివృద్ధి చేసెను. ౬౪,౦౦౦ల బౌద్ధపురోహితులను(!) శాస్త్రయుద్ధమున హిందూదేశము నందంతటను ఇతఁడు పెక్కురాజ్యములను గెలిచి తన రాజ్యములోఁ గలుపుకొనెను. ఢిల్లీలో రాజ్యముచేయుచున్న వీరసేనప్రధానుని వంశము నంతము గావించెను. మేవాడ, మార్వాడ, భాటియా ప్రాంతముల గెల్చి అచ్చటివారికి తన మతదీక్ష నొసంగెను. ఇతఁడు దక్షిణదేశమును గెల్చుటకై సైన్యముతో బయలుదేరి నర్మదానది దాటి ఇచ్చట నైజాముగారి రాజ్యములో నున్న దేవగిరియొద్దకు వచ్చి యాగిరిదుర్గమును నిర్మించెను. మహారాష్ట్రదేశముమీఁదరాజ్యము చేయు సుదర్శనుఁ డనురాజును శివానుకోర్టు అనుచో యాతనిపుత్రిని వంశకుని చేసికొనెను. తగర్ అనుచోట తనరాజధానిని స్థాపించి వీర శావాహుఁ డనుకైనని అచ్చట నునిచి దేశయాత్రకు బోయెను. అచ్చటనుండి తనసరదారులను బంపి వరాడ్ (బీరారు), బంగాళము, తెలుగుదేశము పాండ్య కేరళ చోళదేశములను జయించెను. అచ్చట జైనుల నధికారులుగా నియమించెను. ఎల్లోరాగుహలను త్రవ్వించుటకు యుధిష్ఠిరశకము ౧౭౫౧ (క్రీ. పూ. ౧౩౫౧) ప్రారంభించి ౧౭౬౩ లోఁ (క్రీ. పూ. ౧౩౪౧లో) పూర్తిచేయించెను. ఈచంద్రగుప్తుండే స్థాపకుఁడు దేవగిరిలో నీ యుండెను తరువాత పుష్యమిత్రుఁ డనుకోట్లింగమును వేదించి చెరిపోయెను]

అశోకునికాలమందలి విశేషాంశములు క్రింద పట్టికగాఁ జూపఁబడినవి —

క్రీ. పూ.

౨౭౩ అశోకుఁడు రాజ్యమునకు వచ్చెను

౨౬౯ అభిషేకము

౨౬౧ కళింగదిగ్విజయము

౨౬౦ బౌద్ధుఁడుగా మారెను.

౨౫౯ వేటాడుట మానెను; ధర్మయాత్రకై దేశసంచారము చేయనిశ్చయించెను, మతబోధకులను దేశదేశములకుఁ బంపెను.

౨౫౭ ౧-వ ముఖ్యశిలాశాసనము, ౧౪ శిలాశాసనములలో ౩-వది, ౪-వది వేయించెను. ఆజీవకులకు బరాబర్ అనుచోట గుహాలు త్రవ్వించెను.

౨౫౬ పదునాల్గుశాసనములు, కళింగశాసనములను వేయించెను. 'ధర్మమహామాత్ర' అను ఏర్పాటు చేసెను.

౨౫౫ కపిలవస్తువద్ద కోనాకమను బుద్ధస్తూపమును విశాలముగఁ గట్టించెను.

౨౫౫ కళింగశాసనములలో నొక్కటి వేయించెను

౨౫౧ బౌద్ధపరిషత్తు

౨౫౦ ఆజీవకులకు మఱికొన్నిగుహలు నిర్మించెను.

౨౪౯ నేపాళాదిదేశములకు యాత్ర పోయెను. చారుమతి సన్యాసిని అయ్యెను.

1. విజ్ఞానచంద్రికా గ్రంథమాలయందలి ౨-వ పుస్తకము మగు 'హిందూమహాయుగము' లోని అశోకచరిత్రమునఁ గొంత చేర్చియుఁ గొంత మార్చియుఁ గొంత తగ్గించియు నీయధ్యాయము వ్రాయఁబడినది.—[ప్ర. సం.]

ములు సంగ్రహములను చేసియున్నారు. 'అభినవమాధవీయ' యనునది యిట్టిగ్రంథములలో నొక్కటి. తెనుగుదేశమునందు నశౌచమును గురించి సంశయము కలిగినప్పుడు దీని ననుసరింతురు. నిర్ణయసింధు, ధర్మసింధు అను గ్రంథములుగూడ ప్రమాణముగ దీసికొందురు.

అశౌచకాలమున, తెల్లనివస్త్రములను ధరింపవలెను, చెప్పులు గొడుగు చేసికొనగూడదు, బొట్టు పెట్టుకొనగూడదు, తీపి తినగూడదు, స్త్రీసంభోగాదు లుండరాదు.

ఉపనయనవివాహాదిశుభకార్యములలోఁ గంకణము కట్టుకొనిన పిదపను, యజ్ఞయాగాదికములలో దీక్ష వహించియున్నకాలమందును అశౌచము వచ్చినయెడల దానిని పాటింపనక్కఱలేదు. లింగాయతులను కన్నడులును 'అశౌచములు' పాటింపరు. వారికి నశౌచము వచ్చినను వారినిత్యకర్మములు యథావిధిగ జరుగుచుండును. ఆంధ్రదేశమందలి యారాధ్యులను బ్రాహ్మణులు కొంతవఱకు నశౌచమునిమయమున లింగాయతుల యాచారమునే యనుసరింతురు. వీరికి మాతకము వచ్చినప్పుడును వీరు సంధ్యావందనము, శివపూజయు చెప్పటివలెనే సాంగోపాంగముగఁ జేసెదరు. స్త్రీలు ముట్టయినను, శిల్లాదినను శివపూజ చేసికొందురు. అశౌచము కలవారిచేత మాత్ర మితరులు భోజనము చేయరు.

ఒక యశౌచములో నింకొకయశౌచము వచ్చుట 'అశౌచసంకరము' అని చెప్పబడును.

ఇతరదేశములవారు నానాశౌచములను పాటించుచున్నట్టు కానరాదు. మృతాశౌచమునుమాత్రము పాటించెదరు. వేఱువేఱుదేశముల వారు మాతకచిహ్నములను వేఱువేఱువిధములుగ ధరించెదరు. ఇప్పుడు పాశ్చాత్యులు అశౌచమును సూచించుటకై నల్లగుడ్డయొకటి చేతిమీఁద గట్టుకొందురు. పూర్వకాలపుయూదులు (Jews) లలో నశౌచకాలము 8 దినము లుండెను. కొందఱు 30 దినములవఱకును మాతకము పట్టుచుండిరి. అశౌచకాలమందు తలకు మాసి రాచుకొనుట, చెప్పులు తొడుగుకొనుట, స్నానము చేయుట లేదు. అందఱును గలసి యొకచోట నేలపైఁ బరుందురు. గ్రీకుదేశవాసులు 30 దినములవఱకు మాతకము పట్టుచుండిరి. వారిలో స్పార్టను లనువారు ౧౦ దినములు మాత్రమే గ్రహించిరి. అశౌచకాలమందు వెండ్రుకలు తీసి, నల్లబట్ట కట్టుకొందురు, వెలుపలఁ దిరుగువారు కారు. రోమదేశమందు భర్త పోయినచో నాతని స్త్రీలకు నొక సంవత్సరము మాతకముండెను. పురుషులకుమాత్రము కాల మల్పము. మాతకకాలమునందుఁ బురుషులు నల్లబట్టలను, స్త్రీలు తెల్లబట్టలను కట్టుకొందురు.

**అశ్మకదేశము** — మహాభారతమునుబట్టి చూడ నిది భారతవర్షమందలి దక్షిణదేశ మనియు (భీష్మ, అధ్యా ౯), బృహత్సంహితమతమున వాయవ్యదిక్కునందుండు దేశ మనియు, కొందఱుమతమున నిది మధ్యదేశ మనియుఁ (విశ్వ) దెలియుచున్నది. ఈదేశనామము పాణినియొక్క అష్టాధ్యాయిలో నున్నది (౪ ౧.౧౭౩).

**అశ్మకుఁడు** — ౧ ఒకబ్రాహ్మణుఁడు, జనకరాజుతో సుఖదుఃఖనివృత్తినిగుఱించి మాటాడెను (మహాభార, శాంతి, అ. ౨౮).

౨ (సూ.వం) ఇక్ష్వాకుకులోత్పన్నుఁడును, కల్మాషపాదనామాంతరము కలవాఁడును అను మిత్రసహరాజుయొక్క పుత్త్రుఁడు. ఇతనితల్లి తండ్రి కథ యెట్లన, మిత్రసహునకు బ్రాహ్మణశాపమువలన, భార్యాగమనము మనసుకు నిలు లేనందున, నాతఁడు మదయంతి యను తనభార్యయందు వసిష్ఠునిచే గర్భము స్థాపింపఁజేసెను. ఏడేండ్లయినను ఆగర్భము వెలువలికి రానందున అశ్మము(రాయి)తో కడుపును కొట్టుకొని మదయంతి దానిని వెలుపలికిఁ దీసెను. అందుచే నాతనికి అశ్మకుఁ డను పేరు వచ్చెను (భాగ, ౯ స్కం ౯ అ). ఇతఁడు పైఠనపురమును స్థాపించెను. ఇతనిభార్య ఉత్తర. నారీకవచుఁ డనునామాంతరముగల మూలకుఁ డితనిపుత్త్రుఁడు.

౩ దుర్యోధనపక్షీయుఁడగు రాజు. అభిమన్యునిచేఁ జచ్చెను (మహాభా, ద్రోణ అ ౩౭).

**అశ్లీలము** — పెద్దమనుష్యులు మాటలాడఁదగని ప్రసంగమును అశ్లీల మందురు. ఇది మనయాలంకారికులచేఁ గావ్యదోషముగ నెంచఁబడినది. 'అశ్లీలము' శబ్దదోషముగను, అర్థదోషముగనుగూడఁ జెప్పఁబడియున్నది. వ్రీడాకరము, జుగుప్సాకరము, అమంగళకరము అని యీయశ్లీల మూఁడువిధములు (కా, ప్ర ౭). వ్రీడ యనఁగ సిగ్గు, లజ్జ; జుగుప్స యనఁగ రోఁత, అమంగళ మనఁగా అశుభము. కావ్యనాటకములు చదువునప్పుడు చదువువారికి, వినువారికి సిగ్గుగాని, లజ్జగాని కల్గునట్టిమాటలు, వర్ణనములు కావ్యములలోఁ జెప్పఁగూడదు. అట్లే రోఁతపుట్టించు వర్ణనములను, అశుభమును సూచించుమాటలను వ్రాయఁగూడదు. సంస్కృతలక్షణగ్రంథములలో నీమూఁడువిధముల యశ్లీలమునకు నీక్రిందియుదాహరణము లీయఁబడినవి —

(౧) 'ఓ రాజా! శత్రువినాశమునకై నీయొద్ద గొప్ప 'సాధనము' కలదు.' 'సాధన' శబ్దమునకు పురుషలింగ మని మఱొకయర్థము గలదు కావున వ్రీడాకరము.

(౨) 'కుమారీ! 'వినాశ' మప్పుడు నీ 'వాయువు' పెల్లుగా నాడెను.' ఇందు 'వాయువు' పదము లోపలి యున్నయర్థమందు వాడినను దానికి 'అపానవాయువు' అను మఱొకయర్థము కలుగు గావున నిది జుగుప్సకు నుదాహరణము.

(౩) వైరాగ్యమునందే 'వినాశ' పదము నిరర్థమునందు నుపయోగింపఁబడినను దానికి 'మరణ' మను అర్థము కలదు. కావున నిది యమంగళకరము.

హరవిధూపాశ్రితులునందు శబ్దదోషములలో మూఁడువిధముల యశ్లీలమునకు నీక్రిందియుదాహరణ మీయఁబడినది.

స్త్రీయు, వైశాఖపూర్ణిమయందు ప్రాజాపత్యపశ్వాలంభమును కల్ప సూత్రములందుఁ జెప్పఁబడినవిధముగా ఆచరింపవలయును అశ్వమేధ యజ్ఞమునిమిత్తము విడువఁబడు ఋత్విక్కులు దీక్షాంతమువఱకు మేఁ కులవలె చెక్కించియో సువర్ణములచే చెక్కించియో గౌరవపాత్ర ముగ విలువగానిరావలయును యజమానుఁడు దేవయజనము ప్రవే శించి కేశశ్మశ్రువులను గాదినియమములనువ్విశఁ దయి ఉపవసించి ఆ రాత్రి యంతయు మేల్కొనియుండవలయును పార్శ్వమునఁగున్న వార లారాత్రి యంతయు వినోదకరము లగు నానావిధకథలను చెప్పుచు మేల్కొని యుండవలయును మఱునాఁడు దగ్నిహోత్ర మయినపిదప వర్షజలములు (వానలో పట్టిన ఉదకములు), కూప్య ములు (బావినీరు), స్థావరములు (చెఱువునీరు), వహంతులు (నదీ జలములు) అనుజలములచే దక్షిణవాత మశ్వప్రక్షాళనమును చేసి నల్గురు మహాఋత్విక్కులకు పెట్టవలయును వారికి నాలుగువేల సువర్ణ నిష్కములను, నాల్గు అశ్వములను దక్షిణగా నొసంగవలయును

అశ్వమేధీయాశ్వమును స్నానార్థము జలాశయమునకు తీసికొని పోవునప్పుడు యజమానునియొక్క మేనత్తకొడుకు అశ్వమునకు ముంగు గాను, పినతల్లికొడుకు వెనుకను నడచిపోవలయును

౧ నూర్గురు రాజపుత్త్రులతోడ సర్వవర్మ్యులగు ప్రాగ్దిశయందు పశ్చిమాభిముఖుఁడయి నిలువఁబడి 'ఈపార్శ్వశాయుఁ డీ పవిత్రాశ్వ ముతో యాగము నొనర్చి శత్రువుల జయించుఁగాక' అని ప్రోక్షించును

౨ రాజ్యములేని క్షత్త్రియులు నూరుగురు నూర్గురతోడ బ్రహ్మ దక్షిణదిశయందు ఉత్తరాభిముఖుఁడయి నిలువఁబడి 'ఈపార్శ్వశాయుఁ డీపవిత్రాశ్వముతో యాగము నొనర్చి యితరుల కజేయుఁ డగుఁగాక' అని ప్రోక్షించును

౩ నూర్గురు సూతగ్రామణులతోడ హోత పశ్చిమదిశయందు ప్రాఙ్ముఖుఁడయి నిలువఁబడి 'ఈ పార్శ్వశాయుఁ డీ పవిత్రాశ్వ ముతో యాగము నొనర్చి అనేకములగు గోవులు, అశ్వములు, ఏనుఁ గులు, మేఁకలు కలిగియున్నవారును, బహువిధవ్రీహియవమాషతిలాది ధాన్యములు కలిగియున్నవారును, బంగారు కలిగియున్నవారును, సేవ కులు కలిగియున్నవారును, ధనము పుష్టికలిగియున్నవారగు ప్రజల కధిపతి యగుఁగాక' అని ప్రోక్షించును

౪ నూర్గురు సూతగ్రామణీపుత్త్రులతోడ ఉద్గాత ఉత్తర దిశయందు దక్షిణాభిముఖుఁడయి నిలువఁబడి 'ఈపార్శ్వశాయుఁ డీ పవిత్రాశ్వముతో యాగము నొనర్చి సంపూర్ణ మయిన ఆయుష్మ గలవాఁ డగుఁగాక' అని ప్రోక్షించును తరువాత కల్పసూత్రోక్తము లగు హోమములు మున్నగునవి చేసి గుఱ్ఱమును విడువవలయును ఆ గుఱ్ఱమును సంరక్షించుటకై దానివెంట ౧ రాజ్యార్హులగు రాజ పుత్త్రులు ౧౦౦ గురును, ౨ క్షత్త్రియకుమారులు ౧౦౦ గురును, ౩. వైశ్యకుమారులు ౧౦౦ గురును, ౪. సైనికు లగు శూద్రకుమార కులు ౧౦౦ గురును మొత్తము ౪౦౦ మంది పంపఁబడవలయును.

ఆ యశ్వమును సాయంకాలమునందు రథకారునిగృహమునందు దాని దానిపాదములందు ధృతిహోమములను సలుపవలయును

ఈ విధముగా అశ్వమేధీయాశ్వ మశ్వపాలకు లగు రాజ పుత్త్రాదులు ౪౦౦ లమందిచేత సంరక్షింపఁబడుచు స్వేచ్ఛగా ఒక సంవత్సరకాలము తిరుగవలయును ఈ సంవత్సరకాలము దేవయజన మునందు ప్రతిదినము ౧. ప్రాతఃకాలమునందు అష్టాకపాలసమన్విత ము సావిత్రేష్టిని, ౨ మధ్యాహ్నకాలమునందు ఏకాదశకపాలసము న్వితము ప్రసవితృసవితృదేవతాకము నిష్టిని, ౩ అపరాహ్ణకాలము నందు ద్వాదశకపాలసమన్వితము ఆసవితృసవితృదేవతాకము నిష్టిని ఋత్విజు లాచరించుచుందురు సాయంకాలమునం దాహవనీయాగ్ని యందు ధృతిహోమముల నాచరించుచుందురు

ఇష్టికాలమునందు పగలు బ్రాహ్మణుఁడును, రాత్రియందు క్షత్త్రియుఁడును వీణాగానము నొనర్తురు

'ఓ మహాప్రభూ! నీ వివిధముగా గోభూహిరణ్యాదిదానముల నొసఁగుచు రాజసూయాదిమహాక్రతువుల నాచరించుచు నద్రపో చేశముగ బ్రాహ్మణుల కన్నము పెట్టితివిగదా!' అని బ్రాహ్మణుఁడు సలుపు గానముయొక్క భావము

'ఓ మహాప్రభూ! నీవు పృథుభగీరథాదినృపపుంగవులవలె శత్రువుల జయించినవాఁడ వయి గొప్పగొప్ప వీరపుంగవులతోడ పోరాడి వారిని సంహరించినవాఁడవు గదా' యని క్షత్త్రియుఁడు సలుపు గానముయొక్క భావము

ఈవిధముగా గాన మొనర్చినయిరువురకు నిన్నూరు గోవులు, బండియందు కట్టిచేసిన రెండు ఎద్దులను దానము నొసంగవలయును

అశ్వమేధీయాశ్వము దేశసంచారము చేయునప్పుడు దేవయజ నమునందు ఋత్విజులు, యజమానుఁడును కలసి ఇటు లాచరించుచుం దురు, మఱునటి సంవత్సరము వైశాఖబహుళ అమావాస్యయందు దీక్షితేష్టి సలిపినతరువాత నశ్వమేధదీక్ష మూఁడుదినములు జరుగును.

అశ్వమేధయాగమునం దిరువదియొక్క అరత్నుల (మూరల) ప్రమాణముగల ఇరువదియొక్క యూపము లుండును అశ్వమేధ యాగమునందు ప్రధానపశువు అశ్వ (సంఘ) మయినను అరణ్యము లును, గ్రామ్యములును, జలచరములును, సర్పములును, పక్షులును అనుపశువులు యూపములకు ౬౦౯గా బంధింపఁబడును. పర్యగ్నికరణ మయినపిదప అరణ్యపశువులను వదలివేయుదురు పిదప అశ్వసంజ్ఞ పనము (చంపుట), ఇతరపశుసంజ్ఞపనము మున్నగునవియు హోమ ములును అగ్నిష్టోమము జరుగును (అగ్నిష్టోమ మనఁగా సోమలతను తెచ్చి అభిషవ మొనర్చి ఆయాదేవతల కొసంగి యజమానుఁడు ఋత్వి జులతో కలసి సోమపాన మొనర్చుట). హోతయు, బ్రహ్మయు బ్రహ్మోద్యసంభాషణ మొనర్తురు (బ్రహ్మోద్య మనఁగా అధ్యాత్మ విషయకమగు ప్రశ్నప్రతివచనము). పిదప ప్రధానఋత్విక్కు

